# ANDHRAPATRICA

## THE FOURTH ANNUAL NUMBER.

CONTAINING

PICTURES OE ANCIENT TEMPLES, AND EMINENT PERSONS
AND CONTRIBUTIONS FROM ANDHRA SCHOLARS ETC.



PRINTED AT THE TATVA-VIVECHAKA PRESS.

**April 9th 1913**

**BOMBAY.**

---

# ఆంధ్రపత్రిక

## నాల్గవ సంవత్సరాది సంచిక.

1913 వ సం॥ ఏప్రిల్ నెల 9 వ తేది.

ప్రమాదీచనామ సంవత్సర చైత్రశుద్ధపాడ్యమి సోమవారము.
వివిధవ్యాసములతోను, వివిధములైన చిత్రపటములతోను

ఆంధ్రపత్రికాధిపతిచే బ్రకటింపబడి

తత్వవివేచక ముద్రాక్షరశాలలో ముద్రింప బడినది.

బొంబాయి.

# ప్రస్తావన.

ఓమ్ నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైకమూర్తయే । నిర్మలాయ ప్రసన్నాయ దక్షిణామూర్తయేనమః ॥

శ్రీమద్రౌద్రిమాదీచ సంవత్సర మారంభమైనది. వర్తమాన చాంద్రాయనమునకు చంద్రుఁడు రాజు, ధాన్యాధిపతి; రవి మంత్రి; శని సేనాధిపతి, మేఘాధిపతి, అర్ఘాధిపతి; బుధుఁడు సస్యాధిపతి; గురువు రసాధిపతి; కుజుఁడు నీరసాధిపతి. ఫలము మంచిపంటలు, రాజ్యములకు వైరము, యుద్ధములు, అత్యర్ఘము; రాశిఫలము నృపసంక్షోభము, ప్రజాపీడనము, ప్రజాసుఖము. ఫలనిర్ణయము యూరపుదేశమునందలి రాజ్యములందు వర్ధిలుచున్న వైరమున కనుకూలముగనున్నది. ఫలములనిజానిజములు కాలగర్భమునందిమిడియున్నవి. పరీధావిసంవత్సరము ముగిసినది. లోకపరివర్తమునందొక యేఁడు కడచినది. ఆపరివర్తన పరిణామము కాలాంతరమున నెఱుగనగును.

యూరపురాజ్యములు బలసంపదలకు నిలయములు. ఆబలసంపదలు లోకవ్యవహారముల నిర్ణయములకై వినియోగింపబడుచున్నవి. సకలదేశముల రాజ్యాంగములందును, వాణిజ్యములందును, పరిశ్రమలందును, కోశవ్యవస్థలయందును యూరపు రాజ్యములు ప్రమేయమును గల్పించుకొనుచున్నవి. అప్పులు, రైలుమార్గములు, యంత్రసామగ్రులు యుద్ధపరికరణములు యూరపురాజ్యముల సహాయములేకను లభింపనేరవు. తురుష్కము, పారసీకము, చీనాదేశము పాశ్చాత్యుల ద్రవ్యపాశములచే బంధింపబడినవి. ఆపాశబంధన మనుదినము దృఢతరమగుచున్నది. దీని పరిణామ ఫలము దుర్గ్రాహ్యము. యూరపురాజ్యములందు స్పర్ధ వర్ధిలుచున్నది. ఆరాజ్యముల యాదాయములు యుద్ధోపకరణములకును, యుద్ధనావలకును, యుద్ధవిమానములకును వినియోగమగుచున్నవి. యుద్ధసన్నాహజ్వరమీరాజ్యములను బీడించుచున్నది. ఈజ్వరమీ రాజ్యముల నేగడియయందైనను తబ్బిబ్బులు చేయవచ్చును. ఇంగ్లాండు రష్యా ఫ్రాన్సు యొక వైపునను జర్మని ఆస్ట్రియా ఇటలీ మరియొక వైపునను ప్రాబల్యమునకై పెనఁగులాడుచున్నవి. జర్మని ఫ్రాన్సు దేశములు యుద్ధసన్నాహమునకై తొంబదికోట్ల రూప్యముల నధికముగా వ్యయమును జేయుటకై నిశ్చయించినవి. ఇంగ్లాండు జర్మని దేశములందు యుద్ధనావలను నిర్మించు వేగము మితి మీఱుచున్నది. ఈప్రయత్నములు మహాసంగ్రామ రూపమును ధరించి లోక సంక్షోభము నెపుడుచేయునో దేవునకెఱుక. బాల్కనుసంగ్రామము బాల్కనురాజ్యముల సంయోగము యూరపుదేశముయొక్క రాజ్యాంగములందు నూతనశకమును నిర్మించుటకు గారణములు. దైవకృపవలన బాల్కనుయుద్ధము మహాసంగ్రామముగా బరిణమించి లోకశాంతికి భంగమును గలిగించలేదు.

### తురుష్కదేశముయొక్క దురవస్థ.

దారిద్ర్యము కుటుంబములను సంఘములనువలె మహాజాతులనుసయితము దాస్యులను జేయుచున్నది. లోకమునందిపుడు ధనము ప్రత్యక్షదైవము. ఆదేవతానుగ్రహములేని జాతుల బలశీలములు నిరుపయోగములు. తురుష్కసామ్రాజ్యమునం దైదేండ్లకు బూర్వము ప్రాతినిధ్యపాలనము స్థాపింపఁబడినది. యావన తురుష్కుల నూతనోత్సాహము సామ్రాజ్యము నుద్ధరించుటను నాశగలిగినది. తురుష్కులు సహజముగ శాంతస్వభావులు. నిద్రావస్థనుండి మేల్కొనిన తురుష్కదేశమునకు లేచుటకైనను యూరపురాజ్యము లవకాశమునొసఁగలేదు. లేచుటకే యవకాశములేనపుడు కోలుకొనుటకవకాశము గలుగునా! ఇంగ్లాండు ఫ్రాన్సు దేశములు దక్కఁ దురుష్కసామ్రాజ్యముయొక్క సుఖస్థితినిగోరు యూరపురాజ్యములు లేవు. ఈరాజ్యములకై

నను సహజమైన శ్వేతజాత్యభిమానమును విడువనేరవు. తురుష్కుల క్షేమమును నటించు జర్మనిదేశము దన మిత్రరాజ్యములు బోస్నియ, హేర్జగోవిన, ట్రిపోలిదేశ ముల దిగమ్రింగుట నంగీకరించినది. బాల్కనుల జయ మెక్కు పెట్టున గొనియాడబడినది. తురుష్క శౌర్యము నిరసింపఁబడినది. సంధిప్రయత్నములును బాల్కనురాష్ట్ర ములపట్ల యూరపురాజ్యముల సానుభూతిని బ్రకటించి నవి. ఆకలివలన మాడువానికి వేదాంతోపదేశములు నిరుపయోగములు. ఈదురవస్థపాలైన తురుష్క సా మ్రాజ్యమునకు క్రైస్తవరాజ్యములుచేయు నీతిబోధలు నిరర్థకములు. పూర్వము యూరపుఖండమునందు బ్రకా శించిన తురుష్క చంద్రపూర్ణకళ లిపుడు క్షీణదశనొం దినవి. యూరపుఖండమంతయును శ్వేతముఖుల వశ మైనది. తురుష్కుల దురవస్థ మహమ్మదీయుల కలియక కనుకూలమైనది. ఈభేదభావమును కలియికయును లోక చరిత్రమునందొక నూతన శకనిర్మాణమునకు గారణ ములు. మహమ్మదీయుల సంయోగప్రభావము రాగల మహాసంగ్రామ సమయంబున వ్యక్తముగాగలదు.

యూరపురాజ్యము లన్నియును ధనసంపదలతోఁ దులఁదూగుచున్నవి. వాణిజ్యము పరిశ్రమలువర్ధిలుచున్న వి. విద్యవ్యాపించుచున్నది. జనులు సుఖమునారాధించు చున్నారు. బ్రిటిషురాజ్యమును దినదిన ప్రవర్ధమానమగు చున్నది. గత సంవత్సరమునందు బ్రిటిషుద్వీపముల ఆదా యము.రు.3,057,758,820.వ్రయము.రు.2,579,935,005 బ్రిటిషుసామ్రాజ్యమునందలి భిన్నభాగములు దృఢాను రాగబద్ధములగుచున్నవి. సామ్రాజ్యమును రక్షించుటకు దగిన సాధనములను యోచించుటకు గత సంవత్సరము నందొక సభగూడినది. అధినివేశ స్థలములనుండియును ప్రతినిధులు వచ్చియుండిరి. మలయారాష్ట్రములు సా మ్రాజ్య రక్షణార్థము యుద్ధనావలనుగట్టి యిచ్చుటకంగీ కరించినవి. కనడా, ఆస్ట్రేలియ, న్యూజిలండు, దక్షిణ ఆఫ్రికా దేశములును యుద్ధనావలను నిర్మించుటకుఁ దగిన ప్రయత్నములను జేయుచున్నవి. హిందూదేశమును నీ ప్రయత్నమును జేయవలసి యున్నదని యాంగ్లేయప్రము ఖులు కొంద రభిప్రాయపడుచున్నారు. అధికతరమైన ముప్పదికోట్లరూప్యముల సైన్య వ్రయభారము క్రిందఁ గ్రుంగుచున్న హిందూదేశముపై నీభారమును మోపుట యనుచితమని కొందరు వాదించుచున్నారు. కాని యె ప్పుడో యీదేశముమీద నీభారముకొంతపడుటనిజము.

అయిర్లాండు స్వరాజ్యశాసనము ప్రజాప్రాతి న్న్యాయసభచే నంగీకృతమైనదికాని ప్రభువులసభ యీ శాసనమును నిరాకరించినది. ఢిల్లీపట్టాభిషేక మహో త్సవ సమయమున శ్రీ పంచమజార్జి రాజరాజేంద్రునిచే నొసంగబడిన వరదానముల కనురూపముగా హిందూ దేశ శాసనము పార్లమెంటు సమ్మతినొందినది. బ్రిటిషు ద్వీపవాసులైన వృద్ధుల కుపవేతనములను నిచ్చుటకై నిర్మింపబడిన జార్జిలాయిడుగారి శాసనము వాడుకయం దుంచబడినది. వృద్ధులనేకులు దీని లాభములను బొంద గలిగిరి.

అమెరికా సంయుక్తరాష్ట్రములకు ప్రజానాయక వాదియైన వుడ్రోవిల్సనుగారు పాలకులుగా నెన్నుకొనఁ బడిరి. ఆయన ఫిలిప్పయిను ద్వీపములకు స్వరాజ్యము నిచ్చుట యుచితమని తమ మతమును వ్యక్తీకరించిరి. ఆఫ్రికాఖండమునం దీజిప్టు నందలి జాతీయవాదులు స్వ తంత్రమూర్తియైన కిచనరుప్రభువు పరిపాలనము క్రిందను తలయెత్తుట కవకాశములేదు. దక్షిణ ఆఫ్రికాయందు సంయోగవాదులకునుస్వతంత్రవాదులకును గల భేదాభి ప్రాయములు విపులములైనవి. బోథాగారికిని హర్గో రజుగారికిని గల భేదాభిప్రాయములు బలవంతములై నవి. పాలనమునుండి హర్గోరజుగారు చీలిపోయిరి. అచ్చటి హైందవులస్థితి యథాప్రకారమునకు మోసము లేకనున్నది. హైందవుల నులభప్రవేశమునకై ప్రవేశ పెట్టబడిన శాసనమింతలో వెలుతురునుఁ జూచునను నాశ నిరాశయైనది. దక్షిణ ఆఫ్రికాలోని హైందవుల స్థితిగతులను స్వయముగాజూచి తగిన సదుపాయముల నొడఁగూర్చుటకై దేశభక్తుడు గోఖలెగారు స్వయము గావెళ్ళియుండిరి. ఇప్పటి దక్షిణ ఆఫ్రికా వ్యవహారము లను గుర్తెరిగినవారలకు గోఖలెగారి ప్రయత్నములు సఫలములగునను నాశలేదు.

## పారసీకము.

ఆసియాఖండ ప్రబోధ మింకను ఫలోన్ముఖము గాలేదు. పారసీక దేశముయొక్క దురవస్థ వర్ణనాతీతము. దేశము దుర్జనాక్రాంతము. కోశము శూన్యము. బలము పూజ్యము. దేశము ఋణపాశములలో జిక్కుకొనినది. రష్యా యొత్తిడి ఎక్కువయినది. ఋణబాధ యధికమైనది. ఈవిషమావస్థనుండి విముక్తినొందుటకు సాధనాంతరము గనుపించదు.

## చీనాదేశము.

చీనాదేశము నారురాజ్యములును నష్టకష్టముల పాలుచేయుచున్నవి. ఒకవైపున నరాచకము. ఒకవైపున నప్పులయొత్తిడి. ఒకదిక్కున నల్లమందు వ్యాపారులపీడ. మంగోలియ టిబేటు దేశములు స్వతంత్రమును బ్రకటించినవి. రష్యాదేశముయొక్క యొత్తిడి పెరుగుచున్నది. యుఅన్ షికైగారి ప్రయత్నములు విఫలములగుచున్నవి. ఆరు రాజ్యములునుజేరి చీనాదేశమున కప్పునుబుట్టనిచ్చుటలేదు. అయినను చీనాదేశీయుల దేశాభిమానము వర్థిలుచున్నది. కాలక్రమమున నీయభిమానము దృఢమై చీనా జాతీయ పరిణామమునకు దోడ్పడగలదు.

జపాను సామ్రాజ్య నిర్మాణకుడుగా నెంచఁదగిన మట్సుహిటో చక్రవర్తి మరణము జపానుదేశమునుదుఃఖసాగరమునందు ముంచినది. ధర్మసంస్థాపనకై దేశ దేశములందును మహనీయు లవతరించి దేశము నుద్ధరించుచుందురు. శ్రీ కృష్ణుడు లోకకంటకులైన రాజులను నిర్జించి హిందూదేశమునందొక నూతనశకమును స్థాపించెను. పీటరు మహామహుడు ప్రజలకు దేశాభిమానమును బుట్టించి రష్యాదేశము నుద్ధరించెను. ఫ్రెడరికు మహానుభావుడు భిన్నప్రదేశములకు సంయోగముఁ గూర్చి జర్మనుసామ్రాజ్యమును నిర్మించెను. మొదటి విలియము భిన్నజాతులనేకముగాజేసి బ్రిటిషుమహాసామ్రాజ్యమును నంకురింపజేసెను. స్వచ్ఛందముగా నిరంకుశాధికారమును బరిత్యజించి నియమితపాలనమును స్థాపించి మట్సుహిటో జపానుదేశము నుద్ధరించెను. నోగి మహారధుని ఆత్మత్యాగమును నిరుపమానము.

## హిందూ సామ్రాజ్యము.

శ్రీపంచమజార్జి రాజరాజేంద్రుని వరదానముల కనుగుణ్యముగ బీహారురాష్ట్రము నిర్మింపఁబడినది. రాజధాని ప్రాచీన నగరావతంసమైన ఢిల్లీనగరమునకు మార్చఁబడినది. ఢిల్లీనగర ప్రవేశోత్సవమునకై సామంతరాజులు వచ్చియుండిరి. మహావైభవముతోఁ బ్రవేశోత్సవము జరుపబడినది. కాని దయార్ద్రహృదయులైన హార్డింజిప్రభువుపై బాంబును బ్రయోగించుట వలన హైందవులకు విషాదము గలిగినది. వారి సత్కీర్తికి గళంకమేర్పడినది. దైవము రాజప్రతినిధిని హార్డింజిప్రభ్వుని ఘోరమరణమునుండి గాపాడినందులకు జనులానంద పరవశులైరి. దేశీయమహాసభకుజనకుడైనహ్యూముగారి మరణము హైందవుల కమిత విచారమును గలిగించినది. హ్యూముగారి యవ్యాజానురాగము, స్వతంత్రప్రియత్వము, హైందవ జాతీయాభిమానము హైందవప్రజల యనురాగమునకు గారణములు. దయార్ద్రహృదయుడైన బైరాంజి మలబారిగారి మరణమును విచారమునకు గారణమైనది. మలబారిగారి విశాలహృదయయమునకును, దీనదయాళుత్వమునకును, లోకారాధనమునకును వారిచేస్థాపింపబడిన సేవాసదనమును క్షయరోగాశ్రయమును శాశ్వతమైనస్మరణచిహ్నములు. రాజ్యాంగసంస్కరణములకు హ్యూముగారివలె సంఘసంస్కరణములకు మలబారిగారు దోడ్పడిరి.

## దేశపరిపాలనము.

దేశపరిపాలనముయొక్క పరమావధిని గూర్చిన చర్చలు గత వత్సరమున ప్రబలినవి. బ్రిటిషుపరిపాల[illegible]రక్షితమైన స్వరాజ్యాదర్శము హిందూదేశ[illegible] బరమావధియని హైందవ నాయకులు విశ్వస[illegible]న్నారు. హార్డింజిప్రభువు క్రూప్రభువునకు బంపినలేఖా సందేశమునందీ భావమీరీతిని సూచింపఁబడినది. "కాలక్రమమున మనదేశ పరిపాలనమునందు హైందవు లధిక ప్రమేయమును గలిగి యుండవలయునను వారి యుచితాశలు ఫలప్రదములుగావలయుననుట సత్యము.........ఈ ఫలప్రాప్తికై దేశమునందనేకము

లైన స్వతంత్రపాలనముగల రాష్ట్రములు నిర్మింపఁబడ
వలయును. సామ్రాజ్యపాలనము రాష్ట్రపాలనములపై
నుండి వాటిని దుష్పరిపాలనమునుండి, గాపాడుచు వాటి
వ్యవహారములను సామ్రాజ్యపరిపాలనమున కనుసంధా
నముగా నియమించవలయును." సహాయమంత్రి మాం
టాగుగారు ప్రసంగవశమున దమ మతమునిటులు నిర్దే
శించిరి:—

„హిందూదేశ పరిపాలకుల లేఖార్థము వెంటనే
కాకపోయినను త్వరగా గాకున్నను, కాలక్రమమున
నెమ్మదిగానైనను మనము వారిని జేర్చవలసిన గమ్య
స్థానమును సూచించుచున్నది. మన విద్యాశిక్షణము
వలనను, పాశ్చాత్య విజ్ఞానమువలనను జనించిన
నూతనాదర్శములును, నూతన సంతతి
యును, దలయెత్తినవి. "నూతనసంతతివారు మాగత్యం
తరమేది ?" అని ప్రశ్నించుచున్నారు......విపిన చంద్ర
పాలుగారివంటి జాతీయవాదులును సభినివేశ స్థలము
లందుగల స్వరాజ్యాకాంక్ష వారికి గలదని న్యాయాను
సారముగా వక్కాణించుచున్నారు. ముందు మనమేరీతిని
రాజ్యాంగ నిర్మాణములను నిర్ణయించెదమో మితవా
దులు వినఁగోరుచున్నారు.తగిన సమాధానమును జెప్పక
మనము కాలమును గడిపితిమి. అంతత్వరగా గాకున్నను
హిందూదేశమునందు బ్రిటిషు పాలనాపద్ధతులను, సవి
వృద్ధినొందవలసిన మార్గములను వ్యక్తీకరించుట కొక
రాజప్రతినిధి సాహసించెను."

ఈ యుదారభావ గర్భితమైన యాదర్శమును
వ్యక్తీకరించిన సహాయమంత్రి హిందూదేశ రాజ్యాంగ
వ్యవస్థలను స్వయముగా నెరిగి యుండుటకై మూడు
మాసములు దేశాటనమును జేసి స్వదేశమును జేరిరి. ఈ
కృతపరిచయము హిందూదేశాభ్యుదయమునకు వినియో
గపడునను నాశ వొడము చున్నది. ఈ యాదర్శమె
యాంధ్రులకును బ్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణమునందభి
లాషనుఁబుట్టించినది.

దేశీయమహాసభానాయకులును నీయాదర్శమునె
పరమావధియని నమ్ముచున్నారు. ఈయాదర్శ మెన్ని
తరములకు ఫలోన్ముఖమునకు రాగలదో యూహిం
చుట దుస్తరము. ఉన్నత రాజకీయోద్యోగముల స్థితి
గతులను, వాటియం దధికతరముగా హైందవులకు బ్రవే
శమును గల్పించుటకు దగినసదుపాయములను, న్యాయ
విమర్శనాధికారమును కార్యనిర్వాహకాధికారమునుండి
విడఁదీయుటను మొదలగు విషయములను గురించి
యోజించుటకొక పంచాయతిసభను శ్రీ పంచమ జార్జి
రాజరాజేంద్రుడు నియమించెను. ఆసభాసదులు ముఖ్య
ప్రదేశములందు సాక్షులను విచారించిరి. హైందవుల
కున్నతరాజకీయోద్యోగము లందనిపండ్లు. కారణము
పౌరసేవాపరీక్ష యింగ్లాండునందు మాత్రము గలదు.
పరీక్షకు జదువుట కిరువదివేల రూప్యములు గావల
యును. హిందూదేశమునందింత ద్రవ్యమును వ్రయముచే
యఁగలకుటుంబములరుదుగనున్నవి. సొమ్మునువెచ్చించిన
నుపరీక్షయం దపజయముగలిగిననుజాతీయధర్మపరాఙ్ము
ఖత్వ మేర్పడినను దుర్వ్యయమగుచున్నది. ఈప్రతిబంధ
మును దొలగించుట కేకకాలమునందొక విధమైన పరీ
క్షను హిందూదేశమునందును నింగ్లాండునందును జేయుట
ధర్మానుకూలమనియును, పాలకులు చేసిన ప్రతిజ్ఞల కను
రూపమనియును హైందవ నాయకులు చిరకాలమునుండి
వాదించుచుండిరి. హైందవనాయకులలో ప్రముఖులీ
రీతిని సభయెదుటను సాక్ష్యమునిచ్చిరి. దొరలందరును
నిదితగదని సాక్ష్యమిచ్చిరి. రాష్ట్రీయపౌరసేవా పరీక్ష
వలనగాని నియోగము వలనగాని యధికోద్యోగముల
నిచ్చుట యుచితమని దొరలును కొందరుహైందవులును
సాక్ష్యమునిచ్చిరి. ఈమార్గావలంబనము పక్షపాతమున
కును, నిరసనమునకును,దుర్బలమునకును గారణమగును.
ఉభయదేశములం దేక విధమైనపరీక్షనుజేసి యుత్తీర్ణులకు
న్నతోద్యోగములను జాతిభేదములేక నొసగినహైందవుల
కుస్వాత్మగౌరవమునుస్వయంసహాయమునునలవడివిద్యా
వివేకములు వర్ధిల్లును. పాలకులు తగిన కట్టుబాటులతో
నీసహజమైన న్యాయమును హైందవులకు జేయుదురను
నాశ వారి మనంబుల వికసించుచున్నది.



Mausoleum of RabiDurani, Aurangabad.

రాబియదురానీసమాధి, ఔరంగాబాదు.



An Old Banyan tree, Madura.

పురాతనమైన మఱ్ఱిచెట్టు, మధుర.




The first Stage of creation:- Shells, Fish & Vegetation.

సృష్టియొక్క ప్రథమదశ. నత్తలు, జలచరములు, గడ్డిమొదలగునవి.




The second stage of creation :- Amphibious and crawling animals.

సృష్టియొక్క రెండవదశ. ఉభయజంతువులు, నేలమీద ప్రాకెడి జంతువులు.

Blocks by Messers Neroy & Co.




The third Stage of creation.- Forest livining animals, beasts.

సృష్టియొక్క మూడవదశ:_ వనచరములు మృగములు.



te ancestor inhabitant of Great Britain 20,000 years ago.

సృష్టియొక్క నాల్గవదశ:_ మానవాకృతి కనుసంధానమైన వానరము, 20,000 ఏండ్ల

Pupils of the Madras Traing School at maypole drill.



మద్రాసు ట్రెయినింగుస్కూలులోని బాలికలకోలాటము.



కుమారమంగలం జమీదారుగారు, వారిసతి రాధాబాయమ్మగారు, బి.ఎ.

The Temple of Sundaranarayana at Nasik.



నాశికయందలి సుందరనారాయణ దేవాలయము.

The Temples at Tiruvannamalai.



తిరువణ్ణామలై దేవాలయములు.

Brihadiswaraswamy Temple at Tanjore.



తంజావూరు బృహదీశ్వరస్వామి దేవాలయము.

Subrahmanya Swamy Temple at Tanjore.



తంజావూరు నందికేశ్వరుడు సుబ్రహ్మణ్యస్వామి.

Temple at Chidambaram.



చిదంబర దేవాలయము.

Temple at Chidambaram.



చిదంబర దేవాలయమునందలి ముఖమంటపము.

Srirangam Temple Inner portion.



శ్రీరంగ దేవాలయాంతర్భాగము.

Srirangam Temple Inner portion.



శ్రీరంగ దేవాలయాంతర్భాగము.

అధికమైన సైన్య వ్యయమును తగ్గించుటకు దగిన సదుపాయములను యోచించుటకై యేర్పరుపబడినసభ యొక్క విచారణ ముగిసినది. సభాధిపతి సర్ నికోల్సను గారింకను దమతీర్పును వెలిబుచ్చలేదు. తీర్పు వలన బ్రయోజనము గలుగునని విశ్వసింపఁబడుచున్నది.

హిందూ దేశమునందుఁ జెల్లుబడియగు నాణెములకు గావలసిన వెండినిఁగొనుటను, లండనునందు నిలువ యుండుసొమ్మును వాడువిధమును, బంగారునాణెములను వేయు నవసరమును గురించిన చర్చలు విపులముగా గత సంవత్సరమునందు జరిగినవి. హిందూ దేశమంత్రి యింగ్లీషువర్తకుల యాలోచనలను నమ్మి నిలువసొమ్మును నుపయోగించుటయందును, వెండిని గొనుటయందును హైందవ కరదాయకుల క్షేమమును గమనించుటలేదను వాదము ప్రబలమయినది. హిందూదేశమునందు బంగారునాణెములను వేయుటయును వెండినాణెముల నిరర్గళ ముద్రాంకితము నాపుటయును ఛౌలరు పంచాయతిసభ యొక్క తీర్మానము. మొదటి తీర్మానము నింత వరకు హిందూదేశపాలకు లాచరణమునందుంచలేదు. హిందూ దేశమునందు బంగారు సవరనులను పదిరూప్యముల నాణెములను వేయుట యుచితమని హిందూదేశపాలకులు దమ యభిమతమును వ్యక్తీకరించిరి. ఈవిషయమును విచారించుటకై పంచాయతిసభ నియమింపఁబడునని ప్రధానమంత్రి ఆస్కివ్వతుగారు పార్లమెంటులో దెలిపి యుండిరి. సభయొక్క తీర్మానమునకై వేచియుండక బంగారునాణెములను చేయుటకయి టంకశాలను స్థాపించుట క్షేమకరము.

## శాసనసభలు.

క్రొత్తయెన్నికలకై చేయబడిన మార్పులత్యల్పములు. నియోజననిబంధనలు సంస్కరింపబడునను నాశ విఫలమైనది. యథాప్రకారముగా నధికారసభ్యుల బలము హెచ్చుగనున్నది. అనధికారసభ్యుల తీర్మానము లంగీకృతములగుట కవకాశములేదు. సామ్రాజ్యశాసనసభయందు సురేంద్రనాధబనర్జిగారు, వీరరాఘవాచారిగారు, రామానారాయణంగారు, మిర్ అసదల్లీ ఖాన్ బహాదూర్ గారు ప్రవేశమునుగాంచిరి. గత సంవత్సరమునందు దేశాదాయము రూ. 130,50,00,000లు, వ్యయము రూ. 119,40,60,000. రూ. 11,10,00,000 లధికముగా వసూలైనవి. నిలువ సొమ్మునుండి విద్యాభివృద్ధికై రూ. 2,50,00,000, పారిశుద్ధ్యాభివృద్ధికై రూ. 1,50,00,000 అధికముగా వినియోగించుటకై నిశ్చయింపబడినది. కుట్రకు సంబంధించిన యొక క్రొత్త కఠిన శాసనమును పాలకులు నిర్మించిరి. ఈశాసనముయొక్క లాభనష్టములు ముందుఁ దెలియగలవు.

## జాతీయోద్యమము.

దేశమంతయును నూతనోద్యమమయముగా నున్నది. సభలు గూడుచున్నవి. ధనాగారములు స్థాపింపబడుచున్నవి. నూతనపరిశ్రమ లారబ్ధములగుచున్నవి. వంగ రాష్ట్రమునం దమూల్యమైన బంగారుగని బయటఁబడినటులు ప్రకటితమైనది. రాకాసిబొగ్గుయొక్క యుత్పన్నము 1,30,00,000టన్నులకు బెరిగినది. వ్యాపారవాణిజ్యములు రూ. 296,00,00,000 లకుఁబెరిగినవి. నూతనముగా నిర్మింపబడిన బీహారురాష్ట్రమునందలి బాంకిపురమునందు దేశీయమహాసభ గూడినది. ఆహ్వానసభాధిపతి మజురులుహక్కుగారు హిందూమహమ్మదీయ సంయోగమును స్వరాజ్యాదర్శమును గురించి సానుకంపాభిప్రాయములను వ్యక్తీకరించిరి. ముధోల్కరుగారు దేశీయ మహాసభ కధ్యక్షులుగనుండిరి. వారి యుపన్యాసము స్వతంత్ర గంభీర భావభరితమై యొప్పుచున్నది. హరకిషనులాలుగారు పరిశ్రామికసభ కధ్యక్షతను వహించిరి. దేశోద్ధరణమునకై పరిశ్రమముల పునరుద్ధారణమును, ద్రవ్యోపార్జనావశ్యకతను వ్యక్తీకరించిరి. రామావతారశర్మగారు సంఘసంస్కరణసభ కధ్యక్షతను వహించిరి. సంఘ దురాచారములను, జనుల యుదాసీనభావమును విపులముగా విశదీకరించిరి. హిందూ విశ్వవిద్యాలయమునకై పండిత మదనమోహన మాలవ్యగారును, దర్భంగ మహారాజుగారును శ్రమపడి యేబదిలక్షలరూప్యముల చందాలను వేయించగలిగిరి. విశ్వవిద్యాలయమునకై పాలకులు 69 లక్షల రూప్యముల నధికముగా

వ్యయముచేయుటకై నిశ్చయించిరి. జాతీయజీవనమునకు విద్యావ్యాపనమే మూలబీజము. విశాలమైన భరతఖండమునం దున్నతవిద్యావ్యాపనకయి భిన్నప్రదేశములందు విశ్వవిద్యాలయములను స్థాపించుట యవసరము. ఆంధ్రదేశమునందును విద్యావ్యాపనకై విశ్వవిద్యాలయ వ్యాపనమవసరమని యాంధ్రదేశీయుల యాశయము.

### చెన్నపురిరాష్ట్రము.

గత సంవత్సరమునందు వనపాలన వ్యవస్థలను విచారించుటకై నియమింపబడిన సభయొక్క తీర్మానములు ప్రకటింపబడినవి. ఈతీర్మానముల వలన వనపాలనమువలన గలుగు కష్టములుకొన్ని తొలగవచ్చును. క్రొత్త మెన్నికల వలన నరసింహేశ్వరశర్మగారును, పోలవరం జమీందారు కృష్ణారావుగారును సభ్యులుగానెన్నుకొనబడిరి. కేశవపిళ్ళగారును, రామచంద్రరావుపంతులుగారును వారి స్థానములను నిలుపుకొనిరి. మహాభాగులు పెట్లండుప్రభువుగారు పాలనభారమును వహించిరి. ప్రజాహిత తత్పరులైన వీరిపాలనాకాలము దేశహితార్థమై వినియోగింపబడునని విశ్వసింపబడుచున్నది. శాసననిర్మాణసభ్యులకు ప్రభువుగారు చేసిన విందు భోజనమునకు జాతిమతభేదమును పాటింపక సభ్యులందరును వెళ్లియుండిరి. చెన్నపురిరాజ్యముయొక్క గత సంవత్సరాదాయము రూ. 8,05,88,000 వ్యయమురూ.7,62,12,000. ప్రజలకునీటివసతులను గల్పించుటకై పాలకులు అయిదులక్షల రూప్యములను వ్యయముచేయవలయునని యున్నారు. విద్యాభివృద్ధికై రూ. 58,88,000. వ్యయము సేయబడును. సంఘసంస్కరణమునకు దగిన సాధనములను విచారించుటకై పండితులు కాంచీపురమునందును,తిరువాదియందును, సభలనుజేసిరి.

### ఆంధ్రదేశము.

ఆంధ్రదేశమునందు గొప్ప యాందోళనము పుట్టినది. దేశమునందంతటను సమాజములు స్థాపింపబడుచున్నవి; సభలుగూడుచున్నవి; విద్యవ్యాపించుచున్నది. యావనులు వ్యగ్రోత్సాహభరితులై పురోవృద్ధిని గోరుచున్నారు. పఠనమందిరములు ప్రబలుచున్నవి. గ్రంథ ప్రచురణ మండలులువర్ధిలుచున్నవి. విద్యానిధిని స్థాపించి విద్యాభివృద్ధినిఁజేయుటకై గా॥ నరసింహేశ్వరశర్మగారి యధ్యక్షతక్రింద నొకసభ స్థాపింపబడినది. ఈయాందోళనము, ఈయుత్సాహము, ఈప్రయత్నములు ఆంధ్రోద్యమమునకు బునాదులు. ఈప్రయత్నములనునిర్ణయించిఫలవంతములనుగాజేయుటకై గుంటూరుమండలవాస్తవ్యులు వైశాఖశుద్ధదశమి గురువాసరంబునం దాంధ్రమహాసభ బాపట్లయందుగూడునటు లేర్పాటుచేసిరి. సభకూడుటకు గలప్రయోజనములిటులు తెలుపబడినవి. 1.జనులకు విద్యయందును, నున్నతాదర్శములందును, జ్ఞానసంపాదనమునందును నభిరుచిని బుట్టించి కార్యసిద్ధికి దగిన సదుపాయములను గలిగించుటకై పాలకులకునివేదించుట; 2. వ్యవసాయవాణిజ్యాభివృద్ధి కనుకూలములైన సదుపాయముల నన్వేషించి కార్యానుకూలమునకై ప్రజలయందు బరస్పర విశ్వాస ప్రత్యయ స్వభావమును బుట్టించుట; 3. జనులకు శుచిత్వమునందును, నారోగ్యమునందును, శరీర వ్యాయామమునందును నుత్సాహము నంకురింపజేయుట; ఆంధ్రగ్రంథప్రచురణమువలన జనులను వివేకవంతులనుగా జేయుట; 5. రాజకీయోద్యోగములం దాంధ్రుల హక్కులను గాపాడుటకై పనిజేయుట.

ఈయాదర్శప్రాప్తికిప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణమును, విశ్వవిద్యాలయ స్థాపనమును, దైనికవార్తాపత్రికాప్రచురణమును సాధనములని విశ్వసింపబడుచున్నది. ఆంధ్రుల యాధిపత్యముక్రింద నాంగ్లదైనిక పత్రికను బ్రకటించుట దుర్ఘటముగాదు. తగిన ద్రవ్యసహాయము లభించిన నిది సులభసాధ్యము. విశ్వవిద్యాలయ స్థాపనమునకు విశేష ద్రవ్యమును పాలకుల సమ్మతియు గావలయును. విశ్వవిద్యాలయ స్థాపనము లాభకరమని అందరును సంగీకరించుచున్నారు. గా॥ శివస్వామయ్యగా రుత్తరమండలములకొక విశ్వవిద్యాలయ మవసరమని వక్కాణించిరి. హిందూదేశ పాలకులును విద్యావిషయమైన తీర్మానమందు నూతనమైన విశ్వవిద్యాలయములను స్థాపించుట యవసరమని తెలిపియుండిరి. బర్మా బీహారు మధ్యరాష్ట్రములందు విశ్వవిద్యాలయములు స్థాపింపబడును. విశ్వ

విద్యాలయమును స్థాపించుటకు ద్రవ్యసహాయ మవస
రము. పాలకు లాంధ్రదేశమునకై ప్రస్తుత స్థితియందు
విశేషద్రవ్యమును వినియోగింతు రనుటకు వీలులేదు.
ఆంధ్రదేశమునం దీ యుద్యమమునకు దగిన ద్రవ్యము
సమకూరిన హిందూ విశ్వవిద్యాలయమువలె నిదియును
సంభవము గాగలదు. డక్కాయందువలె నాంధ్రదేశము
నందును ప్రత్యేక విశ్వవిద్యాలయమునుస్థాపించుట పాల
కులవిధిగా నెంచఁదగియున్నది.

ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణము.

ఈవిషయమును గురించిన వాద ప్రతివాదములు
పత్రికాముఖమునను ప్రసంగ వశమునను వ్యాప్తినిగాంచు
చున్నవి. నూతనాదర్శములు త్వరితముగా నామో
దింపబడుట దుర్లభము. ఈయాదర్శముపట్ల వర్తమాన
నాయకు లుదాసీనభావమును, యావను లుత్సాహ
మును, ద్రవిడనాయకులు పరాఙ్ముఖత్వమును వహించు
చున్నారు. లోకనిర్మాణములలో నేనిర్మాణమునకును
సంపూర్ణస్థితి యసంభవము. రాజ్యాంగవిషయములందీ
సిద్ధాంతము ముఖ్యముగా జెల్లుచున్నది. ఆంగ్లేయరా
జ్యాంగ నిర్మాణముసంపూర్ణస్థితియందున్నదని యూహింప
బడుచున్నది.విన్స్టనుచర్చిలుగారు బ్రిటిషుద్వీపములందు
భిన్నరాష్ట్రనిర్మాణమవసరమని తెలిపియుండిరి. బొంబయి
రాష్ట్రమునుండి సింధుప్రాంతమును విడదీయుట యవసర
మని సింధుదేశవాస్తవ్యులు తలచుచున్నారు. కారణాంతర
మువలన నొకకాలమునందు నిర్మితములైన వ్యవస్థలు కార
ణములు కాలము మారినపుడు శాశ్వతములు గాజాలవు.
ఇంతవరకాంధ్రదేశము చెన్నపురిరాష్ట్రమునందు జేరి
యుండి వృద్ధిజెందినను నాస్థితియె శాశ్వతముగా నిలిచి
యుండవలయుననుట యసంగతము. హిందూసామ్రా
జ్యముయొక్క రాజ్యాంగముల పరమావధిని నిరూపిం
చుట దుస్తరము. దేశమునందు బదుమూడు రాష్ట్రము
లును స్వతంత్రవ్యక్తిగల యనేక సంస్థానములునుగలవు.
బ్రిటిషుపరిపాలనా పాశమువలన నివిసంబద్ధములు. విశా
లమైన భరతఖండమునం దనేకరాజ్యములు, జాతులు,
భాషలు, మతములుగలవు. అయినను నేకజాతీయాదర్శ
మును నేకసామ్రాజ్య భావమును బ్రవర్ధమానములగు
చున్నవి. భిన్నప్రదేశముల వృద్ధి సామ్రాజ్యాభివృద్ధికిని,
భిన్నజాతులబలము జాతీయౌన్నత్యమునకును గారణ
ములు. ఒకభాషను ఒకప్రదేశమును సమానాచార
వ్యవహారములను గలిగియున్న యాంధ్రజాతీయతను నిర
సించువారలకు భాషయందును నివాసస్థలము నందును
నాచారవ్యవహారములందును సామ్యత్వము లేని హైందవ
జాతీయత్వాదర్శ మెటులు సంభవమొ దుర్గ్రాహ్యము.
ఆంధ్రరాష్ట్ర నిర్మాణముయొక్క సంభవా సంభవము
లెటులున్నను నాయుద్యమము పరమావధిని సాదరభావ
ముతో విమర్శించుట విద్యాధికుల కర్తవ్యము. ఆంధ్రో
ద్యమము నాంధ్రదేశమాంధ్రులకని నిర్వచించుట యపా
ర్థము. చల్లని బ్రిటిషుపరిపాలనమునం దేజాతివారెచట
నుండుటకును బ్రతిబంధకములు లేవు. రాష్ట్రనిర్మాణము
వలన ద్వేషముగలుగదని యంగీకృతమైనది. ఇతర సదు
పాయములు కుదిరినపుడు తగిన రాజధాని పాలనము
కుదరకపోవు. పాలనము ప్రజలకై యేర్పడినదిగాని
ప్రజలు పాలనమునకై పుట్టలేదు. ఆంధ్రరాష్ట్ర నిర్మా
ణముయొక్క ప్రయోజన మాంధ్రదేశాభ్యుదయము.
దేశాభ్యుదయమునకు భాషాభివృద్ధి, విద్యావ్యాపనము,
సంపదలు గారణములు. ఈసాధన సంపత్తిని సమకూ
ర్చుటకై ప్రజలును పాలకులును పాటుపడు చున్నారు.
ప్రత్యేకరాష్ట్ర నిర్మాణమువలన నానాప్రదేశములందు
నివసించు నాంధ్ర మహాజనులకు సంయోగ మేర్పడి
శ్రీమంతులు దమ సంపదలను, విద్యావంతులు దమ వివే
కమును, పాలకులు దమ సత్పరిపాలనమును ప్రజల
యోగక్షేమాభివృద్ధికై యధికతరముగా వినియోగిం
చుట కవకాశము లేర్పడి సత్వరముగా దేశాభ్యుదయము
గాగలదు. ఈయాదర్శము దూరాధిరూఢమైనను విచా
రించ దగినది. యత్నించదగినది. పదేండ్లకుమునుపిపుడు
శ్రీ హార్డింజిప్రభువు వ్యక్తీకరించిన యాదర్శము కలలోని
వార్తగా నెంచఁబడియుండును. పదేండ్లపిమ్మట నాంధ్ర
జాతీయాదర్శము పరిపాటియై దూరదృష్టిగల పాలకునకు
విపరీతముగాఁ దోచకపోవచ్చును. ఇప్పటి స్థిరవ్యవస్థ

లఘు డస్థిరములు గావచ్చును. విధిప్రేరితములైన నిర్మాణములు కాలానుగుణ్యముగా మారుచుండుట ప్రకృతిధర్మము. ఈయలంఘనీయమైన ధర్మమును గ్రహించుట విశాలహృదయముగల రాజనీతిజ్ఞుల లక్షణము.

## విద్యావ్యాపనము.

ఆంధ్రదేశమునందును నితర భాగములందువలె విద్యవ్యాప్తిని గాంచుచున్నది. ప్రథమ విద్యాపాఠశాలల నభివృద్ధినిఁ జేయుటకై పాలకులు పాటుపడుచున్నారు. స్త్రీల కున్నతవిద్యను నేర్పుటకై విశాఖపట్టణమునందొక యున్నత విద్యాలయము స్థాపింపబడినది. స్త్రీలకుపవేతనముల నొసంగి దొరతనమువారు విద్యను నేర్పుచున్నారు. కొండ వెంకటప్పయ్య పంతులుగారు వేటపాలెమునందు శారదానికేతనమును స్థాపించి స్త్రీల విద్యాస్వాతంత్రముల నభివృద్ధిజేయుటకై ప్రయత్నించుచున్నారు. మచిలీపట్టణంబునగూడిన యాంధ్రమహిళా సభకు నానాప్రదేశములనుండియును నారీమణులువచ్చియుండిరి. సభయందు జదివిన వ్యాసములును చేసిన ప్రసంగములును యువతీవర్గమునకుగల విద్యాభిమానమును దేశభక్తిని వ్యక్తీకరించుచున్నవి. విద్యనభ్యసించుటకై పరదేశములకేగు విద్యార్థుల సంఖ్య వర్థిలుచున్నది. ఎడింబరో విశ్వ విద్యాలయమునందు విద్యనభ్యసించు నాంధ్రవిద్యార్థులచిత్రపట మీసంచికయందు ముద్రింపఁబడినది. ఆంధ్రవిద్యార్థు లితర విద్యాలయములందును విద్యనభ్యసించు చున్నారు. గత సంవత్సరమునందు బారిష్టరు పరీక్షయందు మొదటిస్థానము నలంకరించి నాలుగువేల రూప్యముల యుపవేతనమును గడించిన కొత్తపల్లి రెడ్డిగా రాంధ్రలోకమునకు సత్కీర్తిని గడించిరి. విదేశములకేగిన విద్యార్థులకు బహిష్కారబాధతగ్గుట యాంధ్రదేశాభ్యుదయమునకు శుభసూచకము. ఆంధ్రదేశముయొక్క భావిభాగ్యోదయమునకు విద్యావ్యాపనమె మూలము. దేశమునందు సత్వరముగా నన్నతవిద్యవ్యాపించుటకు విశ్వవిద్యాలయమును స్థాపించుటకు మించిన సాధనాంతరములేదు.

## సంఘసంస్కరణము.

సంస్కరణముల పరిణామము ప్రజాసుఖమ[illegible] సంస్కరణము లెన్నియైనను ఫలమొక్కటియె. రా[illegible] కీయసభలు, సాంఘికసభలు, మతచర్చలు సంఘవ[illegible] నుద్ధరించుటకై పుట్టినవి. సంస్కరణాభిలాష తెలుగ[illegible] దేశమునందుఁ బెరుగుచున్నది. రావుబహద్దరు వీరేశలి[illegible] గముపంతులుగారు నాటిన సంస్కరణాంకురములు మహ[illegible] వృక్షములుగాఁ బరిణమించుట కామహనీయుని వం[illegible] స్వార్థత్యాగులును కార్యశూరులును గావలయున[illegible] హితోపదేశములనుఁ జేయుట సులభము. తప్పులనెన్ను[illegible] సులభతరము. చేయుట దుష్కరము. మనుజమాత్రులక[illegible] సంపూర్ణత్వ మసంభవము. లోపములుండుట సహజము[illegible] పంతులువారు దమ ధనమును, పాండిత్యమును, నార[illegible] గ్యమును దేశహితార్థమై సమర్పించిరి. చేసిన మేలున[illegible] మరచుట యవివేకము. నిర్హేతుకముగా వృద్ధాప్యమ[illegible] నందు వీరేశలింగముపంతులుగారి తప్పుల నెన్ని వారి[illegible] మనోవేదనను గలిగించువారు దేశోపకారులుగా నెంచ[illegible] బడరు. ఆంధ్రులు సదయహృదయులై పంతులుగార[illegible] సుగుణములను గ్రహించుట శ్రేయస్కరము. నిర్బంధ[illegible] వైధవ్యము, బాల్యవివాహములు, కన్యాశుల్క వరశు[illegible] ల్కములు, నిమ్నజాతి ప్రతిబంధకములు మొదలగు[illegible] దురాచారములను దొలగించుటకు చర్చలు జరుగుచు[illegible] న్నవి. కాలక్రమమున నీచర్చలు క్రియారూపమును[illegible] దాల్చఁగలవు.

## ఆంధ్రభాష.

భాషాభిమానులు మృదు మధురమైన తెలుగు[illegible] భాష నభివృద్ధిని జేయుటకై పాటుపడుచున్నారు. గ్రంథ[illegible] ప్రచారిణీసంఘములు వర్ధిలుచున్నవి. కోవూరి చంద్రా[illegible] రెడ్డిగా రాంధ్రభాషాపోషకులయం దెన్నికను గాంచుచున్నారు. చంద్రారెడ్డిగారు దమ విద్యాధనములను సదుద్యమములకై వినియోగించుచు నాంధ్రదేశమును భాషను చంద్రప్రభావమువలన వికాసవంతముగఁ జేయుచున్నారు. పిఠాపురము రాజుగారి యౌదార్యము వలన

స్థాపింపబడిన సాహిత్య పరిషత్తు త్రిమాసపత్రికను ముద్రించుట కుపక్రమించినది. పరిషత్తు పత్రికవలన భాషా విషయమైన మూలాన్వేషణ విచారణము వర్ధిలునని విశ్వసింపఁబడుచున్నది. తెలుగునందు విపులమైన శబ్దార్థకోశమును బ్రచురించుటకై తగిన యత్నములు జరుగుచున్నవి. విజ్ఞానచంద్రికా మండలివారు విజ్ఞానసర్వస్వమను విశ్వకోశమును బ్రచురించుటకై ప్రయత్నములనుఁ జేయుచున్నారు. చెన్నపురి రాష్ట్రపాలకులీ కోశములను ముద్రించుటకై ద్రవిడభాషాకోశ ముద్రణమునకువలె దగిన ధనసహాయమును జేయవలసియుందురు. భాషాభిమానులు దమ విద్యాధనములను భాషాపోషణమునకును తన్మూలమున దేశాభివృద్ధికిని వినియోగించుచు నాంధ్రమాత నుద్ధరించుటకై పాటుపడవలసియుందురు.

### గ్రామ్య గ్రాంథిక భాషలు.

ఈవిషయమై వాదోపవాదములు పెరుగుచున్నవి. ఉభయపక్షములవారి వాదముల నీసంచికయందు బ్రచురింపబడిన వ్యాసములవలన జదువరులు గ్రహింపనోపుదురు. ప్రయోగమె శరణ్యముగాగల భాషను శాసించుసామర్థ్య మెవరికిని లేదు. సచేతనమైనభాషయందనుక్షణమును మార్పులేర్పడుచున్నవి. మార్పులు స్థిరమైనపుడు నియమములును స్థిరపడును. లక్ష్యములేని లక్షణమసంభవము. మార్పులకై వేగిరబడుటవలన బ్రయోజనమేర్పడదు. వాగనుశాసనుని బోలిన మహామతులు భాషానిర్మాణకులు. కేవలము వాదమును నిలుపుకొనుటకై పాటుపడుట యసంగతము. గ్రామ్యభాషాభిమానులు జనాదరణమునుఁబొందక పాఠశాలలందు స్వకీయపక్షమును బలపరచు పఠనీయగ్రంథములను జదివించుటకై చేయు ప్రయత్నములు వైషమ్యమును బెంచుచున్నవి. గ్రాంథిక భాషాభిమానులు గ్రామ్యభాషనువాడుటను నిరసించుచు సభలనుజేసి పాలకులకు విన్నపముల నంపుచున్నారు. మార్పులేర్పడుటయును నవి నియమానుసారముగ నేర్పడుటయును భాషాభివృద్ధికిఁ గారణములు. ఉభయపక్షముల యాశయములును భాషాభివృద్ధి. వారును వీరునుగూడి మార్పుల యావశ్యకతను జర్చించి నిర్ణయించి సామాన్యజనమునకు సందేహనివృత్తినిఁ జేయుట శ్రేయస్కరము.

### వాణిజ్యపరిశ్రమలు.

దేశాభ్యుదయమునకు వాణిజ్యము పరిశ్రమలు మూలము. పాశ్చాత్యదేశముల ధనసంపదలకు వ్యాపారమును పరిశ్రమలును గారణములు. ఆంధ్రదేశమునందు వ్యాప్తినిగాంచిన పరిశ్రమము వ్యవసాయము. జనులలో మూడువంతులు ప్రత్యక్షముగనో పరోక్షముగనో యీ వృత్తి నవలంబించుచున్నారు. వ్యవసాయమునందైనను నూతనపద్ధతుల నవలంబించినగాని తగిన ఫలితమేర్పడదు. కార్యసిద్ధికి వ్యవసాయశాస్త్రముయొక్క జ్ఞానవ్యాపన మవసరము. తెలుగుదేశమునందు 60 వడ్లమరలును, 2 జనపనార యంత్రాలయములును, 25 దూదిబస్తాలను గట్టు యంత్రములును, 16నూనెమరలును, 70,000 చేతి మగ్గములును, 2 సర్కరశాలలును నితర పరిశ్రమాగారములు కొన్నియునుగలవు. ఆంధ్రదేశమునందు స్థాపించుటకు దగిన పరిశ్రమ లనేకములుగలవు. బట్టలయంత్రాలయములు ముఖ్యముగ గావలసియున్నవి. అవసరమైన బొగ్గు దూది పనివాండ్రు దేశమునందుగలరు. వలయు మూలధనమునుగూర్చి బట్టల యంత్రాలయమును స్థాపించుట క్షేమకరము. నూనెగింజలనుండి నూనెనుదీసి పిండిని నెరువుగా వాడుట లాభకరము. వ్యాపార విజృంభణమునకు దగిన రేవాంధ్రదేశమునందు లేనందున విదేశవ్యాపారము తెలుగుదేశమునందు లేదనవచ్చును. విశాఖపట్టణమునందు నావాశ్రయమును నిర్మించుటకై నాయకులు పాలకులనుగోరి వాణిజ్యాభివృద్ధిని జేయుటకై పాటుపడవలయును. స్వదేశపరిశ్రమములు లేకను స్వదేశవస్తు ప్రచారము గలుగనేరదు. జాతీయాభిమానులు దేశమున కవసరమైన పరిశ్రమలను స్థాపించినదేశమును బాగుచేసి తాము బాగుపడగలరు.

### వ్యాసములు.

సంవత్సరాదిసంచికకు సురుచిరాలంకారము లందు ముద్రితములైన వ్యాసములు. విద్యాధికుల యుప

దేశములు సామాన్యజనులకు మార్గదర్శకములు. శ్రేష్ఠులయాచరణములు సామాన్యులకు ప్రమాణములు. వారి యుదారసంకల్పములు వీరి కున్నతాదర్శములు. వారి వ్యాసములు వీరికి జ్ఞానోపదేశములు. ఉదారసంకల్పములులేని జాతులు నిమ్నదశావశులగుదురు. ఉన్నతాదర్శములె వ్యక్తిని సంఘమును జాతిని నుద్ధరించుటకు మూలబీజములు. ఉన్నతాదర్శము లుదారసంకల్పములకును నుదారభావములు మహత్కార్యములకును మూలకారణములు. విద్యాధికుల సదుపదేశములు దేశభక్తిని, రాజభక్తిని, భాషాభిమానమును, సాధుశీలమును బెంపొందించుటకు సాధనములు. వ్యవహారపరాయణులైన విద్యాధికులకు దీరికతక్కువ. అయినను వారు శ్రమచేసి సావకాశమును గల్పించుకొని తమమంచివ్యాసములతో నీసంచికను సత్కరించినందులకు నిర్వ్యాజమైన వందనంబులు. సంచికయందు ముప్పదియారు వ్యాసములును, కొన్ని పద్యములును ముద్రింపపడినవి. రాజకీయవిషయములను గురించినవి పది, భాషాభ్యుదయమునకు సంబంధించినవి యారు, మతమీమాంసలకు జెందినవినాలుగు, సంఘ సంస్కరణమును జర్చించునవి నాలుగు, పరిశ్రమలను గూర్చినవి నాలుగు, కథలు రెండు, ఇతరములైనవి కొన్నియును వ్యాసములుగలవు. కారణాంతరములవలన జేరిన వ్యాసములలో గొన్ని ముద్రించుటకు వీలుగలుగలేదు. వ్యాసలేఖకులు మన్నించెదరు గాత. ముద్రితములైన పద్యంబులు చదువరులకు భక్త్యుత్సాహములను గలిగించి దేశాభిమాన పరాయణత్వము నుపదేశించగలవు.

చిత్రపటములు.

భారతకాలమునం దింద్రప్రస్థపురంబని పేరొందిన ఢిల్లీనగరమునకు రాజధానిని మార్చుటవలన హిందూసామ్రాజ్యమునందొక నూతనశక మేర్పడినది. ఇమ్మహాప్రస్థమునం దింద్రప్రస్థపురమును, పృథ్వీరాజనగరమును, ఫిరోజాబాదును, షహజహానాబాదును మించెడి మహానగరము నిర్మింపబడి భారతజాతీయత కాటపట్టుగా గలదు. నానారాష్ట్రముల ప్రతినిధులీ పవిత్రమైనయమునాతటంబునంగూడి జాతి మతభేదములను మఱచి భారతమాత నారాధించెడి కాలము కాలాంతరమున సంప్రాప్తించంగలదు. మహాభాగుడు హార్డింజిప్రభు వత్యుదారభావగర్భితమైన యాదర్శమును నిర్భయముగాం బ్రకటించెను. ఆమహామహుని ఢిల్లీనగర ప్రవేశము ముఖపటముగా ముద్రింపబడినది. వారి ధైర్యస్థైర్యములు, సౌహార్దము, విశ్వాసము సంస్తవనీయములు. శ్రీ పంచమజార్జి రాజరాజేంద్రుడు దేశాభ్యుదయమునకు ఆరోగ్యము, ఐకమత్యము, విద్యావ్యాపనము సాధనములని హితోపదేశమును జేసెను. శ్రీ హార్డింజిప్రభువీసదుపదేశములనాచరణమునకు దెచ్చుటకై శక్తికొలది యత్నించుచున్నారు. ముఖపటమునందు గజారూఢులై సంగీతసాహిత్యపరిశ్రమ చిత్రకళాధిష్ఠాన దేవతలనుగమింప హార్డింజిప్రభువు ఢిల్లీనగరమునందు ప్రవేశమును జేయుచున్నటులు చిత్రింపంబడినది. కళాధిష్ఠానదేవతల యాకృతులు పాశ్చాత్యుల చిత్రకళాసిద్ధాంతానుసారముగా జిత్రింపబడినవి. విద్యాసేవనము, పరిశ్రమారాధనము, కళోపాసనము భరతవర్షాభ్యుదయమునకువలె నాంధ్రదేశాభ్యుదయమునకును బీజాంకురములు.

మొదటి చిత్రపటమునం దాంధ్రమాత తనవర్తమానసంతతి నలంకరించు నాయకులకు గీర్తిశేషులైన యాంధ్రమహారాజుల చరిత్రముల నాదర్శముగా జూపుచున్నటులు లిఖింపబడినది. పటముక్రింద ముద్రించిన పద్యమువలన భావము వ్యక్తముగాగలదు. రెండవ పటమునందు సంవత్సరారంభమునందు బంచాఙ్గశ్రవణమును జేయుచున్నటులు చిత్రింపబడినది. మూడవపటమునందు భరతమాత యాంధ్రబాలను జేరదీసి యోదార్చునటులు చిత్రింపబడినది. రెండుపటముల భావములును నెదుటి పుటయందు ముద్రింపబడిన పద్యములవలన వ్యక్తమగుచున్నవి. ఇతర చిత్రపటములు రమారమి రెండువందలుగలవు. తురుష్కసామ్రాజ్యమునకు, పాదుషా, చెన్నపురి బొంబయిరాష్ట్రపాలకులు, తురుష్క బాల్కనుసంగ్రామమునకు సంబంధించిన నాయకులు, సుప్రసిద్ధదేవాలయములు, మసీదులు, మందిరములు, రాజులు, మహా

జనులు, నాయకులు మొదలగు విషయములకు సంబంధించిన చిత్రపటము లనేకములుగలవు. ఆంధ్రభాషను మాటలాడు ప్రదేశమునుజూపు దేశపటమొకటి చేర్చబడినది. చదువరులీ పటముల ప్రయోజనమును గ్రహించి సంతసించెదరుగాత.

స్వవిషయము.

దైవానుగ్రహమువలనను నాంధ్రదేశబాంధవుల సహాయప్రోత్సాహమువలనను నాల్గవసంవత్సరాదిసంచిక వెలువడినది. దేశబాంధవుల యుదారపోషణమువలన నాంధ్రపత్రిక దినదిన మభివృద్ధినిజెందుచున్నది. దేశాభిమానులు, భాషాభిమానులు, శ్రీమంతులు దమయుదారభావములతోను, వ్యాసములతోను, చందాలమూలమునను నింతవరకు బత్రికాభివృద్ధికి దోడ్పడినందులకువందనములు. ఆంధ్రపత్రిక తెలుగుదేశమునకు దూరమునందున్న బొంబయినగరమునందు ప్రచురింపబడుచున్నది. దూరస్థితి పత్రికాప్రయోజనమునకు భంగమును గలిగించుచున్నది. తెలుగుబాసను మాటలాడు జనులు 2,50,00,000గలరు. అయినను నాంధ్రభాషయందొక దినపత్రికయైనను లేదు. గుజరాతిభాషయందారు దినపత్రికలు గలవు. ఆంధ్రదేశబాంధవుల సహాయమువలన నాంధ్రపత్రికను దినపత్రికగా జేయవలయునను సంకల్పముగలదు. పత్రికను దినపత్రికగా మార్చినను వారపత్రికయును నిప్పటివలె ప్రచురితమగుచుండును. సంకల్పసిద్ధికై యాంధ్రపత్రికను మద్రాసునుండి ముద్రించుట యుచితమని తోచుచున్నది. ఆంధ్రమహాజనులు దమయుదారస్వభావముతో నీసంకల్పసిద్ధికిఁ దోడ్పడుటకు బ్రార్థితులు.

వందనములు.

వ్యాసములనువ్రాసియును, చిత్రపటముల నందజేసియును, చందాలనిచ్చియును, నితరవిధములైనసహాయమును జేసియును నుగాదిసంచికను ముద్రించుటకు దోడ్పడిన మహాజనుల కనేకవందనములు. కొన్నిచిత్రపటముల నిచ్చిన నికోలస్ కంపెనివారికిని; మరికొన్నిటిని శ్రమపడి సంపాదించిన వైద్యరత్న పండిత గోపాలాచార్యుల వారికిని, ముద్రణాఫలకములను సిద్ధముచేసిన వెంకయ్య సోదరులుగార్లకును, యుశేగారికిని, సీరాయిగారికిని, సంచికను ముద్రించిన తత్త్వవివేచక ముద్రాక్షరశాలాధికారులకును ధన్యవాదములు.

నూతనవత్సరారంభమున బాపట్లయందు గూడగల యాంధ్రమహాజనసభ ఆంధ్రోద్యమమున కాలవాలమై, జాతీయజీవనంబునకాకరంబై, రాష్ట్రనిర్మాణమునకు రక్షయై చిరకాలమువర్ధిల్లి భరతవర్షాభ్యుదయమునకు దోడ్పడుటకు సర్వేశ్వరుడనుగ్రహించెడిగాత. సకలాభీష్టప్రదాతయైన సర్వేశ్వరుడు జనులకు శుభంబుల నొడగూర్చి రక్షించుగాత. పత్రికాధిపతి.

---

# శుద్ధాశుద్ధపత్రము.

చిత్రపటములు.

| పుట | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| II | పాతాంతరములు. | నూతనవత్సర ఫలశ్రవణము. |

వ్యాసములు.

| పుట | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 123 | స్త్రాహబు | స్తోహబు. |
| | స్నైకృడ | స్నైకృటి. |
| | యగణంబు | యగణ్యంబు. |
| 124 | స్త్రాహబు | స్తోహబు. |
| | బణ్యముల | బణ్యముల. |
| 125 | బిగాదిగ | ఎగాదిగ. |

# విషయానుక్రమణిక.

# చిత్రపటముల విషయానుక్రమణిక.

దీనిలోఁ దెలుగంకెలు, చిత్రపటములున్న పుటలసంఖ్యను, నింగ్లీషు అంకెలు వాటి వివరమునుదెలుపు పుటలసంఖ్యనుఁ దెలుపును.

THE BLESSING OF THE MOTHER. ఆంధ్రమాతాశీర్వచనము.




ఉత్పలమాలిక. గాదిలి బిడ్డలార! ఘనకార్య ధురంధరులార! ధీర మ, ర్యాదవులార! యాంధ్రజనరత్నములార! సమస్తభంగులన్
బ్రోదియొనర్చినన్ను మును బ్రోచిన ధీరు లుదారులెల్లరున్, మేదురభక్తియుక్తి నదె మింటను నేటి కదృశ్యదృశ్యతే
జోదయలీలఁ గాంచెద రహో! మరిమీరును వారిభాతి నా, ప్లోవము మీఱి మాతృహితలాలసమానసులై పరార్థతా
పాదక సత్క్రియాధ్వత భవజ్జనయిత్రి సముద్ధరింప దీ, క్షాదరబుద్ధి యత్నములు సల్పరె! పూర్వుల పేరునిల్పరే!

ఉత్పలమాలిక. లాలిత నూత్నవత్సర ఫలంబిదె యాకొనుఁ డాంధ్రులార! మీ
యాలన పాలనల్ దెలియునట్టి మహాసభ యొక్కటబ్బె; మీ
పాలిటి కల్పవల్లివలె భవ్యఫలంబు లొసంగు విశ్వవి
ద్యాలయ మొక్కటబ్బె; వసుధాస్థలి మీదగు శక్తియుక్తులున్
శీలముఁ, జాకచక్యమును, జేవయు, లావును సాటివారిలోఁ
గ్రాలఁగ జేయునట్టి యవకాశము లిచ్చెడు రాష్ట్రమబ్బె; నే
వేళను దోడునీడవలె వెంటనటించుచు దొడ్డచెడ్డలన్
బోలఁగఁ దెల్పుచున్ హితము బోధయొనర్చుచు మిత్రరత్నమై
యోలినిఁ దల్లిదండ్రులయి యొజ్జలునై రసముల్ సమస్తమున్
గ్రోలఁగఁజేయు పాత్రమయి కూరిమినై నిలువేలునై సదా
హేలమెయిన్ రచించి మిము నేలెడు దైనిక పత్రికబ్బె;
నింతేల మహోచ్ఛకాలమిది యెల్లగ్రహా లనుకూలముల్ గురుం
డే లలి వెల్గుచుండెను పదింటికి సవ్వలియింట నింక నే
లీలను జూచుకొన్న నవలీల ఫలించు మనోరథంబు లీ
కాలము మారునింకఁ జిరకాలమునుండి యలంచుచున్న గా
ఢాలసతా పిశాచము లడంగుఁ గడంగు బెడంగు లెన్నఁడున్
దూలని నూతనోద్యమము తోడను నూతన నాయకుల్ సుధీ
శాలిత భాసిలన్ దశదిశావృత శుభ్రయశః ప్రలోభతన్
దేలుచు స్వార్థముల్ విడిచి దీక్షమెయిన్ గృషిచేసి శాంతియున్
మేలుసుఖంబుఁగూర్చి యినుమిక్కిలి పొల్చెదరింత నిక్క మీ
పాలున నీఫలంబు లనిశంబు భృశంబుగ నమ్మి నెమ్మదిన్
వ్రాలిన వేడ్క పిక్కటిల వర్తిలు చభ్యుదయంబుఁ గోరుచున్
మేలము మాని యింపగు సమేలము మైఁ జరియింతు రెల్లరున్.

పాఠాంతరములు.

శ్రీకర నూత్నవర్ష ఫలసిద్ధి వినుండిదె యాంధ్రులార! మీ
యేకట లెల్లఁదీర్చి మిము నెల్లర నేకముఁ జేసి సారసు
శ్లోకులఁ జేసి లోకమును లోకువఁ జేసి చెలంగు సత్ప్రభా
వాకరమై యెసంగెడు మహాసభయున్ గరిమంబుఁ గూర్చు ప్ర
త్యేకపు రాష్ట్రమున్ దలివి తేటలుఁ దేకువఁగూర్చు విశ్వవి
ద్యాకమనీయశాలయును నబ్బెను వేయననేల యేమిటన్
మీకుఁ గొఱంత యించుకయు మేకొనకుండఁగ నెల్లభంగులన్
సాకుటఁ జేసి యేడుగడ సత్యమె! యీసమ; మీకుఁగాన న
స్తోకముదంబునన్ గలిసి సోదరులన్ బరెసంచరించి మీ
శ్రేకపుఁ గష్టముల్ గడచి వేడ్కలవర్ధిలు చుందు రెల్లరున్.



A forecast of the future.

ఆంధ్రదేశమునకు- భావిశ్రేయస్సూచనము.



Bharatamata blesses the Andhra Bala.

భారతమాత యాంధ్రబాలను దీవించుట.

The Mecca Masjid.



మక్కామస్జీదు.

The Sultan of Turkey.



తుర్కీ సుల్తానుగారు.

Lord Pentland.



పెంట్లండు ప్రభువు.

Lady Pentland.



పెంట్లండు ప్రభ్వీణి.



Lord Willingdon. విల్లింగ్డన్ ప్రభువు,



Lady Willingdon. విల్లింగ్డన్ ప్రభ్వీణి.

The Members of the Royal Commission on Public Services.



పబ్లిక్ సర్వీస్ కమిషన్.



The Late General Nogi. కీర్తిశేష జనరల్ నోగీ.



Sir Edward Grey, సర్ ఎడ్వర్డ్ గ్రే.



Kiamil Pasha. కియామిల్ పాషా.



Mr. Enver Bey. ఎన్వర్ బేగ్.

ఓమ్ శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీ ప్రమాదీచ సంవత్సర సిద్ధాన్త పంచాఙ్గము.

అచింత్యావ్యక్తరూపాయ నిర్గుణాయగుణాత్మనే । సమస్తజగదాధార మూర్తయేబ్రహ్మణేనమః ॥

శ్రీకల్యాణగుణావహం రిపుహరం దుస్స్వప్న దోషాపహం గంగాస్నాన విశేషపుణ్యఫలదం గోదానతుల్యం నృణాం ।
ఆయుర్వృద్ధిదము త్తమం శుభకరం సంతానసంపత్ప్రదం నానాకర్మసుసాధనం సముచితం పంచాఙ్గ మాకర్ణ్యతాం ॥

అస్యసంవత్సరస్య సృష్ట్యాది గతాబ్దాః ౧౯౫౫౮౮౫౦౧౪ ॥ కలియుగ గతాబ్దాః ౫౦౧౪ ॥ శాలివాహన శక ౧౮౩౫ ॥ విక్రమార్క గతాః ౧౯౭౦ ॥ హూణశక ౧౯౧౩-౧౯౧౪ ॥ ఫసలి ౧౩౨౨-౧౩౨౩ ॥

ఈసంవత్సరమున చైత్ర వైశాఖముల యందు ఉత్తరదిక్సంధి ప్రాంతములలో ఖండవర్షము ఇతరదేశములయందు తొలకరివానయును గలుగును. జ్యేష్ఠాషాఢములయందు సర్వభూముల యందు సాధారణ వృష్టి కలుగును. శ్రావణభాద్రపదములయందు సువృష్టి కలుగును. ఆశ్వయుజ కార్తికములయందు కొన్నిచోట్లఅధికవృష్టి కలుగును. నదులు సంపూర్ణముగా ప్రవహించు చుండును. తెల్లధాన్యములు, మినుములు, పెసలు, నువ్వులు విశేషముగ పండును. నెయ్యి, నూనె, బెల్లము, మొదలగు రసజాతులకు సామాన్యధరలు కలిగియుండును. వస్త్రములు, పగడములు మొదలగు నీరసవస్తువులకు ధరలు కలిగియుండును. భాద్రపదశుద్ధ ౧౫యందు రాత్రి గ్రస్తోదయ సంపూర్ణ చంద్రగ్రహణము కలుగును. మార్గశిర బహుళ ౯ నాడు తుంగభద్రానదీ పుష్కరప్రవేశ మగును. పంటలు ౭ పాళ్లు లకధికముగా ఫలించును.



శ్లో॥ విలగ్నాతే పార్శ్వద్వయపరిసరే మత్తకరిణౌ కరోన్నితై రంచన్మణికలశ ముగ్ధాస్యగళితైః । నిషించంతౌ ముక్తామణి గణచయైస్త్వాం జలకణైః, గృహస్యా సౌదామోదరగృహిణిదారిద్ర్యదలితాః

స్వస్తి సర్వేషాంసమస్తమంగళానిభవస్తు.



## రాజాదినిర్ణయః.

ఈ సంవత్సరమునకు రాజా చంద్రః, మంత్రీ రవిః, సేనాధిప శనిః, సస్యాధిపః బుధః, ధాన్యాధిపః చంద్రః, అర్ఘ్యాధిపః శనిః, మేఘాధిపః శనిః, రసాధిపః గురుః, నీరసాధిపః కుజః। పురోహితో బుధః। పరీక్షకో కుజః। గణకో గురుః। గ్రామనాయక స్సూర్యః। దైవజ్ఞ శ్శనిః। రాష్ట్రాధిపతి శ్చంద్రః। సర్వదేశోద్యోగాధిపతి స్సూర్యః। అశ్వానామధిపతి రవిసూర్యః। గజానామధిపతి శ్శనిః। దేవానామధిపతి ర్బుధః। నరాణామధిపతి శ్శనిః। గ్రామనాయకః కుజః। వస్త్రాణామధిపతి శ్శుక్రః। రత్నాధిపతి స్సూర్యః। వృక్షాణామధిపతి శ్చంద్రః। జంగమాధిపతిః కుజః। సర్పాణామధిపతి గురుః। మృగాణామధిపతి శ్శనిః। శోభాధిపతి శ్చంద్రః। స్త్రీణామధిపతి శ్శనిః। ఆవర్తనామకో మేఘః। మేరుశిఖరే మేఘోత్పత్తిః। చతుర్మేఘపక్షే పుష్కరనామకో మేఘః। ఉద్వహనామకో వాయుః। విద్యున్నామ్నీ విద్యుత్। నిర్ఘోషనామకంగర్జితం। క్షీరనామకస్సముద్ర। శంఖనామకశ్శేషోభూమింవహతి। వర్షాధిపతి ర్గురుః। అస్మిన్నబ్దే శ్రీకృష్ణ పశుపాలకః। కోష్ట ప్రాపకో బలరామః। త్ర్యాఢకం పరిమితం వర్షం। వత్సరాదిమారభ్య చైత్ర శు ౧౯ గురువార పర్యంతం బాల్యవయోవిశిష్టగణికాహస్తంగతః। తదారభ్యశ్రేష్ఠ బ ౧౩ బుధవార పర్యంతం యౌవన వయోవిశిష్టగణికాహస్తంగతః। తదారభ్యపౌష్య బ ౫ శుక్రవారపర్యంతం వృద్ధవయోవిశిష్ట గణికాహస్తంగతః। తదారభ్యఫాల్గుణ బ ౪ భానువార పర్యంతం పునః యౌవనవయోవిశిష్ట గణికాహస్తంగతః। తదారభ్య వత్సరపునః వృద్ధవయోవిశిష్టగణికాహస్తంగతః।

శ్లో॥ సప్తభాగాస్సముద్రేషు పర్వతేషుతథాదశ

చతుర్భాగా ధరణ్యాంస్యురేవంవర్షతిచత్రిధా॥

అథాస్మిన్నబ్దేతమోమేఘః॥ మేరోః పశ్చిమభాగే మేఘస్యోత్పత్తిః॥ మేఘఫలమ్॥ శ్లో॥ మహావర్షం మహాఘోరం గర్జితంమేఘమండలం। ఏకార్ణవంతమోమేఘస్సాగరాంతం ప్రవర్షతి॥ అస్మిన్నబ్దేత్ర్యాఢక ప్రమాణం వర్షం। ఏకాఢకోవాయుః॥

అథవర్షధాన్యదయోర్లిఖ్యంతే.

| | |
|---|---|
| వర్షం | ౧౨ |
| ధాన్యం | ౧౨ |
| శీతం | ౫ |
| తృణం | ౧౫ |
| ఉష్ణం | ౨ |
| మారుతం | ౨ |
| ప్రజావృద్ధిః | ౧౫ |
| ప్రజాక్షయం | ౧౫ |
| రాజవిద్వరం | ౧౧ |
| ఉగ్రం | ౫ |
| పుణ్యం | ౫ |
| పాపం | ౧౫ |
| వ్యాధయః | ౩ |
| తదుపశమనం | ౧౫ |
| ఆచారం | ౧౭ |
| అనాచారం | ౧౭ |
| జన్మాని | ౧౭ |
| మరణాని | ౫ |
| దశోపప్లవం | ౧౫ |
| దేశస్వాస్థ్యం | ౧౭ |
| చోరభయం | ౧౭ |
| తదుపశమనం | ౧౨ |
| అగ్నిభయం | ౧౫ |
| తదుపశమనం | ౧౫ |
| మృగోపద్రవం | ౧౭ |
| మృగక్షయం | ౨ |
| కీటకభయం | ౧౭ |
| తన్నాశః | ౧౩ |
| మూషకవృద్ధి | ౧౧ |
| తన్నాశః | ౧౭ |
| సర్పోపద్రవం | ౧ |
| తన్నాశః | ౧౭ |
| కామం | ౧౧ |
| లోభం | ౧౧ |
| మోహం | ౧౫ |
| మదం | ౧౧ |
| మత్సరం | ౩ |
| సుఖం | ౭ |

| | |
|---|---|
| దుఃఖం | ౧౩ |
| భోగం | ౧౫ |
| విడంబం | ౧౫ |
| మనోవ్యథ | ౧౩ |
| ద్వేషం | ౭ |
| ప్రతిష్ఠ | ౩ |
| అప్రతిష్ఠ | ౧౩ |
| ద్యూతం | ౫ |
| మత్తత | ౧౩ |
| పురుషోత్పత్తి | ౩ |
| స్త్రీణాముత్ప | ౭ |
| ధాతుర్వాదం | ౧౫ |
| భయం | ౩ |
| శౌర్యం | ౩ |
| దుష్టనిగ్రహం | ౧౧ |
| శిష్టపాలనం | ౧౫ |
| సత్యం | ౧౭ |
| అసత్యం | ౫ |
| విశ్వాసం | ౨ |
| అవిశ్వాసం | ౭ |
| దయాళుత్వం | ౧౧ |
| నిర్దయాళుత్వ | ౧౩ |
| న్యాయం | ౧౫ |
| అన్యాయం | ౯-౩౨ |
| జ్ఞానం | ౧ |
| అజ్ఞానం | ౧౩ |
| కాపట్యం | ౧ |
| నిష్కాపట్యం | ౭ |
| ధార్మికత్వం | ౧౨ |
| అధార్మికత్వ | ౩-౧ |
| గోమాయువ్వ | ౧౦ |
| తన్నాశః | ౧౦ |
| సస్యకీటకవ్వ | ౧ |
| తన్నాశః | ౧౦ |
| శలభవృద్ధి | ౪ |
| తన్నాశః | ౪ |
| మశకవ్వ | ౧ |
| తన్నాశః | ౧౩ |
| మత్కుణవ్వ | ౧౩ |
| తన్నాశః | ౧౩ |

| | |
|---|---|
| వృశ్చికవ్వ | ౧ |
| తన్నాశః | ౪-౧ |
| సస్యవ్వ | ౬ |
| తన్నాశః | ౨ |
| పశువ్వ | ౪ |
| తన్నాశః | ౫ |
| శుకవృద్ధిః | ౮ |
| తన్నాశః | ౫ |
| ద్రుమకీటకవ్వ | ౮ |
| తన్నాశః | ౫-౮ |
| క్షుధా | ౩ |
| తృష్ణా | ౨ |
| నిద్రా | ౫ |
| ఆలస్యం | ౨ |
| ఉద్యోగం | ౨ |
| శాంతం | ౨ |
| క్రోధం | ౧ |
| దంబం | ౭ |
| మిత్రభేదం | ౫ |
| మిత్రానురాగం | ౨ |
| రసనిష్పత్తిః | ౧ |
| ఫలనిష్పత్తిః | ౫ |
| ధేనువ్వ | ౫ |
| తన్నాశః | ౩ |
| మహిషవ్వ | ౯ |
| తన్నాశః | ౯ |
| మృగవృద్ధి | ౧ |
| తన్నాశః | ౩ |
| ఛాగవ్వ | ౧ |
| తన్నాశః | ౫ |
| అశ్వవ్వ | ౧ |
| తన్నాశః | ౧ |
| గజవ్వ | ౪ |
| తన్నాశః | ౫ |

| | |
|---|---|
| ఉష్ట్రవ్వ | ౫ |
| తన్నాశః | ౫ |
| విప్రవృద్ధిః | ౧ |
| తన్నాశః | ౩ |
| క్షత్రియవ్వ | ౩ |
| తన్నాశః | ౫ |
| వైశ్యవ్వ | ౫ |
| తన్నాశః | ౪ |
| శూద్రవ్వ | ౨ |
| తన్నాశః | ౪ |
| మ్లేచ్ఛవ్వ | ౩ |
| తన్నాశః | ౧ |
| సంకరవ్వ | ౩ |
| తన్నాశః | ౫ |
| గారుత్మతవ్వ | ౯ |
| పద్మరాగవ్వ | ౩ |
| వజ్రవ్వ | ౪ |
| వైడూర్యవ్వ | ౧ |
| గోమేధికవ్వ | ౫ |
| పుష్యరాగవ్వ | ౧ |
| ఇంద్రనీలవ్వ | ౧ |
| ప్రవాళవ్వ | ౧ |
| మౌక్తికవ్వ | ౧ |
| ఇతరరత్నవ్వ | ౨-౧ |
| సువర్ణవ్వ | ౧౯ |
| రజితవ్వ | ౧౯ |
| తామ్రవ్వ | ౦-౧౪ |
| కాంస్యవ్వ | ౧౦ |
| లోహవ్వ | ౯ |
| అయోవ్వ | ౯ |
| త్రపువ్వ | ౧౦ |
| సీసవ్వ | ౧౦ |
| రసవ్వ | ౮-౧౦ |
| వ్రీహివ్వ | ౧౦ |

| | |
|---|---|
| శాలివ్వ | ౧౬ |
| కుళుద్థవ్వ | ౧౦ |
| తిలవ్వ | ౧౬ |
| మాషవ్వ | ౪ |
| ముద్గవ్వ | ౧౯ |
| సర్షపవ్వ | ౯ |
| చణకవ్వ | ౧౬ |
| ఆఢకవ్వ | ౪౧ |
| గోధూమవ్వ | ౧౦ |
| కోద్రవవ్వ | ౧౯ |
| ప్రియంగవ్వ | ౧౬ |
| యావనాళవ్వ | ౧౪ |
| శ్యామాకవ్వ | ౧౬ |
| రాజమాషవ్వ | ౧౯ |
| నీవారవ్వ | ౯ |
| శింబివ్వ | ౭-౯ |
| అతివృష్టి | ౧౨ |
| మక్షికవృద్ధి | ౧౧ |
| మశకవ్వ | ౧౨ |
| సూకరవ్వ | ౫ |
| స్వచక్రభయ | ౧౩ |
| పరచక్రభ | ౧౦-౩ |
| అండజాః | ౯౩ |
| స్వేదజా | ౯౩ |
| ఉద్భిజాః | ౫ |
| జరాయుజాః | ౯౦ |
| స్థావరాః | ౮ |
| జంగమాః | ౧౧-౮ |
| రాజపూజ్యత | ౩౬ |
| రాజావ | ౧౯-౩౪ |
| విద్యుతు | ౪ |
| శిలాపాతం | ౬ |
| గర్జితం | ౧౩-౬ |
| ఉత్సాహం | ౨ |

## అథ ఫలాని.

అథ చాంద్రసౌరమానాభ్యాం
ప్రమాదీచనామ సంవత్సరఫలం.

శ్లో॥ నృపసంక్షోభమత్యుగ్రం ప్రజాపీడాత్వనర్ఘతా ।
తథాపి సుఖమాప్నోతి ప్రమాదీవత్సరేజనాః ॥

అథబార్హస్పత్యమానేన క్రోధనాబ్దఫలం.

శ్లో॥ క్రోధనాబ్దేమధ్యవృష్టిః పూర్వసస్యవినాశనం ।
సంపూర్ణమపరంసస్యం భూపాః క్రోధాభిభూతయః ॥

అథసర్వత్ర గురూదయవశాదాషాఢాబ్దఫలం.

శ్లో॥ ఆషాఢాబ్దేతుప్రచురం పీడ్యంతే సర్వసస్యాని ।
క్రిమికీటాదిభిరతులం త్వపరంసస్యంచ వృద్ధిమాప్నోతి॥

అథచంద్రస్య రాజ్ఞత్వఫలం.

శ్లో॥ ధరాధరక్ష్మామఖిలాం ప్రకుర్యాద్ధరాధర క్షేమకరం సుభిక్షం । సంపూర్ణసస్యాని ఫలంతిభూమౌ గీతోత్సవాశ్చాబ్జ పతౌశశాంకే ॥

అథరవేః మంత్రిత్వఫలం.

శ్లో॥ రాజ్ఞామన్యోన్య వైరత్వ మనావృష్టిస్తు సంగరః।
అధర్మనిరతామర్త్యాః భాస్కరస్యచమంత్రితః ॥

అథశనేః సేనాధిపతిత్వఫలం.

శ్లో॥ సేనాధిపేసూర్యసుతే ధరిత్ర్యాం సేనాధియుక్తాస్సతతంనరేంద్రాః । అధర్మయుక్తాస్సతతం ప్రజాశ్చ కృష్ణానిధాన్యాని ఫలంతిభూమౌ ॥

అథబుధస్య సస్యాధిపతిత్వ ఫలం.

శ్లో॥ మధ్యవృష్టిర్మందసస్యం మేఘావాతేనపీడితాః ।
త్రాసస్సర్వ నరాణాంచ బుధేసస్యాధిపేసతి ॥

అథచంద్రస్య ధాన్యాధిపతిత్వఫలం.

శ్లో॥ బహుక్షీర ప్రదాగావః సర్వవ్యాధివివర్జితాః ।
సుభిక్షంచమహోవర్షం చంద్రేధాన్యాధిపేసతి ॥

అథశనేరర్ఘాధిపతిత్వ ఫలం.

శ్లో॥ వృష్టిస్తు మధ్యార్ఘపతౌశనౌచే దాతంకచోరాగ్ని యుతామహీస్యాత్ । భయంభవేదన్న సమృద్ధిరల్పా కృష్ణానిధాన్యాని ఫలంతిభూమౌ ॥

అథ మేఘాధిపస్య శనిఫలం.

శ్లో॥ మధ్యసస్య మనర్ఘంచ ఖండవృష్టిశ్చజాయతే ।
నీలధాన్యసమృద్ధిశ్చమందే మేఘాధిపేసతి ॥

అథగురోః రసాధిపతిత్వఫలం.

శ్లో॥ సువృష్టి స్సర్వసస్యానాం ఫలితావృక్షజాతయః।
సదారోగ్యం సుభిక్షంచజీవేయదిరసాధిపే ॥

అథకుజస్య నీరసాధిపతిత్వఫలం.

శ్లో॥ నీరసేశోయదాభౌమః ప్రవాళారక్తవాససాం ।
రక్తచందన తామ్రాణామర్ఘ్యంజాయతే తథా॥

## అథ మేషసంక్రాంతిఫలం.

ఏతత్సంవత్సర చైత్రశు॥ ౭ స్థిరవాసరే రాత్రౌరవేర్మేష ప్రవేశత్వాత్ఫలం ॥ శ్లో ॥ రాత్రౌసస్యాభివృద్ధిస్స్యాత్ క్షేమారోగ్యం సుభిక్షకృత్ ॥

వార ఫలం.

శనివారేల్పవృష్టిస్స్యా న్మేషసంక్రమణంరవేః ॥

అథార్ద్రాప్రవేశఫలం.

ఏతత్సంవత్సరజ్యేష్ఠబహుళతృతీయా స్థిరవాసరే ఉషానక్షత్రే మాహేంద్ర నామయోగే భద్రకరణ ఉపరాహ్ణే రవేరార్ద్రా ప్రవేశత్వా త్ఫలంలిఖ్యంతే ॥ దివార్ద్రాసస్యనాశాయ తృతీయాంచ సుభిక్షకృత్ । విశ్వర్క్షే సమరంకుర్యా న్మందేమందఫలం విదుః । నిష్టాం వృష్టి వినాశస్స్యాద్వైంద్రేత్వింద్రపదంభవేత్ ॥ రవేరార్ద్రా ప్రవేశకాలే భరణ్యాదిమణ్మండలానాం మధ్యే పంచమమండలే చంద్రమసోవిద్య మానత్వాత్ఫలం ॥ వృష్టినాశనం ॥ రవేరార్ద్రాప్రవేశకాలే చంద్రః పూర్వ జలసంజ్ఞిక మకరరాశౌ విద్యమానత్వాత్ఫలం ॥ శ్లో॥ జలరాశిగతేచంద్రేజలోదయ సమన్వితే । తత్కాలే రౌద్రగే చార్కేదివార్ద్రాదోషనాశభాక్ ॥

అథకుజవక్రఫలం:

ఏతత్సంవత్సరకార్తీకబ॥౬ గురువాసరేస్వోదయ నక్షత్రాపేక్షయాసప్తదశమర్క్షే వక్రంగతత్వాత్ ఫలం॥ శ్లో॥ అష్టాదశే సప్తదశే ప్రతీపేనిస్త్రింశపూర్వం ముసలాహ్వయంచ తత్రార్ఘనాశో ధరణీపతీనాం రణే క్షయంయాంతి సమస్తలోకాః ॥

అథ గురుచారఫలం.

ఏతత్సంవత్సర చైత్రశు॥ ౧ ప్రభృతి మార్గశిర శు॥ ౨ పర్యంతం ధనూరాశి స్థితగురుఫలం॥ శ్లో॥ పీతరోగభయాస్సర్వే చాపస్థే సురపూజితే । హ్యానయానంది నీధాత్రీ ఫలశాలీక్షువృష్టిభిః॥ తత్ప్రభృతివత్సరాంతం మకరరాశి స్థితగురుఫలం ॥ శ్లో॥ అశత్రవోజనాధాత్రీ పూర్ణసస్యార్ఘవృష్టిభిః । పీతరోగభయాస్సర్వే మకరస్థే సురార్చితే॥ ఇతి॥ అథ శనివారఫలం ॥ ఏతత్సంవత్సర చైత్రశు॥౧ప్రభృతి వైశాఖ శు॥౫ పర్యంతం కృత్తికా నక్షత్ర స్థితశనిఫలం ॥ శ్లో॥ అనలర్క్షే శనౌహంతి పణ్యస్త్రీరసజీవినః। ఇతి॥ తదాదివత్సరాంతం రోహిణీ నక్షత్రస్థిత శనిఫలం ॥ శ్లో॥ బ్రహ్మర్క్షేకోమద్ర కాశీపాంచాలశకతోంతకృత్ ॥ శనేరస్యవర్షాది మారభ్య వర్షాంతం వృషభరాశి స్థిత్యాఫలం ప్రోచ్యతే ॥ శ్లో ॥ గోసంస్థితేసూర్యసుతేత్వమాత్యా ధాన్యార్ఘభూజాన్యపదేవనాశః । అవంతిపాంచాలక కోసలాది దేశావినష్టాః కురుపశ్చిమాద్యాః ॥

అథకూర్మచక్రస్థిత శనిఫలం.

పృథ్వీకూర్మచక్రస్యోత్తరభాగే నాభిప్రదేశే వర్త

మాసశనినా, వింధ్యాకాశీకాంతర్వేదీ ప్రయాగమధ్య దేశాధిపాః వినాశమాయాంతి ॥

అథజ్యేష్ఠశు॥౧యుక్తగురువారఫలం.

శ్లో॥ సుభిక్షం క్షేమమారోగ్యం వృష్టిస్సస్యవివర్ధనం।
ప్రజారోగ్యం సుభిక్షంచ జ్యేష్ఠాదే గురువాసరే ॥

ఆషాఢశు॥౭ యుక్తభౌమవారఫలం.

యుద్ధప్రదం॥ తచ్ఛుక్ల నవమీ యుక్తస్వాతీనక్షత్రఫలం.

శ్లో॥ ఆషాఢస్య సితేపక్షే నవమీస్వాతిసంయుతా, సర్వసస్యసమృద్ధిస్స్యాత్ ప్రహ్లాదంతే నిరామయం। తత్కృష్ణపక్షరోహిణీయుక్త ౧౧ తిథిఫలం। ఏకాదశ్యాంతు మధ్యమమితి ॥

పుష్య॥ బ॥౩౦ యుక్తేందువారఫలం॥ క్షేమం ॥

అథగోపాలస్యపశునాయకత్వాత్ఫలం.

శ్లో॥ సంపూర్ణతృణవృద్ధిస్స్యాద్బహుసస్యార్ఘసంపదః। పశువృద్ధిస్సుభిక్షంచ గోపాలఃపశునాయకః॥

అథగురుశుక్రమౌఢ్యనిర్ణయః క్రియతే.

ఏతత్సంవత్సర చైత్రశు॥౯ భౌమవాసర ప్రభృతి చైత్ర బ॥౪గురువాసర పర్యంతం పశ్చాదస్తమితం శుక్రమౌఢ్యంపునః మార్గశిర బ॥౧౩ గురువాసర ప్రభృతి ఫాల్గుణబ॥౭ ఇందువాసర పర్యంతం ప్రాగస్తమిత శుక్రమౌఢ్యం పుష్యశు॥ ౧౦ ప్రభృతిమాఘ శు॥ ౧౪ పర్యంతం గురుమౌఢ్యం॥ అథగ్రహణకాల నిర్ణయః.

ఏతత్సంవత్సర భాద్రపద శు౧౫ ఇందువాసరే పూర్వాభాద్రానక్షత్రే రాహుగ్రస్తే సోమోపరాగః కపిలవర్ణః ఖచ్ఛన్న బింబాధికగ్రాసః గ్రస్తోదయః యామ్యగోళే ఆగ్నేయ దిక్స్పర్శః నైఋతిమోక్షః - ఉత్తరగోళే వాయువ్యనిమీలనం - ఈశాన్యోన్మీలనం.

సూర్యోదయాది స్పర్శకాలఘటికాది౨౨-౧౬ఘం ౨-౫౦నిమీలనకాల ౨౫-౧౯ ఘం ౪-౦ మధ్యకాల ౨౬-౫౭ ఘం౪-౩౨ ఉన్మీలనకాల ౨౮-౪౪ ఘం ౫-౨౫ మోక్షకాల ౩౧-౩౮ ఘం ౬-౩౫ బింబాదర్శనకాలఘటికాది౩-౩౪ ఘం౧-౨౫ఆద్యంతపుణ్యకాలఘటికాది ౯-౨౨ ఘం౩-౪౫ అథగ్రహణమాసఫలం॥

శ్లో॥ కళింగవంగాన్మగధాన్సు రాష్ట్రాన్ మ్లేచ్ఛాన్సువీరాందరదంశకాంశ్చ స్త్రీణాంచ దర్పాన్ఛన్న సౌరాన్నిహంతి సువృష్టిక్షిప్రదాభద్రపదేవ్యపోతే॥ అయనఫలం॥ వైశ్యశూద్రాణామరిష్టం॥ దక్షిణాయనత్వాత్ ॥

గ్రస్తోదయచంద్రగ్రహే ప్రత్యబ్దశ్రాద్ధవిధిః.

ఏతత్సంవత్సర భాద్రపద శు॥౧౫ ఇందువాసరే గ్రస్తోదయచంద్రగ్రహణసంభవాత్ పూర్ణిమాతిథిః ప్రయుక్తశ్రాద్ధంరాత్రౌ ముక్త్యనంతరం యథావిధి కర్తవ్యం। ప్రమాణస్తు॥ శ్లో॥ గ్రస్తేచంద్రేమాదితే తస్య ముక్తిందృష్ట్వా తత్రశ్రాద్ధకుర్వీత స్నానకార్యమిత్యాద్యుక్త వచనప్రామాణ్యాత్ శర్మణానాం బ్రాహ్మణానాం పూర్ణిమాప్రయుక్త ప్రత్యబ్ద శ్రాద్ధాదికంపితరమ సుద్ధిశ్యాచరశ్రాద్ధంరాత్రౌయుక్తకాల మితిసిద్ధాంతః॥

అథ మకర సంక్రాంతి ఫలం.

ఏతత్సంవత్సర పౌష్యబ ౧ భౌమవాసరే ఆశ్లేషానక్షత్రే ప్రీతినామయోగే గరజికరణే సూర్యోదయాది ఘటి ౩౬పల౪౧ సమయే పూర్వరాత్రౌ రవే ర్మకర రాశి ప్రవేశత్వాత్ఫలం॥ త్రిశీర్ష మిత్యాది సంక్రమాణ పురుషలక్షణం చాభివర్ణ్యతే॥ శ్లో॥ త్రిశీర్షం ద్వ్యముఖం చైవ పంచవక్త్రం త్రినేత్రకం। లంబకర్ణం రక్తదంతం లంబభ్రూర్దీర్ఘనాసికం। అష్టబాహుం ద్విపాదంచ వికృతం కృష్ణవర్ణకం। యోజనద్వయవిస్తీర్ణం శతయోజనమున్నతం। స్త్రీపుంరూపం సువిజ్ఞేయం సంక్రాంతి నరలక్షణం॥ అస్యపురుషస్య మహోదరనామధేయః ఫలం- శూద్రాణామరిష్టం, బిల్వోదక స్నానం ఫలం- భీతిప్రదం, నీలవస్త్రధారణం ఫలం-మహాభయం, లాక్షాగంధలేపనం ఫలం- రాక్షసానామరిష్టం, జపాపుష్పధారణం ఫలం- యుద్ధప్రదం, గోమేధికభూషణం ఫలం-మహాభీతిః, సీసపాత్రఫలం-యుద్ధభయం, పయఃపానఫలం - కీర్తిహానిః, బదరీఫల భక్షణంఫలం-చోరనాశనం, చాపాయుధధారణంఫలం- క్షత్రియాణామరిష్టః, కాంచనవర్ణ ఛత్రంఫలం - రోగనాశం, గజవాహనారూఢం ఫలం-రాజ్ఞాంయుద్ధం, నివిష్టావస్థాఫలం, రసవస్తు నామత్యర్ఘం, విస్మయచేష్టాఫలం - అశుభప్రదం, పశ్చిమదిగ్యానంఫలం- తద్దేశే క్షామం, కాలఫలం - నటగాయకా నామనిష్టం, తిథిఫలం-శుభం, వారఫలం- దుఃఖప్రదం. ఏవం సర్వమాలోచ్య నిశ్చిత్య సప్తాంశాధిక ఫలంభవతి.

అథవర్షయోగా స్తద్భంగాశ్చలిఖ్యంతే.

౧. ఏతత్సంవత్సర చైత్రశు ౧ ప్రభృతి బ ౩౦ పర్యంతంకుజ బుధగురూణాం రసజలమేఘసుధానాడీషు సంచారస్య సంభవత్వాచ్ఛుక్రస్య వక్రగమనకాలే బుధఋజుగమన విశేషణతయోస్సామీప్య సాహచర్య వశేన, శుక్రోదయబలేనచతత్రతత్ర సామాన్యఖండవృష్టిః। తన్మధ్యేరవిగురుశనీనాందహనవాతాతి వాతనాడీషుక్రీడనాను స్థాధిక్యంప్రాప్యతే । ౨. వైశాఖ శు ౧ ప్రభృతిబ ౩౦ పర్యంతం రవికుజబుధశుక్రశనీనాందహన వాతాదినాడీ విహారాదత్యంత గ్రీష్మసహిత వాయుర్వాతీతివాచ్యం। తదాతపాపశ్చిమవాయుశ్చతన్మధ్యే శనేస్సారాంతరగమన విశేషాద్గురోఃరసనాడీ సంచారాత్తత్రతత్ర స్వల్పవృష్టిః। ౩. జ్యేష్ఠశు ౧ ప్రభృతి బ ౩౦ పర్యంతం రవి కుజ శుక్ర శనీనాం అనిలానిలనాడీ గృహస్థిత్వాత్పురో బుధదోషేణ అత్యంత నిదాఘసహిత పశ్చిమవాయుర్వాతీతినిశ్చితం। తథాపిబుధగుర్వోర్వక్రలాది శుభరేఖాసుద్యోతనాత్కృష్ణపక్ష సంభావితమకరజల చంద్రయోగకాలే బహుభూమి సువృష్టి సంభవిష్యతి। తదితరసమయే నీహారకణ గుళికా ప్రయుక్తఖండ ఖండవృష్టిః। ౪. ఆషాఢశు౧ ప్రభృతి బ ౩౦ పర్యంతం రవి బుధ గురూణాం రసజలమేఘ సుధానాడీ సంచార

౧౯౦౪ సం॥ జనవరి నెల.

| | | | |
|---|---|---|---|
| ౨౮ | రబుశు | ౧౪ | ఆ॥ శుక్ల ప్ర౩౨-౫౦పూషా౩౭-౪౬ధృ౩౭-౩౨కింతు౩-౧౬రావి౩౦-౫౨పూషా౧రవిః ౧౯-౨౦మూ౧ ధనుస్సీబు౨౩-౭ మూ౨శు౧౪-౫౦ శ్రీరంగనాయకస్వామి సాముత్సవారంభః ఇష్టకాలః ఘు౨-౨౩చ౨౯ |
| ౨౯ | గు | ౧౫ | సో॥ద్వి౩౯-౯ఉషా౩౯-౩౬వ్యా౩౩-౩౫బా౨ ౫౯ శేషః౨ ౨౯త్యా౧ప్ర౪-౭రావి౨౨-౩౭శుషా౩గురుః౨౩-౨సౌమ్యశ్శ్రుం గోస్సుత చంద్రోదయః అర్కోఘ్నః ఘు౨-౩౪చ౩౦ (శ్రీ౭శవే) ఘు౨-౪౫ సఫర్ నెల చ౧ |
| ౩౦ | బుశు | ౧౬ | మం॥తృ౩౪-౪౬ప్ర౪౨-౪౧హర్ ౩౧-౫౭వై౩-౫౭ రావి౨౫-౩౭అహః౨౭-౩౨ మూ౨బు౧౯-౩౦ మూ౩ శు౫౪-౩౭ |
| ౩౧ | ర | ౧౭ | బు॥ చ౩౭-౩౬ధని౪౫-౩౪వజ్ర౩౧-౨వన౬-౧౧త్యాజ్యంశూన్యం పూషా౨రవిః౩౪-౪౬ ఘు౨-౫౮చ౨ |
| ౧ | బు | ౧౮ | గు॥ పం౪౧-౩౩శత౫౨-౧౦సిద్ధి౩౧-౭బ౯-౩౪దివి౫-౩౨ మూ౩బు౧౫-౫౩సర్వేషాం బరాభరణధారణాదిషు యోగ్యతిథిః ఘు౩-౯చ౩ మదన హిందూపుర్యాది సుబ్రహ్మణ్యక్షేత్రేషు మహోత్సవః |
| ౨ | శు | ౧౯ | శు॥షష్ఠి౨౩పూభా౫౮-౧౮వ్య౩౧-౪౯కా౧౩-౫౮ దివి౯-౪౮ మూ౪ శు౩౪-౨౪ రాహుకాన్తం ఘు౩,౨౧చ౪ |
| ౩ | రశుబు | ౨౦ | శ॥ సప్త౨-౩౯ఉభా౬౦-౧౧వణి౩౩-౨౪౯౧-౩౧దివి౨౫-౭ పూషా౩రవిః౫౦-౧౨ పునః వక్రీకుజః ౩౬ ౨౫వా౪బు౧౨-౧౬ఘు౩-౩౨చ౫ |
| ౪ | | ౨౧ | ఆ॥ అ౫౮-౧౩ఉభా౪-౫౬పరి౩౪-౨౦భ౨౫-౨౬రావి౧౦-౩౩అహః౨౭-౩౮ స్థిరయోగః ఘు ౩-౪౪చ౬ |
| ౫ | బుశు | ౨౨ | సో॥న౬౦-౧౧రేవ౧౧-౨౬శివ౩౫-౩౩బా౩౦-౨౬విషాభావః పూషా౧బు౮-౩౯పూషా౧శు౧౪-౧౧ ఆమలకగౌరీవ్రతం |
| ౬ | | ౨౩ | మం॥ న౨-౩౦అశ్వి౧౭-౩౦సిద్ధ౩౬-౧౯కౌ౨-౩౦దివి౬-౨౯రావి౬-౪ (అశ్విశకవే) ఘు౪-౬చ౮ |
| ౭ | రబుగు శు | ౨౪ | బు॥ ద౬-౫౪భర౨౩-౦సా౩౬ ౩౧గర౬ ౫౪రావి౨౭-౪౧అహః౨౭-౪౦పూషా౪రవిః౫-౩౮ పూషా౨ బు౫-౨ పశ్చాదస్తంగురుః ౭-౨౪పూషా౨శు౫౩-౫౮ఘు౪ ౧౮చ౯ |
| ౮ | శ | ౨౫ | గు॥ ఏ౧౦-౧౦కృ౨౭ ౪౨శు-భ౦౩౫-౪౨భ౧౦-౧౦విషాభావఃరోహిణి౨వక్రీశనిః౪-౦వైకుంఠఏకాదశి శ్రీపాన్నూరు భావక్షేత్రేద్వారదర్శన మహోత్సవః శ్రీరంగక్షేత్రేచ వైవతమన్వాదిః ఏకాదశి గురువారవ్రతంఘు౪-౩౦చ౧౦ |
| ౯ | శుబు | ౨౬ | శు॥ ద్వా౧౨-౨౮రో౩౦-౨౪శుభ౯౦౩౪-౫౫బా౧౨-౨౮దివి౧౦-౧౦రావి౧౬-౪౯మదనకీతిముఖః ౪౬ ౩౯అర్ ౪ వక్రీశు ౩౪-౪౦పూషా౩బు౧-౨౫మూర్మద్వాదశి శనికాన్తం ఘు౪-౪౨చ౧౧ |
| ౧౦ | రబుశు | ౨౭ | శ॥ త్ర౧౩-౧౪మృ౩౦ ౫౬బ్రం౩౧ ౧౮వై౩ ౧౪రావి౨౪-౫౪అహః౨౭ ౪౨ఉపా౧రవిః౨౧ ౪పూషా౪బు౫౭-౪౮ పూషా౩శు౨౦-౧౭పాతాభావః (అనధ్యయ) ఘు౪-౫౨చ౧౨ (ధానంఘు౫-౪చ౧౩ |
| ౧౧ | | ౨౮ | ఆ॥ చతు౧౨-౪౯ ఆర్ ౩౨ ౫౨ మాహే ౨౭ ౪౪ వన౧౨ ౪౯ త్యాజ్యాభావః స్త్రీణాం చంద్రదర్శనం అన్వా |
| ౧౨ | బుగుశు | ౨౯ | సో॥ ౧పా ౧౧-౧౦పున౩౨-౨౧వై౨౩-౧బ౧౧-౧౦దివి౨-౩౭ రావి౨౪-౮ఉషా౧బు౫౪-౧౧ ఉషా౪గురుః౫౨ ౩౬ పూషా౪శ ౫౯-౩౬ కుజక్రాంతం యోగకాలః ఘు౫-౧౫చ౧౪ |

| | | | |
|---|---|---|---|
| | | శ | కు |
| రా | బగుసంమక<br>కే-రవిః<br>శుగురుధనుబు<br>బుధబుమకబు | | |
| రబుగు | | | కే |
| శు | | | |

| | | | |
|---|---|---|---|
| ౧౩ | ర | ౩౦ | మం॥ కృష్ణ౮-౩౬పుష్య౩౦.౪౮విష్క౧౭-౩౪కా౮-౩౬త్యాజ్యాభావః అహః౨౭-౪౬ఉషః౨మకరేరవిః౩౬-౪౧ భోగి పండుగ ఘ౫-౨౫చ౧౫ |
| ౧౪ | బు | ౧ | బు॥ ద్వి౪ ౧౦ ఆశ్లేష౭-౧౭ప్రీతి౧-౫౧గర౪ ౧౦దివి౧ ౨౭రావి౨౭ ౫౭ఉషః౨మకరేబు౫౦-౩౪అస్మిన్ దినే సూర్యోదయాది పంచఘటికాపర్యంతం ఉత్తరాయణ పుణ్యకాలః ఇతినిర్ణయసింధు వచనాత్ కూష్మాండదానాని ఘ౦-౪౭౧౬ ధర్మపుర శ్రీకాశీవిశ్వేశ్వర రాథోత్సవః |
| ౧౫ | శుకు | ౨ | గు॥ తృ౦ ౧౦ఉపరి౫౩-౩ మఖ౨౫-౧౦ఆయుష్౪-౩౭సౌ౪౭.౫౪ధం౦-౧౦బ౨౬-౪౫రావి౧౬-౧౧ఆర్ ౩ వక్రీస ౧ ౩౨ ఉషః౧శు౩౨ ౫౫ తిరుముడిశయాళ్వార్ (తిరునక్షత్రం) ఘ౨-౧౪చ౧౭ (శ్రీకాళ్ళిం) ఘ౦-౨౫చ౧౭ |
| ౧౬ | రబు | ౩ | శు॥ పంచ౯.౨౩పుబ్బ౨౧-౩౯శో౪౫.౪౩కా౨౧-౨౭రావి౧౦-౩౫అహః౨౭-౪౭ఉషః౩రవిః౫౨-౨౬ఉషః౩బు౩౭-౪౬ |
| ౧౭ | | ౪ | శ॥ షష్ఠ౩ ౩౧ఉ౪౧౭.౨౫అతి ౪౧-౪౪గ౪౧౬-౨౭రావి౯.౩౫సత్యకామతీర్థ పుణ్యదినం ఘ౦-౩౬చ౧౯ |
| ౧౮ | బుశు | ౫ | ఆ॥ స౩౭-౩౪హ౧౪-౩౩సుక౩౩-౨౭ధ౧౦ ౩౨రావి౪-౫౭ఉషః౪బు౩౩-౪౯ ఉషఃమకరేశు ౧౬-౧౪ తిపోష్టకాః భానుసప్తమి కూరత్తాళ్వార్ తిరునక్షత్రం ఘ౦-౪౬చ౨౦ |
| ౧౯ | | ౬ | సో॥అ౩౧-౫౧చి౯-౯ధృ౨౬-౪౮బా౪.౪౨దివి౨౨-౧౬అహః౨౭-౫౦(చిత్రరావే) ముద్గరయోగః ఘ౦-౫౭చ౨౧ |
| ౨౦ | రవుబు | ౭ | మం॥ న౨౬-౩౦స్వా౫.౨౦శూ౧౭-౩౫గం౨౬-౩౦దివి౧౭-౩౪ఉషః౪ రవిః౭-౧౧ఆర్ వక్రీస ౧.౦శ్రవ౧బు౨౭-౪౨ ఉషః౩శు౫౪.౩౩ ఘ౧-౭చ౨౨ (ఘ౧-౯చ౨౩ |
| ౨౧ | ర | ౮ | బు॥ ద౨౧-౩౭విశా౨-౦అనూ౫౭-౯గ౦౧౧-౩౩ ధ౨౧-౪౩దివి౧౧-౩౩ కుంభాయనగతోర్కః ౨-౯పాతాభావః |
| ౨౨ | బు | ౯ | గు॥ఏ౧౭-౨౭జ్యే౫౭-౧౧వృ౪-౫౬ధృ౫౪-౩౩బా౧౭-౩౭దివి౧౧.౧౭అహః౨౭-౫౪తిథిద్వయంఅపదిః౧౬-౪౫అంత్యః ౨౨-౨౦శ్రీ.౨బు౨౩-౪౫ ఘ౧-౨౯చ౨౪ (ఘ౧-౪౧చ౨౫ |
| ౨౩ | రశు | ౧౦ | శు॥ ద్వా౧౪-౩౫ మూ౫౬-౨౭ వ్యా౫౪-౪౭ తై౧౪-౩౫ రావి౨౪-౩౬ శ్రవ౧ రవిః౨౩-౫౬ ఉషః౪ శు౩౨ ౫౨ |
| ౨౪ | బు | ౧౧ | శ॥ త్ర౧౨-౨౨పూషా౫౬-౫౫పూర్వాష౪౫-౫౭వన౧౨-౨౨దివి౨౦-౩౭శ్ర౩బు౧౭-౪౭ మాసశివరాత్రిః అసహ్యఘనచతుష్టయం(పూషాటకవేధః) ఘ౧-౫౨చ౨౬ ఘ౨-౨చ౨౭ |
| ౨౫ | | ౧౨ | ఆ॥ చతు౧౧-౪౪ఉషః౫౭-౨౪వజ్ర౪౭-౭శకు౧౧-౪౪దివి౧౭-౨౪ అహః౨౭.౦విధ్యార్ధశతిక్ పుణ్యదినం అన్వాధానం |
| ౨౬ | రబుశు | ౧౩ | సో॥ ● అమా౧౨.౭శ్ర౬౦-౧౧సిద్ధి౪౫-౩వాగక౦౧౨.౭దివి౭-౫౪శ్ర౨రవిః౩౯-౪౧శ్ర౪య౧౩-౫శ్రవ౧కు౧-౧౧ అమాసోమవారవ్రతంసింధుస్నానం రక్తాంఇష్టికాలఃమకరేపంచగ్రహకూటఃఅహస్ ౧౭౩౧౬-౪ఘ౨-౧౨చ౨౭ |

మకరమాసము.

| | | | |
|---|---|---|---|
| ౨౭ | బుగు | ౧౪ | మం॥శుక్ల ప్ర౧౩-౫౧ శ౧-౨౭వ్య౪౩-౫౬బ౧౩-౫౧దివి౧౨-౯పశ్చాముదయంబు౪౨-౪౨శ్రవ౧గు౨౨-౧౦శిబుతుప్రా రంభః మాఘస్నానవ్రతారంభః మాధవార్చనం పురాణపఠనం సమశృంగచంద్రోదయః సమార్ఘః భు౨-౨౩చ౨౯ |
| ౨౮ | బుశు | ౧౫ | బు॥ద్వి౧౬-౪౪ధని౫-౩౬వరి౪౩-౪౮కా౧౬-౫౧దివి౨౫-౬అహః౨౮-౮ధని౧బు౮-౫౪శ్ర౨శు౩౯-౩౦ కైలాసగౌరీవ్రతం ఇక్షుఖండలతాదిస్థాపనం భు౨-౩౩రబ్బీలవల్ నెలచ౧ |
| ౨౯ | ర | ౧౬ | గు॥తృ౨౦-౪౫శత౧౦-౩౦వరీ౪౪-౨౦గం ౨౦-౧౨రావి౦.౧౩ శూన్యతిథిః శ్రీ౩రవిః ౫౫-౨౬కుందగౌరీవ్రతం నూతనవస్త్రాభరణధారణం ఉత్తరదిక్ర్యయాణే యోగ్యంభు౨-౪౪చ౨ (పపనం (రాహుక్రాంతం) భు౨-౫౫చ౩ |
| ౩౦ | బు | ౧౭ | శు॥చ౨౫-౪౩పూర్వాభా౧౬-౨౯శివం౪౦-౩౪ భ౨౫-౪౩ రావి౧౪-౫౬ ధని౨బు౧౯-౫౦కుందచతుర్థి వరదానగౌరీవ్రతంసో |
| ౩౧ | శు | ౧౮ | శ॥పం౩౧-౫౮ఉభా౨౨-౫౭సిద్ధ౪౬-౩౮బా౩౧-౫రావి౩౧-౦అహః౨౮-౧౨శ్రీ౨శు౧౭-౪౯ వసంతపంచమీభు౩-౬చ౪ |
| ౧ | బు | ౧౯ | ఆ॥ష౩౬-౩౧ రేవ౨౯-౨౮ సా౪౮-౮౩-౪౮ శేషః౩-౩౮ త్యాప్ర౪-౨౬ ధని౩కుంభే బు౨౮-౧౯ప్రవర్ధమానయోగః భు౩-౧౬చ౫ (న్యాదిసూర్యచంద్రవ్రతం అభోజ్యార్కవ్రతంఅశ్వి౭ కేతువేధః భు౩-౨౭చ౬ |
| ౨ | రశు | ౨౦ | సో॥స౪౧-౩౪అశ్వ౩౫-౪౧శుభ౪౪-౩౫క౯-౧౨దివి౨౪-౩౮శ్రీ౪రవిః౧౧-౫౪శ్రీ౪౪శు౫౬-౮ (రథసప్తమి) వైవస్వతమ |
| ౩ | బు | ౨౧ | మం॥అ౪౫-౫౭భర౪౧-౨౩శుభ్రం౫౦-౨భ౧౩-౪౫దివి౧-౫౭అహః౨౮-౧౮ధని౪బు౩౬-౪౮ భీష్మతర్పణం మహావై ప్రః౧౧-౫౯ర్గ్యః౨౩-౫౪భు౩-౩౮చ౭ (భు౩-౪౮చ౮ |
| ౪ | కు | ౨౨ | బు॥న౪౯-౧౪కృ౪౬-౦బ్రం౪౯-౧౪కా౧౭-౩౫దివి౩-౪౧అర్ ౧వక్రీస౩౧-౦మధ్వనవమి-శ్రీమదానందతీర్థ పుణ్యదినం |
| ౫ | రబుశు | ౨౩ | గు॥ద౫౧-౪౪రో౪౬-౪౭మాహే౪౮-౧౨వై౨౦-౯రావి౦-౯ ధని౧రవిః౨౯-౧౪ శత౧బు౪౫-౧౭ధని ౧శు౩౪-౨౭ ద్వారస్థాపనంభు౩-౫౯చ౯ (చకంభు౪-౧౦చ౧౦ |
| ౬ | కు | ౨౪ | శు॥ఏ౫౨-౬మృ౫౧-౩౯వైర౫-౩౮వ౨౧-౫౪దివి౪-౧౩అహః౨౮-౨౪కుజవక్రత్యాగః౨౪-౪౭భీష్మైకాదశి-భీష్మపం |
| ౭ | బు | ౨౫ | శ॥ద్వా౫౧-౯అర్ ౫౨-౩౦విష్క౪౨-౬బ౨౧-౪౨దివి౧౨-౫౬శత౨బు౫౩-౪౬భీష్మద్వాదశి తిలద్వాదశి వరాహద్వాదశీసోపపదంకుజక్రాంతంభు౪-౨౦చ౧౧ (యోగః భు౪-౩౧చ౧౨ |
| ౮ | రశు | ౨౬ | ఆ॥త్ర౯-౫౦పున౫౨-౨౬ప్రీ౩౮-౨కా౨౦-౩౪దివి౨౨-౨౮ధని౨రవిః౪౬-౩౪ ధని౨శు౧౨-౪౬ వరాహకల్పాదిఃవిజయ |
| ౯ | గు | ౨౭ | సో॥చతు౯ ౯పుష్య౫౧-౫ఆయు౩౨-౫౨ గర౧౮-౯దివి౧౧-౫౯అహః౨౮-౩౦ప్రాగుదయంగురుః ౨౨-౨౪గురు మౌఢ్యత్యాగః ప్రజాపతియోగః భు౪-౪౨చ౧౩ |
| ౧౦ | బుగుశు | ౨౮ | మం॥⊙పౌ౪౨-౫౫అశ్లే౪౮-౪౭సౌ౨౬ ౫౫భ౧౪-౫౨ దివి౨౧-౫౨ శత౩బు౨-౧౫శ్రీ౨ గురుః౫౧-౪౪ ధని౩కుంభేశు ౫౧-౫౪నివక్రత్యాగః౩౮-౫మహామాఘోత్సవః చంద్రపూజాఅన్వాధానంభు౪-౫౩చ౧౪ (భు౫-౩చ౧౫ |

[illegible] ఫిబ్రవరి నెల.

| తేది | గ్రహ | తిథి | వివరము |
|---|---|---|---|
| ౧౧ | రాకే | [illegible] | బు॥ కృ ప్రతి ౮-౧౫ మఖ ౪౫-౦ శో ౯-౪౦ బా ౧౦-౩౫ దివి ౧౬-౫౪ పూఫా ౧ రాహుః పుబ్బ ౩ కేతుః ౨౭-౩౩ ఇష్టికాలః |
| ౧౨ | రబు | ౧ | గు॥ ద్వి ౩౩-౩౦ పుబ్బ ౪౨-౩౬ అతి ౧౩-౧౪ తై ౫-౫౪ దివి ౪-౧౨ రావి ౩౦-౪౭ అహః ౨౭-౩౬ ధని ౩ సంక్రమణః ౩-౫౪౪౮ బు ౧౦-౪౪ కలియుగాంతః హరిపద పుణ్యకాలః భు ౫-౧౪ చ ౧౬ (౦-౭ చ ౧౭ |
| ౧౩ | శు | ౨ | శు॥ తృ ౨౭-౧౭ ఉ ౩౭-౭ సుక ౫-౫ వనం ౨౪ ధ ౨౬-౫౪ శేషః ౩-౧౦ త్యాజ్య ప్ర ౩-౪౬ రావి ౨౭-౪ ధని ౪ శు ౯-౨౪ భు |
| ౧౪ | | ౩ | శ॥ చ ౨౧-౩ హ ౩౩-౫౬ వృ ౨-౯ శూ ౪౭-౫ బా ౨౧-౩ రావి ౨౩-౫౬ తిథి ద్వయం మృత్యుయోగః భు ౦-౧౭ చ ౧౭ (౪ రవిః ౨౧-౧౪ (చిత్త్ర ౭ రావే) భు ౦-౨౬ చ ౧౯ |
| ౧౫ | ర | ౪ | ఆ॥ పం ౧౫-౩౦ చిత్త ౨౯-౪౯ గం ౪౨-౧౫ తై ౧౫ ౩౦ రావి ౧౪ ౭ అహః ౨౭-౪౨ ధని |
| ౧౬ | బుశ | ౫ | సో॥ షష్ఠీ ౪౬ స్వా ౨౫-౫౫ వృ ౩౪-౪ వర్జ ౪౬ రావి ౧౦-౨౬ పూభా ౧ బు ౨౩-౨౭ (శత ౧ శు ౭-౪౩ త్రిస్పృక్ కాలః మహావ్యతీ ౧-౫౨ దిన్గః ౧౪-౧౯ భు ౦-౩౫ చ ౨౦ |
| ౧౭ | | ౬ | మం॥ సప్త ౨౭ ఉపరి ౫౫-౨ విశా ౨౨-౨౭ ధృ ౨౭-౩ ౨బ ౪-౨౭ బా ౨౭-౪౧ రావి (౩-౯ భు ౦-౪౮ చ ౨౧ (౧ రవిః ౩౭-౩౪ శత ౨ శు ౪౬-౨ భు ౦-౫౩ చ ౨౨ |
| ౧౮ | రశు | ౭ | బు॥ అష్ట ౨౪ అనూ ౯-౪౧ వ్యా ౨౦-౫౭ తై ౨౫-౨౩ రావి ౩-౫౪ అహః ౨౭-౪౭ శ |
| ౧౯ | రబు | ౮ | గు॥ నవ ౨-౨౦ జ్యే ౧౫-౨౬ హ ౧౨-౫౭ వన ౨౩-౫౨ విష్ణుభావః మీనాయనగతో (కృ ౩౪-౪౧ పూభా ౨ బు ౫౪-౪౩ భు ౧-౨ చ ౨౩ |
| ౨౦ | | ౯ | శు॥ ఏకం ౨౫ మూ ౧౬-౩౪ వర్జ ౪౭ బ ౨౧-౨ దివి ౧౨-౯ రావి ౧౧-౪౯ స్థిరయోగః భు ౧-౧౧ చ ౨౪ (భు ౧-౨౧ చ ౨౫ |
| ౨౧ | రశు | ౧౦ | శ॥ ద్వాద ౯-౩౧ పూషా ౧౬-౪౩ సిద్ధి ౫-౩౦ కౌ ౯-౫౭ రావి ౭-౧౪ అహః ౨౭-౫౪ శత ౨ రవి ౫౫-౨౪ శత ౩ శు ౨౪-౨౧ |
| ౨౨ | | ౧౧ | ఆ॥ త్రయో ౯-౫౭ ఉషా ౧౭-౫ వ్య ౨-౭ వణి ౫౭-౪౭ గర ౯-౪౪ దివి ౨౭-౨౪ ప్రదోషోత్సవః భు ౧-౩౦ చ ౨౬ |
| ౨౩ | శు | ౧౨ | సో॥ చతు ౫౧-౪౧ శ్ర ౨౦-౩౦ పరి ౫౭-౧౦ భ ౨౦-౯ రావి ౩-౧౩ శత ౪ శు ౫౭-౪౩ మహాశివరాత్రివ్రతం శ్రీకాళహస్తీశ్వరోత్సవః శ్రీశైలే భు ౧-౩౯ చ ౨౭ |
| ౨౪ | | ౧౩ | మం॥ ● అమా ౫౪-౪౧ ధని ౨౪-౧౭ శివ ౫౭-౪౭ చతు ౨౩-౧౧ రావి ౧౪-౪౭ కాళహస్తీశ్వరక్షేత్రే త్రివేణీస్నానం ద్వాపరయుగాదిః అన్వాధానం సంక్షేపంచగ్రహకూటః (ర-చం-బు-శు-రా) ఆహార్ ౧౭౩౧౭౨౩ భు ౧-౪౭ చ ౨౮ |

ఫాల్గుణ మాఘమాసము.

| | | శ | కు |
|---|---|---|---|
| రా రబు | బవిగుసంక్రమః శుక్లసం-బు ౫ ౧౫సం కుంశు | | |
| శుగు | | | కే |

# ఆంధ్రమహాజనులకొక విజ్ఞాపనము.

## ఆంధ్రపత్రికా కార్యస్థానమును చెన్నపురి రాష్ట్రమునకు మార్చుట.

## దినపత్రికగా జేయు సంకల్పము.

ఆంధ్రదేశమునం దిపుడు నలుదిక్కుల నూతనోజ్జీవము వ్యాపించుచున్నది. ఆంధ్రజాతీయాభిమానము అతిశయిల్లుచున్నది. ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణావశ్యకత విచారార్హమగుచున్నది. భాషాభిమానము ప్రబలుచున్నది. పఠనమందిరములు, పుస్తకభాండాగారములు, గ్రంథప్రచారిణీ సంఘములు వ్యాపించుచున్నవి. దేశాభిమానులును, భాషాభిమానులును దేశభాషాభివృద్ధికి దగిన సాధనముల నన్వేషించుచున్నారు. శాఖాసభలుగూడి దేశాభివృద్ధికి దగిన సదుపాయములను యోజించుచున్నవి. మతాచారములు మాఱుచున్నవి. ఏవంకజూచినను నూతనవికాసము హృదయరంజకమై విరాజిల్లుచున్నది. ఈ మహాపరివర్తనమును దేశాభిమానులందఱు నుచితరీతిని గ్రహించుచు బ్రజల నుత్సాహవంతులనుగా జేయుటకై యత్నించుచున్నారు. ఈమహత్కార్యమును సాధించుటకై వార్తాపత్రికలును యథాశక్తిని దోడ్పడుచున్నవి. ప్రజలకు వర్తమాన లోకవ్యవహారములను, వాదప్రతివాదములను, పూర్వపక్ష సిద్ధాంతములను, దేశోపయోగకార్యములను దెలుపుచు, వారల నేకీభావులనుగా జేయుటకును, నీమహోద్యమమును సరిగానడుపుటకును వార్తాపత్రికలే ముఖ్యసాధనములుగా నున్నవి.

ఆంధ్రపత్రికకుఁ గారణాంతరములవలన నారంభదశయందు బొంబయి ముద్రణస్థానముగా నుండుట పత్రికాభివృద్ధికి దోడ్పడినను నిపుడది ప్రతిబంధకముగా నున్నది. పత్రికయాలస్యముగా జేరుచున్నది. ఆంధ్రదేశవార్తలను బ్రచురించుటలో నాలస్యమేర్పడుచున్నది. ఆంధ్రులవ్యవసాయరంగమునకు దూరముగా నుండుటవలన వారియభీష్టాశయములను సకాలమునందుచితరీతిని బ్రచురించుటకువీలుకలుగకున్నది.

ఈ లోటుపాటులు లేకుండుటకును, దానియుపయోగమును వృద్ధిపఱచుటకును, చెన్నపురి రాష్ట్రమునందు ముద్రించుటయును, దినపత్రికగ మార్చుటయును, ముఖ్యమని పత్రికానిర్వాహకులు నిశ్చయించిరి. తెలుగుభాష మాటలాడువారు 2,50,00,000 మంది గలరు. వీరిస్వభావ ముదారము. వీరి దేశాభిమానము నిశ్చలము. మహారాజులు, రాజులు, జమీందారులు, ధనవంతులు, విద్యావంతులు నెందరో తెలుగుదేశము నలంకరించుచున్నారు. దేశమునందిపుడుదయించుచున్న యీనూత్న దేశాభిమాన సమయమున దినవార్తాపత్రికను బోషించు జనులు లభించరనుట హాస్యాస్పదము. ఈకార్యనిర్వహణమున కాంధ్రదేశబాంధవులు తమ సహజమైన యుదారముతో దీనినిబోషించికాపాడుదురను దృఢనిశ్చయము పత్రికానిర్వాహకులకు గలదు. కావున, నీవిషయమునం దభిరుచిగలవారీ క్రిందివిషయములపై దమ యభిప్రాయములను దెలిపి మాయుద్యమమును జయప్రదముగా జేయుదురుగాక !

1. ఆంధ్రభాషయందు దినపత్రికను బ్రచురించుట కవకాశముగలదా? 2. పత్రికను బ్రచురించుటకు దగిన స్థలమేది? 3. చందాధన మెంతయుండిన బాగుండును? 4. దినపత్రికను జనోపయోగకరముగా జేయుటకు దగినయుపాయము లెవ్వి? 5. ఈమహత్కార్యనిర్వహణ విషయమై మీమకుదోచిన విశేషాభిప్రాయములెవ్వి.?

ఇట్లు విధేయుఁడు,

పత్రికాధిపతి.

భాషలోతిరిగి చెప్పవలెనుగదా. కొత్తవిద్యలు నేటి తేటతెలుగులో కాకితముమీద వ్రాస్తే సులభముకాదా? ఈలాగుచేయడము అన్ని దేశములలోను అన్ని భాషలలోను జరుగుతున్నదికాదా? పది పదిహేను మార్లుపాతగిల్లిన ఇంగ్లిషులో క్రీస్తుమత గ్రంథములు మాటిమాటికి కొత్త కొత్త ఇంగ్లిషులో వ్రాస్తున్నారుకారా? మనదేశములోకూడా పూర్వము అదే సంప్రదాయముగదా. ఇందులో వైపరీత్యము ఏమి ఉన్నదని పండితులు రణగుణధ్వనిచేసి ఆకాశము బద్దలుకొట్టుతున్నారు.

విద్యలు కూడా కలకాలము ఒక్కరీతిని ఉండవు; ఉండలేవు. విద్యలు అన్నీ అందరికి సామాన్యముగా ఉండవు. లోకవ్యవహారము మారినప్పుడు దానితో కూడా అందుకు ఉపయోగించే విద్యలూ మారుతవి. ఇప్పుడు సివిల్ కోర్టులలోను క్రిమినల్ కోర్టులలోను పూర్వపు స్మృతులు పనికివస్తవా? పూర్వపు ధనుర్విద్య ఈకాలపు యుద్ధమునకు పనికివస్తుందా! పూర్వపు నియమాలు ఈకాలములో చెల్లుతవా! లోక వ్యవహారము లక్షవిధములు. నాగరికత ఎక్కువ అయినకొద్ది ఈలోకవ్యవహారము శాఖోపశాఖలుగా భిన్నభిన్నమై దుర్బోధము, దుర్లభము అవుతుంది. శాస్త్రములు, కళలు లెక్కకుమీరి పెరుగుతవి. ఇవి అన్నీ నేర్చుకోడము అందరికీ సాధ్యమా? సర్వజన సామాన్యమైన విద్యవల్ల తెలిసేవి-వ్రాయడము, చదవడము, కొంతగణితము, దేశచరిత్ర, భూగోళ వివరము, జగత్తు ఉత్పత్తి వృద్ధిబోధించే శాస్త్రము, రాజ్యపరిపాలన, ప్రజలనడవడి, దేహారోగ్యము మొదలయినవి. ఈవిద్య ఎంతో కొంత వచ్చిన పిమ్మట ప్రజలు తమ తమ వ్యాపారమునకు ఉపకరించే విద్యను గ్రహించవలసి ఉన్నది. కడుపుకూటికోసము దినమంతా శ్రమపడవలసిన వారి అందరికీ అన్ని శాస్త్రవిద్యలు స్వాధీనమవుతవా? పాత తెలుగు పాండిత్యము పౌరాణికులకు పాత తెలుగు కవులకు కావలెను; లేదా భాషా తత్త్వము తెలుసుకొనేవారికి కావలెను; గాని అందరికీ ఎందుకు? అందరూ సంస్కృతము నేర్చుకోరేమి? వేదములు బ్రాహ్మలయినా చదవరేమి? దేశభాష అయిన సంస్కృతముకన్న మ్లేచ్ఛభాష అయిన తెలుగు ఎందులో ఎక్కువ?

పూర్వకాలమున మనదేశములో పుట్టి పెరిగిన విద్యలలో ఎన్నో రూపుమాసిపోయినవి. నిలిచినవయినా అన్నీ ఇప్పటి లోకవ్యవహారమునకు అనుకూలముగాలేవు. లోకముతో కూడా మార్పు చెందనిది ఏదీ వృద్ధిపొందదు. లోకమును అనుసరించి మారినవి వృద్ధిపొంది, మారని వాటిని అణగదొక్కి నిర్మూలము చేయక మానవు. ఇది లోకధర్మము. మనుష్యులు మృగములేకాదు, చెట్లు చేమలున్ను, రాజ్యములు, వ్యాపారములు, భాషలు, విద్యలుకూడా, కాలానుగుణముగా మారనియెడల, వృద్ధిపొందవు. మార్పునుబట్టే వృద్ధి. పుట్టినవాడు పుట్టినట్టే కర్రబొమ్మవలె ఉండునా? జంతువులకు జీవము ఎటువంటిదో, అటువంటిదే భాషకు నోటి వాడుకా, విద్యకు లోకవ్యవహారముతో సంబంధమున్ను.

పూర్వకాలమున మనదేశములో ద్విజులేగదా విద్యలు నేర్చుకొనేవారు; వారిలో నయినా అందరూకారు. సర్వసామాన్యముగా

ప్రజలందరికోసము ఉద్దేశించి ఏ
చలేదు. బ్రిటిషువారి పరిపాలన వ
అయితే దురభిమానముచేత పండితుల
తెలియక విద్యాధికారులున్ను, ప్రజల
విద్యను. పండితులు కవనముకోసము క
బాలబోధలూ కథలూ చరిత్రలూ వ్ర
చదివినా అర్థముకాకుండాను, చేసి,
దాకా తెలుగు చదివినా ఇంగ్లిషు చది
స్త్రీలు చదివినట్లు, ప్రతీదీబండవల్లె
బుద్ధి వికసించకుండా మాడ్చి పాడుచేసినారు.
గా తెలిసేమాటలతో విద్య చెప్పవలెనన్న సంగతి
కారణము మనదేశములో విద్యవ్యాపించక మన
యూరపుఖండములో కూడా మూడునాలుగు వ
కిందటి వరకు కృత్రిమ భాషఅయిన లాటినులో
ము విద్యచెప్పడము ఆచారమయి ఉండేది. అంద
సంసారులలో విద్యావంతులు అరుదు సన్యాసు
మాత్రము చాలాకాలము పట్టుదల కలిగి పూని వల్లించి, అకృ
షా, అందులో వ్రాసిన గ్రంథాలు నేర్చుకోగలిగేవారు. మనదే
పూర్వసంప్రదాయము ప్రకారము తెలుగుభాష నేర్చుకొనేవా
మాలు నేర్చుకొన్న వెంటనే సంస్కృతములో వ్రాసిన బాలరా
ణము, తర్వాత అమరము, ఆంధ్రము, శబ్దాలు, సంస్కృత కా
న్నయభట్టీయము ఈవరకును చదువుకొని ప్రబంధాలు ఆరంభి
రట! ఇదే అనులోమమార్గమట! వేదము వేంకటరాయశాస్త్రి
గ్రామ్యదేశ నిరసనములో ఈపద్ధతిని ఎంతో కొనియాడుతూ
నారు. ఈచొప్పున తెలుగు చెప్పక పోవడము చేతనేనట
పిల్లలకు తెలుగు బాగారాకపోవడము! భళాభళీ! నిజము!
గారు సెలవిచ్చినసంగతి వాస్తవమే! ప్రతి తెలుగువాడు
పండితుడు కావలెనంటే, ఇదే ఉత్తమమయిన పద్ధతి. అయితే
డు "గ్రాంథికశైలిని" "వ్యాకరణశైలిని" నిర్దుష్టముగా వ్రాస్తు
ప్రగల్భాలు పలుకుతూ ఉన్న ఎమ్. ఎ. పండిట్లు, బి. ఎ. ప
ఎఫ్. ఏ, పండిట్లు, ఉత్తర పండిట్లు, అను లోపముగా శాస్త్రి
చెప్పిన పద్ధతిని తెలుగు అభ్యసించి
బడను. అంతా హుళక్కి పండితులే. పండిట్
సుబ్బారావుపంతులవారంతటివారు "సందేహనివర్తి" అని
అని సంస్కృతములున్ను "బుజావుచేయుట" "మాటలథో
నవారిని వివాకుఁ జక్కఁగఁ దెలియునా?" "మేము విజయ
చియుఁ జావడరొ" "స్త్రోసెడి "తీసిపై చినది" "తిరి
అని అసంస్కృతాలు, సంక
కి, ప్రయోగించినారు. వీరు
నిఘంటువులున్ను వ్యాక
వీరి దోషములు ప్రకటి

పూర్వకాలములో రామా
గురవడు, చాకలి సరవడు, గొల్ల
ఒకటే. ఎవరయినా ఉత్తరాలు
అక్కరలేదు, రసీదులూ లేవు.
అధికార్లు నోటిమాటలతోనే వ్యవహారాల
అర్జీలు, సమనులు, ప్లెషంటులు,
క్రీలు నకళ్లు, మనిఆర్డర్లు, రెయిల్ వే
ధరవరల పట్టీలు, ట్రేడు డైరక్టరీలు
సిపల్ కౌన్సిల్ ప్రొసీడింగ్సు, న్యూస్
లు, బులిటిన్లు మొదలయినవి ఎన్నిఉన్న
చేము చదవడము, వ్రాయడమువస్తే లోకవ్యవహా
లు తెలుసుకోవచ్చునో చూడండి. తెలివే ప్రధా
లుగులోనే తెలివి సులభము కాదా?

రామావధానులుగారి మనుమడు బి. ఏ. బి.ఎల్
లేదా స్కూల్ ఫైనల్ దాకా చదువుకొని హె
డు. రామినాయుడు, మనుమడు డిప్టికలక్టరు అవు
ఇన్‌స్పెక్టర్ అవుతాడు. (తెలుగులో పాండి
ు చేతకాసు సుమండి) అయితే మంగలి వెంకడు, గొల్ల గోపాలు
చాకలి సగవడు ఇప్పటికీ రామావధానులు, రామినాయుడు తాత
తలంత సత్యకాలపు వాళ్లే. ఇప్పుడు ఇంగ్లీషు బళ్లలో జాతిభే
లేకుండా అందరికి సరిసమానముగా చదువుచెప్పబట్టిగాని, బ్రా
పండితులకే విద్యాధికారము ఉంటే, బ్రాహ్మణేతరులలోవిద్య
త్రమయినా వ్యాపించునా? తెలుగుదేశములో విద్య ఇంతతక్కు
ఉన్నప్పుడు విద్యఎడల నిజమైన అభిమానము గలవారు చేయవల
పనిఏమిటి? విద్యవల్ల కలిగే ఫలము, లోకవ్యవహారానికి పనికివచ్చే
మా? లేక కేవలము శబ్దజాలమా? ఏదో ఒకటివల్లించడమా? పల్లిం
దానిలోని విషయము తెలుసుకోడమా? జ్ఞానము కలిగించే సాధన
ఎంత సుకరముగా ఉంటే అంత మంచిదిగదా! మాటకు, ఇప్పు
కాసీయాత్ర చేసేవారు రెయిల్ బళ్లు ఎక్కిపోతున్నారు కారూ?
రెయిల్ బండికంటె ఎడ్లబండి ఎక్కిపోతే ఎక్కువ పుణ్యమని, అంతక
న్న కాలినడకను పోతే మరింత పుణ్యమని, ఇంకా రోడ్లుమీద దొర్లు
మరీ ఎక్కువ పుణ్యమని, మన పౌరాణిక పండితులు మనసు
చేసినా, ఎంతపుణ్యము దొరికితే అంతే ఆయెను అని,
మా మెయిల్ బండి మీదనే పోతున్నామా, లేదా? పైకి
వారు శాస్త్రిగారు బుగ్గిలో దొరుతూపోతే బొందెతో
కి పోతామని వ్యవహారములో ఆమాటమీద విశ్వాసం మన
వారికీలేదు. వాదానికి మాత్రం శాస్త్రం ఒప్పుకోవలెనట!
, నిత్యమూ వ్యవహారములో

లోకులు మాటలాడుకొనే
పములు అందరికీ బోధప

డేవి. రాను రాను ఆభాషమారి, తుదకు వాడుకలేక, ఎవరికీ తెలియ
కుండా అయినది. ఇట్లా మారి ఏర్పడిన కొత్తభాషే సంస్కృతము.
భారతము పంచమవేదమని చెప్పి, పూర్వపు ఇతిహాసములు అన్నీ ఇమి
డ్చి, అందరికీ తెలిసేటట్టు అందరూ వాడుకొనే భాషలోనే తర్వాత
తేటగా వ్రాసినారు. ఆభాషను వ్రాసినవారు, పూర్వ భాషతో కల
పక, తమకాలపు వాడుకను అనుసరించే వ్రాసినారు. వాడుకలో
ఉన్నభాషకు మార్పు కలగడము అనివార్యము గనుక ఆసంస్కృతము
కూడా కాలక్రమమున మారి, ప్రాకృతభాషలు ఎన్నో ఏర్పడినవి. ఆ
భాషలలో గ్రంథాలూ పుట్టినవి. అయితే ప్రాకృతములూ సంస్కృత
మూ కలిపి ఏకభాషగా ఎవరూ చేయలేదు. సంస్కృతములో వ్యాక
రణము వ్రాసినవారు అయినా వాడుకలో ఉన్నభాషనే పరీక్షించి
నట్టు అనేక నిదర్శనములు ఉన్నవి. శబ్దముల రూపభేదముల అంగీకరిం
చినారు; స్వరము ఏర్పరిచినారు; తూర్పుదేశమువారు ఈలాగు ఉచ్చరి
స్తారని, ఉత్తరదేశమువారు ఈలాగు ఉచ్చరిస్తారని, లోకములో వా
డుక ఈలాగు ఉన్నది, ఛందస్సు (అనగా వైదికభాష) లో ఈలాగు
ఉన్నది, అని, ప్రత్యేకముగా పాతభాష కొత్తభాష, అని రెండుభాష
లు ఉన్నట్టుగా చూపించినారు.

పాతవిపట్టుకొని పాకులాడేవారు కొందరు, కొత్తవి కోనియా
డేవారు కొందరు, ఎప్పుడూ ఉంటారు. పాతగిల్లినకొద్ది పరిచయము
తక్కువ. గౌరవము ఎక్కువ; దూరమైనకొద్ది దృష్టిసూక్ష్మము అవు
తుంది. రామాయణముకన్నా, శాస్త్రముకన్నా వేదము గొప్పది. శా
స్త్రిగారికన్నా అవధానులుగారు గొప్పవారు. తెలుగురామాయణము
కన్న సంస్కృతరామాయణము చదివితే పుణ్యమెక్కువ. తెలుగు పం
డితులకన్న సంస్కృత పండితులు ఎక్కువ గొప్పవాళ్ళ మనుకుంటా
రు. తెలుగుపండితులుకూడా తమకు సంస్కృతములో పాండిత్యము
ఉన్నా లేకపోయినా ఉన్నట్టేనటిస్తారు. పాత తెలుగు పండితులు కవి
త్రయమును ప్రమాణముగా ఉంచుకొని సంకర తెలుగు వ్రాసేవారిని
తక్కువగా చూస్తున్నారు. కొత్తతెలుగున వ్రాసేవారిని చూచి
వారూవీరూ ఆక్షేపిస్తున్నారు. పల్లెటూళ్ళో రవిక తొడు
క్కుంటే సాని, పట్నములో కోటుతొడుక్కుంటే దొరసాని; అని
ముసలమ్మలు అన్నట్లే.

ప్రస్తుత విషయమునకున్నూ మీద చెప్పిన మాటలకున్నూ సం
బంధమేమిటంటే:—మొదటి తెలుగు కవులు తమ వ్యవహారములో
ఉన్న తెలుగుభాషను వ్రాసినారు. వారి తెలుగు కాలక్రమమున మారి
నది ఎంతోకొంత. దానికిన్ని ఇప్పుడు వాడుకలో ఉన్న తెలుగుకున్ను
భేదము ఉండబట్టి పాతభాషలో చెప్పిన వాక్యముల అర్థము ఆభాష
బాగా చదువుకొన్న పండితులకుగాని స్పష్టముగా తెలియడములేదు.
పాతభాషలో కల్పించిన వేదములలోని సారము కొత్త సంస్కృతము
లో భారత రామాయణములు వ్రాసి చెప్పినట్టుగా, పాతతెలుగులో
వ్రాసిన పుస్తకములలోని విషయములు సర్వసామాన్యముగా తెలిసే
టట్టు చేయవలెనంటే, కొత్తతెలుగు అనగా ఇప్పుడువాడుకలో ఉన్న

The entrance of the Temple at Rameswaram.



రామేశ్వరము, ప్రధానగోపురము.

The Inner Temple at Rameswaram.



రామేశ్వరము, గర్భగుడి, రామలింగేశ్వరస్వామి.

The Waterfall at Coonoor.



కూనూరు జలపాతము.

The Waterfall at Sivasamudram.



శివసముద్ర జలపాతము.



The Periyar Project. పెరియారు జలాశయ నిర్మాణము.

Mantapam at Sreerangam.



శ్రీరంగములోని మంటపము.



Sreerangam. శ్రీరంగము.

Temples at Chandragiri.



చంద్రగిరి దేవాలయములు.

Temple at Kalahasti.



శ్రీకాళహస్తీశ్వర దేవాలయము.

# భగవత్ప్రార్థనము.

[ మంగిపూడి వేంకటశర్మగారు. ]

చ. ఎవఁడు విలాసమాత్ర సృజియించును లోకచయంబు నెల్ల, నే
భువనమయుండు స్నేహ మెయిఁ బ్రోదియొనర్చును తల్లి వోలె, నే
భవహరుఁ డుగ్రమూర్తి యయి భాసిలి లోఁగొను నామహామహున్,
భవు, నభవున్, స్వయంభువును భక్తి భజింతుము భక్తవత్సలా! 1.

ఉ. ఆదిమ గ్రంథరత్నము లుదంచిత వేదములున్, దదంగముల్
శ్రీదములే యనంతుని విచిత్ర చరిత్ర లెఱుంగఁజాలవో
యాదియు, మధ్యమున్, లయమునందక వెల్గు మహాత్ము డెవ్వఁ డా
యాదిమ బ్రహ్మమున్, బరము నాత్మ భజింతుము భక్తవత్సలా! 2.

ఉ. రూపము లేనివాఁడగుచు రూఢిగ, దానె సమస్తరూప...
దీపితనిర్గుణుండగుచు దిక...
ప్ర...
డాని...మ...

చ. దినకరుఁ డే స్వయంప్రభ...
ఘనుఁడు, శశాంకుఁ డే...
యనలుఁడు నే ప్రచండుని...
య్యనుపము, నద్వితీయు...

ఉ. శక్తి కొలంది నేయనఘుశ...
సక్తిని నేయనంతుని ప్రసన్న...
వ్యక్తతఁ గాంచి సాధుపథవ...
భక్తులు ముక్తులౌ దురలభవ్యభ...

చ. కులగిరులే నిరంజను నకుంఠిత...
బులో? జలరాసు లేఘనుని భు...
యిలయు, నభంబు నే విభుని య...
బులో? యలసత్ప్రభావుని, స...

ఉ. కన్నుల నే పదార్థములఁ గన్నను,...
విన్నను భక్తులైన సువివేకులకే జ...
పన్న శరణ్యుఁడున్, సదయభావుఁడ...
బన్నగ దోఁచునట్టి గుణభద్రు భజింతు...

చ. పవనుఁడు వీవనల్ విసర, భానుఁడు,...
దివమను కాయమాన...ఁ దీర్చిన...
ప్రవిమల తారకల్ వెలయ భ...
ద్భవనమునందుఁ గొల్వమరు...

చ. కనఁ గనఁ జక్రకార్ముకముఁ గన్న, విచిత్రపు బర్హిబర్హమున్
గనినను, నింగిరంగులను గాంచిన, నింకమ కోమ లింతఁ గ
న్గొనినను భక్తవర్యుల మనోంబుజముల్ వికసిల్లి యే నిరం
జను మహిమంబు నెంతు రల స్వామి భజింతుము భక్తవత్సలా! 9.

ఉ. స్వానుపదార్థ సంతతులుఁ జల్లనిగాలియు, వెల్గు, వేఁడియున్,
బాదపముల్, మహానదులు, భద్రదముల్ పశు పక్షిబృం...
మోదముఁ గూర్చు సౌరభసమున్నత పు...
యాదిము...

చ. ధనములనిచ్చి, సాధువుల దార సుతాదులనిచ్చి, వస్తు వా
హనములనిచ్చి, హర్మ్యనివహంబులనిచ్చి, ప్రశస్తదివ్య భో
జనములనిచ్చి, భక్తియును, జ్ఞాన విరాగతలిచ్చియున్న మ
జ్జనములఁ బ్రేమనోమునలసామి భజింతుము భక్తవత్సలా ! 17.

చ. మనుజులు లోభ మోహ వినిమగ్న మనస్కులై ఘోరపాప చిం
తనమొనరించు పట్టుల నుదారత ధీరతఁదారపిల్లి వ
ర్తనమును జక్కఁజేసి ప్రమదంబు ఘటించెడు నంతరాత్మఁ బోం
తనముగ నిచ్చినట్టి నెఱదాతభజింతుము భక్తవత్సలా ! 18

ఉ. ధారణివెండి, పైఁడియును దాఁచియొసంగుట వింతయేమహో
దారతరత్న సంచయము దాఁచియొసంగుచునుంట భూప్రజల్
సారముమీఱుభోగములఁ గ్రాలసముద్రఁపునీటిలోన బం
... ? యఖండు భజింతుము భక్తవత్సలా !.

... రమున్

చ. తలఁపునవారువీరనక దర్శనమిచ్చుచు నెల్ల వారికిన్
సులభముగా నభీష్టములఁ జొప్పడఁ జేయుచు ధర్మమార్గమున్
దలఁగిన నస్వాదండనలఁ దార్కొనఁజేసి సుబోధమిచ్చుచున్
మెలపునలోక మేలు పర మేళు భజింతుము భక్తవత్సలా ! 24.

ఉ. ఏయదియైన మేలుకొఱకే ఘటియించుచు నెల్ల వేళలన్
బాయనిసుప్రసన్నమతి భాసిలుచున్ గనరాక మేలులన్
జేయుచుదీనరక్షణమె నిత్యవ్రతంబుగ లోకరాజ్యమున్
జేయుచునుండు సత్ప్రభుని నెమ్మిభజింతుము భక్తవత్సలా ! 25.

చ. సచివులులేకయుండ భటసంఘములేకయెయుండ నాయుధ
ప్రచయములేకయుండ సులభంబుగనెల్ల జగంబు వశ్యమై
ప్రచురతఁగొల్చుచుండ నొకరవ్వయురట్టును లేకయుండ నే
సుచరితుఁడేలులోక మలశుద్ధభజింతుము భక్తవత్సలా ! 26.

ఉ. ఉండియులేనివానివలెనుండుచుఁ దోఁచియు దోఁచనట్లుగా
...డుచుశాంతధర్మములె యూఁతగఁదా నసహాయుఁడయ్యుభూ
... ప్రసుత ...ఁజేయు సత్కృపా
... ! 27.

...వత్స...
...కాస్తిక
...డైన వానికా
... భక్తవత్సలా ! 28.

...యించి త్వన్మయ
...క్షణవర్ణనమందె ప్రొద్దులన్
...న్ జగమెల్ల నీస్వరూ
...స్తులు భక్తవత్సలా ! 29

...విచారభావమున్,
...వర్జితమైనదేహమున్
...ఘటించి ప్రసన్నతన్ మమున్
... భజింతుము భక్తవత్సలా ! 30.

...నలరఁజేసి
...సంతమూర్తి ॥
...

...వేళన్ ॥
...డు ...సం
... ?

# ప్రాక్తన హిందూ రాష్ట్రీయ యుద్ధధర్మములు.

[ముత్తరాజు సుబ్బరావుపంతులుగారు ఎం., ఏ.]

ఆంగ్లేయభాషయందు వ్రాయఁబడిన యంతర్దేశీయ శాసనములను ( International Law) గ్రంథమునుఁ బఠించుచుండ మనహిందూదేశమునందలి రాష్ట్రములకిట్టి ధర్మములెవ్వియైన నుండినవో లేవో యని గనుఁగొను బుద్ధి స్ఫురించ దానికై కొన్నిగ్రంథములఁ బరిశోధించి వానియం దీయంశమునకు సంబంధమైన విషయముల గ్రహించి క్లుప్తపఱచి యిందు బొందుపఱచినాఁడ. ఇందు మనశాస్త్రకారకులు యుద్ధమునకుఁ జొచ్చుటకుఁ దగిన కారణములుగా వేనిని విధించిరో పూర్వరాజు[illegible] ములకై యుద్ధమునకుఁజొచ్చిరో కొంతవఱకు జర్చింపబడి యున్నది.

ఈవిషయములకు ముఖ్యాధారములు త్రివిధములు. అందు మొదటివి హిందూమతసంబంధమగు గ్రంథములు. ఉదా:-రామాయణము, మనుస్మృతి, శుక్రనీతి, యిత్యాదులు. రెండవవి సమకాలికులగు హిందువులచే వ్రాయఁబడిన గ్రంథములు. ఉదా:-రాజతరంగిణి, అర్థశాస్త్రము, హర్షచరిత్రము లిత్యాదులు. మూఁడవవి హిందూదేశమునకు వచ్చిన పరదేశీయ పాంథులచరిత్రములు. ఉదా:-మెగాస్తనీసు, ఫాహియాను, హ్యూయన్సుత్సాంగ్ ప్రభృతులువ్రాసిన చరితములు. ఇందు మొదటివియే మనకు ముఖ్యాధారములు. అందు రాజులెట్టి ధర్మముల కనుగుణ్యముగ యుద్ధమొనర్పవలయునో వ్రాయఁబడినది. ఇట్టి ధర్మములు మతస[illegible]ధ గ్రంథములనుండుటకు కారణము మనమత మన్ని[illegible]లకు సర్వావస్థలయందును తత్తదాచరణీయములగువిధుల నేర్పాటుజేయుటయే యని తోఁచుచున్నది. ఇట్టి సంబంధము వీని కత్యధికమగు గౌరవమును గలుగఁజేయుచున్నది. మఱియు బ్రహ్మాదిదేవతలీగ్రంథముల వ్రాసిరనియు, వీనిలోని ధర్మము లవశ్యమనుచరణీయములనియు వీనికి వ్యతిరిక్తముగా నడుచుకొనుటవలన నిహపరంబుల దుఃఖము ప్రాప్తమగుననియు నుండుటచేత రాజులును నితరులవలె వానియం దత్యంత గౌరవమునుఁ జూపుచుండిరనుట నిర్వివాదాంశము. తదితరాధారములీ గ్రంథస్తమగు ధర్మము లెంతవఱ కాచరణములో నుండెనో తెలియఁజేయుట కుపయుక్తములు. ఈవిషయమును మనకుఁగావలసినంత విశదముగాఁ గనుగొనుట దుర్లభము. ఏలయన మన దేశచరిత్రము మన నిర్భాగ్య హేతువుచేతనో యనునట్లు లెందఱెంత పాటుపడినను గొన్ని సందర్భముల సంపూర్ణముగా శిథిలమై, గొన్నిచోట్ల సంశయాస్పదమై యిదమిత్థమని నుడువుటకు వీలులేక పరిణమించుచున్నది. ఇక్కతంబున నీధర్మాచరణంబు పూర్ణముగా సాధ్యమయ్యెనో లేదో కనుగొనుట కష్టతరమైనను గొంతవఱకు బరిశీలింపవచ్చును. ఇక మనవారి యభిప్రాయమున రాజ్యమన నెట్టిదో రాజన నెట్టివాఁడో యించుక విచారింతము.

రాజ్యమన నృపుఁడు, అమాత్యుఁడు, చెలికాఁడు, కోశము, సేన, దుర్గము, రాష్ట్రములను సప్తాంగములను గలిగినది. వీనిని బరిశీలించిచూడ పాశ్చాత్య రాజ్యతంత్రకారకులు రాజ్యములకు ముఖ్యచిహ్నములనివ్రాసిన ప్రజ, భూమి, ఐక్యము, అంగవిన్యాసములను నాల్గింటి యొక్క విపులీకరణమని నుడువవచ్చును. మఱియు రాజ్యపురుషునకు “నృపుండు శిరంబు, చక్షునమాత్యుండు, చెలికాఁడు శ్రోత్రంబు, కోశంబు ముఖంబు, సేన మనంబు, దుర్గంబులు హస్తంబులు, రాష్ట్రంబు పాదంబు”లని చెప్పబడియున్నవి. మఱియు భూపాలురు నిర్మింపబడిన హేతువిట్లు వ్రాయఁబడెను. “మున్నొక్కఁడు నాయకుండు లేమింజేసి జనులన్యోన్యపీడితులగుడుఁ జతుర్ముఖుండు లోకపాలురయు జంద్రార్కులయు నంశంబులచే దపస్సామర్థ్యంబునఁ జరచరాత్మకంబగు నిజ్జగంబున కొఱయల

నిర్మించె". దీనివలనరాజులు జనుల నన్యాయపీడితుల గాకుండఁ బ్రోచుటకై నియోగింపబడిరని దెలియవచ్చుచున్నది. మఱియు రాజన "ప్రజాసంరక్షణ సామర్థ్యంబును, బరాక్రమంబును, నింద్రియ నిగ్రహంబును, శైలియుం" గలవాఁడు. వానికిఁ గామంబు ప్రజాపాలనంబుననను, క్రోధంబు శత్రుదండనంబుననను, లోభము సేనాపరిగ్రహంబునను నుండవలయును. వానికి "దుష్టశిక్షణంబును శిష్ట రక్షణంబును, దానంబును, రాజసూయాది యజ్ఞంబులును, న్యాయంబునఁ గోశార్జనంబును, రాజుల నరికాపులగావించుటయును, శత్రుసంహారంబును, దేశాక్రమణంబును" నను నీ యెన్మిదియు నవశ్యకర్తవ్యములు. ఇట్లుగాక, రాజులఁ గరదులఁ గావింపక, అనీకాభివృద్ధిఁజేయక, ప్రజల బాగుగా బరిపాలింపకయుండు రాజులు పండతిలలు నాదగుదురు.

ఇట్టిరాజులు యుద్ధాచరణమునకుఁ బూనుకొనుటకుఁ దగినకారణముల నిట్లు నుడివియున్నారు. అన్యాయవృత్తులగు భూపాలుర రాజ్యంబుల సర్వస్వంబు నపహరించుచుఁ బరాజితులదేశంబున ధర్మాదికరణంబు నిలుపవలయుననియు నిట్లురాజులపాత్రులగు రాజుల సర్వస్వంబు నపహరించియు నధర్మశీలురైన నృపాలుర ధనంబు గైకొనియును బాపభాజనులు గారనియు వ్రాయఁబడియున్నది. మఱియుస్త్రీలకును విప్రులకును గోవులకునునాపదవాటిల్లినపుడు జివ్వకుంజొచ్చుట యుచితమనియువ్రాయబడినది. ఇంకను రాజున కపకారముగాని తన జనులయెడ దార్జన్యముగాని జేసినవారిపై దండెత్తుటుచితమనియు వ్రాయబడియున్నది.ఈధర్మములవలన రాజులు లోకమునందంతయు ధర్మసంస్థాపనార్థమును బ్రజాసంరక్షణార్థమును నధార్మికులను నపకారులనుగెలిచి వారిరాజ్యంబును సర్వస్వంబును గైకొనుట దగుననియు నది పాపహేతువుఁగాదనియు నిహపరముల సౌఖ్యదంబనియుఁ దెలియవచ్చుచున్నది.

ఇట్లున్నను దీనికి వ్యతిరిక్తముగాఁ గొన్నియెడల గొన్నిధర్మములు గన్పట్టుచున్నవి. రాజసూయాది యజ్ఞంబుల జఱుపునెడఁ గారణాకారణ విచక్షణలేకయే యుద్ధమునకుఁజొచ్చు టుచితమనిరి. ఇట్టియజ్ఞంబు లింద్రపదవినొందుటకు సాధములనియు నుడివిరి. ఇట్టి వ్రాతకు గారణము హిందువులేక మతస్థులైయుండగా వారొక్క నృపుని పాలనమున నేయుండ బాగనిమెంచి యేర్పాటు జేయఁబడినట్లు దోచుచున్నది. దీనినిగుఱించియే సంజయుడు భారతంబున రాజులు దమకుఁ గీడుసేయనివారికిఁ గీడొనర్చుటచేఁ గిరాతులనుఁ బోలినవారనియె. మఱియు ధర్మాధర్మ విచక్షణజేయుటయందు భిన్నాభిప్రాయములుండుట సహజముగాన గొందఱునృపులు వారికి దగినట్టు లీవిభజనఁజేయుచుండిరి. ఇదియునుగాక సైన్యసమేతుఁడైన రాజు బలవంతముగానైన నందఱినిఁ దనకు వశ్యులుగా జేసికొనవచ్చుననియు, భిన్నమంత్రబలుండగు వాని రాజ్యము నవశ్యము [illegible]ననియు, బలిష్ఠుడందఱిపై దాడియెత్తవచ్చుననియు వ్రాయబడియున్నది. దీనివలన బలవంతుఁడగు నృపుఁడు గారణము లేకపోయినను నితరులపై దాడివెడలుట బాగగుననియుఁ దెలియవచ్చుచున్నది. ఇంకను రాష్ట్రములు శత్రువులవనియు, మిత్రులవనియు, మధ్యస్థులవనియు వాని వాని స్థానములంబట్టి విభాగింపబడియున్నవి. ఒకరాజుదేశమునకుఁ బ్రక్కనుండు రాజ్యములు శత్రురాజ్యములు. వానికిం బ్రక్కనుండునవి మిత్రరాజ్యములు. వీనిరెంటికినిఁ బ్రక్కగనుండునవి మధ్యస్థుల రాజ్యములు. ఇట్లు రాజులు వారి వారి రాజ్యములఁ బ్రక్కనుండురాష్ట్రములఁ నెంచుకొని తగు జాగరూకతతో నుండవలయునని మనుస్మృతియందును చాణక్యుని యర్థశాస్త్రమందును జెప్పబడియున్నది.

ఇట్లు శాస్త్రకారకులు [illegible]మ గ్రంథములయందు భిన్నాభిప్రాయములకుఁ [illegible]నట్లు వ్రాసియుండినను వారు వీనియొక్క దుష్ఫలములనెఱింగి వాని నివారించుటకై యుద్ధకాముకులకుఁ గొన్ని నీతుల బోధించియున్నారు. దేశకాలంబులను, బగఱబలంబును, దనబలంబును, సంధివిగ్రహ యానాసనద్వైదీభావ సమాశ్రయములను షడ్గుణోపాయములను బాగుగాఁ బరిశీలించి యుద్ధకా

ముకులు గావలయుననిరి. విజిగీషుఁడగురాజు కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యములను నరిషడ్వర్గమును ముందు జయించి తర్వాత శత్రువులపై దాడివెడలుటుత్తమ మనియుసామదాన భేదోపాయంబులముందు ప్రయోగించి వ్యర్థములైన దండోపాయమునకుఁ బూనుమనియు నుడివిరి. ఏలయన "సర్వకార్యంబులకుఁ బ్రధానసాధనంబును శ్రేష్ఠంబునునగునది సామంబును దదనంతర సాధనంబు దానంబును దర్వాతిది భేదంబునగును; గాని ప్రాణసంశయకాలంబున దండంబు సమాశ్రయణీయంబు. రాజు ప్రబలులగు నృపులయెడ సామదానంబులేని సామభేదంబులేని వినియోగించుచు సముఁడగు పగవానియందు భేదదండంబులఁ బ్రయోగించుచు హీనబలుండగు రిపునియందుఁ దప్పక దండంబు ప్రయోగించునది." శత్రులందు సామదానంబులేగాని భేదదండంబులొకప్పు[illegible] తింపఁదగదు. కాన దండోపాయమునుఁ గొ[illegible] ములనే యుపయోగింపదగును గాని సర్వత్ర వినియోగించుట దూష్యమును నపాయకరమును నగును. ఇంకను యుద్ధంబున జయాపజయంబులు దైవాధీనములు గాన భూపాలుఁడెప్పుడును తానవశ్యము గెల్తునని దలచుట తేలకనమనియు చీటికి మాటికి యుద్ధమునకుఁ బూనుకొనుట శ్రేయస్కరము గాదనియు నుగ్గడించి నిరుత్సాహులఁజేసిరి. ఇవియునుఁగాక పైనవివరించిన శత్రురాజ్యముల విషయమై రాజులు జాగరూకతతోనుండినఁ జాలుననియు వారు యుద్ధమునకుఁజొచ్చి యొకవేళ నొక శత్రురాజ్యమును గెల్చి యాక్రమించుకొనినను నింకొక రాజ్యము శత్రురాజ్యముస్థానములో నుండునుగాన నెన్ని రాజ్యముల నాక్రమించుకొనినను శత్రురాజ్యములు ప్రక్కనేయుండు ననియు నుడివిరి. పైనుడివిన నీతులవలన యుద్ధమునకుజొచ్చుట సాధ్యమైనంతవఱకు వారణీయమనియు నుడివి యుద్ధకాముకుల నిరుత్సాహపఱచిరి.

ఇఁక మనదేశమందు దార్యాగమనమునుండి క్రీ. వె. 1000 సంవత్సరములవఱకుఁ జఱిగిన ముఖ్యయుద్ధములఁ గొన్నిటిం దీసికొని యవి సహేతుకములా నిర్హేతుకములా యని యించుక చర్చించి యవి యెట్టియుద్ధములో నిరూపణ జేయుదము. యుద్ధమన శత్రుభావంబు ధరించిన నిశ్చయాత్మలగు నిద్దఱుగాని పెక్కండ్రుగాని రాజులు స్వకార్యసిద్ధ్యర్థంబు శస్త్రాస్త్రదులఁజఱుపు వ్యాపారము. ఇది రెండు విధములు. ధర్మయుద్ధము, కూటయుద్ధము. ధర్మయుద్ధమన శాస్త్రోక్తమగు విధుల కనుగుణ్యముగఁ జేయఁబడునది. తదితరము కూటయుద్ధము. ఈవిభజన మనకంత యవసరము లేదు. ఇద్ది యుద్ధాచరణమునుబట్టి గలిగిన విభజనగాని కారణములవలనఁ గలిగినదిగాదు. మనకుఁ గారణములు ముఖ్యములు గావున యుద్ధములు సకారణములనియు నకారణములనియు విభజింపనగు. అందు సకారణములు ధర్మసూచితములగు గారణములు గలవి. అకారణము లట్టి కారణములు లేక బలిష్ఠులచే స్వోత్కర్షణమునకై జఱుపబడునవి. ఈవిభజనప్రకారము మనదేశములలో మన [illegible] యుద్ధ[illegible] విమర్శింతము.

మనకుఁదెలిసిన యుద్ధములలో మొట్టమొదటిది కురుపాండవుల యుద్ధము. ఇది పాండవులచే రాజ్యభాగమునకై జఱుపఁబడియె. పాండవులు రాజ్యభాగమున కర్హులా కాని సంశయాస్పదముగ నుండుటచే నిది యిట్టి యుద్ధమనిచెప్పుట కవకాశము లేదు. రెండవది రామరావణులయుద్ధము. ఇది రామునిచేఁ దనభార్య నపహరించిన రావణునిపై జఱుపఁబడినదిగాన సకారణయుద్ధమే. మూఁడవది చంద్రగుప్త మౌర్యుని యుద్ధములు. ఇతఁడు నందులతో జఱపిన యుద్ధ మకారణము; కాని తనరాజ్యముపై దండెత్తివచ్చిన యవనరాజగు సెల్యూకసుతోఁ జేసినది సకారణమే. నాల్గవది అశోకుని కళింగయుద్ధము. దీనికి గారణములు మనకు బొత్తుగ దెలియవు గాన నిదిట్టిదని చెప్పుటకు వీలు లేదు. ఐదవది రెండవ విలివాయఁకరుఁడు సహాపాణునితోఁ జేసినయుద్ధము. ఇది హిందూజాతీయ విధులను శాస్త్రోక్త ధర్మములను నేటిలోఁగలిపిన పరజాతీయుఁడును పరమతస్థుఁడును నగు సహాపాణునిపై మతద్వేషముచేత జరుపఁబడిన దగుటచే నకారణముగఁ దోచుచున్నది. ఆఱవది హైందవ నేపోలియన్ అనిఖ్యాతి

వఁజేసిన-సముద్రగుప్తుని యుద్ధములు. ఇవన్నియుఁ గారణములేకయే స్వోత్కర్షణముకొఱకును కీర్తినార్జించుట కొఱకును జరుపఁబడినవిగాన నకారణములే. ఏడవది వాని కొమరుఁడగు రెండవ చంద్రగుప్తుని సౌరాష్ట్రయుద్ధము. దీనికింగారణము మతభేదముచేఁగలిగిన మాత్సర్యయగుటచే నిదియు నకారణమాయని సంశయము దోఁచుచున్నది. ఎనిమిదవది రాజ్యవర్ధనుని మాళవయుద్ధము. దీనికిం గారణము దన చెల్లెలును పాంచాలరాజ్ఞియునగు రాజ్యశ్రీదేవికి మాళవదేశపాలకుఁడొనర్చిన యవమానము గాన నిది సకారణము. తొమ్మిదవది వానితమ్ముఁడగు హర్షవర్ధనుని యుద్ధములు. ఇవన్నియు హిందూదేశమునం దేకఛత్రాధిపత్యమువహింపఁ గంకణముగట్టి యాతఁడొనర్చిన వగుటచే నకారణములు. పదియవది కాశ్మీరేశుఁడగు లలితాదిత్యుడు పాంచాలరాట్వరుండగు యశోవర్మతో జఱపినయుద్ధము. దీనికి [illegible] జఱిగిన మర్యాదలోపముగాన నిది సకారణము. పదునొకఁడవది, ఆదిత్యచోళుఁడ పరాజిత పల్లవునితో జఱపిన యుద్ధము. దీనికిఁ గారణము తనపూర్వులేలిన భూములఁ బల్లవు లాక్రమించుకొనుటచే సకారణము. పండ్రెండవది రాజ రాజ చోళుని పూర్వచాళుక్యయుద్ధము. దీనికి గారణమూ దేశమం దంతఃకలహములు పెరిగియుండుటయే కాన నిదియు నకారణము.

పైన వివరింపఁబడిన వానివలన మనకు మనదేశమందు స్వదేశీయరాజులచే జఱుపఁబడిన యుద్ధములలో గొన్ని సకారణములుగను గొన్ని యకారణములుగను జఱుపఁబడుట తెల్లమగుచున్నది. ఇట్లుండుట గొప్పలోపమైనను నప్పటి మనదేశకాలావ్యవస్థఁ బట్టిచూడ నిది సహజముగఁ గాన్పించుచున్నది. ఏలయన నిప్పటికింత నాగరికత హెచ్చినను కట్టుదిట్టము లెక్కుడైనను నకారణయుద్ధములు జఱుగకపోవుటలేదు. ఎట్టి కట్టుదిట్టములున్నను బలిష్ఠులగురాజులు దమ కార్యసాఫల్యమునకై వానిని లక్ష్యముసేయక నడుచుకొనుట మనకందఱకుఁ దెలిసిన [illegible]. ఇక నట్టి కట్టుదిట్టములులేక భిన్నాభిప్రాయముఁ కుఁజోటిచ్చు మన ధర్మశాస్త్రముల మార్గదర్శకములుగఁ గైకొనిన మనస్వదేశీయరాజుల విషయమున వేఱునుడువనేల?

The Three Gopurams on the Tirupati Hill.



తిరుపతి వేంకటేశ్వరులకొండ మొదటి రెండవ మూడవ గోపురములు.

Gopuram of the Govindarajah Swamy Temple at Tirupati.



గోవిందరాజస్వామి దేవాలయముయొక్క గోపురము తిరుపతి.

The Seven Pagodas. Draupadee's Car and Arjuna's Car.



మహాబలిపురము. అర్జునరథము, ద్రౌపది రథము.

Mahabalipuram, Krishna's Cave.



మహాబలిపురము, శ్రీ కృష్ణుని మంటపము.



The Modern Temples, Mahabalipuram. నూతనదేవాలయములు, మహాబలిపురం.



Ganesh Temple at Mahabalipuram. గణేశదేవాలయము, మహాబలిపురం.



The Painted Corridor at Madura.

చిత్రాలంకృత గహ్వర స్తంభమంటపము, మధుర.



Tirumala Naik's Palace, Madura.

తిరుమలనాయకుని రాజమందిరాంతర్భాగము, మధుర.

నక్కలను, పఠానులను స్వయముగనెరిగి వారియందరబుద్ధి హెచ్చుగకుదిరిన సర్ ఫ్రెడరిక్కు రాబర్ట్సు రెండవ ఆఫ్గన్ యుద్ధానంతరము చెన్నపురి సేనాధిపతిగ వచ్చిన నాటనుండియు, తెలుగు, అరవ, మహారాష్ట్ర బంగాళాసిపాయీలపై ధ్వజమెత్తి వారినాశము నిరసింపం దొడగెను. “హిందూదేశమునందు నలువదేండ్లు”ను పేరుగల యాతని స్వీయచరిత్రముయొక్క 63వ యధ్యాయమునం దిట్లువ్రాసియున్నాడు.

“కడచిన శతాబ్దపు యుద్ధములందును, ఈశతాబ్దారంభపు యుద్ధములందును వారి (చెన్నపురి సైన్యముల యొక్క) పూర్వులలో ద్యోతకమగుచుండిన యుద్ధలక్షణములను కనిపెట్టుటకు నేనుచేసినప్రయత్నము వ్యర్థమయ్యెను. అనేకసంవత్సరములనుండి దేశమునకుగల నెమ్మదియు, దానివలన గలిగెడు భద్రము, ఐశ్వర్యము, ఏష్యాఖండవాసులందరియందువలెనే, వారియందును మార్దవమునుపుట్టించి, వారిలక్షణములనుమార్చి, బంగాళాదేశమందలి హిందూస్థానీలయందువలెను, బొంబాయి రాజధానియందలి మహారాష్ట్రులయందువలెను, వారియందును, పౌరుషమును వీర్యమును చంపివేసినదని నేనూహించుచున్నాను. దీనిమూలమున వారు దక్షిణహిందూస్థానపు పొలిమేరలను దాటి కాని, యుద్ధస్వభావముగల యితరజాతులవారితో నితరస్థలములందు యుద్ధములలో నువయోగించుటకుగాని, పనికిరారని నేనునమ్ముచున్నాను. నాగౌరవశ్లాఘనలకు పాత్రమైన తొల్లిటితూర్పుతీర సైన్యముయొక్క సంతతివారిపై నిట్టియభిప్రాయమునుకలిగించుకొనుట నాకు గడు విచారముగనున్నది. చెన్నపురిసైన్యమునకు చేరియున్న బ్రిటిషు ఉద్యోగీయులు తమ రెజిమెంట్లపై నభిమానము గలవారై వాని పూర్వచరిత్రమున నుత్సాహపూరితులగుచుండుటవలన వారికొరకైన నాసైన్యముయొక్కన్యూనతనునమ్ముటకు నేనిష్టపడనైతిని.

చెన్నపురిరాజధాని సేనాధిపత్యమునుండి రాబర్ట్సుప్రభువు హిందూదేశసేనాధిపత్యమునకు నియమింపబడినతోడనే తన మనోరథమును తీర్చుకొనగల్గెను. హిందూస్థానీ, తమిళ, తెలుగు, మహారాష్ట్రసిపాయీలు గల పటాలములను వగులగొట్టి వారిస్థానమున రాజపుత్రులను, తురకలను, పంజాబీలను నియమించి పూర్వపు చెన్నపురి సైన్యమును చరిత్రవిషయముగావించెను. ఒకవేళ చెన్నపురిసేనలు క్షీణదశ జెందినవనుకొన్నను దానికి గారణభూతులు బ్రిటిషు ఉద్యోగీయులు కాని తెలుగువారుకారని యాంధ్రభారతినుండి చూపిన పై నిదర్శనమువలన స్పష్టము కాగలదు. బట్టల నుదుకుచున్న చాకలిని, కల్లుగీయుచున్న యీండ్రవానిని, చేనుకోయుచున్న మాలవానిని, చెప్పులనుకుట్టుచున్న మాదిగవానిని, మూటలనుమోయుచున్న తూర్పువానిని, హఠాత్తుగ సిపాయినిచేసి వాడు ఫిరంగిధ్వనిని వినినతోడనే భీతుడు కాగా, తెలుగువారు పిరికిపందలని నిర్ణయించుట న్యాయవిరుద్ధము. యుక్తవివేచనములేకుండ సిపాయీలను నియమించి, యిచట బ్రిటిషు రాజ్యస్థాపనమునకు సహకారులైన తెలుగువారు తమచక్రవర్తికొలువునజేరి తమశౌర్యప్రతాపములను ప్రభుభక్తినిచూపుటకును తెలుపుటకు నవకాశమీయకుండుట పాడిగాదు. తమతో కలిసిమెలసి తిరుగుచు సమాన నిర్బంధములకు పాత్రులైయున్న తెలుగుదేశపు మహమ్మదీయులు పనికివత్తురనియు, తెలుగు హిందువులు పనికిరారనియు తీర్మానించుట మన కెక్కుడు పరాభవమయ్యెను, మహమ్మదీయుల కట్టిగౌరవమును నిలిపినందుకు మన మీర్ష్యాగ్రస్తులమై యుండక తెనుగుదేశవాసులు కొందరైన నాయుధగ్రహణమున కర్హులని దొరతనము వారు తలపోసినందుకు వారికి కృతజ్ఞులమైయున్నాము. ఇట్టిభేదమును పాటించుటకు కారణములమాత్రము మనమూహింపజాలకున్నాము. ఇంతటితో సరిగాక క్రైస్తవ మతావలంబకులైన తెలుగుదేశపు పంచములు సిపాయీలు కొలువునకు పనికివత్తురను వేఱొకయుత్తరువుకలదు. దేహదార్ఢ్యము గల పంచముడు మతాంతరుడు కాకుండినంతకాలము మిగత తెలుగువారివలె గర్హ్యుడేకాబోలు! వీర్యప్రతాపములు లేనివానియందవి యన్యమతావలంబనము వలన నుదయించునని తలపోయుట వింతగనున్నది. ఇట్టినిర్బంధములను తొలగించుట కిపుడాంధ్రదేశీయులు ప్రయత్న

ములుచేయుచున్నారు. 1912సంవత్సరము మేయినెలలో నిడదవోలులో జరిగిన కృష్ణామండలసభయందును, విశాఖపట్టణమునజరిగిన విశాఖపట్టణ మండల సభయందును తెలుగువారిని మఱల పటాలములలో చేర్చుకొనుటను గురించి దీర్మానములు గావింపబడెను గోదావరి మండల సభవారు హిందూరాష్ట్రీయ సేనాధిపతిగారికి పంపిన సహేతుకమైన విజ్ఞాపనమునకాయన క్రిందిరీతిని గడచిన జూలై రెండవతేదీని ప్రత్యుత్తర మొసగిరి:— తెలుగువారు సేనలలో పూర్వముచేసిన మహాకార్యములకు వారినిమెచ్చుకొనుచు, చెన్నపురి పటాలములలో మఱల తెలుగువారిని చేర్చుకొనుటకుఁ జేయవలసిన మార్పుల నిపుడు తలపెట్టుట కుద్యుక్తులము కాజాలనందుకు జింతిల్లుచున్నాము" ఆవిజ్ఞాపనములోని విషయముల నామోదించుచు ఇండియన్ స్పెక్టేటరు, మోడరన్ రివ్యూ, ఇండియన్ మెస్సెంజరు పత్రికలు తమ యభిప్రాయములను తెలిపి, తెలుగుదేశపు పంచమక్రైస్తవులును మహమ్మదీయులును మతాంతరకారణమువలన నర్హులగుటయు, హిందువులు నిరాకరింపబడుటయు నాశ్చర్యముగ నున్నదని వివరించెను. మనవారికీస్వాతంత్ర్యము మఱలవచ్చు సందాక ప్రతి తెలుగుదేశపు సభలో నేటేట నీవిషయమునుగురించి తీర్మానములు గావింపబడి దొరతనము వారికి పంపబడుచుండవలెను. పైన నుదాహరింపబడిన గోదావరిమండల సభవారి విజ్ఞాపనమును చెన్నపురిదొరతనమువారు తమ యనుకూలాభిప్రాయముతో నిండియా దొరతనమువారికిపంపిరని యూహింపదగియున్నది. రాజకీయ వ్యవహారసందర్భములనుపట్టి హిందూదేశపు కమాండరిన్‌ఛీఫుగారు పైరీతిని గోదావరి జిల్లాసంఘము వారికి ప్రత్యుత్తరమిచ్చినను గౌరవనీయులగు మ॥రా॥శ్రీ, న్యాపతి సుబ్బారావుపంతులుగారితో దీనినిగూర్చి ప్రశంసించినపుడు తెలుగుదేశీయుల కీపట్ల నన్యాయము జరిగినట్టు లభిప్రాయమును వెల్లడించిరని తెలియుచున్నది. ఈయేడు చెన్నపురి గవర్నరుగ బదిలీచేసిన సర్ మరే హామిక్కుగారు నట్లేచెప్పిరని వారితో నీవిషయమును గురించి ముచ్చటించిన యొకరు నాకు దెలియపరచిరి. కావున తెలుగువారు నిరుత్సాహులుకాక తరుచుగ దొరతనమువారికి దీనినిగూర్చివిన్నవించుచుండిరేని యచిరకాలమున కృతకృత్యులుకాగలరని నేనునమ్ముచున్నాను.

హిందూదేశపు పటాలముల పట్టికలలో సిపాయీల జాతిమతభేదములు తెలుపబడును. చెన్నపురి పటాలములలో కొన్నిటిని కర్ణాటసైన్యమందురు. ఒక కర్ణాట పదాతి పటాలమునందిపుడు 4 కంపెనీలసీక్కులు, 2 కంపెనీల మహమ్మదీయులు రెండుకంపెనీల పరయాలు (పంచములు) క్రైస్తవులుకలరు. ఈకలగూరగంపలో చన్నపురిరాజధానియందలి నాలుగు వర్ణములవారితో నొక్కరయిన చెల్లుబడిగాకున్నారు. దానిమూలమున ప్రసిద్ధిజెందిన శూద్రవంశజాతులందరిపుడు పోలీసు కనిస్టేబు, సాల్టుజవాన్, ఫారెస్టుగార్డు, రెయిల్వేగేటుమన్, షంటింగు జమాదారు మొదలగు సామాన్యోద్యోగముల కాశింపవలసివచ్చెను. తెలుగు, తమిళ, కన్నడప్రజలన్న యూరపియనులకును, మిగత వరగణాలవారికిని గౌరవభావములేదట, వారియందు వీరపురుషచిహ్నములడుగంటినవట. సిమ్లాలోనుండు సేనావ్యవహారదక్షులు మద్రాసుప్రజలయందు నిరసనభావము కలవారగుటవలన చెన్నపురిరాజధానిలో దండుకొలువునకు మనుష్యులను వెదుకుట యనావశ్యకమని నిర్ణయింపబడెను. ఎనిమిదికోట్ల జనసంఖ్యగల బంగాళా రాజధానియందువలెనే నాలుగుకోట్ల జనసంఖ్యగలచెన్నపురిరాజధానియందును మచ్చునకైన నగ్రజాతులవారు సైనికులుగ నుండదగరని సిమ్లాశాసనము బయలువెడలి విజృంభించుచున్నది. ఇప్పుడిండియాపటాలములలో చేర్చుకొనబడుచున్నవారు పఠానులు, సీక్కులు, డోగ్రాలు, రాజపుత్రులు, ఘూర్కాలు, పంజాబీ మహమ్మదీయులు. మధ్య హిందూస్థానమున కొందరు కిరాతులకును, చెన్నపురిలో (పరయాలకును)క్రైస్తవులకును కొంతవరకవకాశముకలదు. లార్డు రాబర్ట్సుగారి మనోరథ మీడేరినను, దానివలన నిపుడు కొంతకష్ట మారంభమయినట్టులు గనుపడుచున్నది. సిపాయీలకిచ్చు తొమ్మిదిరూప్యముల సంబళము చాలకున్నదని యధికారులు గ్రహించిరని తోచు

చున్నది. రాజపుత్రులు, ఉత్తరహిందూస్థానపు అగ్ర జాతులవారు బ్రాహ్మణులు, పండాలు పటాలపుగొలువు నకిపు డాసింపకున్నారట. కావున సిపాయీల కొరకు పఠాణ్, ఘూర్కా ప్రజలలోను, సిక్కు, పంజాబీ, మహమ్మదీయులలో నిపుడు వెదకులాడవలసి వచ్చుచున్నది. సిక్కులుకూడ ధనార్జనపరులై నెలకెక్కువజీతము దొరకు పోలీసు, రెయిల్వేపనుల నపేక్షించుచున్నారని సిడ్నేలో దొరగారు వ్రాసినారు. మహారాష్ట్రులు క్షుద్రమనుష్యులనియు, తెలుగువారు పిరికిపందలనియు, సిక్కులు ద్రవ్యాపేక్షపీడితులనియు, బంగాళీలు నైజభీరువులనియు నందరిని విడనాడి యుత్తరహిందూస్థానపు ప్రజలను, పశ్చిమోత్తర హిమవత్పరిసర ప్రజలుమాత్రమే కుమారసమానులని భ్రమసి, కోట్లకొలది జనుల కారోపించిన దోషము సరికాదని దేశపరిపాలకులు గ్రహించుకాలము వచ్చుచున్నది. కావున విసుగులేక నమ్రతతో నహేతుకముగజేయు మనవుల నాలకించి, యన్యాయమును క్రమముగ నవరించి యర్హస్వాతంత్ర్యములకు తమ ప్రజలకు నిలుపు స్వభావముకల యాంగ్లేయ ప్రభువులు తెలుగుదేశీయులకు సైనికవృత్తిని పునరుద్ధారణముచేయుట నిశ్చయము. దానికి గొంతకాలము గడువవలెను. జనులు పూనిక విడువక విన్నవించుచు విషయము నధికారుల జ్ఞప్తియందుంచవలెను.

## *దేశభక్తి.

[అత్తిలి సూర్యనారాయణగారు.]

మ॥ ఇది నాదేశము నాక యెన్నఁ డొకమాటేనిన్ మనం బందు స
మ్మద మందన్ దలపోయ నట్టిఁడు ధరామధ్యంబునం గల్గునే?
పదముల్ లాతివిలాతులం దిరిగి స్వావాసోన్ముఖం బైన చో
హృదయం బంతరమందుఁ బ్రోజ్జ్వలత నేయిం తైనఁ జింతింపఁగాఁ
బొదలన్ నేరకయున్న మానవుఁడు నీభూమండలిం గల్గునే?
మది నూహింప నొకండు గల్గినను బొమ్మా! వాని నీక్షింపుమా!
ముద మొప్పార నొకండు వాని నిల నింపుం బెంప నగ్గించునే?
విదితం బైనను బేరు, పెన్బిరుదముల్ పెక్కుల్ ప్రవర్తిల్లినన్;
దుద ముట్టన్ ఘనసంపదల్ వెలసి యెందున్ బొందినన్, స్వార్థదు
ర్మదుఁ డౌదుష్టుఁడు కీర్తిహారుఁడయి గోత్రం జచ్చి రెండింటఁ, దా
మొదలన్ బుట్టిన బూదెలోనికిని బోవున్, మోదఖేదంబులన్
గదియన్ నేరక యిద్ధరాజనులు, లోకం బందు నావంతయున్ ॥

*సర్ వాల్టరు స్కాటు పద్యావళి ననుసరించి యాంధ్రీకరింపఁబడినది.

# ఆంధ్రదేశపు శ్రీవైష్ణవులు – వారి కొడిభేదములు.

[ఇ॥ వే॥ లక్ష్మీనృసింహాచార్యులు గారు, ఎమ్. ఏ., ఎల్. టి.]

భగవద్రామానుజాచార్యులువారు దిగ్విజయము నకై కాశ్మీరము మొదలగు నుత్తరదేశములకు వేంచేసి తిరిగి తమదేశమునకు వచ్చునపుడు శ్రీకూర్మము సింహాచలము మొదలగు తెలుగుదేశములోని క్షేత్రములను సేవించి తమ ప్రభావమువల్ల నచ్చటి వారిని తమ శిష్యులగా జేసికొని శ్రీవైష్ణవమతమును స్థాపించిరి. ఆ కాలమందును నటుతరువాతను ననేకులు జమీందార్లు, ధనవంతులు, బీదలు వివిధ వర్ణములనుండి వైష్ణవమతము నవలంబించి యుజ్జీవించుచుండిరి. నాటనుండియు ధనవంతులు భక్తిపూర్వకముగా సమర్పించిన యగ్రహారములయందుగాని, దివ్యక్షేత్రములయందుగాని వసించుచు నుభయవేదాంత ప్రవర్తకులై (ఉభయవేదము లనగా సంస్కృత ద్రవిడవేదములు) వైష్ణవమతమును వృద్ధిజేయుచు ననేక శ్రీవైష్ణవబ్రాహ్మణు లీదేశమునలంకరించుచుండిరి. కాని కాలక్రమమున వీరియందు విద్యలుక్షీణించగా పూర్వపుటేర్పాటులు మాఱి కొడిభేదములనే శాఖాభేదములు బలపడినవి. "స్వమత స్థితైరపి సమం ప్రాయేణ నాశ్నాత్యసౌ" అని వేంకటాధ్వరి చెప్పినట్లొకరితో నొకరు భోజనప్రతిభోజనములు సహితమిప్పుడు వీరు మానుకొన్నారు. క్రొత్తగా వైష్ణవమతము నవలంబించినవారిని ప్రాతవారు వారిలో జేరనీయకున్నారు. ఈ క్రొత్తగా చేరినవారు వారితరువాత వారిని వారిలో కలుపుకొన నిష్టపడలేదు. ఈవిధముగా ననాదివైష్ణవులు, మధ్యవైష్ణవులు, నూతన వైష్ణవులు, నిష్టిపొందినవారు, నిష్టిపొందనివారు, సమాశ్రయణమైనవారు, కేవల తిరుమణి ధారులునని వైష్ణవులనేక భేదములుగా నున్నారు. ఈ భేదములీదిగువ వివరింపబడుచున్నవి.

ఆంధ్రులు, ద్రవిడులునని యాంధ్రదేశములోని శ్రీవైష్ణవులలో రెండు పెద్దశాఖలుగలవు. ఇందు ద్రవిడులలో, కేవలద్రవిడులు, తూర్పునాడులు, ఆరామద్రవిడులునని మూడు భేదములున్నవి. కేవలద్రవిడులలో నఱవము మఱచినవారు మఱవనివారు నను భేదములున్నవి. అఱవమురానివారు వారిలో వారే యీదేశములో సంబంధములు చేయుచున్నారు. అఱవము మఱవనివారు సాధ్యమైనంతవఱకు దాక్షిణాత్యులతో సంబంధములు చేయుచున్నారు. వీరుభయులకు నచ్చటచ్చట సంబంధములు కలిసియున్నను భోజన ప్రతిభోజనములు లేవు. ఆంధ్రదేశమందలి శ్రీవైష్ణవులలో వీరిరువురియందే తెంగలి వడగలి భేదము కనబడుచున్నది. మిగిలిన శ్రీవైష్ణవులందరు తెంగలులుగానేయున్నారు. అఱవములో తెన్న నగా దక్షిణము, వడయనగా నుత్తరము, కల్లనగా వేదమనియర్థము. తెంగలులకు దక్షిణవేదమందనగా ద్రవిడవేదమం దభిరుచి హెచ్చు. వడగలులకు నుత్తరవేదమందనగా సంస్కృతవేదమం దాదరము మెండు.

తూర్పునాడులు తూర్పినాలనే యఱవగ్రామము నుండి యీదేశమునకు వచ్చినామని చెప్పుచున్నారు. వీరి కఱవమురాదు. కాని వీరిస్త్రీలు ద్రవిడస్త్రీలవలె వస్త్రధారణము జేయుచున్నారు.

ఆరామద్రవిడులనగా తోట యఱవలు. వీరిస్త్రీలాంధ్రస్త్రీలవలె వస్త్రములను ధరించుచున్నారు. వీరికి కూడ నఱవమురాదు.

ఈ మూడుశాఖలవారు గాక మంగలంపాటివారు మున్నగు మఱికొన్నిశాఖలు ద్రవిడులలోగలవు.

ఆంధ్రులలో ముఖ్యభేదములు వెలనాడులు, వెలనాటి నియోగులు, ప్రథమశాఖలులేక యాజ్ఞవల్క్యులు, గోలకొండవ్యాపారులు లేక తెలగాణ్యపు నియోగు లనునవి. వీరిలో నొక గోలకొండవ్యాపారులు తప్ప మిగిలినవారు వారిశాఖ యిదని చెప్పరు. "మేము శ్రీవైష్ణవులము. ఆంధ్రులము" అని మాత్రము చెప్పుచున్నారు. వారి కొడి తెలుసుకొనవలె నన వారియింటిపేర్లను బట్టియే తెలుసుకొనవలెను.

ఈ కొడులలో వెలనాడులు వెల్నాటి నియోగులు లెక్కువ సంఖ్య కలిగియున్నారు. యాజ్ఞవల్క్యులు విరళముగా నున్నారు. వెలనాటి నియోగులలో వైష్ణవ మిది వఱకును వృద్ధిపొందుచున్నది. వీరిలో కొందఱు రామానుజకాలమునుండి శ్రీవైష్ణవులుగానున్నారు. మఱికొంద ఱటుతరువాత కలిసినవారు. ఇప్పుడు కొందఱు కలియుచున్నారు. ఇందుచేతనే యొకభాగములో నున్నవారింకొకభాగములో నున్నవారితో సంబంధములు చేయుట లేదు. అక్కడక్కడ సంబంధములు కలిసినవని వారికి తెలియజేసినను "అదేమో మాకు తెలియదు" అనియనెదరు. శ్రీవైష్ణవులుగాక, వెల్నాటి నియోగులలో సమాశ్రయణము పొందక తిరుమణిధారులుగా కొందఱున్నారు. వారు శ్రాద్ధములయందు స్మార్తులను భోక్తలగా నిమన్త్రణ జేయుచున్నారు.

గోలకొండవ్యాపారు లిటీవల వైష్ణవమతము నవలంబించినవారు. వీరిలో వైష్ణవము పుచ్చుకొన్న వారు పుచ్చుకొననివారని రెండు విధములు. వైష్ణవము పుచ్చుకొన్న వారు మీసములు తీసివేయుచున్నారు.వీరు మీద చెప్పిన శ్రీవైష్ణవులను శ్రాద్ధములయందు భోక్తలగా నియమించుచున్నారు. బర్హాంపురం మొదలగు కొన్నిస్థలములయందున్న వీరిలో కొందఱు ద్రవిడవేదమును బాగుగ నభ్యసించి శ్రీవైష్ణవ మతాచారములను జక్కగ ననుష్ఠించుచున్నారు. ఈకొడిలో భోజనప్రతిభోజనములు సర్వత్ర లేకపోయినను సంబంధములు చేయుచున్నారు.

ఆంధ్రులలో పైజెప్పిన భేదములుగాక మఱికొన్ని యవాంతర భేదములున్నవిగాని యాశాఖలపేర్లు లేఖకునకు లభ్యము కాలేదు.

తెలుగుబ్రాహ్మణులలో రామానుజమతము నవలంబించక వైష్ణవమతము నవలంబించిన రెండు శాఖలు గలవు. ఇవి రామానుజాచార్యులవారిచే నంగీకరించబడినవి. ఇవి పంచరాత్రము వైఖానసమనునవి. ఈ శాఖలవారు పంచరాత్రులు వైఖానసులునని పిలువబడుచున్నారు. పంచరాత్రులకు ప్రమాణము పాంచరాత్రాగమము. వైఖానసుల సూత్రము విఖనస ఋషి ప్రోక్తము. వీరిరువురు దేవాలయములయం దర్చన చేయుచున్నారు. పాంచరాత్రులు సమాశ్రయణ మగుచున్నారు. వైఖానసులు సమాశ్రయణము చేసుకొనరు. దానికిబదులు గర్భ చక్రాఙ్కితము చేసుకొనుచున్నారు. గర్భ చక్రాఙ్కిత మనగా శిశువు గర్భమందున్నప్పుడు తల్లి చక్రాఙ్కితమగుటచే పవిత్రమైన తీర్థమును త్రాగుట. సమాశ్రయణ మనునది బాలురకుపనయనమైన తరువాతను, స్త్రీలకు వివాహమయిన తరువాతను గురువు తప్తములైన శఙ్ఖచక్రములతో కుడిమెడమ భుజముల నఙ్కితము చేయుట.

శ్రీవైష్ణవులలో ముఖ్యమగుభేదములు వెనుక వివరింపబడినవి. ఆచట జెప్పిన కొడులలో నొక కొడివారింకొక కొడివారితో సంబంధములు భోజన ప్రతిభోజనములు లేవు. ఒక కొడిలోకూడ నవాంతరభేదము లేర్పడియిచ్చి పుచ్చుకొనుట మొదలగునవి లేవు. ఇట్టిభేదములు వెల్నాటి కొడియందు మెండు.

ఆంధ్రదేశమందు శ్రీవైష్ణవులసంఖ్య తదితర బ్రాహ్మణుల సంఖ్యకంటె చాలతక్కువ. అయినను వీరియందిన్ని భేదములున్నవి. ఈభేదములు మతోద్ధారకులగు రామానుజాచార్యులవారి కభిమతములుకావు. వారు వర్ణాశ్రమధర్మముల ననుష్ఠింపవలెనని బోధించిరిగాని వారిమతము నవలంబించిన బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులలో నవాంతరభేదముల నంగీకరించలేదు. భిన్న శాఖలవారికి సంబంధములుకూడ సమకూర్చియున్నారు.

ఇట్టి సందర్భమందు నాంధ్రదేశమందున్న శ్రీవైష్ణవు లొకరితో నొకరు భోజన ప్రతిభోజనములు సంబంధములు చేసుకొనకపోవుటకు తగినకారణములు కనిపించవు. అట్టికారణములు లేనప్పుడు వీరందఱును కలిసి భోజనములు చేయుటయు సంబంధములు చేసికొనుటయు మంచిదని తోచుచున్నది. ఇట్లు చేసినయెడల శ్రీవైష్ణవులు ముందు ముందు వృద్ధిపొందుట కవకాశము లెక్కువ యేర్పడగలవు. కాన వీరిలో పెద్దలుచేరి తగిన యుపాయములను చింతింతురుగాక యని ప్రార్థన.

# ఆంధ్రదేశపు వ్యవసాయాభివృద్ధి.

[ గోటేటి జోగిరాజుపంతులుగారు. ]

హిందూదేశమందలి తక్కిన భాగములందువలెనే మన యాంధ్రదేశమందును వ్యవసాయము, ఇంగ్లాండు జర్మ అమెరికాలోని సంయుక్తరాష్ట్రములు మొదలగు దేశములలో నున్నంత యభివృద్ధిగ లేదు. ఒక యెకరము భూమినుండి యాదేశములందు రైతులు దీయుచున్నంత లాభమిా దేశపు రైతులు దీయలేకున్నారు. ఆదేశములందు రైతులు విద్యావంతు లగుటచే దమ వ్యవసాయపు పద్ధతులను శాస్త్రజ్ఞుల సహాయముచే కాలాను గుణముగ మార్చుకొనుచు, పంటల నభివృద్ధి చేసికొనిరి. దొరతనమువారుగూడ మిగుల తోడుపడుచుండిరి.

మనదేశమునందు, రైతులలో జాలమంది విద్యలేనివా రగుటచే దమంతట దాము వ్యవసాయాభివృద్ధి మార్గములను గనుగొనుటకు సమర్థులుగారు. కావున వారిని విద్యావంతులుగఁ జేయువరకును, దొరతనము వారును, నితర ధనికులును, విద్యావంతులును నీ పనికి బూనుకొనవలసి యుందురు. మొదట నిప్పటి వ్యవసాయపద్ధతులను బాగుగ బరిశోధించి వానియందలి లోపములేవయిన నున్న యెడల గనిపెట్టవలెను. పిమ్మట నాలోపములకు దగిన ప్రతీకారములను గనుగొనవలెను. ఇదివరకు దీయు దానికంటె నెక్కువ ఫలమును దీయుటకు తగిన క్రొత్తయుపాయములను గనిపెట్టవలెను. ఇట్లు కనిపెట్టిన క్రొత్త పద్ధతులను రైతులందరకును వెల్లడిచేసి, సహేతుకముగ వానిమంచిచెడ్డలను బోధించి, వారాక్రొత్తపద్ధతుల నవలంబించునట్లు చేయవలయును. ఇదిగాక యొకప్రదేశమునందలి మంచిపద్ధతులను గురించి మరియొక ప్రదేశపు రైతులకు దెలిపి వారిచే నవలంబింపఁబడునట్లు చేయుటవలన గూడ గొంత ప్రయోజనముండును.

దొరతనపువా రిదివరకే వ్యవసాయాన్వేషణాశాల నొకదానిని కోయంబత్తూరునందుస్థాపించి యున్నారు. చామర్లకోట, అనకాపల్లి, నంద్యాల, బళ్లారి మున్నగుచోట్లగూడ వ్యవసాయ పరీక్షా స్థానములను ఆ చుట్టుపట్టులనున్న వ్యవసాయ పద్ధతులనుగ్రహించి వానికంటె లాభకరములగు వానిని గల్పించుటకు యత్నించుచున్నారు. కాని రైతు లనేకశతాబ్దములనుండి, అనుభవముచే ననుకూలమని నిశ్చయించుకొన్న పద్ధతులను సంస్కరించుట గాని, వానికంటె ననుకూలమగు క్రొత్త పద్ధతులను గనుగొనుట గాని, దొరతనమువారి యుద్యోగస్థులకును ఇట్లే కృషిచేయుచున్న యితరులకును ఎంత శాస్త్రజ్ఞానమున్నను, తగినంత యనుభవము లేకపోవుటచే సులభసాధ్యముగ లేదు. అయినను, ఇంతవరకు కనుగొనబడిన యీదిగువ వ్రాయబడువిషయములచే వారుపడుచున్న పాటునకును, వారు వెచ్చించు ధనమునకును దగిన ప్రతిఫలమని యెంచదగియున్నది. ముందుముందనుభవ మెక్కువయిన కొలదిని ఉపయోగకరములగు క్రొత్తపద్ధతు లనేకములు కనుగొన బడునునుటకు సందేహము లేదు.

ఈక్రింద సామాన్య వ్యవసాయపు పనులను నొకటి తరువాత నొకటి యెత్తికొని, వానిలో వేనిని సంస్కరించుకొన వలసి యున్నవో, సంస్కరణ కింతవరకేయే మార్గములు గనిపెట్టబడెనో సంగ్రహముగ వ్రాయబడును.

సాగు.

ఏ సస్యమయినను అదిపైరుచేయబడు నేలను దుక్కి మొదలగు పనులవలన నెంతసమగ్రముగ సాగుచేసిన నంతబాగుగ ఫలించును. అమెరికాలో కొన్నిచోట్ల నేలను తగిన పనిముట్లచే బాగుగ సాగుచేయుచు తేమ

పోకుండ కాపాడుటచే, మిగుల తక్కువవర్షము గురియు చోట్లగూడ మంచిపంటలు పండునట్లు చేయుచున్నారు. మనదేశమునందు నేలను బాగుగ సాగుచేయుటకు తగిన పనిముట్లు లేవు. చాలచోట్ల ఒకనాగటితోనే అన్నిపనులను నెరవేర్చుదురు. అదియయినను చాలచోట్ల చిన్నదిగ నుండుట చేతను, ఎడ్లు బలహీనమయినవిగ నుండుటచేతను తగినంత లోతుగ బోదు. కావున సామాన్యపు నాగటికంటె లోతుగ బోవునదియు, మంటిని ఇంగ్లాండు మొదలగు దేశములలోని నాగళ్ళవలె బాగుగ దిరుగవేయునట్టియు నాగళ్ళను కూర్చుకొని మంచిమెడ్లను సంపాదించి దుక్కి బాగుగ దున్నవలెను. బళ్లారిజిల్లాలో పెద్దమడకయను మిగుల స్థూలమగు నాగటికి బదులు మాస్సీకంపెనీ వారిచే జేయబడిన యొక పెద్ద యినుపనాగలి ప్రత్తిరేగడి నేలలను దున్నుటకు మిగుల నుపయోగకరముగ నున్నది. ఈనాగలి 4, 5 ఎడ్లచే లాగింపబడును. బళ్లారి జిల్లాలో చాలమందిరైతులు దీని నుపయోగించు కొనుచున్నారు. నేలలను లోతుగ బెల్లు విరువవలసి నపుడీ నాగటితో నేలను దున్నుటవలన బెల్లువిరుచుట కయినంతవ్యయ మవసరముండదు. (దొరతనమువారి వ్యవసాయ శాఖచే ప్రచురింపబడిన 1911 సంవత్సరపు 7 వ కరపత్రమును జదువుడు.) సామాన్యపు దుక్కికిగూడ కొన్ని యినుపనాగళ్లు చేసి యమ్మబడుచున్నవి గాని, చౌకగ దొరకు వానిలో బాగుగ పనిచేయునవింకను లభించుటలేదు. రైతులకు సామాన్యోపయోగమునకు బాగుగ బనిచేయు నినుపనాగలి నెవ్వరైన గనిపెట్టి సులభమైనవెలకు దయారుచేయించి యమ్మిన బాగుగనుండును. శివగిరి సంస్థాన క్షేత్రమునందు చేయబడి విక్రయింపబడుచున్న నాగళ్లు తేలిక వెలలకును, మధ్యరకపు ఎడ్లకును అనుకూలముగ నున్నవి.

బళ్లారి, కడప మొదలగు జిల్లాలలో నుపయోగింపబడు గుంటకగొర్రుమొదలగు పనిముట్లు నితరచోట్లగూడ నుపయోగించుట మంచిది.

### ఎరువు వేయుట.

ఎరువువేసిన యెడల నెక్కువపంట పండునని యెరుగని రైతులేడు. కాని, పొలమున నేలేట నైదవభాగము నైనను బలపరచ గలుగుచున్న రైతులు మిగుల తక్కువ.

విడికొట్టపు పద్ధతిగాని, పాడిమంటి పద్ధతిగాని యవలంబించి రైతు తన పశువుల మల మూత్రములను శ్రద్ధతో జాగ్రత్తచేయుట కారంభించిన యెడల ఇప్పుడు రైతులు పోగుచేయుచున్న ఎరువుకంటె సారవంతమగు నెరువు రెట్టింపునకు పైగా లభించును. (దొరతనమువారి వ్యవసాయశాఖచే ప్రచురింపబడిన 1911 సంవత్సరపు 14 వ కరపత్రము చూడుడు.) ఉలవలు మొదలగునవి దాణగవేయు పశువుల మలమూత్రములు సామాన్యపు మేతదినువాని మలమూత్రములకంటె నెక్కువ సారవంతము లగుటచే, మరింతశ్రద్ధతో జాగ్రత్తచేయబడవలయును.

జనుము, మొదలగు సస్యములను పెంచి వానిని పచ్చిఎరువుగా నుపయోగించుట నేలను బలపరచుటకొక సులభమైన మార్గము.

చౌకయగు సామాన్యపు ఎరువులు, దొరకనప్పుడు వానికి బదులుగా ఆముదపుపిండి, వేపపిండి, ఎముకల పొడి, చేపలయెరువు మొదలగు ప్రత్యేకపు ఎరువులను, వీలుచొప్పున నుపయోగించి, విలువగల పంటలను పండింపవచ్చును. కృష్ణా గోదావరీ డెల్టాలలో పాటిమన్నరుదగుటవలన దానికి బదులుగ నుపయోగింపదగిన యెరువులు కొన్ని దొరతనమువారిచే పరీక్షింపబడి ప్యారీకంపెనీవారిచే నిడదవోలులోను బెజవాడలోను, వారియెరువు డిపోలలో నమ్మబడుచున్నవి. (1911 సంవత్సరపు 14 వ కరపత్రము చూడుడు.)

### ప్రవర్ధనము.

'విత్తుకొలదిమొక్క' యని సామెత. విత్తుమంచి వంగడము గలదియు ఆరోగ్యమయినదియు, స్ఫుటమయినదియు గానియెడల దానినుండిపుట్టు మొక్క ఆరో

గ్యముగను బలముగను పెరిగి తగినంత ఫలము నీయజాలదు. కావున రైతు లేటేట తమసస్యములందు నెక్కువ పెరుగుచున్న మొక్కలనుండియు పెద్దవెన్నుల నుండియు ఏరుచు, వానినిమాత్రమే చల్లుచున్నయెడల పంటకొంతవరకు పెంపగును.

మొదటనారుపెంచి పిమ్మట నామొక్కలనుదీసి యూడ్చు వరి, చోడి మొదలగువానివిత్తులను, నారుమడి బాగుగ బలపరచి, పలుచగ చల్లవలెను. పిఠాపురం మొదలగు గ్రామములలో రైతులు వడ్లను నారుమడిలో ఎకరమునకు 80 మొదలు 100 కుంచములవరకు చల్లుదురు. నారొత్తుగ మొలుచుటచేసన్న గిలిపీచువలె నుండుటచే ఒక యెకరముభూమి నూడ్చుటకు 8 మొదలు 10 కుంచముల నారువరకు పట్టును. పిఠాపురమునందలి శ్రీరాజావారి పొలములో ఎకరమునకు 40 కుంచములు మాత్రమే చల్లుటవలన 3 కుంచముల నారుతోనే 1 ఎకరము నూడ్చబడుచున్నది. మిగుల ననుకూలముగ నారెదిగినచోట్ల నెకరమునకు రెండుకుంచముల నారే సరిపోయెను. ఇట్లు తక్కువవిత్తులు పట్టుటచే గలుగు లాభమేగాక మొదటినుండియు మొక్కలు బలముగ బెరుగుటచే పంటయు నెక్కువ పండును.

నారును కుచ్చులుకుచ్చులుగా నాటక ఒక్కొక్క మొక్కనే యూడ్చుట లాభకరమని అనేకచోట్ల పరిశోధనలవలన నిశ్చయింపబడెను. కృష్ణా గోదావరి జిల్లాలలో కొన్ని తాలూకాలలో నొక్కొక్క మొక్క నూడ్చుటయె వాడుక. ఆజిల్లాలలో తక్కిన భాగములందును, నితర తెలుగుజిల్లాలలోను, 2 మొదలు 6 వరకు ఊడ్చుచుందురు. ఇదిమాని యందరును ఒక్కొక్క మొక్కనే యూడ్చు నలవాటు చేసికొనవలెను. భూమి సారములేని దయినను, మొక్కలను దగ్గరదగ్గర నూడ్చుట మంచిది గాని యొక్కొక్కటికంటె నెక్కువ నాటకూడదు. 20, 30 మొక్కల నొకచోటనే నాటు దురాచారము విశేషముగల దక్షిణజిల్లాలలో నిట్లొక్కొక్క మొక్క చొప్పున నూడ్చుటవలనగలుగు లాభములు రైతులకు మిగుల స్పష్టమగుచున్నవి. చాలమంది నూతనపద్ధతి నవలంబింప జొచ్చుచున్నారు.

నీరు కట్టుట.

నీరుపెట్టి పైరుచేయు సస్యములకు మళ్ళను చదునుగచేసి అంతటను సమముగ నీరానునట్లు చేయుట కొంతశ్రద్ధచేసినను చేయవలసినదే. ఈపనిచేయక పోవుటవలన రైతులు తాము కొనుదానికంటె నెక్కువ నష్టమును పొందుచున్నారు.

నీరేసస్యమున కెపుడెంత కట్టవలెనో శోధనచేసి అంతేగట్టుచుండుటకు యత్నింపవలెను. వరిచేనుకయినను, నీరెక్కువగాగట్టుట మంచిగాదు. ఎక్కువగట్టుట వలన గలుగు నష్టమును రైతులుచాలమందికినాటలేదు.

దొరతనమువారును, జమీందార్లును, చెరువులు మొదలగు జలాధారములను నిర్మించి తమరైతుల స్థితిని బాగుపరచుటకు యత్నించుచుండవలయును. రైతులు నూతులు త్రవ్వి వానిక్రింద చెరకు, అరటి, పసపు, మిర్చి మొదలగు విలువయైన సస్యములను పైరుచేయుటకు ప్రారంభింపవలెను. దొరతనమువారు ఇట్టి పనులకు సులభమగువడ్డికి బదుళ్ళ నిచ్చుటకుగూడ ఏర్పాట్లుచేసియున్నారు. జమీందార్లును తమరైతుల కిట్టి సహాయము చేయుట యుక్తము.

నీరు తగినంతగ నుండు నూతులనుండియు నితరజలాశయములనుండియు నీటిని పైకి తోడుటకు ఈమధ్య ఛాటర్టన్ దొరవారిచే వ్యాపకములోనికి దీసికొనిరాబడిన తైలయంత్రములును మధ్యావర్తన జలోద్ధారకయంత్రములును, మిగుల నుపయోగ కరముగ నున్నవి. అవి మోటకంటె తక్కువ వ్యయముతో పైకితోడును.

పదియైదడుగులకంటె లోతుగనుండు సామాన్యపు నూతుల నీటిని తోడుటకు మోటయు, 15 అడుగులకంటె తక్కువ లోతుగానుండు నూతులకు ఏతమును అనుకూలముగనుండును. ఇతర సాధనములింతకన్న ననుకూలములుకావు. కావున వానినిగొనుట మంచిది గాదు.

Beautiful Carvings on Pillars at Rameswaram.
Representing Lakshmi carrying Shiva.



రామేశ్వరమునందలి చిత్ర చిత్రిత మంటప స్తంభములు.
శ్రీదేవి మహాదేవుని వహించునటులు చెక్కబడినది.

The Eastern Gopuram at Sreerangam.



శ్రీరంగము తూర్పు గోపురము.

The Southern Gopuram at Tadpatri.



తాడిపత్రి, రామలింగేశ్వరస్వామి దక్షిణ గోపురము.

Ramalingeswara and Laxmi Temples at Tadpatri



శ్రీ రామలింగేశ్వర లక్ష్మీదేవాలయములు, తాడిపత్రి.



Temple of Ranganatha Swamy, Nellore    శ్రీ రంగనాథస్వామి దేవాలయము, నెల్లూరు,



Temple of Kapoteswara at Chezarla Krishna District. కృష్ణామండలము, చేజర్ల,

The Shrine of Nagur Kadir Saheb, Nagapatnam.



నాగపట్నము, నాగూరు కాదిరుసాహెబు పంజా.

Sreerangapatam, Juma Masjid built by Tippu Sultan.



శ్రీరంగపట్నము, టిప్పుసుల్తాను కట్టించిన జూమామసీదు.

మిగుల తక్కువ లోతుననుండి, (3,4 అడుగులు) నీరుతోడుటకు గోదావరిజిల్లాలో విశేషముగ వాడబడు కారెము మిక్కిలి అనుకూలమయినది. ఈసాధనము నుతక్కిన జిల్లాలలో చాలమంది ఎరుగరు. రాజమహేంద్రవరమునకు సమీపముననున్న కడియము అను గ్రామమున, చేయబడి యమ్మబడుచున్న యినుపకారెము దోనెలు మిగుల తేలికగా నుండుటచే నొకమనిషియే దానితో నీటిని దోడవచ్చును. వానిని విరివిగ వాడుట మంచిది. ఒక్కొక్క కారెము దోనె రమారమి ఎనిమిది రూపాయల వెలకమ్మబడుచున్నది.

ఉత్తర కృషి.

పశువులచే లాగబడు పనిముట్లచే చేలలో గడ్డి గాదములు లేకుండ జేయుటకును మొక్కల మధ్యస్థలములను గుల్లగ జేయుటకును వీలుగ నుండునట్లు పైరును వరుసలుగా వేయుట మంచిది. కడప, కర్నూలు, బళ్లారిమొదలగు కొన్ని జిల్లాలలో జొన్న మొదలగు విత్తులుగొర్రుతో వరుసలుగ చల్లబడును. ఉత్తర సర్కారులో నొక గుంటూరు జిల్లాలోను, కృష్ణాజిల్లాలోను కొన్ని చోట్లనుతప్ప తక్కినచోట్ల గొర్రు వాడుకలో లేదు. సామాన్యముగ తేలిక నేలలోను, దుక్కివలన మృదువుగ చేయబడిన నేలలోను గొర్రు నుపయోగించుటకు వీలుపడును. కావున సాధ్యమయినంతవరకు గొర్రుతోనే మెట్టసస్యముల విత్తులచల్లుటకు రైతులు యత్నింపవలెను.

వరుసలుగా పైరుచేయబడు సస్యములలో నాగలి, మెట్లగుంటక, దంతులు మొదలగువాని నుపయోగించి త్రవ్వుకోల మొదలగు చేతిపనిముట్లతో గొప్పుత్రవ్వనపుడగు తగులుబడి తప్పించుకొనవచ్చును. ఇందుకు ఇతరదేశములలో వాడుకలోనున్న ప్లానెట్ జూపిటర్ హో మొదలగు కొన్నిపనిముట్లు ఈదేశపు పనిముట్లకంటె శ్రేష్ఠములుకాని, వానివెలలు హెచ్చుగ నున్నవి.

విత్తులు చల్లిన వెంటనే పెద్దవర్షము కురియుటచే నేలపైన పెట్టుగట్టిపోయిన పాలూరు వ్యవసాయస్థానమునం దమ్మబడు త్రికోణపుపండ్లచట్టమను పనిముట్టుపైని తోలుటకు మిగుల ననుకూలించును. మొక్కలు మొలచిన వెనుకగూడ నవిజేనెడెత్తెదుగువరకు దీనితోలిపైపెట్టు కదల్పవచ్చును. (1912 సంవత్సరపు వ్యవసాయ పంచాంగము.)

సస్య సంరక్షణము.

సస్యమును పశువులు మొదలగునవి తినకుండ జాగ్రత్తపెట్టుట యవసరమని యందరికిని దెలిసిన విషయమే. సస్యముల కొక్కొకప్పుడు, ఇట్టిపెద్దజంతువులవలనగాక, కీటకములను చిన్నచిన్న జంతువులచే విశేషహాని గలుగుచుండును. గొంగళి పురుగులు మిడుతలు ఇట్టినష్టములను దొలగించుటకు గూడ రైతు సాధన మెరిగి యుండవలయును. ఈదేశమందు మొన్న మొన్నటి వరకీ విషయమై నెవ్వరును కృషిచేయలేదు. ఈ మధ్య దొరతనమువారి యుద్యోగస్థులు కొందరు కీటకముల స్వభావములను గ్రహించి వానివలని బాధ తొలగించుటకు సాధనములను వెదకు చున్నారు. కొన్నికొన్ని సులభోపాయములను గనిపెట్టి అక్కడక్కడ వానివలననెట్లు చీడబాధనుండి నేలను కాపాడవలెనో రైతులకు జూపుచున్నారు. దక్షిణార్కాడు జిల్లాలో నొకచోట గంటె చేలకు గొంగళిపురుగు పట్ట నారంభించినపుడు పొలములో రాత్రులు దీపములుబెట్టి, ఆగొంగళి పురుగుల తల్లులగు రెక్కపురుగులను వేలకొలదిని ఆకర్షించి జంపుటవలన నాచీడను నివారణ జేసిరి. (1910 సంవత్సరపు 12 వ కరపత్రము జూడుడు.

ఈ మధ్య బొంబాయి రాజధానినుండి బళ్లారి, కర్నూలుజిల్లాలలోనికి మైసూరులోనికిని వ్యాపించిన యొకవిధమైనమిడతలబాధను నివారణచేసికొనుటకు, కొన్ని సాధనములు కనిపెట్టబడెను. జనేవరినెలలో నేలనుదున్ని అందుండు గ్రుడ్లుచచ్చునట్లు చేయుట యొకసాధనము. పైరుమీద గుడ్డసంచులనీడ్చి మిడుతలను పోగుచేసి చంపుట మరియొక సాధనము. ఈసాధనము వలన ఎకరమునకు రు 1-8-0 తో మిడుతలవలన గలుగు అప

రిమిత నష్టమును దొలగించుకొన వచ్చును. (1912 సంవత్సరపు 3కరపత్రము.) ఇట్లె పరికిపట్టు ఏవిలిపురుగులను జంపుటకును, గుడ్డసంచుల నుపయోగింపవచ్చును. కీటకముల విషయమై తెనుగున తగినగ్రంథమింకను లేక పోవుట శోచనీయము.

సస్యములకు జంతువుల వలననే గాక శిలీంధ్రములను సూక్ష్మములగు నుద్భిజ్జములవలనగూడ నష్టము గలుగుచుండును. జొన్నకుపట్టు కాటుక తెగులు, చెరకునకుపట్టు ఎర్రతెగులు మొదలగునవి శిలీంధ్రములవలననే గలుగుచున్నవి. కృష్ణా గోదావరిజిల్లాలలో నీమధ్య వ్యాపించిన తాటిచెట్ల తెగులుకూడ నిట్టిదే. (1911 వ సంవత్సరపు 15 వ కరపత్రము చూడుడు.) ఇట్టి తెగుళ్ళను గలిగించు శిలీంధ్రముల తత్వమును పరీక్షించి వానికి ప్రతీకారములను గనుగొనుటకు దొరతనమువారు కొందరుద్యోగస్థులను నేమించియున్నారు. వారు క్రమముగ నీతెగుళ్ళను తొలగించు సాధనములను గనుగొందురు.

### సస్య సంగ్రహణము.

కోత, నూర్పిడి మొదలగు పనులిందులోచేరినవి. కోతకును నూర్పిడికిని ఇంగ్లాండు అమెరికా మొదలగు దేశములలో యంత్రము లుపయోగింపబడు చున్నవి. కాని ఈదేశములో నిప్పటి పనివాండ్ర వేతనములను బట్టి లెక్కజూచిన యెడల దానినుపయోగించుట లాభకరముగ నుండదని తేలినది. అయినను, వేతనములు క్రమక్రమముగ హెచ్చుచున్నందున అట్టియంత్రముల సహాయము కొంతకాలమునకు కావలసి వచ్చును. కావున సులభముగా పనులనుజేయు యంత్రముల కొరకు వెదకు చుండవలెను.

కొన్ని యితరదేశములలో పండ్లుమొదలగు దినుసులను దూరస్థలములకు గొనిపోవుటకు వీలుగనుండు నేర్పాట్లు చేసి వానివిక్రయమువలన విశేషలాభమును దీయుచున్నారు. అమెరికానుండియు వెస్టుఇండీస్ నుండియు ఇంగ్లాండునకు అనేకలక్షల విలువగల ఫలములు పోవుచున్నవి. మనదేశమునకుగూడ కొన్నిపండ్లు ఆస్ట్రేలియా మొదలగు చోట్లనుండి వచ్చుచున్నవి. మనదేశపు రైతులు విరివిగ తోటలనుపెంచి మామిడి, మొదలగు ఫలములను నితరదేశముల కెగుమతిచేసి లాభము పొందుట నేర్చుకొనవలెను.

వ్యవసాయము వలన తగినంత లాభమును బడయుటకు రైతు పైనవివరింపబడిన పనులందేగాక, ఇసుక బంకమన్ను, సేంద్రియపదార్థములు మొదలగునవి చేర్చుటవలనను, జలనిర్గమము బాగుపరచుటచేతను నేలలస్వభావమును శాశ్వతముగ బాగుపరచుట, బీళ్ళలోను, నితర బంజరునేలలోను తమయిండ్ల కొరకును, పనిముట్లకొరకును నుపయోగించు తాటిచెట్లు, తుమ్మచెట్లు మొదలగు చెట్లను వృద్ధిచేయుట సీమచింత మొదలగు చెట్లను వరుసలుగపెంచి మెరకభూములలో కట్టలేర్పరచుటయు మొదలగు పనులలో రైతు తనబుద్ధికుశలతను జూపవలెను. తనపొలమందు ఏసస్యములను పైరుచేయుట లాభకరమో తెలిసికొని పొలమునంతట నొకేసారి యొకసస్యమేగాని, ఒకేచోట ప్రతియేటను ఒకే సస్యమునుకాని పైరుచేయక, వీలుచొప్పున సస్యములను కూర్చుచుండవలెను. పొలమందంతటను ఒకేవిధమగు వ్యవసాయమును చేయక కొంతభాగమున మెరక వ్యవసాయమును, కొంతభాగమున పల్లపు వ్యవసాయమును, కొంతభాగమున తోటసస్యములను పైరుచేయుచు, తనపనివాండ్రకును పశువులకును, సంవత్సరము పొడుగునను పని గల్పింపవలెను. తానును తనపనివాండ్రును సాధ్యమయినంతవరకు పొలమునందే నివసింపవలెను. బీళ్ళను వదలిగాని, పశువుల మేతదినుసులను పైరుచేసిగాని, పశువులను బాగుగ మేపుచుండుట మంచి రైతుల లక్షణము. ఇప్పుడుకొందరురైతులు ప్రత్యేకము వరిసాగుమాత్రము పెట్టుకొని ఊడ్పుకాలమున పశువులను సంతలలో గొని, ఊడ్పు ముగిసిన వెంటనే వానినమ్మివేసి, ధాన్యములను గడ్డినికూడ విక్రయించి సొమ్ముచేయుచున్నారు. ఇట్టివ్యవసాయము మొదటలాభకరముగ గనబడినను, తుదకు రైతునకు నష్టదాయకము గాక మానదు. ఏలయన నేలనుండి ధాన్యరూపమునసే

గాక గడ్డిరూపమునగూడ సారము విశేషము ప్రతిసంవత్సరమును పోవుచుండును. పశువులు లేమిచే ఇట్లు పోయినసారము వానిమలమూత్రముల రూపముగ నేలకు మరల జేరదు. ఇతర విధములచే నేలకు సులభవ్యయముతో సత్తువ చేయుటకు తగిన యుపాయము లెవ్వియు రైతెరుగడు. కావున క్రమక్రమముగ పంటలు తగ్గిపోవును.

పశువులమందలను వృద్ధిజేసి ఎడ్లను ఆవులను అమ్ముట, ఆవులను గేదెలను పెంచి పాలు పెరుగు మొదలగువాని నమ్ముట, కోళ్ళను పెంచి గ్రుడ్లనమ్ముట, ఆముదపాకులనుదిని పెరుగు పట్టుపురుగులను బెంచి పట్టుదీయుట మొదలగు వ్యవసాయశాఖలను సామాన్యవ్యవసాయమున కనుబంధములుగా నవలంబించి దానివలన గూడ గొంతలాభమును బడయవచ్చును. ఇట్టి వ్యవసాయశాఖలనుగూర్చి విరివిగ వ్రాయుట కిచట నవకాశము లేదు.

రైతు పైవిషయములను బాగుగ గ్రహించి మునుపటికంటె నెక్కువలాభమును దీయవలెనను పట్టుదలతో కృషిచేసిన యెడల తన యభీష్టమును దీర్చుకొనలేకపోడు. ప్రతిపనియును రైతు సాధ్యమయినంతతక్కువ వ్యయముతో నెరవేర్ప యత్నింపవలెను. ప్రతిపనియొక్కయు లాభాలాభములు విమర్శించుకొనుచుండవలెను. ఇంతేల, రైతు తనపనినొక సామాన్యవిధిగా నెంచక, దానియందు నిజమయిన అభిలాషగలిగి తనబుద్ధిసూక్ష్మతను నెలకొలిపి, విసుగుచెందక యావచ్ఛక్తిని వినియోగించిన గాని మంచివ్యవసాయదారుడు కానేరడు. తానే మార్గదర్శకుడగుటవలన నీరైతు లక్షణములను తన పనివాండ్రయందు సైతము పుట్టించి వారిని గూడ శ్రద్ధావంతులుగను, నీతివంతులుగను జేసికొనిన గాని తన ప్రయత్నములు నిరాటంకముగ కొనసాగవు.

చీడపురుగులను, తెగుళ్ళను నివారించుకొనుట, మొదలగు కొన్ని పనులలో నొక్కొక రైతు కృషిచేసిన ప్రయోజనముండదు. అట్టివిషయములలో రైతులకైకమత్యము ప్రాధాన్యము. తమకష్టములను దొరతనపువారికి సంఘముగ దెలిపి, వారివలన సదుపాయములను బడయుటకును ఇతర సాధకబాధకములను గురించి యాలోచించుటకును గూడ ఆవశ్యకము. కావున రైతులు తమలో సంఘముల నేర్పరచుకొని, తమవ్యవసాయాభివృద్ధి మార్గములనుగురించి సంప్రదించుకొనుటయు మిగుల క్షేమకరము.

ప్రకృతిజ్ఞాన సంపాదనకు చదువను వ్రాయను నేర్పుట ముఖ్యసాధనము, కావున రైతులు తమబిడ్డలకు చదువుచెప్పించినయెడల వారయినను, ముందుముందు ప్రకృతిశాస్త్రజ్ఞానమును సంపాదించి వ్యవసాయాభివృద్ధిసాధనములను వెదకుటకు తమంతట తామే యత్నించుటకును దొరతనమువారి యొక్కయు, నితరవిద్యాధికుల యొక్కయు నుద్యమములకు దోడ్పడుటకును సమర్థులగుదురు.

# విదేశములలోని భారతీయులు.

[రివరెండు జి. ఎల్. థామస్సన్.]

ఈకాలమునగూడ హిందువులలో చాలభాగము నౌకాయానము చేయుటకు వెనుదీయుచున్నారు. కనుకనే ఇతరదేశములను గురించి, అచ్చటి చిత్రములను గురించియును వారికంతగా తెలియకున్నది. ఈవిషయములో వీరు ఇతరదేశస్థులను బోలియున్నవారు. ఒక దేశములోని వారు మరియొకదేశమునకు వెళ్లుటకు తగిన కారణము లుండవలయును. అప్పులవారిబాధ, రాజకీయదండనములు, రోగములు, మిక్కుటమగు జనసమ్మర్దనము, విరోధులవలనిభయము, యుద్ధము మొదలగు శక్యముగాని కారణములు లేనిచో, ఒకదేశమువారు మరియొకదేశమునకు జనియుండలేదు. దైవానుగ్రహము వలన కాలము మారుచున్నది ఎచ్చటజూచినను నెమ్మదిగనున్నది. ప్రజలందరును అభివృద్ధికై దారులు వెదకుచున్నారు.

వెంకమ్మ, పుల్లమ్మ కబుర్లతో ప్రొద్దుపుచ్చుచుండెడి పల్లెటూరివారు నయితము, ఆఫ్రికా, అమెరికా, పీనాంగు, బర్మా, ఫిజీలంకలను గురించి మాటలాడగలుగుచున్నారు. ఈస్థితి పరదేశములకు తెగించి వెళ్ళినవారి వలనను, దేశీయపత్రికల వలనను కలిగినది. దేశీయపత్రికలు, ఇతరదేశముల విషయమై, స్వభాషలలో ప్రకటించుటవలన, మూల మూలలవారికి, ఇతరదేశముల సంగతులు తెలియునయినవి. ఇతరదేశములకు వెళ్ళిన హైందవుల విషయమై విపులముగా చర్చించుట కిచట స్థలము చాలదు. వర్తకవ్యాపారముల కొరకును, విద్యకొరకును చాలమంది యూరోపా, జపాన్, మున్నగుదేశములకు వెళ్ళియున్నారు. చాలమంది, ఆఫ్రికా, అమెరికా, పినాంగు, బర్మా, ఫిజీలంకలలో పనిచేయుచున్నారు. వీరు పరరాజ్యములలో ఎట్లు మనుచున్నది ఇంచుక విచారించుటానంద దాయకముగ నుండును.

మనుష్యుని భాగ్యదేవతయన నొప్పు దక్షిణ ఆఫ్రికాఖండమునకు ఇప్పుడు వెళ్ళుట చాలించుకొనినను, ఇప్పటికి అనేకవేల హైందవు లచ్చటనే యున్నారు. అచ్చట తెల్ల నల్ల జాతిభేదము విశేషముగా హైందవులను బీడించుచున్నది. అచ్చటనున్న హైందవులను రెండుతెగలుగా విభజింపవచ్చును. 1.వ్యవసాయకులు, వర్తకులు 2.కూలివాండ్రు. మొత్తముమీదవ్యవసాయకులు మంచియభివృద్ధియగు సంఘముగా నేర్పడియున్నవారు. కూలీలుగా వెళ్ళినవారందరు మొదట తోటలువేయు పనులకో చేరి, అచ్చట పనులునేర్చుకొని, కొంతద్రవ్యము నిలువచేసికొని, పెక్కుమంది యచ్చటనే, స్వతంత్రమైన చెరకు, కూరగాయ కాపులుగ దేశమునంటి యున్నవారు. మిగిలినవారు తమస్వదేశమున కేగుటకు నుచితముగా నియ్యబడిన ప్యాసును వృథాజేయ నిష్టములేనివారగుచు, మాతృదేశము మీది ప్రేమచే స్వదేశమునకు తిరిగి వచ్చుచున్నారు. అయిన బహుమంది వ్యవసాయవృత్తితో భాగ్యవంతులగుచు దేశమును కనిపెట్టుకొని యున్నవారు. వర్తకము చేయువారు సామాన్యముగ మహమ్మదీయులు. వీరు బొంబాయి ప్రాంత్యములనుండి వెళ్ళినవారు. వీరిని దక్షిణాఫ్రికాలో సామియని పిలిచెదరు. వీరిని సాయబు యని పిలుచుట శ్రేయము. కాని చెన్నపట్టణ ప్రాంతముల నుండి వచ్చువారి నామములకు స్వామియను పదము తుదనుండుటచేతను, దక్షిణాఫ్రికా తెల్లవారికి స్వామియని ఉచ్చరించుట కష్టతరముగా నున్నందునను, మొత్తముమీద హిందూదేశమునుండివచ్చు వారినెల్ల సామియని పిలుచువాడుక నొకటేర్పడినది. పట్నములోని టోకుబేరగాండ్ర నుండి వస్తువులుతీసి, చిన్నగ్రామములయందలి చిల్లరబేరములు జరుపుకొనుచు, చివరకు ఉభయులును భాగ్యవంతు లగుచున్నారు. 'ఆరునెలలు సహవాసము చేసినవారు వీరగుదురు' యను లోకోక్తి ననుసరించి, కొంతకాలము, దక్షిణాఫ్రికా యాందోళమునబడి, పూర్వ కులము, ఆచారము విషయమై మరచిపోవుచున్నా

రు. వేరుకొంతమంది హైందవులు, దక్షిణాఫ్రికాలో వేరువేరు భాగములయందును గన్పట్టుచున్నారు. వీరెల్లరు కష్టపడి పనిచేయుచు, స్వామిభక్తి రాజభక్తి గలిగినవారై, మంచివారని దేశమెల్లను పేరుగాంచుచున్నారు.

అమెరికా దేశమందు, హిందూదేశమునుండి వెళ్ళువారికి గోష్పాదమంత భూమికూడ దొరకుట కష్టతరము. ఎద్దియో యొకవిధమున కొన్నివేలమంది వర్తకులుగను, వ్యవసాయకులుగను పనిజేయుచు సంఘీభూత పరగణాలలో నివసించుచున్నారు. వేరు కొంతమంది కెనాడా పశ్చిమ ప్రాంతమునందు పనిజేయుచున్నారు. హైందవు లెచ్చటకు జేరినను, ధనము జేర్చుకొనుచునే యున్నారు. మలేఫెడరేటెడ్డు పరగణాలలోను బర్మాయందును, హైందవులసంఖ్య దినదినాభివృద్ధి యగుచున్నది. అచ్చట బాగుగనే జీవించుచున్నారు. సామాన్యముగ ఈదేశములను రంగూన్, పినాంగు అని పిలుచుచున్నారు. ఫెడరేటెడు మలెపరగణాలలో రబ్బరు పరగణాలలో ముఖ్యముగ పనిజేయుచున్నారు. వారికి పోటీదారులు చీనావారు. వీరు హైందవ పనివాండ్రకన్న ఎక్కువ కష్టపడగలరు. ఎక్కువ నిపుణముగగూడ పనిచేయ గలుగుదురు. కాని వారు ఎక్కువ కూలి కోరుటయేగాక, హైందవులంత విశ్వాసము, ప్రభుభక్తిగలవారు కారు. దేశము చూడదగినది. కొండలు, పచ్చికబయళ్ళు, పైరులు, చెట్లు నేత్రానందమును గాపించును. ప్రతివృక్షమును సొగసుగా పెరుగును. సంవత్సరములో పగలు వేడిగాలి వేసినను ప్రతిరాత్రియును వర్షము కురియుచుండును. పనియును తేలికయైనదే. రబ్బరుచెట్టు బెరడునూడదీసి, దానిపాలను పాత్రలయందుంచి, దానితో రబ్బరు చేయుచుండవలయును. మొగవాండ్రు, ఆడువాండ్రు, పిల్లలును మంచివేతనములనే గైకొనుచున్నారు. అచ్చట మన్యజ్వరముచే లేనియెడల, అచ్చటగలుగు సౌఖ్యమునకును, అచ్చట దొరకు ధనమునకును మేరయేలేదు. హైందవకూలీలు గృహముల రెండవ యంతస్థునందు వసించుచుందురు. అచ్చట గృహములు సౌందర్యమైనవి వేనవేలు గలవు. వైద్యశాలలకు కొదవయేలేదు. ఇన్నియుండినను చాలమంది జ్వరముచేపీడితులగుచున్నారు. కొంతమంది తమ ప్రాణములను జ్వరమున కర్పించుచున్నారు. ఈమాగాణములలోనుండి మన్యజ్వరమును వెడలనడిపిన, ఇంకచాలమంది కూలీలు సులభముగా అచ్చటికిజేరి ధనవంతులగుటకు సందియము లేదు. చెన్నపట్టణమునుండి పినాంగుకు కొలదిరోజుల ప్రయాణమైనందున, సులభముగా పోవుచు వచ్చుచుండవచ్చును. అన్నివిషయముల కూలి గుంపులకు సదుపాయములతో అమరియున్న ఈదేశమున జ్వరరాక్షసి నివసించియుండుట కడువిచారణీయము. బర్మాదేశమునందిట్లుగాదు. అచ్చట ఇంత మన్యజ్వరములులేవు. కనుక వేలకువేలచ్చటికిబోయి నివసించియుండుట యాశ్చర్యకరమైన విషయముకాదు. దేశము చక్కగా నున్నది. ఇంగ్లీషువారు పరిపాలకులగుటచే, నెమ్మదినిషయమై చర్చింప నవసరములేదు. చేతికినిండుగ పనియున్నది. బర్మాకును, దానిదక్షిణమునసుండు మాగాణములకు పోలిక లేకున్నది. బర్మాదేశీయులును, చీనావారును పోటీదారులుగ నున్నను, హైందవులు స్వామిభక్తి, ప్రభుభక్తి గలవారలగుటచే, ధనమును సంపాదించుకొనుచు, ఐశ్వర్యమును బడయుచు, అధికార ప్రాబల్యమునుగూడ గలిగియున్నారు. బర్మాకు ఇంకను వేనవేలు హైందవులు కావలసి యున్నారు. హిందూదేశమునుండి అచ్చటికి వెళ్ళుటకును సంతోషదాయకముగ నున్నది. వెళ్ళినవారు బాగుపడుట కిసుమంతయును సందియము లేదు.

ఆస్ట్రేలియాకు తూర్పుతీరమునకు 1500 మైళ్ళ దూరములో, కొన్నిదీవులు గలవు. అవి సంఖ్యకు రెండువందల ఏబదియున్నవి. అవి ఫీజీదీవులను పేరున నున్నవి. అచ్చటికి వేనవేలు హిందువులు వెళ్ళియుండిరి. ఇంకను ప్రతిసంవత్సరము వేలకువేలు వెళ్ళుచున్నారని వ్రాయుట కెంతయును సంతసించుచున్నారము. ఆ లంకల నివాసులు పనిచేయువారుకారు. వారు వ్యాధిపీడితులుగ నున్నారు. పూర్వము మనుష్యమాంసమునుతినెడిస్వకులహంతకులు. పరమదుర్మార్గులు, నిర్దాక్షిణ్యమూర్తులు. ఇట్టిజాతివారిని కానిబాలులని(Cannibals) ఇంగ్లీషునందం

దురు. క్రైస్తవమతబోధకులవలన, వారు నాగరికులై అట్టి దారుణ కర్మలనాపివేసిరి. ఎట్లయినను వారి జాతి క్షీణించుచున్నది గాని వృద్ధియగుటలేదు. ఈలంకలు చాల సారవంతములయినవి. శీతోష్ణస్థితి విచారించిన మనుష్యులు సుఖముగా పనిచేసికొనుటకుమంచి అనుకూలప్రదేశములు. దేశముచక్కగనుండి నేత్రోత్సవము గలిగించును. ఈలంకలు శాంత మహాసముద్రమునం దున్నవి. ఇట్టిలంకలకు హైందవులు క్రమముగా జేరుచున్నారు. ఇవి 1859 సం॥లో ఇంగ్లీషువారి స్వాధీనము క్రిందికి వచ్చినను, 1875 సం॥ ప్రాంత్యమునుండి వారిసంపూర్ణభుక్తము క్రింద నున్నవి. హిందూదేశము శాంత మహాసముద్రముయొక్క కేక వినుచున్నది. ఇదివరకే అచ్చటికి 40,000 హైందవులు చేరియుండిరి. అచ్చటసర్వవిధముల ప్రోత్సాహముండుటచే, ఏభాగము నుండిగాని, హిందూదేశమునుండి ప్రతిసంవత్సరమును జనులచ్చటికి వెళ్ళుచునే యున్నవారు. హిందూదేశమునందలి పైరులన్నియును, అచ్చట మరింత కోమలముగ పెరుగుచున్నవి. అచ్చట సొగసైన గృహములు గలవు. హిందూదేశము నెరుగని హైందవజాతి వృద్ధియగుచున్నది. వీరు,ఫిజీ ఇంగ్లీషుమాటలు కలిసిన హిందూస్థానిభాష మాటలాడుచున్నారు. ఫిజీలంకల నివాసులు, హైందవులకన్న నెక్కుడు శరీర దార్ఢ్యము గలవారలైనను, నిలువబడి హైందవులతో సమానముగ పనిచేయజాలరు. శరీర కష్టమున కోర్వలేరు. ఇదిగాక ఈసోమారి ఫిజీలు డబ్బుపైమిక్కిలి నిర్లక్ష్యముగా నుందురు. హైందవు డట్లుగాక మితవ్యయుడుగా నున్నవాడు కాన ఇత డచ్చటికి బోయినను జయమే చేకూరుచుండును. హైందవు డాలంకలకు జేరుటకు పూర్వము, చెన్నపురియందుగాని కలకత్తాయందుగాని జరుపబడు శరీరదార్ఢ్య పరీక్షయందు గెలుపు నొందవలయును. లంకలకు జేరినతోడనే ఈసర్టిఫికెటు, అచ్చటివారికి చూపించవలయును. అటుతరువాత ఇతనిని చేర్చుకొన నుద్యమించియున్న సంఘమువారు తిరిగి ఇతని శరీరదార్ఢ్యమును పరిశీలించి, అయిదుసంవత్సరములు తమయొద్దపనిజేయుటకు ఒడంబడికజేసెదరు. ఈ అయిదు సంవత్సరములు గడచిన పిమ్మట, ఇతనికిస్వేచ్ఛనొసంగెదరు. ఇట్టిసమయములో, ఇతని కిష్టమున్నచోటుల వేతనములకు కుదురవచ్చును. ఈపది వత్సరములు గడచిన తరువాత, మాతృదేశమున కుచితముగా దీసికొనిపోవుటకు సెలవియ్యబడును. పది సంవత్సరములు, లంకలలో రుచి మరగిన తరువాత, ఎవరును తిరిగి హిందూదేశమునకు వచ్చుటకియ్యకొనరు. అచ్చట అన్ని విషయములలో ఎక్కువ సుఖప్రదముగా నున్నప్పుడు, తిరిగిదేశమునకు రావలయుననెడి యాశకలిగి యుండుట కష్టము. హిందూదేశమునుండి యాలంకలు 8000 మైళ్ళ దూరములో నున్నవి. ఇచ్చటినుండి అచ్చటికి జేరుటకు మూడువారములు పైనబడును. హైందవులచ్చటికి వెళ్ళుటకు దూరప్రయాణ మొక పెద్ద కష్టమయియున్నది.

మాతృదేశమునకన్న మిన్నయగు నది మరియొకటిలేదు. జయింపరాని కొన్నికారణములుండి యుండిననేగాని స్వదేశమును వదలగూడదు. శరీరకష్టమునకు వెనుదీయక, మర్యాదస్థుడుగానుండి, విశ్వాసము, రాజభక్తిగలవాడిండియాను ఏల వదలవలయును? విద్య గలిగియుండియును, కష్టించి పనిచేయుట కిష్టములేనియెడల వానికి పరువు ప్రతిష్టలురానేరవు. ఇతర దేశములకు వెళ్ళువారు పనిజేయుట కిష్టములేని వారగుదురేని, మాడి చావవలసి యుండును. లేనియెడల, అడుగుకొని తినవలయును. అట్లుగానియెడల దొంగతనముచే బ్రదుకవలయును. విద్యావంతుడయిన వాడు తానుపని జేయ ప్రారంభించిన కొలదికాలములో ఇతరులచే పని చేయించువాడగును. హిందూదేశమందుగాని, మరియితర చోటులగాని, మర్యాద, విశ్వాసము, ఓర్పు, మితవ్యయము మొదలగు సద్గుణములచే నలరారుచు, ముందువెనుకలు నాలోచించువాడుగానుండి, సమయాసమయములు గుర్తించు నేర్పరిగానుండిన, ఎవడైనను, సందియ మేమాత్రములేక జయప్రసాదు డగుచుండును. ఇట్టి సద్గుణములు గలవానికితర దేశములందుకంటె నిచ్చటనే జయము మోఘముగ చేకూరును గాన, వాడికితర దేశములకు వెళ్ళుటకుకించిత్తయినను అవసరముండదు.

# ఇండియాదేశపు మతచరిత్ర - దాని యావశ్యకత.

—— :o: ——

[గొల్లపూడి శీతారామశాస్త్రిగారు బి. ఏ., బి. ఎల్.,]

ఇండియాదేశమున బహుభాషలును, వాఙ్మయంబులునుగలవు. వాని కన్నిటికిని శిరోభూషణమైన మాతృభాషసంస్కృతము కలదు. సర్వవిధముల నుగ్రంథము లాయాభాషలయందుల భించుచున్నవి కాని, అదియేమి గ్రహచారమో చరిత్రవిషయక గ్రంథములు కానరావు. పూర్వులుచరిత్రలకు లక్ష్యముచేయలేదో, వ్రాసినగ్రంథములు మధ్యకాలములో నశియించెనో చెప్ప నలవిగాదు. హిందూదేశవాసులు చరిత్రను వ్రాయుటకు ప్రయత్నించలేదనియు, పాశ్చాత్యదేశముల యందువలె సామాన్యచరిత్ర, వారికి రుచింపలేదనియు తోచుచున్నది. వేదకాలంబునను, బౌద్ధ మహాయుగంబునను, హిందు మహాయుగంబునను జరిగిన యద్భుతాంశంబులును, మహామహుల చర్యలును, యుద్ధములును, రాజ్యాక్రాంతములును, విప్లవములును విడి విడిగా నెచ్చటను గన్పట్టవు.

మహమ్మదీయ రాజ్యసమయంబునగూడ మహమ్మదీయేతరులైన యిండియనులు చరిత్రవిషయమై యోజింపరైరి. వీరలెల్లరు వేదాంతమునం దభిరుచిగలవారు. దేహమునకుగాక ఆత్మకును, కార్యమునకుగాక కారణభూతునకును, ప్రత్యేకజీవులకుగాక సంఘమునకును, ఇహమునకుగాకపరమునకును ప్రాముఖ్యతనొసంగు స్వభావము గలవారును, జీవునకు జన్మమొక్కటెగాక అనేకములని నమ్మువారును ప్రతినిమిషము గలుగుచుండు మార్పులను గాక నిత్యమ్మునుగూర్చి విచారించువారు నగుటచేత ప్రత్యేక జీవితమందుజరిగిన కార్యములను గుర్తించి, లిఖించి, శాశ్వతముగా నుంచుటకు యత్నింపరైరి. వారి వారి ఆలోచనలును, భావములును, ధర్మకార్యములును, జీవితసారములును, వానివలన నేర్పరచదగిన నీతులును, తెలుపదగిన గ్రంథములను వ్రాసిరి. అందుచేతనే పురాణములు, ఇతిహాసములును ప్రబలెను. కాని చరిత్రగ్రంథములు లేకుండుట దేశమునకు పలుతెరంగుల నష్టదాయకమని తెలిసిన విషయమె.

ఈచరిత్రలు పెక్కురకములు. జీవితచరిత్రలు, మహాపురుషుల చరిత్రలు, దేశచరిత్రలు, మతచరిత్రలు, సంఘచరిత్రలు మొదలుగా నెన్నియోచరిత్రలు గలవు. బ్రిటిషుసామ్రాజ్యము హిందూదేశమున స్థాపింపబడి నెమ్మదియు, శాంతియు, కల్గియున్న యీకాలములో చరిత్రవిషయక చర్చలును, గ్రంథములును వ్రాయబడుచున్నవి. ఇప్పుడు వ్రాయువారెవరును మతచరిత్ర వ్రాయ ప్రయత్నించినట్లుల గానము. ఈభారతఖండంబున నుమారు 4000 సంవత్సరములకు పైకాలమునుండి, నాగరికతయు, మతజ్ఞానమును, వ్యాప్తములైయున్నవి. ప్రప్రథమమున జనులు తమకు గోచరమగు ప్రతిశక్తిని పూజించుచుండిరి. తరువాత దేవతలపూజయు ప్రారంభమయ్యెను. ఈదేవతలు పరస్పరము సంబంధములేని ప్రత్యేక వ్యక్తులుగాక నొకమహామహుని వికారములు. అవిలేని ఏకేశ్వరోపాసన మొదలుపెట్టబడెను. ఈదేవుడు కాని దేవతలు కాని జనులవలన యజ్ఞయాగాదికములచే తృప్తులై కోరికల దీర్చుదురను నమ్మకము ప్రబలుట హెచ్చి యజ్ఞములు మొదలగునవి ప్రబలెను. ఇదియంతయు దురభిప్రాయమనియు వైరాగ్యమేమార్గమనియు, కర్మ ఫలప్రదాయిగాదనియు తెలిసికొనిరి. సన్యాసులు మెండు కాజొచ్చిరి. శరీరమును కష్టముల పాలుచేసి ఘోరతపములు జేయదొడంగిరి. దానివలన ప్రయోజనము గాంచకజైన బౌద్ధమతములు వ్యాపించెను.

అట్టులనె కాలక్రమమున ఒకదానివెనుక నొకటిగా చార్వాక కాపాలికాది మతములును, శంకరరామానుజాది మతకర్తలును పుట్టిరి. కొంతకాలమునకు మహమ్మదీయ విజృంభణంబున హిందూమహమ్మదీయ మత

ములకు పరస్పరస్పర్శ కలిగి పెక్కుమతములుతోడ మత కర్తలు భక్తులును ప్రబలిరి. అటుపిమ్మట క్రైస్తవమత సంబంధము కల్గుటయు తన్మూలమున ఆర్యసమాజ బ్రహ్మసమాజాది సంఘములు ఏర్పడుటయు తటస్థించెను. ఈమతముల పుట్టుకయు, వాని పుట్టుక కాలమును, ఆకాలమందున్న సంగతి సందర్భములను తెలిసికొనుట యావశ్యకమైయున్నది. ఈమతములు అనవసరముగా ఏర్పాటయ్యెనని యెవ్వరును జెప్పసాహసింపరు. "ఏధర్మమార్గముగాని చాలకాలమునుండి ప్రపంచము చెడగొట్టకుండుటకై ప్రాతమర్యాదలును స్థాపనలును మారి నూతన వ్యవస్థలేర్పడుచుండును." అని స్పెన్సర్ అను నాంగ్లేయ కవి వక్కాణించియున్నాడు. ఈలోకమున పుట్టినదెల్ల జచ్చుటయు, పెరిగినదెల్ల విరుగుటయు, బాల్యావస్థనుండి వృద్ధాప్యమును పొందుటయు వృద్ధిశక్తి వెంటనంటి నాశనకరమగు మృత్యుశక్తియుండుటయు విదితము. మల్లజెట్టులబోలిక మత్సరమున వృద్ధిమృత్యుశక్తులు రెండు విడువకెపుడు అదనుకై వేచి పొంచుండి యరుగుచుండు. అందుచేత ప్రతిమానవునకు బోలె ప్రతిమతమునకు, జననము, బాల్యమును, మధ్యకాలము, వృద్ధాప్యము, మృత్యువును సహజములుగ సంప్రాప్తములు. అదేకారణముగ పెర మతములు వ్యాపించుటయు సంభవమగు చున్నది. ఈక్రొత్తమతములుపుట్టు కాలముననుండు జనులయాచార వ్యవహారములు, పూర్వపు మతమున జొరబడిన దుర్బోధలు దురాచారములును నిష్పక్షపాత బుద్ధితో గమనించినయెడల, క్రొత్తమత వ్యాపనమునకుగల కారణముల యావశ్యకత బయలుపడును. ఈమత విషయములలోగూడ దేశము పరిణామము నొందుచున్నదనియె చెప్పవలెను. పలురంగులుగల గ్లాసుతో నిర్మింపబడిన చిమ్నిలోనుండి దీపపుకాంతి పలుతెరంగులు వ్యక్తమగునట్లు, అన్నిమతములలోను దేవాంశములును, జ్ఞానదీప్తియు ప్రస్ఫుటమయి ప్రకాశ్యమగుచున్నవి. అందుచేత కాలానుగుణముగా దేవాంశలకు ప్రాముఖ్యతయొసంగబడును. దానిని కనుగొనుటయు, మతోద్దేశ్యము నూహించుటయు మిక్కిలి కష్టము. ఇవి కనుగొనినచో, పరస్పరద్వేషమును, అసూయయు, మారి ఒండొరులయందుగౌరవమును సహనమును నేర్పడును.

ఈయీమతవ్యాపనమును, రాజకీయ చరిత్ర ననుసరించియు, రాజ్య విజృంభణమును, భాషాభివృద్ధియు, వాఙ్మయ సంపాదనమును సమకాలమున జరుగుచు వానికన్నింటికి మూలాధారమయి జీవహేతువయి, ప్రోత్సాహకారణమై ప్రభవిల్లుచుండును. అందుచేత రాజకీయాది చరిత్ర సమూలముగా గ్రహించుటకు, రాష్ట్ర విప్లవములకును, పరరాష్ట్ర నిర్మాణములకును, రాజకీయ యౌన్నత్యమునకును, దేశోద్ధరణమునకును మూలకారణముల నెరిగి సమన్వయించుటకు వీలుకలుగును. రాజ్యతంత్రములెల్లను ఆత్మజీవనమునకు సహాయకారులు. అప్పుడే నిజమయిన అభివృద్ధికి మార్గమేర్పడును. లోకపరిణామమార్గము గుర్తింపనగును. ఎన్నివిధముల విచారించినను, మతచరిత్ర యావశ్యకమని తేలుచున్నది. అట్టి గ్రంథములు ఆంగ్లేయభాషలోగాని దేశభాషలోగాని యున్నట్టు తెలియదు. కాన భారతదేశమునందు పూర్వమునుండి వ్యాపించియున్న మతముల చరిత్రలు వ్రాయుచు, సందర్భానుసారముగా వాని జన్మకారణములు, నాశనహేతువులు, వాని ప్రయోజనములు సూచించు చరిత్రగ్రంథములయందు నూత్నమార్గ ప్రదర్శకులుగానుండుటకు దేశీయులు ప్రార్థితులు. అద్దానివలన మహోపకారముగలుగు. దేశాభిమానంబు పెరుగు. విజ్ఞానంబు జనియించు. లోకంబుమెచ్చు.

---

Siva Temples at Conjeevaram.



కంచి ఏకాంబరేశ్వరాలయము.

Vishnu Temples at Conjeevaram.



కంచి వరదరాజస్వామి దేవాలయము.

Meenakshi Temple at Madura.



మీనాక్షీ దేవాలయము, మధుర.

Temples at Budha Gaya.



గయలోని దేవాలయములు.



Brahmeswara Temple, Bhuvaneswara, Puri.

బ్రహ్మేశ్వరాలయము, భువనేశ్వరము, పూరి.



Parasurameswara Temple at Bhuvaneswara.

భువనేశ్వరమునందలి పరశురామేశ్వర దేవాలయము.

Parvati Temple at Poona.



పూనాలోని పార్వతీ దేవాలయము.

Raja Rani Temple at Bhuvaneshwara.



భువనేశ్వరము, రాజారాణీ దేవాలయము.

# స్త్రీలకు గావలసిన విద్య.

[కొండ వేంకటప్పయ్యపంతులుగారు బి. ఏ; బి. ఎల్.]

శిల్పకారుని హస్తలాఘవమునంజేసి మొండిగానుండు బండసయితము జగన్మోహనాకృతి వహించినట్లును, కొరగాని గులకరాయిగా గనుపించు శిలావిశేషము సానబట్టుటచేత వజ్రమయి తేజోపుంజంబు విడంబించినట్లును, తొలుత నేమియు దెలియని ప్రాకృతజనుండయినను విద్యాప్రభావము వలన మహాపురుషుండగుచున్నాడు. అందుచే బుద్ధి ప్రకాశించుటకు విద్య యావశ్యకమని స్పష్టమగుచున్నది. అట్టిబుద్ధి పురుషులకువలెనే స్త్రీలకును సామాన్యమగుట నెఱింగి స్త్రీలకును విద్యగఱపుట యవసరమని మనదేశమున నిప్పుడనేకు లంగీకరించుచున్నారు. కాని యీ మత మింకను సర్వజన సమ్మతము కాదయ్యెను.

పూర్వము లోకమునందన్ని దేశములలోపలవిద్యలయందును ముందంజవేసిన యీభరతఖండమున స్త్రీలకు విద్యనేర్పుట యనావశ్యకమును అనర్థదాయకమును అని దలంచెడి వారలుండుటెంతయు విస్మయమును విషాదమును గల్పించుచున్నది. గత కాలములందు ప్రజాభిమానములేని పరరాజుల దండయాత్రలకు లోనయి స్వాతంత్ర్యమును గోలుపోయి పరతంత్రులుగా మనుచుండిన జనులకు బుద్ధులు కొుక్కబోవుటయు వారి విశాలహృదయంబులు హ్రస్వంబులగుటయు సహజము.

ప్రాక్తనులగు మహర్షుల యుగములలో స్త్రీలు విద్యా వైదుష్యము సముపార్జించి పేరోలగంబులందు సయితము తమ పాండిత్యము ప్రదర్శించిరని తెలియుచున్నది. జనకచక్రవర్తి యెదుట విద్యా విశారదులగు మహామునులమధ్య వేదాంతవిద్యాకోవిదుండును బ్రహ్మిష్ఠుఁడునగు యాజ్ఞవల్క్యునితోడ గార్గేయియను యోషి ప్రశ్నము వేదాంత ప్రసంగము సల్పెనను బృహదారణ్యకథ యొక గొప్పనిదర్శనము. ఆదిశంకరులకును మండనమిశ్రునకును జరిగిన మతసిద్ధాంతవివాదములందు జైమినియు వేదవ్యాసులును ఒల్లని మాధ్యస్థమును భర్తాజ్ఞ బడసి మండనమిశ్రుని భార్య యుభయభారతి యను నామె వహించెనను శంకరవిజయగాథయును నొక రీతి దృష్టాంతమే. మఱియును కాళిదాసాది మహాకవికృత గ్రంథములందు శ్లోకరచనా చమత్కృతియు, చిత్రలేఖనానైపుణ్యమును నీతిబోధనా సామర్థ్యమును గల యువతులు వర్ణింపబడి యుండుటచేత స్త్రీలకు విద్యాభ్యాసము ఆకాలమున నరిదిగాదని తోచెడిని.

క్రీస్తు శ॥ 8 వ శతాబ్దప్రాంతమున రచియింపబడి రాజశేఖరసూక్తి ముక్తావళి వల్లభదేవ సుభాషితావళి మొదలగు గ్రంథములందు మోరిక విజ్జక * మొదలగు సీమంతినులచే లిఖియింపబడిన శ్లోకములుదాహృతములయి యున్నవి. ధనదదేవుని శార్ఙ్గధరపద్ధతియందు

> శీలావిజ్జామారులామోరికాద్యాః
> కావ్యంకర్తుం సంతి విజ్ఞాః స్త్రియోఽపి
> విద్యాంవేత్తుం వాదినో నిర్విజేతుం
> విశ్వం వక్తుం యః ప్రవీణః సవంద్యః॥

అని వ్రాసియుండుటచేత ఆదినములలో కావ్యకర్తృక సామర్థ్యముగల ప్రసిద్ధస్త్రీలుండిరనియు వారు గౌరవపాత్రులుగా నెంచబడుచుండిరనియును స్పష్టమగుచున్నది.

క్రీస్తు శ॥ 12వ శతాబ్దమునాటి భోజచరిత్రయందు విద్వత్కుటుంబ స్త్రీలును మాఘపత్నియును సమస్యా

* విజ్జక రచియించిన శ్లోకము.

> కవేరభిప్రాయమశబ్దగోచరం
> స్ఫురంత మార్ద్రేషు పదేషుకేవలం
> వదద్భిరంగైః కృతరోమవిక్రియైః
> జనస్యతూష్ణీం భవతోయమంజలిః

పూరణమునకై నుడివిన శ్లోకములు గన్పట్టుచున్నవి. పూర్వ ఆంధ్రయువతులలో రుద్రమదేవి రాజ్యభారము వహించెను. నాయకురాలు అశ్వారూఢయై రణాంగమున నిలిచి తనసేనల పురిగొల్పుచు శత్రువీరుల నెదిర్చెను. కుమ్మరి మొల్లయును తరిగొండ వెంగమయును కవిత్వము నడిపిరి. కీర్తిశేషురాలైన శ్రీ బండారు అచ్చమాంబగారు రచియించిన అబలా సచ్చరిత్రయందు విద్యావతులును, గుణవతులును, ధైర్యవతులును, యశోవతులు నగు హిందూసుందరీమణు లనేకులు చేర్కొనబడియున్నారు.

కాబట్టి పూర్వకాలమున మనదేశమున స్త్రీలు విద్యాస్వాతంత్ర్యము కలిగియే యుండిరనియును కాలక్రమమున దేశమునంగలిగిన యుపప్లవములవలన నవ్వది యంతరించెననియును స్పష్టమగుచున్నది.

ఈ కాలమున అన్యదేశపుస్త్రీలు విద్యాబుద్ధులందు దేరి స్వకుటుంబ పాలనాసమర్థత వహించి సంఘోపకర్తలుగ నుండుటయును ఒకానొకహిందూసుందరియును విద్యావైదుష్యము సంపాదించి కీర్తిమతి యగుటయును తెలిసికొని కొందఱుమనవారిప్పుడిపుడు స్త్రీలువిద్యాభ్యాసమువలనప్రయోజకురాండ్రుకాగలరనినమ్ముచున్నారు. కాని స్త్రీలకు విద్యనేర్పుట యుక్తమనెడి వారయినను స్త్రీ లభ్యసింపవలసిన విద్యావిషయములంగూర్చి భిన్నాభిప్రాయులుగా నున్నారు.

కొందఱు తెలుగుభాష చదువను వ్రాయను నేర్చిన చాలునందురు. మఱికొందఱు సంస్కృతాభ్యాసముచేయుట యుక్తమందురు. ఇంకనుకొందఱు ఆంగ్లేయభాష నభ్యసించు టావశ్యకమందురు. కాని స్త్రీ లేయేభాష లభ్యసింపవలయునో ఏయేశాస్త్రములు చదువవలయునో ఏయేవిషయములందు వారలకు జ్ఞానమావశ్యకమో నిర్ణయించుట సుకరముకాదు. బుద్ధివైశద్య మాలోచించిన యెడల స్త్రీలు పురుషులకు వెనుకబడువారుకారు. స్త్రీలలో కవులును గణితశాస్త్ర ప్రవీణలును, వైద్య విద్యా విశారదలును రాజ్యపరిపాలనా సమర్థులును కలరు. ఇకను ధైర్యము, పట్టుదల, మొదలగు గుణంబులనెన్నితిమేని యుద్ధభూములందు అమేయపరాక్రమము జూపిన యువతులుగలరు. ఇట్లు వివిధవిద్యావిషయ సామర్థ్యములందు ప్రవీణలగు వారు తమజీవితములవలన హిందూదేశపూర్వచారిత్రమును అన్యదేశపు చరితలను అలంకరించిరని చరిత్రాపరిచయము గలవారెల్లరకును విశదమే.

మానవులకు పుట్టుకతోడనే యుత్పన్నము లయిన మనోవృత్తి బీజాంకురములు కొనలుసాగినకొలది ఆవరణ బలమువలన క్రమముగనో వక్రముగనోపెరిగి స్వభావ చేష్టలకు కారణభూతము లగుచున్నవి. మనోవృత్తులు సుశిక్షితములయినయెడల సుశీలమును యోగ్యప్రవర్తనయు ప్రాదుర్భవించును. అట్లుగానిచో దుర్మార్గమునకు జాలుపడును. స్త్రీలకును పురుషులకువలెనే మనోవృత్తుల శిక్షావిశేషంబునంజేసి గుణవిశేషంబులు కల్గుచున్నవి. కావున వారలకు విద్యాప్రయోజనములును శిక్షావిధి ననుసరించియే యుండుననుట స్పష్టము. కావున విద్యవలన దోసగు పోనగుననుట వెఱ్ఱి. మంచి చురుకుదనమును దిట్టతనమునుగలిగిన స్త్రీలు సద్గుణముగలవారయ్యెనేని ఎంతటి విద్యలయిన నేర్వగలరు. ఎంతటి మహాత్కార్యము లయిన సాధింపగలరు.

విద్యమానమగు ప్రపంచమునందు స్త్రీ పురుష జీవితాదర్శములలో వ్యత్యాసము విమర్శించి తదాదర్శ పోషకములగు విద్యలు ముఖ్యముగా గఱపవలయును. స్త్రీలకందఱకు ఒకపాటి లోకవిజ్ఞాన మావశ్యము గావున నట్టి తెలివినిగలిగించు శాస్త్రవిషయము లభ్యసించుట ముఖ్యము.

నిత్యము ఇంద్రియగోచరమగుచు జీవితముతోడ నిరంతర సంబంధముగల భౌతికవిషయములు జ్ఞానేంద్రియముగల స్త్రీలకును పురుషులకును విమర్శనీయములే. అట్టి జ్ఞానములేనివారలు పురుషులైనను స్త్రీలైనను కేవలము పశుప్రాయులనుటకు సంశయములేదు. కూపస్థ మండూకములుగానుండక విశాలమగు నీ విశ్వమునుగూర్చి యొకపాటి జ్ఞానముగలుగుటకు భూగోళ ఖగోళముల స్వరూపము లించుకయైన నెఱుంగవలయును. తమ వంశ

మునందలి పూర్వులచరిత్రంబు లెటులెఱింగినట్లు తమ దేశచరిత్రను గూడ కొంతవఱకైన తెలిసియుండుట యవసరము. ఇంతటి సామాన్యజ్ఞానము స్త్రీల కందఱకు నత్యావశ్యకము.

మఱియును మన దేశము స్త్రీలు వివాహితలయి గృహిణులుగా నుండవలసినవారగుటచేత గృహ పరిపాలనావిధులును ఆరోగ్యశాస్త్రమును,శిశుపోషణక్రమమును బాలశిక్షాపద్ధతులను, పాకశాస్త్రమును, గృహోపాంత వననిర్మాణ రీతులును చక్కగా నేర్చియుండవలయును.

నీతియును దైవభక్తియును స్త్రీలకు అవసరములే గావున నీతిబోధకములగు గ్రంథములును మతవిషయక గ్రంథములును కొన్ని చదివి గ్రహించుటయేగాక పావనులగు వారలచరిత్రలును తెలిసికొనవలయును.

అంగనలకు సహజోత్పన్నములగు మార్దవ సౌకుమార్యాది గుణవిశేషంబులను వ్యక్తీకరింపదగిన విద్యలు నభిమానవిద్యలుగా నవలంబించుట యుక్తము. స్త్రీలు సామాన్యముగ కంఠస్వారస్యము మాత్రమేగాక భావ ప్రకాశమునందును సహజసామర్థ్యము కలవారగుటచేత సంగీతము నభ్యసించుటవలన హృద్యముగను భక్తిరస ప్రధానముగను గానముచేసి ఆనందముకల్గింప జాలుదురు. అటులనే చిత్రలేఖనా నైపుణ్యమును వారు సంపాదింప దగినదే. దయయును, సహనమును, ఆదరణయును వారలకు నుగ్గుతో పోసినవగుటచేత వైద్య విద్య నేర్చి యౌషధసేవనము పథ్యపానములను సమయానుకూలముగనొసంగి రోగపీడితులగువారిని కాపాడు పోషణక్రమము లెఱుంగుట మిక్కిలి యుక్తము. మన దేశమున స్త్రీలు పురుష వైద్యులకు తమ వ్యాధులను వెల్లడించుటకు సమ్మతింపక మానుషమునకై క్రూరవ్యాధుల పాలబడి తమ సౌఖ్యమును ప్రాణములను గోలుపోవుచున్నారు. బంగాళా దేశమునందు కొందఱుస్త్రీలు యిరోపా మొదలగు దేశములందు వైద్యశాస్త్రము నభ్యసించి తమతోడి యువతులకు చికిత్సలు జేయుచున్నారు. అట్టి వైద్య విద్యాభ్యాసము వలన స్త్రీలు మితిలేని మేలుచేసిన వారగుదురు.

మఱియును బాలికాపాఠశాలలలో స్త్రీలు ఉపాధ్యాయినులుగానుండుట యవసరము. మగపిల్లలకును, ఆడుబిడ్డలకును స్త్రీలుఉపాధ్యాయినులుగా నుండుటవలన విద్య బాగుగానబ్బును. జపానుదేశమునందు బాలికలకును కొంతవఱకు బాలురకును స్త్రీలే యుపాధ్యాయినులుగా నుండుటవలన ఆదేశమునవిద్య శీఘ్రకాలములో నభివృద్ధి చెందినది. ఉపాధ్యాయినులుగా నుండుటకు ఉపాధ్యాయ శిక్షాశాలలలో పరీక్షలయందు తేరవలయును. కావున కొందఱు యువతులు అట్టి శిక్షాలయములందు బోధనావిధులను నేర్వవలయును.

ప్రస్తుతమున స్త్రీవిద్యాభిమానులగువారు పట్టణములలో క్రైస్తవమతావలంబికలగు పాశ్చాత్య వనితలచేత తమ గృహములందు దాడువారలకు విద్యాభ్యాసము చేయించుచున్నారు. మతాంతరులతోడ సంసర్గమువలదని కొందఱట్టి యేర్పాటు లంగీకరించుటలేదు. కావున స్వదేశ స్త్రీలే విద్యాబోధకులుగానేర్పడి యిండ్లలో స్త్రీలకు విద్యగఱపుటకు బూనినయెడల నిరాక్షేపణగ నట్టి విద్యావ్యాపకమార్గములు విరివిగా సాగగలవు.

ఆంధ్రభాష మాతృభాషయగుటచేతను సంస్కృతభాష మహోన్నతమగు నార్యభాషగానుండి యనేక యుద్గ్రంథములుగలిగి మనపూర్వుల నుజ్ఞానమున కాలవాలముగా నుండుటచేతను ఆంగ్లేయభాష రాజభాషగా నుండుటయేగాక ఆధునిక విజ్ఞానము బడయుటకు ముఖ్య సాధనముగా నుండుటచేతను మనయాంధ్రులెల్లరకును ఈమూడుభాషలు అభ్యసనీయములేకావున వారి వారి సామర్థ్యముకొలది వారికివలనగుభాషల జదువవలయును.

మనసంఘమున బాలికలుచిన్నవయస్సునందే సామాన్యముగ వివాహితలగుచుండుటచేత వివాహానంతరము కొలదికాలములోపలనే పాఠశాలల వదలుచుండుట వలననుఅటుపిమ్మట వారికి విద్యావ్యాసంగమునకవకాశములేకుండుటచేతను యువతులగువారు చదువుకొనుటకు దగిన విద్యాశాలలు లేనిందుచేసియు ప్రస్తుతము స్త్రీవిద్య మిక్కిలి హైన్యదశలో నున్నది.

1911 సంవత్సరములో నడచిన జనసంఖ్యలెక్కల వలన చెన్నపురిరాజధానిలో చేరిన తెలుగుజిల్లాలలో నుండు స్త్రీలలో 100కి నొక్కరుమాత్రమే చదువుకొనినవారు కనుపడుచున్నారు. బడికిపోవు నీడుగల పిన్నవారలలో గంజాము, విశాఖపట్టణము, బళ్ళారి, అనంతపురం జిల్లాలలో 100కి మువ్వురుమాత్రము గలరు. కడపలో నూర్గురికి నలువురును; కర్నూలు, నెల్లూరు మండలములలో నయిదుగురును; గుంటూరున తొమ్మిదిమందియు; గోదావరిలో పదుగురును; కృష్ణామండలమునందు పదునొకండ్రుచొప్పునను నున్నారు. తెలుగుజిల్లాలన్నిటిలో సెకండరిపాఠశాలలు బాలికలనిమిత్తమేర్పడినవి అయిదు మాత్రమే. కావున మిక్కిలి కొఱతబడియున్న స్త్రీవిద్య నభివృద్ధిచేయుటకై వయస్సువచ్చినవారునయితము నిరాక్షేపణగ విద్యాభ్యాసముచేయుటకు తగిన పాఠశాలలు నిర్మాణముచేసి యందు కేవలము ప్రాథమికవిద్యతో సరిపుచ్చక ఉన్నతవిద్య నేర్పుటకు తగిన యొనరు లేర్పరచవలయును. ఉన్నతములగు జాతీయాదర్శములతో నుత్తమములగు ఆధునిక విజ్ఞానవిశేషముల సందర్భానుసారముగ సమ్మేళనముజేయు విద్యాపద్ధతుల నవలంబించి లౌకిక పారమార్థికజ్ఞానము లభివృద్ధిజేసి ప్రజ్ఞావతులుగా జేయుటయేగాక సదాచారపరులుగను సంఘమునకు నుపకర్తలుగను జేయవలయును.

స్త్రీలెప్పుడును పరభృతలుగానుండక స్వతంత్ర జీవనముచేయుటకు తగిన పరిశ్రామికవిద్యలు నేర్పవలయును.

పాశ్చాత్యవిద్య లభ్యసించినను మనవారు పాశ్చాత్యుల జీవితాదర్శముల నాదరింపదగదు. నవనాగరికత జెందిన పాశ్చాత్యదేశములవారు లౌకికాభివృద్ధియందు లక్ష్య మెక్కువయుంచి ధనద్రవ్యములకై కడలేని పాట్లు పడుచుందురు. వారలలో తల్లి బిడ్డలకును, తండ్రి కొడుకులను అన్నదమ్ములకును అక్కచెల్లెండ్రకును ఆదరణసౌహార్దంబులు మనయందువలె గాఢములుగావు. వారలకు వివాహసంబంధము కొన్ని సందర్భములందు విడగొట్టుకొనదగిన కట్టుబాటు. అట్టి యాదర్శముల ఔన్నత్యలోపములవలననే గాబోలు పట్టపరీక్షలందు తేరిన పాశ్చాత్యయువతులలో వివాహము మానివేయుపద్ధతి ప్రబలమగుచున్నది. మహోన్నతములగు కార్యముల సాధించుటకయి విద్యావయితలగువారు పావనమును అనుపమానమునగు బ్రహ్మచర్యమువహించి వైవాహికస్థితి అంతరాయమని యెంచి దానిని విడనాడినను వంద్యులే. కాని కేవలము స్వచ్ఛందవృత్తి నభిలషించి సంసారము శృంఖలమను తలంపుతో నవియొల్లక విద్యాప్రౌఢిమచేత స్వతంత్రజీవనము స్వస్వాధీనముగదాయని విఱ్ఱవీగుచు నిరంతరము కన్యలుగానుండుట శ్లాఘనీయముగాదు. వివాహము జాత్యభివృద్ధి హేతువగుటంజేసి దానిని కేవలము స్వతంత్రసౌఖ్యమునకయి విడనాడుట మానవజాతి నిర్మూలనంబునకు కారణమగును. కావున అట్టి యభిప్రాయముల కెడమియ్యక మన దేశపుస్త్రీలేయే విద్యలు నేర్చినను పైన నుడివినట్లు మహోన్నతకార్యకలనంబులకై నిర్దుష్టమగు బ్రహ్మచర్యంబు బూనినప్పుడు దప్ప లేనియెడల వైవాహికవృత్తి నిరసింపదగదు. స్వచ్ఛమై, అవిచ్ఛిన్నమై, ఇహలోకావధికిగూడ నతీతమయి, పరమపవిత్రమై, పతియే సర్వంబను నిశ్చయాత్మకబద్ధమయి, వర్థిల్లు గాఢానురాగముచేత నిరంతరాత్మత్యాగ స్వరూపమగు ఆర్యగృహిణీధర్మము నేటికిని సర్వదేశములవారికిని శ్లాఘాపాత్రముగనుండుటకు హిందూస్త్రీల దృఢవ్రతమే కారణము కావున అట్టిధర్మము నెప్పటికిని కాపాడుదురుగాక!

మఱియు దైవవిధింజేసి భర్తృవిహీనులైన యువతులు వేనవేలు మనదేశమునంగలరు. వీరు అవివాహనిష్ఠాబద్ధులై తమ జీవితములను బంధుగృహ సేవనంబుల ధారబోయుచున్నారు. అట్టివారలకు విద్యాధిక్యత కలుగజేసి విద్యాబోధకులుగనుండుటకు నవకాశము కల్పించితిమేని అనతికాలములోపల మనదేశమున ప్రతిగృహమును సరస్వతీసదనమును ఇందిరామందిరమునయి విలసిల్లును.

---

# మన జమీందారులు - దేశాభివృద్ధి.

[గౌరవనీయులు శ్రీరాజా కొ. రా. వేంకట కృష్ణారావు పంతులు బహద్దరు జమీదారుగారు బి. ఏ.,]

శాశ్వతపుహక్కుతో ముఠాలను గ్రామములను ననుభవించుచున్న జమీందారులు ప్రస్తుతము మన రాజధానిలోననేకులుగలరు. పందొమ్మిదవ శతాబ్దారంభమున శాశ్వతముగాఁ గొంతభూమిపన్ను నేర్పరచి దొరతనమువారు మనరాజధానిలోఁ గొన్ని పరగణాలను విస్తీర్ణప్రదేశములను గ్రామములను శాశ్వతపుహక్కుతోఁ గొందఱికొసఁగిరి. అట్లు శాశ్వతపుహక్కుతో నొసఁగఁబడిన ప్రదేశములలో ననేక మంతకుఁబూర్వము చాలకాలము క్రిందట మహమ్మదీయప్రభువులచే యుద్ధములకు సైనికనికాయమును సమకూర్చు నుద్యోగమునకును, యుద్ధములయందుఁ దమకు సహాయమొసఁగినందుకుఁ బారితోషికములుగను భూమిపన్నును వసూలు చేయుటకును నొసఁగఁబడినవి. ఆంగ్లేయప్రభుత్వ మారంభమైనతరువాత మహమ్మదీయప్రభువులచే సన్మానమునందుచుండిన భూస్వాములనందఱను గూడ యథాస్థితిగఁ దాము వంశపారంపరగా ననుభవించుచుండిన వసతులనెల్ల సంవత్సరమునకు ద్రవ్యరూపకముగాఁ గొంతమొత్తమును దొరతనమువారికిఁ జెల్లించు పద్ధతిపైన శాశ్వతపుహక్కుగలిగి యనుభవింప గలుగునట్లేర్పఱుపఁబడినది. తరువాతఁ గాలక్రమమున దేశకాలవిపరీతములనుబట్టియుఁ గాటకములనుబట్టియు, ననావృష్ట్యాది బాధకములనుబట్టియు గొన్ని కొన్ని పరగణాలును యెస్టేట్లును సంస్థానములును విభజింపఁబడి యితరులకు శాశ్వతపు హక్కుతో నమ్మఁబడినవి. తరువాత దొరతనమువారట్లు శాశ్వతహక్కుతో విస్తీర్ణప్రదేశములను గ్రామములను పరగణాలను శాశ్వతపు భూమిపన్నేర్పఱచి యిచ్చుటకంగీకరింపక దామే పుచ్చుకొని చిల్లరగా రహితులకు ముప్పదిసంవత్సరముల కవులకిచ్చిరి. శాశ్వతపుహక్కుగలిగి చిరకాలమునుండి శాశ్వతపు భూమిపన్ను దొరతనమువారికొసఁగుచు గ్రామములను పరగణాలను విస్తీర్ణప్రదేశములను ననుభవించుచున్న భూస్వాములు జమీదారులనిపిలువబడుచున్నారు. అట్టిజమీందారులలో దేశాభిమానధురీణులును ననుభవజ్ఞానసంపన్నులును అనేకులుగలరు. ఈజమీందారులు మిక్కిలిగౌరవమైన వంశజులనియు నాత్మగౌరవము నెంతటి కష్టములకైన నోర్చికాపాడుకొనువారనియుఁ జెప్పుటకెంతమాత్రమును సందియములేదు. చిరకాలమునుండి తమయాత్మగౌరవమును, గులధర్మములను వంశమర్యాదలను సంరక్షించుకొనుచు దేశక్షేమమునకుఁ బాటుపడుచుఁ దమయేలికపలోబడిన ప్రజలయనురాగమునకు విశ్వాసమునకును బాత్రులయియున్న మన జమీందారులవలన మనదేశమునకుఁ గలిగినయుపకారము లనేకములుగలవని చెప్పుటకెంతమాత్రమును సందియములేదు. మనరాజధానియందు ప్రస్తుతము 1126 గురు జమీందారులుగలరు. వీరందఱును గలసి దొరతనమువారికి ఏబదిమూడులక్షల రూపాయలు శాశ్వతపుభూమిపన్ను చెల్లించుచున్నారు. అందు దెలుగుజిల్లాలలో నాలుగువందల పదిమంది జమీందారులుగలరు. వారుసంవత్సరమునకు శాశ్వతపు భూమిపన్నుగా ముప్పదినాలుగులక్షల రూపాయలు చెల్లించుచున్నారు. తక్కినదక్షిణాది జిల్లాలలో 716 గురు జమీందారులుగలసి పందొమ్మిదిలక్షలరూపాయలుమాత్రమే చెల్లించుచున్నారు. ఉత్తరాదిజిల్లాలలోఁ గొన్నిగొప్పజమీందారీ సంస్థానములు దొరతనమువారి కంతరించిపోయినవి. ఆసంస్థానాధిపతుల వంశస్థులిప్పటికిని దొరతనమువారివలన రొక్కరూపకముగాఁ గొంతసహాయము ననుభవించుచున్నారు. ఉత్తరసర్కారులని పిలువఁబడు నాల్గుజిల్లాలును జాలకాలము వఱకు మహమ్మదీయులయేలుబడియందుండుటంబట్టి యందుజమీందారీవసతులు దక్షిణజిల్లాలకంటె నెక్కువగానుండుటకుఁ గారణమైనట్లుదోచుచున్నది.

జమీందారులు మిక్కిలిగౌరవనీయులనియు గొప్పవంశజులనియు దేశాభిమాన మాననీయులనియు నుదారచేతస్కులనియుఁ జెప్పుటకుఁ బ్రబలనిదర్శనములున్నవి. వీరనేకవిధములగు చేతిపనులను శిల్పవిద్యలను సంగీతాభినయాది కళలను, భాషాపాండిత్యము గవిత్వము మొదలగు ననేకవిషయములను బోషించుచు వానినుజ్జీవింపఁజేసి మనదేశముయొక్క నాగరికతను గాపాడుచుండిరి. ధనమును బలుపఁబడియు నౌదార్యమును వితరణయు స్వదేశాభిమానమును నుపకారబుద్ధియుఁగలిగి వీరుమనదేశమున కొనరించిన శాశ్వతోపకారము లిన్నియని చెప్పశక్యముకాదు. మనదేశమందుఁగల గొప్పగొప్పదేవాలయములును, ధర్మసత్రములును, సంస్కృతాంధ్రకావ్యములును దటాకములు నూతులు,ధర్మారామములు అగ్రహారములు భూవసతులు మొదలగు ననేకములును వీరియౌదార్యమును దేశక్షేమాభిరతినిఁ బ్రజానుకూలపరిపాలనమును బెక్కువిధములుగా నిప్పటికిని దేశమంతయుఁ జాటించుచునేయున్నవి. మన జమీందారులయొక్క పూర్వులలో ననేకులు సంస్కృతాంధ్రభాషాపరిచయముగలిగి యనేకకళలను విద్యలనుబోషింపుచు కళావిదులని ప్రసిద్ధిగాంచి యత్యున్నత నాగరికపదవియందుండి యప్పటిరాజకీయభాషయగు ఫార్సీయందు పాండిత్యమువడసి దేశాభిమానధురీణులయిమహమ్మదీయ ప్రభువుల గౌరవమునకును సన్మానమునకును బాత్రులయియుండిరనుటకుఁ బ్రబలనిదర్శనము లనేకములుగలవు. అందులో గొందఱుచక్కనిపాండిత్యమును సంపాదించి కవిత్వముకూడఁ జెప్పగలిగిపండితకవిపోషకులని ప్రసిద్ధిగాంచిరి. వీరు నాగరికాగ్రగణ్యులనియు దేశాభిమానధురీణులనియు నింతకుమునుపే చెప్పియున్నాను. ఇట్టిపరోపకా

రోపకారిణులగు మహనీయులవలననే మనదేశమందిప్పటికిని పూర్వనాగరికతయు పురాతనవిద్యలును గేవలమడుగంటిపోక నామమాత్రముగానైన నిలచియున్నవి.

మనదేశము నభివృద్ధి పఱచి యౌన్నత్యపదవికిఁ దీసికొనివచ్చుటకుఁ జేయవలసిన కార్యములనుగురించియు మనసంఘము సుస్థితికిఁ దీసికొనివచ్చుటకుఁ దగిన యుపాయములనుగూర్చియు నిప్పుడు మనవారందఱు దేశమందంతటను దేశాభిమానబుద్ధితోఁ బాటుపడి పనిచేయుచున్నారు. దొరతనమువారుగూడ మనకు నూతనముగాఁ గొన్ని స్వతంత్రములనొసఁగి మనముచేయుచున్న ప్రయత్నములను బ్రోత్సాహపఱచుచు మనకు సాధ్యమగునంతవఱకు సహాయముఁజేయుచున్నారు. ఆంగ్లేయ ప్రభుత్వమహత్వమువలనను నాంగ్లేయ విద్యాప్రాబల్యమునుబట్టియు మహోన్నత్యపదవియందున్న ఇతరదేశముల నైశ్వర్య ప్రాభవజ్ఞానమునుబట్టియు మనదేశమునందలి జనులందఱును బ్రజాస్వాతంత్ర్యమువలనగానిఁ దేశాభివృద్ధికలుగనేరదని నిశ్చయముగా గ్రహించి స్వదేశక్షేమముకొఱకు స్వార్థత్యాగులై పట్టుదలతోఁ బనిచేయుచున్నారు. మనదేశమును చిరకాలమునుండియావహించిన మౌఢ్యపిశాచమును గ్రమక్రమముగాఁ బారదోలుచున్నారు. ఇప్పుడు మనదేశ మన్నివిధములచేతను బాగుపడి యభివృద్ధికి రాఁగలుగుటకుఁ దగినకాలమారంభమైనది. కావున నీసమయమును నిరాకరింపకఁ గర్తవ్యములను జక్కఁగాఁ దెలిసికొని వాని ననాదరబుద్ధితో నిర్లక్ష్యముచేయక మనదేశమభివృద్ధి పఱచవలయునను దీక్షగలిగి పనిచేయుట మనకందఱకును విధ్యుక్తమని నేను మనవిచేయుచున్నాడను. స్వదేశాభిమాన మాంగ్లేయప్రభువుల యాగ్రహమునకును వారితో విరోధమునకును గారణహేతువని తలచుట యెంతమాత్రము వాస్తవముకాదు. దొరతనమువారు మనయందమిత దాక్షిణ్యమును అనురాగమునుఁ బ్రీతియుఁగలిగి మన మభివృద్ధికి రావలయుననియు మనదేశ మున్నతపదవికిఁ దేవలయుననియుఁ ద్రికరణశుద్ధిగాఁగోరి మనకనేకవిధముల సహాయములనొసగుచు మనదేశక్షేమముకొఱకనేకకార్యములను జేయుచునేయున్నారు. రాజభక్తియు విశ్వాసమునుగలిగి మనప్రభువులగు నాంగ్లేయోద్యోగస్థుల విశ్వాసమునకును నమ్మకమునకును బాత్రులమగునట్లు ప్రవర్తించుచు మనము పనిచేసినచోఁ బ్రభుసహాయము మనకుఁ దప్పకఁగలుగకపోదు. అట్లు మనకాంగ్లేయప్రభువులు విశేష సహాయమొసంగిన నిదర్శనము లనేకములుగలవు. మనజమీందారులు మిక్కిలినాగరికులును, బరోపకారపారీణులును, దొరతనమువారి విశ్వాసమునకును గౌరవమునకును బాత్రులును గావునను, ద్రవ్యవంతులును, బలుకుబడిగలవారును జనమాన్యులును గావునను వారు మనదేశాభివృద్ధికిఁ బనిచేయుట కితరులకంటె నెక్కువ యవకాశము గలిగియున్నవారని చెప్పవలసియున్నది. ప్రకృతకాలానుగుణముగా వ్యవసాయము నభివృద్ధి పఱచుటకుఁ దగిన సాధనముల నేర్పఱచుటయు, యంత్రశాలలను నిర్మించి వస్తురచనగావించుటయు వాణిజ్యమభివృద్ధి పఱచి మనదేశము నైశ్వర్యప్రదముగా నొనర్చుటయు మనజమీందారులకుఁ గర్తవ్యమని చెప్పకఁదప్పదు. ఈకార్యములనుజేయుటకు జమీందారులకుఁ గల సాధనసంపత్తి యితరులకులేదు. కాబట్టి దేశాభివృద్ధికి ముఖ్యకారణములగు నీవిషయములనుగూర్చి మనజమీందారులు చక్కఁగాఁ బనిచేయవలసియున్నది. దేశ మభివృద్ధినొందినకొలది వ్యవసాయ మభివృద్ధినొందినకొలది వాణిజ్యమును యంత్రశాలలును ప్రబలినకొలది జమీందారులకుగూడ నమితలాభమున్నదని చెప్పుట కెంతమాత్రమును సందియములేదు. తమదేశప్రజలను సుస్థితికిఁ దెచ్చి దుర్భిక్షాది దోషములను దొలగించి ప్రజాక్షేమకరములునుఁ దమకులాభకరములును నగుకార్యములనుఁజేయుటకన్న మనజమీందారులు చేయఁదగిన మంచికార్యమేదియునులేదని నిశ్చయముగా జెప్పవలసియున్నది. ఇతరులకును దనకును లాభకరముగను శ్రేయోదాయకముగను నుండుకార్యముల నాచరించుట ప్రతివానికిని గర్తవ్యమనుట కెంతమాత్రమును సందియములేదుగదా? జమీందారులు వ్యవసాయమభివృద్ధి పఱచుటవలనఁ దమభూములు మిక్కిలి ఫలవంతములగుటయు, యంత్రశాలలనునిర్మించి పనిచేయించుటచే మనదేశమందునుఁ దమజమీను ప్రదేశములయందును బండింపఁబడిన ప్రత్తినార మొదలగు ననేకవస్తువులును, గనులయందు దొఱకు లోహములు, రత్నములు మొదలగు విలువగల పదార్థములును ఇతరదేశములకుఁ దీసికొనిపోఁబడి యితరుల కమితలాభము గలుగఁజేయుచున్నవిధముగాఁ గాక నీపదార్థములకు జన్మభూమియగు మనదేశముయొక్క నైశ్వర్యమునే యభివృద్ధి పఱచుటయుఁ దటస్థమగును గావున మనజమీందారుల కమితలాభము గలుగునను టెంతమాత్రము సందియములేదు. తమకు మాలిన ధర్మమాచరింపుడనియు స్వార్థత్యాగులై పరోపకారమునే చేయవలసినదనియుఁ దమలాభములు బాటింపక నితరుల లాభమునకే పనిచేయవలసినదనియు మనజమీందారులను గోరుటలేదు. స్వశ్రేయమును స్వలాభమును నభివృద్ధి పఱచుకొనుచుఁ దన్మూలమున దేశాభివృద్ధికినిఁ బ్రజాక్షేమమునకును దోడ్పడవలసినదని మనజమీందారులకు విన్నవించుకొనుచున్నాడను. జమీందారులు దేశాభివృద్ధికిఁదోడ్పడి చేయవలసినకార్యములను గూర్చియు వానివలన వారికిఁగలుగు లాభములనుగురించియు మనమాలోచించవలసియున్నది.

విద్య ప్రపంచమందలి ప్రతిమనుష్యునకును నత్యావశ్యకము. విద్యలేనిచో జ్ఞానాభివృద్ధియు యుక్తాయుక్తవిచక్షణయు, యోగ్యతయు గలుగనేరవు.

గీ॥ విద్యవలనను వినయంబువినయమునను ।
బడయుఁ బాత్రత పాత్రతవలనధనము ।
ధనమువలనను ధర్మంబు దానివలన ।
నైహికాముష్మిక సుఖంబులందునరుడు ॥

అనిచెప్పఁబడియున్నది. కావున విద్యయన్నిటికంటెను బ్రధానమనియెంచి మనజమీందారులు దామువిద్యావంతులగుటయేగాక విద్యాభిమానమాననీయులయి ప్రజలకు విద్యనేర్పించుటకుఁ దగినసహాయములను దమశక్తివంచనలేకుండఁజేయవలయును. విద్యాదానమన్నిదానములకన్న నుత్కృష్టమైనది. సద్విద్యాదానముక్రిందగాక జమీందారులు దమద్ర

వ్యయమును మఱియొకవిధముగా సద్వినియోగము చేయనేరరు. దమమతశక్తికొలది పాఠశాలలనుస్థాపించియు, కళామందిరముల నేర్పఱచియు, విద్యార్థి వేతనములొసంగియుఁ బుస్తకభాండాగారముల నెలకొలిపియు బీదవిద్యార్థులకు సహాయముచేసియు ననేకవిధములుగా విద్యాదానమొసగి జమీందారులు జనుల కుపకారమొనరింపవలయును. ప్రజలమౌఢ్యమును అజ్ఞానాంధకారమును దొలగించినగాని జనులు జ్ఞానవంతులుగారు. ప్రజలు మౌఢ్యమునుబాసి జ్ఞానమునుబడసినగాని దేశమభివృద్ధిఁ జెందనేరదు. కాబట్టి విద్యాదానమొసగుటవలనను, విద్యార్థులకుఁదగిన ప్రోత్సాహమును గలుగజేయుటవలనను జమీందారులు దేశాభివృద్ధి కమితసహాయము జేసినవారగుదురు. కేవల భాషాపాండిత్యమున కుపచరించు విద్యనుమాత్రమేగాకఁ గృషి, శిల్పిశాస్త్రము, మొదలగు విద్యలను నేర్పుటకుఁ దగినపాఠశాలలను, గళాశాలలను మనదేశమున నేర్పఱచి యాయాశాస్త్రములును జనులు నేర్చుకొనుటకుఁ గావలసినసహాయమును మనజమీందారులు దప్పకచేయవలయునని నాయభిప్రాయము. దొరతనమువారు విద్యాదానవిషయమై చాలద్రవ్యమును వినియోగపఱచుచు ననేకపాఠశాలలను గళాశాలలను మనదేశమున స్థాపించియున్నారు. మనదేశ మతివిస్తీర్ణమైనదియు, మనదేశప్రజ మిక్కిలిదరిద్రులును, నసహాయులును, నన్యాపేక్షలేక జీవింపఁగల స్వశక్తిలేనివారును, నజ్ఞానులును, మూఢులును గావున దొరతనమువారేర్పఱచిన పాఠశాలలు బొత్తుగాఁజాలకున్నవి. ద్రవ్యము లోపమువలన ననేకులు విద్యనేర్చుకొనఁజాలకున్నారు. భాషాపాండిత్యముకలన జనసామాన్యులకుఁ బ్రయోజనములేకపోవుటఁబట్టియుఁ గృషి శిల్పశాస్త్రాదికములగు ధనార్జనసాధనమగు విద్యలను నేర్పుపాఠశాలలు మనదేశమున లేని హేతువుచేతను ఇప్పుడు దొరతనమువారిచే నియమింపఁబడిన పాఠశాలలు జనసామాన్యుల కంతగా నుపయోగకరములుగాలేవు. మనదేశమునఁ బూర్వమున్నతస్థితియందున్న చేతిపనులిప్పు డడుగంటిపోయియుండిన కారణముచేతను, నానాటికిఁ గర్షకులసంఖ్య వృద్ధియగుచు సేద్యమున కనువగునట్టియు లాభకరమగునట్టియు భూప్రదేశములు సులభసాధ్యములు గాకపోవుటచేతను, ననేకులకు వృత్తిచ్ఛేదము గలిగి స్వల్పమగు దినవెచ్చముల కనేకులు గాయకష్టముల ననుభవించుచుఁదనుయాత్రగడపుచున్నారు. అందనేకులుమార్జించుకొనగలుగు నత్యల్పమగు దినవెచ్చము లుదరపోషణమునకుఁజాలక క్షుత్పీడాజనితమగు ననేకవిధములగు రోగములచేఁ బీడింపఁబడుచు నకాలమరణము నందుచున్నారు. అన్నదాన మెంతయుత్తమమయినదైనను, బీదల కన్నమొసంగుట కెన్నిధర్మసత్రముల నేర్పఱచినను బ్రజలకు శాశ్వతోపకారకారణమును, బ్రజాదారిద్ర్య నాశనహేతు భూతములును ఎన్నటికిని గానేరవు. స్వతంత్రశక్తిగలిగి ధనమార్జించుకొని స్వేచ్ఛగా జీవింపఁగలుగు సాధనములను జనులకుఁ గలుగఁజేయుటవలనను, వారికి నేర్పించుటవలనను జనుల దరిద్రము మాన్పనగునుగాని యన్నసత్రములేర్పఱచి యన్నదానమొసంగుటవలననే జనుల హైన్యమెన్నటికినిఁ బోఁజాలదు. కాబట్టి ప్రజల హీనదశను దొలగించి దేశాభివృద్ధి గలుగజేయుటకు గర్మవిద్యలత్యావశ్యకమని చెప్పుటకెంతమాత్రమును సందియములేదు. ఇట్టికర్మవిద్యలను నేర్పు పాఠశాలలు మనదేశమున కిప్పుడత్యావశ్యకము గావునఁ జిరకాలమునుండి విద్యాభిమానులనియు, విద్యాపోషకులనియు, సకలకళాభిరతులనియు, బ్రజాపోషకులనియుఁ బరోపకారపారీణులనియు, దానధర్మాభిరతులనియుఁ గీర్తిగాంచిన సంస్థానాధిపతులగు మనజమీందారులు దమసద్వంశములకు నైసర్గికమగు నీయుదారసద్గుణములను బ్రకటీకృతముచేయుచుఁ బ్రకృతకాలమున కత్యావశ్యకమగు కృషి వాణిజ్య శిల్పశాస్త్రాదివిద్యలను నేర్పు కర్మవిద్యాలయముల నేర్పఱచి దేశక్షేమమాచరింపవలయును. ద్రవ్యసాధ్యమగు నీపని సాధారణులవలన నెరవేరుట దుర్ఘటము. మనజమీందారులు దమశక్తికొలదిని విద్యలనాదరించుచు, విద్యాదానమొసగుచుఁ జేతిపనులకుఁ బ్రోత్సాహము గలిగించుచుఁ దమకుదోచినవిధమునఁ దమద్రవ్యమిప్పుడు గొంతవఱకు వినియోగపఱచుచునేయున్నారు. కాని మనదేశమునఁ గేవలము భాషాపాండిత్యమువడయుట కుపచరించు పాఠశాలలుమాత్రమేయుండుటచేతను, మనదేశమునఁ బూర్వమున్న చేతిపనులును, శిల్పవిద్యలును నడుగంటిపోయియుండుటఁబట్టియు మనజమీందారులు చేయు ద్రవ్యసహాయమంతయు జనుల దుస్థితినిఁ దొలగించుటకును దేశాభివృద్ధి గలుగఁజేయుటకును నంతగా నుపచరించకున్నది. చేతిపనులును శిల్పవిద్యలునుఅడుగంటియుండుటచేతను విన్నాణములగు విదేశవస్తుజాలము దమ్ము మాటిమాటికి మోహింపఁజేయుచుండుటచేతను స్వదేశవస్తువులక్రిందఁ దాము వెచ్చించుద్రవ్యమును స్వదేశవస్తునిర్మాణము నుజ్జీవింపఁజేయుటకునుఁ బోషించుటకును దాము వినియోగపఱచుద్రవ్యమును నంతగా గణనీయముగా నగుపించుటలేదు. యంత్రసాధనము లేర్పడినతరువాతఁ జేతిపనులంతగాఁ బనివాండ్రకు లాభకరములుగాలేవు. పూర్వకాలమునందువలె నిప్పుడు చేతిపనులు చేయఁగల పనివాండ్రకుఁ బ్రోత్సాహముగలుగఁజేయుట సాధ్యముగాదు. కాబట్టి యిప్పటికాలమునకుఁ దగినవిధమున యంత్రసాధనములచేఁ బనులుచేయఁగలుగు కర్మవిద్యను నేర్పించుటకుఁ దగిన పాఠశాలల నేర్పఱచి యట్టివిద్యను వినియోగపఱచి జీవింపగలుగుటకు జనులకు యంత్రశాలాదిసాధనములను స్థాపించుటకు మనజమీందారులు పూనుకొనవలయును. ఈమహత్కార్యమునుఁజేయుటవలన వారు మనదేశమున కమితోపకారమునుజేసి మనదేశాభివృద్ధికిఁ దోడ్పడినవారగుదురు. అందువలనఁ దమకులాభమును గీర్తియుఁ బ్రజాసన్మానమునుఁ జిరకాలము స్థిరప్రతిష్ఠయు దేశాభిమాన మాననీయులను గౌరవమును జెందుదురనుట కెంతమాత్రమును సందియములేదు.

మనదేశమందున్న ప్రజలలో నూటికి డెబ్బదిమంది కృషివలనజీవించుచున్నారు. అట్లనుటవలన నూటిలో డెబ్బదిమందికి భూవసతిగలదనియెంచగూడదు. ఈడెబ్బదిమందిలో భూవసతిగలవారతిస్వల్పము. తక్కినవారందఱుఁ గృషివిషయికమైన పనులుచేయుచు నత్యల్పమగు దినవెచ్చములకుఁ బాటుపడు పాటకజనులేయనిగ్రహింపవలయును. ఇట్లుకూలిపనులవలన జీవనముచేయువారిసంఖ్య నానాటికిఁ బెరుగుచునేయు

న్నదిగాని తఱుగుటలేదు. కృషివిషయికములగు కూలిపనులు పండ్రెండు మాసములునుండవని యందఱకుఁ దెలిసినవిషయమే. అనావృష్ట్యాదిదోషములచేతను గాలవైపరీత్యమువలనను, గాటకములు మూలమునను భూస్వాములుగానున్న గర్షకు లనేకులు గాలక్రమమున ఋణపీడితులయి తమతమ భూవసతులను ఋణదాతలకుఁ గోలుపోయి దినవెచ్చములకితరులయొద్దఁ బనిచేసి జీవింపవలసివచ్చుచుండుటఁబట్టి కూలివలననే జీవనము చేయవలసినవారిసంఖ్య నానాటికభివృద్ధియగుచున్నది. అట్లు కూలివలన జీవనముచేయవలసిన వారైనను వ్యవసాయపుపనులయందుఁ గూలిపనులుచేసికొనుచుఁ బల్లెటిగ్రామముల నాశ్రయించి యుండవలసినవారగుచున్నారుగాని యంత్రశాలలు మొదలగువానియందుఁ గూలిపనులుచేసికొనుచుఁ బట్టణములందు నివసింపఁగలుగుట కాధారములేనివారగుచున్నారు. ఇట్టివారిస్థితిగతుల నభివృద్ధిపఱచినఁగాని దేశమభివృద్ధికి రానేరదు.

«కృషితో నాస్తి దుర్భిక్షమ్మ»ను నార్యోక్తినిఁబట్టియు మన హిందూదేశముగృషియే ప్రధానాధారముగలదియగుటఁబట్టియు వ్యవసాయాభివృద్ధి యొనరించినఁగాని మనదేశమభివృద్ధి నొందనేరదని నిశ్చయముగాఁజెప్పవలసియున్నది. పూర్వకాలమునందువలెఁగాక నిప్పుడీవిషయముకొఱకనేక నూతనసాధనములేర్పడి యున్నవి. అనాదిసిద్ధములగు విధములచేఁగాక నిప్పుడు క్రొత్తగాగనిపెట్టఁబడిన నవీనసాధనములచే మనదేశమునఁ గృషిజరుపఁబడుటలేదు. తగినయెరువులు మొదలగునవి యుపయోగపఱిచి భూసారము దఱిగిపోకుండ భూమిని గాపాడకపోయినచో సేద్యమువలన నానాటికి భూసారముక్షీణించి యల్పఫలమిచ్చుచుండును. మనదేశమందలి జనసంఖ్య నానాటికిఁ బెరుగుచున్నది. మనదేశస్థితినిఁబట్టి ప్రజాభివృద్ధి యెక్కువైనకొలఁది వ్యవసాయమే జీవనాధారముగా గలవారిసంఖ్యగూడ నానాటికిఁ బెరుగుచునే యున్నది. ఇట్లు కృషియే ముఖ్యాధారముగాఁ జీవించుజనులు దక్కువఫలవంతములగు ప్రదేశములను సేవ్యముచేయు నవసరముగలుగుచున్నది. అట్లు తక్కువఫలవంతమగు ప్రదేశములను సేవ్యముచేయ నారంభించినకొలఁదిఁ గర్షకులకు మిగిలెడిలాభమును భూసారము దఱిగిపోవుచుండుటవలనఁ బంటయుఁ దక్కువగుచున్నది. ఈకారణములఁబట్టియు మనదేశమునఁ బండిన ధాన్యములితరదేశములకుసులభముగాబంపబడుచుండుటచేతను నానాటికభివృద్ధియగుచున్న మనదేశప్రజకుఁజాలినంతవరకు మనదేశమునలభింపక ధాన్యాదులధరలు నానాటికిఁ బెఱుగుచుఁగర్షకులకునుదదితరులకునుగూడ జీవనాధారములు దగ్గిపోవుచు మనదేశప్రజలు నానాటికిదుస్థితికివచ్చుచున్నారు. మనదేశమునఁ బండింపఁబడిన ధాన్యాదు లితరదేశములకుఁ బోవుటవలన స్వదేశవాణిజ్య మభివృద్ధిజెంది రొక్కరూపకముగా మనకెక్కువద్రవ్యము లభించుచుండును. అందువలనమనకంత నష్టములేదనియేచెప్పవచ్చును. కానిమనదేశమందు భూములసారము దగ్గిపోయి తక్కువఫలము లభించుచుండుటచేఁ గర్షకులకు సేద్యమువలన లాభములేకపోవుటయు ధాన్యాదు లితరదేశముల కతిధారాళముగాఁ దీసికొనిపోబడుటచే మనదేశస్థులనందఱను బోషింపగలిగినంత పంటమనదేశమున మిగిలియుండకపోవుటవలన ధాన్యాదులధరలు పెఱిగిపోవుటయుగూడ తటస్థమగుచున్నది. భూసారము దఱిగిపోకుండ గాపాడుటచేతను, ఎక్కువఫలమును బడయుటకనువగు నవీనవ్యవసాయ సాధనములను గ్రహించుటవలనను మనదేశమందుఫలించు ధాన్యాదులమొత్తము నినుమడింపఁ జేయవచ్చును. అట్లుపంటల నభివృద్ధిపఱచుటవలన స్వదేశవాణిజ్యమున కించుకైనభంగముగలుగకుండఁ గర్షకులకును దదితరులకునుగూడ జీవనాధారమును గల్పించి వారిదుస్థితినిబాపి దేశమునకు లాభమును క్షేమమును గలిగింపవచ్చును. కాబట్టి వ్యవసాయశాస్త్రమును జక్కగా దెలిసికొని భూసారమభివృద్ధిపఱచి పంటలను వృద్ధిచేయుటకుఁ దగినంత సాధనముల నవలంబించి పనిచేయుట మిక్కిలి యవసరమని మనము రూఢిగా నమ్మవలసియున్నది. యూరోపుఖండమందలి దేశములయందును అమెరికా ఆస్ట్రేలియా మొదలగుదేశములయందును వాడుకలోనున్న వ్యవసాయసాధనములలో మనదేశమునకుపచరించు వానిని గ్రహించి యెక్కువలాభకరమగు నితరపంటలను బండించి మనదేశమునందలి వ్యవసాయము నభివృద్ధిపఱచవలసియున్నది. ఈవిషయములను జక్కగాబోధించి నేర్పుటకు గొన్నికృషిశాస్త్రములను నేర్పుపాఠశాలలును మాదిరిపొలములును మనదేశమున ముఖ్యముగా స్థాపింపబడవలసియున్నది. మఱియు వ్యవసాయదారులకుఁ గ్రొత్తవిత్తనములును లాభకరమగు క్రొత్తపైరులను సేవ్యముచేయుటకును నూతనమగు మార్గములచే సేద్యముచేయుటకుఁ గావలసిన సాధనములును సులభముగాలభించుటకుఁ దగినసదుపాయముల నేర్పఱచవలసియున్నది. ఇంతియఁగాక స్వల్పమైనవడ్డీలకు సులభముగా సేద్యమునకుగావలసిన పెట్టుబడిసొమ్ములభించుటకు వీలగుసాధనములనుగూడ నేర్పఱచవలసియున్నది. ఈవిషయములయందు దొరతనమువారు మనకుదగిన సహాయమునుజేయుచునేయున్నారు. కానిమనదేశమతివిస్తీర్ణమైనదియు వ్యవసాయముననే జీవించవలసిన జనులసంఖ్య మిక్కిలియెక్కువగా నుండుటయేగాక నానాటి కభివృద్ధినొందుచుండుటయు నాలోచింప దొరతనమువారు వ్యవసాయాభివృద్ధివిషయమున మనకొసగుచున్నసహాయము మిక్కిలియల్పమని చెప్పకదప్పదు.

వ్యవసాయ మభివృద్ధినొంది భూసారమును బంటలును బెఱుగుటవలన లాభమందువానిలోఁ బ్రప్రథములు భూస్వాములును గర్షకులునని చెప్పవలసియున్నది. కావున వ్యవసాయమభివృద్ధియైనకొలఁదిఁ దమకులాభమెక్కువగా లభించునను నంశమును గ్రహించి భూస్వాములు స్వలాభాపేక్షమఱువక వ్యవసాయమభివృద్ధియగు మార్గముల నవలంబించు టత్యావశ్యకము. మనజమీందారులీవిషయమందు మిక్కిలిశ్రద్ధవహించి పనిచేయవలసియున్నది. తమజమీను భూము లధికఫలవంతములుగాఁ జేయఁబడి నవీనసాధనములచే సేద్యముచేయఁబడుటవలన జమీందారులకుఁ గలుగులాభమమితమని చెప్పుటకెంతమాత్రమునుసందియములేదు. కావున స్వలాభమును బ్రజాక్షేమమును దలచిమనజమీందారులీవిషయమందు మిక్కిలిశ్రద్ధతోఁ బనిచేయవలయును. తమజమీనులందు వ్యవసాయసాధనములను బోధించుపాఠశాలలను నియమించి

మాదిరిపొలముల నేర్పఱచి క్రొత్త పైరులకు విత్తనములను సమకూర్చి భూసారమభివృద్ధియగుటకుఁ దగిన యెరువులను దెప్పించి వ్యవసాయమభివృద్ధి పఱచుటకుఁ దగిన నూతన సాధనములను సులభసాధ్యముగా నలవఱునట్లొనర్చి కర్షకులకు జమీందారులు సహాయమొసఁగి తమ జమీను భూముల నతిఫలవంతములుగను సారవంతములుగను నొనర్చి తామెంతయయిన లాభమును బడయుటకుఁ బ్రయత్నించుటవలన నమితదేశోపకార మొనరింతురనుట కెంతమాత్రమును సందియములేదు. కాబట్టి తమకును తమ ప్రజలకును లాభకరమును శ్రేయోదాయకమును నగు నీ విషయమును మన జమీందారులు చక్కగా నాలోచించి కర్తవ్యములను జేసి దేశోపకార మొనరింపవలయునని కోరుచున్నాఁడను.

కేవలము భోజ్యములగు ధాన్యాదులనే గాక ప్రత్తి నార మొదలగు పంటలనుగూడ విశేషముగాఁ బండించుటకుఁ దగిన ప్రోత్సాహముల నొసఁగుట మిక్కిలి లాభకరముగా నుండును. వెలహెచ్చుగల ప్రత్తి మొదలగు విదేశవస్తువులను మన దేశమునఁ బండించుటవలన మిక్కిలి లాభముగలుగును. కావున నట్టి పైరులను జమీందారులు దమ జమీను ప్రదేశములయందుఁ బండించుటకుఁ దగిన సాధనములను సమకూర్చి వ్యవసాయదారులకు సహాయమొసఁగవలయును. మన దేశమునందలి కర్షకులు విద్యాశూన్యులును, ధనహీనులును నూతన వ్యవసాయసాధనములను బొత్తుగా నెఱుఁగనివారును, నసహాయులును గావున దమ లాభమును దాము గుర్తెఱుఁగనేరకయు నొకప్పుడు గాకపోయిన నొకప్పుడైనఁ దమ లాభమును దెలిసికొనఁగలిగినవారైనను దాము లాభమందుటకుఁ గావలసిన ప్రోత్సాహము నందఁ జాలకయు నానాటికి నతిహీనస్థితికి వచ్చుచున్నారుగదా. తమ రయితుల స్థితి బాగుపఱచి తమ జమీను భూములలో వ్యవసాయమభివృద్ధి పఱచుటవలన జమీందారులు దేశమున కమితోపకారమును జేయఁగలుగుదురు.

వ్యవసాయము చేయు జనులసంఖ్య యభివృద్ధియైనకొలఁది వ్యవసాయము వలన లభించు లాభము దఱుఁగుచుండునని నేనిదివఱకే చెప్పియున్నాను. కాని యంత్రసాధనములను స్థాపించి వస్తునిర్మాణ మొనరించుట వలన మాత్ర మట్లు కానేరదు. పెద్ద యంత్రముల నేర్పఱచి యెక్కువమంది మనుష్యులచేఁ బనిచేయించుటవలన నెక్కువ వస్తువులు తయారుచేయించుటకు వీలుకలుగును. అట్లెక్కువ వస్తువులను దయారుచేయించుటకు ఖర్చు మాత్ర మంత యెక్కువగా నుండదు. దినమునకు నూరు బస్తాల బియ్యము యంత్రసాధనమునఁ జేయించుటకగు ఖర్చు మొత్తమునకన్న దినమునకయిదువందల బస్తాల బియ్యము దయారుచేయించుటకగు కర్చు మొత్త మెన్నటికి నైదురెట్లగునని తలఁచఁగూడదు. ఎక్కువ సంఖ్యగల బస్తాల బియ్యము దయారుచేయించినకొలఁది బస్తా బియ్యమును దయారుచేయుటకగు కర్చు స్వల్పమగుచుండును. ఈవిధముననే యంత్రసాధనములవలనఁ దయారుచేయఁబడు వస్తువులకన్నిటికిని గర్చులు దక్కువగుచుండును. అర్థశాస్త్రపరిచయము గల వారికీ విషయమునుగూర్చి యంతగా విశదపఱచవలసిన యవసరములేదు. వ్యవసాయమునకును యంత్రసాధనమూలమునఁ జేయఁబడు వస్తుచయమునకును గల తారతమ్యమును ఆ రెండు విషయములవలనను సంభవించు లాభమందలి భేదమును అర్థశాస్త్రజ్ఞులకుఁ జక్కగా దెలిసియేయున్నది. కావున నావిరి యంత్రములను స్థాపించి పనిచేయించుటవలన మిక్కిలి లాభమున్నదని చెప్పుట కెంతమాత్రమును సందియము లేదు. చేతితో పనిచేసి వస్తువులను దయారుచేయుటకన్న యంత్రసాధనములచే వస్తువులను నిర్మించుటకుఁ గర్చులు దక్కువగును. అట్లు తక్కువ ఖర్చులకు వస్తువులను దయారుచేయఁ గలుగుటవలన నట్టి వస్తువులను యథాలాభమునకే తక్కువ మూల్యమున కమ్మకము చేయవచ్చును. ఆవిధముగా దక్కువ మూల్యమునకు వస్తువుల నమ్మగలుగుటవలన నెక్కువ వస్తువుల నమ్మగలుగుటకును నెక్కువ లాభమును సంపాదించఁగలుగుటకును బ్రజలకుఁ జవుకగా వస్తువులు సమకూరునట్లు చేయుటకును వీలుకలుగును. కాబట్టి యంత్రసాధనములను స్థాపించి విరివిగా వస్తువులను దయారుచేయించుటవలన నట్టి యంత్రస్థాపనాధికారులకును బ్రజలకునుగూడ మిక్కిలి లాభకరముగను శ్రేయోదాయకముగను నుండుననుట కెంతమాత్రమును సందియములేదు.

మన దేశమున ఫలించుచున్న పైరులలో వస్తునిర్మాణమునకుఁ బనికివచ్చు ప్రత్తి నార తైలబీజములు చెఱకు తాటిబెల్లములు కరక్కాయలు మొదలగు పదార్థములనేకములు మిక్కిలి విరివిగా ఇంగ్లాండు మొదలగు విదేశములకు ధారాళముగా దీసికొనిపోఁబడి యక్కడ యంత్రసాధనముల సహాయమున వస్త్రాదికములగు ననేకవిధములగు వస్తువులుగా దయారుచేయఁబడి తద్వస్తువులు దిరిగి మన దేశమునకుఁ దీసికొనిరాఁబడి విశేషలాభమునకు మనకమ్మఁబడుచున్న విషయమందఱకుఁ దెలిసియేయున్నది. అట్లు మన దేశమున ఫలించినవానిని విదేశములకంపి యచ్చట వానివలనఁ దయారుచేయఁబడిన వస్తువులను మనము విశేషమూల్యమునకుఁగొని యన్యులకు లాభము గలిగించుటకన్న మన దేశమునందే యంత్రశాలలను స్థాపించి మన దేశమునఁ బండిన పదార్థములనెల్ల నా యంత్రశాలలయందు వస్తునిర్మాణమునకు వినియోగపఱచి యా వస్తువులను మన దేశమందును నితర దేశములయందును విక్రయించుటవలన మన దేశప్రజలకా వస్తువులిప్పటికంటె మిక్కిలి చవుకగా లభించుటయు యంత్రాధికారులకు లాభము కలుగుటయు, యంత్రశాలలయందుద్యోగములును బనులును లభించుటవలన మన దేశప్రజల కెందరికో జీవనాధారమేర్పడుటయు, మన దేశమునఁ దయారుచేయఁబడి విదేశములకంపఁబడి యచ్చట విక్రయింపఁబడు వస్తువుల మూలమున నితర దేశముల ద్రవ్యమును మన దేశమాకర్షింపఁగలుగుటయు సంభవించునుగదా? దూది మొదలగు స్థూలపదార్థములను విదేశములకంపి యచ్చట వాటివలనఁ దయారుచేయఁబడిన వస్తువులు దిరిగి మన దేశమునకుఁ దేఁబడి యిక్కడ మనకు విక్రయింపఁబడుటయందు వాని మూల్యములో దొలుత నాయా వస్తురచనకుఁ దీసికొనిపోఁబడిన స్థూలపదార్థములకు వెచ్చింపఁబడిన కేవు కర్చులును దరువాత వస్తురూపమున మన దేశమునకుఁ దీసికొనివచ్చుటకు వెచ్చింపబడిన కేవుకర్చులును గలసియున్నవి. మన దేశమందే యంత్రములను స్థాపించి వస్తువులను దయారుచేయఁగలిగిన యెడల మనమిప్పుడిచ్చుచున్న కేవుకర్చుల నిచ్చుకొనవలసిన యవసరము లేకయే ఆ వస్తువుల నిప్పటికంటె చవుకగాఁ జెందఁగలమనుట కెంతమాత్రమును సందియములేదు.

మఱియు వస్తునిర్మాణమునకుఁ గావలసిన పదార్థములన్నియు మనదేశమున సులభముగా లభించుటయేగాక నితరదేశములయందువలె గాక మనదేశమందు దినవెచ్చ మల్పమగుటచేతను యంత్రసాధనములకు గావలసిన వంటచెఱుకు, నేలబొగ్గు, నీరు మొదలగునవి సులభసాధ్యములగుటవలనను నితరదేశములకన్న మనము మనదేశమందుఁ దక్కువకర్చులకు యంత్రసాధనమూలమున వస్తువులను దయారుచేయఁ గలమనుట కెంతమాత్రమును సందియములేదు. కర్చులు తక్కువయైన కొలది లాభమెక్కువగాఁ గలుగుచుండునని నేనిదివఱకే చెప్పియున్నాను. కాబట్టి యీకారణములనన్నిటినిబట్టి మనదేశమున యంత్రశాలలను స్థాపించి మనదేశమందు బండువస్తువులనెల్ల వానియందుపయోగపఱిచి వస్తువులను దయారుచేయుటవలనఁ గలుగులాభమింతింతయని జెప్పనలవికాదుగదా! ఇట్టిలాభమును మనము గ్రహింపఁజాలకఁ జేతకానివారివలె యూరకుండుట మిక్కిలి శోచనీయముగదా! యంత్రసాధనములు ప్రబలినతరువాతఁ జేతిపను లడుగంటిపోయినవి. నేతగాండ్రు మొదలగు పనివాండ్రకు వృత్తిచ్ఛేదముగలిగి కూలివాండ్రుగను, నూరూరు దిరిగి బిచ్చమెత్తుకొను బిచ్చగాండ్రుగను బ్రతుకవలసివచ్చినది. ఇట్లు నానాటికి మనప్రజలదుస్థితి పెఱుగుచునేయున్నదిగాని తరుగుటలేదు. ఇంతియగాకఁ గఱవుదినములలో దొంగలు ప్రబలుటయు ఘోరకృత్యములు వృద్ధియగుటయు మనము చూచుచునేయున్నాము. దరిద్రత ధనాశకుమూలము. ధనాశ యెట్టిదుష్కార్యములనైనఁ జేయించును. ఆకలిచేఁ గడుపుగ్రాలుచున్నవాడెట్టి ఘోరకార్యమునైనఁజేయ వెనుకదీయడు. కాబట్టి మనదేశమందలిజనులు నానాటికి దరిద్రులగుచుండుటచే మనకెట్టి యాపద సంప్రాప్తమగుచుండునో క్షుద్బాధాపీడితులగునట్టి దరిద్రులెంతెంత ఘోరకృత్యములను జేయుట కవకాశము గలిగించుచుందురో తినుటకన్నమును గట్టుకొనుటకు బట్టలునులేక శరీరములు కృశించి శీతవాతాదిదోషములకుఁజిక్కి రోగపీడితులై ప్రతిసంవత్సరము నెందఱెందఱు రకాల దుర్మరణముల నందుచున్నారో మనముగ్రహించి యట్టినిర్భాగ్యుల దురవస్థలనుబాపుట మనకుఁ బరమధర్మమనియు నమితపుణ్యమనియు నిశ్చయముగానమ్మి యట్టివారల దురవస్థలనుమాన్పి పరోపకారమొనరించి మనదేశమునభివృద్ధి పఱచవలయును. యంత్రాదిసాధనముల నేర్పఱిచి కేవలము కృషిసాధనమే జీవనోపాయముగా నుండకుండఁజేసినచో మనములాభమందుటకును బీదలు దరిద్రత వదలి సంతుష్టిగాజీవింపఁగలుగుటకును వీలుగలుగును. దమకులాభకరమును నితరుల కుపకారకారణమునునగు నిట్టికార్యములను జేయుటకన్న మనము చేయఁదగిన దేశోపకారమేదియునులేదనియు నాతాత్పర్యము. ధర్మచింతగలిగి పరోపకారబుద్ధితో నితరులకు సహాయముచేయుటయు శిల్పశాస్త్రాదివిద్యలను జేతిపనులను బోధించుటయు బీదల కన్నప్రదానముగావించుటయు విద్యాదానమొనరించుటయు మొదలగు సత్కార్మాచరణము మనజమీందారులకు వంశధర్మములనియు వెన్నతోఁడఁ బెట్టినవనియు నేనిదివఱకే చెప్పియున్నాను. కాబట్టి మనజమీందారులీవిషయమును జక్కఁగాఁబాటించి యంత్రశాలలను స్థాపించి తాము లాభమందుచు నితరులకు లాభముగలుగఁజేయుచు స్వదేశవాణిజ్యమభివృద్ధిపఱచి దేశాభివృద్ధికిదోడ్పడవలయునని కోరుచున్నాడను.

మనదేశమునకుఁ రత్నగర్భయను నామధేయము సార్థకమనుట కెంతమాత్రమును సందియములేదు. మనదేశమున లభించనిపదార్థములేనేలేదు. పలువిధములగుపంటలు పండుటకుఁ దగిన సారవంతములగు ప్రదేశములును, అమూల్యములగులోహములును, రత్నములును, అనేకచిత్రవిచిత్రములగు వస్తువులునుమనదేశమున విస్తారముగలభించుచున్నవి. ఇట్లనేకపదార్థములు దొఱకునట్టియు, వస్తునిర్మాణమున కావశ్యకమగు సదుపాయములన్నియు సులభసాధ్యము లగునట్టియు ననుశ్రుతముగాఁ జేతిపనులుజేయుటయం దారితేరి వస్తురచనయు, శిల్పకళానివేశతయుఁ గులవృత్తిగాగల జనులనేకులు సులభవేతనములకు లభించునట్టియు మనదేశము నభివృద్ధిపఱచుటకుఁ జేయవలసిన లాభకరమగు కార్యముల నేమరియుండుటుచితముగాదు.

వ్యవసాయాభివృద్ధియొనరించుటకు వ్యవసాయదారులకు విత్తనములు దుక్కిపశువులు యెఱువు మొదలగునవి సంపాదించుకొనుట కుపచరించునట్లును దొరతనమువారు రెండు చట్టములనుజేసియున్నారు. ఆచట్టములు చాలకాలమువఱకు ప్రయోజనకరములుగానుండుట కవకాశము గలుగలేదు. అందుకుఁగారణము భూస్వాములును వ్యవసాయదారులును వానిలాభమును బొందఁజాలని తెలివిహీనులును మూఢులును స్వలాభమెఱుఁగని యవివేకులును, అనిఎంచగూడదు. మనభూస్వాములును వ్యవసాయదారులును యెంతవిద్యాగంధములేనివారైనను స్వలాభముబొత్తుగాగ్రహింపఁజాలని యవివేకులు మాత్రమెన్నటికినిగారు. ఆచట్టముల స్వభావమును ఉపయోగమును అందువలనిలాభమును భూస్వాములకును వ్యవసాయదారులకును, నంతగాలేకపోవుటయు వానియమలంత లాభకరముగాలేకపోవుటయు నిందుకు వాస్తవమైనకారణమని నిశ్చయముగాజెప్పవలసియున్నది. చట్టములయుద్దేశమెంత శ్లాఘాపాత్రమైనదైనను వానియుపయోగము లెంతలాభకరములైనవైనను వానియమలుచక్కగానుండకపోయినచో వానిప్రయోజనమేమియులేదుగదా! అట్లీ రెండుచట్టములును జాలకాలమువఱకుఁ బ్రయోజకరములుగాకయే పడియుండవలసినకారణముగలిగి భూస్వాములకుగాని వ్యవసాయదారులకుగాని వానియుపయోగము లేకపోయినది. ఆచట్టములవలన దొరతనమువారు సదుద్దేశముగలవారనియు వ్యవసాయాభివృద్ధికి సహాయముచేయుటకు సంసిద్ధులనియు మాత్రము జగద్విదితముచేయుట కుపచరించినవి. గ్రంథవిస్తరభీతిచేతను అప్రస్తుతప్రసంగమగునను దలంపుచేతనువాని విషయమునుగూర్చియు వానివలనలాభమును నుపయోగమును లేకపోవుటకుఁగల కారణములనుగూర్చియు నీసమయమునఁ జెప్పుటకు విరమించుచున్నాడను.

పదిసంవత్సరములనుండి దొరతనమువారీ రెండు చట్టములను ప్రయోజనకరములుగా నుండకపోవుట గ్రహించి వ్యవసాయాభివృద్ధి పఱచుటకు నీటివసతు మొదలగు సదుపాయములను బొందగలుగుటకు దగిన సలహాలనొసఁగి భూస్వాములకు సహాయము జేయుటకొక యుద్యోగస్థుని నియమించి యాయుద్యోగస్థుని శిఫారసుమీద భూస్వాములకు స్వల్ప వడ్డీకి ఋణమొసఁగి నీరుతోడుయంత్రములు మొదలగునవి సమకూర్చుకొనగలుగుటకు దోడుపడుచున్నారు. దొరతనమువారి సదుద్దేశము సఫలీకృతమై భూస్వాములకును, వ్యవసాయదారులకును మిక్కిలి లాభకరముగానుండును గాకయని కోరుచున్నాడను. తరువాతనాలుగైదు సంవత్సరములనుండి దొరతనమువారు వస్తునిర్మాణమునకు యంత్రములను స్థాపించి పనిచేయించువారికిఁ దగినసలహాలనిచ్చి యంత్రములను దెప్పించిపెట్టి వాటిని స్థాపించి సహాయమొసఁగుటకుగూడ మఱియొకయుద్యోగస్థుని నియమించి మనకుపకారముచేయుచున్నారు. ఇట్టిమహత్కార్యములకుఁ దక్కినసహాయముండ ద్రవ్యసహాయము ప్రధానమనుటకెంతమాత్రమును సందియములేదు. కావునదొరతనమువారు వ్యవసాయాభివృద్ధికొఱకు భూస్వాములకు ఋణములొసగునట్లు యంత్రశాలలను నిర్మించువారికి గూ[illegible] ఋణము లొసగుటకుఁ బ్రయత్నింతురుగాకయని కోరుచున్నాడను. యంత్రశాలలనుస్థాపించి పనిసేయఁగడఁగువారికి విస్తారము మొత్తములు ఋణమియ్యవలసిన యవసరము గలుగుచుండుననుటకు సందియములేదు. అట్లు విస్తారము మొత్తము ఋణమిచ్చుటకు దొరతనమువారికి ద్రవ్యము చాలకపోయినను వారు దేశాభివృద్ధియు దేశక్షేమమును జక్కఁగా నాలోచించి యితరదేశములయందు ఋణముచేసియైన మనకార్యమునకుఁ దోడ్పడవలయునని నాయభిప్రాయము. దేశమభివృద్ధి పఱచునుద్దేశముతో విస్తారము మొత్తములు ఋణముగాఁగొని రైలుబాటలు మొదలగునవి యేర్పఱచుచున్నప్పుడు దొరతనమువారీకార్యమునకు సహాయమొసఁగుటకుమాత్రమెందుకుఋణముచేసి దేశమునభివృద్ధి పఱచకుండవలయును? అట్లుచేయుటవలన దొరతనమువారి కెంతమాత్రమును నష్టములేదనియు మనదేశమునకు మహోపయోగకరముగా నుండుట కెంతమాత్రము సందియములేదనియు నేనుదృఢముగాఁ జెప్పగలను.

స్వల్పమొత్తములు ధనముగలవారనేకులుగూడి భాగస్థులుగాజేరి గొప్పమొత్తమగు ధనమునుజేర్చి మహత్కార్యములను జేయునలవాటును నుత్సాహమును మనదేశస్థులకులేదు. వ్యవహారజ్ఞానమును నార్జితమును బట్టుదలయు నోరిమియు నన్యోన్యవిశ్వాసమును, స్థైర్యసాహసములును, వ్యవహారనిపుణత్వమును మొదలగుగుణము లిట్టిగొప్పకార్యముల కత్యావశ్యకము. వాణిజ్యప్రాభవములేని మనదేశమందు మనవారికి వ్యవహారాభివృద్ధి కత్యావశ్యకమగు నీగుణములంతగా సామాన్యముగాలేవు. వ్యవహారవాణిజ్యాభిరుచిగల ద్రవ్యవంతులనేకులిప్పుడిప్పుడు గొప్పగొప్పపట్టణములయందు బయలువెడలి పనిచేయుచు మనదేశస్థులు కేవలము వ్యవహారవాణిజ్యములకు బనికిరానివారనియు నందుకు ముఖ్యముగాగావలసిన గుణములనెన్నటికిఁ బడయజాలనిమూర్ఖులనియుఁ జెప్పెడియపవాద కేవలమన్నృత వాచకముగాఁజేయుచున్నారు. ఈయంశములనుబట్టి యోచింపమనదేశపు ప్రజ లచిరకాలములో వ్యవహారవాణిజ్యముల కత్యావశ్యకమైనగుణములను బడసి యింగ్లాండు అమెరికాదేశములయందు వాణిజ్యవ్యవహారములయందుఁ జిరకాలమునుండి యారితేరినవారితో సమానమగు ప్రజ్ఞానిపుణత్వములుగలిగి గొప్ప గొప్పవ్యాపారములను జేయఁగలరనుట కెంతమాత్రమును సందియములేదు. మనదేశపుజనులలోఁ బారసీకులు, యూదులు, మారవాడీలు, గుజరాతులు, వైశ్యులు, నాటకోటిశెట్లు, కొన్నితెగలమహమ్మదీయులు మొదలగుజాతులవారు వాణిజ్యవ్యాపారములయం దారితేరినవారని మనమందఱమెఱిగియేయున్నాము. ఇట్లు వాణిజ్య వ్యాపారములయందు ప్రజ్ఞగలవారిసంఖ్య నానాటికభివృద్ధినొందుచునేయున్నది. కాబట్టిధనసహాయము సులభముగాదొరకినచో మనవారు మిక్కిలిలాభకరములగు గొప్పవ్యాపారములను జేయగలుగుట కెంతమాత్రమును సందియములేదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. అట్టిధనసహాయము శ్రీమంతులగు మనజమీందారుల వలనను దొరతనమువారివలనను లభింపవలయునుగాని మఱియొకవిధముగా లభింపదు. మనదేశమందలిజనులలో వాణిజ్యవ్యాపారమునే జీవనాధారములుగా గలిగి కులవృత్తిగా జీవించుజాతులవారీవిషయములోఁ జేయఁదగినపనులు చేయుచునేయున్నారు. తదితరులలో ధనికులగు వారుమాత్రమట్టికార్యములయందుఁ జొరబడకున్నారు. మనజమీందారులలో ధనికులగువారు గూడ నిట్టివిషయములలోఁ దగినప్రయత్నములనుజేసి దేశాభివృద్ధికిదోడ్పడవలయును.

దేశాభిమానము మిక్కిలి శ్లాఘనీయమైనదని చెప్పుట కెంతమాత్రము సందియములేదు. తన్నుగనిపెంచిన తల్లియందెట్టిగౌరవమును విశ్వాసమును యభిమానమును నుండుటెట్టి మానవధర్మమో తానుపుట్టిపెఱిగి తనదనిచెప్పుకొను స్వదేశమందుఁగూడ ప్రతిమానవునకు నట్టిగౌరవమును విశ్వాసమును అభిమానమునునుండుట ముఖ్యధర్మము. కావునఁ దనస్వదేశము నభివృద్ధి పఱచి గౌరవోన్నతదశకుఁ దెచ్చుటకుఁ బ్రతిమనుష్యుడును శక్తివంచనలేకుండ బాటుపడుట ముఖ్యకార్యమనియుఁ బరమధర్మమనియుఁ జెప్పకదప్పదు. అట్లు స్వదేశాభిమానమును బ్రకటించుటకు జనులు స్వలాభమును కేవలము నిరాకరింపవలయునని నిశ్చయించుటకు వలనుపడదు. స్వార్థత్యాగులై స్వలాభమించుకైనఁ బాటింపకఁ గేవలపరోపకారబుద్ధితోఁ దమదేశాభివృద్ధికిఁ బాటుపడు మహనీయులు మిక్కిలి పూజ్యులనుట కెంతమాత్రమును సందియములేదు. అట్టిమహనీయులగు సత్పురుషులు వెయ్యింటికొక్కరైన లభించుట మిక్కిలియరుదు. కాబట్టి దేశాభిమానముగలిగి స్వదేశాభివృద్ధికొఱకు స్వల్పమూల్యములకు లభించు విదేశవస్తువులను నిరాకరించి యంతకంటె నెక్కువమూల్యములకు స్వదేశవస్తువులను మనదేశస్థులు గ్రహింతురని నమ్ముట కేవలము పిచ్చితనమనినాయభిప్రాయము. స్వార్థత్వమును నహంభావమును మానవనైసర్గికగుణములు. జనసామాన్యులట్టి మానవనైసర్గికగుణములను త్యజించుట మిక్కిలికష్టసాధ్యము. అందు ద్రవ్యహీనులగువారిట్టి స్వార్థత్వమును స్వలాభమునువదలి యుండఁగలుగుట

మిక్కిలి యసంభవము. కాబట్టి స్వదేశవస్తువులను జనులు గ్రహింపవలయునన్నచో యంత్రాదిసాధనములచే వస్తునిర్మాణమును విరివిగానొనరించి యవి యల్పమూల్యములకు జనులకు లభించునట్లొనరించి వారు విదేశవస్తువులను నిరాకరించునట్లొనరింపవలయును. అమ్మువానికిని గొనువానికినిగూడ లాభముగాని భావిలాభాపేక్షగాని లేకపోయినచో వ్యాపారమెన్నటికిని జరగనేరదు. కాబట్టి యుభయులకు లాభకరమును క్షేమకరమును నగు మార్గముల నవలంబించుటవలనఁ బ్రయోజనమున్నదిగాని స్వార్థత్యాగమును స్వలాభాపేక్షయు ద్యజింపుమని యుద్బోధించుటవలనఁ గొంచెమైనను ప్రయోజనములేదు. ఆరంభశూరత్వమువలనఁ గొందఱిట్టికార్యమునకుఁ గంకణముగట్టుకొని పనిచేసినను ఆయుత్సాహమచిరకాలములో మాసిపోయి పరులహాస్యమునకుఁ బాత్రముకాకపోదు. కావున నట్టి యసాధ్యప్రయత్నములను వదలుకొని యత్నసాధనమునకుఁ దగినమార్గముల నవలంబించి వృథాకాలయాపన మొనరింపక నేనుచెప్పినవిధమున దేశాభివృద్ధికిఁ బాటుపడవలసినదని వినయపూర్వకముగా మనవిచేయుచున్నాను.

ప్రతికార్యమును జమీందారులే చేయవలసినదని యుద్దేశింపనేలయనియుఁ బ్రతివిషయమునకును జమీందారుల సహాయమే యెందుకపేక్షింపవలెననియుఁ గొందఱనవచ్చును.

మనజమీందారులు పరోపకారచింతగలవారనియు ధర్మబుద్ధిగలవారనియు ధనవంతులనియుఁ బలుకుబడిగలవారనియు ననేకేతరావకాశములుగలవారనియు వారు దేశోపకారసాధనములగు కార్యములకుఁ దోడ్పడవలసినదని నాయభిప్రాయము గాని యీభారమంతయు వారే భరింపవలసినదనియు నితరు లూరకుండవలయుననియు నాయభిప్రాయమెన్నటికినిగాదు. ప్రపంచమున జన్మించిన ప్రతిమానవునకును దాను నెరవేర్చవలసిన విధులు గొన్ని గలవు. మనుష్యునకుగల జ్ఞానాభివృద్ధినిబట్టియుఁ బ్రయోజకత్వమునుబట్టియు, విద్యనుబట్టియు, ద్రవ్యసంపత్తినిబట్టియు, సాధనసంపత్తినిబట్టియు, నితరవకాశములనుబట్టియు నీవిధులును ధర్మములును గర్తవ్యములై యుండును. మన జమీందారులు దక్కినవారికన్న నిట్టికార్యములనుజేయుట కెక్కువసాధనసంపత్తిగలవారగుటబట్టి మనదేశాభివృద్ధికిఁదోడ్పడుట వారికెక్కువ విధికృతమనియు ముఖ్యధర్మమనియు నాతాత్పర్యము.

మనదేశమున కెట్టెట్టి విపత్పరంపరలు సంప్రాప్తమైనను మనదేశమందలి ద్రవ్యమెన్నెన్నివిధములు నెన్నెన్నిపర్యాయము లెందఱెందఱిచేఁగొల్లగొనిపోఁబడినను మనదేశపుప్రజ లెన్నిపర్యాయము లెంతవఱకెన్నెన్నివిధములఁ బీడలఁజెంది కష్టములకుఁ బాలుచేయఁబడి క్షోభింపఁబడినను మన యదృష్టమువలన నాంగ్లేయుల ప్రభుత్వము మనకు సంప్రాప్తమగుటబట్టి మనదేశమునకు మంచిదినములిప్పటి కింతదీర్ఘకాలమునకు దైవానుగ్రహమువలన సంప్రాప్తమైనవి. ఆంగ్లేయ ప్రభుత్వమువలన మనదేశమునకును మనకును గలిగిన యమితలాభములును ముందు చిరకాలములో మనకు నిశ్చయముగాఁ గలుగనున్నలాభములును ఇన్నియన్నియని చెప్పనలవికాదు. ప్రజాస్వాతంత్ర్య మాంగ్లేయప్రభుత్వమువలనమనకులభించిన యమూల్యమైనగొప్పలాభమని యందఱకుఁ దెలసియేయున్నది. ఇట్టిస్వాతంత్ర్యము మనప్రభువులు మనయోగ్యతలనుబట్టియు యుచితత్వమునుబట్టియు మనశక్తిసామర్థ్యములనుబట్టియు మనకుఁ గ్రమక్రమముగా నొసఁగుచున్నారనియు మనమట్టిస్వతంత్రతకును రాజ్యతంత్రమంను మనముచెందఁగలిగిన శక్తియుక్తులనుబట్టియు నార్జితమునుబట్టియు మనకు నిశ్చయముగా సంపూర్ణరాజ్యస్వతంత్రమును యోగ్యతయు దొరతనమువారొసంగుట కెంతమాత్రమును సందియములేదనియు మనము నిశ్చయముగా నమ్మియుండుటకుఁ దగినప్రభుత్వము మనకులభించినది. రాజభక్తియుఁ ప్రభువిశ్వాసమును గృతజ్ఞతయుగలిగి రాజ్యతంత్రములను జక్కగాఁ దెలసికొనఁగలుగు విద్యయు శక్తియుక్తులును మనము సంపాదించుకొననేర్చినకొలఁది మనకు దొరతనమువారు స్వాతంత్ర్యముల నొసఁగుచుందురు గావున మనమట్టివిద్యయు శక్తియుక్తులును సంపాదించుకొనుటకుఁ దగినప్రయత్నములను బూనికతో చేయుచు దొరతనమువారి విశ్వాసమునకుఁ బాత్రులమగురీతిని బ్రవర్తింపవలయును.

మనదేశమతి విస్తీర్ణమైనదియు ననేకవిధములగు నాచారభేదములతోనున్న యనేకజాతులును మతములును గల పలువిధములగుజనులతోఁ గలసియున్నట్టిదియు నైనను నాంగ్లేయ రాజ్యపరిపాలనావిధులనుబట్టియు మనకు దొరతనమువారొసఁగిన విద్యవలన జనించిన జ్ఞానసంపత్తినిబట్టియు నాసేతుహిమాచలపర్యంతము మనదేశమందలి జనులందఱు నొక్కటిగాఁ గలసిమెలసి దేశక్షేమమునకొఱ కన్యోన్యము సహాయము చేసికొనుచుఁ బనిచేయుట కవకాశము మనకిప్పుడు గలిగియున్నది. ప్రజాసౌఖ్యమునకును బ్రజల క్షేమలాభములకొఱకును గావలసిన సదుపాయములనెల్ల దొరతనమువారొసఁగుటకుసంసిద్ధులైయుండి మనయభిప్రాయమును మనకోర్కెలను వారితో ధారాళముగా మనవిచేసికొనగలుగుట కనేక సదుపాయములను అవకాశములను మనకొసంగుచున్నారు. దొరతనమువారి యుద్దేశములను అభిప్రాయములను బ్రజలకును బ్రజల స్థితిగతులను వారికోర్కెలను దొరతనమువారికిని విశదీకరించి బోధింపఁగలుగుటకు నుభయపక్షములవారికిని విశ్వాసపాత్రులగునట్టి శక్తిసామర్థ్యములును విద్యయు గలిగినట్టియు నార్జితులును వివేకులును నగు మహనీయులు మనవారిలోఁగొందఱు మనదేశాభివృద్ధి కత్యావశ్యకము. అట్టిమహనీయులు మనలో నిప్పుడనేకులు బయలువెడలి మనదేశాభివృద్ధికొఱకు స్వలాభమును ద్యజించి పాటుపడి పనిచేయుచున్నారు. మనజమీందారులకు దొరతనమువారు గ్రొత్తస్వతంత్రములను గ్రొత్తయధికారపదవులను దయచేసి వారుగూడఁ దమక్షేమాభివృద్ధికొఱకును దేశాభివృద్ధికొఱకును బనిచేయుటకుఁ దగిన యవకాశముల నొసగినారు. అట్టియధికారమును స్వాతంత్ర్యమునుమనజమీందారులు దమక్షేమలాభములకొఱకును దేశాభివృద్ధికొఱకును బూర్తిగా వినియోగపఱచవలయునని నాముఖ్యాభిప్రాయము. దొరతనమువారికి వంశమర్యాదనుబట్టియు, నౌన్నత్యపదవినిబట్టియు, బలుకుబడినిఁబట్టియు మనజమీందారులయందు గౌరవముగలదని చెప్పుట కెంతమాత్రమును సందియములేదు. వీరుదొరతనమువారివలన శాశ్వతపు హక్కునుపొంది

విస్తీర్ణములగు భూప్రదేశములను గ్రామములను ననుభవింపుచుండుటచే దొరతనమువారి శ్రేయోభివృద్ధియు స్థైర్యమును దమకు శ్రేయోభివృద్ధిదాయకములనియు ,లాభకరములనియు నమ్మియున్నవారని మనయేలిక లెఱుఁగుదురుగాని యెఱుఁగనివారుగారు గావునను మనజమీందారులయందు దొరతనమువారికెక్కువ నమ్మకమును విశ్వాసమును గలిగియుండుట స్వభావికధర్మమని మనము నమ్ముటకెంతమాత్రమును సందియములేదు. కావున మనజమీందారులందు దొరతనమువారికిఁగల గౌరవమును విశ్వాసమును నమ్మకమునుబట్టివారు దొరతనమువారిని ప్రోత్సాహముచేసి దేశోపకార మొనరించుటకు వారికితరులకన్న నెక్కువ యవకాశము లున్నవనుట కెంతమాత్రమును సందియములేదు.

ఇట్లనేకవిధములుగా మనజమీందారులు దేశోపకార మొనరించుటకును దేశోపకారమునకుఁజేయు ప్రయత్నములకుఁ దోడ్పడుటకు ననేకావకాశములుగలవు. దేశోపకారమునకుఁ దోడ్పడవలయునను నిశ్చయమును బుద్ధియుఁ గార్యాచరణమునుమాత్రమే మనజమీందారులనుండిన నెంతలాభమైనఁ గలుగుననుట కెంతమాత్రమును సందియములేదు. మనజమీందారులు పరోపకారచింతగలవారనియు ధర్మబుద్ధిగలవారనియు దేశక్షేమమును గోరువారనియు నేనిదివఱకే చెప్పియున్నాను. కావున దేశాభివృద్ధికిఁ దోడ్పడవలయునన్నయుద్దేశము వీరికి బొత్తుగా లేకపోలేదనియు మనము నిశ్చయముగానమ్మవచ్చును. కాని దేశాభివృద్ధికిఁదోడ్పడుటకుఁ జేయవలసినకార్యము లెవ్వియో వీరికొకవేళఁ దెలియకపోయినఁ దెలియకపోవచ్చును. అదియొక గొప్పలోపమనియుఁ జేతగానితనమనియు దేశాభివృద్ధికిఁ దోడ్పడగూడదను గృతనిశ్చయమువలనఁ గలిగిన యభిప్రాయమనియు మన మెంచఁగూడదు. కార్యాంతరవ్యాసంగములచే నాకుఁ గొంచెమైనఁ దీరికలేక నాశక్తికొలదిని నాకుఁదోచినవిధముగా దేశోపకారమునకు మనజమీందారులు దోడ్పడవలసినయుచితమగు మార్గములను గొన్నిటిని వ్రాసినాడను. నేనువ్రాసినవిషయమును మనజమీందారులు సావధానచిత్తులైయోచించి వారికి నేనుపదేశింపఁబూనినందుకు నన్నుమన్నింతురనియు మనదేశమభివృద్ధినొందుటకు జేయుకార్యములయందును ముందు చేయవలసిన పనులయందును యుదారసాహసములతోఁ దోడ్పడుదురనియు నట్లువారొనరించి శాశ్వతకీర్తియు జనుల విశ్వాసమునుబడసి చిరకాల మాయురారోగ్యాభివృద్ధి గలిగియుందురుగాకయనియుఁ గోరుచు నింతటితో విరమించుచున్నాడను.

స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం ।
న్యాయ్యేనమార్గేణ మహీంమహీశాః ।
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తునిత్యం ।
లోకాస్సమస్తా స్సుఖినోభవంతు ॥

---

# అల్పపదసామర్థ్యము.

[అత్తిలి సూర్యనారాయణగారు.]

తలఁపకు పెద్దమాటలనె తద్దయుఁ బాటవ ముండు నంచు, దు
ర్బలమ యటంచు నెంచకుము స్వల్పపు సంగ్రహవాక్యజాలమున్;
బల మెఱు సాఁగ లాగినను, బ్రాతిగ నల్లిన, దీర్ఘమైన, మి
క్కిలిగను హ్రస్వమైనఁ, బొడిగించి విశాలము గాక యుండినన్,
బొడుగునకంటు లోతు కడుఁ బొందక యుండిన, నైజయోజనా
బలమును వాక్పటుత్వమును వర్తిలుఁ గావుత నావి యౌచు! న
బ్బలితపు వాక్యపుంజములపాళి యటుండఁగని మ్మదే, సము
జ్జ్వల మగు చున్న మండదు, ప్రాసంగఁ దళత్తళ లాడు చుండియున్
వెలుఁగదు; పాటవం బొకటె నిండదు సంగ్రహవాక్యమందు; దో
ర్బలపుఁ దుపానుకంబెను దురంబునకంబెను, సంద్రపుం దరిం
గలిగిన తాలగుట్టలను గాఢతరంబుగఁ దాకు వీచికా
వళుల రవంబుకంబెఁ ఛిద్రదరుపాళి నదల్చెడుగాడ్పుకంబె, న
గ్గలపుఁ బిరంగిఘోషములకంబెను, రక్తసుసిక్తయుద్ధభూ
ములఁ బడి క్రందు వీరభటమగ్న నినాదముకంబె, నెక్కుడౌ
ఫల మొదవించు; దీన నొకవార్తయు వర్తిలు చుండుఁ జూడ, రో
గులకును దుఃఖపీడితులకున్ హసియించెడివారి కెందు గం
తుల నిడువారికిన్ గడఁకతోడను జేతులు దట్టువారికిన్;
దలఁపఁ గథాంశ మార్తి జనితం బగునేని ప్రమోదమానమై
యలరెడు నేని నిక్కముగ నన్నిట మాటలఁబాటలం దలం
పుల నల గద్య పద్యములఁ బొందిక యోగము సేయఁగాదగున్ ॥

# మన ఐశ్వర్యాభివృద్ధి.

[మా. వేంకటరంగయ్యపంతులుగారు ఎమ్., ఏ.]

—— :o: ——

ఆంధ్రదేశమున మత నీతి సంఘ సంస్కరణముల గుఱించి ప్రజలకు బోధించువా రనేకులున్నారు కాని ఆర్థికవిషయములగురించి విపులముగ జర్చించి సత్యమేదియో ప్రజలకు దెలుపువారి సంఖ్య మిక్కిలి కొద్దిగ నున్నది. ఐశ్వర్యవిషయముయొక్క ప్రాముఖ్యత మనకు దెలియకపోవుటయే దీనికి గారణము. మనదేశమునం దనాదిగ ప్రజలకును, పండితులకును, తత్వమతవిషయములయందున్నంత గౌరవము ఐహిక విషయముల గుఱించి వివరించెడు అర్థశాస్త్రాదులయందు లేదు. పాశ్చాత్యులకును, మనకును, నిటీవల గలిగిన సంబంధహేతువుచేతను, పాశ్చాత్యుల యాధిక్యత వారి వ్యాపార పరిశ్రమల ఫలమని మనవారు దెలిసికొనినందునను, నిప్పుడిప్పుడు మనవారుకూడ నిట్టి యంశములం దభిరుచి గలిగియున్నారు. ఇది న్యాయమే. ఏలయన, మతము నీతి మొదలగునవి మానవునికెంత ప్రధానములో ధనముగూడ వానికంత ప్రధానమైనదియే. ఆకలి, దప్పి, రోగము, మొదలగునవి ప్రపంచమునందుండు వఱకును, వీనిని బోగొట్టుకొనుటకు నేదియోకొన్ని పదార్థము లావశ్యకములుగ నుండువఱకును, ఈపదార్థములు మనుష్యుని పరిశ్రమ చేతనేగాని మఱియేమార్గమునను దొరకకుండు వఱకును, ధనమనునది యత్యావశ్యకము. ఇట్టివిలేని దేవలోకమున బహుశః ధన మవసరములేక యుండవచ్చును. ఇదిగాక అనేక హేతువులవలన నీతి మతవ్యాపనలకు గూడ ధనమావశ్యకమైయున్నది. మన దేశమునందు క్రైస్తవమత మభివృద్ధి యగుచున్నదనియు, హిందువులయొక్కసంఖ్య క్షీణించుచున్నదియు,మనము విచారపడుచున్నాము. ఈవృద్ధినాశములకొక హేతువు క్రైస్తవుల యపరిమిత ధనమేకదా? నీతియనమాత్ర మేమిటిది? ప్రతివాడును తనబిడ్డల చక్కగా పోషించి, వారికి దగిన విద్యనేర్పి, వారి యారోగ్యమును గాపాడి, వారిని శరీర మనోబలముగల వారినిగ జేయుటకంటె నీతియు మతమును వేరేపైననున్నవా? ఇట్టివి ప్రతి[illegible]హస్తుడును జేయుటకెంత ధనముకావలసియున్నది! ధనము లేమిచేతనేగదా మనమింత దుస్థితిని బొంది యుండుట?

మనదేశమునందుండు ప్రతి యూరోపియనుడు నెంతయో దృఢమగు శరీరముగలిగియున్నాడు. మనము కృశాంగులమై యున్నాము. మనలో ఆరుమందిచేయునంత పని వారిలో నొకడు చేయగలిగియున్నాడు. దీనికి గారణము వారి ఐశ్వర్యమే. ఇంగ్లాండునందు సరాసరి ఒక్కొక మనుష్యుడు సంవత్సరమునకు ఆఱువందల రూపాయల సంపాదింపగలిగి యుండి మనలో నొకడొకడు ముప్పది రూపాయలకంటె నెక్కువ సంపాదింపలేకయున్నాడు. కనుకనే వారు సంతృప్తిగ దినమున కారుమార్లు భోజనముచేసి, విశాలమైన గృహములయందు వసించి, వ్యాధిపీడితు లయినప్పుడు తగు ధనమును ఖర్చుజేసి ఆరోగ్యమును కాపాడుకొని, వారి పిల్లలను పాఠశాలల కంపి విద్యను నేర్పగలిగియున్నారు. కనుకనేవారు తమ దేశమందు క్షామమన్న నేమియో యెఱుగకయు, ఒకవేళ అట్టివిపత్తు వచ్చినను వారు మిక్కుటముగా సంపాదించుటచే విశేషముగ కూడబెట్టి క్షామకాలములదుం దీకూడబెట్టిన దాని నుపయోగింప గలిగియు, సామాన్యముగ ప్రతివాడును ఎనుబది సంవత్సరముల వయస్సు వఱకు జీవింప గలిగియు, ఉన్నారు. మన మెట్టిస్థితిలో నున్నాము?

దినమున కారుమార్లు భోజనము లేనేలేదు. ప్రజలలో చాలభాగము పుష్టిగ నొకభోజనముకూడ కలిగి యుండుటలేదు. నెయ్యి, పెరుగు, (శూద్రాదులలో)

మాంసము, మొదలగునవి ఒక పండుగపుడేకాని ఇతర సమయములందు మన సామాన్యజనము వీని రుచికూడ నెరుగరు. మనము సంపాదించునది మన ఖర్చులకే చాలదనుటకును క్షామకాలమునందు మనకువచ్చు కష్టములనుండి విముక్తుల మగుటకు ధనము కూడబెట్ట నశక్తులముగ నున్నామనుటకును, ఇట్టి కాలములయందు లక్షలకొలది మృతిజెందుటయే నిదర్శనము. మనరాజధాని 1911 జనాభానుబట్టి నూటికి ఆరుగురుకంటె నరువదిసంవత్సరముల తరువాత జీవించుటలేదు. విశాలగృహములు లేకయు, వైద్యుల సహాయమును కొనజాలకయు, నీపది సంవత్సరములలో (1901-11) దాదాపుగ 30 లక్షలమంది జ్వరముచే మృతిబొందిరి. ఇట్టి కారణముననే 1000 మనుష్యులలో 75 కంటె నెక్కువమందికి చదువుటకును, వ్రాయుటకును, తెలియకయున్నది. అనేకులు దారిద్ర్యమువలన స్వమతమును విడనాడి పరమతముల స్వీకరించుచున్నారు. మఱికొందఱు స్వదేశమునువదలి నెటాలు మొదలగు పరరాష్ట్రములకు వెళ్ళి ఆత్మగౌరవమును గూడ కోల్పోవలసి వచ్చుచున్నది.

ఇట్టిస్థితిలో నీతి మత విషయములవలె ఆర్థికవిషయముకూడ మిక్కిలి ప్రధానమైనదని స్పష్టపడుచున్నది.

ఈ మన దారిద్ర్యమున కనేక హేతువులున్నవి. మన సంపాదనమేల అంత తక్కువగ నున్నదో మొదట విచారింతము. వ్యవసాయాది పరిశ్రమలే ధన సమృద్ధికి హేతువులు. ఒక దేశమునందనేక లాభకరములగు పరిశ్రమలుండిన యెడల ఆదేశస్థుల సంపాదన మధికముగ నుండును. ఇంగ్లాండు యిట్టిదేశము. సమస్త విధములైన నేతపరిశ్రమలు, లోహపరిశ్రమలు, ఆదేశమునందు వర్ధిలుటవలన ఇంగ్లీషువారపరిమిత ధనవంతులైయున్నారు. మనదేశమునందిట్లు వివిధపరిశ్రమలులేవు. మనకెల్లరకు ప్రధానమైన జీవనోపాయ మొక వ్యవసాయమే. లాభమువచ్చినను నష్టము వచ్చినను జనసంఖ్య హెచ్చినను తగ్గినను నిదితప్ప వేరు జీవనోపాయములు మనకులేవు. ఒకగృహమున భార్యాభర్త లిద్దరుమాత్రమే యుండినపుడు నాలుగెకరముల భూమినుండియుత్పత్తిచేయబడిన ధాన్యము వారి జీవనమునకు సరిపోయిన, వారి సంతానము వృద్ధియైనప్పుడు వారు సౌఖ్యముగ నుండవలయునేని వారి భూమియైన వృద్ధిచెందవలయు; లేదా వారి కుమారులు వేఱు జీవనోపాయమేదైన గలిగియుండవలయును. ఇట్లుగాక ఆనాలుగెకరములను మాత్రమే సేద్యముచేసి తమకుగావలసిన వానిని సంపాదింప గోరిరేని వారు విఫల మనస్కులై దినదినము కృశించెదరు. ఇట్లే ఒక దేశముకూడ, సేద్యమున కుపయోగపడు భూమిని విశేషముగ వృద్ధిచేయుట కష్టము. దేశములోని వారందఱు నీస్వల్ప విస్తీర్ణముగల భూమినుండి సమస్తము సంపాదింప గోరిరేని వారి సంపాదనము తగ్గిపోవుననుట సర్వవిదితాంశము.

ఇదిగాక, దేశమునందు పది ప్రధానపరిశ్రమలుండెనేని ఒకదానియందు నష్టమువచ్చిన యెడల దానికి సంబంధించినవారే కష్టపడవలసి యుందురుకాని యితరులెప్పటివలె సౌఖ్యముగనుందురు. ఒకయింటిలో పదుగురుండి ఒక్కొక డొక యుద్యోగమందుండి అందొకరి యుద్యోగముపోయిన వాని కొక్కనికే నష్టముకలుగును; ఇతరుల యుద్యోగములట్లే యుండుటవలన వారి కేలాటి నష్టమును సంభవించదు. అట్లుగాక పదిమందియు ఒక కచ్చేరియందే యుద్యోగము గలిగియుండిరేని, ఏకారణముచేతనైన నాకచ్చేరీ తీసివేసిన పదిమందికి నష్టముగలిగి ఆగృహమె నశించును. అట్లె మనదేశమునందు నూర్గురిలో డెబ్బదిమందికి వ్యవసాయమే ప్రధానోద్యోగము. సకాల వర్షములుగురిసినప్పుడే యిది లాభకరముగ నుండును. అట్లుగాక క్షామము సంభవించెనేని ప్రజలందఱు నష్టము నొందవలసియుందురు. అనగా ఈవృత్తికెట్టి యపాయము సంభవించినను జనులందఱు బాధపడవలసినవారైయున్నారు. ఈబాధకొందఱకు మాత్రమే కలిగి మిగిలిన వారందఱు క్షేమముగ నుండుటలేదు.

వ్యవసాయమునుగుఱించిన అంశ మింకొకటియున్నది. ఒక యెకరము భూమినుండి యెక్కువ ధాన్యము నుత్పత్తిజేయుటకై మనము విశేష ప్రయత్నముల జేసితిమేని మనము దాని సారమంతయు బోగొట్టినవార

మగుదుము. ఈపోగొట్టిన సారమును తిరిగి వృద్ధిజేయుటకే మనము ఎరువుల నుపయోగించుచున్నాము. మనదేశమునందిపు డుపయోగింపబడు ఎరువు లంతశ్రేష్ఠమైనవికావు. శ్రేష్ఠమైనవి మిక్కిలి యెక్కువ ఖరీదు గలిగియుండును. మన రైతుల కవియేవో తెలియదు. వ్యవసాయ సంబంధమైన విద్య వారికి నేర్పుటలేదు. ఒకవేళ వానినిగురించి వారికి దెలిసినను వానిని గొనుటకు గావలసిన ధనము వారియొద్దలేదు. వారు మిక్కిలి దరిద్రులు. కాబట్టి మన భూములీ యెరువులేక నిస్సారములగుచున్నవి. ఈతీరున మనము వ్యవసాయమును జేయుచుంటిమేని కొంతకాలమునకు మనభూములు నిరుపయోగములవును.

ఇంగ్లాండునందొక యెకరము భూమినుండి మనము త్పత్తి జేయుదానికన్న మూడు రెట్లధికముగ ధాన్యము నుత్పత్తిజేయగలిగియున్నారు. వారనేక యావిరి యంత్రము లుపయోగించియు, శాస్త్రీయముగ అనేక యెరువులు వేసియు, ఇట్టి ఫలమునుజెందుచున్నారు. మనమిట్లు చేయుటకు మన దారిద్ర్యమొక యాటంకముగనున్నది. మఱియొకతీరున మనదేశమునందు సాధారణముగ నొక్కొకడు నాలుగైదెకరములకంటె నధికముగ పొలమును సేద్యముచేయుటలేదు. ఇంగ్లాండునందొక్కొకడు నూర్లకొలది ఎకరముల సేద్యముజేయుచున్నాడు. వేయిరూపాయల విలువగల యొక యంత్రమునుగొనిన నాలుగెకరముల భూమికై లాభముగ నుపయోగించుటకు వీలులేదు. అధిక విస్తీర్ణముగల భూములయందే అవి మిక్కిలి యుపయోగకరములై యుండును. తండ్రియొక్క ఆస్తిని సమానముగ కొడుకులందఱు విభజించుకొనుపద్ధతియుండు మనదేశమునం దధికవిస్తీర్ణముగల భూములుండువారు అనేకులుండుటకువీలులేదు.

విచారణ చేయవలసిన అంశము లిట్టివెన్నియో కలవు. కాని, వీనినుండి హిందూదేశస్థుల దారిద్ర్యమునకు ప్రధానహేతువు వివిధ జీవనోపాయములు లేకుండుటయని తేటపడుచున్నది. ఒక్క వ్యవసాయమే ప్రధాన జీవనోపాయ మగుటవలనను, నీవ్యవసాయమునందుండి యెక్కువ ఆదాయమును సంపాదించుటకై ఆవశ్యకములగు నవీనపద్ధతులు తెలియకుండుట చేతను, తెలిసినను వాని నుపయోగించుటకు వలసిన ద్రవ్యము లేకుండుట చేతను, దారిద్ర్య మధికమగుచున్నది.

మనదేశమునం దొకటే ప్రధాన జీవనోపాయముండుటకును, పలువిధములయిన పరిశ్రమలు లేకపోవుటకును, హేతువులేవియో యించుక విచారింతము.

పరిశ్రమల యుద్దేశము ధనోత్పత్తి అయినను, నీ ధనమనునది పలువిధములై యున్నది. ధాన్యము, ప్రత్తి, జనుము, బొగ్గు, ఇనుము, వస్త్రములు, యంత్రములు, కాకితములు, ఇవన్నియు ధనములో జేరినవే. వీనిలో దేని నుత్పత్తి జేయునట్టిదైనను నదియొక పరిశ్రమయే. ఈవివిధ ధనములను రెండు తరగతులుగ మనము విభజింపవచ్చును. కొన్ని పక్వములైనవి; (Manufactured goods) మరికొన్ని అపక్వములైనవి. (Raw materials) వస్త్రములు, యంత్రములు, మొదలగునవి మొదటి తరగతియందును ఇనుము మొదలగునవి రెండవతరగతియందును జేరినవి. ఈరెంటికి మధ్యనుండు నవి యింకొక తరగతిలో జేరినవని చెప్పవచ్చును. మనదేశమందుండు పరిశ్రమలలో చాలభాగము అపక్వపదార్థముల యుత్పత్తి జేయునవియే. ధాన్యములు, ప్రత్తి, ఇనుము, నేలబొగ్గు, నువ్వులు, వేరుసెనగలు మొదలగు నవి మనదేశమునందుత్పత్తి చేయబడుచున్నవి. పక్వపదార్థములయిన వస్త్రాదులనితరదేశములయందుండి మనము తెప్పించుకొనుచున్నాము. వ్యవసాయ పరిశ్రమకు అర్థశాస్త్రమున అపక్వపదార్థముల నుత్పత్తి జేయుటని యర్థము.

కావున మనమిపుడు పక్వపదార్థముల నేల మనము మనదేశమునందు చేయగూడదో విచారణచేయుట యుక్తము. సామాన్యముగ నొక అంశము మాత్రము స్పష్టముగనున్నది. ఏపక్వ పదార్థము నుత్పత్తి జేయవలయునన్నను అపక్వపదార్థమొక్కటియో, అనేకములో, కావలసియున్నవి. వస్త్రములకు ప్రత్తి, యంత్రములకు ఇనుము, నేలబొగ్గు, చక్కెరకు చెరకు, కాకితములకు గుడ్డపీలికెలు, వెదురు మొదలగునవి కావలయును. మన

దేశమునందిట్టి పరిశ్రమలు లేకపోవుటకు వీనికి గావలసిన అపక్వపదార్థములు లేకకాదు. ఈపదార్థముల నన్నిటిని మనముత్పత్తిజేయుచునేయున్నాము. కాని, వీనినెల్ల నితర దేశములకు బంపుచుంటిమి 1909-10 సంవత్సరమున మనదేశమునుండి దాదాపుగ 195 కోట్లరూపాయలవిలువ గలవస్తువులితర దేశములకు పంపబడినవి వీనిలో 31¼కోట్ల రూ॥లవిలువగలప్రత్తిగింజలు,19 కోట్లరూ॥లఅముదములు మొదలగునవియు, 15 కోట్లరూపాయల జనుము, 10కోట్లరూపాయల తోళ్లు, 3 కోట్లరూపాయల ఉన్ని మున్నగు 84 కోట్ల రూపాయల విలువగల అపక్వపదార్థముల నితర దేశములకు బంపియుంటిమి. ఇక నితర దేశముల నుండి తెప్పించుకొనినవి 155 కోట్ల రూపాయల ఖరీదు గలిగి యుండెను. ఇందు, పక్వపదార్థములలో నూలు బట్టలు 39¼ కోట్ల రూపాయలు. ఉన్ని పట్టుబట్టలు 4½ కోట్ల రూపాయలు. లోహసామగ్రులు - యంత్రములు వగైరా 27 కోట్ల రూపాయలు చక్కెర .1 కోట్లరూపాయలు విలువగలిగి యున్నవి ఆపక్వపదార్థముల నితరదేశములకంపి పక్వపదార్థములు తెప్పించుకొనక యీ పరిశ్రమలను మనదేశమునందే స్థాపించిన యీలాభమంత మనకేయుండదా? మన దారిద్ర్యము నశింపదా? నశింపగలదు. ఏలయనగా వీని స్థాపించుటలో ఇంగ్లాండు మొదలగు దేశములకు లేని సదుపాయములు మనకు రెండున్నవి. వీనికి గావలసిన అపక్వపదార్థములు మన దేశమునందే పండుట, వీనిని పక్వముగ జేయుటకు వలయు మనుష్యులు తక్కువకూలికి దొరకుట.

ఈరెండు సదుపాయములు మనకుండినను కొన్ని కష్టములుకూడ వానివెంటనేయున్నవి. ఈబాధకముల వలననే యిట్టి పరిశ్రమ లివివఱకు మనదేశమునందు వృద్ధియగుటలేదు. ఒకబాధకము మూలధనము లేకపోవుట. రెండవ బాధకము యూరోపియనులంతటి లాఘవము, సాహసము మనకు లేకపోవుట. మొదటి బాధకమంత దుస్తరమైనదికాదు. మనదగ్గర మూలధనము లేకపోయినను ధనవంతులగు నాంగ్లేయులు మొదలగువారియొద్దనుండి మనకు గావలసిన ధనమును అప్పు బుచ్చుకొన



వచ్చును. కొన్ని సంవత్సరములకు పూర్వము మన మిప్పుడెట్టిస్థితిలోనుంటిమో అట్టిస్థితియందేయుండిన జపాను, కెనడా, ఆస్ట్రేలియా, యునైటెడ్స్టేట్సు మొదలగు దేశము లితరులయొద్దనుండి అప్పుదీసికొని తమ పక్వపదార్థ పరిశ్రమ లభివృద్ధిజేసికొని యిప్పుడు కోటీశ్వరులతో దుల దూగుచున్నవి. రెండవ బాధకముమాత్ర మిట్టిదికాదు. లాఘవము సాహసముమొదలగు పారిశ్రామిక గుణములు అభ్యాసమువలన సంపాదింపవలసినవేగాని ఒకరివద్దనుండి గ్రహింప దగినవికావు. ఈ అభ్యాస మలవడుచు కొనుట కొకటేమార్గముకలదు. అది, ఇట్టి పరిశ్రమల మనదేశమునందు స్థాపించుటయే. వీనిని స్థాపించితిమేని కొంత కాలము (మనకు లాఘవము సాహసము మొదలగు గుణములు కలుగువఱకు) మనకు నష్టము కలుగుచుండును. సీమ వస్త్రమొకటి ఒకరూపాయ కమ్మబడుచుండిన మన మునేయు వస్త్రము 1-8-0 రూపాయలకు విక్రయింప వలసినదై యుండును. ఇట్టి నష్టము కలుగునని భయము వలననే యీపరిశ్రమలు మనదేశమునందంత విశేషముగ స్థాపింపబడుటలేదు.

అనగా, నితరదేశస్థులీపక్వపదార్థములను జౌకగ నుత్పత్తిచేసి మనదేశమునం దమ్మకము చేయుగలిగినంత కాలము మన మీపరిశ్రమలు స్థాపించలేము. ఏదియొక విధమున దేశాంతరములలోని యీపదార్థములు మనదేశమునకు రాకుండెనేని మనపరిశ్రమలును మన ఐశ్వర్యమును అప్పుడు వృద్ధికాగలవు. కనుక మనకు నితరులకును, నీపరిశ్రమల విషయమై పోటీయుండుటయే మన దారిద్ర్యమునకు రెండవహేతువై యున్నది.

3. మూడవహేతువుకూడ నొకటియున్నది. మన దేశమునందుగూడ కొన్ని పక్వపదార్థపరిశ్రమలును, లాభకరమగు వ్యవసాయమును ఉన్నవి. సాధారణ ధాన్యములు, ప్రత్తి మొదలగువానిని పండించుటకై పాటుపడు మన రైతుల వ్యవసాయమే లాభకరముగ లేదుగాని, తేయాకు, కాఫి మొదలగువాని నిబండించు వారికి విశేష లాభకరముగనే యున్నది. దాదాపుగ 5¼ లక్షల ఎకరముల భూమియందు 11 కోట్లరూపాయ

ల విలువగల తేయాకు పండింపబడుచున్నది. ఇట్లె సంవత్సరమున కొకటింటికి 1¼ కోట్ల రూపాయల విలువగల కాఫీ యుత్పత్తిచేయబడుచున్నది. ఇదిగాక జనుముబస్తాలను వస్త్రములనుచేయు పరిశ్రమ సంవత్సరమునకు 20 కోట్లవిలువగల పక్వపదార్థములనుత్పత్తి చేయుచున్నది. కానియివియూరోపియనుల స్వాధీనమునందున్నవి. వీరు మన దేశము 700 కోట్ల రూపాయల మూలధనమును వ్యవసాయమునందును, గనులయందును, పక్వపదార్థపరిశ్రమలయందును వెచ్చించియున్నారు. ఈకారణముచే వీనియందెట్టి లాభమువచ్చినను మనదికాదు. అదియూరోపియనులది. ఈలాభము మనదేశమునందుండక ఇంగ్లాండునకు బోవుచున్నది.

దీనినిబట్టి దేశమునం దుత్పత్తియగు ధన మధికముగనే యున్నదనుట స్పష్టము. అయినను దీనివలన స్వదేశస్థులగు మనకేలాటి లాభమును గలుగుటలేదు. ఈధనమంతయు నితరుల స్వాధీనమగుచున్నది కనుకనే యిది మన దారిద్ర్యమునకు మూడవ హేతువైయున్నది.

దేశమునం దైశ్వర్యాభివృద్ధి కావలయునన్న నెట్టిమార్పులు కలుగవలెనో యిప్పుడు విశదమగుచున్నది. (1) వ్యవసాయ మిప్పటికంటె నెక్కువ లాభకరముగ మనము జేసికొనవలయును. రైతులకు వ్యవసాయసంబంధమైన జ్ఞానమభివృద్ధియగుటయు, వారు నవీనపద్ధతులుపయోగించుటయు, దీనికి వలసిన మూలధనము దేశీయులనొద్ద గూడుటయు, దీనికి మార్గములు. (2) పక్వపదార్థపరిశ్రమలు మనదేశమునందు వ్యాపించవలయు. మన లాఘవమును సాహసబుద్ధియు నభివృద్ధియగుట, దేశాంతరములనుండియీపదార్థములు కొంతకాలమువఱకుమన దేశమునకు రాకుండ నిలుపుట. దీనికిప్రధానమార్గములు. (3) మనదేశములోని పరిశ్రమలుసాధ్యమైనంత వఱకు మనస్వాధీనమునం దేయుంచుకొనుట. ఈమార్పులుకలిగిన మన మితరదేశస్థులవలె శరీరమనోదార్ఢ్యములు గలిగిన వారమై సమస్త సౌఖ్యములనుభవింపగలిగి యుందుము.

# తాళపత్త్ర గ్రంథములు - ముద్రిత పుస్తకములు.

[నడకుదుటి వీరరాజు పంతులుగారు.]

జీవదయాపరుండగు పరమేశ్వరుండు సృష్టిలోని ప్రాణికోటులు తమతమ యభిప్రాయములను బరస్పరము దెలియఁజేసికొనుటకు భాషయను నొక గొప్పసాధనము ననుగ్రహించియున్నాఁడు. ఈభాషయనునది స్పర్శరూపకముగను, సంజ్ఞారూపకముగను, ధ్వని రూపకముగను గ్రహింపఁబడుచున్నది. సరీసృపములు, పక్షులు, మృగములు మొదలగునవి వానివానికి సహజములైన యాయా స్పర్శనములచేతను, సంజ్ఞలచేతను, ధ్వనులచేతను నన్యోన్యాభిప్రాయములను దెలిసికొనుచున్నవి. ఇక మనుష్యులన్ననో తమభాషయం దింకొక విశేషముగలవారై యున్నారు. అది నేఁడియున పలువిధములగు ధ్వనులు గల మాటలతోఁ బరస్పరోద్దేశములను దెలియఁజేసికొను నొక యద్భుతశక్తియై యున్నది. అది పరమేశ్వరుడు మానవునకుఁ బ్రత్యేకముగ నొసంగిన ప్రసాదము. ఇట్టి యద్భుతశక్తి సృష్ట్యాది నుండెచ్చట నెవ్విధముగా నుండెనో తెలిసికొనుట యసాధ్యమే యైనను, గాలక్రమమున నది పలువిధములుగా నుత్పన్నమై, బహుభాషల క్రింద నేర్పడినదియని యూహింపవచ్చును. ఆశక్తి కేవలము శబ్దరూపముననే కాక, లేఖనరూపమునఁ గూడ నుండునట్లు క్రమక్రమముగా బుద్ధిమంతులవలనఁ గనిపెట్టఁబడినది. ఆయా దేశములవారు తాము మాటలాడుకొనుభాషను దమ బుద్ధికొలందిని సౌలభ్యమునూహించి లేఖనపూర్వకముగా నేర్పఱచుకొని యందులకు ననువగు సాధనములను గనిపెట్టగలిగిరి. అట్టిసాధనములు పూర్వము మన దేశమున,

"ఇందు నీవిపుడు వ్రాలిడుమని యాకుగంటముచేతి కిచ్చె" (పరమయోగి విలాసము. 5 ఆ.) అనునట్లు తాటియాకును, గంటమును నైయున్నవి. మఱియు (నుత్తర దేశమున)

"పటములందు నాగరలిపి బ్రస్ఫుటముగ, వరమషీతూలికారేఖ వ్రాసినట్టి
యర్హతాగమగ్రంథము త్యాదరమున, సరస,బఠియింప బోధించు సద్గురుండు." కాశీఖండము. 6అ,

(పటము=కాగితము;మషి=సిరా;తూలిక=కలము.)

అనునట్లు కాగితము మొదలగునవి యున్నవని తెలియుచున్నది. ఇవిగాక భూర్జపత్త్రము మొదలగునవిగూడ వ్రాఁతకుపయోగింపఁ బడుచువచ్చినవి. కాగితము, భూర్జపత్త్రము మొదలగువానిమీఁద వ్రాయఁబడిన గ్రంథములకంటెఁ దాళపత్త్రగ్రంథములే చిరకాలము చెడకుండునవి యని మనపూర్వులభిప్రాయపడినట్లు గన్పట్టుచున్నది. దీనంజేసియే, పూర్వకాలమున గ్రంథములు తాళపత్త్రములపైని వ్రాయఁబడుచుండెను. చిరశ్రమమునఁగాని యొక పొత్తము వ్రాత పూర్తినొందెడిదిగాదు. అక్కారణమున నొకపుస్తకము సంపాదించుకొనుట కడుదుర్లభముగానుండెను. ఏదియైన నొకగ్రంథమును గోరువాఁడు తన యితరవ్యాపారముల నుజ్జగించి, కుటుంబమును విడనాడి, యాపొత్తము గలవాని యూరెంతదూరమున నున్నను నచ్చటికిఁ బోవలసియుండెను. అక్కాలమున మార్గములైనను సుగమములు గాకుండెను. ఎట్లేని యాయూరికింబోయి (సమర్థుఁడేని) యచ్చటఁ దనబత్తెమును వెచ్చించియో (కాఁడేని) యితరులఁ బ్రార్థించియో యుదరమును బోషించుకొనుచుఁ గొంతకాల మచ్చట గ్రంథస్వామి నాశ్రయించుచు నివసించి వాని సమయము గనిపెట్టుచు, వానిపొత్తముంబట్టి యొక ప్రతిని వ్రాసికొనవలయును. అక్కాలమున నొకయూరి యుదంత మొకయూరికిఁ దెలియుట యరుదైయుండెను. ఈహేతువుచే నీమధ్యకాలమున, తనకుటుంబ మేమయ్యెనో

యాతనికిఁ దెలియకుండెను. ఇన్నికష్టము లనుభవించియైన మనపూర్వులు గ్రంథములను వ్రాసికొనుచుండిరి.

తాటియాకులపైని బుస్తకములు వ్రాయుటకు దేహబలమును, విద్యాభిమానము, శ్రద్ధ, యోపిక, స్వార్థపరిత్యాగము, పరమార్థచింత మొదలగు సద్గుణములును ముఖ్యముగానుండి తీఱవలయును. మనపూర్వులలోఁ బ్రజ్ఞావంతులగు పుణ్యాత్ములనేకులు తమయాయుష్కాలములోని చాలభాగమును గ్రంథలేఖన గ్రంథపఠన వ్యాపారములయందే వినియోగించియుండిరని మనమూహింపవచ్చును. వారికిఁ బారమార్థికచింతయు, విద్యాభిలాషయుఁ దప్ప నైహికచింత, ధనార్జనాసక్తి మొదలగునవి యంతగాలేకుండెను. కావుననే యష్టాదశ పురాణములు, అన్నియే యుపపురాణములు, భారత భాగవత రామాయణములు, ధర్మవైద్య తర్కవ్యాకరణ మీమాంసాదిశాస్త్రములు, ప్రబంధములు, నాటకములు మొదలగు కోశములు(చిరకాలముక్రిందటనే రచింపబడినవయ్యు) ఖిలముగాకుండఁ బరంపరగా వ్రాయఁబడుచు వచ్చి నేఁటివఱకును నిల్చియున్నవి. మన పూర్వులు మనకుఁజేసిన యిమ్మహోపకారము వేనోళ్లఁ బొగడఁదగినదియైయున్నది.

పూర్వము ధనవంతులగువారిలోఁ గొంద ఱుదారపురుషులు, వ్రాయసకాండ్రకు జీతములిచ్చి గ్రంథములు వ్రాయించి వానిని పండితులకు దానముచేయుచుండెడివారు. అట్టిపుస్తకదానము భూదానముకంటె నెక్కుడుగా నప్పటివారిని సంతుష్టులను జేయుచుండెను ముదుసలులగు కొందఱు సత్పురుషులు తమయోపికకొలఁది మంచిమంచి తాటియాకులను దెప్పించి, పసుపుదారములతో వానిని క్రొత్తగ్రంథములుగాఁగట్టి పుస్తకములు వ్రాసికొన నపేక్షించువారికి నొసంగుచుఁ దమ యథాశక్తిని జూపుచుండిరి. భాషాభిమానులలో జరుగుబాటుగలవారు కొందఱు లేకరులకుఁ గొంతసొమ్మునిచ్చి వలయుపొత్తముల వ్రాయించి తెప్పించుకొనుచుండెడివారు. (పూర్వము భారతమువంటి గ్రంథముయొక్క ప్రతిని వ్రాసియిచ్చుటకు లేఖకు లేఁబది రూప్యంబులఁ బుచ్చుకొనుచుండెడివారఁట!)

లిఖితగ్రంథములన్నియుఁ బైనివ్రాసినరీతిని దేశమున వ్యాపించుచుండెడివి. మనదేశమునఁ బుట్టిన లెక్కలేని గ్రంథములును, వానియొక్క లెక్కలేని ప్రతులును వ్రాయఁబడుటకు మనపూర్వుల కెంతశ్రమ వాటిల్లెనో, యెంతధనము వ్యయమయ్యెనో, యెంతకాలముపట్టెనో యూహించుట సుకరము గాదుగదా!

లిఖితగ్రంథములన్నియు మనపూర్వులచేఁ బ్రాణములకంటె నెక్కుడుగాఁ జూడబడుచుండెడివి. వయస్సుచెల్లిన యిప్పటివారు సయితము పూర్వలిఖితగ్రంథముల నట్లె చూచుచున్నారు. ఏదియైన నొక మంచిపొత్తమును ముద్రింపించుటకును, ఖిలముగాకుండఁజేయుటకును నెంత ప్రార్థించినను (పురాతనాచారము ననుసరించుటచేఁగాఁబోలు) దమపుస్తకధనమును వారు వెలికిఁదీయకున్నారు సరియకదా ముద్రింపఁబడినవానితో సంప్రతించుకొని యిచ్చెదమన్నను వానిని బెట్టెలలోనుండి కదలింపకున్నారు. ఇది కడుశోచనీయము. పూర్వము మనదేశమునకు దురాత్ములగు విదేశస్థులవలనఁ గలిగిన సంక్షోభములలో గ్రామములు తగులఁబెట్టఁబడుచుండునప్పుడుతక్కిన పదార్థములకంటె ముందుగా గ్రంథములే కాపాడఁబడుచుండెడివఁట! ఒకప్పుడొకయూర నొక భాషాభిమాని మండుచున్న తనగృహమునఁదూఱి, తాళపత్త్రిగ్రంథములన్నియు వెలుపలఁ బాఱవైచి తాను మఱలరాలేక మడసెనఁట! ఇంకొకమహానీయుఁడు గ్రామమెల్లఁ గాలిపోవుచున్నపుడు తనయాలుబిడ్డల సంగతి సైతము మఱచిపోయి, తనపూర్వులును దానును గడించిన పుస్తకధనమును పెద్దకట్టగాఁగట్టి శిరంబున నిడికొని యూరివెలుపలికిఁబాఱిపోయి వానిం గాపాడుకొనెనఁట! ఈరీతిని గాపాడుకొనఁబడుచుండెడి గ్రంథములలో ననేకములు దుష్టులవలనఁ గాల్పఁబడిపోయెననియు, నందు గొన్ని మాతృకలకుఁ బుత్త్రికలే లేకపోయెననియు, మనపూర్వులకష్టములోఁ గొంతే యీరీతిని వ్యర్థమయ్యెననియు వినినప్పుడును, దలఁచికొనినప్పుడును దుఃఖము పొడమక మానదుగదా!

ఆంగ్లేయుల చల్లనిపాలనము ప్రారంభము కాఁగానే నేదేశమునందు స్వస్థతకలుఁగఁగా, శ్రీ శ్రీ శ్రీ బ్రౌను దొరవారు మొదలగు మహనీయులు కొందఱు మిక్కిలి శ్రమఁజెంది యనేకములగు తాళపత్త్ర గ్రంథములు మొదలగువానిని సంపాదించి దేశపాలకుల ముఖ్యపట్టణములలో "ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము" లనుపేర నొప్పు భద్రభవనంబులలోనుంచి మహోపకారముఁ గావించియున్నారు. అవి యిప్పటివఱకును మనప్రభువులచే జాగరూకతతోఁ గాపాడఁబడుచున్నవి. తాళపత్త్రాదులపైని లిఖింపఁబడిన కొన్నియుద్గ్రంథములు జర్మనీ మొదలగు నితరదేశములలో నేఁటివఱకును దాఁపఁబడి యమితగౌరవముతోఁ జూడఁబడుచున్నవి.

## ముద్రిత పుస్తకములు.

సర్వజ్ఞుండగు నీశ్వరుండు తొల్లింటివారికింబోలె నిప్పటివారికి నాయువు, బలము, శ్రద్ధ, యోపిక మొదలగునవి హెచ్చుగానుండనేరవని యెంచియే కాఁబోలు ముద్రాయంత్రమునుగనిపెట్టు నూహను బుద్ధిమంతుల హృదయములం బ్రసాదించెను. క్రమక్రమముగా నన్నిదేశములయందును ముద్రాయంత్రములు వ్యాపించెను. దానంజేసి యొక్కొకపొత్తమునకు వేలకొలఁది ప్రతులు సులభముగాను, వేగముగాను నుత్పన్నములు కాఁజొచ్చెను. గ్రంథములకుఁ బ్రతులు వ్రాసికొనవలసిన యావశ్యకము లేకపోయెను. ఒండు రెండుభాషలయందుఁదప్ప మిగిలిన యన్నిభాషలయందును బుస్తకములను సుకరముగా ముద్రించు యంత్రములనేకములు బయలువెడలెను. అవి మనదేశమునకును వచ్చెను. లిఖితములగు తాళపత్త్రగ్రంథములకు మాఱుగా ముద్రితములయిన కాగితపుంబొత్తములు వేనవేలు ప్రకటితములయ్యెను.

ముద్రాయంత్రములు మనదేశమునఁ గ్రొత్తగా స్థాపింపబడినదినములలో సమర్థులగు పండితవర్యులు పూర్వగ్రంథముల ననేకముల సేకరించి, బాగుగాఁ బరిష్కరించి, పరమార్థబుద్ధితో ముద్రింపించుచుండెడివారు. వారికి ధనార్జనాశక్తి తక్కువ. అక్కారణమున నాకాలముం బట్టి తమకయ్యెడి వ్యయములకుఁ జాలినవెలలుమాత్రమె యాయాపుస్తకములకేర్పఱచి విక్రయించుచుండెడివారు. ఆగ్రంథములయందు దోషములు నయితమంతగాఁ గానరాకుండెను. పిమ్మట "మందియెక్కువయైనకొలఁది మజ్జిగపలుచనయ్యె" నన్నరీతిని ముద్రాయంత్రములు లెక్కలేనివి బయలువెడలినకొలఁది బొత్తములవెలలు తగ్గిపోయెను. ఏమన ముద్రాయంత్రాధికారులకును, బుస్తకము లమ్మెడివారికిని ధనార్జనాసక్తి మెండుకాఁగా మొదటివారేర్పరచిన వెలలకంటెఁ దక్కువ వెలలకిచ్చు నభిప్రాయముతో నాగ్రంథములనే యుల్లిపొరలవంటి కాగితములమీఁదఁ దప్పుల తడకలుగా ముద్రింపించి యట్లువిక్రయించుచు మొదటివారిని నిరుత్సాహులను జేసిరి. ఇట్లుభాషాగ్రంథములన్నియుఁ దప్పులకుప్పలై చెడిపోయెను. అక్కారణమునఁ బలువురకు విమర్శనజ్ఞానము నశించి యందలి తప్పులేశరణములయ్యెను ఆగ్రంథములంగాంచు విద్వాంసులుమాత్రము కటకటంబడుచుండిరి. ఇట్లు కొంతకాలము జరిగెను.

ఈమధ్యకాలములో భాషాభిమానులగు మహనీయులు కొందఱు దేశభాషాగ్రంథముల దుస్థితినిగుఱించి విచారపడి వ్యయప్రయాసములకోర్చి వానిని బరిశుద్ధముగ నచ్చొత్తింపసాగిరి. అయినను దేశమందు వానికంతగా వ్యాప్తిలేకున్నది. దీనికనేక కారణములు గలవు. వానిలోఁ గొన్నిటి నీక్రింద వ్రాయుచున్నాఁడ.

1. మనవారిలోఁ జాలమందికి విద్యనేర్చుకొందమను నభిలాష లేకపోవుట. (ఇక్కారణంబున మనవారిలో విద్యనేర్చినవా రత్యల్పసంఖ్యాకులై యున్నారు.)

2. విద్యనేర్చినవారిలో ననేకులు హూణవిద్యావిశారదులై యుండి దేశభాషా గ్రంథములయం దాదరము చూపకుండుట, (కొందఱు మహనీయులు దేశభాషసేవ చేయుచునేయున్నను వారిసంఖ్య మిక్కిలి తక్కువగా నున్నది.)

3. దేశభాషల నభ్యసించినవారి కిక్కాలమునఁ బ్రయోజన మంతగాఁ గాన్పింపకుండుట.

4. దేశము మిక్కిలి పేదవడియుండుట. (అనేకహేతువులచే వ్యయము లధికమై, కఱవు లెక్కువయై చాలమందికిఁ గడుపునిండుటయే దుర్లభముగా నున్నది. ఇఁక గ్రంథములఁ గొనుట యెట్లు?)

5. మనవారిలోఁ బలువురకుఁ బుస్తకములఁ గొనునలవాటంతగాఁ లేకపోవుట. (ఒకనియొద్ద నొకపుస్తకమున్నచో నాయూరివారందఱును వానియొద్దఁ జేరి యాపుస్తకమును వీధిపురాణముగా విని తృప్తినొందు నలవాటు మనదేశములలోని యనేక గ్రామములయందుఁ జిరకాలమునుండి వచ్చుచున్నది.)

6. ఒకఁడొక ప్రతిమునుగొని దాని యుపయోగముఁగూర్చి యితరులకు లెస్సగా బోధించి వారుదానిఁ గొనునట్లు చేయకుండుట. (ఇది మనవారిలో నిండుగాఁ బాదుకొనియున్నది. అయ్యది విసర్జింప దగియున్నది.)

7. దేశమునందు గ్రంథములఁగూర్చి తగినంతప్రకటనము లేకుండుట.

8. తప్పులతడకలగు గ్రంథములు తక్కువవెలలకు నమ్మబడుచుండుట.

ఇక్కాలపుఁ గవీశ్వరులచే రచియింపబడి యచ్చొత్తింపఁబడుచున్న గ్రంథములలో ననేకములుగూడఁ బైవానిగతినే బొందుచున్నవి. దానికిఁ బైకారణములే కాక యింకొక గొప్పకారణమును గలదు. అదియేదన నామహనీయులలోఁ గొందఱు తాము గ్రంథస్వాతంత్ర్యముఁ బొందినవారగుటచే నితరులు ముద్రింప నేరరన్న ధైర్యమునఁ దమకయ్యెడి వ్యయముకన్నఁ బలుమడుంగులు ధనమురాఁగోరి యెక్కువవెలల కమ్మఁజూపుట. (ఈహేతువుచేఁ గొన్నిగ్రంథములు రెండవకూర్పు మొగమునైనఁ గానలేకున్నవి. విద్యాశాఖవారి యనుగ్రహము వడసి పరీక్షకులకుఁ బఠనీయగ్రంథములుగా నేర్పఱుపఁబడినట్లు చేసికొన్న వారిగ్రంథములుమాత్రము కొన్ని కూర్పులను గనుఁగొనఁ గలిగినవి. ఇట్టి గ్రంథములు పరీక్షకులకు నిర్ణయింపఁబడఁగానే కొందఱు మహానుభావులు తాము తొలుత నేర్పఱచుకొన్న వెలలను సైతము హెచ్చించుచున్నారు! చూడుఁడు! వీరి భాషాభిమానము!

ఇవిమొదలగు హేతువులచే ముద్రితగ్రంథములకు సైతము దేశమునందంతగా వ్యాప్తి లేకున్నది. దీనింగూర్చి మనమేమి చేయవలసి యున్నది? వానివెల లెట్లుండవలయును? ఆంగ్లేయభాషాగ్రంథములు లక్షలకొలఁది వెలపోవుచున్నవి. దానికేమి కారణము? వారిలోవిద్య నేర్చినవారు పలువురు కలరు. వారికిఁ జాలినంత ధనమున్నది. వారందఱు సప్పాత్త్రములం గొందురు. దేశములందు బాగుగాఁ బ్రకటింతురు. కొన్నిచోట్ల నాభాష ముఖ్యముగా నేర్చుకోవలసిన యావశ్యకమును గలదు. అవి చదువువారికి ద్రవ్యసంపాదనమార్గము లనేకము లగపడుచున్నవి. వానివెలలును గడు స్వల్పములు. ఇఁక నాగ్రంథములు వ్యయపడుట కేమికొదువ? ఈగతులలోఁ గొన్నియైన మన గ్రంథములకుఁ బట్టవలయును. ఎట్లు?— మనవారిలో హూణభాషా పరిచయము లేమిచే నేయుద్యోగమును లేక యూరక కూర్చుండువారును, చీట్లాటమొదలగు క్రీడలతోఁ గాలము వ్యర్థపుచ్చుచుండువారును నగు (విద్యనేర్చిన) పురుషులు కొందఱున్నారు. వారు విద్యనెఱుంగని వారికిని నిట్టియాటలు నేర్పి వారికాలమును సైతము పాడుచేయుచున్నారు. (ఇదియేమి పాపమోకాని విద్యకన్న నాటలయందలి శక్తియే త్వరలోఁబట్టువడుచున్నది. నిరక్షర కుక్షులలో చీట్లాట, చతురంగము మొదలగు నాటలను బాగుగనాడువారనేకులు మనదేశమునఁ గలరు.) అట్టిమహనీయులింకనైనఁ దమయాటలు చాలించి దేశాభివృద్ధినిగోరి తాము నేర్చినవిద్యను, చదువురానివారి కేసమయముననో నేర్పి, మనపూర్వులు మనఃకాయకష్టములకోర్చి చదువునేర్చి, మనపురోభివృద్ధినిగోరి రచించిన గ్రంథములను గొనుటకును యందలిపరమార్థము గ్రహించుటకును దగినవారిని జేయవలయును. మహారాజులును, ధనవంతులును, విద్యాధికులును, భాషాభిమానులును దేశభాషా సేవచేయువారికిఁ దగినప్రోత్సాహమును గలిగించుమార్గములఁ గల్పించుచు మనపూర్వుల యౌన్నత్యమును నిల్పవలయును.

## ఇఁక గ్రంథముల వెలలు?

ఏమిచిత్రమో పూర్వము తాటియాకులమీఁద వ్రాయఁబడియు నేఁబదిరూప్యంబులకుఁ గాని దొరకని గ్రంథమిప్పుడు నేత్రానందమగునట్లు తెల్లనికాఁగితముల పైఁ బరిశుభ్రముగ నచ్చొత్తింపబడి పదిరూపాయలకుఁ జిక్కుచున్నను, దానిని మనవారు కొనలేకున్నారు. ఇందులకు మనమేమి చేయవలయును? గ్రంథములవెలలు తగ్గింపవలయును. ఎట్లు?—

భారతమువంటి గ్రంథము నొకదానిని మంచి కాగితములపైఁ బరిశుద్ధములగు వేయిప్రతులుగా నచ్చువేయించుటకు నెట్లుచూచినను మూఁడు వేల రూపాయలకంటె నెక్కువవ్యయము కానేరదు. ప్రకటనాదులకింకొక వేయిరూప్యంబులు చూచినను జూడవచ్చును. లాభమొక వేయిచాలును. ఇట్టిగ్రంథము ప్రతియొకటికి నయిదురూపాయలవంతున నమ్మినచోఁ బైనవ్రాసిన సొమ్మంతయు సులభముగాను, వేగముగాను వచ్చును. ఇట్టిచో భారతముప్రతి పదిరూపాయలన్న నెట్లు దేశమునందంతటను వ్యాపింపనేర్చును? ఉల్లిపొరలవంటి పొత్తము లొకరూపాయ యెనిమిదణాలకేకదా చిక్కుచున్నవి! కావునఁ బైరీతిని గ్రంథముల యన్నిటివెలలను జాలినంతవఱకుఁ దగ్గింపవలయును. సాధారణముగా నూఱుపుటలగ్రంథము రెండణాలవ్యయమునకే సిద్ధమగుచున్నది. దానివెల నాలుగణాలన్నచో వేలకొలఁది ప్రతులు వ్యయపడి యచ్చొత్తించువారికి విశేషలాభముఁ గలిగించును. కావున భాషాభిమానులు తామచ్చువేయించు గ్రంథములను సాధ్యమైనంత స్వల్పలాభమునకే విక్రయించుచు, దేశవాసులకు భాషయందభిలాషను బుట్టింపవలయును. చౌకవెల కలిగియున్న కారణమున నిక్కాలమునందు విశేషవ్యాప్తిగాంచుచున్న గ్రంథాదుల దృష్టాంతములఁ గొన్నిటిని జూపి యీవిషయమును విరమించుచున్నాఁడను.

1. ఆంధ్రపత్రిక:—ఈ పత్రికారత్నము విలువగల మంచికాగితములపై వారమున కొకసారి ముద్రింపబడుచు నియతిఁదప్పక బయలువెడలుచుండియు మిక్కిలి చౌకగ లభించుచున్నది. దీనికిఁ జందా సంవత్సరమునకు మూఁడురూపాయలు మాత్రమే. ఆసొమ్మునందుఁ దపాలవ్యయముక్రింద నెట్లయిన నేమి నొకరూపాయ సెలవగును. మిగిలిన దానినుండి తక్కిన పత్రికలవలెఁ గాక యొకరూపాయ యెనిమిదణాలవెల గల సంవత్సరాది సంచికయను నొక యమూల్యగ్రంథరత్నము లభించుచున్నదిగదా! ఇఁకఁ గాగితపు వెలకును, ముద్రాభృతికిని నేమి మిగులుచున్నదో పత్రికాధిపతికి లాభమో, నష్టమో, యారయుఁడు! ఇంతకారుచౌకగల పత్రికగాని, గ్రంథముగాని యాంధ్రలోకమున లేదుగదా! మహామహుండగు నిప్పత్రికాధిపతి యాంధ్రప్రపంచమునకు వెలుపలనుండియుఁ దెలుఁగువారికి జేయుచున్న పరమోపకారము వర్ణనాతీతము కాదా? ఇంతచౌకగ నున్నది గనుకనే యీపత్రిక కించుమించుగ నాఱువేలమంది చందాదారులు చేరి తదధిపతిని వేనోళ్ళఁబొగడుచు నాతనికిఁ గృతజ్ఞతాభివందనము లర్పించుచున్నారు. పరమేశ్వరుఁడు దీనినింకను నభివృద్ధిలోనికిఁ దెచ్చుఁగాక!

2. విజ్ఞానచంద్రికా గ్రంథమాల:— ఈమండలివారు 100 పుటలకు నాలుగణాలచొప్పునఁ దీసికొనుచు తపాలవ్యయములను భరించుచు మంచి గ్రంథములను జందాదారుల కిచ్చుచున్నారు. దీనికిప్పుడు దాదాపుగ మూఁడువేలమంది జందాదారులు గలరు. ఇది యింకను నభివృద్ధిలోనికి రావలసియున్నది.

3. ఆంధ్రభాషాభివర్ధినీ సంఘము, ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము, ఆనందాశ్రమ గ్రంథమాల మొదలగునవి యింకను గలవు. ఇవన్నియుఁ జౌకగనే యున్నవి. అయినను ఆనందాశ్రమమువారు భారతాదులవెలలు బాగుగఁ దగ్గించి యాంధ్రులకుపకారము జేయుదురుగాక.

---

# నేటి తేట తెలుగు.

[రావుసాహెబు గిడుగు రామమూర్తి పంతులుగారు బి. ఏ., ఎల్. టి.,]

"అనావశ్యకములయిన నిర్బంధములను దీసివేసి భాషను సుసాధ్యముచేయుట పరమప్రయోజనకరము......భాషాభివృద్ధిని బట్టియే జనుల నాగరికతయు నభివృద్ధి చెందుచుండును. కనుక "జనుల యభివృద్ధిని గోరు దేశాభిమానులందఱును ముందుగా "నాంధ్రభాషను మంచిస్థితికి దీసికొని వచ్చుటకై ప్రయత్నింపవలెను. "మనవారు దేశభాషలు మంచిస్థితిలో లేవాయని యడుగవచ్చును. "లేవనియే మేము దృఢముగా చెప్పగలము...... (పండితులు) "తమపాండిత్యమును కనబఱుప జూచుచున్నారేకాని జనులకు తెలివిని గఱుపుటకై లేశమయినను బ్రయత్నింపకున్నారు."— కం॥ వీరేశలింగము పంతులుగారి బంగారపు పలుకులు.

మన తెలుగుదేశములో బ్రిటిషుగవర్నమెంటువారు సర్వజన సామాన్యముగా చదువు చెప్పించడానికి మొదలుపెట్టి రమారమీ అరవై సంవత్సరాలు అయినది. ఇంతకాలమూ పండితుల పాతతెలుగునే పుస్తకాలువ్రాసి ఫస్టుక్లాసు మొదలుకొని ఎమ్.ఏ. క్లాసుదాకా చదివిస్తున్నారు. పండితులే తెలుగు పాఠాలు చెప్పుతున్నారు. పండితుల తెలుగు ఎంతమట్టుకు వృద్ధి పొందినది? ఈపాతతెలుగు ఎంతమంది మాటాడగలరు? తెలుగువారిలో, ఇంగ్లీషు పుస్తకముల వల్లనా, తెలుగు పుస్తకములవల్లనా, వ్యాపించినంతమట్టుకయినా, ఇప్పుడు విద్యవ్యాపించినది? ఈ అరవై సంవత్సరములలో, ఎంతమంది ఇంగ్లిషు, అన్య భాష అయినా, చదవడము, వ్రాయడము, మాటాడడము కూడా నేర్చుకొన్నారో చూడండి. పాతతెలుగు పండితులయినా మాట్లాడలేరే! పాతతెలుగు పండితులయినా పొరబాట్లులేకుండా వ్రాయలేరే!

తెలుగు కాంపోజిషన్ గురించి సెనెటులో మొన్న మొన్న చర్చ జరిగినప్పుడు ఏమన్నారు విద్యాధికార్లు? తెలుగు పరీక్షలో నెగ్గిన బి.ఏ లు తెలుగున సలక్షణముగా ఒక కథ అయినా వ్రాయలేరట! మద్రాస్ గవర్నమెంట్ వారున్ను తమ జి. ఓ లో ఈసంగతే చాటించినారు. ఇండియా గవర్నమెంటువారున్ను, దేశభాషలలో విద్యవ్యాపించవలసినంతమట్టుకు వ్యాపించలేదు అనిన్నీ, ప్రజలకు లోకవ్యవహారములో తెలివితేటలు కలిగించేవిద్యలు దేశభాషలలో చెప్పలేదు అనిన్నీ, ఇంతకాలమూ విద్యావ్యాపకమునకై చేసిన ప్రయత్నము, పెట్టిన కర్చు, ఇంచుమించుగా వ్యర్థమైనది అనిన్నీ, ఇకమీదట వాడుకలో ఉన్న భాషలలోనే తెలివికలిగించే విద్యలు నేర్పడానికి ప్రయత్నము చేయవలసినది అనిన్నీ, వ్రాసి, రిజలూషన్ ప్రకటించి ఉన్నారు.

జనాభాలెక్కలలో వేసినట్టు, తెలుగున సంతకముచేయగల వారందరూ చదువువచ్చినవారే అని ఒప్పుకొన్నా, తెలుగువారిలో చదువుకొన్నవారు వేయింటికి 75 గురు మాత్రమే. అంటే, వేయింటికి 925గురు తెలుగువారు సంతకమైనా చేయలేరు అన్నమాట. తెలుగువారి అందరిలో బ్రాహ్మణజాతివారుగదా విద్యాగురువులు, .ఈబ్రాహ్మలు తెలుగువారిలో నూటికి ముగ్గురే ఉన్నారు. వీరికి విద్యనేర్చుకోడానికి ఎన్నెన్నో సుళువులు ఉన్నవి. మొదటి సంగతి, అక్షరాభ్యాసము వారికి విహితకర్మ; ఇంతేకాక, బ్రాహ్మల పిల్లలకు ధర్మానికి అనేకమంది సాయము చేస్తారు. అనేక తరాలనుండి విద్యాభ్యాసము బ్రాహ్మణవంశములలో వేరు నాటుకొని ఉన్నది. పిల్లలు తమ పొట్టపోషించుకోడానికి కూలీ నాలీ చేయ నక్కరలేదు. స్వగ్రామము, స్వగృహము విడిచి దూరదేశాలకు పోయి పదిపండ్రెండు సంవత్సరాలు వేరే చింతలేకుండా చదువుకో వచ్చును. ఇన్ని సుళువులు గల బ్రాహ్మలలోనే చదువురానివారు, ఇంకా నూటికి అరవై మంది ఉన్నారు. ఇకను ఇతరజాతులమాట చెప్పేది ఏమున్నది? ఒకకార్డుమీద చిన్న ఉత్తరమయినా వ్రాయలేనివారు, రెయిల్వే టికెట్ మీద ఏఊరిపేరున్నదో చదువుకోలేనివారు, వెయ్యింటికి 925 గురు ఉన్నప్పుడు, తెలుగుజాతులవారు నాగరికులని చెప్పడానికి నాలుక తిరుగుతుందా? యూరపుఖండములో ఈకాలములో న్యూస్ పేపరు చదవలేనివారిని కిరాతులుగా ఎంచుకొంటారు. అంతమట్టుకు చదవడము వ్రాయడము సర్వసామాన్యమయినవి. నలుగురు పండితులు నాలుగు సంస్కృతపు ముక్కలు, నాలుగు పాతతెలుగు ముక్కలు, వల్లించి, రెండు బండిరాలు, రెండు అరసున్నలు, రెండుబండమాటలు, పెట్టి పాతగొడవలు రెండుపురాణాలు తెలిగించగానే, తెలుగుభాష వృద్ధిలోనికి వచ్చినట్టేనా? ఓనమాలయినా రాని కోట్లకొలది తెలుగువారందరూ తెలివిగలవారున్నూ నాగరికులున్నూ అయినట్టేనా? అధమపక్షము నూటికి ఏభై మంది అయినా పుస్తకము చదివి అర్థము చేసుకోగలవారు, తమ అభిప్రాయములను స్పష్టముగా వ్రాయగలవారుఉండవద్దా?

నాగరిక జాతిలో పూర్వకాలములో చదవడము వ్రాయడము అరుదే. అప్పటి లోక వ్యవహారమునకు ఇవి అంతగా అవశ్యము కావు. తెలివితేటలు కలిగించే ఇతరసాధనములు, ఉన్నమట్టుకు అందరికీ సామాన్యముగానేఉండేవి. బహుస్వల్పముగా ఉండేవారు చదువువచ్చినవారు, ఎవరో నలుగురు, దేవతులలాగు. పురాణము చెప్పినా వారే; పంచాంగముచెప్పినావారే. తక్కిన జనులలో విద్యవల్ల కలిగే ఎక్కువతక్కువలు ఆకాలములో ఏవీలేవు. ఇప్పటి లోకవ్యవహారమయితే ముక్కాలు మువ్వీసము కాగితముమీదనే జరుగుతూ ఉన్నది. వ్రాయలేనివారు, వ్రాసినది చదవలేనివారు, ఎంతవెనక పడుతున్నారో



The Budlist Stupa at Sanchi.

బౌద్ధస్తూపము, సాంచి.



...hist Temple at Gwalior.

జైన దేవాలయము, గ్వాలియర్.



The Golden Temple at Mandalay.

సువర్ణ దేవాలయము, మాండలె.



Eden Gardens, Calcutta.

ఈడెను తోట, కలకత్తా.

కలిగి రాత్రింబగళ్లు వడవల్లించి, పుట్టినదిమొదలు సంస్కృతము, తెలుగు చదువుతూ, గ్రంథములు రచిస్తూ, అధ్యాపకవృత్తిలోనే కాలక్షేపము చేస్తూ ఉన్న వీరికే చక్కగా స్వాధీనముకాలేదే భాష; ఈ కాలపు బడులలో చదివేపిల్లలకు పట్టుపడడము కష్టముకాదా అనిఅడుగడానికి. లెక్కలు, హిస్టరీ, జిఆగ్రఫీ, నేచర్ స్టడి, డ్రాయింగ్, ఇంగ్లీషు మొదలగునవి ఎన్నో నేర్చుకొంటూ, పదింటనొకటిగా ఉన్న తెలుగు పాఠములు అనులోమ పద్ధతిని వల్లించడము బడిపిల్లలకు ఏలాగున వల్లపడుతుంది? సంస్కృత విద్యార్థులను చూస్తున్నాముకామూ? ఏలాగు రఘువంశము వల్లిస్తున్నారో! దినానికి ఒకశ్లోకము చొప్పున వ్యాఖ్యానముతో కూడా చదివి ఒప్పచెప్పతారు గురువుగారికి. ఈలాగున చెప్పమంటే మన పండితులు తెలుగు విద్యచెప్పి తెలివి పుట్టిస్తారట మన తెలుగుపిల్లలందరికీ! దినానికి అరవైగడియలు "గ్రామ్య" తెలుగు వాడుతూ, వాదానికి గ్రాంథిక తెలుగు మంచిదని చిందులు తొక్కుతున్నవారు, తమ పిల్లలకు ఈరీతిగానే చదువులుచెప్పించి లాభము చూపించరాదూ? ఒక్కొక్క కాలేజీకిన్ని, ఒక్కొక్క హైస్కూలుకున్ను, ఒక్కొక్క తెలుగుపండితుడేకదా ఉన్నాడు. తక్కిన మాస్టరులలో ఒక్కడయినా తెలుగు టెక్స్ట్ పాఠముచెప్పలేడుగదా! ఏమిగతి? ఈమాస్టర్లందరు తాము నేర్చుకొన్న మరిఏ సబ్జక్టుపాఠము చెప్పమన్నా చెప్పడానికి తయారుగా ఉంటారు. తెలుగుచెప్పమంటే మాత్రము తమకు రాదని వెనకతీస్తారు. కారణముఏమిటి? తెలుగు గ్రంథాలలోని తెలుగు ఈ తెలుగుమాస్టర్లు నిత్యమూవాడుకొంటూఉన్న తెలుగుకాదు. అది వేరేభాష. ఇంగ్లీషు గ్రంథాలలో ఉన్న ఇంగ్లీషు బోధపడని ఇంగ్లీషు మాస్టర్లను చూచినారా ఎక్కడయినా? లక్షలకొలది అచ్చుపడుతున్నవి ఇంగ్లీషు పుస్తకాలు; ఏవో ఫిజిక్సు కెమిస్ట్రీవంటివి తప్ప, సాధారణముగా ఏపుస్తకము పడితే ఆపుస్తకము చదవగలడు ప్రతి ఇంగ్లీషువాడున్ను, ఇంగ్లీషువారివాకా ఎందుకు? ఇంగ్లీషునేర్చుకొన్న తెలుగువారే చదవగలరు. తెలుగు బి.ఎ.గారు తాను పరీక్షకు చదవని తెలుగుపుస్తకము ఒకటి స్వతంత్రముగాచదవగలరా? ఒక కొత్తపద్యానికి "పదచ్ఛేదము"చెప్పగలరా? నా మాటలు అతిశయోక్తులు, ఉత్ప్రేక్షలు అనేరు కొందరు; గాని నా అనుభవమునుపట్టి నాకు వాస్తవముగా తోచినసంగతులే వ్రాస్తున్నాను. వేదము వేంకటరాయ శాస్త్రిగారిని అడగండి; ఆయన నామాటకాదనరు చూడండి. ఇప్పుడు గ్రంథకర్తలుగా పేరుపొందినవారు అనేకమంది ఎంతతంటాలుపడి గిజగిజ గింజుకొంటున్నారుకారు. వారి తెలుగు పూర్వపు వ్యాకరణసూత్రములను అనుసరించి ఉన్నదని భ్రమపడుతున్నారుగాని దోషములు ఎన్నోఉన్నవి. ఇప్పటిగ్రంథములలో నిర్దుష్టమైనది, ఒకటిఅయినా నాకుకనబడలేదు. మధ్యకవులు ఆధునికకవులువ్రాసినకావ్యములలోనేఅనేకమయినవాటిలో లక్షణవిరుద్ధములయినప్రయోగములుఉన్నవి అని రాయబహద్దరు వీరేశలింగము పంతులుగారే విమర్శించిచెప్పినారు. ఆపంతులు వారిగ్రంథములలోనూ ఉన్నవి. కొన్ని పూర్వలక్షణాలకు విరుద్ధమైనప్రయోగములు. ఇంతమందికి ప్రమాదము కలగడానికి కారణము ఏమిటంటే; బాగాపరిచయముగల స్వభాషలో గ్రంథములువ్రాయక పరిచయములేనట్టిదిన్ని, పాణిని వ్యాకరణమువంటి విపులమయిన లక్షణము లేనట్టిదిన్ని, పూర్వకవుల కావ్యములే శరణగా గలదిన్ని, అయిన ఒక కృత్రిమభాషలో వ్రాయడమేను. స్వభాషలో వ్రాయడము స్వగ్రామములోను స్వగృహములోను తిరుగడమువంటిదిగదా. బొంబాయివంటి పెద్దపట్నములో కొంతకాలము కాపురమున్న తర్వాతకూడా, మనవ్యవహారముతో సంబంధించిన స్థలములతోమాత్రము పరిచయము కలగవచ్చునుగాని, తక్కినభాగములు కొత్తగానే ఉంటవి. మాపుగాని, ప్లానుగాని పట్టుకొనిచూస్తే నలుగురూ గొప్పవనుకొనేస్థలములుమాత్రము పోల్చుకోవచ్చును; గాని తక్కినవి అన్నీ తెలియవు. వ్యాకరణము ప్లానువంటిది. నిఘంటువు పట్నములోని వస్తువుల పట్టివంటిది. ప్లానూ, పట్టి, పట్నము స్వరూపము తెలియజేసినా పట్నములో కాపురముండి నాలుగుమూలలా తిరిగేవారు వ్యవహరించినట్లు స్వేచ్ఛగాస్వతంత్రించితోవతప్పకుండాకొత్తవాళ్లుతిరగలేరుగదా?

అట్టిభాషలో మనోభావములు వ్యక్తపరచడము కూడాను. 'నాకుఆకలివేస్తున్నది' 'నాకుఆకలిఅవుతున్నది' 'నాకుఆకలిగాఉన్నది' అనేవాక్యములు వాడుకలోఉన్నవి; అందరమూవాడగలము. 'నాకు ఆకలిగదిరినది';, 'నాకుఆకలివొడమినది'; 'నేనుక్షుత్పీడితుండను'—అనే వాక్యములు చెవులకుకొత్త. 'నాకుఆకలివేస్తున్నది' అనడానికిమారుగా 'నాకుఆకలివైచుచున్నది' అనిప్రయోగించడము హాస్యాస్పదముగా ఉంటుంది. ఏగ్రంథములలోనూ అట్టిప్రయోగములుకనబడవు. అట్టివి కల్పించివాడినందుచేత నైజధర్మముచెడి భాషకృత్రిమమైనది అవుతుంది. కర్రబొమ్మకుజీవముతో ఉన్నమనిషికీ ఎంతభేదమో అంతభేదముంటుంది అట్టికృత్రిమభాషకున్నూ వాడుకలోఉన్నభాషకున్నూ కంటిమాపులో కనబడేటట్లు నోటిమాటలో వినబడవలెను మనోభావము.

ఎంతోశ్రమపడితేనేగాని కృత్రిమభాషపట్టుపడదు. పోనీ, ఇంతశ్రమపడినేర్చుకుంటే, లాభమేమైనఉన్నదా? ఈకృత్రిమభాష లోకవ్యవహారములో యెవరైనా మాట్లాడుతున్నారా? లేదు. సభలలో వాడుతారా? లేదు. కోర్టులలో ప్లీడర్లు యీభాషలో వాదప్రతివాదములుచేస్తారా? లేదు. అపెసర్లకు అడ్రెస్ యీభాషలోయిస్తారా? లేదు. జడ్జీలు మునసబులు ఈభాషలో విమర్శచేస్తారా? లేదు. తీర్పులుకాని రాజీనామాలుగాని ఈభాషలోవ్రాస్తారా? లేదు బడిలో మాస్టర్లు పాఠాలు బోధపరిచినప్పుడు ఈభాషవాడుతారా? లేదు. పౌరాణికులు ఈభాషలో పురాణములకు అర్థముచెప్పతారా? లేదు. గనుక ఈభాషలో పాండిత్యము లోకవ్యవహారానికి ఎందుకూ బనికిరాదు. పండితులకే అదిప్రయోగించడములో ప్రమాదము సంభవిస్తూ ఉంటే, సాధారణులు ఈభాషనేర్చి, కంపోజిషన్, కవిత్వముకూర్చగలరా? ఇంతదుస్సాధ్యమైనభాషను ప్రతితెలుగుపిల్లవాణ్ని నేర్చుకొమ్మని బలవంతపెట్టడముచేతను, అందులో వ్రాసినపుస్తకములే చదువుమనడముచేతను, ప్రజలలో విద్యవ్యాపించడములేదు. ప్రైమరీస్కూ-

ళ్లలో మాష్టర్లకే కాదు, హైస్కూళ్లు కాలేజీలలో ఉన్న మాష్టర్లకైనా ఈగ్రాంథిక తెలుగు రానప్పుడు వారివద్ద చదువుకొనే పిల్లలకు ఆభాష ఎట్లువచ్చేను? ఇంగ్లీషుకథలపుస్తకము కులాసాగా చదువుతాడుగాని జయవిలాసము, మనుచరిత్రము ఎవడూ ముట్టుకోడు. తెలుగంటే అసహ్యముగదా! బాగా ఆలోచించండి. దురభిమానము విడవండి. నిజము నుకోండి; తెలుగుపుస్తకమంటే తెలుగుపిల్లలకే అసహ్యమెందుకేత? తొమ్మిదిఏళ్లు ఈడుగల తెలుగుపిల్లలు నూరు ఇంగ్లీషుకథల పుస్తకాలు చదివినారు. అతిశయోక్తి కాదు.

అవిచ్ఛిన్నముగా సంప్రదాయానుసారము కవులు అందరూ నన్నయకాలము మొదలుకొని నేటివరకూ వాడుకచేస్తూ వచ్చిన భాషను విడిచి, గ్రామ్యభాషను గ్రంథములు వ్రాయడము ఉచితము కాదని వాదించే వారివాదములో అనేకదోషములున్నవి. భాషమారను అని వాదిసారా? ప్రత్యక్షముగా కనుపడుతున్న దానికి విరుద్ధముగదా! భాషమారకూడదని వాదిస్తారా? ఈవిధి ఎక్కడనున్నదో మొదట చెప్పవలెను. వ్యాకరణము చదువుకుంటే భాష చక్కగా వస్తుందంటే, అనుభవానికి విరుద్ధము. ఏదేశములో అయినా గొప్పకవులు వైయాకరణులు కారు. వ్యాకరణములోని సూత్రము ఒకటి అయినా రాకుండా చక్కగా వ్రాయగలవారు అనేకులున్నారు. గ్రామ్యమనగా అధమజాతులవాడుక. ఇప్పటి ఉత్తమజాతులవాడుక గ్రామ్యము అనకూడదు. ఒకవేళ గ్రామ్యమనగా పూర్వభాషా సంప్రదాయమునకు విరుద్ధము అయినది అంటే, నన్నయవాడుకకు భిన్నముగానున్న తిక్కనవాడుక, నన్నయ తిక్కనల వాడుకకు భిన్నముగా ఉన్న పెద్దనవాడుక, ఇట్లు పూర్వకవుల వాడుకకు భిన్నముగా ఉన్న తర్వాతికవుల వాడుక, గ్రామ్యమని చెప్పవలెను. అప్పుడు గ్రామ్యమను దోషమే ఉండదు. మంచిగాని చెడ్డగాని ఔచిత్యముగాని అనౌచిత్యముగాని ఏశబ్దమునకూ శాశ్వతమైన లక్షణము కాదు. ఒకప్రదేశములో గాని, కాలములోగాని, అనుచితమైనది మరి ఒకప్రదేశములో గాని, కాలములోగాని, ఉచితమవును. ఇది అన్ని భాషల చరిత్రములలోను కనబడుతున్నది. మాటలకు గౌరవము ఆమాటలు ఆడేవారిని పట్టి ఉంటుంది. «సాని» ఏమిపాపము చేసుకున్నది? «ఇల్లాలు» ఏమి పుణ్యము చేసుకొన్నది? «కూడుకుడవడము» ఎందుచేత గ్రామ్యమైనది.? «మనుగుడుపులు»కు అంతగౌరవమేల? కట్టెలకోసము కాటికిపోయినా, «కాటికి పోయినాడు» అనకూడదుగదా. నెల్లూరిలో «బొక్క» అంటేతప్పులేదుగాని, ఉత్తరజిల్లాలలో అశ్లీలము. ద్రౌపది నడిచి నడిచి అలిసిపోయివుంటే, «అలసినది, దానిని మోచికొనితెమ్ము» అని ధర్మరాజు తమ్మునితో చెప్పినట్టు ఇపుడు ఎవడైనా «ఆవిడను మోసుకొని తెచ్చినాడు» అనవచ్చునా?

అయితే, వాడుకలో ఉన్న భాష ఒక్కలాగు ఉన్నదా? ఒక్కొక్కజిల్లాలో ఒక్కొక్కమాదిరి ఉంటుందే, అది అందరికీ తెలుస్తుందా? అని కొత్త తెలుగుకోసము కొట్టుకొనేవారిని కొందరు ఆక్షేపిస్తున్నారు. గ్రాంథికభాషమాత్రము ఒక్కమాదిరిని ఉన్నదా? చూడండి! సంధివిషయములో కొన్నిచోట్ల బహుళమట, కొన్నిచోట్ల వైకల్పికమట, కొన్నిచోట్ల తఱచట!! సరళాదేశము పండితుల యిష్టము; విహితముకాదు. వాడు సూ(చూ)చె; వాడువో (పో)యె.!!! ఉయ్యెల మొ॥ రమారమీ పదిభిన్నరూపములు, ఒకరిత మొ॥ రమారమీ అరవై; తెప్ప, తేప మొ॥ వాటికి ఎన్నటికో రెండేసి ఉన్నవి రూపములు. IV బహువచనరూపములు అనేకరీతులు కొడవండ్లు మొ॥ అయిదు V ద్వితీయావిభక్తి రూపములు. ఉ॥ కంసునిన్ కంసునిఁ, కంసుని, కంసున్, కంసుఁ, కంసుం! చతుర్థీ విభక్తి ప్రత్యయములు కి, కిన్నై VI వర్తమానకాలము, భవిష్యత్కాలము, తద్ధర్మకాల అన్నీ, ఒకటే. VII నన్నునలిగి, నాపై నలిగె అని సకర్మక అకర్మక అర్థములు. VIII ప్రేలును-ప్రేలాడును అని అనుబంధము కలిగిగాని లేక గాని. IX అనిరెను, అనెను, అనితిని, అంటిని XI ప్రతిమాటకు అర్థభేదములేని పర్యాయపదములు అనేకములు XII ఒకేమాటకు అనేక అర్థములు XIII శబ్దపల్లవములు—ఇటువంటి వ్యత్యాసములు ఎన్నో ఉన్నవే గ్రాంథికభాషలో! వీటిలో పదోవంతు అయినా ఉండునా ఈకాలపు నాగరికుల తెలుగు భాషలో భేదములు? పోనీ, తక్కువ కాదు, ఎక్కువే ఉన్నది వ్యత్యాసము అని ఒప్పుకొన్నా. లోకవ్యవహారములో ఉండి, నోటను పలుకుతూ, చెవికి వినబడుతూ ఉన్న భాష ఏదైనా గ్రహించడము, మాటలాడడము బహుసులభము. బరంపురములో తెలుగు పిల్లలు ఓఢ్రము మాటాడగలరు. చెన్నపట్నములో అరవలకు తెలుగువస్తుంది. బళ్ళారిలో తెలుగులకు కన్నడము వస్తుంది. అందరికి ఇంగ్లీషు వస్తుంది. అలాగునే గుంటూరు తెలుగువారు, కర్నూలు తెలుగులో భిన్నరూపము వాడుకలో ఉంటే, నేర్చుకొంటారు; నేర్చుకొంటున్నారు. బొత్తిగా ఒకరిమాట ఒకరికి తెలియనంత వ్యత్యాసము ఉన్నదా గుంటూరి తెలుగుకూ కర్నూలు తెలుగుకూ? ఉంటే, ఇక్కడివారు అక్కడా, అక్కడివారు ఇక్కడా ఉద్యోగాలు చేస్తున్నారుగదా ఏలాగు కార్యాలు నిర్వహించుకొని వస్తున్నారండీ? నాఅనుభవానిపట్టి చూస్తే తెలుగుదేశమంతటా చదువునేర్చిన వారందరూ మాట్లాడేభాష ఇంచుమించుగా ఒకటేభాష. దిగువజాతులవారికి చాలామందికి ఈభాష వాడుకభాషకాకపోయినా, బాగా తెలుస్తుంది; ఇది సులభముగా మాటలాడడము నేర్చుకోగలరు; నేర్చుకుంటున్నారు కూడా. గొప్పవారిళ్లలో నౌకర్లుగా ఉన్నవాళ్లు చాలామంది తమయజమానులు మాట్లాడినట్టే మాటలాడుతున్నారు. ప్లీడర్ల వద్దకు తరుచుగా వెళ్లే క్లయంట్లు నాగరికభాష మాటలాడడము అలవాటు చేసుకొంటున్నారు. ఇట్లే ఆఫీసులలోను, కోర్టులలోను, దేవుడిగుళ్ళ వద్ద, బజారులలోను, మీటింగులలోను, బడులలోను, అన్నిజిల్లాల తెలుగుమాటలు అన్నిజాతుల తెలుగుమాటలు కలిసి సాపెక్కుతున్నవి. ఉత్తమజాతుల వాడుకభాషకుగౌరవము సహజము. గనుక అది వ్యాపిస్తున్నది. భేదాలుంటేనేమి ? రెయిల్‌బండిలో అరిగిపోతున్నవి ఎగుడు దిగుళ్లు అన్నీ. ఇదే కొత్తతెలుగు! నేటి తేట తెలుగు; వ్రాస్తూఉన్న నాతెలుగు; చదువుతూఉన్న మీతెలుగు.

తేట తెలుగుభాష అన్ని విధములా యోగ్యమైనది; అందరికీ సాధ్యమైనది. మాదిగవెంకడు మొదలుకొని వెంకటావధానుల వరకున్న వెయ్యింటికి 75 గురు మాత్రమే ఓనమాలు వచ్చినవారున్నప్పుడు గ్రాంథిక భాషవచ్చినవారు 5 గురైనా ఉందురో, ఉండరో! అయితే నాగరికుల తెలుగు, తేటతెలుగు లోకవ్యవహారములలో ఇప్పుడు వాడుతూ ఉన్నవారే వెయ్యింటికి అధమపక్షము నూరుగురైనా ఉంటారు. అది తెలుసుకో గలిగినవారు వెయ్యింట మున్నూరుగురైనా ఉంటారు. క్రమక్రమముగా వాడుక ఎక్కువయి, అంతకంతకు దిగువ జాతులకు అది వ్యాపిస్తుంది. ఈ తేట తెలుగులో తెలివికలిగించే విద్య అందరికీ సర్వసాధారణముగా చెప్పితే సరస్వతి తెలుగుదేశములో తాండవమాడదా? కొద్దికాలములోనే తక్కినదేశములతోపాటు మన తెలుగుదేశము కూడా నాగరికము కాదా?

ఎవరికీ సాధ్యముకాని, పసలేని పాతతెలుగులోనే అభిప్రాయాలు వ్యక్తపరచవలెనన్న పిచ్చిప్రయత్నాలు చేస్తూఉండబట్టి భాషకు ఏవిధమైన అభివృద్ధి లేకుండా ఉన్నది; గాని మనకు సులువుగా బో పడుతూ వున్న మన తేటతెలుగునే ఆదరించినయెడల ఎంతఉపచరిస్తుందో చూడండి. ఇండస్ట్రియల్ రిఫార్మర్లు పొలిటికల్ రిఫార్మర్లు, సా టరీ రిఫార్మర్లు అగ్రికల్చరల్ రిఫార్మర్లు, ఎడ్యుకేషనల్ రిఫార్మర్లు, లి రరీ రిఫార్మర్లు ఈ తేటతెలుగున లెక్చర్లనోటను వెళ్లుమని ఉరిమిం వచ్చునుగదా; పాంఫ్లెట్లు పుస్తకాలు కురిపించవచ్చునుగదా; విద్య పారించవచ్చునుగదా.. తెలుగువారి బుద్ధి సారవంతమై ఎట్టిపంటపండునని ఎవరుచెప్పగలరు?

పండితులారా! మీదురభిమానము విడిచిపెట్టండి. దేశమంతా విద్యకావలెనని మొరపెట్టుకొంటూఉన్నది. సులభముగా వచ్చే తేట తెలుగులోనే విద్యనేర్పడము సులభమైనప్పుడు పాతభాష నేర్చుకొంటేనేగాని విద్యసంపాదించడానికి వల్లకాదు అని మీరెందుకు అడ్డుపెట్టుతారు. మీరు గ్రామ్యులు కారుగదా? మీనోటను వచ్చేమాట అశ్లీలము కాదుగదా! మీరు నిత్యమూవాడుకొనేభాష శంఖములోపోసిన తీర్థమువంటిది. అదే అందరికిఇచ్చి ఉద్ధరించరాదా?

# నాగరికాంధ్రము.

:o:

[ఉలిగుండం రంగారావుపంతులుగారు బి. ఏ.]

భాషాసంస్కర్తలు ప్రస్తుతము గ్రామ్యము లేక వ్యావహారిక భాష. లేక నాగరికాంధ్రము నేగ్రంథములందు వాడవలయునని యభిప్రాయపడుచున్నారు. ఆంధ్రులకేమి తదితరులకేమి గ్రామ్యము క్రొత్తదికాదు. ప్రతిదేశమందును బ్రతికాలమందును బ్రతిజాతివారియందును గ్రామ్యముండక మానదు. గ్రామ్యమును గ్రాంథికభాషయును విలక్షణములైనవియు. అట్లయ్యు నేభాషయందేనియు విద్వాంసు లసంబరఁగు వారద్దాని నంగీకరింపక దానికంటె నుత్తమమై నిశ్చలమై రసపూరితంబై శ్రవణానందకరంబైన భాషనే గ్రంథములఁ బ్రయోగించుచు వచ్చిరి, మఱియు నిప్పటికిని బ్రయోగించుచున్నారు. దీనికిఁ గారణమేమై యుండును? కారణము సమస్త జనులకు విశదమే. గ్రామ్యమనునది దేశదేశమునను, మండలమండలంబునను, గ్రామగ్రామంబునను బలుతెఱంగుల మాఱుచున్నది కాని సామాన్యమును వహించి యుండదయ్యె. అందునను బ్రాహ్మణులు మాటలాడునదియుఁ దదితరులు మాటలాడునదియు నొక్కరూపమున నుండదు. రాజమహేంద్ర ప్రాంతముల నావకాయపై చర్మమునకు "తొక్కయ్యనా," లోనిగింజకు "డొక్కయ్యనా;" యందురు. గుంటూరు సీమను "తోలు", "టెంక"యందురు. అట్లే "భోగట్టా", "పాలగుండ," అన్న పుగుండ, "ఎలక," తెలకపిండి నూని: 'తోంగున్నాడు' అన్న మాదేశమువారికేమియర్థమగును? "ఎలక" యనుటకు "ఎలుక,". "ఎలికె" యనియు 'తెలకపిండి,' యనుటకు 'తెలికపిండి' 'నూని' కి 'నూనె' యనియు నీసీమను వాడుదురు. 'బుజ్జకొట్టించుకొండి,' 'బుజ్జగికించుకొండి,' 'డొక్కచీరుతాను', 'దుమ్ములు విఱుగగొడ్తాను' అన్న నన్నిసీమలవారి కర్థమగునా? బళ్లారిసీమను సొమ్ములన్నఁ బశువులు. ఇట్లొక సీమమాట మఱియొక సీమకుఁ దెలియకున్నది.

మఱియు నాగరులు మాటలాడుభాష నుపయోగింపవలయునని సంస్కరణాభిమానుల యాశయము. నాగరులభాషయు నొక్కతీరున నుండదాయె. మఱియు నాగరులన్న నుత్తమజాతివారని వారియభిప్రాయము. ఉత్తమజాతివారిభాష యేల గ్రాహ్యమో నీచజాతులవారిదేల యగ్రాహ్యమో సంస్కర్తలు చెప్పరైరి. సంఖ్యకన్నదో రెండవ తరగతివారే హెచ్చు. కాన "బహుజనులు వాడుభాషకాన" నను హేతువు సంస్కర్తలకు సహాయకారికాదు. పోనిండు, ఉత్తమజాతి వారిభాష యెక్కువ మృదువనియా, రసవంతమనియా, నిర్దుష్టమనియా?

...మున నీవిషయములందెల్ల గ్రాంథిక భాష గ్రామ్యముకంటె మేలన తీరనుగదా. కాన నీకారణమును వారికి సరిపడదు. మఱియు నుత్త... నీచజాతి నిర్ణాయకు లెవ్వరు? ఎవరిని నీచులని భావించుచున్నా... వారే యెచ్చుగ నున్నారు. వారు తమరే యుత్తముల మందురు...? కానిచో వీరుత్తములు వీరుకారని ప్రభువు లోకచట్టము నిర్మిం...లయును.

పూర్వకాలమందున నిట్టి గ్రామ్యభాష లేకయుండెనా? అకా...ములందు జనులు సామాన్యముగ మాటలాడు భాషలోనే నన్నయా...లు గ్రంథములు వ్రాసిరనియుఁ నేఁటికి సామాన్యజన భాష మాఱినది ...న గ్రంథభాషయు మాఱవలయునని సంస్కరణాభిమాను లందురు. ...ది నిరాదరణీయము, నన్నయాదు లెవ్వరును వ్యావహారిక భాషలో ...ంథరచనం గావించి యుండలేరు. అప్పటికిని గ్రాంథిక భాష వేఱు ...వ్యావహారిక భాష వేఱు. ఇందుకు బ్రమాణము—అథర్వణ వ్యాకరణకారి కావళిలో "పామరాది ప్రయుక్తం యత్తద్గ్రామ్య మభిధీయతే" యని యు, నన్నయభట్టీయమందు "అనియమాద్గ్రామ్యం హిత్వ ప్రథం తే ॥ విరళాన్ పేచోషాది కతిశబ్దాన్ ప్రవ్యాహరన్తు శబ్దజ్ఞాః। ఇహ తు ప్రవ్యాహార్యం సజ్జేతితను ప్రసిద్ధ మేవపదం" అనియు, సాంధ్ర భాషా భూషణమందు "గ్రామ్యభాషనాఁగఁ గలవైను తెనుఁగులు..." యనియు "......1 సందులోని గ్రామ్య మెందు నెవ్వరునొప్ప ॥ రో రులఁ దెగడుచోట నొప్పనదియు" చెప్పంబడి యున్నది. మఱియుఁ బామరుల భాష గ్రామ్యమనియు దానిఁ బ్రయోగించుట కావ్యదోషమని నరసభూపాలీయములో నాల్గవ యాశ్వాసమందు చెప్పఁబడి యున్నది. కాన నన్నయాదులు వ్యావహారిక భాషలో గ్రంథముల వ్రాసిరనుట కేవలము కల్ల. ఇట్లార్యసమ్మతముగాక దేశదేశములకు వేసంబులమార్చి చరించు పుంశ్చలియగు గ్రామ్యమును బుద్ధిమంతు లంగీకరింతురా? 2. భాషాప్రయోజన మేమనఁ గృతికర్త యభిప్రాయములఁ జదువువారలకు సులభముగ బోధించి తద్ద్వారా వారలకు జ్ఞానము కలిగింపవలయునని యందురు. ఇది యథార్థము, అయిన గ్రాంథిక భాష వలన నీప్రయోజనము కూడకయున్నదా? కూడుట లేదనుట పొరబాటు. పూర్వమందు స్త్రీలేమి, విద్యమాకుఁ బుట్టుకతో వచ్చినదను బ్రాహ్మణులకంటె నితరులేమి యనేకగ్రంథములఁ జదివి జ్ఞానసంపన్నులై గురుత్వమంది ప్రతిష్ఠగాంచిన వారలనేకులు గలరు. ఇప్పుడునట్టి వారనేకులుగలరు. వారు చదివినగ్రంథములు వ్యావహారిక భాషలో నుండెనా? లేదు లేదు. బ్రాహ్మణేతరులు కొందఱెంతమంచిగ్రంథముల నెంతమంచి శైలిలో వ్రాసియున్నారో విచారింపుఁడు. గ్రాంథిక భాషలో వ్రాసిన గ్రంథము లెవ్వరికినిఁ దెలియక యినుపపెట్టెలఁ బోలి యుండినచో నప్పుడప్పుడే యవినశించి యుండును. అట్లుకాక వేల కొలఁది సంవత్సరముల క్రింద వ్రాయఁబడిన గ్రంథములిప్పటికిని మాన్యతఁ బొరయుట యాలోచింపసంస్కర్తల వాక్కులు పొల్లులుకాకమానవు.

నాటకములన్నియు గ్రాంథిక భాషలో వ్రాయంబడి ప్రదర్శింపఁబడుచుండుట తెలియనివిషయముకాదు. వానియర్థము గ్రహించి పామరులు సయితము సంతసించుటలేదా? తెలియక సంతసించిరనుట తప్పు. అట్టిసంతసము చిరకాలము నిల్వనేరదు. అయినఁ బ్రతిపదమున కర్థము గ్రహించుచున్నారాయని యందురు. గ్రామ్యభాషలో వ్రాసిన వ్రాతలుమాత్రము ముక్కముక్క యర్థమగునా? అదియుఁగల్ల.

స్త్రీలును బ్రాహ్మణేతరులును బాడుకొను కీర్తనలు, తత్త్వములు, యక్షగానము లనేకములు కలవు. అందేవియు గ్రామ్యమున రచింపఁబడి యుండకున్నను బాలకులు దానింజదివి యర్థము గ్రహించి యనుభవమునకుఁ దెచ్చికొని సంతోషమనుభవించుచున్నారుగదా! వారలు భారత భాగవత రామాయణములు చదివి తదర్థంబుల గ్రహించుట లేదా?

సంస్కృతనాటకములందుత్తమపాత్రలుసంస్కృతమునఁబల్కినను దానియర్థంబు విపులంబు చేయించుకొనకయే నీచపాత్రలు ప్రాకృతంబునఁ బల్కుదురు. నీచపాత్రలిందువలన సంస్కృతము తెలియకయే ప్రత్యుత్తరమిత్తురనుట సమంజసమా? కాదు, దీనివలనను నీచులకు సుబోధకమగునటుల నపభ్రంశముగ సంస్కృతమునఁ బల్కరైరంచును గాన గ్రాంథికాంధ్రమైనఁ బామరులకుఁ దెలియుననియుఁ దేలుచున్నది.

3. పూర్వభాష యిప్పటికిఁ జాలమాఱినదనుట విశ్వసనీయముకాదు. గ్రంథద్రష్టలగు వారల కీవిషయము స్పష్టము. కొన్ని పదంబులు మాఱిన మాఱుఁగాక మాఱినంతనేమాయె? పూర్వగ్రంథభాషకును బ్రస్తుతవ్యావహారిక భాషకును మిగుల భేదములేదు. ఇంకను దద్గ్రంథంబులఁ దెలిసికొనలేని దుస్థితి యాంధ్రులకుఁ బ్రాపించలేదు. అట్టి స్థితి సంస్కర్తల నిరంతర ప్రయత్నంబులవలనఁ గల్గినఁ గల్గనోపును. పూర్వమున కిప్పటికిని విభక్తిప్రత్యయములును, క్రియారూపకములు మున్నగునవి భేదించినవనియు నట్లగుటంజేసి పూర్వభాష యిప్పుడర్థంబు గాదనియునగాఁ జాలపదము లిప్పుడప్రసిద్ధములైనవనియు నట్టివాని వాడఁదగదనియు సంస్కర్తలందురు. ఇది యథార్థముకాదు. ముందు "వానిని" అనియుండి రానురాను "వానిన్," "వాని," "వాణ్ణి" అని యయినదనిచెప్పుదురు "చేయుచున్నాఁడు" అనునది రానురాను "చేమన్నాఁడు' అని "చేస్తున్నాఁడు," అని యయినదని చెప్పుదురు. ఇదెంతయు నసమంజసము. మున్నా గ్రాంథిక భాషయు గ్రామ్యములేక వ్యావహారిక భాషయు నొక్కటేయనిగాని లేక వానిరెంటి పృథక్స్థితి యొప్పికొన్నచో నప్పటి గ్రామ్యమెట్లుండెనో యిప్పటి కప్పటి కట్టి భేదము కలదో సుప్రమాణముగా సంస్కర్తలు నుడివినఁగాని తెలిసిన వారలు వారలమాటల చెవిఁబెట్టరు. మాపక్షమున గ్రాంథిక భాషయు వ్యావహారిక భాషయు వేఱువేఱనియు గ్రాంథిక భాష నిప్పటికి నప్పటికి మిగుల వైరూప్యమును బొందలేదనియు దీనికిఁబ్రమాణము మునుపటి నుండి యిప్పటికి నిలిచియున్న పుస్తకములే.

సంస్కర్తలు తమపక్షమున నుదాహరణలుగ నిచ్చు పదములఁ గొన్ని విచారింతము:—

మున్ను "అయినన్" అనియు నిప్పుడు "అయితే" ననియుఁజే దర్థంబునఁ బ్రయోగించుచున్నారనియుఁ గాన "అయిన" ననునది య

ప్రసిద్ధమని సంస్కర్తలందరు. సంస్కర్తలకుఁ బ్రతికూలురైన గ్రాంథిక గ్రామ్యభాషా వైషమ్య మెన్నువారి కియ్యది బాధాకరముకాదు. «అయితే» అనురూపము క్రొత్తదికాదు. భారతంబున సభాపర్వంబున «ఏకవస్త్రనైతేనేమి,» «విగతవస్త్రనైతేనేమి» అని ప్రయోగము «నైనైతే» అనునది సామాన్యమే. మొదటిచోట «అయితివి+ఏని,» «అయితి + ఏని» «అయితేని» «అయితే» యనియు రెండవచోట «అయితిని+ఏని» «అయితి+ఏని» «అయితేని» «అయితే»అనియు నయినవి. ఈనూఱ్ఱాండ్లకము గ్రహింపక «అయితే» యని సర్వకాల సర్వావస్థలలోఁ జెవర్థకమని యంట యెంతలెస్స!

మఱియు «రావే» «పెట్టవే» యను ప్రయోగంబు లప్రసిద్ధములనియు వానికిప్పుడు స్త్రీపర్యాయముగ నర్థమిచ్చునందురు ఇదియనుభవములేక చెప్పినమాట. ఇప్పటికిని బ్రాహ్మణులలో సయితము తండ్రిని, అన్ననుగూర్చి పిల్లలిట్లు పలుగుదురు:—«నాయనా అన్నంబెట్టవే», «అన్నోయి నాతోరావే».

చేయఁగా దనయులకు వలయు—«ఇచట» «చేయఁగావలయు» ననుటకు బ లట్లు చెప్పటవలన «వలయు» ననుదాని ప్రయోగము చిత్రమనియు నిప్పుడట్లు ప్రయోగింపరుగాన నయ్యవి యిప్పుడు వర్జ్యములని యం రు. ఇది పద్యకావ్యములందలి యన్వయ విశేషముగాని ప్రయోగ వైచిత్ర్యముకాదు. ప్రతి విషయంబును బద్యకావ్యములందన్వయము లిట్లేయుండును.

ప్రోవ, క్రంప, ప్రాగు,—ఇట్లు రేఫవిశిష్టముగాఁ దత్పదంబుల నిప్పుడు పల్కుటలేదు. గాన నారూపములు పనికిరావందురు. పుట్టు కలోనేయున్న రూపములనేల మార్చవలయునో తెలియదయ్యె. రేఫఁ దీసివైచి తోవయన్నచో నింక రెండునాళ్ళకు «తోవ»యని హ్రస్వముచేసినచో నట్లే ప్రయోగింపవలయుఁగదా? ఇట్లైన భాషకు నిల్కడ యెక్కడ? ఎవని యిష్టమువచ్చినట్లు వాఁడు మార్చినచో నొక్కపదమే యనేకరూపములఁ బొంది యెవరి కర్థముకాకుండుఁగదా? «ప్రతి» యనుదానికిevery యను నర్థము సంస్కృతమున లేదనియుఁ గాలక్రమేణ దానికట్టి యర్థము వచ్చినదనియుఁ జెప్పెదరు. పూర్వ ప్రయోగంబుల «ప్రతిదినం» «ప్రతిక్షణం» అనువాని కర్థమేమొ వారు తెలియకరిరి మఱి తెలుపరైరి.

«రేపు» అనుదానికి మొదటియర్థము«ఉదయము» అనియుఁ నదకుమారి «మరుదినము» అను నర్థమిచ్చుచున్నది కానఁ బూర్వపుటెల్లు అయినదని చెప్పెదురు. «రేపు» అనుదానికి రెండర్థములునుగలవు. మఱుదినమనుటకు భాగవతంబున» «ఆక్కలురావు పిల్లలకు రేపటినుండియు మేతఁగానమిక» అనుదానిం జూడుఁడు. మఱియునిట్టి ప్రయోగంబు లనేకములుకలవు.

«ఊరేగు» అన్నఁ జనిపోవునను నర్థమని మొదటి యర్థమదికాదనియుఁ గానభాషobsoleteఅనియందురు. ఇది మహాచిత్రము «ఊరేగు» పదమున కిప్పటికిని మేళతాళములతో .నూరుతిరుగుటయేయర్థము. చెల్లిపోయెనను నర్థమున గ్రంథప్రమాణము లెచ్చటనులేవు. చమత్కారముగ మాటలాడునప్పుడు లక్షణయాతదర్థమువచ్చునటుల సకృత్తుగా మాటలాడుట కద్దు, కాని వేఱుకాదు.

ఇట్లు స్థాలీపులాకన్యాయముగ నొక కొన్నింటిని మాత్రము చూపినాఁడ. గ్రంథవిస్తరభీతివలన నితరముల వివరింపనైతిని. ఈక్రింది పద్యములఁ జదివిచూచిన నిప్పుడవి మనకర్థమగునో లేదో, ఎన్నిపదముల ప్రసిద్ధములుగలవో, భాషమారవలసిన యవసరమున్నదో లేదో యెల్లరకుఁ దెలియును:—

క॥ వనకన్యక యట నేనట।
వనమున గాంధర్వమున వివాహంబటనం।
దనుఁగనెనట మఱచితినట।
వినఁగూడునె యిట్టి భంగి విపరీతోక్తుల్ ॥ భా॥ ర॥ ఆ॥ ప॥

ఉ॥ దైన్యము దక్కుదూతయుచితంబుగఁబాండునృపాలు పాలురా।
జన్యవరుండు ధర్మజుఁడు సమ్మతివేడెడి నన్న లోకసా।
మాన్య విధింపగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చికొందమ।
న్యోన్య విరుద్ధభాషణము లాడినఁ దత్ఫల మాతఁడందెడిన్ ॥
భా॥ ర॥ ఉ॥ ప॥

మ॥ అనినన్ మీనుడిలోఁ దలంచునది మేలౌ సిద్ధసంకల్పులీ।
రని యావేళనె చిత్రవాహనుఁడుకోలై యుండఁగాబోయియా
యనరారమ్మని గారవించి సుముఖుండై రాజుగారిప్పుడే
మనినారయ్యనిన్ వార్తలంచుఁ బయిపై నాసక్తితోఁబల్కఁగన్॥
విజయవిలాసము.

తే. కొమ్మల నదల్చునెప్పకుఁ గమ్మగాలి।
విధు తనయుఁడు మనోజుఁడు మధుఁడు జాతి।
వైరిదోషాకరుండుడు వల్లభుండు।
గలికివీరికి సుగుణంబు గలుగు టెట్లు॥ కవిజనరంజనము.

ఆ॥ ఎందువేటరారె యితరులే మనసుతో।
దారసంగసుఖముఁ దప్పద్రోచి।
తకట పాండురాజయకమెన్న వైతతి।
క్రూరదశరథేశకులమురోయ॥ రాఘవపాండవీయము.

ఇందే యప్రసిద్ధపదములును, క్లిష్టాన్వయములును లేక శ్లేషతోఁ గూడియు సులభముగ నెల్లర కర్థమగుచునేయున్నవి. అప్రసిద్ధపదములున్న నసమర్థతదోషమనియుఁ గ్లిష్టాన్వయములున్నఁ గ్లిష్టమనియు, మఱియు నపార్థము, అప్రతీతమును మున్నగాఁగల కావ్యదోషంబుల శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. ఇట్టిదోషంబులఁ జక్కగాఁ బరిగణించివ్రాసిన వ్రాతలందఱకు నర్థమగును. గ్రాంథికభాషకును గ్రామ్యమునకునుఁగల భేదములఁగాంచి మున్ను గ్రాంథిక గ్రామ్యభాషలు లేవనియు నదియ యిది యిదియ యది యనిపొరపడి మునుపటిభాష యిప్పుడు మారినదని చెప్పవలయునుగాని యది యథార్థముకాదు.

ప్రకృతిశాస్త్రాదులు సామాన్యజనులకనఁగా బ్రాహ్మణేతరులకుఁ దెలియుమార్గములు తెలుఁగునలేవనియు సంస్కర్తలుచింతింతురు. ఆచింతనే నేను [illegible] కొనుచున్నాఁడ. అయిన నీకష్టమునుదీర్చుటకు

మార్గమెద్ది? అన్యోన్యగ్రామ్యమా? గ్రామ్యమెక్కడనిక్కడఁగాంచరే!
"వచ్చాడు" అనియొకఁడు, "వచ్చిండు" అనిమఱియొకఁడు "భోయినం
చేశాను." అనియొకఁడు, "బువ్వదాగాను" అనిమఱియొకఁడు.. "పండు
కొన్నాను" అనియొకఁడుఁ "పండాడు." అనియొకఁడు. "తొంగు
న్నాను" అనిమఱియొకఁడు, పలుపోకలఁబల్కుచుండ నిట్టిగ్రామ్యమా
మనకు సాయముచేయునది? కాదు. కాదు. ఆంగ్లేయులకును గ్రాంధిక
భాష వేరు. వ్యావహారిక భాష వేఱు. ఇట్లయ్యు వారు జ్ఞానప్రదానము
కొఱకు నపభ్రంశమగు వ్యావహారికభాషలో గ్రంథములు వ్రాయుట
లేదు. సులభమై నిర్దుష్టమై యింపైనశైలిలోనే గ్రంథముల వ్రాయు
దురు. అటులనే మనమును భాషాశుద్ధిని విడనాడక సులభశైలిని
వ్రాయవలయుఁ గాని మరియొకటికాదు. ఇందు కుదాహరణములు
మ. రా. రా. రావుబహద్దరు .కం. వీరేశలింగముపంతులగారు వ్రా
సిన "శారీరశాస్త్రము"ను, మ.రా.రా..శ్రీ. సీతారామయ్యశెట్టి, బి.ఏ.
గారువ్రాసిన "రసాయనశాస్త్రము" మున్నగునవి గ్రామ్యభాషలో వ్రా
యఁబడియుండలేదు. అయిన శుద్ధమై సులభమై కట్టుబాట్లకులోనైన
శైలియే వ్రాయఁబడియున్నది. ఇవియెల్లరకు నర్థమగుచున్నవి. పంచ
మాదిపామరులకును బ్ర ప్రథమమున బహుసులభశైలిని వ్రాయఁబడిన
గ్రంథములునేర్పి యనంతరము వేఱుపుస్తకములు చదివించిన వారికిఁ
దెలియకపోదు. ఇందుకుదాహరణము మనమిషనరీల పరోపకారపారీ
ణతవలన నౌన్నత్యముగాంచిన ఇండియన్ క్రిస్టియనులే. వీరుమాటలాడు
తెనుఁగు మిగులశుద్ధముగనున్నది. దీనికిగారణమేమి. మొదటినుండియు
శుద్ధభాషయందుఁ బరిశ్రమచేయుటయే. ఇంగ్లీషుభాష .గ్రొత్తగనేర్చు
కొనువారు మొదటిపాఠపుస్తకమును మొదలుపెట్టి తుదకు మిల్టన్,
షేక్స్పియరు, టెన్నిసన్ కవుపరు మొదలగువానిఁ జదివి మనము
దిట్టలమగుట తెలియనివిషయముకాదు.

అన్యోన్యసర్వజనులకుఁ దెలియుటలేదు వ్యాకరణమేల, యదియేల,
యని యాంగ్లేయులు భాషాభ్రంశకారులుగారైరిగదా. వారలు మన
కుమార్గదర్శకులు కాఁదగదా? అర్థము సులభముగాఁగాదని భాషను
బాడుచేయవలతురా? వెనుకటిభాషమంచిదని యొప్పుకొనుచు నిట్టికృ
త్యంబునకుఁ దొడ్డపడనగునా? ఇప్పటిదుస్థితిని బోఁగొట్టికొని మఱల
నున్నతస్థితికి రావఁయుఁగాక పదభ్రంశమైనదిగాన నిందే యానంద
మనుభవింతమనువారుకలరా? పోనిందు గ్రామ్యమే వ్రాయుదమన్నఁ
బ్రతివానికిఁ దగునట్లు వ్రాయవలసుపడును. ఆంధ్రదేశ బ్రాహ్మణేతరు
లకుఁ "రైలుటేశనుకాడికిదోవబోద్దా?" "నేనుఫిరంగిపురంపోతుండా"
"అక్కడమాబంధుగులుండారు వాడమ్మశిగ్గొయ్యమావాడే బల్మోన
గాడంటేను. ఇయాలయెత్తె నాపనిపడ్తాడుసూడు. బువ్వదాగిందిమొ
దలు. మాటలేసుకొంటాడు, పచ్చివాగినట్లు వాగుతాడంటె" అనియు
మహమ్మదీయుల కర్థముకావలయునన్న "అరేనీకేంతెల్సునువోయి"
"అరే, నాకే? నాకొట్టంలోవుండారు పదిబఱ్ఱెలు. అరేనీకుబుద్ధిలేదు
వోయి నాకోసంపనిచెయ్యాల." అనియు ద్రావిడుల కర్థముకావల
యునన్న "నేడిచాంతలివాండువచ్చును. లేకు—టే నీవుపూడుస్తావా?"
అనియుఁ దూర్పువారికి వారిరీతినిఁ బడమటివారికి వారిరీతిని వ్రాసినఁ
గాని యర్థముకాదుగదా? వీనిలో దేనినవలంబింపవలయును? ఏల?

అంధ్రదేశమందే దేశదేశంబున భాషాసంబంధమగు భేదములు
గలవు. వానినన్నిటిని మనమంగీకరింపవలసినదేయనియందురు. ఇదికొం
తవఱకునిజము. దేశదేశములుతిరిగి గ్రహింపఁదగినంతవఱకు నట్టిపదంబు
లన్నిగ్రహించి భాషావేత్తలు నిఘంటువులవ్రాసియేయున్నారు. అంతి
యకాని భిన్నపదమెల్ల ప్రయోగయోగ్యము కానేరదు. మఱియు
"డైమండు" "కానుబల్ల" మొదలగుపదములు తెలుఁగులనియు వానిని
నిరాటంకముగఁ బ్రయోగింపవలయునందురు. ఆర్యులారా? డైమండన్న
నెందరుతెలియఁగలరో వజ్రమన్న నెందఱెఱుంగలరో విచారింపుఁడు.
జనసామాన్యమైన పదంబులవిడిచి యెవరెఱుంగని యాంగ్లేయభాషా
భవంబులఁ బ్రయోగించినఫలమేమి? ఇతరభాషలలోనుండి మనభాష
లోలేనియర్థముల వస్తువులఁ జక్కఁగాగ్రహింపవలయు నంతవఱకుఁ
గ్రొత్తమాటలఁదెచ్చికొనవలసినదే. అందును లాటినుభాష ఇంగ్లీషు
కైనట్లు సంస్కృతము తెలుఁగునకునుకాన వీలున్నయెడల సంస్కృత
మునుండి పదములుతీసుకొనవచ్చును. లేక సృష్టింపవచ్చును. సాధ్యము
కానిచో నితరభాషాపదము లంగీకరిగవలయును. కాని యింతకంటె
యెక్కువస్వేచ్ఛవలదు.

గ్రామ్యభాషలోఁ బుస్తకముల నలంకరించినచోఁ గొలఁదికాల
మునకే మనపురాతనములగు సద్గ్రంథములన్నియు నామరూపంబులుం
డకుండఁబోవలసినదేగదా? నాగరికులని పేరువడసి పలువిషయంబుల
వన్నెకెక్కి యెక్కువభాషాభిమానులనిపించుకొని మిగులఁ బుస్తక ప్ర
పంచముగలవారలయి నేటికి మనమాగౌరవమెల్లఁ బోనాడికొని
దిక్కుమాలినవారలు కావలయుట యెంతయు శోచనీయము.

ఆంగ్లేయులకు ప్రాచీనాంగ్లభాషఅనియు, ఆధునికాంగ్లభాష
యనియుఁ గర్ణాటకులకు హళగన్నడ హొసగన్నడయనియు గలవు.
కానఁ దెలుఁగునుమారవలయుననిచెప్పనురు. ప్రాచీనాంగ్లభాష ఆధుని
కాంగ్లభాషకును భేదము మిక్కుటము. హళగన్నడమునకును హొస
గన్నడమునకునట్లే ప్రాచీనాంగ్లభాషయు హళగన్నడమును గాలక్ర
మేణ మిక్కిలిభేదించి తుదకు భాషాంతరములను నంతమార్పులఁజెంది
పిమ్మట నూత్ననియమ బద్ధములయి హొసగన్నడమునయినవి. వీనింబో
ల్చిచూడఁ దెనుగుభాషమాత్ర మిప్పటికి నంతగామారలేదు. ఒకవేళమ
నయాంధ్రభాషాస్థితియు నట్టిదేయన్నను, నూతనాంధ్ర మేర్పఱుపవల
యునన్న దానికి నియమములు కావలయును. కట్టుబాటులు లేనిచోనె
ద్దియేని వదుపులేని వనితభంగి, పిచ్చెత్తినకుక్కమాదిరి, కట్టతెగినచెఱుఁ
వుతెరగున, చెడిపోవునేగాని బాగుపడదు. నియమాపాయంబులేకుండ
నేగ్రామ్యము నుపయోగింతుమందురో మఱలనియమవిశిష్టమైన నదియు
నొకపిల్లబాసయయ్యె. దానికొకనామమిడవచ్చును. దానివలనమాకు
బాధలేదు. దీనివలన సంస్కర్తలకగు ఫలమెద్ది? అన్యోన్యకష్టమనియాం
ధ్రబాషయొక్క సంకెలల్దిగనాడుకొని మఱల గ్రామ్యభాషయొక్క
సంకెలల్దగిలించుకొనుటయేగదా! కావున భాషాకర్తలను గౌరవమొకటి
సంస్కర్తలకబ్బవచ్చును.

మఱియు నీభాషను గొలఁదికాలములోనే మఱియొక వ్యావహారికభాష యేర్పడునేమోయని చింత. మఱిదానివలన సంస్కృతములుపాటుపడి యేర్పరచు భాషయుఁ బోవునేమోయను చింతయు నొకటి.

సంధులు:—ఇవి యవసరములేదందురు. ఇది పొరపాటు. తెనుగుభాష మిగుల మనోహరమై ఇటాలియన్ ఆఫ్ ది ఈస్టు అను బిరుదును బొందుటకు సంధులు ముఖ్యకారణములలోనొకటి. సంధులెవరును బ్రొద్దుపోక పెట్టినవికావు. సంధియనునది మన ప్రయత్నముచేఁ గల్గినది కాదు. స్వభావసిద్ధముగ నయ్యది కల్గుచున్నది. సంధివిషయమై వెంజరుదొరవారు తమ బెంగాలి వ్యాకరణమందు ఇట్లు వ్రాయుచున్నారు:—

In all Languages when two words are joined together, changes are often made for the sake of euphony. Thus in Latin, ad - loquor becomes alloquor; in-mensus becomes immensus. Even when no change is made in the letters themselves, the pronunciation becomes changed. Thus in Englesh cup-board is pronounced cubboard ...... In Bengali also many of these rules exist. The learner will observe that all these changes are really based on the principles of euphony.

(Edited by G. H. Rouse, M. A, 5th Edition)

భాషాప్రవేశములేని పామరులు సయితము. మాటలాడునప్పుడి య్యది కనఁబడును. కాన నియ్యది కృత్రిమముకాదు. సంధి ప్రకృతి ననుసరించియున్నది. పామరులు సయితము "వాఁడేడయ్యోయి" "నీవెందయ్యా" "కూరగాయలు" "కూరకుండబెట్టి" "ఏడబోతివి" "నడవనిచ్చింది" "అడగదొక్క" "ఊరకున్నా" "బిగబట్టు" అని యందురు. ఇచ్చోటఁ గనఁబడు సంధికార్యముల విడనాడి యెవఁడును మాటలాడఁడు. ఇందుకు విరుద్ధముగ వ్రాసిన మాటలాడిన శ్రుతికిఁ గటువుగనుండును. మఱియు సంధివిడనాడినచో బదిపంక్తులలో నిముడుదానికిఁ బదునైదు పంక్తులుగావలయు.

యతిప్రాసములు వలదందురు. ఇవియుఁ బ్రకృతి ననుసరించియే యున్నవి. శాస్త్రము తెలియని పిల్లలు, స్త్రీలుసయితము యతిప్రాసములేనిది మాటలాడరు. ఇందు కుదాహరణముగఁ బిల్లలు కల్పించి జోలపాట పాడుటలో "చింతచెట్టుకింద చిన్నకోవిల" "చింతచెట్టుకింద చిటిబొమ్మరిల్లు" "చిలక చిన్నమెత్తు కనక వర్షము" "జోలపాడరంగ జోగొట్టుకృష్ణ" "మఱ్ఱికింది అబ్బాయికి మాటల్లవెఱ్ఱి" అని యుండును. ఇవి యేశాస్త్రము చదివినందువలనఁ బిల్లలకుఁగల్గె? మఱి యనేకసామెతలందు సయితమిట్లే కలవు. ఇందుకుదాహరణముగ "కోతికి కొబ్బరికాయ దొరకినట్లు" "అంగడిలో అన్ని ఉన్నవి అల్లుడినోట్లో శని" అను వానిఁజూడుడు. ఇది స్వభావసిద్ధము. ఇటాలియన్ ఆఫ్ ది ఈస్టుఅను బిరుదున కిదియొక కారణము. కాన దీని విడువఁదగదు.

అరసున్నలు:—ఇవి సిద్ధములని సాధ్యములని రెండువిధములు. పదముపుట్టుకతో నుండునదిసిద్ధము. వ్యాకరణకార్యమువలనఁ గల్గునది సాధ్యము. పుట్టుకతో నుండుదానిఁ దీసివేయఁదగవా? Mortgage, calm, sign, అనుచోట్ల t l g ల ప్రయోజనమేమి? వానిదీసివేయవలనుపడునా? దానికి వార్లింతురా? లేదు. ఇఁక సాధ్యబిందు పదముల పుట్టుకను పదరూపమును దెల్పును. లేకున్నచోఁ బదరూపము తెలియక యొకపదమునకు మఱియొక పదమునకు భేదము తెలియక గంద్రగోళములోఁబడవలసినదే. చేఁబట్టి, బట్టి; పోఁగొట్టు, గొట్టు, కడుఁదండంబులై, దండంబులై యనుచోట్ల బట్టు గొట్టు దండంబులు ఒక్కపదమో, వేరుపదములో తెలియ నరసున్న యవసరముగదా? అదిలేనిచో భేదమెట్లు తెలియవలయు? జుట్టు, బొట్టు లేకున్నను యజ్ఞోపవీతమున్నచో నాతఁడు ద్విజుఁడని తెలియునుగదా. కావున నిదియు నవసరమే.

రేఫ శకటరేఫములు:—ఉచ్చారణ యొకటే యయినను వీనిభేదము తీసివేయ వీలులేదు. వీనివలన శబ్దముయొక్క పుట్టు తెలియును. దీనికిఁ బ్రమాణము

"సీ॥ ఊఁదిపలుకుచోట నొగిఁదేల్చి పలికిన,
రేఫగాదు శకటరేఫగాని।
తద్భవపదములను దవిలినయా రేఫ।
రేఫగాని శకటరేఫగాదు॥" "కవిసంశయవిచ్ఛేదము"

కాన దీని నుజ్జగింప వలనుపడదు. Gem లోని G కి June లోని J కు నొకటే యుచ్చారణగనుక నొకదాని నుంచిన జాలునన్న నెంత యుక్తియుక్తముగ నుండునో శకటరేఫ మనవసరమన్న నంతబాగుండును. బి.ఏ. ప్యాసయినవారును సరియగు తెలుఁగు వ్రాయలేరనియుఁ గాన గ్రాంథికభాష వలదని చెప్పుచున్నారు. కొందఱు బిద్యో లింగ్లీషున సయితము రెండుపదములఁగూర్చి వ్రాయలేనివారు మాటలాడ నేరనివారునుగలరు. ఇది భాషాలోపమా, బుద్ధిలోలోపమా? భాషాలోపముకాదు. ఎట్టి కఠినాంశమునైన గ్రహింపఁగల బుద్ధికుశలులులేరా? ఈకారణమును బట్టి భాషను బాడుచేయవలయునా? పడిశము పట్టునని ముక్కుకోసికొందురా? చక్కని యుపాధ్యాయుల నేర్పరిచి యెక్కువ జీతములిచ్చి, తగు నధికారమిచ్చి, వలయు గౌరవముచూపి బాలుర కాయుపాధ్యాయులయందు మర్యాదవాపునటులఁ జేసినచో బిద్యోలందరి భాషయందును బండితులే యగుదురు.

ప్రస్తుతపు సంగతులు చూచినచో నుపాధ్యాయులకు జీతములు తక్కువ, యధికారమాసున్న, పైయధికారుల మన్ననయాలేదు. ఇట్లుండ బాలురకెట్లు వారలయందు భయభక్తులుండును? భయభక్తులు లేనిచోఁ జదువెట్లబ్బును? కాన నీలోపముల సవరింపవలయును. మఱియు గ్రీకుపురాణకథలవంటి పుస్తకములఁ జదివింపరాదు.

# పరిశ్రామిక రక్షణము - స్వేచ్ఛావర్తకము.

[కందుల వీరరాఘవస్వామి గారు బారిష్టరు ఎట్ లా.]

ఇంగ్లండు దేశమున రాజకీయ వ్యవహారములలో బనిసేయువారు పూర్వకాలమున కన్సర్వేటీవ్సు అనియు లిబరల్సు అనియుఁ బిలువఁబడునట్లు ప్రస్తుతకాలమున టారిఫ్ రిఫార్మర్సు అనియు ఫ్రీ ట్రేడర్సు అనియుఁ బిలువఁబడుచున్నారు. సాధారణముగాఁ బూర్వకాలపు కన్సర్వేటీవ్సు ప్రస్తుతకాలమున టారిఫ్‌రిఫార్మర్సుగాను పూర్వకాలపు లిబరల్సు ఫ్రీ ట్రేడర్సుగాను నున్నారు.

టారిఫ్ రిఫార్మర్సుకును ఫ్రీ ట్రేడర్సుకును గల యభిప్రాయ భేదములను విచారింపవలసి యున్నది. తాము స్వదేశవస్తువులనేకాని విదేశవస్తువులను వాడుకొనఁ గూడదనియు, విదేశవస్తువులు తమ దేశమునకు రాకుండ భారమైన పన్నులు వేయుటవలన వానిని బహిష్కరింప వలయుననియు, అట్టి యేర్పాటువలనఁ దమ దేశములోని చేపనులయొక్క స్థితి ప్రస్తుతపు స్థితికన్న మిగుల యభివృద్ధిలో నుండుననియు, తమ దేశములోని పనివాండ్రకు నెడతెగని పని కలుగుటయే కాక వారి వేతనములును హెచ్చుగుననియు, తమ దేశమునందలి ద్రవ్యము విదేశవస్తు పరిగ్రహణ మూలమున నితర దేశములకుఁ బోక తమ దేశమునందే నిలిచి యుండుననియు, స్వదేశమునందలి పనివాండ్రు అన్నపానాదులు లేక కృశింపవలసిన యవసరముండదనియు, బ్రిటిషుప్రజలను జీవనోపాధికై ఆఫ్రికా, ఆస్ట్రేలియా, న్యూజీలండు మున్నగు దేశములకుఁ బంపవలసిన యగత్యముండదనియు, విదేశవస్తువుల రాకచే జీర్ణమైయున్న స్వదేశమునందలి చేపనులు యభివృద్ధిలోనికి వచ్చుటకు కారణము కలుగుననియు, కడుహీన స్థితిని మున్న వ్యవసాయము నానాటికి యభివృద్ధిఁ జెందుననియు, టారిఫ్ రిఫార్మర్సు అభిప్రాయపడుచున్నారు. ఇంతేకాక విదేశములనుండి వచ్చు వస్తువులపై పన్నులు వేయుటలో ఆస్ట్రేలియా, న్యూజీలండు డొమినియన్ ఆఫ్ కనడా మున్నగు కొలనీలనుండి బ్రిటిషు దేశమునకు వచ్చు సరకులపై తక్కువ పన్నులను వేసి అట్టి కొలనీలకు నింగ్లండు దేశమునుండి పోవు వస్తువులపై తప్ప జర్మనీ ఫ్రాన్సు మున్నగు విదేశములనుండి పంపబడు సరకులపై భారమైన పన్నులను వేయుటవలన నట్టి వస్తువులను బహిష్కరించు నటుల వారితో నొడంబడికలనుఁ జేసికొనిన యెడల బ్రిటిషు సరకు లిప్పటికన్న నత్యధికముగా గొలనీలకుఁ బంపుటకుఁ గారణము కలుగును. ప్రపంచమునందలి పెక్కు గొప్ప దేశములలో విదేశములనుండి తమ దేశములకు వచ్చు వస్తువులపైఁ బన్నులు వేయుపద్ధతి వాడుకలో నున్నది. ఇందు జర్మనీ, రష్యా, ఫ్రాన్సు, ఆస్ట్రియా, యునైటెడ్ స్టేట్సు, డొమినియన్ ఆఫ్ కనడా, ఆస్ట్రేలియా ముఖ్యములు. ఈ దేశములు ఇంగ్లండు దేశము చేపనుల యందత్యున్నత్య దశయందున్న కాలమునఁ దాము మిక్కిలి హీనదశయందుండియుఁ బ్రస్తుతకాలమున విదేశవస్తువిసర్జనచే నభివృద్ధిఁ జెంది మిగుల ధనవంతములుగా నున్నవి. కావునఁ దామును నావిధముననే విదేశవస్తువులపై భారమైన పన్నులనుఁగట్టి వాటిని సాధ్యమైనంత వరకుఁ దమ దేశమునకు రాకుండఁజేసి యందువలన ప్రస్తుత కాలమునకన్న నధికధనమును సేకరించవలయునని టారిఫ్ రిఫార్మర్సు చెప్పుచున్నారు.

ఇక ఫ్రీ ట్రేడర్సు యొక్క వాదములనుఁ గొంతవరకు విచారింతము.

చేపనులు మిక్కిలి హీనస్థితియందుండి చేపనులకుఁ గావలసిన సమస్త ద్రవ్యములును స్వదేశమునందే యుత్పన్నమగు దేశములు, విదేశవస్తువులపై భారమైన

పన్నులు వేయుట లాభకరమేయైనను చేపను లొన్ని త్యదశయం దున్నట్టియుఁ జేపనులకుఁ గావలసిన ప్రత్తిమున్నగు సమస్తపదార్థములును విదేశములనుంఢీ యపేక్షింపవలసినట్టియు ఇంగ్లండుదేశమునకు విదేశవస్తువులపై భారమైన పన్నులనువేసి వాటిని బహిష్కరించుటచే నష్టమేకాని లాభమిసుమింతయునుండదు. ఇంగ్లండు దేశమునకు, జీవనాధారమైనట్టి గోధుమలు మున్నగు ధాన్యాదులునుమాంసాదులును విదేశములనుండియే రావలసియున్నవి. అట్టి విషయమున ధాన్యములమీదనుమాంసాదుల మీదను పన్నులువేసిన యెడలఁ జేపనులచే జీవించు ప్రజలకుమిగుల కష్టముగా నుండును.

జర్మనీ మున్నగుదేశములు విదేశవస్తువులపై భారమైన పన్నులనువేసి వాటిని తమదేశమునకు రాకుండజేసి తయారుచేయుచున్న సరకులకన్న, విదేశవస్తువులనుఁ దనదేశమునకుధారాళముగా రానిచ్చుచున్న ఇంగ్లండుదేశము పెక్కుమడుంగుల యధికమైనసరకులను దయారుచేయుచున్నది. విదేశవస్తువులపై పన్నులు లేకపోవుటచేతనే సమస్తదేశపువస్తువులును ఇంగ్లండు దేశమునకు ధారాళముగావచ్చి అక్కడిన ర్తకులచేఁదదితర దేశములకుఁ బంపఁబడుటయుఁ దటస్థించుచున్నది. అందువలన బ్రిటిషువర్తకులుమాత్రమేకాక బ్రిటీషుయోడలుకూడ నత్యధికమైన లాభమునుఁ బొందుచున్నవి.

విదేశవస్తువులను స్వదేశమునకు రానీయకుండ నాపుటచే స్వదేశపుపనివాండ్రకుఁ గొంత లాభముకలిగినను విదేశపనివాండ్రు సులువుగాఁజేయఁగలిగిన వస్తువులను స్వదేశపనివాండ్రకు హెచ్చుద్రవ్యమిచ్చి చేయించుటచే సామాన్యప్రజలకు నష్టమే కాని లాభమేమియును లేదు. విదేశములనుండి ఇంగ్లండు దేశమునకు వచ్చు సరకులను వాటిపైన భారమైన పన్నులను వేయుటచే నాపి వేసినయెడల విదేశీయులును బ్రిటీషువస్తువులను పూర్వముకన్న నత్యధికకప్పములచేఁదమ దేశమును బొత్తుగాఁ జొరకుండఁజేసి ఇంగ్లండుదేశమునకు మిగుల నష్టమునుఁ గలుగజేయుదురు. విదేశవస్తువులపై సుంకములు పుచ్చుకొనక పోవుటచేతనే బ్రిటిషుదేశస్థులు తయారు చేయు సమస్తవస్తువులకుఁ గావలసిన పదార్థములన్నియుఁ దక్కువధరలకు నింగ్లండుదేశమునఁ జిక్కుటకును అందువలన నింగ్లండుదేశపు బనివాండ్రు సమస్తవిధములైన సరకులను చౌకధరలకుఁ దయారు జేయుటకును వీలుగా నున్నదనియు శ్రీ ట్రేడర్సు నుడువుచున్నారు.

టారిఫ్ రిఫారమ్ మొదటఁ బ్రజలకు బోధించినది జోసెఫ్ చాంబరులేను. ఈతడు పెక్కువత్సరములు బ్రిటిషు ప్రజాప్రతినిధిసంఘమున సభ్యుడుగా నుండుటమాత్రముకాక కొన్నివత్సరములు ప్రధానమంత్రులలో నొకడుగా సహితముండెను. ప్రజాప్రతినిధి సంఘములో టారిఫ్ రిఫార్మర్సులోఁ బ్రముఖులలో నొకడైన ఆస్టిస్ చేంబరులేను ఈతని పుత్రుడే. ప్రజాప్రతినిధి సంఘములోని ప్రస్తుతము రాజ్యముచేయుచున్న సంఘమువారికి వ్యతిరేకముగానుండే సంఘములోని బాల్ఫోరు, బోనార్లా మున్నగువారందరు టారిఫ్‌రిఫార్మర్సు గానే యున్నారు. ఆస్క్విత్తు చర్చిహిలు లాయిడ్డుజార్జి మున్నగు ప్రధానమంత్రి వర్గములోనివారును వారి యనుచరులను శ్రీ ట్రేడర్సుగా నున్నారు.

ప్రపంచమునందు విదేశవస్తువులపై సుంకములు తీసివేసిన దేశములలో మొదటిది ఇంగ్లండుదేశమే. కాని యీదేశమును తన చేపనులు బాల్యావస్థలో నున్నంతకాలమును విదేశవస్తువులపై నత్యధికమైన పన్నులను వేయుచునే యుండెను. స్వదేశ చేపనులభివృద్ధిఁ జెందినతోడనే విదేశవస్తువులు తనదేశమునకు వచ్చుట నానాటికి సన్నగిల్లెను. అందువలన నాకాలపు రాజ్యాంగతంత్రవేత్తలకు విదేశవస్తువులపైఁ గప్పములు కట్టుట నిష్ప్రయోజనమని తోఁచెను. అయినను ప్రస్తుతకాలమున నితర దేశములును సమస్తవిధములైన సరకులనుఁ దయారు చేయు చుండుటచే నిప్పటి రాజ్యాంగ తంత్రవేత్తలలో నొక తెగవారికి మరల విదేశవస్తు విసర్జన మవసరమని తోఁచుచున్నది.

ప్రస్తుతమున ప్రజాప్రతినిధిసంఘములో ఫ్రీ ట్రేడర్సుసంఖ్య హెచ్చుగా నుండుటచే నింగ్లండుదేశమున విదేశవస్తువులపై భారమైన పన్నులను వేయుట యింకను

సాధ్యముకాక యున్నయది. టారిఫ్ రిఫార్మర్సుయొక్క సంఖ్య ప్రజాప్రతినిధిసంఘము నందు హెచ్చి టారిఫ్ రిఫార్మర్సు రాజ్యపాలనమును చేబూనిన తోడనే విదేశములనుండి ఇంగ్లండుదేశమునకు వచ్చు వస్తువులపై నధిక కప్పములను కట్టి యట్టిసరకులనుఁ దమదేశమునకు రాకుండ జేయుటకుఁగావలసిన చట్టములనుఁదీర్మానింతురు.

పైవాదములనుబట్టి మనము నేర్చుకొనవలసిన నీతులు పెక్కులు గలవు. పై యిరు తెగలవారికిని గల ముఖ్యభేద మెద్దియన నొక తెగవా రొకదేశముయొక్క చేపను లెట్టి యౌన్నత్య దశయందున్నను విదేశవస్తువులా దేశమునకు రాకుండ జేయుటయే కర్తవ్యమని నుడువుచున్నారు రెండవతెగవారో ఒకదేశమునందలి చేపనులు హీనదశలోనుండి, యాదేశము తనకు చేపనుల నిమిత్తమును జీవనాధారము నిమిత్తమును కావలసిన సమస్తపదార్థములును తనదేశమునం దుత్పన్నమగుచున్నపుడు మాత్రము విదేశముల నుండి తనదేశమునకు వచ్చు సరకులమీద భారమైన పన్నులువేసి యట్టిసరకులనుఁ దమదేశమునకుఁ రాకుండఁ జేయుట కర్తవ్యమని యభిప్రాయఁ బడుచున్నారు. బ్రిటిషు రాచకీయ వ్యవహార వేత్తలెట్టి మేధావంతులో యెట్టికుశాగ్రబుద్ధులో యెట్టి వ్యవహారనీతి కోవిదులో చదువరులకుఁ దెలియని విషయముకాదు. అట్టివారిలో నుభయశాఖల వారునుఁ గూడ విదేశవస్తువులను స్వదేశమునకు రాకుండజేయుట కర్తవ్యమనియే చెప్పుచున్నారు. శ్రీ ట్రేడర్సు సహితము స్వదేశమునందలి చేపనులు హీనదశయందున్నపుడు విదేశవస్తువులమీద భారమైన పన్నులువేసి వాటి నాపివేయుట కర్తవ్యమని చెప్పుచున్నారు.

మనదేశమునందలి చేపను లెట్టి స్థితియందున్నదియు నెల్లరకుఁ దెలిసిన విషయమే. పూర్వకాలమునందత్యున్నత దశయందున్న మనదేశపు చేపనులు హీనదశకు వచ్చుటకు ముఖ్యకారణము మనదేశమునందు తయారుచేయబడు చుండెడి వస్తువు లితరదేశములకుఁబోకుండ నాయాదేశములవారు వాటిమీద భారమైన పన్నులు వేయుటయు, మనదేశస్థులు విదేశవస్తువులను మనదేశమునకు రాకుండ భారమైన పన్నులువేయ నసమర్థులై యుండుటయు నైయున్నది.

స్వదేశచేపనులను ప్రస్తుతపు హీనదశయందుండి యున్నతస్థితికిఁ దేదలంచిన యెడల మనదేశమునకు వచ్చు విదేశవస్తువులపై భారమైన పన్నులువేయుట తప్ప వేరు శరణ్యములేదు. కాని అట్టి కార్యము దొరతనము వారి యనుమతిలేనిది పొసగునదికాదు. ఐనఁ ప్రభుత్వమువారట్టి కార్యమునకేలఁ గడంగగూడదని కొందఱికి సందేహము కలుగ వచ్చును. మింటోప్రభువు చెప్పినట్టుగ ఇండియా గవర్నమెంటువారికిఁ బూర్ణమైన స్వతంత్రతయే యున్నయెడల నిదివరకే విదేశవస్తువులను మనదేశమునకు రాకుండ భారమైన పన్నులను వేసియుందురు కాని వారికట్టి స్వతంత్రశక్తి యెంతమాత్రమును లేదు. ఇట్టి ఘనకార్యములన్నియు నింగ్లండులోని ఇండియారాష్ట్రప్రతినిధి యనుమతిలేక చేయ వీలులేదు. ఇండియారాష్ట్రప్రతినిధులు రాజ్యభారము వహించిన సంఘమువారిలోనుండి యేర్పరుపఁ బడుదురు. వీరు వస్త్రములను మిక్కుటముగఁ దయారుచేయు లంకాషయరు ప్రజలయనుమతికి వ్యతిరేకముగాఁ ప్రవర్తించిన శీఘ్రకాలములోనే పదభ్రష్టులగుదురు కావున మింటోప్రభువవలెఁ బ్రజాక్షేమముఁగోరు రాజప్రతినిధు లప్పుడప్పుడు వచ్చుట తటస్థించినను హిందూదేశమునకువచ్చు విదేశవస్తువులపై భారమైన పన్నులను వేయలేకున్నారు.

ప్రజలే విదేశవస్తువులను బహిష్కరించుటవలన నిట్టి ఘనకార్యము నేల నిర్వహింపరాదని కొందఱికి సందియము పొడమవచ్చును. అట్లు చేయుట యోచనకు సులభముగానే తోచవచ్చును గాని యాచరణమునకు మాత్రమిమిగులకష్టసాధ్యముగానుండును. విదేశీయులు మితిలేని ద్రవ్యసహాయముచేఁ బెద్దపెద్ద యంత్రశాలల నిర్మించుట చేతను విద్యావంతులును నేర్పరులునగు పనివాండ్రు సులభముకా చిక్కుటచేతను మిగులసులువుగా సరకులను తయారుచేసి తక్కువధరలకు విక్రయింపగలుగుచున్నారు. మఱి స్వదేశీయులలో, చాలినంతధనము లేకుండుటచే కొద్దిపాటి యంత్రశాలలను మాత్రము ని

ర్శించి అందు విద్యావిహీనులైనట్టి పని సులువు నెఱుఁగనట్టి పనివాండ్రచే సరకులను తయారుచేయింపవలసి యున్నది. గొప్పగొప్ప యంత్రశాలలనుఁ గట్టుటకు దేశమునందు ద్రవ్యములేమిచే స్వదేశీయులు విదేశీయులవలె సులువుగా సరకులను తయారుచేసి తక్కువధరలకు విక్రయించుట సాధ్యముకాదు. అందువలన ననివార్యముగా స్వదేశపు సరకులు విదేశపు వస్తువులకన్న ఖరముగా నుండును. విదేశవస్తువులు చౌకధరలకు దొరకుచున్నప్పుడు స్వదేశవస్తువులను హెచ్చుధరలకు కొనుటకు సామాన్యప్రజలు సమ్మతించరుగదా! విద్యావంతులకు సయితము హెచ్చుధరలిచ్చి స్వదేశవస్తువులను కొనుటవలన నేమిప్రయోజన మున్నదో తెలియకున్నయది. ఇక విద్యావిహీనులమాటఁ జెప్పనేల?

ఇంగ్లండుదేశపు ప్రజలు ఇండియాదేశపు ప్రజలకన్నను విద్యయందును, ధనమునందును యధికులేయైనను బ్రిటిషు ప్రజలలో సయితము స్వదేశవస్తువులయందలి యభిమానముచే విదేశవస్తువిసర్జనము పొసగకున్నయది. విదేశములనుండి చౌకధరలకు వచ్చువస్తువులు ఇంగ్లండుదేశమునందే తయారుచేసికొని హెచ్చుధరలకైనను వాటినేకొని యుపయోగించుకొనవలయునని కొందఱి యాశయము. ప్రజలలో స్వదేశాభిమానము పురికొల్పవలయుననెడి యుద్దేశముతో నుపన్యాసములమూలమునను కరపత్రముల మూలమునను ట్రాముకార్లు మున్నగువాటిమీద "స్వదేశ చేపనులను ప్రోత్సాహముచేయుడు" అని ప్రచురించుటవలనను సర్వవిధముల పనులను టారిఫ్ రిఫారమ్ సంఘమువారు చేయుచునే యుందురు. ధూమశకటములలో నుండు భోజనపుబండ్లలోఁ బదార్థములను దెలియఁజేయు పట్టికమీద నాదేశస్థులు విశేషముగా మాంసాదులనే భుజింతురు గావున "స్వదేశమునందే పెంపఁబడి స్వదేశమునందే చంపఁబడినవి" అని వ్రాయఁబడి యుండును. ఇట్టి విధముల బ్రిటిషుప్రజలు ప్రయత్నములు చేయుచున్నను విదేశవస్తువులను తమదేశమునుండి పూర్తిగాఁ దరిమివేయలేక విదేశవస్తువులపై హెచ్చుపన్నులనువేసి వాటిని తమదేశమునకు రాకుండజేయ గోరుచున్నారు. కావున విదేశవస్తుబహిష్కారముచేఁ బ్రస్తుత కాలపు స్థితిగతుల ననుసరించి స్వదేశవస్తు వ్యాపకమునకుఁ బూర్తిగాఁ దోడుపడుట కష్టసాధ్యమని తోఁచుచున్నది.

ప్రజలలో విద్యావ్యాప్తి తక్కువగా నున్నది. విద్యావంతులలోఁ గూడ విదేశవస్తువులకును స్వదేశవస్తువులకునుఁ గలభేదమును వాటివాటిని యుపయోగించుటవలన గలిగెడు సాధకబాధకములనుఁ దెలిసినవారు మిగుల అరుదుగాఁ గనిపించుచున్నారు. మేధావంతులై దేశాభిమానులై స్వదేశవస్తు వ్యాపకమునకుఁ బనిసేయ బ్రయత్నించినవారు సాధారణముగా రాజ్యాంగవిషయములలోగూడ బనిసేయుచున్నవా రగుటచేత వారిని దొరతనమువా రనుమానించి వారియుద్దేశములకుఁ దోడుపడకున్నారు. మఱి యాంగ్లో యిండియన్ పత్రికాధిపతులో ఇంగ్లండుమున్నగు సమస్తదేశములకును విదేశవస్తువులపై భారమైన పన్నులువేయుపద్ధతి నవలంబించుట లాభకరమేయైనను, హిందూదేశమునకు మాత్రము నష్టదాయకమని వేనోళ్ళ ఘోషించుచున్నారు. వీరి నుడువు లెంతవఱకు విశ్వసనీయములో చదువరులేయూహింతురు గాక!

బ్రిటిషుప్రజల వాదప్రతివాదములనుబట్టి మనము ముఖ్యముగా గమనింపవలసిన విషయ మెద్దియన స్వదేశపు చేపనులు మిగుల హీనదశయందున్నట్టియు జీవనాధారమునకుఁ గావలసిన సమస్త పదార్థములును సులువుగా పండించుకొనఁ గలిగినట్టియు మనదేశమునకు విదేశములనుండి వచ్చు సరకులపై భారమైన పన్నులనువేసి మనదేశమునకు వానిని రాకుండజేసి స్వదేశపు వస్తువుల నభివృద్ధిలోనికిఁ దీసికొని రావలయు ననుట న్యాయమై యున్నది.

---

# ఆంధ్రభాషయందలి నవలలు.

[జి. వి. రాఘవరావుగారు.]

నవరసభరితములును దివ్యకవిత్వ విలసితములును నగు పద్యకావ్యముల సారస్యము గద్యకావ్యములయందు బ్రదర్శింపరాదని సంస్కృతవిద్వాంసులు దలంచియుండుట చేతనో, మరియే హేతువుచేతనో గాని సంస్కృత వాఙ్మయంబున గద్యకావ్యములు వ్రేళ్ళపై లెక్కింపదగినంత స్వల్పముగా నున్నవి. ఆ వాఙ్మయమునందలి మూలములనే గైకొని గొన్నిటిని సంక్షేపపఱచియు, గొన్నిటి నాంధ్రీకరించియు, మరిగొన్నింటి విపులీకరించియు, మనయాంధ్ర గ్రంథకర్తలుగూడ పద్యకావ్యములనే రచియించుచు వచ్చిరిగాని గద్యరచనకు గడంగియుండలేదు. శ్రీమార్గ చిన్నయసూరిగారిచే రచింపబడిన నీతిచంద్రికయె ప్రప్రథమముననాంధ్రమున వెలసినవచనగ్రంథము. వారారంభించిన కార్యమును పూర్తిచేయుటయేగాక రావుబహద్దూరు కందుకూరి వీరేశలింగంపంతులుగారు పండిత పామరజన మనోరంజకమగు సులభశైలిని గద్యగ్రంథము లెన్నియో రచించి యాంధ్రమండలమునకు మహోపకారమొనర్చిరి.

శ్రీ వీరేశలింగముగారి జీవితమును వారొనరించిన మహాత్కార్యములును ప్రతివిషయముచేతను ఆంధ్రుల చరిత్రయందు నూతనయుగ నిర్మాణ కారణములు. ఆంధ్ర సాంఘిక చరిత్రయందును, ఆంధ్రమత చరిత్రయందును, ముఖ్యముగ నాంధ్రవాఙ్మయ చరిత్రయందును వారు నూతన యుగముల నిర్మించినారు. మున్ముందుగ రాజశేఖరచరిత్రయను నవలనువ్రాసి యాంధ్రనవలరచనకు మార్గదర్శకులగుటయేగాక, చింతామణి కార్యస్థానము నేర్పరచి, బహుమానముల నిచ్చెదమని ప్రోత్సాహపఱచిన వలలను వ్రాయించి, యాంధ్రవాఙ్మయముననవలల కెట్టిప్రాముఖ్యతనియ్యవలయునో మనకెల్లరకుఁ జూపియున్నారు.

"అపూర్వము. అద్భుతము" అనియర్థమిచ్చు "నావెల్" అను నాంగ్లేయ పదమునుండి నవలయని తెలుగున తద్భవమేర్పడినది. చదువరుల నద్భుత రసమగ్నులంజేయు మనోజ్ఞకల్పనా విలసితంబులయి, నీతిబోధకములగుచు, చరిత్రాంశకవిషయములను గలుపుచునో, సాంఘికాభ్యుదయమునకు దోడ్పడు మరికొన్నియంశములను విశదీకరించుచునో వ్రాయబడిన మనోహర వచనప్రబంధములు నవలలనుపేర బరగుచున్నవి. చింతామణీ కార్యస్థానమేర్పడుటవలన నంతవరకు గూఢముగనున్న శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి నవలరచనా కౌశలము బహిర్గతము కాగలిగెను. అత్యద్భుత కథాసందర్భములను ఉన్నతనీతిని గలుపుచు కథాసందర్భమునకు వన్నెదెచ్చు పాత్రలును, పాత్రోచితమై నవరసభరితమై, మృదు మధుర పదసంయుతమై వివిధవిశేష వర్ణనాలంకృతమై కడు మనోహరమగుశైలియు నీనవలకారుని ప్రతినవలయందునుఁ జక్కగ ప్రదర్శింపబడినవి. కావున "నాంధ్ర స్కాట్టు" లను బిరుదాంక మీ మహనీయునియందు సార్థకమై వర్ధిల్లుచున్నది.

ఇటీవల భగవంతుని యనుగ్రహమువలన భారతీయుల హృదయసీమలయందు నవశక్తి యంకురించి పెంపొందుటంజేసి దేశీయులందరు నన్నివిధముల నౌన్నత్యము నభిలషించుచున్నారు. వాఙ్మయ మున్నతస్థితికి వచ్చినగాని మనయభీప్సితములు నెరవేరుట సాధ్యము గాదని మనవిద్యాధికు లిప్పుడిప్పుడె గ్రహించినారు. దేశౌన్నత్యమునకు ముఖ్యముగఁ దోడ్పడునది భాషాభ్యుదయమేయని యెరింగి, హిందీ, బంగాళీ, మహారాష్ట్ర సోదరు లవలంభించిన మార్గముల ననుసరించి విద్యాప్రియులగు శ్రీమంతులును విద్యాధికులగు నాంధ్రపండితులును, ఆంధ్రభాషాసేవకు గడంగి, శక్తివంచన చేయక కార్యశూరులై బనిచేయుచుండుట మనకెంతయేని సంతోషకారణమగుచున్నది. ఆంధ్రపత్రిక ప్రముఖాంధ్రపత్రికలాంధ్రసోదర సోదరీమణుల హస్తము నలంకరించి కర్తవ్యోపదేశంబు సేయుచున్నవి.

సంస్కృత వాఙ్మయమునుండి యాంధ్రులు గ్రహింపదగు విషయము లీవఱకే యాంధ్రీకరింపబడి, పురాణేతిహాసకావ్య నాటకాదిరూపంబుల వెలసియున్నందున నిక నావిషయమున కృషి తగ్గింపబడినది. ఆ సంఖ్య నూతనాంశయుతమై విపులమగు నాంగ్లేయ వాఙ్మయమునుండి యుద్గ్రంథములును, ప్రకృతిశాస్త్రములును ఆంధ్రీకరించి ప్రచురించుటకును, స్వయముగ బరిశీలనజేసి తెలియవచ్చిన విషయములవలన నిజమగు దేశచరిత్రము మృదుమధురమగు సులభశైలినివ్రాసి ప్రకటించుటకును, ఆంధ్రమండలమున నచ్చటచ్చట సంఘములు వెలసి భాషాసేవయే పరమావధిగనెంచి, శక్తివంచన చేయక పాటుపడుచున్నవి. ఇందు ముఖ్యముగ బేర్కొనదగినవి చెన్నపురియందలి విజ్ఞానచంద్రికా మండలి యొకటి; బృందావనపురమున నాంధ్రభాషాభివర్ధని సమాజమొకటి. ఈయుద్యమమున కాంధ్రులెల్లవారికి కృతజ్ఞులయి యుండుటయేగాక వారి కెల్లవిధముల దోడ్పడుట ముఖ్య కర్తవ్యమైయున్నది.

విద్యాగంధ మంతగాలేని యాంధ్ర సోదరీ సోదరులకు గొంతవరకు చరిత్రపఠనము రుచింపకపోవచ్చునని తలచి, మనోహరమగు కల్పితకథలలో నిజమగు చరిత్ర నుబోధించు చరిత్రాంశక నవలలనుగూడ వ్రాయించి పై సమాజములు ప్రచురించుచున్నవి. లక్ష్మీనరసింహము గారొకటి రెండు మాత్రము చరిత్రాంశక నవలలను వ్రాసిరి. అట్టివింకను నెన్నియో గావలసియున్నవి గావున నట్టివిగూడ ప్రచురించుట తమ యుద్దేశములలో నొకటిగా ప్రకటించి యీవఱకాంధ్రపాఠకులకు మూడునవలల నొసంగినారు. అందు మొదటిది రాణీసంయుక్త. మానసమున నేపురుషునివరించెనో యతనినెదప్ప యన్యులను గైకొనక, యథార్థప్రేమమహిమ మిట్టిదనిచూపును, తన భర్తపైదండెత్తివచ్చిన మ్లేచ్ఛవీరులతో కాళికరాళమూర్తియైపోరి, శూరశతంబుల యుద్ధావనికిం బలిజేసి, ప్రాణములుగోల్పోయినవిశ్వవిఖ్యాతచరితయగు రాణీసంయుక్త యొక్క యద్భుతచరిత్రమునుజదివి గన్నుల నీరుపెట్టనివారుందురా? విమలయందలి పాత్రలలో రాజసింహుడు భారత సార్వభౌముల క్షమాపరాక్రమాది సమస్తసద్గుణ ఖనియై యొప్పుచున్నాడు. భారతశూరుల స్వామికార్యపరతంత్రతయును, ఎట్టి సంకటకార్యములనైన నవలీలగ నెరవేర్పజాలునంతటి బుద్ధివైభవ, సాహస, బాహువీర్యములును, దుర్గాదాసునియందు మూర్తిగైకొన్నవి. శౌర్య, సాహస, స్వార్థపరిత్యాగ పాతివ్రత్యముల స్వరూప మిందిరయని జెప్పవచ్చును. ప్రభావతి చరిత్రము నం దితరపాత్రలయం దక్కడక్కడ గొన్నిలోపములు బొడగట్టుచున్నను మొత్తముమీద మహారాష్ట్ర యువతుల సాహస విక్రమాదులందుగూడ చక్కగనే ప్రదర్శింపబడినవి. స్వార్థపరిత్యాగులును, దేశసేవా తత్పరులును, మహనీయ గుణగరిష్ఠులును నగు నరనారీమణుల పూతచరిత్రము లెన్నియో శతంబులు నవలలయందు ప్రదర్శింపబడినగాని మనభాషయం దీకొఱంత దీరదు.

దీనిని దీర్చగోరి శ్రీమంతులును, ఆంధ్రభాషాభిమానులునగు శ్రీ కొవ్వూరు చంద్రారెడ్డిగారు నిడదవోలు పురంబున నాంధ్రప్రచారిణి యను నొక గ్రంథమాలను స్థాపించి రెండునెలల కొక్కొకటిచొప్పున చక్కని నవలల నాంధ్రుల కొసంగుచున్నారు. ఇందు వీరు ముఖ్యముగ బంకించంద్ర చట్టోపాధ్యాయులు వంగభాషయందు రచించిన నవలల నాంధ్రీకరించి పాఠకుల కందజేయుచున్నారు. బాల్యమాదిగ బంకించంద్రుడు స్కాట్ ముఖ్య పాశ్చాత్యనవలకారులయుద్గ్రంథముల నతిదీక్షతో బఠించి దేశాభ్యుదయమునకు నవలలే యుత్తమసాధనములని గ్రహించెను. ఆంగ్లేయనవలలు తన మాతృభాషలోనికి భాషాంతరీకరింపబడినంతమాత్రమున ప్రయోజనములేదని యితడు తనదేశకాలపాత్రల కుపయుక్తమగు తెరంగున నూతనకల్పనలతో విరాజిల్లుచు నత్యంత మోదావహంబులై యుత్కృష్టాంశముల నతి గాఢముగ చదువరుల మానసంబున నాటించి దేశారాధన జీవనము నుబోధించు నవలరాజముల నిరువదియేడింటిని రచించియున్నాడు. హైందవ నవలకారులలో నగ్రగణ్యుడగు నీతనినవలల ప్రాశస్త్య మిట్టిదని వర్ణించుటకంటె యవి యన్నియు నింగ్లీషు, ఫ్రెంచి, జర్మనీ మొదలగు భాష

లలో వెలసి పాశ్చాత్యపాఠకుల విస్మితచిత్తులం జేయుచు అచ్చటి పండితులచేతను, కృతివిమర్శకులచేతను వేనోళ్ళ గొనియాడబడుచున్నవని వ్రాసినజాలును. ఆనందమఠ యం దాతడు "సుజలాం, సుఫలాం, మలయజ శీతలాం, శుభ్రజ్యోత్స్నాపుల కితయామినీం, ఫుల్లకుసుమిత ద్రుమదళశోభినీం, సుహాసినీం, సుమధుర భాషిణీం సుఖ దాం వరదాం మాతరం వందేమాతరం" అని వ్రాసిన గీతము వంగదేశీయులకేగాక ముప్పదిమూడుకోట్ల భార తీయులకు జాతీయగీతముగాదగియున్నది. ఆమహనీయుని నవల నాంధ్రీకరించి ప్రకటించు సదుద్యమమునకు శ్రీ చంద్రా రెడ్డిగారి కాంధ్రులెల్ల కృతజ్ఞులైయుండవలయును. ఇయ్యవి భాషాంతరీకరింపబడుటచే వంగమాతృకల యంత రసవంతముగ నుండకున్నను జాగరూకతతో వానిం బఠించు పాఠకులకు కథాసంపోషణ క్రమమును, పాత్రో చిత సంభాషణక్రమమును బోధించుచు భావియాంధ్ర నవలకారులకు మార్గదర్శకములై వన్నెకెక్క గలవు.

ఆంధ్రప్రచారిణీ ప్రచురములలో వసుమతీ వసంతము మాత్రము వేంకటపార్వతీశ్వర కవుల స్వకపోలకల్పిత మైన నవల. దీని పీఠికయందు సంపాదకులగు శ్రీయుత అయ్యగారి నారాయణమూర్తి బి.యె. బి.యల్. గారు చరిత్రాంశక నవలలను గురించి వ్రాసిన విషయములు మనమున నాటించుకొనవలసినవి. వాని నిచ్చట బొందు పరచుట యుక్తమే యగునుగాని గ్రంథవిస్తర భీతిచే విడువవలసిన వాడనైతిని. ఆ నవలయందు చాణక్యుని రాజనీతియు, చంద్రగుప్తుని చరిత్రమును, నందవంశ వినాశమును, మౌర్యరాజ్యస్థాపనమును గ్రీకుల పరా జయమును చక్కగా వ్రాయబడినవి. ఈ కవివరులును, రాణీసంయుక్త రచించిన శ్రీ వేలాల సుబ్బారావుగారును ఆంధ్రవాఙ్మయమున నవలల నున్నతస్థితికి దేవచ్చునని యాస కలుగుచున్నది.

పైని పేర్కొనబడినవిగాక మరికొన్ని నవలలగూడ ప్రకటింపబడినవి. సువర్ణలేఖా కార్యస్థానమున శుక్తిమతి మొదలగునవి ప్రచురితములయ్యెను. అందు ముఖ్యముగ పేర్కొనదగినది, శ్రీ రమేశచంద్రదత్తుగారిచే రచింపబడి, శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణ రావుగారిచే నాంధ్రీకరింపబడిన మాధవీకంకణము. మాతృకలోని రససారస్య ములను చాలవరకు నిలిపి కృతకృత్యులైనందుకు రావుగా రభినందనీయులు. నవలలనుపేర మరికొన్ని గ్రంథములు ప్రచురితము లయినవిగాని యవి నిజముగా నవలలు గానందుకు చింత వొడముచున్నది.

లక్ష్మీనరసింహముగారిచే రచింపబడిన హేమలత, అహల్యాబాయి, రామచంద్రవిజయము, సౌందర్యతిలక యను నవలలును పైని వివరింపబడినవియునుగాక ప్రస్తు తమున తెలుగున నవలలే లేవు. ఇవిమైన వ్రాయబడుట కు పాశ్చాత్య విద్యాసంపర్క మొక ముఖ్యకారణము. గావున నావాఙ్మయమున నవలల నిర్ణీతస్థానమేదో మన ము దెలిసికొనవలసియున్నది.

పాశ్చాత్యదేశములలోని విద్యాస్థితికిని మనదేశ మునందలి విద్యాస్థితికినిఁ జాలవ్యత్యాసమున్నది. తమ సంతకమునైన చేయనేరని వారాదేశములలో లేనేలేరు గాని మనదేశమున నట్టివారు కోట్లకొలది గలరు. అ త్యున్నత విద్య నభ్యసించినవా రంతటను తగుమాత్ర ముగనే యుండవచ్చును; గాని సాధారణవిద్య నభ్యసిం చినవా రాదేశములందు చాలనెక్కువగను మనదేశము నందు చాలదక్కువగను నున్నారు. ఆదేశములలో నా యాభాషలందు కవిసార్వభౌములచే వ్రాయబడిన కా వ్యనాటకాదులు సుబోధకముగా నున్నంతవరకు పఠింప బడుచున్నను, గష్టముగనున్న భాగములంతగా పఠింప బడకున్నవి. నాగరికత హెచ్చి, వ్యాపారమభివృద్ధి నొం దినకొలది యాదేశములందు మధ్యతరగతివా రభివృద్ధి నొందుచు, సంఖ్యయందేగాక, అధికారమునందు గూడ ధనవంతులను మించుచున్నారు. సాధారణ విద్యాభ్యా సము గలవారు ముఖ్యముగా నీమధ్యతరగతికి జేరినస్త్రీ పురుషులే. వారు తమకు తీరికయగునప్పుడెల్ల చిత్రక థాసంశోభితంబగు నొకమనోహర వచన ప్రబంధమును చదువగోరినయట్లు సులభగ్రాహ్యముగాని ప్రౌఢకావ్య నాటకాదుల నంతగా పఠింపగోర కున్నారు. కావున నాదేశములందు కావ్యనాటకాదుల చెంతకు బోవు పాఠ



పలకరాతి చెక్కడములు, ఘంటసాల.



Pillar Victory, Bobbili

జయస్తంభము, బొబ్బిలి.



Buddlst Marble Carving, Amaravati.

Jagannathan.



బౌద్ధుల పలకరాతి చెక్కడములు, అమరావతి.

Maharajah's Palace Mysore.



రాజమందిరము, మైసూరు

Mahanandi, Chamundi Hill.



మహానంది, చాముండీకొండ, మైసూరు.

వికచరిత్రను వ్రాసి ప్రకటించినారు. అందు మనపూర్వు
లు నావికాకౌశలమున బ్రస్తుతమున నాగరికశిఖామణుల
ని వన్నె కెక్కు దేశముల వారి కెంతమాత్రమును దీసిపో
యినవారు గారని స్థాపించినారు. ఆంధ్ర విష్ణువు శ్రీము
ఖశాతకర్ణి గౌతమిపుత్రశాతకర్ణి ప్రముఖాంధ్ర చక్రవ
ర్తు లలెగ్జాండరు జూలియస్ సీజరు, హానిబాల్, నెపో
లియనులకు దక్కువ కారని వారిశాసనములు వేనోళ్ళ
ఘోషించుచున్నవి. ఈ యంశములు చరిత్రాంశక నవ
లలమిషంబున నాంధ్రసోదర సోదరీమణుల హృదయసీ
మలను నాటించుట బ్రస్తుత నవల కారుల ముఖ్యకర్త
వ్యము.

రాబోయెడి నవల లుత్తమమైనవి గావలయునని
నచో నిదివరకున్నవాని లోపములందు బొడసూపకుండ
జేయవలయును. వీనిలో ముఖ్యముగ పాత్రోచిత సం
పోషణక్రమము లేకపోవుట గొప్పలోపముగా నున్నది.
నవలయందలి ప్రతిపాత్రయు కొన్ని కార్యములు చేయుచుం
డును. ఆపాత్రచేయు కార్యములను బట్టియు, పలికెడి
పలుకులం బట్టియు, ఇతరపాత్ర లీపాత్ర లీవిషయమై చె
ప్పికొను విషయములనుబట్టియు, నాపాత్రముయొక్క స్వ
భావవర్తనములను చదువరు లూహించుకొన వలసిన వా
రగుచున్నారు. ఇవి పరస్పర విరుద్ధములై యున్నప్పుడు
పాత్రస్వభావాదులను చదువరులు నిశ్చయించుటకు చా
లకష్టముగ నుండును. ఇవి విరుద్ధములై యుండుటయె
పాత్రసంపోషణ క్రమమునకు లోపము నాపాదించును.
భాషాప్రావీణ్యముకంటె, కల్పనాకౌశలముకంటె నవల
కారులకు పాత్రసంపోషణక్రమమున కౌశల మలవడుట
మిగుల ముఖ్యము. ఆంధ్రభాషయందు ప్రావీణ్యమును
కల్పనా కౌశలమును మన నవల కారులలో కొందరి కల
వడినవి గాని పాత్రపోషణంబున నీసరికి మనవారెవ్వరు
ను కుశలురు గారని వాకొనవలసి యున్నది. లక్ష్మీనర
సింహముగారు కల్పనాచాతురియం దొక్కొక్క ఘట్ట
మున స్కాట్టునుగూడ మించిరని చెప్పవచ్చును. ఇందుకొ
క్కయుదాహరణము మాత్ర మిచ్చెదను. అహల్యాబా
యి పాత్రలలో నొకడగు శ్యామసుందరుడు రాజద్రోహ
నేరమునకు దేశభ్రష్టుడైన వెనుక నాతనిసంగతి యేమ
య్యెనని చింతించుటకు చదువరుల కవకాశముండదు.
జామానుఖాను డెవడో యనుమానమైన జనింపదు.
పిమ్మట "అమ్మా! నిరపరాధియగు శ్యామసుందరుడే జా
మానుఖాను సుమీ" అని శ్యామసుందరు డహల్యయె
దుట నిలువబడినపుడు చదువరుల శరీరములు బులకరించి
కన్నుల బాష్పములు రాగలవు. కాని యాపాత్రపోషణ
మున శ్రీలక్ష్మీనరసింహముగారు సహితము పొరబడిరని
వ్రాయుటకు చింతవొడముచున్నది. చెఱంబడిన శ్యామ
సుందరుడు విచారవివర్ణుడైనట్లు వర్ణించుపట్టున నాతడొ
కటి రెండుసారులు జస్వంతరావుపక్షమున చేరి చెఱ
తప్పించుకొన దలచినట్లు చదువరులకు దెలియుచుండును.
శ్యామసుందరునివంటి యుత్తమపాత్రకట్టి యోచనజనిం
చినదని వ్రాయుటవలన నాపాత్రప్రాశస్త్యమున కొకింత
కళంకముగలుగుచున్నది. లక్ష్మీనరసింహముగారిదిచూ
చి, యింకొక కూర్పునందైన దీనిని సవరింతురని ప్రా
ర్థింపసాహసించుచున్నాను.

ఆంధ్రనవలకారులకు మార్గదర్శకులగు లక్ష్మీనర
సింహముగారే "ప్రమాదోధీమతామపి" యని పొరబడె
నప్పుడు ఇతరనవలకారులమాట చెప్పబనియేమి? మరి
యొక్క యుదాహరణమాత్రమిచ్చి యీవిషయమునుం
డి విరమించెదను. ప్రభావతియందు, కథానాయకుడు
బంధితుడై చెఱనున్నపుడు తనయాలు బిడ్డలేమగుదురో
తనకేమి దారియోయని హోరున రోదనమారంభించిన
ట్లు వర్ణింపబడినది. దేశభక్తుడును ధీమంతుడును నగు
నట్టియుత్తమ పాత్రనోటనుండి యిట్టిపలుకులు వెడలవ
లసినవిగావు. నీచపాత్రములనోట నుత్తమ ప్రసంగముల
ను, ఉత్తములనోట తుచ్ఛపు పలుకులను మన నవలల
యందు సాధారణముగా మనము చూడగలము.

ఇట్టి లోపములను రాకుండ జేయుటకు సాధన
మొక్కటి గలదు. ఏపాత్రలకెట్టి స్వభావవర్తనల నియ్య
వలయునని గ్రంథకర్తయుద్దేశించునో, అదియొకచోట వ్రా
సియుంచుకొని, యాపాత్రచేసెడి కార్యములకును, పలి
కెడి పలుకులకును అందుకర్తృత్వము గౌరవమునకు సంపన

స్పర విరుద్ధములేకుండ నతికుశలతతో బదములు ప్రయోగించుటయె కడు జాగరూకతతో నిట్లు చేసినగాని మన నవలలయం దీయసందర్భపు లోపము రూపుమాయుననుట కవకాశము గాన్పింపదు. నాటక రచనయందును, నవలరచనయందును, పాత్రసంపోషణ క్రమమె బహుప్రధానమైనది గావున గ్రంథకర్త లీవిషయము నేమరక ముఖ్యముగ గమనించుచు వత్తురుగాక. గ్రంథకారుని కౌశలమును, బుద్ధివైభవమును జదువరులకు జూపు నదీవిషయమే గావునను, ఆంధ్రనవల కారుల ముఖ్యలోప మిదియె గావునను దీనిని గురించి యింతనొక్కి వ్రాసినందుకు మన్నింప వేడుచున్నాను.

కథాకల్పనము బహుకష్ట సాధ్యమైనది. కథయద్భుతావహమగుచుండునట్లు కల్పింపవచ్చును గాని, కథయందు వినవచ్చు నెంతస్వల్పవిషయమైనను కథ గమనికకు తోడ్పడునట్టిదిగను ఒకానొక పాత్రయొక్క స్వభావమును జూపునదిగను నుండునట్లు రచించుటయును ఇందుకు విరుద్ధముగానున్న ప్రతివిషయమును త్యజించుటయు కష్టతరమైన కార్యము. కథ గమనికకును, పాత్రపోషణమునకును సాధనములుగాని యనవసర విశేషములను వర్ణించుటలో మనవారు గొందరు చాలనేర్పును జూపుచున్నారు గాని యది పొరబాటు. ఏవిషయమును వ్రాయబూనినను దానికిని శేషించిన కథకును సంబంధ మేమియని యోచించినగాని యావిషయమును మనగ్రంథకర్త లిటుపై ప్రవేశపెట్ట కుందురుగాక. అట్లు చేయకుండుటచే కథకును నవలకును గలభేదము గ్రంథకర్తకు తెలియదని నిశ్చయింపవలసి యుండును.

ఈ విషయనమున శ్రీ లక్ష్మీనరసింహముగారు సౌందర్యతిలక యందు చూపిన కౌశలము నిరుపమానమైనదని నా యభిప్రాయము. భావి నవలకారులు వారి మార్గమున ననుసరించి పోవలసినవారు గావున నందలి ముఖ్యాంశముల నొకటి రెండింటి నిందు బొందుపరచుట యుక్తమని భావించి యట్లు చేయుచున్నాను. కథ యారంభమునందే గిరివ్రజవాసులక్షురతులనియు, సుఖవిలాసాసక్తులనియు తిరిపమెత్తుకొను వృద్ధుడొకడు వచించియున్నాడు. వాడావాడలంబడి తిరుగుచుండ వనవిహారనిమిత్త మరుగుచున్న యొక రాజకుమారుని యరదము వాయువేగమున బోవుచుండెను. అది యాదీనుని కాలిమీదగపోవుటచే వానికి బలమైన గాయమయ్యెను. అందువలన చూపరులకు వానియందు కనికరముగలిగెను. ముఖ్యముగ నాగవల్లి యాదీనుని దురవస్థకు చింతించి యుక్తాయుక్తముల నారయక, తనసఖి కందజేయుమని యోగియొసంగిన పూలచెండు నొకచో విక్రయించి యాదీనుని కుపచారముచేసెను. స్వల్పమాత్రముగాతోచు నీ విషయము ముందు కథాపోషణమునకేగాక, నాగవల్లి సహజ దయాహృదయమని బోధించి యాపాత్రస్వభావ నిరూపణమున కెట్లు తోడ్పడుచున్నదో పాఠకులు గమనింపవలయును. జయసేనుని దాసి యతని పుత్రునికొఱకాచెండునుగొని వానినాడించుచుండ నాలోపల నిమడ్చబడియున్న కేతకీదళము నేలబడుటయు, అది జయసేనుని కంటబడి యతనికి చిత్తవైకల్యము నాపాదించుటయు, గృహచ్ఛిద్రమధ్యమున నొకచోబడియుండిన కేతకీదళము రణార్ణవుని కంటబడి వానివలన జరాసంధునిచేత బడుటయు, జాగ్రతగా బరిశీలించినచో నవియన్నియు స్వాభావికము లనియు, ఒకదాని కొకటి క్రమముగా ఫలితము లనియు మొత్తముపై కడుచోద్యముగనుండి, మనోజ్ఞములై స్వభావనిరూపణాదుల కతి చమత్కారముగ మూలము లగుచున్నవనియు తేటపడగలదు. స్వభావ విరుద్ధములైన విషయములను బ్రవేశపెట్టక, కథ గమనికకో, పాత్రపోషణమునకో దోడ్పడనివిషయముల చెంతకుబోక పాఠకుల నత్యద్భుత ప్రమోద మగ్నమానసులంజేయు నీ కల్పనాకౌశలము నెంత గొనియాడినను నాకు తృప్తి గలుగదు. నాగవల్లి వివేకమును కోరక కాణభూతుల సమయస్ఫూర్తియు ననుభవైకవేద్యములు. కథారంభమున నగుపడిన వృద్ధుడు కథకొక మూలకారకుడగుటయె గాక కథాంతము వరకెట్లుపచరించెనో బరిశీలించుటయు చాలముఖ్యము. ఇట్టిరచనాకౌశలము బట్టుపడుటకు నవలకారులతి ప్రయత్నముచేయవలయును. అది మాటలతో జరుగుకార్యముగాదు. నవలకారుడొక చిత్రకారునివంటి

వాడు. నవలయొక చిత్రపటము. అందలిపాత్రలే ప్రతిమకు వివిధాంగముల వంటివి; భాష పటమునలంకరించు వస్త్రాలంకారము వంటిది. ఇందేది స్వాభావికముగ లేకున్నను పటముయొక్కయందముచెడినట్లునవలపాడగును.

ఇక నవల శైలినిగురించి యోచించవలసియున్నది. ఒక్కొకవిధమగు కావ్యమున కొక్కొకవిధమగు శైలి యేర్పడియున్నది. జనసామాన్యమునకు సులభసాధ్యమగుచు, సృష్టిసౌందర్య వైచిత్ర్యములనుదర్పణము విధమున ప్రతిఫలింపజేయుచు, మధురజీవన పూరితమును, సుగంధమిళితమునై మనోహరమగుచు, దేశాభ్యుదయమునకు దోడ్పడుచు కథాసమతలంబున నసర్గళంబుగ ప్రవహించు మృదుశైలి నవలలకు ముఖ్యముగా గావలసియున్నది. ఇట్టిది శ్రీ లక్ష్మీనరసింహముగారి శైలియే. ఆజాడనేబోవుచు నా శైలిని పెంపొందజేయుటకంటె యీవిషయమున చేయవలసినది లేదనినాయభిప్రాయము. బంగాళీశైలి పాఠకులకంతగా రుచించుటలేదు. వంగనవలయందలి యభిప్రాయములను లక్ష్మీనరసింహంగారి శైలిలో వ్రాయప్రయత్నించుట యుక్తముగా గాన్పించుచున్నది. కథ యాంధ్రమండలమునకు చెందినదియై, పాత్రలాంధ్రస్త్రీపురుషులైనప్పుడు పాత్రోచితముగ సంభాషణలయందు గ్రామ్యముపయోగించుట సమంజసమగును.

ఇక నొక్కవిషయముమాత్రము చెప్పవలసి యున్నది. జనసామాన్య మున్నతస్థితికి వచ్చినగాని దేశమున్నతస్థితియందున్నదని చెప్పజనదు. అజ్ఞానులై యున్నంతకాలము జనులున్నతస్థితికి రాగలరనిచెప్పుట కవకాశము చాలదు. కల్పనాకథల మిషను స్త్రీ బాలురకు నీతిని గఱపుచు నజ్ఞానమునణచి, యౌన్నత్యము నభిలషింప చేయునట్లితరవిధములఁజేయుట యంత సులభసాధ్యము గాదు. బాల్యమున నొక్కొక గ్రంథము పఠించుచుండ నందొక్కొక్క వాక్యము తమ హృదయములదృఢముగా నాటుకొని తమ భవిష్యజ్జీవములకు పునాదివేసినట్లెందరో మహాపురుషులు నక్కాణించియున్నారు. ఉద్గ్రంథములు, ఉపన్యాసములు, సభలు మొదలగునవి విద్యాధికుల కుపయుక్తమైనట్లుసామాన్యస్త్రీబాలురకుపయుక్తమని చెప్పజనదు. ఎల్లరకు నాహ్లాదకారణములైనవియు, నీతిగఱపునవియు, పరమావధుల నతిదృఢముగ హృదయములందు నాటించుచు దేశారాధనజీవనమునకు బురికొల్పునవియు మనోజ్ఞములగు నవలలేకదా? అంతకంటె నుత్తమ సాధనము వేరొకటి నాకు బొడగట్టదు. నవలపఠనమున కందరు సమావేశము గానక్కరలేదు. ధనవ్యయ మక్కరలేదు. పోట్లాట లక్కరలేదు. అదృశ్యుడై తనపని నిర్వహించు నవలకారుడును, అతని కథామృతము గ్రోలుచదువరియు మాత్రము గావలసియున్నారు. కావున ప్రస్తుతమున కుశలురగు నవలకారులకంటె దేశాభ్యుదయమునకు దోడ్పడువారు వేరొకరుండజాలరు. ఆంధ్రులమగు మన మన్నివిధములచేతను మన హిందీ, బంగాళీ, మహారాష్ట్ర సోదరులకు వెనుకబడి యున్నారము. ఇరువదియవ శతాబ్దమునకు చెందినవారమయ్యు పదునాఱవ శతాబ్దమువారలమైనట్లజ్ఞానమున సంచరించుచున్నారము. విజ్ఞానచంద్రికాది సంఘములు చేయుచున్న పని చాలవరకు దేశాభివృద్ధికి కారణమగుచున్నది. ఇప్పుడాంధ్రమండలమున ముఖ్యముగ నొక్క బంకించంద్రుడు గావలసియున్నాడు. అట్టి మహాపురుషుడొక్క డుద్భవించి నవల కుసుమశరానుల వెదజల్లి యద్భుతములంజేసి యాంధ్రజనసామాన్యమున కున్నతాదర్శప్రదర్శకుడు గావలసియున్నాడు. పాశ్చాత్యనవలల నేకమతి దీక్షతో బఠించి వాని రససారస్యముల నారగ్రోలి, దేశసేవాదీక్షాపరతంత్రులై యెల్లరకు సుబోధకముగ నవలల నాంధ్రమున రచించి యాంధ్రదేశోద్ధారణకు గడంగవలసినవారెవరు? ఈవఱకు పట్టపరీక్షలం దేలినవారిలో ననేకులకు దీని యాధిక్యత బోధపడక వారావిషయమున గృషిసల్పియుండలేదు. ఇటుపైననైన కొంత కృషిసల్పుదురేమో? ప్రస్తుతమునం దాంధ్రగీర్వాణపండితులనేకు లాంగ్లేయ విద్యాగంధమంతగా లేనివారగుట వారికి నవలసారస్యము తెలిసియుండదు. దీనిని నెఱవేర్పగలవారు ప్రాయశః ప్రస్తుతమున కళాశాలలయం దాంగ్లేయ విద్యాభ్యాసముసేయుచున్న యాంధ్రవిద్యార్థులు.

ఓ భాషాభిమానులారా! వింటిరా! మీదేశ చరిత్రమును గరతలామలకముగ బోధించునవియు, మీ సాంఘిక జీవనము నుత్కృష్టస్థితికి దెచ్చునవియు భావికాలమున మీచే రచింపబడు నవలలు! ఎన్ని సంఘసంస్కరణసభలైన నొక చక్కని నవలయంత యద్భుతముగ ప్రజల మూఢవిశ్వాసములను తొలగద్రోచి దేశాభ్యుదయమునకు దోడ్పడవని మీమనంబుల దృఢంబుగ నాటియుంచుకొని కర్తవ్యమునకు గడంగుడు! భాషాసేవకులగుటకు ప్రయత్నింపుడు! దేశసేవాదీక్షా పరతంత్రులు గండు! సర్వశక్తుడగు భగవంతుడు మీ సదుద్యమునకు దోడ్పడక మానడు.

భాషాభిమానులగు శ్రీమంతులారా! ఇదివఱకు మీ రెట్టి యుత్సాహముతో భాషాసేవ జేయుచుంటిరో దాని నతిశయింప జేయుడు. ఆంధ్రనవలకారులకు ప్రోత్సాహమొసంగుడు? ఆంధ్రదేశము ముఖ్యముగా కథాసీమగా గలిగి, పాత్రసంపోషణాదులను క్రమముగా జూపుచు దేశాభ్యుదయమునకు దోడ్పడుచు, స్వతంత్రముగ వ్రాయబడిన నవలలకు బహుమాన మిచ్చెదమని ప్రచురించి ప్రోత్సాహమిచ్చి, యిట్టి గ్రంథములు లేనికొరంత దీర్చుడు! మహాపురుషులయం దిప్పుడు గూఢమైయున్న మహచ్ఛక్తులను బహిర్గతము గావించి, దేశారాధన జీవనమునకు వారిని బురికొల్పవలసిన వారలు మీరుగావున మీరది నెరవేర్చుచు కృతజ్ఞులు గండు.

---

# జర్మనీ సామ్రాజ్యతంత్రము - హిందూదేశము.

:o:

[వల్లూరు సూర్యనారాయణరావుపంతులుగారు బి. ఏ., బి. ఎల్. ఎల్., టి,]

ఆంగ్లేయ ప్రభుత్వముక్రింద మున్దెన్నడైన హిందూదేశమునం దేర్పడినచో అమెరికా సంయుక్తరాష్ట్ర రాజ్యతంత్రమువంటి దేర్పడవచ్చునని కొందఱు చెప్పుచున్నారు. కాని హిందూదేశమునందాంగ్లేయ చక్రవర్తిగారి ప్రతినిధిచేత పరిపాలింపబడునవి మాత్రమేగాక, సంపూర్ణస్వాతంత్ర్యములేని రాజులును, నవాబులును పాలించు రాష్ట్రములుకూడ గలవు. వీనికిని ఢిల్లీలో సామ్రాజ్యశాసననిర్మాణసభలో ప్రతినిధులుండవలసివచ్చును. చాలకాలమువఱకు నీస్వదేశరాజ్యములన్నియు, ప్రజాస్వామికపాలనము క్రిందకురాక, రాష్ట్రాధిపతుల క్రిందనేయుండ దటస్థింపవచ్చును. ఇందుచే, బ్రిటిష్ ఇండియాలో ప్రజాస్వామికమును, స్వదేశరాజ్యముల ప్రాతినిధ్యమును సమ్మేళనముచేసి, ఇండియా సంయుక్తరాష్ట్రమునకు ఆంగ్లేయచక్రవర్తిగారే ప్రెసిడెంటుగనుండి రాజ్యతంత్రము నేర్పఱచవచ్చును. అప్పుడది అమెరికాసంయుక్తరాష్ట్రములకంటె జర్మనీరాజ్యతంత్రమును బోలియుండును.

సంయుక్తరాష్ట్ర ప్రభుత్వమనగా రాష్ట్రములకుగల సంపూర్ణస్వాతంత్ర్యములోకొంతభాగము సంయుక్తరాష్ట్రప్రభుత్వమున కీయబడుననియు నీరెండవదాని యధికారములు దీనియుద్యోగియులవలననే జరుపబడుననియు అమెరికా సంయుక్తరాష్ట్ర రాజ్యతంత్రమును జదివినవారికి దెలిసినవిషయమే. కాని జర్మనీ సంయుక్త రాష్ట్రరాజ్యతంత్రములో నిటులుండుటకు వీలులేదు. జర్మనీ సంయుక్త రాష్ట్రాధికారులకు అమెరికాలోవారికంటె శాసననిర్మాణాధికారము మిక్కిలి హెచ్చుగను, కార్యనిర్వాహకాధికారము మిక్కిలి తక్కువగను ఉండును. జర్మనీలో చట్టములు నిబంధనలు మున్నగునవి రాష్ట్రముల యుద్యోగస్థులవలననే అమలులోనుంచబడవలయును. ఈవిషయమై పైతనిఖీమాత్రము సంయుక్తరాష్ట్రాధికారులకుగలదు. వీరిచట్టముల నేరాష్ట్రముగాని అమలులోబెట్టనియెడల సంయుక్తరాష్ట్రమునకు వేఱుగ నుద్యోగస్థులు లేకపోవుటచేత నారాష్ట్రముమీద దండెత్తి దానిచేతనే పనిని నెరవేర్చుకొనవలయును. కాని యిట్టిచిక్కులెన్నటికిని జర్మనీదేశములో దటస్థించవు. ఏలయన నీదేశపుచక్రవర్తి ప్రష్యారాష్ట్రమునకు రాజు. ఈప్రష్యారాష్ట్రము తక్కిన తన సోదరరాష్ట్రము లన్నిటిలో నుండుదానికంటె నెక్కువవైశాల్యమును జనసంఖ్యయుగలది. కాబట్టి తక్కినరాష్ట్రములన్నియు దీనినిజయించలేవు. కావున ప్రష్యారాష్ట్రమునకే రాజ్యతంత్రములో నెక్కువబలముగలదు. ఈవిధముగనే యిండియా సామ్రాజ్యశాసననిర్మాణసభలో బ్రిటిషు ఇండియాలోనుండి ఆంగ్లేయచక్రవర్తిపంపు ప్రతినిధులే యెక్కువగనుండుట తటస్థించును. కాబట్టి స్వదేశప్రభువుల కంతగా దానిలో పలుకుబడియుండ నేరదు.

అమెరికాసంయుక్తరాష్ట్రములో నన్నిరాష్ట్రములకు సమానహక్కులున్నవి. జర్మనీ సామ్రాజ్యతంత్రములో రాష్ట్రములకూటమి

Maharaja's Palace, Bangalore.



రాజమందిరము, బెంగళూరు,

Lal Bagh, Bangalore.



(లాల్ బాగ్)ఉద్యానవనము, బెంగుళూరు.

HIGH COURT, MADRAS.



మద్రాసు హైకోర్టు.

Board office, Presidency College, Senate House, Engineering College, Madras.



రివిన్యూ బోర్డు, ప్రెసిడెన్సీ కాలేజి మద్రాసు.

The Bombay Secretariat, Rajabai Tower.



బొంబాయి సెక్రటరియట్ రాజాబాయి గోపురము.

The Pier at Madras.



చెన్నపురిలోని వారధి.



Musoleum of Prince Etmaddowlah.

ఎత్మాద్దౌలా సమాధి, ఆగ్రా.



The Pearl Mosque. Agra.

ముత్యాలమసీదు. ఆగ్రా.

The Bombay Secretariat, Rajabai Tower.



బొంబాయి సెక్రటేరియట్ రాజాబాయి గోపురము.

The Pier at Madras.



చెన్నపురిలోని వారధి.

కులసంఖ్యకంటె నవలలను బఠించువారిసంఖ్య దినదినము నధికమగుచున్నది. దినమెల్ల వ్యాపారసంబంధములగు విధుల నెరవేర్చి యలసియుందురు. కావున సాయంకాలముననో, తీరికయున్న మరియొకప్పుడో దేనినైన జదువవలయునను నభిలాషవారికి గలిగినప్పుడు మనోజ్ఞములగు నవలలు వారి హృదయముల కాహ్లాదకారణములైనట్లు ఇతర కావ్యాదులంతగా గానేరవు. ఆహేతువుచేత నాదేశములయందు నవలపాఠకులసంఖ్య యితర పాఠకులసంఖ్యను దినదినము మించుచున్నది. ఆంగ్లేయవాఙ్మయమున షేక్స్పియరు నాటకములకంటెను, ఇతరకవుల కావ్యములకంటెను స్కాట్, డిక్కెన్సు, జార్జి ఈలియట్, జేనాస్టిన్, స్టివెన్సన్ ముఖ్యనవలకారుల నవలలే ప్రధానాంగములై వెలయుచున్నవి. నవలకారుల సంఖ్యదినదినమువృద్ధియగుచున్నది. వారిచేతులలోనవల రచన పెంపొంది యున్నతస్థితికి వచ్చుచున్నది. ఇంగ్లండుదేశమున నొక్కసంవత్సరములో(1911)పదునొకండువేల నూతనగ్రంథములుముద్రితములై ప్రచురింపబడెను. అందు సుమారైదువేలు నవలలై యున్నవనినచో నాదేశమున నవలలెంతవిస్తారముగా పఠింపబడుచున్నవో పాఠకులచే నవలకారులకును, వారినవలలను ముద్రించి ప్రకటించు ప్రచురకర్తలకును నెట్టి ప్రోత్సాహ మియ్యబడుచున్నదో తేటపడగలదు. మనయాంధ్రమండలమున నన్ననో మూడునాలుగుకంటె నెక్కువగ నవలలను బ్రచురించుసంఘములే లేవు. అందొక్కదానికైననిజముగామూడువేల చందాదారులు లేరు. ఏలయన వి. పి. వచ్చిచేరినదాక చందాదారులై యుండి, యదిచేరినవెంటనే తిరుగగొట్టి, నిష్కారణముగా నాసంఘములకు నంచెకూలి మొదలగు వ్రయభారములను దగిలించుచుండుట మిగుల శోచనీయము.

ఆంధ్రనవల పాఠకుల సంఖ్యనుచూచినను, ఆంధ్రనవలలసంఖ్యను విచారించినను, వానిం బ్రచురించు సంఘముల స్థితిగతుల పరీక్షించినను, మనమున కుత్సాహము గలుగకున్నది. అట్లని యిక నవలల నున్నతస్థితికి దెచ్చుట సాధ్యముగాదని నిరాశజెంద బనిలేదు. వేలాలసుబ్బారావుగారును, వేంకటపార్వతీశ్వరకవులును కాలక్రమమున గొప్పనవలలను వ్రాయగలరని యాశగొల్పుచున్నారు. శ్రీపిఠాపురము, బొబ్బిలి, మునగాల జమీన్దార్లు ఆంధ్రభాష నుద్ధరింప బూనియున్నారు. శ్రీ కొవ్వూరు చంద్రారెడ్డిగారు యావనులకు ప్రోత్సాహమొసంగి నవలల వ్రాయించుచున్నారు. ఆరంభదశయందు వానియందు లోపములు మెండుగా నుండవచ్చును. అయ్యవి సవరించుకొన వచ్చునవిగాని సవరించుకొన రానివిగావు. చదువనేర్చిన వారిసంఖ్య వృద్ధినొందినగాని పాఠకులసంఖ్య వృద్ధిగాదు. పాఠకులనేకులుండినగాని నవలలం బ్రచురించు సంఘముల చందాదారులసంఖ్య వృద్ధిగాదు. అదియయినగాని యాసం ములస్థితి తృప్తికరముగా నుండజాలదు. అంతవరకు శ్రీమంతుల సహాయములేక యదినెరవేరదు. అదియొక్కటి బాగుగా నుండినచో దక్కినవన్నియు కాలక్రమమున నెరవేరగలవు. గౌరవనీయులగు గోఖలేగారీవిషయములను మిగుల దూరదృష్టితో నాలోచించి చూచి నిర్బంధక ప్రారంభోచితవిద్యా శాసనమును రాజప్రతినిధిగారి శాసననిర్మాణసభలో బ్రవేశపెట్టిరి. అయ్యది శాసనముగా నంగీకరింపబడకున్నను శ్రీజార్జి రాజరాజేంద్రులు తమ పట్టాభిషేక శుభముహూర్తమున నేబదిలక్షలు ప్రారంభోచిత విద్యాదానమున కొసంగి మనల సంతోషాన్వితస్వాంతులను జేసినారు. దొరతనమువారక్కడక్కడ ప్రారంభవిద్య నుచితముగా గఱపుట కేర్పాటుచేయుట మనకు జాలదృప్తికరముగా నున్నది. నేడుగాకున్న రేపో, రేపుగాకున్న నెల్లుండియో గోఖలేగారి చట్టము శాసనమగునన్న యాశ మనహృదయములయందు దృఢముగా నాటుకొని యున్నది. చదువరులసంఖ్య వృద్ధిగాంచినపుడు నవల లిప్పటికంటె విశేషముగా పఠింప బడగలవు. అందువలన భాషాభివృద్ధియు, దానిచే నున్నతాదర్శసంప్రాప్తలాభమును గలుగగలవు.

ఇక నాంధ్రనవలల నున్నతస్థితికి దెచ్చుమార్గము నగుణించి యోజింపవలసి యున్నది. దేనినైన నున్నతస్థితికి దేవలయునన్నచో, మున్ముందందలి లోపములను

వెదకి యవిలేకుండ జేయవలయును. లేనిపక్షమున నున్నతస్థితి లభ్యముగాదు. లోపములను జూపినచో మామిత్రులగు నవలకారులకు నామీద గోపమురావచ్చును. వారి నవమానము జేసి గోపము దెప్పించుట నాయభిప్రాయముగాదు. సంపూర్ణ మొక్క భగవంతుని యందు మాత్రము జూపట్టును. దిద్దుకొనదగిన లోపములున్నపుడు వానిని దిద్దుకొని, యుత్తమ గ్రంథముల వ్రాసి పాఠకుల కొసంగుట గ్రంథకర్తలవిధి. టెన్నిసన్ మహాకవి 1832 వ సంవత్సరమున కొన్ని పద్యకావ్యములను బ్రచురింప కృతివిమర్శకులు వానిని నిర్దయులై విమర్శించిరి. వానితో నిరుత్సాహుడుకాక యాతడొక పదిసంవత్సరము లూరకుండి యాకావ్యముల నుచితరీతిని సంస్కరించి 1842 సం॥ లో మరల ప్రచురించెను. అవి యిప్పుడాంగ్లేయ వాఙ్మయమున సత్యుత్తమమైన వానిలోగొన్నిగా పరిగణింపబడుచు నాంగ్లేయభాషాభ్యాసము చేయువిద్యార్థుల కవశ్యపఠనీయములై యొప్పుచున్నవి. ఆమహాకవి వలెనే మననవల కారులుగూడ నట్టి గ్రంథములు పాఠకులకు రుచించి దేశాభ్యుదయమునకు దోడ్పడునో యట్టివియె లోపములు లేకుండ వెలయింపజేతురుగాకయని మనఃపూర్వకముగా గోరుచున్నాను.

ప్రస్తుతమున గల నవలలో చాలవర కాంధ్రీకరింపబడినవే గాని స్వతంత్రముగా వ్రాయబడిన నవల లధికముగా లేవు. బంకించంద్రుడును, రమేశచంద్రదత్తును మహారాష్ట్రగ్రంథకారులును వ్రాసిన నవలలు భాషాంతరీకరింపబడినవి. ఇదిసులభమా, స్వతంత్రగ్రంథరచన సులభమా యని యోచించినచో స్వతంత్ర గ్రంథరచనయే యని నొక్కిచెప్పవచ్చును. ఉభయభాషా పాండిత్యముండినగాని భాషాంతరీకరణ మంతయుపయుక్తము గానేరదు పాండిత్యముండినను, భాషలు వేరగుటచేత నొకభాషయందలి భాషీయము రెండవభాషయందు లభించుట సాధ్యముగాదు. ఆహేతువుచేత భాషాంతరీకృత నవలలు మాతృకలోని రససారస్యములను గోలుపోవుటయేగాక బంగాళీ వచనశైలితో గలసి తెలుగున నొక మిశ్రశైలి నూతనముగ నుద్భవించినది. విశేషించి వంగమహారాష్ట్రముల దేశముల యొక్కయు, అందలి సాంఘికాచారములయొక్కయు వర్ణనలు మనయాంధ్రదేశపు వర్ణనల కంతగా సరిపోవమిచే యానవలలయందలి చమత్కారములను గ్రహించిన పాఠకు లెందరో యుందురని విశ్వసింపజాలము. భాషాభిమానులు గొందరు తామొక కవివరుని గ్రంథమును మాతృకగా గైకొని, యాంధ్రీకరించి, దానికింకను వన్నెదేవలయునను సదుద్యమముతో మార్పులనుజేసి మాతృకయందలి చమత్కారములను వానియందమును ధ్వంసముసేయుచున్నందుకు చింతింపవలసి యున్నది.

భాషాంతరీకృత నవలలం దాంధ్రదేశ వర్ణనాదులుండుట యసంభవము. ఇక నాంధ్రనవలకారుల స్వతంత్ర గ్రంథములయందును, అనువాదముల యందును నైన నట్టిదిగానరాకున్నది. శ్రీ వీరేశలింగము పంతులుగారి రాజశేఖర చరిత్రమును, లక్ష్మీనరసింహముగారి రామచంద్ర విజయమునుదప్ప నాంధ్రమండలము కథాసీమగాగల నవలేలేవు. హేమలత, విమలాదేవి, ఈరెండును రాజపుత్రస్థాన విషయమైనవి. అహల్యాభాయి ప్రభావతి మహారాష్ట్రమునకు జేరినవి. రాణీసంయుక్త ఉత్తరహిందూస్థానముపై మహమ్మదు ఘోరీదండయాత్రను గుఱించి చెప్పుచున్నది. వసుమతీవసంతము మార్యరాజ్యసంస్థాపనకథ. ఇవి యుండుట తప్పని నాయభిప్రాయముగాదు. ఆంధ్రమండలము కథాసీమగాగల నవలలు లేకుండుట లోపమనియు, దానిందీర్పుమని నవలకారులకు జూపి వారిని ప్రార్థించుటయే నాయభిప్రాయము. శ్రీ చిలుకూరి వీరభద్ర రావుగారు, మనపూర్వులగు నాంధ్రులు పౌరుషమునందుగాని, పాండిత్యాశయమునందుగాని, రాజ్యవిస్తారము నందుగాని, సామ్రాజ్యమున్నతస్థితియం దుండిన కాలమునందుగాని, సుశీలములయందుగాని, ప్రజాక్షేమైక తత్పరత్వమునందుగాని ప్రపంచమందలి యేసామ్రాజ్యమువారికిగాని దీసిపోయినవారు కారని సిద్ధాంతీకరించి యాంధ్రుల చరిత్రమును వ్రాసి, మనకు మహోపకార మొనర్చిరి. వంగదేశమునందు శ్రీ రాధాకుముదముఖుర్జీ ఎమ్. ఏ గారు ప్రాచీనభారతనా

ఒకసింహము కొన్నిగుంటనక్కలు, కొన్నిచుంచులుచేరి యేర్పరుచుకొన్న సంఘమువలెనుండును. జర్మనీలో ప్రష్యారాష్ట్రమే తక్కిన తనతోడిరాష్ట్రముల సలహాతోడను, సహాయముతోడను రాజ్యము చేయుచున్నదని చెప్పవచ్చును. తనరాజే జర్మనీసంయుక్తరాష్ట్రమునకు చక్రవర్తిగానుండవలయును. సంయుక్తరాష్ట్రనిబంధనలో మార్పులను శాసననిర్మాణసంఘములో నొకశాఖయగు ప్రజాప్రతినిధిసంఘమువారు (Reichstag) అంగీకరించినను రెండవశాఖయగు శిష్టసభవారు (Bundesrath) తమలో పదునాలుగువోట్లచేత నవి రదుపఱచవచ్చును. ఈశిష్టసభలో ప్రష్యారాష్ట్రమునకు పదునేడువోట్లుండుటవలన జర్మనీ సంయుక్తరాష్ట్ర నిబంధనలో నెట్టిమార్పులు నెన్నటికిని దానియిష్టము లేకుండ జరుగనేరవు. కాబట్టి దానికి సంపూర్ణమైన నిరాకరణాధికారముకలదు. పటాలములు నావికాబలము పన్నులు వీనిలో నెట్టిమార్పులు చేయవలెనన్నను ప్రష్యారాష్ట్రముయొక్క యిష్టములేనిదే అవి జయప్రదముగ జరుగుటకు వీలులేదు. శిష్టసభలో (Bundesrath) రాష్ట్రములన్నియు రెండుసమానకక్షులుగా వోట్లువేసినపుడు ప్రష్యారాష్ట్రమొకవోటు నధికముగానిచ్చుటకు అధికారముకలదు. ఈశాఖయొక్క కమిటీలకు అధ్యక్షుల నేర్పరచునధికారముకూడ ప్రష్యారాష్ట్రమునకే కలదు.

అన్నిరాష్ట్రములలోను నిర్బంధపు సిపాయికొలువు ఎవరికిని తప్పదు. కాని సేనలకుసంబంధించుచట్టములు నిబంధనలు సంయుక్తరాష్ట్రమువారే యేర్పరచవలయును. సేనాధిపత్యము చక్రవర్తిగారిదే. ఈయన యాజ్ఞలనుమీరి యేరాష్ట్రపుసేనయు నడువగూడదు. ఈసేనలకు ముఖ్యోద్యోగియులను చక్రవర్తిగారే యేర్పరచెదరు. కాబట్టి యీరాష్ట్రములలోనున్న సేనలన్నియు ప్రష్యారాష్ట్రసేనలలో భాగములనే చెప్పవచ్చును. కొన్నిరాష్ట్రములు తమకు సంయుక్తరాష్ట్రనిబంధనలవలన గలిగిన యధికారములను ప్రష్యారాజుగారి కిచ్చివేసినవి. వీనిలో వాల్డెక్కు అనురాష్ట్రముయొక్కరాజు తనహక్కులనన్నిటిని ప్రష్యారాజునకుఅమ్మివేసి తాను కొంతవేతనముతీసికొని విదేశములలో తిరుగుచున్నాడు. ఈసంయుక్తరాష్ట్రసంఘములోచేరినందుకు . బవేరియా, ఉర్టెంబర్గు, బేడెన్ అనురాష్ట్రములకు కొన్ని యెక్కువహక్కులీయబడినవి.

## ప్రజాప్రతినిధిసంఘము. (రీచిష్టాగు.)

అయిదుసంవత్సరములకొకసారి జర్మనీ సామ్రాజ్యములోనుండు జనులందఱు రహస్యముగ వోట్లువేసి తమప్రతినిధుల నెన్నుకొనెదరు. ఈనియామకు.లిరువదిరైదు సంవత్సరములలోపు వయస్సుగలవారుగగాని కడుబీదలుగగాని సైనికులుగగాని కొన్ని నేరములు చేసినవారుగగాని యుండగూడదు. సామ్రాజ్యనిబంధనలవలన నేర్పడిన జిల్లాలనుండి ప్రతినిధు లెన్నుకొనబడెదరు. మొదట లక్షజనులుగలప్రదేశ మొకజిల్లాగా యేర్పాటుచేయబడెను. ఇటీవల నీజిల్లాలలో జనసంఖ్య యెన్నివిధములుగమారినను, జిల్లాలనుమార్చనేలేదు. అమెరికా సంయుక్తరాష్ట్రములోవలెనే యేజిల్లాగాని రెండురాష్ట్రములకు జేరియుండగూడదు. కాబట్టి యెంతచిన్నరాష్ట్రమైనను ఒకప్రతినిధినిబంపుటకు అధికారము కలిగియున్నది. ప్రష్యా 235 ప్రతినిధులను, బవేరియా 48, సాగ్జని 23, ఉర్టెంబర్గు 17, ఆల్సేసులొరేన్ 15, బేడెన్ 14, హెస్సీ 9, మెక్లెన్బర్గు 6, సాక్సెవీమారు 3, ఓల్డెన్బర్గు 3, బ్రన్సువిక్ 3, హాంబర్గు 3, సాక్సెమీనింజన్ 2, సాక్సెకోబర్గుగోతా 2, అన్హాల్టు 2, తక్కినరాష్ట్రములన్నియు ఒక్కొక్క మెంబరును తమప్రతినిధులుగా ఈసంఘమునకు బంపవచ్చును. ప్రతినిధికి సగముకంటె నెక్కువవోట్లు రావలయును. ఇట్లురానియెడల రెండవసారి బాలటుమీద నెక్కువ వోట్లువచ్చిన మొదటియిద్దరుప్రతినిధులకుమాత్రమే బాలటువేసి వీరిలో నెక్కువవోట్లువచ్చిన ప్రతినిధిని యెన్నుకొనవలయును.

ఈసంఘము తనప్రెసిడెంటు నెన్నుకొనుటకును, తనకు సంబంధించిన నిబంధనల నేర్పఱచుకొనుటకును, తనప్రతినిధులు సరిగా నెన్నుకొనబడిరాయని చర్చించుటకును పూర్ణాధికారము కలిగియున్నది. ప్రతిసెషనుమొదటను, నీసంఘము యేడుభాగములుగా విభజింపబడును. ఈవివిధభాగములలోనుండు ప్రముఖులందఱు వేరుగ నొకసంఘముగ జేరి, ముఖ్యమగు రాచకార్యములకు గావలసిన కమిటీలను, వానిలో ప్రెసిడెంట్లను మెంబర్లను ఏర్పఱచుకొనెదరు.

ఈసంఘముయొక్క యధికారములు బయటకు గొప్పవిగా కనుపడును. శాసననిర్మాణమునకు దీనియంగీకారము తప్పకకావలెను. బిల్లులను ప్రవేశపెట్టుటకును, కార్యనిర్వాహకశాఖవారినుండి రిపోర్టులను తెప్పించుకొనుటకును, వారిమేనేజిమెంటునుగుఱించి తమ యభిప్రాయమును వెల్లడిచేయుటకును ఈసంఘమువారికి నధికారముకలదు. కాని, నిజముగానిది యింతయధికారము చెలాయించుటలేదు. సంయుక్తరాష్ట్రనిబంధనప్రకారము ప్రతిసంవత్సరము ఆదాయవ్యయములపట్టీని యేర్పాటుచేయవలెనని యున్నప్పటికి ముఖ్యమైన రివిన్యూచట్టములు శాశ్వతముగా ప్యాసుచేయబడి రెండవశాఖయైన బూండిసాత్రు అను శిష్టసభవారి యంగీకారములేనిదే అచట్టములు మార్చుటకు వీలులేకపోవుటచేతను, కొన్నిసంవత్సరములకుగాని సేనల సంబంధమైనఖర్చులకు చట్టములేర్పడుట యనవసరముగుచుండుటచేతను ఈప్రజాప్రతినిధిసంఘమువారు (రీచిష్టాగు) పూర్ణాధికారములు చెలాయించుటకు తగినసమయములు రానేరావు. ప్రధానమంత్రిగారును (ఛాన్సలరు) బూండిసాత్రువారును ప్రవేశపెట్టుబిల్లులను ఆలోచించుటయే యీశాఖవారి ముఖ్యకార్యము.

చక్రవర్తిగారి యనుమతిదీసికొని బూండిసాత్రు యీసంఘమును ఛిద్రముచేసి క్రొత్తప్రతినిధుల నెన్నుకొనవలసినదని ప్రజలను కోరవచ్చును. సాధారణముగా నూతన రీచిష్టాగు చక్రవర్తి చెప్పినప్రకారమే నడచుకొనును.

ఈదేశములో మంత్రులసంఘము (అనగా, ఇంగ్లాండులో కాబినెటువంటిది) లేనేలేదు. ప్రధానమంత్రియైన చాన్సలరుగారీ రీచిష్టాగులో మెంబరుకాడు. ఒకప్పుడు బూండెసాత్రునుండి వచ్చుప్రతినిధులతోగలసి యీయనరావచ్చును. అప్పుడు వేరుగకూర్చుండును. ఈయన

రీచిస్టాగు వేయుప్రశ్నలకు తనతాబేదారులగుండ జవాబుచెప్పెదరు. ఈరీచిస్టాగు సంఘమువారికి యిష్టములేనంతమాత్రముచేత చాన్సలరు గారు తనపదవికి రాజీనామానీయరు.

### శిష్టసభ (బూండెస్రాతు)

ఈసభకు వివిధరాష్ట్రములరాజులును, స్వాతంత్ర్యపట్టణములును ప్రతినిధులను బంపవలయును. ఫ్రెంచివారిని జయించితీసికొన్న ఆల్సేసులోరేను అను రాష్ట్రముమాత్రము రీచిస్టాగు శాఖకు ప్రతినిధులను బంపునధికారము కలిగియున్నది. కాని బూండెస్రాతుకు అదిపంపు ప్రతినిధులకు ఆసంఘములో వోటువేయునధికారములేదు. ఈసభలో 58 మెంబర్లుందురు. వీరిలో ప్రష్యా 17గురను, బవేరియా ఆరుగురను సాక్సనీవుర్టెంబర్గులుచేరి నలుగురన్ను, బేడెన్ హెస్సీలు చేరిముగ్గురన్ను, బ్రన్సువిక్కు మెక్లెన్బర్గులు చెరియిద్దరను తక్కిన పదునాలుగురాష్ట్రములు మూడు స్వతంత్రపట్టణములు ఒక్కొక్కప్రతినిధిని ఈసంఘమునకు బంపవలయును. ఇదిగాక ప్రష్యారాష్ట్రము వాల్డెక్కురాష్ట్రముతోచేసి కొన్న ఎగ్రిమెంటునుబట్టి ఒకవోటును బ్రన్సువిక్కురాష్ట్రమునకు తనరాజకుటుంబములో నొకరిని మేనేజరునిగా నియమించుటచేత రెండువోట్లును కలిగియుండుటవలన మొత్తము 58 వోట్లలో ప్రష్యారాష్ట్రమునకు 20 వోట్లున్నవి. కాబట్టి యీసభలో మరిపది వోట్లుసంపాదించుకొన్న యెడల తానుతలచు కార్యములన్నియు ప్రష్యారాష్ట్రము కొనసాగించుకొనగలదు.

ఈసభలోనుండు మెంబర్లందరు అమెరికా సంయుక్తరాష్ట్ర శిష్టసభ మెంబర్లవలెగాక వారివారిరాష్ట్రములనుండివచ్చిన రాయబారులవలెనుందురు. ప్రజాప్రతినిధులవలెనుండరు. వీరిని దీసివేయుటకును, నేర్పరుచుటకును వీరిని పంపినరాష్ట్రములకు సర్వస్వతంత్రముకలదు. వీరువేయువోట్లు వీరిరాష్ట్రములవేగాని వానిప్రతినిధులవికావు. కాబట్టి ఒకరాష్ట్రముయొక్క ప్రతినిధులందఱు నొకటేవిధముగ వోటువేయవలయును. ప్రతిరాష్ట్రమునుండివచ్చు ప్రతినిధులవోట్లన్నియు మొత్తమువోటుగా లెక్కపెట్టుదురు. వీరిలో ఒక్కప్రతినిధియేవచ్చి తనరాష్ట్రమునకున్న వోట్లన్నియు తానేవేయవచ్చును. ఈప్రతినిధులు తమ రాష్ట్రీయప్రభుత్వమువారు తమకిచ్చిన యుత్తరువులప్రకారము వోట్లు వేయవలసియుండును.

రాష్ట్రీయప్రతినిధి అతనిరాష్ట్రములో మంత్రిగగాని లేక ఒక గొప్పయుద్యోగస్థుడుగగాని యుండును. ఈప్రతినిధులు వారివారి రాష్ట్రములలో పౌరులుగానుండవలసినపనిలేదు. ఒక్కొకప్పుడు వ్యయమునకు వెఱచి అనేకరాష్ట్రములొక ప్రతినిధినేపంపి తమవోట్లన్నియు అతనిచేతనే వేయించును. ఇటీవల కొన్ని ముఖ్యాంశములను జర్చించునపుడు ప్రతిరాష్ట్రమువారును తమస్వంతప్రతినిధులనే పంపవలెనని యేర్పాటుచేయబడినది.

ఈసంఘము సంయుక్తరాజ్యాంగములో నొకభాగమై చట్టములను ప్యాసుచేయునదిగాన దీనిలోని ప్రతినిధులు కేవలము రాయబారులని యెంచగూడదు. తమరాష్ట్రాధికారుల యుత్తరువుల ననుసరించియే వీరు నడచుకొనవలెను గనుక యీప్రతినిధులసంఘము ఆలోచనసభగా కూడ నెంచబడగూడదు.

ఇతరదేశముల శాసననిర్మాణశాఖలవలె నీసంఘము నియమిత కాలమునకేర్పడిన ప్రతినిధులను గలిగియుండదు. ఈప్రతినిధులు తమ రాష్ట్రములపక్షమున వచ్చినవారేగాని, ఆరాష్ట్రీయ ప్రజలపక్షమున కాదు. వీరు తమరాష్ట్రములకు ఏజెంట్లుగానుండి అవిచెప్పినటులచేయ వలసినవారై యున్నారు. రాష్ట్రీయప్రభువులే తమయేజంట్లద్వారమున నీసంఘములో వోట్లువేయుచున్నారని మనమెంచుకొనవలయును.

ప్రష్యారాష్ట్రము యీసంఘములో తనకుగల 17 వోట్లమూలముగ సంయుక్తరాష్ట్రనిబంధనలో నెట్టిమార్పులను జరుగకుండ జేయగలరనియు, సేనలు పన్నులవిషయమై యీసంఘముయొక్క తీర్మానమును నిరాకరించు నధికారముకలిగియున్నదనియు, నిదివరకే తెలిపియుంటిమి. ఇదిగాక ప్రష్యారాజుగారే సంయుక్తరాష్ట్రచక్రవర్తిగానుండి తనమంత్రిని నియమించునధికారము కలవాడుగానున్నాడు. ఈమంత్రి యీ సంఘమునకు ప్రెసిడెంటుగానుండి యిది చేయవలసినపనుల నేర్పాటు చేయును. రెండవశాఖయైన రీచిస్టాగుపంపు పిటీసనులు, రిపోర్టులు, తీర్మానములు మొదలగునవియన్నియు, తానే యందుకొనుచుండును.

ఈసంఘమున కెనిమిదికమిటీలు, సంయుక్తరాష్ట్రనిబంధనవలన నేర్పడినవి. సేనలు కోటలనుగుఱించి విచారించుకమిటీవారు చక్రవర్తి గారిచే నియమింపబడుదురు. దానిలో బవేరియా, సాక్సనీ, ఉర్టెంబర్గుల ప్రతినిధులుండితీరవలయును. నావికాబలమునుగుఱించి యేర్పడిన కమిటీ మెంబర్లందఱు చక్రవర్తిగారివలననే నియమింపబడుదురు. (1) పన్నులుసుంకములు, (2) ఇనుపదారులు, (3) పోస్టుటెలిగ్రాఫులు, (4) వాణిజ్యము, (5) ఆదాయవ్యయములకు సంబంధించినలెక్కలు (6) న్యాయాధికారవిషయములు ఈయారుకమిటీలకు నీసంఘమువారే యేటేట తమలో తాము ప్రతినిధుల నెన్నుకొనుచుందురు. సేనలు, కోటలనుగుఱించి యేర్పడిన కమిటీగాక తక్కిన యేడుకమిటీలలో కనీసము అయిదురాష్ట్రములకైనను ప్రతినిధులుండవలయును.

ఈకమిటీలన్నిటిలో ప్రష్యారాష్ట్రప్రతినిధి యుండితీరవలయును. ఏయేరాష్ట్రములీకమిటీలలో నుండవలెనో చక్రవర్తిగాని, యీసంఘవారుగాని యేర్పాటుచేసినతరువాత, తమలోనెవరిని ఆయాకమిటీలకు ప్రతినిధులుగబంపవలెనో ఆరాష్ట్రప్రతినిధులే యేర్పఱచుకొనెదరు. అప్పుడు, ఆప్రతినిధి తన్నుతనరాష్ట్రమువారు పంపినట్లే యెంచుకొనవలసినదిగాని, తానుతనసోదర సభ్యులప్రతినిధియని యెంచుకొనగూడదు. పరదేశవిషయములనుగురించి విచారించుమఱియొక కమిటీకలదు. ఇదితక్కినకమిటీలవలెరిపోర్టులుపంపదు. దీనిలోని మెంబర్లు మంత్రిగారు చెప్పినసంగతులనువిని తమ రాష్ట్రములవారికి వానినిగురించి తెలియజేయును. ఈకమిటీలో బవేరియా, సాక్సనీ, ఉర్టెంబర్గు రాష్ట్రములును, బూండెస్రాతువలన నేర్పాటుచేయబడు మఱిరెండు రాష్ట్రములును, చేరియుండవలెను. దీనిముఖ్యకార్యము మంత్రిగారికి సలహానిచ్చుటమాత్రమేగనుక, కమిటీలో ప్రష్యారాష్ట్రమునకు చోటుఅవసరములేదు. ప్రష్యాదేశపు మంత్రిలేనపుడు, బవేరియాప్రతినిధిదీనికధ్యక్షుడుగానుండును.

రీచిస్టాగు సంఘమువలెగాక, బూండెస్రాతుసంఘములోకొన్ని రాష్ట్రములకే వర్తించువిషయములలో, ఆరాష్ట్ర ప్రతినిధులే చర్చించి వోటువేయవలయును. ఈరెండుసంఘములు శాసననిర్మాణ శాఖలో చేరినవైనను, కడసారిమాట బూండెస్రాతుదనే చెప్పవచ్చును. సాధారణముగా, ప్రతిశాసనము, బూండెస్రాతులో నుపపాదింపబడి చర్చచేయబడి, రీచిస్టాగునకు పంపబడును. వారు దీనిని విచారించి ప్యాసుచేసి తిరిగిపంపగా ఈసంఘమువారామోదించినయెడల, చక్రవర్తిగారి యంగీకారమునకు బంపుదురు.

ఈబూండెస్రాతుసంఘము కార్యనిర్వాహకశాఖలోకూడ నొకభాగము. రాజ్యపరిపాలనవిషయమై యేర్పడినచట్టములననుసరించి ఈసంఘమువారు నిబంధనలను చేయుచుందురు. కోశాధికారములోకూడ వీని కెక్కువ జోక్యముకలదు. ఇదిలెక్కలనన్నిటిని తనిఖీచేయును. హైకోర్టుజడ్జీలను, లెక్కలను తనిఖీచేయుకమిటీలను ఏర్పఱచును. పైనచెప్పిన కమిటీలయంగీకారముతో కలెక్టర్లను, చిన్నగాయబారులను నియమించును. యుద్ధమును మొదలుపెట్టవలెనన్నను, రీచిస్టాగునుఛిద్రముచేయవలెనన్నను, మూర్ఖపుపట్టుదలవహించిన రాష్ట్రమును బుద్ధిచెప్పవలెనన్నను, నీసంఘమువారి యంగీకారముండవలయును. కార్యాలోచనలోఆంగ్లేయ మంత్రివర్గమువారికున్న యధికారముదీనికినిగలదు. తానామోదించు విషయములను తెలియజేయుటకై రీచిస్టాగుకు తనమెంబర్లలోకొందఱిని పంపుచుండును. రీచిస్టాగులో ఒకబిల్లుచర్చింపబడునపుడు ఆబిల్లులో నేయేమార్పులు తానంగీకరించునో, ఆసంగతి వారికితెలియజేయుటకు, తనప్రతినిధులనుపంపును. తానట్లుపంపు ప్రతినిధులు, తన యభిప్రాయమునేగాక, వారివారి రాష్ట్రముల యభిప్రాయములుకూడ దానికి భిన్నములైనను రీచిస్టాగువారికి చెప్పవచ్చును.

సంయుక్త రాష్ట్రమునకును, రాష్ట్రములకును తగవులుసంభవించినపుడీసంఘమువారు, సంయుక్తరాష్ట్రపు చట్టములకు వ్యాఖ్యానము చేసి తీర్పులుచెప్పవచ్చును. ఒకరాష్ట్రన్యాయస్థానము సరియైనతీర్పుచెప్పలేదని, యీసంఘమువారికి అప్పీలుచేసికొనవచ్చును. రాష్ట్రములలో నొండొంటికి గలుగుతగవుల నీబూండెస్రాతు పరిష్కరించవచ్చును. సంయుక్తరాష్ట్ర నిబంధనవిషయమై ఒకసమస్య సంభవించి దీనిని విచారించుటకు రాష్ట్రములో తగినకోర్టులేనపు డీసభవారు ఆరాష్ట్రమువారి యిష్టముమీద విచారించవచ్చును. అట్లువీలులేనియెడల దీనివిషయమై క్రొత్తచట్టమును ప్యాసుచేయవచ్చును.

ఈసంఘము కూడనిసమయములో రీచిస్టాగు కూడుటకు వలను పడదు. కాని, రీచిస్టాగు కూడకపోయినను, నీసంఘముకూడవచ్చును. ఈసంఘమువారిలో మూడవంతుల మెంబర్లుకోరినయెడల నీసంఘము కూడకతప్పదు. రీచిస్టాగువలెగాక, ఒకసెషను ఆఖరుకాగానే దీనిపని పూర్తికాదు. ఇదితిరిగి కూడినపుడు వెనుకటిసెషనులో ఆపబడినచర్చను సాగించును. ఈసంఘములో చర్చజరుగునపుడు బయటిప్రజలను రాకుండచేయవచ్చును. కాబట్టిఇంగ్లాండుదేశపు కాబినెటులోవలెనే దీనిలో కూడరహస్యపుచర్చలుజరుగుచు మంత్రివర్గములో భేదాభిప్రాయములు బయటిప్రజలకు తెలియకుండ నుంచవలసి వచ్చుచుండును.

### కార్యనిర్వాహకశాఖ.

ఈశాఖలో చక్రవర్తియు, మంత్రియు ప్రధానులు. చక్రవర్తి యనగా వంశపారంపర్యపు హక్కుగల రాజని జనులు సాధారణముగ ననుకొనెదరు. కాని జర్మనీసామ్రాజ్యతంత్రములో చక్రవర్తి అట్టివాడుకాడు. ఆయన ప్రష్యారాష్ట్రమునకు రాజు. ఆయనకు సామ్రాజ్యకిరీట మొకటి వేరుగ నేర్పడియుండలేదు. సంయుక్తరాష్ట్ర నిబంధనలలో, ప్రష్యారాష్ట్రపురాజు, యీసామ్రాజ్యమునకు చక్రవర్తిగానుండి పనులు జరిగింపవలెనని మాత్రమే యున్నది. ఎవరైనను, ఆరాజు మైనరుగగాని, పిచ్చివాడుగగానియుండి, ప్రష్యారాష్ట్రపు చట్టముప్రకారము, ఆదేశమునకు ఒక మేనేజరు యేర్పడినయెడల నిమేనేజరే చక్రవర్తిగా నుండును.

సంయుక్తరాష్ట్ర సేనలన్నిటికిని, చక్రవర్తియే సేనాధిపతిగ నుండును. తక్కిన విషయములలో అన్ని రాష్ట్రములకును, బూండెస్రాతు ఆజ్ఞలకు లోబడి, ప్రతినిధిగా పనులను జరిగించును. విదేశములతో సంబంధించు విషయములలో అనగా వానితో సంధులను చేసికొనుట, యుద్ధముచేయుట మొదలగువానిలో, బూండెస్రాతు యనుమతిమీదనే యీయన వ్యవహరించును. అవిధేయతతో సంచరించు రాష్ట్రమును, బూండెస్రాతు తీర్మానము ననుసరించి శిక్షించుచుండును. శాసననిర్మాణశాఖ కూడుటకును, మఱియొకదినమునకు నిలుపుదల చేయుటకును, సెషను నాపివేయుటకును ఆజ్ఞనిచ్చుచుండును. బూండెస్రాతు అంగీకారము తీసికొని రీచిస్టాగును ఛిద్రముచేయును. చట్టములను ప్రచురపఱచి వానిని అమలులోపెట్టును. ఇట్లు అమలులో పెట్టుటకు కావలసిన నిబంధనలను సాధారణముగ బూండెస్రాతు ముందుగనే యేర్పాటుచేయుచుండును. చక్రవర్తిగారు, తన ప్రధానమంత్రిని, అనగా ఛాన్సలరును, మఱికొందఱు సంయుక్త రాష్ట్రోద్యోగులను తానే యేర్పఱచుకొనును. సాధారణముగా సంయుక్తరాష్ట్రచట్టములన్నియు, రాష్ట్రములే యమలులో పెట్టుచుండుటచేత, సంయుక్త రాష్ట్రోద్యోగులు కొద్దిగనేయుందురు.

పటాలములు, విదేశవిషయములలోతప్ప, తక్కిన సంయుక్త రాష్ట్రకార్యములలో చక్రవర్తికేమియు నధికారము లేదుగాని, ప్రష్యారాష్ట్రమునకు రాజగుటచేత నీయన కెక్కువ పలుకుబడియుండును. ప్రష్యారాష్ట్రమునకు రాజుగానుండుటచే బూండెస్రాతులో తనకిష్టమైనవారిని ప్రతినిధులనుగా నేర్పఱచుకొనును. వారిగుండా తనకిష్టమైనచట్టమును ప్రవేశపెట్టగలడు. చక్రవర్తిగా, తనకుచట్టనిరాకరణాధికారము లేకపోయినను, బూండెస్రాతులోనుండు తన ప్రతినిధుల మూలమునసంయుక్తరాష్ట్ర నిబంధనలలో మార్పులుగాని, సేనలుపన్నుల విషయమై మార్పులుగాని రాకుండచేయగలడు. చక్రవర్తిగా, సమస్తమైన సేనలకు సైన్యాధిపతిగానుండి, పెద్దయుద్యోగస్థులనందఱిని తానేయేర్పఱచుకొనును. ప్రష్యాదేశమునకు రాజుగా క్రిందియుద్యోగస్థుల

నేర్పఱుచుటయేగాక, సంయుక్తరాష్ట్ర సేనలనన్నిటినితనస్వాధీనములో నుంచుకొనుటకు అధికారముగలదు. చక్రవర్తిగా, తనమంత్రిచేత నొక బిల్లును తయారుచేయించును. ప్రష్యాదేశపు రాజుగా, తన మంత్రిచేత, బూండెస్రాతులో దానిని ప్రవేశపెట్టించును. ఆసంఘములో తన మూడవవంతు మెంబర్లచేతవోట్లువేయించును. చక్రవర్తిగారి పేరుమీద, అబిల్లును రీచిస్టాగులో ప్రవేశించపెట్టబడును. దానిలో నేయేమార్పులు తానంగీకరించునో వానిని బూండెస్రాతు పక్షమున అనగా తన మూడవవంతు ప్రతినిధుల పక్షమున తన మంత్రిగుండా ఆసంఘమునకు తెలియఁజేయును. బిల్లు ప్యాసయిన తరువాత చక్రవర్తిగా, తాను దానిని ప్రచురపఱచును. ప్రష్యారాష్ట్రములో రాజుగా దానిని అమలులో పెట్టును. రాజు తానుచేయుచున్న ప్రభుత్వమును గుఱించి చక్రవర్తిగా పైతనిఖీ చేయుచుండును. రాజ్య పరిపాలన మంతయు రాష్ట్రాధిపతులకే యీయబడినది. వీరందఱికి ప్రష్యాదేశపురాజే ప్రెసిడెంటుగా ఏర్పరచబడెను. ఈకారణముచేతకూడ ప్రష్యారాజు మఱికొన్ని యధికారము తీయబడినటుల యెంచుకొనవలయును.

ఈసంయుక్తరాష్ట్రములో మంత్రిసంఘములేదు. ఛాన్సలరు అనేపేరుతో ఒకమంత్రియుండును. తక్కిన యుద్యోగస్థు లీయన తాబేదార్లేగాని సోదరమంత్రులుకారు. ఈయన తనయజమానియైన ప్రష్యారాజునకే జవాబుదారుడుగాని శాసననిర్మాణశాఖలో నేసంఘమునకుగాని లోబడియుండవలసినపనిలేదు.

## న్యాయాధికారశాఖ.

ప్రతిరాష్ట్రములోనుండు కోర్టులే అన్నివిధములైన కేసులను విచారించగలవు. ఈకోర్టులు సంయుక్తరాష్ట్రచట్టములనుబట్టియే నడచుకొనుచుండును. సివిల్ క్రిమినల్ ప్రాశిజరుకోడ్లులు, సివిల్ కోడ్డు, పీనల్ కోడ్డు వాణిజ్యసంబంధమైనకోడ్డు యీమొదలగు నన్నిచట్టములు అన్నిరాష్ట్రములకోర్టులును గమనించి వానిననుసరించియే నడువవలయును. కాని యీకోర్టుల న్యాయాధిపతులందఱు తమరాష్ట్రప్రభుత్వములవారిచేత నియమింపబడి తమరాజుల పేరనే తమవిధ్యుక్తకార్యములను నెరవేర్చెదరు. ఈకోర్టులుగాక సంయుక్తరాష్ట్రమున కంతకు నొకకోర్టుయేర్పడియున్నది. రాజద్రోహపుకేసులను విచారించుటకును, జర్మనీసామ్రాజ్యమునకు సంబంధించినవిషయములలో అప్పీళ్లు విచారించుటకును ఈకోర్టుయేర్పడినది.

ఈజర్మనీ సామ్రాజ్యతంత్రమువలన మన మొకవిషయము గ్రహించనగును. మనయిండియాదేశము భాషలనుబట్టి విభజనచేయబడి ఆయాభాగములకు ప్రజాస్వామికమునిచ్చినయెడల బ్రిటిషు ఇండియా ప్రష్యారాష్ట్రమువలెనుండి దీనిప్రతినిధులును ఇండియాలో స్వదేశ సంస్థానములచేత పంపబడు ప్రతినిధులునుకలసి ఢిల్లీలో సామ్రాజ్య శాసననిర్మాణసభలో బూండిస్రాతువంటి సంఘముగా నేర్పాటుకావచ్చును. ఇండియాదేశములోనున్న ప్రజలందఱిచేతను ఎన్నుకొనబడు ప్రతినిధులందఱు రీచిస్టాగువంటి రెండవసంఘముగా నేర్పాటుకావచ్చును. ఆంగ్లేయ రాజకుటుంబములోనొకరు ఢిల్లీలో చక్రవర్తిగానుండవచ్చును. శాసననిర్మాణసంఘముయొక్క మొదటిశాఖలో బ్రిటిషు ఇండియానుండియే యెక్కువమంది మెంబర్లుయేర్పడుదురు గనుక ఆంగ్లేయచక్రవర్తి ప్రష్యారాజువలెనే సంపూర్ణాధికారము కలిగియుండును. ఈసభలో బ్రిటిషు ఇండియా మెంబర్లలో కొంతమందిని బ్రిటిషుప్రభుత్వమువారే నియమించుకొనవచ్చును. తక్కినవారు ఆయా రాష్ట్రములనుండియే యెన్నుకొనబడవచ్చును. ఇండియాలోనుండు స్వతంత్రప్రభువులొక్కొకప్రతినిధి నీసభకుబంపవచ్చును. ప్రస్తుతము పదిలక్షల జనులకొక ప్రతినిధినిచ్చుచు నియామకుల కట్టియోగ్యతలుండవలెనో బ్రిటిషు గవర్నమెంటువారేయేర్పరచవచ్చును. వీరిచే నెన్నుకొనబడు ప్రతినిధులందఱు 350 మందికంటె నెక్కువమందియుండరు. ఈప్రజాప్రతినిధిసంఘమువారు ప్యాసుచేయు బిల్లులను శిష్టసభవారంగీకరించినగాని అవి చట్టములుగ మారనేరవు. ఈరెండుసంఘములు ప్యాసుచేసినను చక్రవర్తిగారుతమ నిరాకరణాధికారము నుపయోగించవచ్చును. ఈశిష్టసభలో మెంబర్లకును వీరినియామకులకును నెక్కువ యోగ్యతల నేర్పఱచవచ్చును. పరదేశీయులతోజరుగు వ్యవహారములన్నియు బ్రిటిషుప్రభుత్వమువారు చక్రవర్తికిని యీసభకునుమాత్రమే వదలివేయవచ్చును. భాషలప్రకారమేర్పడిన ప్రతిరాష్ట్రమునకు గవర్నరును నియమించుటకు బ్రిటిషుప్రభుత్వమువారికే యధికారముకలదు. కాని శాసననిర్మాణ కార్యనిర్వాహకాధికారములు ప్రజలకేయుండవలెను. సంయుక్తరాష్ట్రాధికారులకు దేశమునకంతకు సంబంధించిన విషయములలోపూర్ణమైన స్వతంత్రాధికారము కలిగియుండవలయును. ఢిల్లీలో ఒకసుప్రీముకోర్టునేర్పఱచి దేశములోనుండు అన్నికోర్టులమీదను అప్పీలుఅధికారము కొంతవిలువగలకేసులలోను, రాష్ట్రములమధ్య సంభవించుకేసులలోను ఒకరాష్ట్రమునకును మఱియొకదాని పౌరులకు గల కేసులలోను దానికీయవలయును. ఇది మనవారికి అసాధ్యమైన యాదర్శముకాదు. క్రమక్రమముగ బ్రిటిషుసామ్రాజ్యమిట్లు పరిణమించుననుటకు ఏవిధమైనసందేహములేదు. ఇది శీఘ్రకాలములో రావలెనన్నయెడల మనవిద్యాధికులు జనులలో రాజకీయవిద్యలను ప్రబలము చేయవలయును.

# కో న సీ మ.

[ ఆచంట సూర్యనారాయణరాజుగారు. ]

శ్రీమన్మహాభారతదేవీ కంఠప్రదేశమున విరాజిల్లు ముత్యాలహారమువలెను, భారతదేవి కంఠమునందు దాల్చిన నానాపుణ్యక్షేత్ర రత్నహారమున దారమువలెను జెన్నారి దేవతరంగిణి యను నామము వడసి నదులలో బేరొందిన త్రిలోకపావనియైన గంగానదికి జ్యేష్ఠ సోదరి యనియు, దక్షిణగంగ యనియు పరువనామములు దాల్చి భరతఖండమున మఱియొక దేనికిని లేని మహాత్మ్యగుణాపహారిణి యను బిరుదాంకితము వహించి, కేవలము భగవంతుని యవతారమని హిందువులు నమ్మి పూజించుచుండు శ్రీరామచంద్రుని దన సమీపమున బదునాల్గేండ్లు నిలుపుకొనిన గోదావరీ స్రవంతి నాసికాత్ర్యయంబకముకడ జన్మమొంది దండకారణ్యమున జాల వఱకు బ్రవహించి దన సమీపముననున్న పెక్కుస్థలముల బుణ్యక్షేత్రములుగా నొనర్చి రానురాను రాజమహేంద్రవరము విజయేశ్వరము మధ్యనాలు క్రోశముల వెడల్పు గలిగి ధవళేశ్వరము నొద్ద యేడుపాయలైనది. అందంతశ్శాఖల మధ్యప్రదేశము మిగుల సారవంతమయినదై యేటేట గౌతమీనది ప్రసాదమగు వండ్రుమట్టిని జేర్చుకొని గోదావరీ మండలములోనున్న సర్వప్రదేశముల నతిశయఖ్యాతివహించియున్నది. ఈప్రదేశమునకే కోనసీమ యనిపేరు. ఇయ్యది అమలాపురము తాలూకాలో సగమును నగరముతాలూకా యంతయు నాక్రమించియున్నది. గోదావరీనదిచే నావృతమైన యీ కోనసీమ తనలో నివసించుజనులకు సంతతాహ్లాదదాయినియు నిత్యఫలప్రదాయినియునై వారిని నానందాబ్ధిని నోలలాడించుచుండును. ఈసుక్షేత్రము వండ్రుమట్టితో గలిసిన గరపభూమి యగుటచే వరిపంటకు బనికిరాక ఫలవృక్షములు పెరుగుటకు యోగ్యమయినది. పరప్రదేశములలో గాని యితరస్థలముల బెరుగని కమవృక్షములు తప్ప దక్కిన సర్వఫలవృక్షములీకోనసీమలో నలపండువుగా బెరుగుచుండును. ఈకోనసీమలో కొబ్బరితోటలు మెండు. తరువాత పోకతోటలును అరటితోటలును లెక్కకు వచ్చును. ఇంక నారింజచెట్లు బటేవియా నారింజచెట్లు, దబ్బచెట్లు పంపర పనసచెట్లు, పనసచెట్లు, నిమ్మచెట్లు, దానిమ్మచెట్లు, వెలగచెట్లు, మామిడిచెట్లు, అంటుమామిడిచెట్లు విశేషముగా బెరుగును. విలువగలతోటలతో వర్ణనీయమగు నీసుక్షేత్రఖండములో గొన్నిప్రదేశములలో నెకరమొక్కటికి వేయి మొదలు పన్నెండువందల రూపాయలవఱకు విలువ నొసంగుదురు. ఈకోనసీమ సౌఖ్యము వేసవికాలమున ననుభవింప నర్హము. రోళ్లు పగులగిన రోహిణీకార్తిలో సరిగా మేనెలలో గొడుగయిన నక్కఱలేక కోనసీమలో నొకచోటనుండి మఱియొకచోటికి రెండుజాములవేళ సూర్యరశ్మి సోకకుండ బోవచ్చును.

పుల్లేటికుర్రు, మోడేకుర్రు, అవిడి మొదలగు కొన్నిస్థలములు కోనసీమకు మధ్యప్రదేశములు. ఇచ్చట గొబ్బరి గెలలో రెండువందలకు మించిన కాయలుండునని చెప్పినచో నీప్రదేశ మెంత ఫలవంతమగునదో యోచింపదగును. నగరము తాలూకాలో కొబ్బరితోటలును అరటితోటలుమాత్రము గలవు. వసిష్ఠావైనతేయముల తీరమున నీకొబ్బరితోటలెంతో శృంగారముగా నుండును. ముదిరిన పోకబద్దతో నిచ్చటి కూలివాండ్రతి నేర్పుగా గొబ్బరికాయల నొలుతురు. గంగాబోండమను పేరుగల కాయలలోని నీరు మంచి దాహముగల యిద్దరు మనుష్యులకు సరిపోవును. ఆనారికేళోదకము మిగుల రుచికరమైనది. ఈకోనసీమలోనే కొబ్బరినూనె తీయుదురు. నారతో త్రాళ్లు పగ్గములు మోకులు మొదలగునవి యల్లుదురు. రాలిన కమ్మలు వంటచెఱుకునకును, అచ్చటచ్చట నింటి పైకప్పులకు వినియోగింపబడును.

పోకచెట్లు మిక్కిలి సుకుమారములగుటచే బసిబిడ్డను పెంచినట్లు పెంచవలయును. ఈతోటలుగల వా

టికి హిమవంతఋతువు గడచినది మొదలు తొలుకరి వానలు కురియువఱకు పనిమెండు. ప్రతిదిన ముదయమున నీరు తోడవలయు. ఒక్కనాఁడు తోడకపోయినను పూవ తయు రాలిపోవును. వేసవికాలములో నుదయమునఁ బోకతోఁటలోనికిఁ బోతిమేని నిర్మిదని వివరింప శక్యముకాని యొక చక్కని పరిమళముతోఁ గూడిన చల్లనిగాలి సోఁకును. నానావ్యాకులములుగల వాఁడీతోఁటలలోఁ దిరుగుచుండెనేని వాఁడు తన వ్యాకులమ లెయు విస్మరించి యీశ్వరుని సృష్టిమహిమకు నాశ్చర్యపడుచు నానందమగ్న హృదయుఁడగును. తెల్లవాఱుసరికి పోక పొత్తులు చెట్లక్రింద వెండి కంచములవలె రాలియుండును. ఆసీమవాసులు భోజనపాత్రలగా నుపయోగింతురు. పచ్చళ్ళు మొదలగునవి యుంచుకొను దొన్నెలుగా నుపయోగపడును. వేసవికాలములో ననుదినము నీరు తోడవలయునుగాన నానీటి కాలువలకు బ్రక్కను పొట్ల, బీర, దొండ, కాకర, నీటి వంగచెట్లు రైతులు నాటుదురు. అవి విరివిగా కాయుటచే నచ్చట లభియింపని కూరలు వేసవికాలములో కోనసీమలో దొఱుకును. ఆ కూరలెతో రుచికరములు. నిలువుడేసి పొట్లకాయలును, పదునాలుగంగుళముల పొడవుగల కాకరకాయలును కాయును. యుక్తకాలమున దుంపకూరలు పుష్కలముగా లభించును.

శర్కర కదళీవనములు మితిమీఱియున్నవి. ఈ తోఁట యెకరమునకు రెండువందల రూపాయలకు మించు రాఁబడి తెచ్చును. అన్నిజాతుల యరటితోఁటలును పెరుగుచుండును. ఏకాలమునఁ బండవలసిన పండ్లా కాలమున లభించును. సంవత్సరములో నొకటి రెండు నెలలేమో కాని తక్కిన సర్వదినములందును బాఁడపండ్లును వెలగపండ్లును దొఱుకును. వెలగపండులో లెక్కపెట్టదగిన యనగా రమారమి యిరువదియైదు గింజలు మాత్రమే కలిగి మంచి రుచిగల గుంజుండును. జనవరినెలలో పనసపండ్లును, ఆశ్వయుజమాసములో మామిడికాయలను బడయుకోరువాఁడు కోనసీమ దిగినచోఁ గృతార్థుఁడగును. పనసపండ్లు మిక్కిలి మెన్నిక పొందునవి సంపాదింపవచ్చును. చేయిపట్టనంత తొనగల పండ్లుకూడఁ గలవు. వేఱుపనసచెట్లుకూడఁగలవు.

ఇంక మామిడిచెట్ల రకము లనంతములు. లోకములోనుండు నన్నివిధముల రసాలఫలములును దొఱుకును. మిక్కిలి చౌకగ కూడ లభియించును. పండబాఱిన పిదప నొక్కకాయనైన దక్కకుండ పక్షులేచెట్లకాయలన్నిటి ననుభవించి బాగుగా పీల్చివేసిన టెంకలు మాత్రము దిగువ విడిచిపెట్టు నంతటి మాధుర్యముగల మామిడిపండ్లు కోనసీమలో ఫలించును ఈ సీమలో మాచవరము గ్రామమునకు సమీపమునగానున్న "అంబాజీపేట" యను చిన్నగ్రామములోఁ బ్రతి బుధవారమున గొప్ప సంతకూడును. దానికి వేసవికాలములోఁ బండ్లు కొనఁదలచి పోయిన క్రొత్తవానికి నిజముగాఁ బిచ్చియెత్తి, రూపములోనేమి, ఆకృతిలోనేమి, సువాసనలోనేమి, మాధుర్యములోనేమి [illegible]యన నూతనములైన మామిడిపండ్లును, పనసపండ్లును, శర్కర కదళీఫలములు (చక్రకేళీ) ఒకదానిమించి యొకటి కనఁబడుచుండునుగాను నేదియుఁ గొనలేక చిక్కులుపడును. వేసవిలో అంబాజీపేట సంతకుఁ బోయి వచ్చినవానికి ఘ్రాణశక్తి మాఱిపోయి కొన్నిదినము వఱకు పండ్లవాసన పోదు.

వేసవి శ్రీమహాలక్ష్మి గోదావరీ విహారమునకు వచ్చి సముద్రమునుండి వచ్చు చల్లనిగాలి సోకుచుండఁగా నచ్చట విర్పుండినపుడు గ్రహరాజగు సూర్యుడు తన్నుఁ జూచి నిజ కులాంగన యగుటచే నాతనిదృష్టి తనపైఁ బడకుండ జక్కని ఛత్రమువిప్పి దానినీడలోఁ జల్లనిగాలి ననుభవించుచున్నదని యూహింపఁదగు.

ఆహా! తినుట కాహారముకాని త్రాగుటకు నీరుగాని శ్రమనిర్చుకొనుట కొక్క వృక్షముగాని లేక బాగులు బాగామనుచుండు నెడారులను, సర్వకాలముల నిష్టమగు నాహారమును స్వాదు జలములును, సూర్యరశ్మి యేనాఁడు సోఁకని నీడయు గలిగిన యిటువంటి ఫలవృక్షములఁ నిండియుండు ప్రదేశములనుస్మరియించి యీశ్వరుఁ డొనర్చిన యపార మహిమలు వెల్లడించుట చేత నాతని మహామహిమ కాశ్చర్యము చెందుట తప్ప నరుఁ డంతకంటెను సేయఁగలఁడు.

# వర్గీకరణము - శాస్త్రాభ్యసన సాధనము.

[మంత్రిప్రెగ్గడ సాంబశివరావుపంతులుగారు బి.ఏ., ఎల్.టి.]

చిరకాలమునుండియు మనుజుడు జ్ఞానసంపాదనయందత్యంత యభిలాష గల్గియుండెను. శరీరవాంఛలు దీరినవెంటనే వాడు బాహ్యప్రపంచమునందలి ప్రతివస్తువును తన యింద్రియములకు గోచరమగునంతవరకు పరీక్షించి ఆయాయింద్రియములచే గ్రహించుటకు వీలైనవాని గుణములను గ్రహించును. ఇట్లు సంపాదించిన జ్ఞానశకలముల సంఖ్య కాలక్రమమున వృద్ధినొంది, ఒకేవిధమైన సందర్భములకు పౌనరుక్తము గలిగినప్పుడు, ఆకారణములచే గలిగినకార్యములకు గూడ పౌనరుక్తము గలుగునని మనస్సుకు తట్టక మానదు. కార్య కారణ సంబంధములను, చక్కగా నరయుటయే మన లోకానుభవమునకు మూలము. ఇట్టి జ్ఞానము శైశవమునుండియు కలుగును. ఒక చిన్న యుదాహరణము. పసిపిల్లవాడు ఉయ్యెలలో నేడ్చుచుండ, తల్లి సామీప్యమునకు వచ్చినతోడనే రోదనము మాని ముఖవికాసము జెందును. దీనికి కారణమేమి? ఇదివరకొకసారి తానట్టి స్థితియందుండినప్పుడు, తల్లి వచ్చి యోదార్చి తనకు కావలసినదాని నిచ్చునదను జ్ఞానము తప్ప వేరేమున్నది. ఆకాశము నీలమేఘాచ్ఛాదితమై ఉరుములు మెరుములతో సంక్షోభించుట చూచినవెంటనే వర్షధారలు భూమికిదిగుట ఒకసారి చూచినప్పుడు, తిరిగి మరియొకసారట్లు ఆకాశంబున జలగర్భితములైన జలదంబులు గుమిగూడి కారుమబ్బులచే రోదసీ కుహరంబును నింపుచుండ, వర్షమురావచ్చునని సూచించుటకు భవిష్యత్ జ్ఞానము కావలెనా? ఈవిధముగా తనయనుభవములను వేరు వేరు వర్గములుగా విభజించును. అట్లు విభజించుట "వర్గీకరణము" అనబడును. ఇట్లువర్గీకరింపబడిన జ్ఞానసంపుటమునకే "శాస్త్ర"మని పేరు. ఈవిషయమును మరికొన్ని యుదాహరణములవలనబోధ జేయనగు. మనుష్యుడు కాలుజారినప్పుడు నేలగూలుటయు, చెట్టునుండి పండు తొడిమ సళ్ళినప్పుడు నేలకుజారుటయు, చేతిలోని వస్తువు చేతినుండి తొలగినప్పుడు భూమిమీదపడుటయు, బంతి నెగరవైచిన భూమికి దిగుటయు, లోకానుభవమువలన గలుగు జ్ఞానలేశములు. ఇవన్నియు నొక్కసారిగా దెలిసినవిగాక అప్పుడప్పుడుగలిగిన తాత్కాలిక జ్ఞానములు. వీని నన్నిటిని నొక్కసారిగా నొకచో సమకూర్చి, నొకదానితోనొకటి పోల్చిచూచిన వాని యన్నిటియందును నొక సామాన్యధర్మము గన్పట్టును. అది యేదనిన "దేని సాయము లేక, నిరాధారముగా నాకాశములోనుండు పదార్థము భూమిమీదికిబడును" అను నూతనవిషయము. మనస్సింతటితో తృప్తినొందక అట్లు సంభవించుటకు గల కారణ మరయును. అదేదనిన, భూమి తన సమీపమున నున్న ప్రతివస్తువును తనవైపున కాకర్షించును.

ఈజ్ఞానము మనకెట్లుగల్గెనో కొంచెమాలోచించి చూచిన అది మూడుతరగతులుగ మనకు సంప్రాప్తమైనదని దెలియును.

1. అవలోకనము అనగా లోకానుభవమువలన ఇంద్రియముల సాహాయ్యమున గలిగిన జ్ఞాన శకలములు. ఇవి మనోగతములై కావలసినప్పుడు ఉపకరించును.

2. వానినన్నిటిని నొకచోజేర్చి, పోల్చి, సామాన్యధర్మమును గ్రహించి వానినొక తరగతిలోనికి జేర్చుట. ఇదే వర్గీకరణము.

3. ఇట్టి సామాన్యములుండుటకుగల కారణము నరయుట. ఇది కేవలము మనోప్రపంచమునందలి యంశము. ఇందు మనస్సు మనోగతములైన యంశముల విడిచి ముందుకొక యంజవేయును. దానివలన "సామాన్యనియమ" మొకటేర్పడి వీనినన్నిటిని గుదిగూర్చి యొక "సంపుటీజ్ఞాన" మేర్పడునట్లు జేయును. ఇట్టి సంపుటీ జ్ఞానమే పరిపక్వముజెందిన జ్ఞానము. ఇట్టి జ్ఞానమువలన గతించిన

వానిని మనోగతములు జేసికొనుటయేగాక, రాబోవువా
నిని సూచించుటకుగల శక్తిగూడ గల్గును. అట్టి శక్తి
గల్గినవాడే "శాస్త్రజ్ఞుడు." కాబట్టి శాస్త్రజ్ఞుడనిన శాస్త్ర
ము తెలిసినవాడుమాత్రముగాక, శాస్త్రమును తనమనో
బలముచే వృద్ధిచేయువాడు.

శాస్త్రము లనేకవిధములు. అందుకొన్ని మను
జుని జీవితసౌఖ్యము నన్నివిధముల వృద్ధిజేయును. అందు
ముఖ్యములైనవి ప్రకృతిశాస్త్రములు. కాబట్టి ప్రకృతి
శాస్త్రజ్ఞానము ప్రతిమనుజునకును నవసరము.

ఈవిషయమునే విస్తరించిచెప్పుటకు వివిధశాస్త్ర
ములనుండి యుదాహరణము గ్రహింపనగును.

నిరాధారమైనవస్తువు భూమిమీదబడును అని
పదార్థముల కన్నిటికిగల ఒక సామాన్యధర్మమును గ్ర
హించితిమిగదా! ఇతరవస్తువులకన్నిటికిని భూమియాధా
రమును గల్పించుచున్న, భూమి దేనిమీద నాధారపడి
యున్నది? ఆధారములేక నిలుచుటెట్లు? అట్లయిన మన
ము గ్రహించినదానినిబట్టి భూమి దేనిమీదనో పడవలసి
నదేకదా! ఇట్లే సూర్య, చంద్ర, అంగారకాది గ్రహము
లును దేనిమీదనో పడవలసినవే గదా! అట్టి యాపద
లేమియును సంభవింపక, ప్రతిగ్రహమును తనగతిని దాను
గల్పించుకొని, దాని నెంతమాత్రమును తప్పక క్షణముల
ప్రకారము ప్రచారముచేయుచున్నవను విషయము అంద
రకును దెలిసినదే. అట్లు వానికి నియమితగతులు లేక
పోయిన గ్రహణకాలాది నిర్ణయములు జేయుటకు వీ
లుండునా? కాబట్టిఇట్టి సృష్టివైచిత్ర్యమునకు కారణముండ
వలయును, కారణములేని కార్యముండుట యసంభవము
గదా! ఇందుకు తగినకారణము ఇంద్రియములకు గోచ
రించునదేదియు లేకపోయినను, ఇంద్రియాతీత విషయ
ములను గ్రహించు మనస్సేంద్రియమునకు పొడగట్టక
పోదు. భూమి యితరవస్తువులను ఆకర్షించినట్లే ఇతర
వస్తువులన్నియు భూమిని యాకర్షించుచుండవలెను. ఇట్టి
పరస్పరాకర్షణమే అనంతగోళములను గతులుతప్పక నడు
పుచున్నది. ఆయాకర్షణమునే శాస్త్రజ్ఞులు 'భౌతికాకర్షణ
మ'ని చెప్పుదురు. ఇచ్చట 'గరిమ' నుండి భౌతికాకర్షణము
నెట్లు గ్రహింపగలిగితిమో చదువరులు తమ మనోవృత్తు
లను పరీక్షించుకొనెదరుగాక.

ఇక నోషధిశాస్త్రమునుండి యొకవిషయమాలో
చింతము. సాధారణముగా వృక్షము పుష్పించు కాలము
నందే తుమ్మెదలు, తేనెటీగలు మొదలైనవి వాని నాశ్ర
యించి యుండును. అవి తమ శరీరపోషణార్థమై మధు
పానముకొరకు వచ్చెదవనుట సత్యమే. అయితే మన యవ
లోకన మింతటితో ముగియవలెనా? తుమ్మెదలు వచ్చిన
వనమునందలి వృక్షములు కొలదికాలములోనే ఫలసం
భరితములై, తుమ్మెదలను రాకుండ నేవిధమైన నాటంక
ములను గల్పించిన నక్కడివృక్షములు ఫలశూన్యములై
యుండుటయు నవలోకనాంశమే. అయితే తుమ్మెదలకును,
పిందెలు గల్గుటకును నేదైన సంబంధముకలదా? తుమ్మె
దలు మొదలైనవానిని రాకుండ నాటంకములు గల్పించి
నప్పుడు, ఆవనమునందలి పుష్పములన్నియు రాలిపోవును
గాని, కాయలు పుట్టనే పుట్టవు. ఏలయన రజోసంసర్గము
అనగా స్త్రీ పురుషసంయోగము లేక పిందె పుట్టనేరదు.
అట్టి సంయోగమునకు కారణము ఈకీటకాదులు. చెట్ల
విషయములో స్త్రీ పురుష వివక్షత యేమియని యడుగ
వచ్చును. మనము శ్రద్ధగా కొన్నపుష్పములను పరీక్షిం
చిన వానిలో నొకటి పురుషాంగము, మరియొకటి స్త్రీ
అంగము. ఈ రెంటి సంయోగమే కాయ కాచుటకు
కారణము.

ఈజ్ఞానశకలములన్నిటిని జేర్చిన, వృక్షవర్గములో
గూడ స్త్రీ పురుష వివక్షత యేర్పడి, వీనికిగల పరస్పర
సంబంధములవలననే జాతియొక్క చిరంజీవత్వము యేర్ప
డుచున్నదని తేలుచున్నది. స్త్రీపురుషాంగములు కొన్ని
పుష్పములయందు కలిసియుండుటయు, కొన్ని చెట్లయందు
అవి ఒకభాగమునందు, ఇవియొక భాగమునందు ఉండు
టయు మరికొన్ని చెట్లయందు అవియొక చెట్టునందు, ఇవి
యొకచెట్టునందు ఉండుటయు తటస్థించును. ఇట్టి భేదము
లన్నిటిని కనిపెట్టి వృక్షములను వివిధ వర్గములుగా విభ
జించనగు. ఏదైన నూతనవృక్షము దొరకినపుడు దాని
గుణములనుబట్టి, ఇదివరకుగల వర్గములలో జేర్చుటగాని,

లేదా దానికొక నూతనవర్గమును గల్పించుటగాని అవసరమగును. వర్గములయొక్క గుణములను తెలిసికొనిన, అందలి భాగములను తెలిసికొనుట మిక్కిలి సులభము. అందుచేత శాస్త్రమును సాధించుట సుకరము. లేనియెడల ప్రతిదానిని వేరువేరుగ గ్రహించవలసిన ఒకని జీవితకాలముచాలదు. ఒకశాస్త్రమునకె జీవితకాలము చాలక పోయిన, దినదినాభివృద్ధి జెందుచున్న వివిధశాస్త్రముల రహస్యముల గ్రహించుటెట్లు! కాబట్టి వర్గీకరణ మొక ముఖ్యమైన శాస్త్రసాధనము.

రసాయన శాస్త్రమునుండి ఒక యుదాహరణమును దీసికొని వర్గీకరణముయొక్క మరికొన్ని యుపయోగములను జూపనగు. ఏసిద్ధాంతమైనను నిజమైనదా కాదాయని పరీక్షింపవలసినప్పుడు, మనకిదివరకు తెలిసినట్టివిషయములకు సరియైన సమాధానమని చెప్పుచున్నదా లేదాయని పరీక్షించుటమాత్రముతో తృప్తినొందకూడదు. అది భవిష్యత్ సూచనకు సోపానమేర్పరుచున్నదా లేదాయనిగూడ విమర్శింపవలెను. అట్లుచేయగల్గినప్పుడే యదినరియైన సిద్ధాంతము.

శాస్త్రజ్ఞులు ఇప్పటివరకు తెలిసికొన గలిగిన మూలద్రవ్యములు 80 వరకుగలవు. ప్రతిపదార్థమునకు భారమొక సహజధర్మమగుటచేతను, ప్రతిపదార్థమును పరమాణు సంయోగమువలన బుట్టుచుండుటచేతను, పరమాణువులకు గూడభారము గలదని గ్రహింపవచ్చును. కాబట్టి ప్రతిద్రవ్యమునకును పరమాణుభారము గలదు. పరమాణుభార మంతకును మూలద్రవ్యముల గుణధర్మములకును ఏమైన సంబంధముగలదాయని శాస్త్రజ్ఞులు పరిశోధనలుచేసిరి. వారిలో నొకడు మూ ద్రవ్యముల నన్నిటిని వానిపరమాణుభారముల సంఖ్యాప్రకారము వరుసగా గుదిగూర్చిచూచెను. అప్పుడు కొన్ని ద్రవ్యముల తరువాత మొదటిదానితో సమానధర్మములుగల ద్రవ్యము కనబడెను. దానితరువాత దానికి రెండవదానితో సమానధర్మములు గన్పట్టెను. ఇట్లువిభజింపబడిన మూలద్రవ్యములపట్టిక ఈక్రింద జూపబడినది.

మూలద్రవ్యములును వానిపరమాణువు వివరములు.

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|---|
| సౌఁమము | గ్రావము | విదురము | టంకము | అంగారము | నత్రజని | అమ్లజని | ప్లవము | ... |
| 4 | 7 | 9 | 11 | 12 | 14 | 16 | 19 | ... |
| న్యనము | సోడియము | మగ్నము | స్ఫటముళే॥ అలూమన | శైలము | స్ఫురము | గంధకము | హరికము | లోహము- నిసిలను కోబర్టు |
| 20 | 23 | 24½ | 27 | 28½ | 31 | 32 | 35½ | 56.58½.59 |
| అర్గనము | పొటాసియము | ఖటికము | స్కాందము | తితనము | వనాటము | క్రుమము | మాంగిన | ... |
| 40 | 39 | 40 | 44 | 48 | 51 | 52 | 55 | ... |
| | తామ్రము | యశదము | గాల్లము | శార్మణ్య | కాలము | సోమము | స్తంభము | రుదేనము |
| ... | 63½ | 65½ | 70 | 72 | 75 | 79 | 80 | హ్రాదము- |
| త్రప్తము | రూపదము | స్త్రాంతము | యిత్రము | జిర్మనము | నిరోబ | మోలదము | | పలాడము |
| 82 | 85½ | 87½ | 89 | 90½ | 94 | 96 | ... | 102- 103 |
| ... | రజతము | కాద్మము | ఇందము | వంగము(త్రగర) | అంజనము | భామము | అదము | 104 |
| | 103 | 112 | 114 | 118½ | 120 | 125 | 126.9 | ... |
| యినుము | శ్యామము | ఖారము | లందనము | ... | తంతలము | తుంగనము | ... | ... |
| 128 | 133 | 137 | 138 | ... | 183 | 184 | ... | — |
| ... | ... | ... | యితర్వము | సీనము | బిస్మతు | ... | | ఓస్మము ఖ- |
| | | | 173 | 207 | 208 | | | ప్లాటినము |
| ... | స్వర్ణము | పారదము | దాల్లము | దురము | వరుణ 240 | | | 191. 193- |
| | 197 | 200 | 204 | 232 | | | | 195 |

దీనినిబట్టి 1వ గడియందలి గ్రావము, సోడియ పొటాసియు ఇత్యాదులును 2వ గడియందలి విదురము, మగ్నము, ఖటికము ఇత్యాదులును ఈవిధముననే ఇతర గడులయందలి ద్రవ్యములును సమానధర్మములుగలవని గ్రహించునది. అనగా వానిలో నేమియు భేదము గన్న దని యభిప్రాయముగాదు. ఒకకుటుంబములోని వారి కందరకు నెట్టిసమానగుణములుగల్గియు వ్యత్యాసము లెట్లుండునో నట్టివిధముననే వీనికిగూడ పరస్పరసంబంధము లుండును. ఇవియే రసాయనిక కుటుంబములు. ఈకుటుం బముల సాహాయ్యమున రసాయనశాస్త్రము నభ్యసిం చుట సులభము. ఒకద్రవ్యము ఒకకుటుంబములోనిదని తెలిసికొనినవెంటనే దాని కాయాగుణము లుండవలెనని రూఢిగా జెప్పవచ్చును. అట్టిగుణములు దానియందు గన్న డనియెడల దానికికారణ మరయవలసివచ్చును. ఇట్లే శాస్త్ర మభివృద్ధిజెందును.

ఇదిగాక పైపట్టికయందు కొన్ని కాళీప్రదేశములు గన్పట్టుచున్నవి. అప్పటికిగల శాస్త్రజ్ఞానమునుబట్టి అస్థల ము నాక్రమించుటకు తగినద్రవ్యమేమియు లేకపోవుటచే అస్థలము విడువబడినది కాని అప్పటి శాస్త్రజ్ఞులు ఆగడి యందుండవలసిన ద్రవ్యము కుండవలసిన గుణములను మాత్రము సూచించిరి. అట్టిద్రవ్యములు వారుచెప్పినట్లు గా తరువాత కనుగొనబడినవి. ఇప్పటికిని కొన్నికనిపెట్ట బడవలసియున్నవి. ఇదియే వర్గీకరణ పద్ధతివలన గలిగిన ముఖ్యలాభము.

ఇట్టియుదాహరణము లెన్నియైనను నీయవచ్చును. అవి చదువరులకే విడిచిపెట్టబడినవి.

సింహావలోకనము:—మనకు శాస్త్రాభ్యసనమునకు మూడుమూలోపాయములు. 1. అవలోకనము. 2, వర్గీ కరణము. 3 సామాన్యనియమమును దెలిసికొనుట. ఇం దు మొదటిది ఇంద్రియవిదితమైనట్టి జ్ఞానమును, రెండవది ఇంద్రియాతీతము కాకపోయినను మనస్సహాయమునగలు గునదియు, మూడవది, ఇంద్రియాతీతమై కేవల మనో వికాసముచే గలుగునట్టిదియునైయున్నవి. మూడవస్థితిని చేరినజ్ఞానమే నిజమైనశాస్త్రజ్ఞానము. అట్టిశాస్త్రజ్ఞానము నకు మొదటివి రెండును సోపానములు. మొదటిసోపా నము ఇంద్రియజ్ఞానముగల ప్రతివానికినిసాధ్యము. కన్ను గలవాడు ప్రతివస్తువును చూడవచ్చును. చెవిగలవాడు వినవచ్చును. ఆయింద్రియములు లేనివారికే అట్టిజ్ఞానము లభింపనేరదు. చెవిటివాడు శంఖనాదమును గ్రహింపలేడు. అంధుండు నేత్రేంద్రియ సంబంధమైన సృష్టి వైచిత్ర్య ముల కెన్నటికినిదూరుడే. రెండవది సామాన్యలోకజ్ఞాన ముగల్గి కొంచెమైనను ఆలోచన చేయగల ప్రతివాని కినిసాధ్యము. మూడవది శాస్త్రజ్ఞులకే సాధ్యము. ఇది యోగులకుసాధ్యమైన తురీయావస్థవంటిది. ఈమూటినిబట్టి మనుష్యజాతినంతను 3 భాగములుజేయవచ్చును. నూటికి తొంబదికెక్కువగా మొదటిరెండుతరగతులలో జేరుదురు. తక్కినవారు మూడవతరగతిలోనివారు. వారే లోకోప కారులు. మహర్షులు. ఈశ్వరాంశసంభూతులు. ఇంత యేల భగవత్ స్వరూపులు.

The Image of Veerabhadraswamy
Carved on a stone Pillar at Madura.



మధురమంటప స్తంభమునందు జెక్కబడిన
వీరభద్రస్వామి,

The Image of Ganapati at Tanjore.



గణపతివిగ్రహము, తంజావూరు.



Emambara Mosque, Lucknow.

ఇమాంబారా మసీదు, లక్నో.



Juma Masjid, Bijapur.

జూమామసీదు, బిజాపురం.

Famons Indian Tableux, S!aged by the female Students.



చెన్నపురిలోని విద్యార్థినులచే ప్రదర్శింపబడిన పురాణ వృత్తాంతము.
సైరంధ్రీసింహబలునకు మద్యమునుగొనిపోవుట. శకుంతలాపత్రలేఖనము. దమయంతీవిరహము.

The Superintendent, Staff and pupils of the Training School at Madras.



విద్యాశిక్షణ పాఠశాలాధ్యక్షురాలు, సహాయోపాధ్యాయినులు, విద్యార్థినులు చెన్నపురి.



The Andhra Jateeya Kalasala, Masulipatam. ఆంధ్రజాతీయ కళాశాల, మచిలీపట్నము.



Masulipatam National College, Workshop ఆంధ్రజాతీయ కళాశాల యంత్రాగారము.

Blocks by Messers Neroy & Co.

# ఆంధ్రదేశ దక్షిణ భాగాంధ్రకవులు.

[వెన్నెలకంటి అప్పారావుగారిచే వ్రాయఁబడినది.]

ఏదోయొక సమయంబున నాంగ్లేయ మాసపత్రికయగు "స్ట్రాండుమాగజైను" నందు నొక్కొక కౌంటి (మనజిల్లాలకంటెఁ జిన్నదైన రాష్ట్రభాగము) యందుద్భవిల్లినట్టియు వర్ధిల్లినట్టియుఁ గవిబృందంబుల చారిత్రములనొక వింతనేర్పుతో నెవ్వరోయొక శీర్షికగా వ్రాయుచుండుటఁ గాంచితి. తదాదిగా ద్రావిడదేశముయొక్క సరిహద్దుగనున్న కతంబునను నేటికాలంబునఁగృష్ణా గోదావరీమండలములబోలె జలసమృద్ధి లేక ధనధాన్య సమృద్ధి కడమై దారిద్ర్యంబున మునిఁగిన కారణంబునను బై మండలవాసులచేఁ గొంతవరకు నాంధ్రదేశ బహిర్గతముగఁ బరిగణింపఁబడు నెల్లూరుమండల మాంధ్రమాతకు నెంతవరకుఁ దోడ్పడినదో, యందెట్టి మహాకవులు వర్ధిలియుండిరో యాంధ్రదేశవాసులకుఁ దెల్లంబుగఁ దేటపరుప నుద్యుక్తుఁడనై యుంటి. కాని యటులఁజేసినచో మిక్కిలి సామాన్య కవులఁగూడ లెక్కకుఁగొని రావలసివచ్చుననియు, నదియునుగాక పూర్ణమైన కవిజీవితములు చిక్కని కారణమున నాకు శ్రమయుఁగూడ నధికమగునని జంకితి. అటులొనర్చియుఁనంత లోతుగఁ బోయినచో నాంధ్రజనులకు రుచించునో రుచింపదో యనికూడ సందేహించి "ఆంధ్రదేశ దక్షిణ భాగాంధ్రకవు"లని ప్రథమమున వ్రాసి నాపోయినమార్గము సరియైనది యని తోఁచినచోఁ బూర్వపు సీమా విభాగముల ననుసరించి యొక్కొకసీమకు నొక్కొకవ్యాసము వ్రాసిన బాగుగనుండునని తలంచితి. వారి వారి యభిప్రాయానుసరణముగ నెవ్వరైన నాంధ్రదేశమును విభజించి యందలి కవిజీవితములు వ్రాసిన దేశోపకారంబగు. ఆంధ్రదేశ దక్షిణభాగ మెద్దియనియు, గుంటూరుమండలమందలి యుత్తరభాగమనగా బాపట్లకు నుత్తరభాగముకూడ నుత్తరాంధ్రభాగంబునఁ జేర్చిన బాగుండుననియుఁ గృష్ణా మండలవాసులు తలంచవచ్చు; కాని యది విభజన కానేరదనియుఁ బూర్వపు నెల్లూరుమండల భాగంబగు ఒంగోలుతాలూకాను నిప్పటి గుంటూరుమండల భాగంబులగు సత్తెనపల్లి, నర్సారావుపేట, వినుకొండ. గుంటూరుతాలూకాలకును భాషాచారాది విషయంబులలో భేద మించుకంతయును లేనికతంబునను గృష్ణానదికిదక్షిణభాగమంతయు దక్షిణాంధ్రదేశమన నొప్పియుండునని యిటుల విభజనఁజేసితి.

నన్నయభట్టుయొక్క కవిత్వము సలక్షణమైనది కాదనికాని, యాతఁడే ప్రథమాంధ్రకవియనిగాని నాయభిప్రాయముకాదు. భారతాది పర్వత్రయము ప్రథమాంధ్రగ్రంథముగా నందఱిచే భావింపఁబడుటచే బాల్యావస్థ దానికిని రూపింపఁబడియె.

ఆంధ్రభాషామతల్లి రాజమహేంద్రపురంబున జన్మించినందున బాల్యావస్థయందగు చిహ్నంబులే యందుఁగాన్పించెడు. శైశవమునందలి మాటలెంతయు ముద్దులు మూటకట్టుచున్నను లేఁబ్రాయంపు నొయారపురసము లొలుకుమాటలు కానేరవుకదా. బాల్యావస్థయందలి దోగాడుటలెంత సుందరముగఁ గాన్పించినను నిండు జవ్వనమందలి గజగమనముంబోలు మందయానముతో సరిపోలవుకదా. గలుగల్లుమని నెన్నడుమునను ముంగాళులను గింకిణీరవములు గలిగినను జిన్నతనఁపు దిసమొలకల బిడ్డఁడు మీగాళ్ళమీఁదఁ జిందులాడు పట్టుచేలముఁగట్టి సర్వలక్షణ కళాసంపూర్ణయగు మత్తకాశినితో సరితూగఁడుకదా. కనుక నాంధ్రభాషామతల్లి జన్మభూమి రాజమహేంద్రవరమే యైనను నామె కౌమారశోభలన్నియుఁగాంచు నదృష్టము సింహపురివాసులకే కలిగెఁగాని మఱెవరికి నబ్బదయ్యె. ఆమె తనకేళీవిలాసంబుతో విక్రమపురివాసుల నానందవార్ధి నోలలాడింపఁజేసె; తన వాగ్విలాసంబుచే నందలివారికి దిగ్భ్రమ గలుగునటులఁజేసె; తనకవిత్వ నైపుణ్యముచే నెల్లూరుమండలమును దేదీప్యమానంబుగ వెలుంగఁజేసె; "శ్రీయనగౌరి నాఁబరఁగు చెల్వల చిత్తము పల్లవింప భద్రాయతమూర్తియై హరిహరంబగు రూపముదాల్చి విష్ణురూపాయ నమశ్శివాయ యని గొల్చెదుభక్త జనంబులకు నాప్తమై విక్రమసింహపురివాసుల యోగనిద్రం జెందు నటులఁజేసె.

ఆంధ్రదేశము నంతయు గాలించిచూడుఁడు. తిక్కననాచనసోమనఁబోలు కవివర్యులును నీకవిద్వయమున కిష్టదైవంబగు హరిహరనాథుఁడును మఱెందైనను గానవత్తురేమో. ఈహరిహరనాథుఁ డెట్టివాఁడో కనుగొనవలెనన్నఁ జదువరులు భారతమునందలి పదునేను పర్వములయందలి యాశ్వాసారంభాశ్వాసాంత పద్యములఁ జూడనగునే కాని నాబోంట్ల కవర్ణనీయము. వేదాంతసారమంతయు నీపద్యములలోఁ బొందుపఱుపఁబడినదన నొకవింతకాదు. ఈపద్యముల నెవ్వరైనను దినపఠనంబొనర్చినఁ బురాణపురుషుండును గృష్ణద్వైపాయన వేదవ్యాసుండునునగు సాక్షాత్కారుణ్యమూర్తి చెంతంజేరుననుటకెట్టి యనుమానమును లేదు. ఇట్టి కవిద్వయము ముందర శ్రీకృష్ణరాయ సభాంతస్థలాష్టదిగ్గజములు భాసమానభాస్కరుని ముందలి దివ్వెలంబోలరే. పూర్వకాలంబునఁగడుఁబ్రఖ్యాతి గాంచి యిక్కాలంబునఁగూడ నాంధ్రమాతకు నెంతయోతోడ్పడుచున్న రాజమహేంద్రపురవరపు కవులుఁగూడఁజంద్రమండలము నావరించియుండు నక్షత్రకోటిలోఁ జేరుదురేకాని చంద్రునిం బోలనగునే! ఇక నెల్లూరుమండలము నెన్నఁడమా పూర్వకాలంబునుండి నేటివరకు నాంధ్రకవులలో శ్రేష్ఠులకుమాత్రమె యాకరంబైయున్నయది. కవిత్రయములో ద్వయమును నదియకదా యిచ్చినది. ఇటులన్నిటికిని మిన్నయగు కతంబున నాంధ్రదేశ దక్షిణభాగమందలి పట్టణం

బులన్నిటిలో నగ్రస్థానము విక్రమసింహపురి కిచ్చినవాఁడనైతి. ఇఁక నిందలి కవులనెటుల విభాగించెదమో చూతము.

1. తిక్కనసంతతి, 2. కంకంటి పాపరాజుసంతతి, 3. కాళహస్తి వెంకటగిరికవులు, 4. బమ్మెర పోతనామాత్య శ్రీనాథకవులు, 5. స్త్రీకవులు, 6. వెన్నెలకంటికవులు, 7. అప్పకవి బాలసరస్వతులు, 8. పంచతంత్రాంధ్రీకరణ కర్తలు. నెల్లూరుమండలకవులు. 9. గుంటూరుకవులు, 10. విద్యానగరకవులు.

నాయనంబునఁ బైవరుసలలోఁ (1) తిక్కనసంతతి. (2) కంకంటి పాపరాజుసంతతి (3) కాళహస్తికవులలో ధూర్జటిసంతతి గలుగఁజేయునట్టి యుల్లాసము మఱియొక సంతతివలనఁ గలుగనేరదని నిశ్చయముగఁ జెప్పవాఁడ. ఏలయన వినుఁడు. కవులలోఁ దఱుచుగ శ్రీవీరేశలింగముపంతులుగారు చింతిలినట్లు మత్సరము గనఁబడుచున్నను నదియాధునికులలోనేమి పూర్వులలోనేమి యుత్తరమున నే యధికముగనున్నటులఁ దోచును. ఒకరు తమయాధిక్యమును జూపుటచేతనేకదా మఱియొకరికి నోర్వలేమింబట్టి మత్సరమున కవకాశము గలుగుచున్నది. అయినను దిక్కనయజ్వనుబోలు జ్యోతి వెలుఁగుచున్నను నాజ్యోతినిఁ జూచి యప్పటికాలపుకవులాశ్చర్యనిమగ్నులై యాజ్యోతినావరించి యందలి కాంతిచేఁ బ్రకాశించు చంద్రునివలెఁ దామును బ్రఖ్యాతిఁగాంచఁగోరిరే కాని యాజ్యోతినడంచి తామే యాజ్యోతి కావలెనని ప్రయత్నము చేసినవారుకారు. ఆకాలపువారు వ్యర్థులుగనుక నటులఁజేసిరని పాఠకులు పొరఁబడుదురేమో! తిక్కనతో సమానుఁడైన నాచనసోముఁడుకూడఁ దిక్కనయం దత్యాదరణము నూనెననుటకు నాయన హరివంశమేసాక్షి. ఈతిక్కనయను మహాజ్యోతినిఁ జుట్టుకొని చిన్నజ్యోతులనఁబరఁగినట్టియు, నక్కారణంబునఁ దమ ప్రకాశమును గోల్పోక యందలి ప్రకాశమును హెచ్చించి జ్యోతిశ్చక్రమునకుఁ గల్గునట్టి మహావైభవమునకు సహాయభూతులై శాశ్వత బ్రహ్మకల్పముగఁ దమనామంబుల నిల్పుకొనినట్టివారి నామంబులను వారి గ్రంథములమాత్ర మిందుఁ బొందుపఱిచెద. (1) భారతారణ్యశేషమును, రామాయణమును, హరివంశమును, లక్ష్మీనృసింహపురాణమును రచించి శంభుదాసుండనియుఁ బ్రబంధపరమేశ్వరుండనియుఁ బ్రఖ్యాతిఁగాంచిన యెఱ్ఱాప్రగ్గడయు (2) శ్రీమత్సకలభాషాభూషణసాహిత్యరసపోషణ సంవిధాన చక్రవర్తి సర్వజ్ఞబిరుదంబులనంది విద్యానగర మహారాజులచే మన్ననఁగాంచి హరివంశమును రచించిన నాచన సోముఁడును (3)

గీ॥ కవితఁజెప్పి యుభయకవి మిత్రు మెప్పింప,।
నరిది బ్రహ్మకైన నతఁడు మెచ్చఁ।
బరఁగ దశకుమార చరితంబుచెప్పిన,।
ప్రోడనన్ను వేఱె పొగడనేల॥

యని చెప్పికొని యాంధ్రభాషాభూషణమను లక్షణగ్రంథమును, యాజ్ఞవల్క్యమను ధర్మశాస్త్రమును రచించి "యభినవదండి"యని పేరువడసిన కేతనయు (4) మార్కండేయ పురాణమును దెనిగించిన మారనయు నీతిక్కన సంతతిలోఁ జేరినవారు.

2. కంకంటి పాపరాజు సంతతిలోఁ జేరిన కంకంటి పాపరాజు పుష్పగిరి తిమ్మన్న ధరణిదేవుల రామమంత్రి వీరియొక్క మిత్రత్వమును, వీరియొక్క నైకమత్యమును వీరియొక్క పరస్పర శ్లాఘనయు నేరికైనను శ్లాఘనీయమే. ఇట్టి మిత్రకవిత్రయమును గనుగొనవలెనన్న నాంగ్లేయదేశమందో లేక యూరపుఖండదేశములందో వెదకవలెనేగాని మనయాంధ్రదేశమున నున్నటుల నాకుఁదోఁపదు. పైవారిలో ధరణిదేవుల రామమంత్రి తన కృతిపతింగూర్చి యిటులనభివర్ణించె.

ఉ॥ నారదమౌని! యేమి? సురనాథ! విశేషములేమి? వింటిరో
సారసగర్భుఁ జెంగటను శారదలేదట! యెందునిల్చెనో!
యారసిచూడుఁడా మగదలాన్వయదుగ్ధపయోధిచంద్రమం
దారము కృష్ణమంత్రిరసనా స్థలినిల్చెను యుక్తమేకదా!

కృతిపతియైన కృష్ణమంత్రి రచించిన గ్రంథములేవియు మనకు దొరకకపోయినను బైకవిత్రయమునకు నితఁడును బండితుఁడైన ముఖ్యస్నేహితుఁడై యుండవలెను. కంకంటి పాపరాజు యుత్తర రామాయణమును, పుష్పగిరి తిమ్మన్న సమీర కుమారవిజయమును భర్తృహరి నీతిశతకమును ధరణిదేవుల రామమంత్రియొక్క దశావతార చరిత్రమును బ్రతియాంధ్రుఁడును జదువఁదగిన గ్రంథములు.

3. నాసంతతులలో మూడవదియగు ధూర్జటిసంతతి నాకత్యానందము గల్గించుటేల? ఏకవంశములోఁ దండ్రి తాతలు మొదలు మునుమలవరకుఁ బండితులై మహాకవులనిపించుకొనుట యాంధ్రదేశంబున నెందైనఁ జూపింపఁ గల్గుదురా? ఈయొక్క కారణంబుననే యావిద్వద్వంశమునందు నాకు నత్యాదరణ. ఈవంశపు కవిత్వ మీవంశమువారికే తగునుగాని మఱియొకరికి రాదు. ఈధూర్జటివంశములోఁ గడపటికవియగు వేంకటరాయకవి ధూర్జటికవినిఁ దన తండ్రినినిట్లభివర్ణించియున్నాఁడు

మ॥ పటుగంగాలహరీతరంగ సమకుంభత్ప్రోఘతాంచత్కశా।
ఘటనన్ బాదవినమ్రకృష్ణ నరరాడ్గంభీరకోటీరవి।
స్ఫుటరత్నద్యుతిపాటలీకృత పదాంభోజాతు సర్వజ్ఞు ధూ
ర్జటినిం గొల్చెద నస్మదీయ కులకర్తన్ భక్తిరంజిల్లఁగన్॥

మ॥ ఘనగౌరీశకటాక్షలబ్ధ కవితాగాంభీర్య సంతుష్ట భూ
జనరాడ్దత్తసువర్ణచేల మణిభూషాగ్రామ పల్యంకికా
ఘనదంతావళ ఘోటకాది బహుసత్కార ప్రతిష్ఠాత్ము మ।
జ్జనకున్ ధూర్జటి లింగరాజకవి రాజశ్రేష్ఠుఁ గీర్తించెదన్॥

వీరినామంబులు వరుసగ (1) ధూర్జటి (2) కుమారధూర్జటి (3) ధూర్జటి లింగరాజు (4) వెంకటరాయకవియైయున్నవి. వీరిగ్రంథములలోఁ బెక్కులు ముద్రితంబులైయున్నయవి. ఇఁక కాళహస్తి వెంకటగిరి కవులలో సర్వజ్ఞసింగమనాయఁడు సంస్కృతకవియై గ్రంథములు వ్రాసి కడుఁబ్రఖ్యాతిఁగాంచె. వెంకటగిరి రాజులతో బాంధవ్యముచేసిన దామెర వేంకటపతి బాహుళాశ్వచరిత్రమను దానిని వ్రాసి ప్రఖ్యాతిఁగాంచె. మధురవాయకులలో మిక్కిలి ప్రఖ్యాతిగాంచిన తిరుమల నాయఁడును నతని కుమారుఁడు ముద్దళగిరిరాజు నాస్థానకవియో సత్యభా

మాసాంత్వనమునురచించిన తిరుకామకామేశ్వరకవియు కాళహస్తివాఁడో లేక కాళహస్తికి సామీప్యమువాఁడో యైనటులఁ గనఁబడుచున్నది. వెంకటగిరి ప్రభువులైన వెలుగోటి రాయభూపాలునకంకితము చేయఁబడి దెంటూరి గంగరాజ విరచితంబైన భానుమతీపరిణయము కూడ శ్లాఘనీయమైన గ్రంథమే.

4. భావమరునులై యొకరినిమించ నొకరు మహాకవులనిపించుకొను భాగ్యము పోతనామాత్య శ్రీనాథులకుమాత్రమేఁగల్గె. ఒకరు భక్తిరసమును మఱియొకరు శృంగారరసమును గ్రోలి యారసాంబుధియందు మునింగి యందే యైక్యమైరి. అచంద్ర తారార్కముగ వీరికీర్తి ప్రకాశించుకతన వీరి కవిత్వశైలింగూర్చి నేనుడువుట సంశ్లేషించువాఁడ.

5. విజయనగరరాజులు తమ బాహాగర్వముచే మహమ్మదీయ దండయాత్రలను మహాప్రవాహములనాపకమున్న, నాంధ్రరాజ్యమందు సేకీభావమన నేమియో యెఱుఁగకమున్న, ప్రస్తుతకాలపు సంఘసంస్కారణకర్తల యుత్పత్తి యించుకయైనఁ గోచరింపకమున్న, బాలికాపాఠశాల లెటులుండునో యూహింపఁజాలకమున్న, వేదకాలమునాటి స్త్రీస్వేచ్ఛావిహారము లడుగంటి స్త్రీలను బంధించుకాలంబున, స్త్రీలు తమమానంబులఁ గాపాడుకొనుటయే కష్టంబుగనుండుకాలంబున, నాంధ్రమండలంబునఁ గవిత చెప్పఁగల్గునట్టి యువతీరత్నముండునని యెవ్వరైన నూహింపగలరా? అట్టిస్త్రీ యెట్టిదై యుండునో యాలోచింపుఁడు. వేదపఠనాదికారణంబులచే స్వచ్ఛమైన బ్రాహ్మణులమందు జన్మించెనా? క్షాత్రమే తమకులగురువుగాఁగల్గి లక్ష్మీసంభూతులగు క్ష్మాపతి వంశమందైనను జన్మించెనా? అటులఁగాక యెందోమృణ్మయపాత్రలఁ జేసికొని బ్రతుకు కుంభకారునింట నామెజన్మించెనని యెవ్వరైన నూహింపఁగలరా? ఇదియంతయుఁజూడ నెల్లూరుమండలమందలి శీతోష్ణమహిమంబుననో, యందలిభూజలప్రభావంబుననో మఱేకారణంబుననో మండలంబులన్నింటిలో నెల్లూరుమండలము పురుష కవిశ్రేష్ఠులకు స్థానమగుటయేకాక ప్రథమ స్త్రీకవికి జన్మస్థానమగు నబ్బూరపు బరువము కూడ దీనికేగలిగె. ఆహా! నెల్లూరుమండలవాసుల యదృష్టమేమన వచ్చు. స్త్రీయయ్యు నీమెకవిత్వము పురుషకవిత్వమునకుఁ దీసిపోవదికాదు. అనాదినుండి స్త్రీవిద్యావ్యాపకముగల యాంగ్లేయదేశమందుఁగూడ స్త్రీకవులలో మనదేశమందలి మొల్లకుసాటిగుకవులున్నవారో సందేహింపవలసినప్పుడు కుమ్మరమొల్లయొక్క యౌన్నత్యము బోధపడును. ఈమెశైలి చక్కనిశైలియగుటయే కాక పద్యములయందు భక్తిరసము చిప్పిలుచుండును. కనుకనే పూర్వకాలంబుననే కాక యిక్కాలంబునఁగూడ ఈమెపుస్తకమగు రామాయణమును బాలబాలికాహస్తంబుల ధారాళంబుగ నిడుచున్నవారు. కులాంగనలు శృంగారరసమునందెంత మేరకుఁబోఁగలరో యీమెకును నీమెసాటియగు తరిగొండ వెంకమ్మకును దెలిసినటుల మఱియొకరికిఁదెలియదు. సర్వసామాన్యముగ స్త్రీలు విద్యావంతులై జ్ఞానవంతులుగనుండుట దేశౌన్నత్యము సాటించును. పై వర్ణింపఁబడినవిధముగ దేశమున్నట్టి కాలమునందు స్త్రీలు తమ యసాధారణప్రజ్ఞను జూపించినపుడు బాలికాపాఠశాలలు స్థాపింపఁబడియు నాంగ్లేయవిద్య వ్యాపించియుఁ బురుషు లధికవిద్యావంతులుగనుండునట్టి యిక్కాలంబున స్త్రీలలో మొల్లకుసాటిలిన స్త్రీలు పెక్కురులేరన నిప్పటికాలపు స్త్రీలకును స్త్రీవిద్యకును గొప్పలోపము కదా! కారణములెవ్వియైయుండు పాఠకులారయుదురుకాక. స్త్రీకవులలోఁ బ్రసిద్ధికెక్కిన తరిగొండ వెంకమ్మపుస్తకములలో ముద్రితంబులైన రాజయోగసారమును వెంకటాచల మాహాత్మ్యమును నందఱుఁ జదువఁదగియున్నవి. తంజావూరు ప్రభువగు ప్రతాపసింహ మహారాజు యుంపుడుకత్తెయగు ముద్దుపళనికవిత్వము రసవంతముగనే యున్నను నీతిబాహ్యముగనుండుటచే దీనిగ్రంథమగు రాధికాసాంత్వనము చదువఁదగినదికాదు. వీరందఱును దాక్షిణాత్యులే.

6. వంశంబులలో వెన్నెలకంటివంశముకూడ విద్యావిషయంబునఁ గడుప్రఖ్యాతిఁ గాంచినది. తాముకవులై గ్రంథరచనయందు దక్షులైనవారేకాక తాము గ్రంథములనంది కవులకు సహాయము నొసంగిరి. వెన్నెలకంటి సూరన్నవిరచితంబైన విష్ణుపురాణమును గృతినందిన రాఘవరెడ్డి కొండవీటికిని గుంటూరునకును మధ్యనుండు గావూరు సంస్థానమునకుఁ బ్రభువుగానుండెనని కవులచరిత్ర చెప్పుచున్నది. సూరన్నకుఁదాతయగు వెన్నెలకంటి సూర్యుఁడు అద్దంకి రాజధానిగాఁగల్గిన యనపోతరెడ్డికిఁ గృతులిచ్చియున్నందున నీవెన్నెలకంటివంశము వంగోలుతాలూకాలోని సుప్రసిద్ధమైన వెన్నెలకంటివంశమని తోచుచున్నది. ఈసూరన కవిత్వము మృదుమధురపద భూయిష్టంబై ద్రాక్షాపాకమై యనర్గళధారకలిగి ప్రవహించుచున్నదనియు నితనిది సలక్షణమైన మంచికవిత్వమనియుఁ గవులచరిత్ర నుడువుచున్నది. వెన్నెలకంటి పెదసూరన్నగ్రంథములేవియుఁ జిక్కకుండుట గొప్పదురదృష్టము. ఈసూరన్నకృతినందిన జక్కన కవికృతమైన విక్రమార్కచరిత్ర మద్భుతమైన గ్రంథము.

7. ఎలకూచి బాలసరస్వతి యఖండపాండిత్యమును గవితాధారయుఁగల్గి త్ర్యర్థికావ్యములు రచించినవారిలో మొదటివాఁడు అప్పకవి గొప్పలాక్షణికుఁడని యందరకుఁ దెలిసినవిషయమే.

8. జగదుపకారంబైన పంచతంత్రమును దెనుఁగు ప్రపంచమునకు లభింపఁజేసినవారు నెల్లూరుమండలవాసులగు బైచరాజు వెంకటనాథకవియు మాబగుంటనారాయణకవియునై యున్నారు.

9. గుంటూరుకవులలో ముఖ్యముగా నధికకీర్తిపరులైన తెనాలి రామకృష్ణకవి, కనుపర్తి యబ్బయామాత్యుఁడు, భాస్కరరామాయణ కృతికర్తలు, తెనాలి అన్నయ్య, ఎఱ్ఱన, పింగళి యెల్లనార్యుఁడు, గణపవరపు వేంకటకవి మొదలగువారుచేరుదురు. వీరిలోఁ బెక్కురు శ్లాఘనీయమై, సలక్షణమై చదువుట కింపైనగ్రంథములవ్రాసిరి. పైవారిగ్రంథములన్నిటిలో రామకృష్ణ కవికృత పాండురంగమాహాత్మ్యమును, కనుపర్తియబ్బయామాత్యకృత కవిరాజ మనోరంజనమనునామాంతరముగల పురూరవశ్చరిత్రయుఁ బేర్నికఁ గనియున్నవి.

10. విద్యానగరకవులలోఁ గృష్ణరాయల యాస్థాన కవులేకాక విద్యానగరరాజులచేతను వారిబంధువులచేతను వారి మండలాధిపతుల

చేతను మన్నింపఁబడిన యాంధ్రకవులనందఱిని విచారింపవలసియుండును. అట్టికవులలో ముఖ్యులెగు (1) అల్లసాని పెద్దనామాత్యకృత మనుచరిత్రమును, (2) ముక్కుతిమ్మనార్య పారిజాతాపహరణమును, (3) కృష్ణరాయల యాముక్తమాల్యదయు, (4) మాదయ్యగారి మల్లన కృతరాజశేఖరచరిత్రమును సుప్రసిద్ధమైనగ్రంథములు. ఇవికాక ఒంటిమెట్టనివాసుఁడైన అయ్యలరాజు రామభద్ర కవికృత రామాభ్యుదయమును, పింగళి సూరనార్యకృత రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నమును నసాధారణగ్రంథములైయున్నవి. వీనినన్నిటిని మించినది వసుచరిత్రకలదు. ప్రబంధములలో నిట్టియద్వితీయగ్రంథ మేభాషయందైనఁ గలదాయని సందేహింపవలసియున్నది. ఆంధ్రవిద్వాంసులలో వసుచరిత్రసారస్యమును గ్రహింపనివాఁడును గ్రహింపనేరనివాఁడును, గ్రహింపనసమర్థుఁడును హిందూస్థానమునఁ బుట్టి చూతఫలసారస్యంబును గ్రహింపనివానివలె భావింపనగును. ఇచ్చువారున్నచోఁ బద్యంబునకు వేయివరాలచొప్పుననిచ్చినను నాకవితకు న్యూనమైన బహుమానమిచ్చినవారుకారు. పైవిద్యానగరకవులలో నేరు దాక్షిణాత్యులో నెవరుత్తరవాసులో నిప్పుడు స్పష్టముగఁ గనుగొనుటకు నాధారములు దొరకకపోయినను నొకానొకరు తప్ప నందఱును విద్యానగర సామీప్యవాసులుగనే, దీనివిరుద్ధముగ నిదర్శనములు గనఁబడువరకుఁ, బరిగణించుట భావ్యము. అందులో నల్లసాని పెద్దనయు వసుచరిత్ర గ్రంథకర్తయగు రామరాజభూషణుఁడును దాక్షిణాత్యులనుట కేలాటి సందేహమునులేదు. పైవారిలో నందఱు మిశ్రమభాషయగు నాంధ్రమునఁ బ్రబంధములు గొప్పలుగొప్పలుగ రచించుచుండ నొక్కపొన్నిగంటి తెలగన్న మాత్ర మచ్చతెనుఁగున నూతనముగ గ్రంథరచనకుంబూనుకొనె. ఇతఁడుచేసిన యయాతిచరిత్రము సర్వవిధములచేతను కూచిమంచి తిమ్మకవి రచించిన పుస్తకములకంటె శ్రేష్ఠతరముగనున్నదని కవులచరిత్రయే యుద్ఘోషించుచున్నది. ఈతఁడుకూడఁ దన గ్రంథరచన కృష్ణానదీ దక్షిణతీరంబుననే చేసెను.

వీరుకాక యిటీవల లభించిన కుమారసంభవమను ప్రౌఢకావ్యమును రచించిన నన్నెచోడ కవిరాజశిఖామణికూడఁ గృష్ణానదికి దక్షిణభాగంబగు కమ్మనాటివాఁడని శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారు తమయాంధ్రుల చరిత్రముయొక్క [మధ్యయుగంబున స్పష్టముగాఁ జూపియున్నారు.

11. ఇఁకప్రస్తుతకవులను గురించి విచారించుదము. ఏలయన నావ్యాసపరోక్షులు పూర్వకాలంబుననేమి గ్రంథరచన చేసిరోకాని యిక్కాలంబునమాత్రము దక్షిణభాగము వెనుకఁబడియున్నదని నుడువవచ్చు. ఇప్పటి కవులసంఖ్య నెన్నిన నుత్తరాంధ్రదేశంబునఁ గొంచెమధికముగ నుండునేమోకాని రచింపఁబడిన మహాగ్రంథంబుల లెక్కకుఁ గొనిన దక్షిణభాగమే మిన్నయగు. కావలితాలూకా లక్ష్మీపురనివాసియై కొలఁదిసంవత్సరములక్రిందటఁ గాలధర్మంబునొందిన గోపీనాథ వేంకటకవివిరచితమైన గ్రంథమొత్తములో సగభాగమైన రచించినవాని నుత్తరభాగంబునఁ జూపించినసంతోషించెద.- గోపీనాథరామాయణమిప్పటికి రెండుమూఁడుమారులు ముద్రితంబగుటవలన నాంధ్రభారతభాగవతములకుఁ దోడుగ నీరామాయణము పఠనీయగ్రంథమగునని భావింపవచ్చు. చర్వితచర్వణమైనను వావిలికొలనుసుబ్బారాయ కవికృతమై, గోపీనాథరామాయణమువలె సంస్కృతమునకు సరియైన యాంధ్రరామాయణము నుత్తరమున నెవ్వరు రచించిరో యాలోచింపుఁడు. ఈసుబ్బరాయకవిగారు శ్రీకుమారాభ్యుదయము, శ్రీకౌసల్యాపరిణయము మొదలగు గ్రంథముల రచించి ప్రఖ్యాతిఁగాంచి యాంధ్రమాతకుఁదన కవిత్వనిపుణతచే సహాయముచేయుచు నింకను సజీవులైయున్నవారు. దాక్షిణాత్యుఁడైన పరవస్తు చిన్నయసూరి యాంధ్రవచనరచనకుదారి, దీసి పంచతంత్రమను చక్కనిగ్రంథమును రచించె. బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారు తమయసమాన సంస్కృతాంధ్ర పాండిత్యముచే వచనకావ్య నాటకాది కావ్యముల రచించి యాంధ్రులకుమహోపకారంబొనర్చుచున్నవారు. బ్రహ్మశ్రీ ధర్మవరము కృష్ణమాచార్యుల వారు తమనాటక ప్రదర్శనములచే నాంధ్రులమనంబుల సంతసింపఁజేయుచున్నవారు. సంస్కృతమునకు సరియైన తెనుఁగున కాళహస్తినివాసులగు బ్ర. శ్రీ శతఘంటము వేంకటరంగశాస్త్రిగారు భారతభాగవతాదిగ్రంథముల వచనముగ వ్రాయుచున్నారు. పైవారలుకాక నాకుం దెలియని పద్య కావ్యకర్తలును వచనగ్రంథకర్తలును, నెందరోయుండియుండవచ్చు. వారినామంబు లిందురాకుండుటకు నాయజ్ఞానకారణమేకాని వేరుకాదు. ఈయాంధ్రకవులేకాక «తర్కాలంకార రత్న» బిరుదులనంటినట్టి బ్రహ్మశ్రీ పంచాగ్నుల దక్షిణామూర్తి శాస్త్రిగారిం బోలిన సంస్కృతపండితులెందరో యుండవచ్చు. ఈమధ్యకొండవీటి సీమనుండి వెల్వడియాంధ్రదేశమునం దవిచ్ఛిన్నకీర్తివెలెఁబ్రకాశించియాశుకవిచక్రవర్తి బిరుదంబులనంది శతావధానంబులనొనర్చుచు, వేనవేలు గడించుచున్న కొప్పరపుకవులు కడుప్రశంసాపాత్రులు. కీర్తిశేషులైన బ్రహ్మశ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారుకూడ నాంధ్రభాషకు నెంతయో పాటుఁబడిరి.

పురాణాంధ్రకృతమునకు నన్నయభట్టారకుఁడే ప్రథముఁడయ్యెను, నాతనికిఁ దీసిపోనట్టి (1) తిక్కనాది యాంధ్రకరణకర్తలకును, (2) యాజ్ఞవల్క్య ధర్మశాస్త్రమును దెనుగించిన కేతనకవికిని (3) ప్రబంధపరమేశ్వరుండనంబరఁగి ప్రబంధశైలికి దారిఁజూపినవాఁడును, నూత్న ప్రబంధకర్తయగు నాంధ్రకవితా పితామహునకును, (4) లక్షణగ్రంథకర్తలగు కేతన, లింగమగుంట తిమ్మన, వెల్లంకి తాతంభట్టు, అప్పకవులకును, (5) ద్వ్యర్థి కావ్యకర్తలగు పింగళి సూరన్నమూర్తులకును, (6) త్ర్యర్థి కావ్యకర్తలలోఁ బ్రథముఁడగు ఎలకూచిబాలసరస్వతికిని (7) శ్లేషకావ్యధురంధరుఁడగు రామరాజభూషణునికిని (8) ఆంధ్రనిఘంటుకర్తలగు పైడిపాటి లక్ష్మణకవి కోటివెంకనార్యులకును, (9) అచ్చతెనుఁగుగ్రంథములలోఁ బ్రథమగ్రంథమువ్రాసిన పొన్నిగంటి తెలగన్నకును, (10) సలక్షణ వచన గ్రంథకర్తలగు పరవస్తు చిన్నయసూరి వేదము వేంకటరాయశాస్త్రి శతఘంటము వేంకటరంగ శాస్త్రిగార్లకును, దక్షిణాంధ్రదేశమేకదా జన్మస్థానము. ఒక్క గణితశాస్త్రముతప్పఁ

మాసాంత్వనమునురచించిన తిరుకామకామేశ్వరకవియు కాళహస్తివాఁడో లేక కాళహస్తికి సామీప్యమువాఁడో యైనటులఁ గనఁబడుచున్నది. వెంకటగిరి ప్రభువులైన వెలుగోటి రాయభూపాలున కంకితము చేయఁబడి వెంటూరి గంగరాజు విరచితంబైన భానుమతీపరిణయము కూడ శ్లాఘనీయమైన గ్రంథమే.

4. భావమరుఁదులై యొకరినిమించ నొకరు మహాకవులనిపించుకొను భాగ్యము పోతనామాత్య శ్రీనాథులకుమాత్రమేగల్గె. ఒకరు భక్తిరసమును మఱియొకరు శృంగారరసమును గ్రోలి యారసాంబుధియందు మునింగి యందే యైక్యమైరి. ఆచంద్ర తారార్కముగ వీరికీర్తి ప్రకాశించుకతన వీరి కవిత్వశైలింగూర్చి నేనుడువుట సంక్షేపించువాఁడ.

5. విజయనగరరాజులు తమ బాహాగర్వముచే మహమ్మదీయ దండయాత్రలను మహాప్రవాహములనాపకమున్న, నాంధ్రరాజ్యమందు నేకీభావమన నేమియో యెఱుఁగకమున్న, ప్రస్తుతకాలపు సంఘసంస్కారణకర్తల యుత్పత్తి యించుకయైనఁ గోచరింపకమున్న, బాలికాపాఠశాల లెటులుండునో యూహింపఁజాలకమున్న, వేదకాలమునాటి స్త్రీస్వేచ్ఛావిహారము లడుగంటి స్త్రీలను బంధించుకాలంబున, స్త్రీలు తమమానంబులఁ గాపాడుకొనుటయే కష్టంబుగనుండుకాలంబున, నాంధ్రమండలంబునఁ గవిత చెప్పగల్గునట్టి యువతీరత్నముండునని యెవ్వరైన నూహింపగలరా? అట్టిస్త్రీ యెట్టిదై యుండునో యాలోచింపుఁడు. వేదపఠనాదికారణంబులచే స్వచ్ఛమైన బ్రాహ్మణులమందు జన్మించెనా? క్షాత్రమే తమకులగురువుగాఁగల్గి లక్ష్మీసంభూతులగు క్ష్మాపతి వంశమందైనను జన్మించెనా? అటులఁగాక యెందో మృణ్మయపాత్రలఁ జేసికొని బ్రతుకు కుంభకారునింట నామెజన్మించెనని యెవ్వరైన నూహింపఁగలరా? ఇదియంతయుఁజూడ నెల్లూరుమండలమందలి శీతోష్ణ మహిమంబుననో, యందలిభూజలప్రభావంబుననో మఱేకారణంబుననో మండలంబులన్నింటిలో నెల్లూరుమండలము పురుష కవిశ్రేష్ఠులకు స్థానమగుటయేకాక ప్రథమ స్త్రీకవికి జన్మస్థానమగు నబ్బురపు బరువముకూడ దీనికేగలిగె. ఆహా! నెల్లూరుమండలవాసుల యదృష్టమేమన వచ్చు. స్త్రీయయ్యు నీమెకవిత్వము పురుషకవిత్వమునకుఁ దీసిపోవునదికాదు. అనాదినుండి స్త్రీవిద్యావ్యాపకముగల యాంగ్లేయదేశమందుఁగూడ స్త్రీకవులలో మనదేశమందలి మొల్లకునీడగుకవులున్నవారో సందేహింపవలసినప్పుడు కుమ్మరమొల్లయొక్క యౌన్నత్యము బోధపడును. ఈమెశైలి చక్కనిశైలియగుటయే కాక పద్యములయందు భక్తిరసము చిప్పిలుచుండును. కనుకనే పూర్వకాలంబుననే కాక యిక్కాలంబునఁగూడ ఈమెపుస్తకమగు రామాయణమును బాలబాలికాహస్తంబుల ధారాళంబుగ నిడుచున్నవారు. కులాంగనలు శృంగారరసమునందెంత మేరకుఁబోఁగలరో యీమెకును నీమెసాటియగు తరిగొండ వెంకమ్మకును దెలిసినటుల మఱియొకరికిఁ దెలియదు. సర్వసామాన్యముగ స్త్రీలు విద్యావంతులై జ్ఞానవంతులుగనుండుట దేశౌన్నత్యము సాటించును. పై వర్ణింపఁబడినవిధముగ దేశమున్నట్టి కాలమునందు స్త్రీలు తమ యసాధారణప్రజ్ఞను జూపించినపుడు బాలికాపాఠశాలలు స్థాపింపఁబడియు నాంగ్లేయవిద్య వ్యాపించియుఁ బురుషు లధికవిద్యావంతులుగనుండునట్టి యిక్కాలంబున స్త్రీలలో మొల్లకుంబోలిన స్త్రీలు పెక్కురులేరన నిప్పటికాలపు స్త్రీలకును స్త్రీవిద్యకును గొప్పలోపము కదా! కారణము లెవ్వియైయుండు పాఠకులారయుదురుకాక. స్త్రీకవులలోఁ బ్రసిద్ధికెక్కిన తరిగొండ వెంకమ్మపుస్తకములలో ముద్రితంబులైన రాజయోగసారమును వెంకటాచల మాహాత్మ్యమును నందఱుఁ జదువఁదగియున్నవి. తంజావూరు ప్రభువగు ప్రతాపసింహ మహారాజు యుంపుడుకత్తెయగు ముద్దుపళని కవిత్వము రసవంతముగనే యున్నను నీతిబాహ్యముగనుండుటచే దీనిగ్రంథమగు రాధికాసాంత్వనము చదువఁదగినదికాదు. వీరందఱును దాక్షిణాత్యులే.

6. వంశంబులలో వెన్నెలకంటివంశముకూడ విద్యావిషయంబునఁ గడుప్రఖ్యాతిఁ గాంచినది. తాముకవులై గ్రంథరచనయందు దక్షులైనవారేకాక తాము గ్రంథములనంది కవులకు సహాయము నొసంగిరి. వెన్నెలకంటి సూరన్న విరచితంబైన విష్ణుపురాణమును గృతినందిన రాఘవరెడ్డి కొండవీటికిని గుంటూరునకును మధ్యనుండు గావూరు సంస్థానమునకుఁ బ్రభువుగానుండెనని కవులచరిత్ర చెప్పుచున్నది. సూరన్నకుఁదాతయగు వెన్నెలకంటి సూర్యుఁడు అద్దంకి రాజధానిగాఁగల్గిన యనపోతరెడ్డికిఁ గృతులిచ్చియున్నందున నీవెన్నెలకంటివంశము వంగోలుతాలూకాలోని సుప్రసిద్ధమైన వెన్నెలకంటివంశమని తోఁచుచున్నది. ఈసూరన కవిత్వము మృదుమధురపద భూయిష్ఠంబై ద్రాక్షాపాకమై యనర్గళధారకలిగి ప్రవహించుచున్నదనియు నితనిది సలక్షణమైన మంచికవిత్వమనియుఁ గవులచరిత్ర నుడువుచున్నది. వెన్నెలకంటి పెదసూరన్న గ్రంథములేవియుఁ జిక్కకుండుట గొప్ప దురదృష్టము. ఈసూరన్నకృతినందిన జక్కన కవికృతమైన విక్రమార్కచరిత్ర మద్భుతమైన గ్రంథము.

7. ఎలకూచి బాలసరస్వతి యఖండపాండిత్యమును గవితాధారయుఁగల్గి త్ర్యర్థి కావ్యములు రచించినవారిలో మొదటివాఁడు అప్పకవి గొప్పలాక్షణికుఁడని యందఱకుఁ దెలిసినవిషయమే.

8. జగదుపకారంబైన పంచతంత్రమును దెనుఁగు ప్రపంచమునకు లభింపఁజేసినవారు నెల్లూరుమండలవాసులగు బైచరాజు వెంకటనాథకవియు దూబగుంట నారాయణకవియునై యున్నారు.

9. గుంటూరుకవులలో ముఖ్యముగా నధికశక్తిపరులైన తెనాలి రామకృష్ణకవి, కనుపర్తి యబ్బయామాత్యుఁడు, భాస్కరరామాయణ కృతికర్తలు, తెనాలి అన్నయ్య, ఎఱ్ఱన, పింగళి యెల్లనార్యుఁడు, గణపవరపు వేంకటకవి మొదలగువారిచే నుందురు. వీరిలోఁ బెక్కురు శ్లాఘనీయమై, సలక్షణమై చదువుటకింపైనగ్రంథములు వ్రాసిరి. పైవారిగ్రంథములన్నిటిలో రామకృష్ణ కవికృత పాండురంగమాహాత్మ్యమును, కనుపర్తి యబ్బయామాత్యకృత కవిరాజ మనోరంజనమనునామాంతరముగల పురూరవశ్చరిత్రయుఁ బేరెన్నికఁ గనియున్నవి.

10. విద్యానగరకవులలోఁ గృష్ణరాయల యాస్థాన కవులేకాక విద్యానగరరాజులచేతను వారిబంధువులచేతను వారి మండలాధిపతుల

తక్కిన నూత్న శైలులకు నాదర్శకులు దాక్షిణాత్యులే కదా. ఇకసర్కారులవారితో నెల్లూరు తెనుఁగునుగురించి నాకుంజరిగినసంభాషణా సందర్భములవిడిచి నూత్న రాణ్మహేంద్రవరశిల్పియనందగినమ-రా-శ్రీ, కందుకూరి వీరేశలింగము పంతులుగారికి వారిమండలమందున్న యభిమానమునుజూపి, యదియేనన్ను బురికొల్పెనని సవినయముగఁ దెల్పువాఁడ. చంద్రహాసవిలాసమను గ్రంథమును రచించినయాదవామాత్యకవి. "సీ॥ వాల్మీకి ముఖ్యగీర్వాణకవీంద్రు లనుమనన్న పాల్క్యాది తెనుఁగుకవులనను శుభంబులొసంగుమని భద్రగిరిరామభద్రునికడు భక్తిబ్రస్తుతించి॥ యనిచెప్పియుండుటయును నొక్కయాధారంబుచేత నేపంతులుగారుఁపయుపద్యములలో భద్రాద్రిరాముని జేర్కొనియుండుటవలనఁ గవి గోదావరిమండలములోని వాఁడని తేటపడుచున్నది" యనివ్రాయుచున్నారు. పంతులుగారి స్వమండలాభిమాన మెంతమెండో యారయుఁడు. మండలాభిమానమే నన్నును నీవ్యాసమువ్రాయుటకుఁ బురికొల్పె. ప్రస్తుతనెల్లూరుమండలమందలి దక్షిణభాగంబునఁ దెనుఁగు స్వచ్ఛముగమాటలాడఁబడక యేసఁగల్గి కొంతవరకును ద్రవిడభాషాపద మిళితంబై కొంతవరకును నున్నను నెల్లూరుమండలమందలి యధికభాగమైన నుత్తరభాగమందలి తెనుఁగు కృష్ణాగోదావరీ మండలములందలి తెనుఁగునకుగాని మఱియేతెనుఁగునకుగాని తీసిపోనిదై, స్వచ్ఛమై, శ్రవణానందకరంబై, యిప్పటికిని బండితపామరజనులకుఁ బైవారివలెనే ప్రేమాస్పదంబై పూజనీయంబై మాతృభావంబై యలరారుచున్నదని చూపుటకొరకే నేనీవ్యాసమును వ్రాసితి. ఈవ్యాసముందిలకించిన తరువాతనైన నెల్లూరుమండలవాసులతెనుఁగు సర్కారులవారుగాని యుత్తరాదితెనుఁగును దాక్షిణాత్యులుగాని యీసుసంజాడక యాంధ్రభాషయొందున్నను, నెటులున్నను మనమాతృభాషయనియు నద్దాని మాటలాడువారు మనసోదరులనియు భావించెదరుగాక! ఆంధ్రమెందున్నను సర్వాంధ్రజనగ్రాహ్యమైనందుకు సంతసించెదరుగాక!

# ప్రాచ్యప్రతీచీవిద్యాపద్ధతులు.

[ వింజమూరి గోపాలకృష్ణయ్యంగారు ఎమ్. ఏ., ఎల్. ఎల్. బి., బారిష్టర్-ఎట్ లా. ]

హిందూదేశజుఁ డెవ్వఁడేని౯ బాశ్చాత్యదేశములకు వెళ్ళి యచ్చటఁ గొంతకాలము నివసించినపుడు క్రొత్తక్రొత్త జనులను జూచుటయు, వింతవింత భాషలను వినుటయు, అనల్పశిల్ప రచనాయుక్తంబులై రామణీయకములైన రాజమార్గంబులను, ప్రాచీనౌన్నత్య సూచకంబులైన ప్రతిమావిశేషంబులను సందర్శించుటయు మాత్రమేగాక, యచ్చటి జనుల శరీరదార్ఢ్యతయు, వారి విమలవేషంబులును, సుభారోగ్యసూచక భాసురముఖ వికాసంబును, వానిమనసున కెంతయుఁ బొడకట్టును. అచ్చట వారి జీవితచర్య చూడఁగా వారి సర్వవ్యవహారములయందును, నియమశీలత గాన్పించును. ఇన్నియన్నియని యెన్నరాని పుస్తకభాండాగారములును, సర్వజనోపయోగములై యెచ్చటఁజూచిన నచ్చట విచ్చలవిడిగాఁ జదువుకొనదగిన విశాలములైన శాలలును, ఒక్కదినమునకే లెక్కలేకుండ నమ్ముడుపోవుచుండు లక్షలకొలఁది వార్తాపత్రికలును, ప్రత్యక్షముగ వానికి నెప్పట్టునను గన్పట్టుచుండును. గొప్పవారలేకాక బండితోలువాండ్రును, స్వల్పపు నౌకరులును, సయితము తమ యిచ్చవచ్చిన పత్రికల నత్యాదరంబుగఁ జదువుచు రాజ్యాంగవిషయచర్చలంజూచి ప్రతిభావిశేషులవలెనే తాము వితర్కించి నిష్కృష్టాంశముల నిర్ణయించుచుండుటయు, ధననిక్షేపాధిపతులు తమతమ వ్యాపారస్థలముల కతిశీఘ్రంబున జనుచుండుటయు, రాజ్యవ్యవహార ధురంధరులు తమ్ము ననుసరించియుండు ప్రజలకు నుపన్యసించుచుండుటయు, వీక్షింపగలఁడు ఇంతయేల? వాని వీక్షణమునకు బాశ్చాత్య జీవితౌన్నత్య వికాసమంతయు మూర్తీభవించి యతని కన్నులఁ గట్టినట్లుండి వానిచిత్తము నెంతయు నాకర్షించును. జన్మభూమియొక్క యభ్యుదయమునే కోరుచున్నట్టి యాతనిహృదయమునకు స్వదేశస్థితి యపుడు స్మరణకు రాకమానదు. పాశ్చాత్యదేశస్థితికిని తన జన్మదేశస్థితికినిగన్పట్టువ్యత్యాసముచే నతని మనసున కింతింతనరాని చింతయు నిరుత్సాహమును గలుగును.

ఇచ్చటి బీదగుడిసెలును, గుటీరములును, విద్యావిహీనులై, మూఢాచార పరాయణులై, అర్ధోపవాస భోజనులై, దుఃఖసాగర నిమగ్నులై, ఖిన్నులై దరిగానలేకయున్న జనసామాన్యమును, అప్పుడు వాని తలంపునకు వచ్చును. ఇచ్చటఁగూడఁ గొన్నిచోటులఁ బాశ్చాత్య దేశములయందువలెనే దేదీప్యమానములగు చిత్రప్రవృత్తులతో నెక్కడనో యొక్కచోట, ఆపన్నివారణార్థ సంరంభములయందుఁ గొందఱి మొఱలు మాత్రము వినంబడునుగాని, అంతకంటె విశేషమేమియుఁ గానరాదు. అందుచే, ఇండియాదేశస్థితింగూర్చి తలంచినచో నిర్భరమయిన మనస్తాపమునకును, విచారణమునకును గారణమగును. అట్టిదశలో నతఁడీ వ్యత్యాసమునకుఁ గారణము లేమిగానుండునని ప్రబలముగా మనసున నిట్లాలోచింపసాగును. "ఈ వ్యత్యాస మీశ్వర నిర్ణీతమా? ఆయునకు, హిందూదేశముకంటె యూరోపునం దధికాభిమానమా? ప్రకృతివర్గములో నీశ్వరప్రసాదములైన యమూల్యవస్తువుల నుపయోగించుకొనుటయందు భారతీయుల యసమర్థతా స్వభావమా?"

పూర్వము పాశ్చాత్యులందఱు నజ్ఞానాంధకారమున నెంతయు మునింగియుండఁగా, ఏదేశము మహాధనవంతమై, సర్వవస్తుసమృద్ధమై, సర్వవ్యాపారభూయిష్ఠమై, అనన్యసామాన్యప్రకాశమై, ప్రసిద్ధిగాంచెనో, ఎద్దేశము నాగరికతయం దగ్రేసరత్వము వహించెనో, ఎయ్యది షడ్దర్శనము లనెడి మహాతత్వ శాస్త్రములకు

తక్కిన నూత్న శైలులకు నాదర్శకులు దాక్షిణాత్యులే కదా. ఇంకను ర్కారులవారితో నెల్లూరు తెనుఁగునుగురించి నాకుంజరిగినసంభాషణా సందర్భములవిడిచి నూత్న రాణ్మహేంద్రవరశిల్పియనందగినమ-రా-శ్రీ, కందుకూరి వీరేశలింగము పంతులుగారికి వారిమండలమందున్న యభిమానమునుజూపి, యదియే నన్నును బురికొల్పెనని సవినయముగఁ దెల్పువాఁడ. చంద్రహాసవిలాసమను గ్రంథమును రచించినయాదవామాత్యకవి. "సీ॥ వాల్మీకి ముఖ్యగీర్వాణకవీంద్రు లనుమనన్న పాణ్యాది తెనుఁగుకవులకును శుభంబులొసంగుమని భద్రగిరిరామభద్రు నికడు భక్తి బ్రస్తుతించి" యనిచెప్పియుండుటయును నొక్కయాధారంబుచేత నేపంతులుగారు "ప యుపద్యములలో భద్రాద్రిరాముని జేర్కొనియుండుటవలనఁ గవి గోదావరిమండలములోని వాఁడని తేటపడుచున్నది" యనివ్రాయుచున్నారు. పంతులుగారి స్వమండలాభిమాన మెంత మెండో యారయుఁడు. మండలాభిమానమే నన్నును నీవ్యాసము వ్రాయుటకుఁ బురికొల్పె. ప్రస్తుతనెల్లూరుమండలమందలి దక్షిణభాగంబునఁ దెనుఁగు స్వచ్ఛముగమాటలాడఁబడక యేసఁగల్గి కొంతవరకును ద్రవిడభాషాపద మిళితంబై కొంతవరకును నున్నను నెల్లూరుమండలమందలి యధికభాగమైన నుత్తరభాగమందలి తెనుఁగు కృష్ణాగోదావరీ మండలములందలి తెనుఁగునకుగాని మఱియే తెనుఁగునకుగాని తీసిపోనిదై, స్వచ్ఛమై, శ్రవణానందకరంబై, యిప్పటికిని బండితపామరజనులకుఁ బైవారివలనే ప్రేమాస్పదంబై పూజనీయంబై మాతృభావంబై యలరారుచున్నదని చూపుటకొరకే నేనీవ్యాసమును వ్రాసితి. ఈవ్యాసముందిలకించిన పిరువాతనైన నెల్లూమండలవాసుల తెనుఁగు సర్కారులవారుగాని యుత్తరాది తెనుఁగును దాక్షిణాత్యులుగాని యీసుసంజాడక యాంధ్రభాషయెందున్నను, నెటులున్నను మనమాతృభాషయనియు నద్దాని మాటలాడువారు మనసోదరులనియు భావించెదరుగాక! ఆంధ్రి మెందున్ననుసర్వాంధ్రి జనగ్రాహ్యమైనందున సంతసించెదరుగాక!

జన్మభూమియై గణితశాస్త్రప్రవీణులచేతను, రాజ్యవ్యవహార ధురంధరులచేతను, మహాసంగ్రామ శూరులచేతను, నిండియుండెనో, అట్టి సుప్రసిద్ధ హిందూదేశ మిపుడు మృతకళేబరమువలెఁ దూలియాడునట్లు చేసినదేది? పాశ్చాత్యాధిక్యతకును హిందూదేశాధఃపతనమునకును గారణమెద్ది? ఇత్యాద్యనేక సంశయంబు లతిరయంబున నాతని మనసున బరంపరలుగ వచ్చి కలవరపెట్ట, తచ్చింతా పరవశుండై సంశయనివారణం బెట్లగునాయని యెదురుచూచుచుండును.

నేను, ఇంగ్లండుదేశమునందు వసించి, తదితరములైన ఐరోపాదేశములలో సంచారముచేయు కొలఁదికాలములో నామాతృదేశమునకును, యూరోపునకును, గలవ్యత్యాసమునుగూర్చి నామనంబున నాందోళన పడినపుడు, నేననుభవించిన మనోవేదన యింతింతని వచించుట కెంతయు నసమర్థుఁడనై యున్నాను. అయినను, నామాతృదేశమునకును బాశ్చాత్యదేశమునకును రాజ్యాంగపద్ధతియందును సాంఘికపద్ధతియందును, గలవ్యత్యాసమే దీనికిఁ గారణమని తెలిసికొంటిని.

పాశ్చాత్యదేశములందలి ప్రజాపాలనము స్వజాతీయము, భరతవర్షమందలి ప్రజాపాలనము విజాతీయము. ఐరోపాఖండము రాజ్యపరిపాలనా పద్ధతులయందభివృద్ధి చెందుచున్నకాలములో దానికి బ్రతిబంధము లెవ్వియును లేకుండెను. అదృష్టవశముచే మనదేశ పరిపాలనమునందు నవీనచైతన్య ముద్భవించి పరిపాలనాపద్ధతులు మాఱ నారంభించినవి. సాంఘిక నిరంకుశాధికారము సడలిపోవుచున్నది. ఇంతయేల? ఉత్తమాధమ జాతులకుం గల వైషమ్యమే హిందూదేశ వినాశనహేతువని చెప్పఁదగియున్నది. ఇట్టి జాతిద్వయకలహము, ఐరోపాయందును బూర్వముండినను, బ్రస్తుతము చాలభాగమస్తమించినది.

ఇట్టి కలహదశలో, ఐరోపాయొక్క జయమునకు హేతుభూతమైనది యచటి విద్యయు, విద్యాలయములే కాని వేఱుకావు. ఈవిద్యవలన బలవత్తరమగు మధ్యజాతియొకటి క్రొత్తగాఁ గల్పింపఁబడి యుత్తమాధమ జాతులకు సంధియొనర్చి జాతీయౌన్నత్యదశకుఁ గారణమైనది. ఐరోపాఖండమందలి విద్య తజ్జనసంఘముయొక్క యాచారమును మూలముట్టుగఁ బెఱికివేసి, నూత్నపద్ధతులతో దానిని మఱల నుద్భవింపఁ జేసినది. అదిప్రజలయందు వైరంబులను రూపుమాపి, ఐక్యభావమును గల్పించి వర్తకవ్యాపారముల వృద్ధిపఱచి, పాలనాశక్తులఁ బెంచి, అగమ్యములైన మత, సాంఘిక, రాజ్యాంగార్థిక విషయములను నిర్ధారణ చేసినది. విద్యయేనిశ్చయముగా యూరోపుఖండముయొక్క యౌన్నత్యదశకు ముఖ్యాధారమైనది. ఆ విద్యయే మనదేశముయొక్క పునర్జీవనమునకు ముఖ్యాధారముగాఁ జేయవలసియున్నది. అయినను, సర్వదేశముల విద్యాపద్ధతులు నొకటేవిధముగా నుండుటకు వీలులేదనుట స్పష్టము. మఱియు నట్లుండుట మంచిదియుగాదు. విద్య, రాష్ట్రజనహృదయమిట్టిదియని సూచించుటకును, దానియాధిక్యతను విశదపఱచుటకును బహిర్లక్షణమై యున్నది. ఒకదేశమందలి విద్యాపద్ధతులు, ఆయాదేశ సంప్రదాయములకును అచ్చటి యావశ్యక విషయములకును, సరిపోవు నట్లుండవలెనేకాని, మఱియొకదేశపద్ధతుల నవలంబింపఁ గూడదు. ఇంతయేల? జాతీయాభివృద్ధికి విద్యయే జీవనాధారముగా నుండవలయును.

విద్యావిషయమై యాలోచింపవలసిన విషయము మఱియొకటి గలదు. విద్య, సర్వకాల సర్వావస్థలయందు నొకటేవిధమైనదిగ నుండఁదగదు. నాగరికత వృద్ధియైన కొలఁదిని, జాతీయాభిప్రాయములు మాఱినకొలఁదిని, ఈవిద్యయు మార్పుల నంగీకరించి, మారుచుండవలెను. ఒకప్పుడు విద్యావాప్తిమాత్రమే ప్రాముఖ్యముగా నెంచవలయును. మఱియొకకాలమందు విద్యాభివృద్ధి నాలోచింపవలెను. సామాన్యవిద్య ప్రత్యేకవిద్యకు బూర్వమవలంబింపవలయును. శాస్త్రసామాన్య విద్యనభ్యసించిన తదుపరిరసవాదప్రకృతిశాస్త్రేత్యాదిశాస్త్రసముదాయంబుల నభ్యసింపవలెను. విద్యావిషయమైన యావద్విషయంబులును యూరోపుఖండమునందు చాలవరకుఁ దృప్తికరముగనే పరిష్కరింపఁ బడినవి.

ఐరోపా దేశములందలి విద్య, ప్రతి మానవునందును లీయమైయుండిన సర్వశక్తులను విజృంభించునట్లుచేసి స్త్రీపురుషులనందఱిని సుగుణసంపత్తిగల వారినిగాఁ జేయుటకే కాని, మనుజులనందఱిని జేతన రహితమైన జంత్రపు బొమ్మలుగాఁ జేయుట కొఱకును, ఉద్యోగములను సంపాదించు జీవనోపాధి సాధనముగా నుండుటకును మాత్రమే యేర్పడియుండలేదు.

ఫ్రాన్సు దేశమునందుఁ దక్క, తక్కినపాశ్చాత్యదేశములందంతటను సామాన్యవిద్యతోఁబాటు నీతిదాయకమై, దైవభక్తి ప్రధానమైన విద్యనుగూడ నిచ్చెదరు. వారిదేశముయొక్క రాజ్యాంగ సాంఘికాది వ్యాపారంబుల నిపుణత్వముతో నెరవేర్పఁ గలుగు సామర్థ్యమును బొందుటకుగాను పాశ్చాత్యులు విద్యనభ్యసింతురు. అచ్చటివిద్య వారిని దేశభక్తులనుగాఁ జేయుచు, తమ దేశమునకును, జన్మమునకును, సాంప్రదాయములకును గీర్తి దెచ్చువారినిగాఁ జేయునదై యున్నది.

మఱియు నైరోపా దేశములోని పరీక్షలు, విద్యార్థులను మిగుల హింసించునవి కావు. విద్యార్థులకేపాటి జ్ఞానము కలదోయని తెలిసికొనుటకే కాని, తెలియఁజాలని యంశములను వెదకి, యట్టివానింగూర్చి ప్రశ్నించి వారి నిబరీక్షలలో దప్పిపోవునట్లు చేయుటతదభిప్రాయముకాను. రాజనీతిపరుఁడును, క్రిందటియాంగ్లేయరాజ్య ప్రధానమంత్రియునైన బాల్ఫరీవిధమున నుడివి యున్నాఁడు.

"మనమేగ్రంథమునైనను బరీక్షకొఱకే చదువుట సరియైనపద్ధతికాదు. ప్రతివిద్యార్థియుఁ దనసందేహానివృత్తికొఱకుఁ జదువవలెనేకాని యితరులప్రశ్నలకు సమాధానము లిచ్చుటకొఱకుగా నుండఁగూడదు." ఈయభిప్రాయమున కనుగుణముగా నాదేశమందు విద్యార్థులు గ్రంథములను బఠించునపుడు జ్ఞానమునేగాని బరీక్షలనంతగా బాటించరు. ఇట్లు మనవిద్యార్థులుకూడ చేసిన ఎంతోబాగుగనుండును! పూర్వోక్తంబైన విద్యాపద్ధతులు ముఖ్యముగా నాంగ్లేయ, జర్మనీ దేశపు విద్యాలయములందుఁ గాననగును. ఆంగ్లేయదేశమునందలి విద్య సర్వసంపూర్ణమై యున్నది. అక్కడఁ గొన్ని పాఠశాలలు దొరతనమువారిచే స్థాపింపఁబడి, వారియధికారముక్రిందనే యున్నవి. మఱికొన్ని దొరతనమువారి సహాయముచే బోషింపబడునవియై యున్నవి. పెద్దపెద్ద కళాశాలలన్నియు జనసామాన్యముచే స్థాపింపబడి వారి స్వార్థత్యాగమును, దేశాభిమానమును, వేయినోళ్ళ దిగంతములవరకుఁ జాటుచున్నవి. ఆ దేశమునందలి విద్య "పబ్లిక్" పాఠశాలలందుఁ బ్రారంభింపఁబడి యాంగ్లేయప్రజలయొక్క సుగుణసంపత్తికి హేతుభూతమైయున్నది. ఈవిద్యాలయములందే, ఆంగ్లేయబాలకులు ఐదుసంవత్సరములు మొదలు పదునాలుగేండ్లవరకును విద్యనభ్యసించి బాగుగా శిక్షితులగుదురు. ఈ పాఠశాలలలోఁ గొన్ని యుచితముగా భోజనాదుల నిచ్చి చదువు చెప్పునవిగా నున్నవి. బాలురు విద్యయొక్క సర్వాంగములయందును శిక్షితులై సదా యుపాధ్యాయునితో నుండుటచే దుర్గుణంబుల కెడమీయక సద్గుణంబులనే యాకర్షించుచుందురు. ఇట్టి విద్యాలయములం దుపాధ్యాయులుగా నుండువారు సకల సద్గుణసంపత్తియుక్తులై విద్యార్థులకెల్లరకు మార్గదర్శకులుగానుందురు. ఈవిద్యాలయములలో శిక్షితులైన బాలకులెల్లరు జీవితకాలములోని ప్రతివిషయమును జయప్రదముగా నెరవేర్పఁగలవారగుదురు. బ్రిటిషురాజ్యమందలి మిక్కిలి సమర్థులయిన రాజ్యకార్యనిర్వాహకులుగాని, శాస్త్రపరిజ్ఞులుగాని వర్తకవ్యాపార సంస్కర్తలుగాని, ఇట్టివిద్యాలయములందు శిక్షితులైనవారె!

ఇట్టిశిక్షను బాలుఁడు పొందిన తఱువాత, సర్వకళాశాలయందు విద్యనభ్యసించుటకుఁ బ్రారంభించును. నాలుగువందల యేబదిలక్షల జనసంఖ్యగల బ్రిటిషు ద్వీపములలో పదునైదు సర్వకళాశాలలు కలవు. అందాఱు మతాధిపతులచే స్థాపింపఁబడినవి. మనదేశమందలి మతాధిపతులును, ఆప్రకారము జేసిన దేశమున కెంతయో మేలుకలుగక మానదు! మిగిలినవి, రాజశాసనాధారముచే జనసామాన్యమువలన నేర్పఱుపఁ బడినవి. దేశమునందలి యున్నత చారిత్రులందఱు నిందుశిక్షితులగుచున్నవారే.

ఇవిగాక, కాయకష్టకర్మల నుపదేశించు పలువిధములగు పాఠశాలలు దేశమంతట నసంఖ్యాకములుగా నున్నవి. వీనియందు శాస్త్రజ్ఞానమునకుఁదోడు, అనుభవజ్ఞానమును బోధింపబడును. పత్రికాప్రచుర విషయమును, రాజ్యాంగవిషయమును, యుద్ధకౌశలమును, నావికాశిల్పమును, ఇత్యాది సమస్తవిద్యలు నేర్పఁబడును. మఱియును పాకశాస్త్రము, గానము, సంగీతము నభ్యసించవచ్చును. ఇందలి యుపాధ్యాయులు, ఆయావిద్యాంగములయందు మహాపండితులుగా నుందురు.

ఈపాఠాలయములయందు బరీక్షలుసంవత్సరమునకు రెండుమూఁడు పర్యాయములు జరుగును. అవి బాలురపాలిట మృత్యుదేవతవలె యుండక నూటికి డెబ్బదిమందికంటె ధికముగా యోగ్యతాపత్రికలనొందుటకు వీలుగానుండును.

ఇత్తరి, జర్మనీదేశ విద్యాపద్ధతుల నొకింత విచారింతము. ఇంగ్లండునందుకంటె జర్మనీదేశములో విద్యాంగములన్నియు నొకదానినుండి మఱియొకటి యెక్కువస్పష్టముగా విభజింపబడి యున్నవి. జర్మనీదేశములోని విద్య ప్రతిదినచర్యల కనుగుణముగా నుండును. ఆదేశమునందువలె మఱియేదేశమునందును మాతృదేశభక్తిజాతీయానురాగ బీజంబులు బాలుర హృదయంబుల నాటఁబడి యుండలేదు. జర్మనీదేశమందలి విద్యార్థులందఱును, భావిక దేశసేవకులును, రాజ్యకార్య ధురంధరులును, సర్వశాస్త్ర నిపుణులును, చరిత్రకారులునై యున్నారనుటకు సందియములేదు. కనుకనే, ఈదేశమందు విద్యార్థులకున్న మర్యాద గౌరవములు మఱియొకరికి లేవు. అమెరికా, జపాన్, ఇంగ్లండు మొదలగు దేశములు తమతమ జాతీయ విషయములను మాత్రము మార్చక, తమపాఠశాలలను జర్మనీదేశ పద్ధతిప్రకారము మార్చుకొనఁ జూచుచున్నవి.

జర్మనీదేశమందు నాలుగువిధములగు పాఠశాలలుగలవు. అందు మొదటివి ప్రజాసామాన్య పాఠశాలలు. ఇవి ఇంగ్లండునందలి పబ్లికు పాఠశాలలకు సామ్యముగా నుండును. ఇందు బాలురు ఆఱుమొదలు పదునాలుగు సంవత్సరములవరకు సామాన్యవిద్య నభ్యసించెదరు. రెండవవి రియల్ పాఠశాలలు. ఇవి మంచివర్తకవ్యాపారవిద్యను గఱపు పాఠశాలలై యున్నవి. ఇచట విద్యనభ్యసింపగోరు బాలురు ప్రజాసామాన్య పాఠశాలలందు మూఁడు సంవత్సరములు మాత్రమే విద్యనభ్యసింతురు. ఇట్టివి జర్మనీయందుతప్ప యితరదేశములందుఁ గానరావు. మూఁడవవి జమ్నేసియా పాఠశాలలు. ఇది జనసామాన్య పాఠశాలలకును, సర్వకళాపాఠశాలలకును మధ్యరకముగా నుండును. ఈపాఠశాలలందు బాలురు తొమ్మిది సంవత్సరములఁ బ్రాయమందుఁ బ్రవేశించి, మఱితొమ్మిదియేండ్లు ముఖ్యముగా బూర్వచారిత్రవిషమైక విద్యనభ్యసించెదరు. నాల్గవవి సర్వకళాపాఠశాలలు. జర్మనీదేశమందలి సర్వకళాపాఠశాలలు స్వాతంత్ర్యమే ప్రధానముగాగల విద్యార్థుల స్వపరిపాలనా రాష్ట్రములని వర్ణింపనగును. ప్రత్యేకరక్షకసైన్యముతోను, ప్రత్యేక న్యాయస్థానములతోను సర్వకళాశాలలకు బరిపాలనా సంఘములు కలవు. నేరస్థుఁడైన యొకవిద్యార్థిని బట్టుకొనుటకు జర్మనీదేశపు పోలీసువారికి నధికారములేదు. వాఁడు పాఠశాలసంబంధమైన న్యాయాధికారుల చేతనే శిక్షితుఁడగును. సర్వకళాశాలలకు సంబంధించిన కారాగృహములును గలవు. నీతిదూరుఁడైన విద్యార్థి నీ కారాగృహమునందు బంధింతురు.

ఇట్టిస్థితిలో జర్మనీదేశముయొక్క ప్రస్తుతౌన్నత్యదశకు కారణమును, మిక్కిలి పురాతనమునైన హైడల్బర్గు సర్వకళాపాఠశాలలనుగురించి చెప్పకుండుట సాధ్యముకాదు. అది 1386 సం॥ స్థాపింపబడి యిప్పటి కతి విశాలంబులును, అత్యున్నతములును నగు కట్టడములు నలువది గలవు. అది మొట్టమొదట మతవిద్యకొఱకేర్పడినదైనను ప్రస్తుతము రసవాద ప్రకృతిశాస్త్రాది విద్యలకును, నానాభాషా పరిచయమునకును, మూలస్థానమై యున్నది. ఒకనాటి సాయంసమయమున నాసర్వకళాశాలాభవనము యొక్క మధ్యభవనమునందు జ్ఞానాభివృద్ధినేకోరుచు నొక యమెరికా దేశస్థుడైన యుపాధ్యాయుని విద్యాప్రసంగము వినుచున్న దాదాపు రెండువే

లమంది బాలురను జూచునపుడు నాకు గలిగిన మనోల్లాసము వర్ణనాతీతమైనది. ఈకళాశాలయందలి బాలురు మాతృభూమియొక్క రాజకీయ, సాంఘిక, వ్యాపారములందు జోక్యము కలుగఁ జేసికొను స్వతంత్రులై యున్నారు. ఐరోపాఖండమున కంతకు విద్యావిషయమునఁ బ్రతినిధిత్వమును వహించినవి జర్మనిఇంగ్లాండు దేశములే. మిగిలిన దేశములు బహు విద్యాలయములచే జాతీయ విద్యను, ఆయాదేశమందెల్ల వ్యాపింప జేయుచున్నవి. వాని నన్నిటి నిక్కడ నుదహరించుట యనావశ్యకము.

ఏయంశమునందును హిందూదేశ సర్వకళాశాలలందలి విద్య జాతీయవిద్యయని వచింప నెవ్వరుసాహసింతురు? ఈ దేశమందలి విద్య మనజీవితమున కాధారముగాఁ జేయఁబడకుండుటచేతను, దృష్టాంతసహితము కాకుండుటచేతను, అనుభవైకవేద్యము కాకపోవుటచేతను, ఖండనార్హమై యున్నది. నీతిదాయక విద్యలేమిచే సుగుణసంపత్తు లభివృద్ధియగుట కవకాశములేదు. మన సర్వకళాశాలలోని విద్యలయందు హిందూదేశచరిత్రకును, స్వదేశభాషలకును బ్రాముఖ్యత నీయకుండుట శోచనీయము. ఆర్థికశాస్త్రాది విద్యలు హిందూదేశ స్థితిగతుల కనుగుణముగా గాక నింగ్లండు దేశస్థితిగతుల కనుగుణముగ నేర్పుట, దేశాభివృద్ధికి ననుకూలముకాదు. మన దేశవిద్య స్వకపోల కల్పితాసక్తి నీయజాలదు. విద్యావిషయమున పరీక్షలనే ముఖ్యముగా నెన్నుటచే, విద్య యానందదాయకముగా నుండక దుఃఖదాయకముగా నున్నది.

విద్యయే సాంఘిక రాజకీయ ఆర్థికదోషముల నివారణచేయగలదని దృఢముగానమ్మి మనదేశమందలి విద్యాపద్ధతులను పునఃప్రతిష్ఠితములుగాఁజేయుట మిక్కిలి యావశ్యకము. పాశ్చాత్యదేశ విద్యాపద్ధతులలోని సుగుణంబుల నెల్లను గ్రహించి మనదేశ చారిత్రలయందలి గౌరవనీయమైన ప్రతివిషయంబును భద్రపఱచి, మనజాత్యాచార సాంప్రదాయముల కనుగుణముగా, విద్యాపద్ధతులను సంస్కరించుట యత్యావశ్యకము. పాశ్చాత్యదేశములందువలెనే, మనదేశమందును, విద్య, సుగుణసంపత్తి నభివృద్ధిఁజేయునదిగాను, మనయందు లీనమై యుండు సర్వశక్తులను బహిర్గతములఁ జేయునదిగా నుండునట్లు మార్చుట మనవిధియై యున్నది. మఱియును విద్యకొలఁది జనులకే సాధ్యముగాక, జనసామాన్యమున కంతకును, పొందఁ దగినదిగా నుండవలెను.

అప్పుడు, రాజకీయ నిరంకుశాధికారము విచ్చిపోవును. సాంఘిక నిరంకుశాధికారము రూపుమాయును. స్వాతంత్ర్యము, సమత్వము, భ్రాతృభావము, నాగరికతయను కిరణసముదాయము హిందూదేశముపై బ్రసరించుట కారంభమగును.

మనమాతృదేశము నాస్థితికిఁ దెచ్చుభారముకొంతవరకు ప్రభుత్వమువారి మీఁదను, చాలవరకు మన మీఁదను నిలిచియున్నది. భగవంతునికిఁ బ్రేమపాత్రులగుటకును, మనయొక్కయు, మాతృభూమియొక్కయు పురోవృద్ధికొరకును, యిట్టిస్థితికి విద్యను తెచ్చెదముగాక! మనము గట్టిగ బూనుకొనిన యెడలఁ దప్పక యీపనిని జయప్రదముగా నెరవేర్పగలుగుదుమనుటనిస్సందేహము.

# సొహ్రాబురుస్తుముల కథ.

[గాడిచర్ల హరి సర్వోత్తమరావు పంతులుగారు ఎమ్.ఏ.,]

రాత్రి మూఁడుజాములు మీరినది. తెల్లవారువేళ గావచ్చినది. చీకఁటులుకమ్మియేయున్నవి. తార్తారులవిడిసియుండెల్లెడలను నిదురశక్తి వలన నంతయు నిశ్శబ్దముగనున్నది. పరస్పరము హెచ్చరికఁ జేసికొనుటకొఱకు అప్పుడప్పుడు పహరావారువేయు కేకలును ఆకేకలచే ఆకస్మికముగ నుసికొల్పఁబడిన కుక్కల మొఱుగుడులును, నాల్గవయామముగాన కుక్కుటముల కొక్కరొకోలును ఎడనెడ వాతావరణము నాక్రమించుకొనుచుండెను గాని మైమఱచినిండార నిద్రించుచుండిన సైన్యముల నేమాత్రమును కదుపలేకుండెను. ప్రదేశమెల్లయునిట్టి శాంతినందియుండ నొక్క పురుషుఁడు మాత్రము తన డేరాయందు ఏమియో యాలోచించుకొనుచు నటు నిటు దిరుగుచుండెను.

ఆసమయమున నతని ముఖవికారమును చేష్టావిశేషములను ఎవ్వరైనను గమనించియుండిరేని అతడు 'ఱేయియెల్లయు ఱెప్పవాల్చక అగాధమగు యోచనయందు మునింగియుండి యుండునని గ్రహించియుందురు. తెల తెలవారు నప్పటికాఁతడు దన కర్తవ్యమును నిర్ణయించుకొని దుస్తులనుదొడిగి ఖడ్గమునుధరించి సైన్యాధిపతి యగు పీరన్వైసాగారి పట కుటీరముకడకు నేగుచుండెను. లంబకాయుఁడును లఘుక్రమణుఁడును నగు నీసొహ్రాబు నెఱుంగనివారు లేరుగాన నితఁడేయాటంకమునులేక తీవ్రగతినేగి సైన్యాధిపుని గుడారముం జొచ్చెను. పీరన్వైసా పడకవఱకుంగల మార్గమెల్లయు మిక్కిలి విలువగల మెత్తని రత్నకంబళములచే నలంకరింపఁబడియుండెను. కాని కొంత యభ్యాసమువలనను గొంత వయస్సువలనను అతనికి నిద్రాసూక్ష్మత యలవడియుండుటచేత సొహ్రాబు తన సోఫావద్దకు వచ్చునప్పటికి పీరన్వైసా సగములేచి 'ఎవరక్కడ? ఇంకను తెల్లవారలేదే. ఏమివార్త. భయమునకు గారణము లేదుగదా?' యని గంభీరస్వనమునఁబలికెను. సొహ్రాబు పడకప్రక్కకుం జని "తాము నన్నెఱుంగరు. నన్ను సొహ్రాబ్ అంద్రు. రాత్రి ఎల్లయు నిదురలేక గడపి మన రాజుగారగు అఫ్రేసియబుగారి హితవచనములు మనమునఁ గలవాఁడనుగానఁ దమకు నావేదన నివేదించుకొని ప్రతీకారము చేసికొన నేతెంచినాఁడను. నాకోరిక నెఱుంగఁజేసెద వినుండు. ఇంతకాలమును దార్తారుల పక్షమునువహించి పారశీకవీరులను పలుపోరుల గెలుచుచు పసివాఁడనయ్యు అరితేరిన వీరునియంత పరాక్రమాతిశయంబులఁ గనుబఱచుచుంట మీరెఱుఁగనియదిగాదు. ఇదెల్లయు నేనొక్కనిం గనుతలంపునఁ బడుపాట్లు. వీరాగ్రేసరుండని పేరుగాంచిన నా తండ్రి ఏయుద్ధరంగంబున నయిన నా కెదురొడ్డకుండునే యను నాసచే నేనీవిధంబున ముంకపడి యజేయుండనగు మల్లుండనై యుంట. కావున నాప్రార్థన నంగీకరింపుఁడు. నేఁడు ఇరువాగులవారు యుద్ధము చాలించునట్లేర్పఱచి పారశీకులలో నేవీరుడైన నాతోడ ద్వంద్వయుద్ధంబునకు గడంగ నియమించునట్లొనర్పుఁడు" పీరన్వైసా ఈవాక్యముల విని కొంత చింతించి రుస్తుము ముసలివాఁడయినందున గడించిన కీర్తికి ముప్పవాటిల్లకుండ కాపాడుకొను ఇచ్చచేతనో పారసీకప్రభువునకును దనకును భేదములు పొడముటచేతనో పారశీకరాజుతో యుద్ధభూముల ముందంజ నైచిరాకుండుట యెఱింగినవాఁడగుటవలన సొహ్రాబు నిశ్చయమును మరల్ప నెంతయో ప్రయత్నించెను.

ఎన్ని విధముల నచ్చఁజెప్పఁజూచినను సొహ్రాబు పట్టినపట్టు వదలడయ్యె. తుట్టతుదకు సొహ్రాబున కెద్దియో విపత్తురానున్నదని యంతర్వాణి పలుకుచున్నను నేమియుఁ జేయనేరక పీరన్వైసా 'నాయనా, నీవు సింగపుఁగొదమవు. నీయిచ్చవచ్చినదెదను లెమ్మ'ని తనమాతతోఁగూడ సూర్యోదయంబగు సరికి యుద్ధసన్నద్ధములయి ఆక్ససునది కిరువైపుల బారులుదీరి యున్న రెండుసైన్యములకు మధ్య ప్రదేశముం జొచ్చి ముందుకు నడువ నుంకించుచుండిన తార్తారుసైనికుల నిలిపెను. అవలి సేనాధిపతియగు ఫెరూదు ఈతనింజూచి తన సైన్యముల వెనుకకుంద్రోసె. అంత తార్తారుసేనాధిపుఁడు సైకతస్థలమధ్యంబున నిలువంబడి అనిమేషులై పరికించుచుండిన సైన్యంబులం దిలకించి

ఓయి ఫెరూద! ఓ పారశీక యోధులారా!

కం. దిక్కులయశమును నించుచు
మక్కువమీరంగఁగొలుచు మాసొహ్రాబు
న్నొక్కఁడెఁబోరఁగ యోధుని
నొక్కని నేర్పఱచిపనుపుఁ డోడుదులేమిక్.

అని తన సందేశంబుం దెలిపె.

ఈ యుత్పాతంబును వినినంతనె పారసీక సైన్యంబుల గుండెలు ఝల్లుమనియె. నాయకులెల్లరుం సభఁజేరి కర్తవ్యంబు నాలోచించిరి. "సొహ్రాబును జయింపఁగల శూరుఁడు మనయం దెవ్వఁడుగలఁడు? వీని సాహసంబా యపారంబు. వీని చుఱుకుఁదనమా యగణంబు. ఇట్టి వీని తాకుడున కెవ్వండోపు?" అని వగచి, తెఱవుగానక ఎట్టకేలకు గుడార్జ అను వాఁడిట్లనియె.

ఓయి ఫెరూదా! మనమీ ద్వంద్వయుద్ధంబున కోడంబడకున్న నంతకంటె యవమానకరంబుండదు. కావునఁ దప్పక నీవువెళ్ళి సొహ్రాబునకుం దగినవీరుని ఎదురొడ్డుదమని పలికిరమ్ము. రుస్తుము నిన్నటిరేయే యిట జేరియున్నాఁడు. సంబంధమేమియు లేనివానింబలె ఉదాసీను

డయి మన విడిదికిదూరమున పటకుటీరము వైచికొనియున్నవాడు. నేనతనిం జేరి తార్తారుల విజృంభణమును వర్ణించి సొహ్రాబుపేరును వయస్సును జెప్పి పురికొల్పి ఎక్కటికయ్యంబునకియ్యకొనునట్లు పన్నెదను."

ఈమాత్రము ధైర్యము నిచ్చుటతోడనే పెరూదు ముంగ నడిచి వీరసైన్యసానుజూచి

"ఆర్య, వినుమిష్ట మేము విూయభిమతంబు
దీర్ప సమకట్టి తేజస్వి ధీరునొకని
పనుపనున్నాము సొహ్రాబుపాలి మగని
కాన నాతని నాయత్తుఁ గమ్మనుండు."

అని బనులుపలికె. సైన్యంబులు దమ దమ స్థానంబులుచేరె. గుడార్జు రుస్తు మేమనునో మన తెలంగెట్లగునోయని యుయ్యేలలూగు చిత్తంబుతో పారసీకశిబిరముంగడచి రుస్తుము విడిదికింజనియె. అట నాతఁడును ప్రాతఃకాలభోజనముదీర్చికొని యుబుసుబోఁనడచుకొ అస యొకడేగను హస్తముపై నిడికొని కాలముపుచ్చుచుండెను. గుడార్జును జూచినంతనే లేచియాపక్షి నటుంచి స్వాగతంబొసఁగి భోజనమునకుం బిలిచె. సమయము బురస్కరించుకొని గుడార్జు కుటీరద్వారంబుననె నిల్చి "భోజనకాలము మించఁగలదు. ఇది యదనుకాదు. కర్తవ్యంబు వేరు. తార్తారులు మన గౌరవము నపహరింపనున్నారు. వారి వీరుండగు సొహ్రాబుపేరు నీకుం దెలిసినదియే. అతనిపుట్టుక ఎవ్వరికిం దెలియదుగాని ఆతని ప్రతాపంబు మాత్రమెల్లరకుం దెల్లంబె. నీశక్తింబోలినశక్తియె యాతనిది. పారసీక వీరులు ముసలులో బలహీనులో అయియున్నారు. అందఱును నీ యెడకె దుష్టులు సారించుకొని యున్నవారు. కావున నీవ మాకిప్పుడు ఉత్తారకుడవు" అని బ్రతిమాలుకొన మొదలిడెను. రుస్తుమద్దానికి "పో! పొమ్ము! పారసీకవీరులు ముసలులయిన నేనంతకంటె ముసలిని. అందు యౌవనులు బలహీనులందువా? కాదు. కాదు. మనరాజు గారికి వారే బలవంతులు. ఇదంతయు నాకేల. నాకు బుట్టినదొక యబలయగుటం బట్టిగదా నాతండ్రి 'జాల్'ను అఫ్ఘనులు వేధించుచుంట. సొహ్రాబంతటి కుమారుఁడే నాకుండియున్న యుద్ధభూమికి వానినంపి నేను నాముసలితండ్రిని జూచుకొనియుందునుగదా! ఇప్పుడేమయ్యె. సొహ్రాబుతో నేమి? మఱి యెవ్వరితోనేమి? నేనుపోయి హాయిగ నా తండ్రివద్ద నుండెదను. కృతఘ్నుల కొలువేలవలయు, నేనిఁక నాయుధములఁ దాకను" అని చిఱునవ్వొలయ నాడి యూరకుండె. గుడార్జు "ఆర్యా! రుస్తుము: సొహ్రాబు మనవీరులనెల్లఁ దృణీకరించి నిన్నే వెనుక చుండ నీవు తలఁదాచికొనిన లోకులేమందురో గణింపుము.

ఉ॥ జీవితకాలమంతయును జెప్పగరాని వెకల్భరించి తా
నేవిధినైనఁబుణ్యముల హెచ్చుగఁగూర్చు పెగొప్పగామదిన్
భావనసేసిచేర్చి ముదిపాల్పడ పీడఁగలేకలోభి పె
న్గావలమందిపోవుక్రియఁగా తరుఁడయ్యెనురుస్తుమంచులో
కావలియాడఁగావినుట గార్యమెకో మనవీరవృత్తికిన్ ॥

అని నొనాడఁ బల్కెను. రుస్తుము వీరావేశమునలేచి ద్వంద్వయుద్ధమున కియ్యకొనియెను. కాని తానురుస్తుమని ఎవ్వరికిని తెలియరాదనియు అవిధమునను పోరుసల్పెదననియు నతఁడుసమయము చేసికొనెను. గుడార్జుసంతోషమున బయలుదేరిపోయెను. సొహ్రాబురుస్తములిర్వురును ఎక్కటిపోరున కాయత్తులయిరి. రుస్తుమును పారసీకులెఱుంగరే కాని తార్తారులెఱుంగరు. అతఁడు సాయుధుండయి యుద్ధరంగమును మొదట బ్రవేశించె. తన్నుపట్టుదలతో వెదకుకొనుచు వచ్చుచుండిన సొహ్రాబు యొక్క సౌకుమార్యమును సౌందర్యమును జూచుటతోడనే రుస్తుమున కాతనిపై యొకవిధమగుఁ బ్రేమకలిగి మనస్సుగఱఁగఁజొచ్చెను. అంత నాతడు సొహ్రాబునుగుఱించి "చిన్నవాఁడా, ఏల వృధాయాసపడెదవు. నేనుబహు జయములందినవాఁడను. వయసుముదిరినవాఁడ. నీవింకను బాలుఁడవు. శుభములు పడయవలసినవాఁడవు. భౌతిక సౌఖ్యంబులింకను నీకు రుచికరంబులు. ఆస్వాదనీయములు. కావుననవసరంబుగమృత్యుముఖంబున కురుకవలదు. మాపారసీకంబునకురమ్ము. నాకొమరుండవు బలెనుండుదువుగాక, యని మృదువుగఁబల్కుటయు సొహ్రాబునకు నిజస్థితికొంతదోచి ఆశయంకురింప మోకరించుకొనుచువచ్చి "ఆర్యా! నిజముపల్కుము, నీవురుస్తుమవుగావా? దాచకుము. చెప్పుము' అనిప్రశ్నించెను. ఇదిరుస్తుమునకు విపరీతంబయి తోచె.

తార్తారు యౌవనులు కపటులు. ఇప్పుడు నేనురుస్తుమననియొప్పుకొంటినేని వీడేదియో మిషపన్ని నన్ను పొగడి నాతోఁడఁబోరక వెడలిపోవును. తరుణము దొరకినప్పుడు తక్కుంగల పారసీకనాయకులను పరిహసించును. అహో! నావలన వారెల్లరకును నవమానమౌ బగునుగదా! కావున నేమరరాదు. ఈకపటబాలునకు అనవసర ప్రసంగమున కవకాశమిచ్చుటతగదు. అనితలపోసి కినుకవహించి సొహ్రాబునకుమరలి,

"ఓయీ! లెమ్ము. రిచ్చకోరికలేల పెట్టుకొనెదవు. రుస్తుమునేల వెదకెదవు. ఆతఁడే నేఁడు నీకెఱుంగునట్లు నిలిచెనేని నీవుపోరుమాటయే తలపెట్టకుందువు. ప్రసంగమిఁకఁ జాలు. నీవుకోరుకొనిన తెఱంగున పారసీకపక్షమున నేనొకయోధుఁడ నిన్నెదిరింపవచ్చినాఁడ. పొగరువిడనాడి జితోస్మియని లోఁబడితివా తప్పినది. లేకున్న నీయెముకలనీభూమికి బలియిత్తు"నని గర్జించెను.

సొహ్రాబునకీమాటలు ములుకులయినాఁ "అవును, నిజంబ. రుస్తుమే వచ్చినయెడ పోరేలేకపోవును. ఆతండు దూరంబున నున్నాఁడు. మనకిప్పుడు పెనగుటతటస్థించినది. నీకు వెఱచుటకు నేనుబాలికనుగాను. నీభయంబు నాకులేదు. రమ్ము. చూతముగాక యనిప్రత్యుత్తర మిచ్చుచుండగనె రుస్తుము ఈటెనుగొని యుద్ధమారంభించెను.

తండ్రీ కొమారు లొక్కరినొక్కరు గుర్తింపక బహుకాలము హోరాహోరిగబోరిరి. రుస్తుము సొహ్రాబును సొహ్రాబురుస్తుమును దప్పించుకొనుచు మాపరుల నద్భుతంబునముంచుచు పరాక్రమముంజూపిరి. మొదటినుండి సొహ్రాబునకు ననుమానంబె. తన్నెదిరించినపురుషుండు రుస్తుముగానే యుండవలెనని తలంచె. ఇట్లుండ నొక్కతఱి రుస్తుము గదద్రిప్పివేయుచు దానితోడన తానునుభూమికిపడెను. ఇసుమున సగముస్ప్రుక్కలి దప్పిపడిన యాతనిపై కత్తిదూయక సొహ్రాబు చిరునగవున దూరముతొలగి

"ఏల యిూలీలనెనంగెదవు. నీయాయుధము నాపయిన్పడకున్నయది. నీవు రుస్తుమునుకానను చున్నావు. మఱియెవ్వరవో తెలియకున్నది.

నీయందు నాహృదయంబిట్లు లగ్నంబగుట కేమికతం? నేనెన్నియో యుద్ధములుచేసినాఁడనుగాని యెప్పుడును నామనంబిట్లాకర్షితము గాలేదు. ఇక మనకు వైరమువలను. నిన్నెదిరింప మాసేనయందును నన్నెదిరింప మీసేనయందును శూరులున్నయెడ వారితోఁ బోరుదముగాక. మనకు నిరువురకు వైషమ్యంబేలః యని రుస్తుమున కనియెను. కాని రెండుసైన్యములయెదుట పరాభవము నందియుండిన రుస్తుమునకు మాత్ర మీమాటలసహ్యంబులయి కోప సొహ్రాబునకు రోషము పుట్టునట్లు నిందావాక్యముల నొక్కింటిపై నొక్కటిని పేర్చెను. అంత నీయిరువురకు మరల కయ్యంబయ్యె. రుస్తుమెన్నియోమారులు దెబ్బలుతిని తుదకు 'రుస్తుమ్' అను సింహనాదముతో నీటెనెత్తెను. ఆమాట వినవచ్చినంతనె సొహ్రాబు విభ్రముఁడైనిలిచి చేతనుండిన డాలును జారవిడిచె. అంతట రుస్తుముపైచివ ఈటె సొహ్రాబు ప్రక్కడొక్కం జొచ్చె. అతఁడు నేలగూలుటతోడనే అతనికిఁ గమ్మియుండిన అంధకారంబును ఆవిరియు విరిసిపోయెను. రుస్తుము సొహ్రాబుం జూచి తిరస్కారభావంబున ఓయీ! నీవీరంగమున షార్శీకయోధు నొక్కని ద్రుంచి యశముగాంచ నెంచితివిగాదె! రుస్తుము నీకు యెదురుపడి పోరాడుననియూహించితివా? అతఁడు వచ్చిన నీమాయలచే నతని లోబఱచుకొని ఈవులచే సంతృప్తిపఱచిపంపి అంతటివాని సమానుఁడనైతినని చాటనుంకించితివిగదా! అట్టి పేరాసలకు నుచితమైన ఫలముంగంటివిగా' యనిపల్కె.

అంతట సొహ్రాబు ఆహా! ఏలయీ ప్రేలుడు. నీవంటివారుకడు పులుగట్టివచ్చిన నశ్రమంబున నాకశంబయి యుందురు. కాని నీవెత్తిన రుస్తుము నామంబును నీయందేదికయో చెప్పనలవిగాని యనురాగంబును నాకుంగల పితృభక్తియు సాయుధుండయి యుండిననన్ను నిరాయుధుం జేసినవి. ఇంతటితోఁ బొంగిపొరలఁబోకుము. నాతండ్రి రుస్తుము. ఈ నీదురుద్యోగము న్వినినేని నిన్ను బోరిగొనకమానఁడు. ఏనాతండ్రిని కనీ లోకమంతయు వెదకుచుఁ దిరుగుచున్నానో ఏనాతండ్రి మహావీరుఁడై విస్తార విఖ్యాతిగాంచి యున్నాఁడో అరుస్తుమే ఈనీదుష్కర్మకుఁ దగుఫలంబు నీకొడఁగూర్చుంగాక. యనిగంభీరముగఁ బల్కుటయు ప్రాను పడినవాడుంబలె రుస్తుముదిగాదిగ చూచుచు నిలువంబడియె. కొంతవడికి చిత్తము కలఁకదీర్చుకొని నమ్మకముకుదురమింజేసి 'ఏమి, ఈప్రల్లదము రుస్తుమునకు కొమరుఁడులేనేలేడుగదా!' యనిదృఢముగఁబల్కె. లేశం డునే కలండు. ఆదురదృష్టుండగు పుత్రుండ నేనె. నాతండ్రిదర్శనంబు నాకలభింపదయ్యెను. అయిననాతనికి నావార్త తెలియకపోవునా! నిన్నాతడు మచ్చమాపక విడచునా! అకటా! అడరుబేజమనందు కురుడుల రాజగు ముదుసలి తండ్రితోడంగూడనుండు నాతల్లి యెంతెవగవుం జెందునోగదా. తన్ను దిక్కుమాలినదానింజేసి యూరుపేరులేని వానిచే యుద్ధభూమింబడితినని మాయమ్మచెవులబడిన నామె యెంతవిలపించునోయెఱుంగనగునా" అనియనుచు దుఃఖము క్రమ్ముకొనిరా తల్లినిదలంచి విలపింపదొడంగె. రుసుము అగాధమగు యోజనయందు మునింగియుండెనుగాని సొహ్రాబు తనకుమారుండను నమ్మకమింకను నాతనికిఁబుట్టదయ్యెను. ఎన్ని లెంగుల జ్ఞాపకమునకుఁ దెచ్చుకొన జూచినను, దనకుఁ గలిగిన దొకపుత్రికమాత్రమేయని యాతనికిఁదట్టుచుండెను. ఆహా! ఆతండేమిచేయఁగలఁడు. మహావీరుండగు నతఁడు పుత్రుడుపుట్టెనని విని నమాత్రమునఁ దనంతట వీరుంజేసి యుద్ధభూములకు బంపునను వెఱపున రుస్తుము భార్య సొహ్రాబు జన్మముంగప్పిపుచ్చి తనకుఁబుట్టినది స్త్రీశిశువని తెలియపఱచియుండె. అందువలన నెంతతడవినను రుస్తుమునకుతన పుత్రుడని స్ఫురింపదయ్యె. అయినను సొహ్రాబు వాక్యములవలన రుస్తుమునకుఁ దనచిన్నతనంబంతయు మఱలయుద్ధమునంగవలె మనమునకుగోచరమయ్యె. తనకు నోడిపడియున్న ఆబాలునిముఖమునందుఁ దనవర్చస్సెకొచుటయు తటస్థించె. అంతటహృదయమున దుఃఖముపుట్ట "నాయనా సొహ్రాబు! నిజముగా పుత్రుఁడవైతివేని రుస్తుమునకు నీకంటెప్రియతముండు వేరొకడుండునా. నీవేపారఁబడినాఁడవో లేకున్న నీకెవ్వరైన నబద్ధములాడిరో నీవుమాత్రము రుస్తుముకుమారుండవుగావు. అతనికొక్క కుమార్తెమట్టుకుఁగలదు. ఆయబలనిప్పుడుతలపెట్టనేల? తల్లితోఁగూడనామె ఎవ్వియో గృహకార్యములఁ జక్కబెట్టుకొనుచుండును" అనివాక్రుచ్చె.

ఈమాటలు వినుటయు సొహ్రాబునకు పట్టరానికోపముపుట్టి 'ఓరీ, ఎవ్వండవురా నీవు. మృత్యువాసన్నమయినవారి పెదవులసత్యమే గదా నెలకొనియుండును. నాజీవితకాలంబునను నేదబ్బరలాడియెఱుంగను. తన శువు బాహువులపై చిత్రింపవలసినదని మాతండ్రిరుస్తుము మాతల్లికింగనుపఱచిన చిహ్నము నాదేహముపైనున్నది. అదియే నావాక్యముల నిజముదెలుపగల" అనుమాటలు సొహ్రాబునోటినుండి వెలువడి వెలువడకమున్నె రుస్తుము ముఖవికాసము నమసిపోయె. కాళ్లు వణంకె. అవిరులుగ్రమ్మె, జారిపోనున్నగుండెను హఠాత్తుగఁబట్టిస్థానంబున నిలుపనో నాబలంబగుహస్తము ఒక్కవిసురున నెదపైఁబడికవచముం ధ్వనింపజేసె. ఎంతోకష్టముతో రుస్తుము 'నాయనా సొహ్రాబు! అట్టిదానిం జూపితివేని నీవు రుస్తుముపుత్రుండు నిక్కంబె' యనిహీనస్వరమునపలికెను. అంత సొహ్రాబు బలహీనంబగుచుండిన తనవ్రేళ్ళతో త్వరితగతి నడుముపట్టాను సడలించి కవచముందిగిచి బాహువుపైపొడువంబడియుండి సుందరమగు మచ్చనుజూపించెను. తనముద్దుటుంగరపు జిహ్నముంగనినతోడనె రుస్తుమునకు స్తంభంబుగలిగె. నోరాడకపోయె. కన్నులు కదలుట మానె. ఉచ్ఛ్వాస నిశ్వాసంబులొక్క త్రుటికాలంబునిరుద్ధంబయ్యె. 'నాయనా! నీతండ్రి' యను వెఱ్ఱికేకతో గొంతడచికొనియె. కన్నులు మూసికొనివచ్చె. లోకము దిద్దిరందిరిగి నట్టయ్యె. పాదచ్ఛేదితవృక్షమట్లు రుస్తుము నేలంగూలె.

సొహ్రాబుమనంబు నప్పుడెట్టి వైకల్యము జనించెనో మనమెఱుంగజాలము. కాని యాతఁడు మెల్లగ తండ్రివగ్గరకుఁ బ్రాకి ఆతని నల్లనల్లన తడవి ఎట్టకేలకు స్మృతిగనునట్లు చేసె. మఱలకనులువిప్పి కుమారుంజూచి రుస్తుమనుభవించిన దుఃఖమును వర్ణించుట సాధ్యము కాదు. కాని

స్వాహాబు ధీరుఁడుగాన తండ్రినెంతో యౌదార్యుఁ బ్రయత్నించిలేన తార్తారుసైన్యంబులయెడ కరుణజూపుమని నుడివి ప్రక్కనుగుచ్చుకొని యున్న ఈటెను బెఱికివైచి ఎడనెడ తండ్రి సెలవు కొనువానివలెనాత నిముఖముంజూచుచు ప్రాణములవదలె. రుస్తుము నిండుగఁగప్పుకొని పుత్రునివిడువక అక్ససునదీ సైకతముల కూర్చొనియె. తిమిరములునిండారె. సైన్యములెచ్చటి వచ్చటికింజనిరె.

అక్ససు మహానది అపట్టునుండితరలి కొంతదూరమునిర్మలమయి స్వచ్ఛమయి ప్రవహించి మఱికొంతదూరము దాట్లువైచుకొని పరుగ లిడిఆపై కొంతదూరము ఇసుకదిబ్బలడ్డుపడుటచే పాయలయి శుష్కించిఎన్నిరౌ త్రిప్పఁడుఁలంబడి తుట్టతుదకు రత్నాకరంపువీచికలనాదము హాయినొసఁగ చేరిమహాంబుధియందు లీనంబై తనలోనుండియుద్భవించుతారకాగణ సముదయంపు మిమచేచిరునగవున నలరుచు స్వాహారాబు రుస్తుములు ప్రకృతితో లీనంబగుటను జాటుచుండె.

# "యద్దృశ్యమ్, తన్నశ్యమ్"

[వేంకట పార్వతీశ్వర కవులు.]

గీతము.

ముద్దులొలికించు చివురులో ♦ మొగ్గవోలెఁ 1.
దావులను జిమ్మెడు గులాబి ♦ పూవుపగిది
పగటియందుఁ బ్రభాతసం ♦ ప్రత్తిగరణి
నక్షులనుదన్ను నుదయారు ♦ ణార్కునట్లు
పాటపాడుచు నెగిరెడు ♦ పక్షిమాద్రి 5.
నల్లనల్లన నీఁ నురా ♦ యంచరీతిఁ
దానములఁబాడు వల్లకీ ♦ తంత్రిలీల
విశ్వమంతట నలమిన ♦ వెలుఁగుపోల్కి
లలితపరిమళ మలయాని ♦ లంబులాగు 9.
తొలుకరిందోచు శాద్వల ♦ తలమువలెను
కడఁగి క్రొత్తగ మొదలిడ్డ ♦ కథ కయివడి
మలయుచుంచులఁ దగుమేఘ ♦ మాలభాతిఁ
బుట్టి, కనువిచ్చి, పురిటింటఁ ♦ బొలుపుదెలిపి 13.
చిన్ని నెమ్మోని నిగ్గులఁ ♦ జెంగలించి
జెక్కులల్లార్చి, ఊ, యని ♦ నిక్కినిక్కి,
తప్పటడుగులఁదారి తా ♦ తాయటంచు
ముద్దుమాటలఁ బాటల ♦ మురువునూపి 17.
శరణమున రత్నదీపమై ♦ జవ్వనంబుఁ
గాంచి, కులమెల్లఁ దనలోనఁ ♦ గలుపుకొనుచు
జీవయాత్రను నూతన ♦ సృష్టిఁగూర్చి
సంతతులతోడ మెఱయుచు ♦ సంతసంబు 21.
మూఁగి లోకానుభవము తె ♦ న్నుంచుకొనఁగ
జగతి నలరారుచుండును ♦ జనుఁడుఁగూడఁ:—
గాని, యోచింపఁ బ్రకృతిసం ♦ కలమునను
తూర్మితలంబునఁదోఁచు నై ♦ జంబుగలుగు 25.
సకలమైన చరాచర ♦ సంతతికిని
భవము నాశంబుఁగూడఁద ♦ ప్పనివె సుమ్మ!
మొగ్గవిడిపోవును, గులాబి ♦ పువ్వువాడుఁ;
గాంచుచుండఁగనె ప్రభాత ♦ కాలమేగు; 29.
నరుణబింబంబు పడమట ♦ నస్తమించు;
మరియువిహగంబు గిరగిరఁ ♦ దిరిగిపడును;
ఈఁదురాయంచ మృతిదరికేగియాఁగు;
స్వరములలయించు తంతువు ♦ సాగితునియు;
వెలుగగిరిపోవుఁ; బరిమళా ♦ నిలమునడగు
నెండచే లేఁతపచ్చిక ♦ యెండిపోవుఁ;
గ్రమముగాఁముదముట్టును ♦ కథయుఁగూడ;
మాయమగు నంతలో ♦ మేఘమాలికయును; 37.
కూరుచుండఁడు మనుజుండుఁ ♦ గూడఁజచ్చు.
చావుపుట్టువు లవధులు ♦ జీవితమున
కట్టిజీవిత మొకస్వప్న ♦ మట్టిదగును;
జననమారసిచూడని ♦ చ్చటికి మొదలు, 41.
చావుఁదలపోసితెలియ న ♦ చ్చటికి మొదలు;
భూతపంచకమనియెడి ♦ పోగులెల్లఁ
దడవిపురినెట్టి కూర్చిన ♦ త్రాడువంటి
దగును జీవంబు; క్రమముగా ♦ నట్టెసాగి 45.
బిగిసి బిగ్గరగాసాగి ♦ తెగునుతుదకు.
కానదృష్టంబు నష్టమన్ ♦ గణనఁజేసి
కొనియదృష్టంబునే దైవ ♦ మనిరిబుధులు.

# ఆంధ్రదేశమున క్రైస్తవ మిషనుల భావిపరిణామము.

[ఎమ్. సుశీల.]

పై విషయమునుగూర్చి వ్రాయుటలో మిషనుల వెనుకటి రిపోర్టులనైనను వర్తమానపు రిపోర్టు నైనను వేరె యితర సాధనములనైనను సహాయముగా గొనక, ప్రకృతపు మిషనుల స్థితిగతులను సింహావలోకనముఁ జేయుటచే నాయందుద్భవించిన యల్పానుభవమును మాత్రముపయోగించినాడను. మరియు క్రైస్తవమత బోధనైనను తద్బోధ సత్యస్థాపనము నైనను క్రైస్తవమత ప్రతిష్ఠుల సంఖ్యనైననుఁ జర్చించుటకుఁ బూనుకొనలేదని వాచకులు గ్రహింపఁ బ్రార్థితులు.

ప్రతికార్యమునకుఁ బర్యవసానముండుట సహజము. కాని యొక కార్యముయొక్క పర్యవసానమెట్లు కాలగతిలో మార్పునొందునో, అదెట్టి రూపముధరించునో, వివరించి వ్యక్తీకరించుట సులభసాధ్యముకాదు. వర్తమానమున సంభవించు నేదేని యొక కార్యమునుఁ, జర్చించి దాని విశదీకరించుటకు బూనుచోనది యెంతయో ప్రయాస పరిశ్రమ యుక్తమైయుండగా తత్కార్యము యొక్క భవిష్యత్తునుఁ గ్రహించి ప్రపంచమునకుఁ బ్రకటించుట మరింత దుస్తరముగానుండకమానదు. అయిననొక్క కార్యము కష్టతమమని, దాని ప్రస్తాపనమె, మానుట మానవ నైజముకాదు. కావున నీ యాంధ్రదేశమున మిషన్ ప్రవృత్తుల ప్రస్తుతస్థితినిఁ జక్కగా విచారించి వాని విధి విధానముల బరీక్షించి సూక్ష్మవిచారణ గావించిన యా మిషన్ ప్రవృత్తుల భవిష్యద్రూపము మనము కొంతవరకైన నూహింప శక్తికల్గును.

రమారమి యొక శతాబ్దమునుండి క్రైస్తవమిషనులాంధ్రదేశమునఁ బ్రవేశించి పనిచేయువిషయ మెల్లరు నెరిగినదె. విదేశమునుండి వచ్చిన యామిషనుల ప్రథమభావము క్రైస్తవమత వ్యాపకము. విదేశీయులు పైభావము నెగ్గించుకొనుటకు, దమ కుత్తమములని దోచిన సాధనములను నేటివరకును నుపయోగించుచు వచ్చుచున్నారు. కనుక వారు తాముబూనిన యాకార్యమున నెంతమట్టుకు సిద్ధినిగాంచిరో ఆవిషయము విమర్శించిన విమ్మటగాని మిషనుల భవిష్యత్తేర్పడదు. ఈకార్యమున దాముద్దేశించినరీతి చాలమట్టుకు ఇష్టార్థసిద్ధిని గాంచియున్నారని నేక్రింద చెప్పఁబోవు సంగతులవల్ల గ్రహింపనగును.

(1) ఆంధ్రులలో ననేకులు క్రైస్తవమతబోధ నంగీకరించి తన్మతాచారములకు లొంగుట.

(2) క్రైస్తవులను సంఘములుగాఁజేర్చి యాసంఘపాలనను దమవశములోఁ బెట్టుకొనుట.

(3) క్రైస్తవ స్త్రీపురుషులను మతవ్యాపకోద్యోగమునందు నియమించుకొని వారిద్వారమునఁ గ్రైస్తవుల సంఖ్య నభివృద్ధి పరచుకొనుట.

(4) ఉన్నత విద్యాశాలలును కళాశాలలును స్థాపించి వానివలన దమ మతవ్యాపక కార్యమును సఫలపరచుకొనుట (మద్రాస్) క్రైస్తవకళాశాలనుండి ప్రథమమున క్రైస్తవమతము స్వీకరించినది ఆంధ్రుడే.

పైజెప్పినవానివలనను మరికొన్ని విధములవలనను వీరు దమ యిష్టార్థసిద్ధిని బొందియున్నను, నింకను తద్విషయమగు తృప్తినిఁగన్పరచి, ఆంధ్రదేశము క్రైస్తవాంధ్రులచేఁగాకఁ దమవలన మతవ్యాపకమునకు వశవర్తి గాదని కనుగొని యిప్పుడిప్పుడు స్వదేశీయులే స్వపాలన స్వపోషక స్వవ్యాపక భారముల వహింపఁదగినదని క్రైస్తవాంధ్రులనుఁ బ్రేరేపించుచున్నారు.

వారిట్లు తమ సంపూర్ణ మనోభీష్టము బొందలేదని యతృప్తి జూపుటవలన వారిలోను వారుపయోగించు వి

విధానములలోను స్వదేశ క్రైస్తవులలోను హైందవాంధ్రులలోను ప్రతిబంధకములుండినట్లు తేలుచున్నది. కనుక నా ప్రతికూలము లెట్టివో మనము తరచిచూచుట యుక్తము. కాబట్టి మొదట విదేశీయులలోని లోపములను విచారింతము.

కృతఘ్నుని బగిది విదేశీయుల లోపములను విచారించుటకు బూనుకొనలేదని గ్రహింప వేడుచున్నాను. ఏలయన విదేశీయు లాంధ్రదేశమున కొనర్చిన మేలెన్నవరితరము? వారు తమ స్వసంఘములనుండి పోగుచేయబడిన ద్రవ్యముతో వచ్చి వ్యయప్రయాసములకోర్చి స్వసంఘబహిష్కృతులవలె తమ యాచారపద్ధతుల కన్యంబైన ఈయాంధ్రదేశమును మాతృభూమిగా జేసికొని తమహృదయతరంగమున నలవాలమై నెలకొనియుండు సుదివ్యబోధ వ్యాపకమును గావను దేశించియున్నారు. అజ్ఞానాంధకార బంధురంబైన ఈయాంధ్రదేశమును జ్ఞానజ్యోతిర్మయముజేసినది వీరిప్రయత్నములే కావా. స్త్రీవిద్య, జాతీయాభిమానము మన్మజాత్యుద్ధరణము మొదలగు విషయములయందభిమానము పుట్టించినది వీరివలననే కాకుండిన మరెవ్వరివలన? ఆంధ్రులు తమ వేదపురాణములను శోధించి, వాని సత్యాసత్యములను వెల్లడిచేయుట వీరిచే నియ్యబడిన జ్ఞానజ్యోతివలననే కాదా! ప్రస్తుతమును వీరు భావిసత్ప్రచారకులకు తాజగాలు పెంచువారుగా నున్నారు. కనుక వీరిలో లోపవైకల్యము లుండవని చెప్పను. గనుక విదేశీయ మిషనెరీ లందరు నాంధ్రులచే గౌరవింపబడుటకర్హులని నిశ్చితముగ నుడువుచున్నాను.

కాబట్టి వారిలోని వ్యాపారవిధులను వారి కార్యసిద్ధికి విఘ్నముగా నుండువానిని. మొదటిది శాఖాభేదము "మునుందే గ్రోలుచున్నట్టు దానిమీద రోకటిదెబ్బ" యను లోకోక్తిననుసరించి, లండన్ మిషన్, ఎస్. పీ. జీ. మిషన్, బాప్టిస్టుమిషన్, లూథరన్‌మిషన్, వెస్లియన్ మిషన్, కనేడియన్ బాప్టిస్టు మిషన్, ఇత్యాది శాఖాభేదములను మునుపే జాతి, మత, సిద్ధాంత భేదములచే బెనగులాడుచున్న ఆంధ్రదేశమునం బ్రవేశపెట్టియున్నారు. ఇట్లుచేయుటవలన క్రైస్తవాంధ్రులలో నేపరస్పర భేదములుద్భవించి ఒండొరుల భ్రాతృత్వబోధ క్రైస్తవ మతములోనే లేనట్లు స్థిరపరచబడినది.

రెండవది:—వీరు తమ మతవ్యాపకవ్యవస్థలో ప్రభుత్వమువారిని బోలినట్టి పద్ధతుల ననుకరించుట. స్వదేశబోధకులు, ఉపదేశకులు, అయ్యవార్లు మున్నగు తరగతుల నేర్పరచి వారువారు చేయదగినపనులలో వారికిచట్టములను గావించి వారియందరికి దాము పైవిచారణ కర్తలుగా నిలువంబడి రాజ్యాంగ ప్రభుత్వము కైవడి సంఘపాలన మతవ్యాపకములనుం జేయబూనియున్నారు. ఇందువలన అధికారి సేవక ప్రమాణమేర్పడి సమానత్వమును అన్యోన్యమైత్రియును చెడుటయేగాక ఫలమపేక్షించి మానవసేవ జేయువిధానమును నెలకొల్పినది. ఈపద్ధతివల్ల జీతమునకు మాత్రమే పనిచేయు అలవాటు క్రైస్తవాంధ్రులలో స్థిరపడియున్నది. మరియు నీవిధానము హైందవాంధ్రులకును, క్రైస్తవాంధ్రులకును అన్యభావముగా జూపట్టుచుండును.

మూడవది మతప్రచారకులు దామెవరిమధ్య నివసించుచున్నారో వారిఅలవాటులను వాడుకలను పద్ధతులను గ్రహించి అనుసరించకపోవుట. ప్రస్తుతము విదేశీయులు ఆంధ్రులతోంగూడ కలిసిమెలిసి వారిసుఖదుఃఖములలో పాలివారలైయుండుట కొప్పుకొనరనునది అందరకు తెలిసినదే. ఇట్లుచేయుటవలన దమబోధకులను, తమవర్తనమునకును భేదించుచున్నాము, వారినుండి కేటించుకొనట్లగును. మరియు తమబోధవినువారి యాంతర్యాభిప్రాయములను, మనోవృత్తులను గ్రహించనేరక తాముచేయుబోధ వారిహృదయములలో ఫలించుచున్నదో లేదో తెలిసికొనుట కవకాశముండదు. ఇక క్రైస్తవాంధ్రులలోని లోపములనుగురించి కొంచెము విచారించెదము.

క్రైస్తవాంధ్రులలో చాలమంది పంచమాన్వయులనుండి సమీకరించబడియుండుటంజేసి వీరువిద్యాధికులు గాని ధనాఢ్యులుగాని కారు. వీరు తమ బాల్యావస్థనుండి నిరంతరము పరాన్నభుక్కులై పరతంత్రులై అగ్రజాతుల వారి నిరాకరింపునకు అధీనులై యుండుటవలన వీరార్జిత



The Late

కీర్తిశేషులయిన జపాను చక్రవర్తిగారు.

The New Emperor of Japan.



ప్రకృత జపాను చక్రవర్తిగారు.



President Poincare.　ఫ్రెంచి ప్రెసిడెంటు పోయింకేర్.



The Emperor of Germany. జర్మను చక్ర

Mr. Winston Churchill



విన్‌స్టన్ చర్చిల్ గారు.

Mr. Asquith.



ఆస్క్విత్‌గారు. ముఖ్యమంత్రి

The Late Mr. W T. Stead.



కీర్తిశేషులైన విలియం. టి. స్టెడ్.

The Late General Booth.



కీర్తిశేషులయిన జనరల్ బూత్.

Blocks by the Bombay Art Printing Press.



Nawab Salar Jung Bahadur. నవాబ్ సాలర్‌జంగ్ బహదూర్.



Nawab Fardoon Jung Bahadur. నవాబ్ ఫర్దూన్‌జంగ్ బహదూర్.



Pradhana Siromani Ananda Rao garu. ప్రధానశిరోమణి ఆనందరావుగారు.



Dewan Visweswariah garu. దివాన్ విశ్వేశ్వరయ్యగారు.

స్థితినొంది స్వతంత్రులై మనుటకును, ఎల్లప్పు డితరులచే సహాయమునొందుచుండిన వీరితరులకు సహాయము చేయ నేర్చుకొని మతవ్యాపకమునకు స్వయముగాఁ బూనుకొనుటకును నశక్తులై యున్నారు. వీరు సదా విగ్రహారాధన నిరతులై, పౌరాణిక మతాసక్తులై, మూఢభక్తి పరాయణులై భూతప్రేత పిశాచ సేవకులై, తమ భారమును గ్రహింపలేక యున్నారు. క్రైస్తవమత ప్రవిష్టులైన అగ్రజాతులనుండి క్రైస్తవులైనవారిసంఖ్య యతిస్వల్పము. అయిననువీరెకొంతమట్టుకు ధనాధికులును, విద్యాధికులునై యున్నారు. వీరుస్వవ్యాపకమును బూనుశక్తిగలిగియున్నారు. గాని వీరినాయకత్వముక్రింద వీరితోపాటు పనిచేయుటకు తదితరక్రైస్తవులశక్తులై యుండుటవలన వీరి సదుద్యమములు పుట్టినలోనెఅంతరించుట తటస్థించుచున్నవి. మరియు వీరిలో గొందరు స్వార్థపరులై తమబాధ్యతను కనుగొనుట కిచ్చగించకున్నారు. మరికొందరు విషయలంపటులుగను, నాస్తికులుగను, బ్రవర్తించుటకు మొదలిడి యున్నారు. క్రైస్తవాంధ్రులందరు క్రైస్తవమత సారాంశమునుగ్రహించనేరక మూఢభక్తిలోఁ బ్రవేశించియున్నారు. స్వమతమున దృఢవిశ్వాసము లేదు. అన్యమత సహనము లేదు. అన్యమత బోధయంతయు మిథ్యయని నమ్ముటకు వెనుదీయరు. నూతనవికాసమున గల్గినక్రైస్తవ మతానుభవ మెవ్వడేని ప్రచురించిన వానిని నిందించుటకుబూనుదురు. నూతనచైతన్య జిజ్ఞాసయేమాత్రమును లేకపూర్వాచారపరాయణత్వమున జిక్కియున్నారు. ఇకహైందవాంధ్రులలోని ప్రతికూలములను విమర్శించిన, క్రైస్తవమతము విదేశీయులనుండి వచ్చినమతమని భావించియద్దానిని దమవల్ల నయినంతమట్టుకు ద్వేషించి, యామతవ్యాపకము కాకుండునట్లు అభ్యంతరములు గలిగించుచు, మరియు క్షుద్రజాతు లనుసరించతగినదేగాని అగ్రజాతులకు తగదని యెంచుట మాచుచున్నారు. జనసామాన్యమంతయు, ద్విజులవశ్యులై మతాచారమునందుస్వతంత్రములేక బ్రాహ్మణులచేస్థాపింపబడిన పౌరాణిక మతానుసారులై ఏవిషయమునందైనను నూతనబోధ నంగీకరించని స్థితిలోనున్నారు. మరియు జాతిభేదమును వర్ణాశ్రమధర్మము నే శ్రేష్ఠమైన మానవధర్మముగా నవలంబించి తదితరులను హీనదృష్టితోగూడ జూచుటకలదు.

విద్యాధికులైన పురుషులును విదుషీమణులును, తత్వశాస్త్రసంబంధమైన మతమునపేక్షించి తేటగానుండుక్రైస్తవమతము నుపేక్షించుచున్నారు. వీరిలో కొందరుఆస్తికులును మరికొందరు నాస్తికులును, ఇంకాగొందరు విషయాసక్తులునై, పాపవిచ్ఛిన్నయాత్మ ప్రాయశ్చిత్తము నేమాత్ర మొప్పుకొనక చరించుచున్నారు.

ఇట్లు మతవ్యాపకము చేయువారిలోను మతబోధ వినువారిలోను భేదములుత్పన్నమై ఒండొరులలోనుండు నైకమత్యము నశించినది. ప్రేమానుబంధము విచ్ఛిన్నమైనది. కనుక నిరుపక్షములవారును దాముద్యమించు నిష్టార్థసిద్ధిని బడయుటెట్లు?

భగవంతుడు తనసంకల్పసిద్ధి నెరవేరుటకు కొన్ని యనుకూలములను కలిగించకపోలేదు. అయ్యనుకూలములను గైకొన్న కార్యసఫలత తప్పకగల్గును.

ఇప్పుడిప్పుడు క్రైస్తవులలో గొందరుమతవ్యాపకమాంధ్రదేశమున నలుపుట దమభారమనిగ్రహించి యాభారమునుఁ దమమీదవైచుకొనుటకు యత్నించునట్లు భగవత్ప్రేరేపకులైయున్నారు. మరియు ఆవిషయము కొంతమట్టుకు పరిశ్రమ జేయుచున్నారనుటకు దగినచిహ్నలు కానవచ్చుచున్నవి 2. మరియు పాశ్చాత్యులుకూడవీరిమనోభీష్టమును గౌరవించి యీకార్యమునందు దమయశక్తి నొప్పుకొనుచు స్వదేశీయులలోని యువతుల కొందరిని భావికాలమున నాయకులుగా నుండునట్లువారిని సిద్ధపరచుచున్నారు.

హైందవాంధ్రులు పాశ్చాత్యులతో సంబంధము కలిగినది మొదలు ధార్మిక సాంఘిక లోటుబాటులను గని వానిని సంస్కరించుటకై దృఢప్రయత్నము లొనర్చుచున్నారు. మఱియు నూతనజ్ఞానప్రసక్తితో స్వాతంత్ర్యమును సంపాదించుకొని ఆంధ్రరాష్ట్రమును స్థాపింప నిరతులై ప్రవర్తించుచున్నారు. నూతన చైతన్యము విద్యుద్వేగమున నాంధ్రప్రపంచము నంతటను వ్యాపించు

చున్నది. జపానీయులవలె జ్ఞానసంపాదన మెక్కడదొరికినను సంగ్రహించుకొనుటకు వెనుదీయరు. ఆంధ్రులీవిషయమునఁ దమ చుట్టునుండు ద్రావిడ కర్ణాటులకంటె ముందంజవేయుచుండుట యెంతయో శ్లాఘనీయము.

నేను పైనఁజేర్కొన్న విషయములనుబట్టి వానిపర్యవసానమునాలోచించినచో హైందవాంధ్రులును, క్రైస్తవాంధ్రులును ఒకేపరిణామమునకై పాటుపడుచున్నట్లు తేలుచున్నదిగాని ప్రస్తుతమీయభిప్రాయ మిరుపక్షములవారికిని, విపరీతముగా దోఁచును.

1 క్రైస్తవాంధ్రసంఘములు విమాతయగు విదేశీయులపాలనమునుండి వేరుపడి స్వదేశీయులపాలనలోనికి తప్పకవచ్చును. 2 ప్రస్తుతము విదేశములవారుపయోగించు విధివిధానములు స్వదేశీయులఏలుబడిలో గొప్పమార్పుచెందును. 3 హైందవాంధ్రులలోను క్రైస్తవాంధ్రులలోను నెలకొనియుండు మూఢభక్తియనాచారయుక్తమైనఅభిప్రాయములన్నియు విడిపోవును 4. హైందవాంధ్రులును క్రైస్తవాంధ్రులును, నేకీభవించి సామాన్య సంఘీభావమును కల్పించుకొని జాతిభేదమువలన గలిగిన పరస్పర నిరోధముమానుకొని ఐకమత్యముతో జరించుచు మత, సంఘ, రాష్ట్రవిశుద్ధిని దమహృదయ కమలముల నిడికొని ఏకాగ్రచిత్తులై ప్రవర్తింతురు. ఇట్లిరుపక్షములవారి యుద్యమములును కాలగతిలోలీనమై గర్భముదాల్చియున్నవి.

# *శ్రీకాళహస్తిక్షేత్రము.

[నాగపూడి కుప్పుస్వామయ్యగారు బి. ఏ.]

ఈదివ్యక్షేత్రమును దక్షిణకైలాసంబని యార్యులు వ్యవహరింతురు. కావుననే యీకొండకు నిప్పటికిని కైలాసంబనియే నామధేయము. ప్రసిద్ధకైలాసంబునుండి యొక్క శృంగంబును నంబుజాసనుఁడు తెచ్చి యిచ్చట లోకానుగ్రహార్థము మహేశ్వరుండు నివసింప నునిచెనని యార్యులందురు. ఇక్కడ నాదికాలంబునఁ బుత్రశోకార్తుండయి కుందుచుండిన వసిష్ఠుండను మునిశ్రేష్ఠుండు తదపనోదనార్థము పార్వతీవల్లభుగుఱించి తపంబొనర్పఁగా శివుండతని కిచ్చటఁ బొడసూపి యతని యుమ్మలికమ్ము మాన్పెనని చెప్పుదురు. పదపడిఁ గొంతకాలమునకు సాలెపురుగొక్కటియు, నొక నాగుఁబాము, నొక్క యేనుంగును, నొక్కటిగాఁ బెక్కులేండ్లు మిక్కిలి భక్తితోఁ దొలిచెయిదముల బలిమివలన మహేశ్వరుగుఱించి తపమొనరింపఁగా నద్దేవదేవుండు ప్రత్యక్షమై మీకెద్ది కావలయుననుడు నవి మేము మువ్వురము నొక్కటిగా నీరూపంబు వడయఁ గోరెదమనిన నట్లకాకయని యమ్మూవురకుం దన సాయుజ్యంబొసంగి శిలామయ లింగాకారముఁ జెందినాఁడని స్థలపురాణము నుడువుచున్నది. దీనికి నిదర్శనంబుగ నీలింగంబు చివరఁ బంచముఖంబులున్నవి. వానిని సర్పరాజ పంచముఖంబులని యందురు. కొననుండి యడుగుదాఁక లింగంబు నడుమ రెండు తెల్లపట్టెలు గానంబడియెడు. అవియ గజరాజదంతంబులని పలుకుదురు. అడుగున సాలెపురుగుంబోలిన యాకృతియు దృగ్గోచరంబగు. ఈకారణముననె యిక్కడి లింగమునకు శ్రీకాళహస్తీశ్వరుఁడని దివ్యనామము గలిగినది.

(శ్రీ=సాలెపురుగు; కాళ=పాము; హస్తి=గజము)

ఇదియుఁగాక నిక్కడిదైన యొక ప్రసిద్ధకథగలదు.

పూర్వకాలంబునఁ గన్నప్పయను నెఱుకొక్కరుం డెఱుక యొక్కింతయులేక దుర్గమకాంతార దంతురంబగు నీప్రదేశంబునఁ గ్రూరభీకర మృగంబులను, శకుంతంబులను, వధియించి దేహయాత్ర నడుపుచు విల్లునమ్ములు చేఁబూని వనమ్మునఁ గ్రుమ్మరు వాఁడొకనాఁడు శ్రీకాళహస్తీశ్వర లింగంబు నొక పొదరింటి నడుమం గాంచి ప్రాక్తన జన్మవాసనా విశేషంబున నాశేషభూషణుపై నత్యంత భక్తివొడమి చర్మనిర్మిత పాదరక్షలచే ఫాలాక్షునొడలు దుడిచి హేమముఖరీనదీ జలంబులు దన పుడిసిటందెచ్చి దేవున కభిషేచనంబుగావించి నాఁడు తనతెచ్చిన పందిమొఱచిం గాల్చి కొండొక కొఱికి చవిఁగలదొట యెఱింగి కఱకంఠునకు నివేదించి యొక ప్రానిసీడ నాప్రొద్దుగడపి మఱునాఁడుం దైతీరున నభిషేక నైవేద్యంబులు గావించెను. ఇట్లేనుదివంబులు గడువ నాఱవనాఁ డక్కరుణాకరుం డక్కిరాతుని చిత్తశుద్ధిని దేవర్షి భక్తజనంబులకుఁ దెలుపఁగోరి తనకంట నొక్కంట నీరుగాఱునట్లొనర్పఁ గన్నప్పయు నెప్పటియట్ల మాంసంబప్పరమేశ్వరునకు నప్పనంబొనర్ప వచ్చుటయుఁ ద్రిలోచను లోచనంబున నీరు వఱదరైకా

* ఈయది సుమారు28సంవత్సరములకు మున్ను వ్రాయఁబడినది. ఇందు దీర్ఘసమాసములును, శబ్దచిత్రరచనలును, మిక్కుటంబుగనున్నను, నాశైలిని మార్పక యవ్విధంబుననె యచ్చొత్తింపవలయునని కొందఱు మిత్రులు ప్రార్థించుటంజేసి దీని నిత్తెఱంగుననె ముద్రణంబొనర్పఁ దలంచినాఁడ.

అఁగముంగొని నాతండ్రికిట్టి యిడుమతోడఁకనే యని పలవించి పలవించి కన్నీరునించి యయిన నేమాయె నాకన్నయ్యకు నాకన్నయిన నొసంగెదంగాకని నిశ్చయించి తనకంటి నొక్కఁటిని వింటి కోపునం బెకలించి యొత్తి ముక్కంటి కంటికిమాఱుగాఁ బెట్టి పూజలుసలుప వెండియుం బెఱకంట నీరుగాఱఁ గన్నప్పయు నెవ్వగ మున్నీటమునింగి నింగిసిగదేవరకుఁ దన ద్వితీయ నయనంబొసంగ నిశ్చయించి యది వెతికిన పిదపఁ దన కీశ్వరుని లోచనంబుండుచోటు దెలియుటకై చెప్పులనొప్పు తన పాదాగ్రంబాతావునమీఁది పదంపడి రెండవకంటిం బెఱుకనయ్యెఱుకుదెసం గరుణార్ద్రచిత్తుండగుచుఁ గృత్తివాసుండతనికిం బొడసూపి యతనికిఁ గైవల్యంబొసంగెనని పురాణంబులు వక్కాణించుచున్నయవి.

ఈభక్తుఁడు శ్రీమచ్ఛంకరాచార్యులవారి కాలమునకుం బూర్వమెప్పుడో యుండినటులఁ దద్విరచిత శివానందలహరిలోని యీక్రింది శ్లోకంబుచేఁ దెల్లంబయ్యెడి.

"మార్గావర్తిత పాదుకా పశుపతే రంగస్య కూర్చాయతే
గండూషాంబునిషేచనం పురరిపోర్దివ్యాభిషేకాయతే
కించిద్భక్షిత మాంసశేషకబళం నవ్యోపహారాయతే
భక్తిః కిన్నకరోత్యహో వనచరో భక్తావతంసాయతే"

ఈదివ్యక్షేత్రంబుననుండు శివుఁడు వాయులింగంబనియందురు. పృథివిలింగము కాంచీపురములోనున్న యేకామ్రనాథుండనియు, నప్పులింగంబు జంబుకేశ్వరంబున నెలకొన్న జంబుకేశ్వరుండనియుఁ, దేజోలింగము తిరుణామలయందుండు నరుణాచలేశ్వరుండనియు, నాకాశలింగంబు చిదంబరంబుననుండు నటేశ్వరుండనియుఁ బెద్దలునుడువుదురు.

ఇక్కడ మహాశివరాత్రినాఁడు పరమపుణ్యప్రదంబని ప్రతీతి గలదు. అప్పుడీ స్వామివారికి బ్రహ్మోత్సవంబు జరుగుచున్నది. ఆనాఁడీపుణ్యస్థలంబున కనేకదేశంబులనుండి జనులు సనుదెంచి ప్రొద్దువొడముట మొదలు క్రుంకుసందాఁక సువర్ణముఖరియందుఁ గ్రుంకుచుఁ బరమేశ్వర సందర్శనంబు సేయుచునే యుందురు. నాఁటిరాత్రి రెండు జాములమీఁద శివలింగోద్భవ కాలంబని యైతిహ్యంబు. ఆనాఁడు మహాదేవ సందర్శనలాలసమానసులై భక్తియుక్తులగు మానవులు నేత్రపర్వమగు వృషభోత్సవముంగని మనంబుల ఘనంబగు ముదంబుఁ జెందుదురు.

ఏతత్పత్తనాగ్నేయ పశ్చిమ పార్శ్వంబుల దేవాయతనంబునొరసికొని స్వర్ణముఖరీనది ప్రవహించుచున్నయది. కొన్ని గ్రంథంబులను వాడుకలోను నీనది స్వర్ణముఖియనియుం జెప్పఁబడుచున్నది. దీనికే తెలుఁగున మొగలేఱని పేరు. పూర్వకాలమందీ స్రవంతి యిరుదరులును సాంద్రకేతకీనికరం బొప్ప శోభితంబుగాఁబోలు నాపేరుగలిగె. ఇప్పుడును నీయేటియొడ్డున నక్కడక్కడ గేదంగి పూఁబొదరుటిండ్లు గుమిగూడి కమ్మవలఁపులు వెదఁజిమ్ముచుఁ బరిసరవర్తుల నాసాపుటంబులు సొగయించుచుండును. "దేవియును దాను మొగలేటఁ దీర్థమాడి" యని ధూర్జటిప్రణీతంబగు శ్రీకాళహస్తిమాహాత్మ్యములోఁ బ్రయోగముకలదు.

ఈచిన్నది చంద్రగిరి కీడెనిమిది క్రోసుల దవ్వునఁ గొండలలోఁబుట్టి శ్రీపదలమేలు మంగాంబాసన్నిధియగు తిరుచానూరుచేరువఁ బాఱుచుఁ జాలదూరముత్తరదిశాభిముఖయై యరుగుచు మఱలఁ బ్రాగ్వాయవ్యదిశలఁ జని శ్రీకాళహస్తీశ్వర సన్నిధానంబున మగిడి యుత్తరవాహినియై కొంతదూరమరిగి మరలఁ దూరుపుదెసకుఁ దిరిగి యరిగి యరిగి తుట్టతుదకు సాగరుంజేరి తదీయోత్తుంగతరంగాలింగన పల్లవితాంతరంగయై చెలంగును.

ఆదికాలమందు మహర్షిపుంగవుండగు నగస్త్యుండీ దివ్యక్షేత్రంబు సరిద్రాజదరిద్రాణంబుగ నునికిం జూచి పరమేశ్వర సందర్శనంబు సేతకు నిత్యంబరుదేరు సంయమిజన భూదేవప్రముఖ సకలజనంబులకు నిత్యనైమిత్తికాద్యనుష్ఠాన సమాచరణంబులకు విమల పయఃపూర పూరితయగు తటిని యుండిన లెస్సయని యాలోచించి తన్నిర్మాణంబునకు ప్రక్రమించి పెద్దకాలంబు మందాకినిం గూర్చి తపంబొనరించి యమ్మహాభాగసాక్షాత్కారంబు వడసి యద్దేవిం బ్రార్థించిన గంగయుఁ గరుణాతరంగితాంతరంగయై నిజప్రవాహంబున నొక్కింత భాగంబును భూమిపైవిడువ నది యున్నదియై చెన్నుమీఱెనని యార్యులు నుడివెదరు.

కనుగొను జనుల కనులకు విందులు సలుపుచు నీశైవలిని యెంతయు రమణీయముగానుండును. ఇందలి యమలిన పులినతలంబులు ఘనసార పరాగంబులంబలె సాంద్రచంద్రికా ప్రకరంబు విధంబున దివ్యశ్రీచందనంబు చందంబున హరిచందన కుసుమ విసరంబు కరణి నతిధవళములై యుండును. ఇందలి జలంబు లతి మధురశీతలములు గాకపోయినను, నతి విమలంబులై యవగాహము సేయువారి మాలిన్యంబును, దురిత నికరంబు దొలఁగించు కైవడి నొక్కింతలోఁ దొలఁగించు. ఇందుఁ దొల్లి మడుంగులు పెక్కులుండినవనియు, నవి యవిరళారవింద సుందరంబులై యుండెననియుఁ దెలియవచ్చెడిని. ఈవాహిని ప్రవాహంబులం బొలుచు మీనాది జలచరంబులం బట్టుటకై పలుదెఱంగుల యెలుంగులిచ్చుచు మింటం దిరుగులాడు వికిరనికరంబుఁ జూడఁ దామును నుత్తమలోకంబు వడయంగడఁగి యీయుత్తమ సరిత్తున స్నానంబుసేయ వచ్చియు నది సలుపు నైపుణ్యంబులేమి నీపుణ్యనది నీళ్ల వేనోళ్లం గీర్తించుచు గగనతలంబుననుండియే ప్రదక్షిణంబు పలుమాఱులు చేసెడి నోనాఁగ నొప్పారును. ఇందుఁ గ్రుంకినపు డిందుకిరణప్రసరణంబునం బోలె డెందం బానందాతిరేకంబునం గ్రాలును. ఇందుఁ దీర్థమాడిన కృతార్థులకు దురితంబులం బరకుసుమంబులు. నాకలోక నివాసంబు ముంగొంగు బంగారంబు. జీవన్ముక్తి తంగేటిజుంటి తేనియ పెర.

ఈస్రోతస్వినిం బ్రాతస్సాయంకాలంబులఁ బుడమివేల్పుల చాల్పుల నల్పసంతోషంబుల్లంబుల వెల్లివిరియ స్నాన సంధ్యావందనాది వేదచోదిత నిత్యకర్మానుష్ఠానంబు లాచరించుచు నందఱుం దమ నగ్గింపఁ బెంపుమీఱుదురు.

ఇందెప్పుడు నిప్పరింగల యొప్పుల కుప్పలు కుప్పలు గూరలుగాఁ జనుదెంచి యొండొరువులఁ గూడి వేడుకలాడుచు జలకమాడి విలాస విభ్రమంబులు ముద్దులుగురియఁ దమ కుంభంబులు విమలాంభఃపూరితంబులు గావించికొని యిండ్లకేగుదురు. ఇందు మందపవనంబులు చల్లనినీటిపైఁ దొలఁగుచు వివిధ సురభి కుసుమ పరిమళంబులు వెల

యించుచు రేపుమాపును జనంబుల నంచితానంద కందళిత హృదయులఁ గావించుచుండును. తులామాఘమాసంబులం బ్రత్యహంబును, నర్ధోదయము, వ్యాసపౌర్ణమాసిలోనగు పుణ్యదినంబులను, సముచిత కాలంబుల నియమంబుదప్పక యిప్పుణ్యతరంగిణియం దనేకజనులు స్నానంబుసేయుటఁజూడ వేడుకగాడము. ఇంకఁ జొత్తేర నిత్తీరంబున నాలుగైదు రేవులు రాలచేఁ గట్టఁబడిన మెట్టులుఁగలిగియుండును. వీని నన్నింటను నీశ్వరాలయంబునుండి నిర్మింపఁబడియుండు సోపానంబులు దర్శనీయంబులుగా నుండును.

ఈసోపానంబులపై నుండి యేటి యునికిఁ బరికింపఁగాఁ బరమేశ్వర పాదారవిందంబులు గొల్వఁ బాతాళంబు వెల్వడి భోగవతీనది యరుదెంచి ప్రవహించుచున్నదో నాఁదోఁచెంచు. ఈసోపానంబుల నడుమనే యందంబగు చిఱుతనూయి యొక్కండుగలదు. అందలి యుదకంబులె విప్రులే తామ్రలోక్కి యెత్తి చిత్తజారికిని, దేవికిని బ్రతిదినము నభిషేకముఁ గావింతురు. ఇది సూర్యపుష్కరణినాఁ బేరందినయది.

ఇక్కడి దేవాలయంబునకుఁ బూర్వదిశను బర్వతంబు గావున నావైపునఁ బ్రాకారంబులో దారిలేక తక్కిన మూఁడుప్రక్కలమాత్రమున్నవి. నిక్కంబుగ నిక్కొండ పడమటి యడుగుననే నిమ్నోన్నతంబులు సవరింపఁబడి గుడికట్టఁబడి యుండుటచేఁ బ్రాచిని నీగిరియే ప్రాకారప్రాయంబై యున్నది.

ఈపురి నైఋతిమార్గంబున భగ్నాయతనముఁ జొరఁగానే తొలుదొలుత సర్వాభీష్టప్రదాయినియగు బాలజ్ఞాన ప్రసూనాంబ సన్నిధియుఁ గొన్ని యడుగులు ముందటి కరుగుడుఁ బాతాళవిఘ్నేశ్వరుని సన్నిధియును నున్నయవి. మొదటి ప్రాకారంబుదాఁటి లోపలఁ బ్రవేశించుచు నెట్ట యెదుట దక్షిణామూర్తియు, మృత్యుంజయేశ్వరుండును, గుఱ్ఱగటనే సిద్ధివినాయక భవనంబును, గొండొకయరుగఁ గుమారసన్నిధియు నక్కడనే సరస్వతీ తీర్థంబును నొప్పచుండును.

ఇందు శేఖరుమందిరంబులో శ్రీకాళహస్తీశ్వర లింగంబుగడుదర్శనీయమై దర్శించువారి పాపప్రపంచంబుఁ బంచబంగాళంబుగఁ జేయుచుండును. ఇది పునర్జన్మమును నిచ్చునేని సర్వాభీష్టప్రదంబనియే చెప్పఁదగియుండు. తదాకృతి నిరూపణంబును, దానికిఁ గతంబును మున్నతెలుపఁబడియెఁగదా. మహామహిమయుతంబగు నీ మహనీయలింగంబు నర్చకులును స్పృశింపరు. కేవల జలాభిషేకంబులు పీఠంబునకేకాని లింగంబునకులేవు. అర్చకులీలింగంబును సురభిఘనసార మిళిత నిర్మలోదకంబులు నించిన సంకుచేఁబట్టి మీఁదనుండియే యభిషేకం బొనర్తురు. స్నానానంతరంబు దడియొత్తుటయులేదు. లింగంబున కెదుట నొకదారమునకు వ్రేలఁగట్టఁబడియుండు కవచంబునకే చందనానులేపన కుసుమమాలికాది కలాపకలాపంబులు సమర్పింపఁబడును. ఇక్కాలంబున నిక్కరుణాకరు దర్శనంబుసేయువారికిఁ జల్లని యీయభిషేకామృతం బొసంగుదురు. ఈవిశేషంబు విష్ణుదేవాలయంబుల సర్వసామాన్యంబుగాని శివాలయంబుల నెంతయుంగ్రొత్త. మఱియు శివాలయంబుల సర్వసామాన్యంబగు విభూతియొసంగుట యిటలేమియు నంతకుంగ్రొత్త.

ఇమ్మహాదేవు సన్నిధానంబున నిలుచున్నపుడు పుణ్యపురుషు మనమ్ము గాఢభక్తియుక్తంబగు. మేనంబులకలు మొలకలెత్తు. శిరోజంబులు నిట్టవొడుచు. కనుదోయిని సమ్మదాశ్రువులురులు. పరమానందంబు డెందంబున సంకడించు. చెడుతలంపులెడలు. దేహాత్మలు పరమాత్మ యధీనంబులయిన తెఱంగుదోఁచు.

ఈయాలయంబు వెలువడి ధ్వజస్తంభము సమీపింప నక్కడఁ బంచలింగంబులును, శనైశ్చరభవనంబును, నటేశ్వరు సదనంబును, బలు రేకుల నొప్పారుదళంబులుగల యఖండ బిల్వవృక్షం బొకటియుఁ బొడసూపును. ఈనగంబుదళంబులుకొన్ని తొమ్మిది రేకులును, మఱికొన్ని పదునొక్కండును గొన్ని పదుమూఁడును గల్గియుండును. మునుపటి దినంబులలో నిక్కడ నీమారేళ్లు పెక్కులుండిన వికాఁబోలు నీక్షేత్రంబున కఖండబిల్వకాననంబనియు నొక్కనామధేయంబుగలదు. ఇవి దాటి ప్రదక్షిణంబుగఁ జనుడు జగన్మాతయగు జ్ఞానప్రసూనాంబసన్నిధి గన్పట్టు. ఇద్దేవి తద్దయువరప్రదాయినియని యనేకజనులు పలువిధంబులఁ బ్రార్థించుకొని తమకోర్కులు సాఫల్యముం బొరసిన పదంపడి తమ మ్రొక్కులు చెల్లించుకొందురు. కొందఱు తమకోరిన యవిఫలించుపొంటె ముందుగా నీత్రిలోకజనని ననేకవిధంబుల సేవింతురు. సర్వమంగళయు భక్తజనాధీనయునగు నిద్దేవింగొల్వ శుభంబు లబ్బుట యేమియబ్బురంబు. ఇజ్జగజ్జననికిఁ బ్రతిసాయంకాలము నవ్యకుసుమ మాలికలతో దివ్యాలంకరణంబు సేయుదురు.

ఇవ్వీటంబువ్వులు పెక్కుతెఱంగులు గలవుగాని యిది యచలారణ్యప్రాంతమ్ముగావునఁ దుమ్మివిరులిక్కడ లెక్కలేక చిక్కును. ఈతుమ్మిపూవులం బూవులమ్మ నెమ్మెలాడులు సన్ననినారలం గ్రుచ్చి నిముసంబున కొకసరంబు కరంబువేడ్కఁ గావింతురు. ఇవ్విరుల నివ్విధంబున నివ్వీటంగల పువ్వుబోఁడులు గ్రువ్వనేర్చిన తెఱంగునం గ్రువ్వ మఱియెవ్వరును నేరరు.

నవరాత్రములు బ్రహ్మోత్సవములోనగు విశేష దినంబులయందును, నెవ్వరేఁ జాలిన గొప్పవారు దర్శనమునకువచ్చు దినంబులను నిమ్మహాదేవికిఁ బసిఁడిబొందళంబు దొడిగి దివ్యరత్న ముక్తాభరణంబుల భవ్యాలంకరణం బొనర్తురు.

దేవ్యాలయంబు చెంతనే వేంకటేశ్వర నిలయంబును నాపొంతనే చండికేశ్వరు నాలయంబును నివి యతిక్రమించుడు భైరవమూర్తి గుడియుం దనరు. కొండమధ్యంబున నొక కన్నప్పగుడియు నయ్యదియే కొండ కొట్టకొనమీఁదనుం గలవు. ఇక్కడి విగ్రహంబులన్నియు సుందరంబులేయైనను, దేవీమూర్తియుఁ భైరవమూర్తియు గన్నప్ప మూర్తియు నత్యంత దర్శనీయములుగా నుండును.

ఈ దివ్యక్షేత్రంబుచేరువ ననేక పుణ్యతీర్థంబులు గలవుగాని వాని నన్నింటినిగుఱించి యిక్కడ వ్రాయుట సుకరముగాదు. ముఖ్యములైన కొన్నిమాత్రమిందు వివరింపఁబడును.

దేవాలయంబునకు దక్షిణంబున మణికంఠేశ్వరాలయంబును దానిదగ్గఱనే బ్రహ్మాలయంబునుగలవు. బ్రహ్మకాలయంబు లెక్కడను

తేరున్నను నిది కైలాసంబుగావునం బరమశివునిఁగొల్వ నిచ్చట నచ్చుతు రానముండును నివసించియున్న వాఁడని చెప్పనగు ఇక్కైలాసగిరి రెండుపాయలై నడుమ నక్కడక్కడ నిమ్నోన్నత ప్రదేశంబులు గలిగి యుండును. ఇందలి చఱియలు పల్లపునేలలుగనుక చిత్తడివానలు కురిసినపుడు నీళ్లెల్ల నక్కడక్కడం బల్లములలోఁ బెల్లుగ నిండియుండుట చేతను నెల్లవేళల నూటనీరు దొరఁగి చిలువలై పాఱుచుండుటచేతను నీనేలయం దధికభాగము సారవంతమై యుండును. దానిచే నిప్పర్వత ప్రాంతంబంతయు దుర్గమకాంతార మయంబై నానావిధానోకహ గుల్మలతావితానంబులు గలిగి వెలయును.

మణికంఠేశ్వరాలయంబున కనతిదూరంబునను కొండ రెండుపాయలవడుమఁ దూరుపుపాయ యడుగున నెయ్యది తియ్యని తీయని నీరులుంగలిగి కమలకువలయ కల్హార సంపన్నంబై చెన్నుమీఱునో, దేనిని నిత్య నైమిత్తికాచరణంబులకుం బుణ్యమానవ వ్రాతంబును బిపాసా, పరిశ్రాంతికోఱకుఁ బవళులం బసులును రేలుకూళమెకంబులును సేవించునో, దేనిచే సమస్త జనులు, సంతోష సమాక్రాంత స్వాంతులై పొంపిరివోవుదురో, దేనికోఱకుఁ దీరస్థభూరుహంబులు తమ నీడలను మలయానిల కందళంబులు తమ చల్లఁదనంబులను గొల్లలుగా నొసంగి క్రుంకులిడువారి కెందంబు లానందకందళితంబులు గావించునో, దేని వలనఁ దనుఁగోలుచు సుజనులు వృజినవిముక్తులై పుణ్యపురుషు లగుదురో, దేనిమహిమ విని యనేకజనులు సేవించుటకై యనుదినముఁ జనుదెంతురో, దేనమధుర మధులోలుపంబులై మధుపంబులు మృదులనినదంబులందీర ద్రుమ విద్రుమారుణ పల్లవాస్వాదన మదకల కలకంఠ కంఠసముద్గీత గీతంబులకు శ్రుతులిచ్చుచు వినువారివీనులు సొగియించు చుండునో, యట్టి భారద్వాజతీర్థంబు నాఁ బేరందిన తీర్థరాజంబు విరాజిల్లుచుండును. మున్నెన్నఁడో యిది భారద్వాజ మహామునీంద్రు నాశ్రమంబై యుండెనని జనులనుటయేకాక యట్లకానోపుననియే తన్మాహాత్మ్యంబే వేనోళ్ళం జాటుచున్న యది. దీని యీశాన్య దిశయందొక యీశ్వరాలయంబు గలదు. ఏతత్సరోవరమధ్యంబున నొక మంటపంబు నిర్మింపఁబడి యునికిం జూడఁ దొల్లి శ్రీ కాళహస్తీశ్వరునకిందుఁ బ్లవోత్సవము జరుగుచుండెనని తోఁచెడి. అరుణ కిరణ కిరణంబు లీకమలినిపై నీతని పొడుపుతోడనఁ బొరయమింజూడ నిది కుముదినియు నాటంజేసి యది నిజకర సంస్పర్శనంబున కనర్హంబని కొండొకవడి కొండకవ్వలనే యుండి సరోజినీ ముఖవికసనంబె తనకుం బ్రధాన కర్తవ్యంబుగావునఁ గమలముకుళవిదళ నంబునకై యెట్టకేలకు గిరిశిఖరం బధిరోహించునో నాఁగ రెండుమూఁడు గడియలైన పిదపనే యిచట దినకర కరనికరంబులు తలసూపును. ఇది విజనస్థలం బవుటంజేసియు నోడలికిఁ గడు నెలమిఁ గలిగించు సలిలచ్ఛాయా మారుతంబుల కలిమివలనను, జుట్టునుం జెట్టులును, గడుఁబెడఁగగు కొండలుం బొదరిండులుం గన్నులపండువు చేత చేతను, నిట రాఁగలుగువారికిఁ బరమేశ్వరుంగూర్చి యొనర్చు జపతపంబులవ్యాహతమతితోఁ గొనసాగుటయేకాక యీ రమణీయప్రదేశంబు వదలిపో నెవరికిని గాళ్ళాడవు.

భారద్వాజతీర్థమునుండి యీకొండ పానుభూమిని గొండొక దవ్వరుగ నగస్త్యేశ్వరాలయంబు నేత్రపథంబు నిరోధించు. మున్నెన్నఁడీగుడిలోఁ బూజలు జరుగుచుండినవో కాని యిప్పుడిక్కడ నంబికానాథుండు పన్నగభూషణుండవుటఁ దెలుపనో నాఁగ నాగంబులు లెక్కలేక చేరి భీకరంబుగ భూత్కారంబులు నిగుడించు చుండును. కావుననే వారును దీనింజేరనుగూడ వెఱతురు.

ఇది దాఁటిపోఁగా భైరవునికోన చూడనగును. ఇచటం బొదలు పొదలు దట్టముగాఁ బెరిగి చల్లనినీడలు గల్పించుచుండును. ఇందలి తీఁగియలుం బెల్లుగనల్లుకొని మ్రాఁకులపైఁబ్రాఁకి వనదేవతలకును చేనాదివారికిని డోలావిహారంబు సమకూర్చుచుండును. కడుం బొడవయిన యొక మావిమ్రాని కొననుండి యొక పెందీఁగ నలువదియడుగుల దూరము క్రిందికి వ్రాలి మఱల నూర్ధ్వగామియై యంతియదవ్వున నొండొక మ్రానికొట్ట కొనకొమ్మపై నల్లుకొనియుండుటం జూచినాఁడను. ఇది యుయ్యెలయునుంబోలె నూఁగుటకెంతయు నుత్సాహంబు గల్పించుచున్న యది. ఇది కాలభైరవు నాశ్రమంబని పలుకుదురు. ఇక్కడ నొక్క చిన్న గుడి యున్నది.

దీనిఁ గడచి యరుగుడు మార్కండేయతీర్థంబు కన్నులపండువు సేయు. ఇది కొండసందులలో బాఱు నూటనీటి చిలువలుబండల యిఱుకునఁ దొరఁగి పెనుపల్లముగా నేర్పడినయది. ఇది యెల్లప్పుడు పయఃప్రపూర్ణంబై యుండును. ప్రావృట్కాలంబుల జలంబులు పెనువెల్లువలు గట్టి యీగుబ్బలిమీఁదనుండి పల్లములోనికి దుముకుటంజూడ నిబ్బరంపు టబ్బురంబు గదురును. దీనిచుట్టును జెట్టులుచేమలు బలిసి గుబురులయి దీని యుపరిభాగంబునంతయుఁ దమకొమ్మల నావరించుకొని యునికిం జేసి యీనీరు లత్యంత శీతలంబులై దీనమునింగినవారికిఁ జెప్పరాని సౌఖ్యరసానుభవంబు గలిగించు. దీనియందలి నీరులతి శ్యామలంబులై యుండును. ఈబండలపై మ్రాఁకులవేళ్ళు చిత్రంబుగఁ బెనగికొని యుంటంజూడ నాగలోకంబునుండి నాగలోకంబులు శ్రీకంఠ సంసేవనార్థం బెగఁబ్రాఁకునోయను తలంపు వొడమును. దీని యొట్ట యెదుట మార్కండేయేశ్వరలింగంబుగల యొక నిలయంబు గలదు.

ఇది యతిక్రమించి కొండొకచనుడుఁ బొడకట్టు సోపానాళి మార్గంబుగ భూధరాధి రోహణంబొనర్ప నొక చిన్నగోపురంబు కరంబుసొంపుమెయిం బెంపారు. ఈగోపురంబుపైనుండి నలుదిక్కులుఁ బరికించినచో నెంతయు సంతసంబునకు స్వాంతంబు నిశాంతంబగు. కైలాసగిరి కుఱుఁగటం బ్రవహించు మందాకినిచందంబునఁ బడమటిప్రక్కనిక్కొండదాపున నేపునంబాఱు కనకముఖరీనదిఁ గనుంగొన నీకొండనుండు ఖండపరశువునకు మండనాయమానంబైన కుండలిపతి యధోభువనంబునుండి యరుదెంచు చాడ్పునం బ్రశస్తంబగు నీమహనీయ క్షేత్రంబు పొంత సుపర్వపర్వ విధువదనలు రచియించిన రంగవల్లి భంగిని ధరణీసతి ధరణీధర వక్షోరుహ దేశంబున వాసిమీఱఁ గైసేసిన ధవళ కుసుమ దామంబుపగిది ముత్యాలసేవళంబు మాడ్కిం జూడ్కికి వేడ్కఁ గావించును.

తూరుపువైపునఁ జూపుసారించుచో నిబిడనికుంజానసీరహనీరంధ్రకాననమయంబగు నొకకోనయుఁ దదంతరంబున సమున్నత స్థలంబున నొకగుడియుం బొడసూపును. ఇదియే మహనీయంబును, దర్శనీయంబును, నాసేచనకంబును, నాశ్చర్యజనకంబును నగు వేయిలింగాల కోన. కొండనుండి మెట్లదారినిదిగి కావఁజొచ్చి కోనకువచ్చుటకుదారి యొకటి యేనాదివారు చేసియున్నారు. తక్కిన ప్రదేశమంతయుఁ దూఱుటకు సెడములేక చెట్లుచేమలచే లతలచే నిండియుండును.

ఇవ్వనంబు గొప్ప వంగడంబువిధంబున వంశవృక్ష విరాజితంబై, రాజమందిరంబు చందంబునఁ జిత్రలతా వితానోపరచితాంబరంబై, యంబరంబు కైవడి ఋక్షరాజ పతంగ విరాజితంబై, కవిరాజ కావ్యంబు మాడ్కి హరిణీప్లుత కోకిల శార్దూల విక్రీడితబంధురంబై, బంధకవిత్వంబునుంబోలెఁ గుసుమగుచ్ఛ పుష్పమాలికానాగచక్ర మేదురంబై, సరంబు తెఱంగున ఖడ్గశిలీముఖవిహారనిలయంబై, లయంబుచందంబున బహుళజలాశయ ప్రపూర్ణంబై, పూర్ణచంద్రునిలాగున విరచిత శశమృగప్రహ్లాదంబై, ప్రహ్లాదు చిత్తంబుచొప్పున నక్రాంత సమాసక్త హరిపదంబై, హరిపదంబులీలం బలాశిజాల సంవర్ధన ప్రవీణంబై, వీణాపాణిమిని జీవాళివిరాజమానంబై, మానవతీముఖంబుక్రియం గస్తూరీతిలక సమలంకృతంబై, కృతయుగంబుచెన్నునసద్ద్విజ కదంబదంతురంబై, తురంగమోత్తమంబువడువున సంవాహ్యమాన రాజహంసకులంబై, కులటయొప్పిదంబునఁ బరితోషిత భుజంగవిహారంబై, హారయష్టి నలువునం బద్మరాగ విలసిత ప్రవాళ మనోహరంబై, హరమాహాత్మ్యంబుగతి విదళితకుసుమశరంబై, స్వాధీన పతికపగిది సశోకోల్లాసంబులును, విరహిణిచాడ్పునం జింతలును, మాలకరిగీముబాడం బూగములును, రాజసదనంబుడంబున మావులును, పట్టణంబునోజం బున్నాగసందోహంబులును, శరీరంబువలె నెమ్ములును, వేదంబులయందంబునం బనసలును, వదనంబుకరణి మోవులుం బండులును, బురుషులంబలెఁ గొమ్మలును, గృహమధ్యంబుభాతిం దివియలును, దల్లుల విన్ననువునం జిఱుతలునుఁ, గలిగియాదవకులంబు గాకుండియు ననిరుద్ధకృష్ణసారవిలాస విభాసితంబై వెలవెలందుక గాకుండియు వెలఁగలకూటమికింజోటై, దీటులేనినీటునం గ్రాలుచు నయనసుభగంబై యుండును.

వెండియు నీవనంబు పావనమునీంద్రుల కాశ్రయంబై, పుండరీకామలకుఁ గేళిభవనంబై, లతికానికాయంబుల కాలవాలంబై, వనదేవతల కారామంబై, యళికులంబున కంబుజాకరంబై, కోయిలపిండున కామనిధియై, నెమ్మికూటువులకుఁ జిత్రతటిమొయిలై, కోకసముదయంబునకు లోకబాంధవసముదయంబై, జీవం జీవం జీవంబులకు జైవాతృకోల్లాసంబై తద్దయు ముద్దుసేయును. కొన్నిచోటులఁ గీరకిశోరవారంబులు మధురంబండినపండులు తొగరుముక్కులం గమిచి తనుపార మెక్కి బారులందీరి యిచ్చకువచ్చినచొప్పున నుప్పరంబునంబఱతెంచుచుఁ గలకలమనిరొలుఁగులు సలుపుచుండు. కొన్ని దెసలం బరభృత ప్రకరంబులు ప్రవాళారుణ తరుణకిసలయంబులు విందారగించి పంచమారావంబుల వనదేవతలు సేయు గానంబురీతి మృదుగీతంబులు పాడుచు వీనులవిందు గావించుచుండు. కొన్నియెడల నవిరళకుసుమ విసర మధుర మధురస పానలోలుప మధుకరనికరంబులు శ్రవణరసాయనంబుగ మృదులఝంకారంబు సేయుచు బహునారీలోలులకైవడిం గొంతవడి యుత్ఫుల్ల సహకారవల్లరీకదంబులను, గొంతసేపభినవ వికచమాలతీలతికలయందును, గొంతప్రొద్దు తద్దయుఁ దేనియలుగురియు విరులవఱలు కలిగొట్టుచెట్టులను, గొంతకాలము దరవికలిత మల్లికావల్లికలందును, గొంతవడి ప్రత్యగ్ర కుసుమిత కేతకీనికుంజపుంజంబులను, గొంతసేపు మనోహర సరోవర విభాసమాన సరోజవనంబులను, వసియించుచు, నచ్చరవిరిబోండ్లు నీలంపుటచ్చనగండ్లాడు కొనిరొయెదరో నాఁగవిఱ్ఱవీగి యఱ్ఱాడుచుండు. కొన్నిప్రదేశంబులం గపోత పోతంబులు విచ్చలవిడిం బొదరుటిండ్లుసొచ్చి ముచ్చటలాడుచుఁ గవలుగూడి నింగికిఁజెంగలించుచు వేడుకలు పొనరించుచుండును. కొన్నితావులం గురంగశాబకంబులు నమనమలాడు లేఁబచ్చిక యొల్లి యొల్లములుగాఁగొఱుకుచు నీరంబులానుచు నీరంబులు సొత్తెంచుచు నం దేమేని జలజలమనియెనా పుండరీకంబనితలంచి గుండియలదరఁజూపులు బెదర వెఱచిపఱచుచు మనోహర స్వైరవిహారంబులు సలుపుచుండును. కొన్ని యిక్కల నక్కలు పెక్కులుసేరి తక్కటి ద్రుక్కుడిమెకముల నదలించియొండె వంచించియొండె దిండిఁ గడించుకొన నీవలావలఁ దిరుగులాడుచుండు. కొన్నిస్థలంబులం గోలాంగూల జాలంబులు నింగిముట్ట విరివిగాఁబెరిగిన మ్రాకులకొమ్మలం దమనిడుద తోఁకలుచుట్టి పిల్లలం దమకడుపులనిడికొని క్రిందికి లంఘించి వ్రేలాడుచుఁ బండులు దుల్చిదండిగాఁగడుపునిండించుచు యథేచ్ఛంబునం గ్రుమ్మరుచుండు. కొన్ని చక్కులముండ్లపందులు సూచీముఖంబులంబోలె తమముండ్లు విరివిగావిదిర్చి డొక్కుడొక్కుమని పరువులిడుచుఁ దంగముస్తాతతులం దమమూతులం బెల్లగించుచుఁ గాలకింకరులవలె వెఱపుఁబుట్టించుచుండును. కొన్నివంకల నాతపంబుసైతము చొరరాక ధ్వాంతజాలనికాంతంబులయి జీబుగానుండు పెనుబొదళ్ళనడుమఁ గ్రొల్పులులు వాతులుదెఱచికోఱలు భీకరంబుగఁ గ్రాల నాలుకవ్రేలాడఁ గుఱుపెట్టుచుఁ గూర్కుచుండును. కొన్ని దెసల వనదేవతా కరపల్లవంబులలీల వెలుఁగుమఱ్ఱిమ్రాకుల యెఱ్ఱని చివురుటాకులు తర్ణకకర్ణంబుల చెన్నున నతికోమలంబులై చిఱుగాలికిఁ గదలుచుండును. కొన్ని క్రేవలరసాలసాలంబులు హారసీమంతినులకరణి సరసకుసుమరసవిలసిత ప్రసవరాజిం దుమ్మెద కొదమ కనుపులను, మెత్తనిక్రొత్త చెందలిరుజొంపంబుల గలకంఠబృందంబులను, బరిణత స్వాదు ఫలప్రచయంబులం గానసమృగ ఖగోత్కరంబులను, దనుపుచు, బలులతకూనలకుం బ్రాపై యేపుమీఱును. కొన్ని పజ్జలగేదంగిపుప్పొడులు కుప్పలుగారాలి జక్కవకవల మక్కువకలయికలకుం బఱవనిపఱపుల చొప్పున లోచనోత్సవంబుసేయును. కొన్నిపాయల నంబరచుంబి విటపి విటపంబుల వేళాకోళంబుగఁ జాంపేయాదివల్లరీ వారంబులల్లుకొని చిలుకపిల్లలంబెనుప వనరమాతరుణి రచియించిన డోలికలపోలికం బొలుపారుచుండును.

ఈకోనలోనికివచ్చినపుడు మనంబునకుంగలుగు నానందంబును డుఃఖండరముగాదు. దీనినడుమ నొ[illegible]చిన్న గుట్టపై సహస్రలింగేశ్వసద

వంబుగలను. దీనియడుగుననుండు పెద్దరాలంబునఁ గొండనుండి స్రవించి
చునాటనీళ్లు నిండి నయనాభిరామంబగు చిన్న కేళాకూళియొక్కండు
గలదు. ఇందలిజలంబులు తేటవు దేటలై వేలుపుటావుపాలుబోలె నెం
తయు వెల్లనై కలకండగలిపిన యట్లెంతయుఁ దియ్యనై మంచుసోనలం
బోలె గడుంజల్లనై యీయరణ్య వరేణ్యంబు సేవించు పుణ్యపురుషు
లకు వృషభగమనుండొసఁగు కైవల్యామృతంబోయనఁ గన్నులపండువై
యొలమివొలయించు. ఈసరస్సునుండి యొకపిల్లకాలువ జలజలఁ బ్రవ
హించుచు నడుమ నడుమఁ బినపిన్న చెలమలై మవ్వంబున నివ్వటిల్లు.
దీనియిరువరుల ననేకసహకారాం కురంబులంకురించి ప్రోదిగా బెరిగి
జనపదంబుల జనియించు కన్నియలం తమప్రాయంబునకు మిగిలియెదిగి
సొగసుగులుకుమాట్కి వేడ్కలుగొలుపును. ఇరువ్యైలమావులును, బలుదీవె
లును, నీచెలమల నన్నింటిమీఁదఁ జదలునగూడుకొని నీడలురచియించు
చున్నను మున్నునుడివిన కొలనికెలననుండు నొకమురిపెపుఁ జెలమపై
నీమోకమామిడి కొమ్మలును మఱియుంద మాలాదిధరణీ రుహశాఖలం
బలిసి నీళులమీఁద నొండొంటి బెనగికొని వనదేవతా రచితకాయమా
వనికాయంబులగతి నతిసుందరంబుగానుండును.

ఈరమణీయప్రదేశంబుల ననవరత మవిరళ సుకుమార సురభికు
సుమ పరిమళ మిళిత సురుచిర శీతలమలయపవమాన కందళంబులు
మకరంద బిందుబృంద సుందరంబులగు చంపకప్రసూనంబుల సౌరభం
బులను, నవకమల కుముద కువలయ కల్హార పరిమళంబులను, దరవికచ
విచికిలా మోదంబులను, నమ్లానపాటలీ కుసుమవాసనలను, నవమాలతీ
లతాంత బంధురసుగంధంబులను, పారిజాత సుమనోమనోహరసౌరభం
బులను, బసిఁడి కేఁకులంబోని గేదంగిపూ ఱేకులకమ్మవలపులను, ధవళా
రుణమందార కుసుమంబుల క్రొత్తసెత్తావులను, బెల్లుగాఁ గొల్లఁగొని
యిచ్చటికివచ్చువారి యుల్లంబులు పల్లవింప నింపుదళుకొత్త మందమం
దగమనంబులఁ గ్రుమ్మరుచుండును.

వసంతసమయంబుల నివ్వనంబున మున్నునుడివిన సౌభాగ్యంబు
లెల్లఁ బెక్కుమడుంగు లెక్కుడుగా నుండును. ఎక్కడఁజూచిన మహా
నటజటాటవీ వాటిచందంబునందనరు సంజకెంజాయల నుల్లసమాడనొప్పు
కెందలిరుల జొంపంబులు కన్నులు గోరగింపఁ బొడమి. కాననశ్రీదొడి
గిన కెంబట్టుపావడలకై వడి వనేందిరపై వేలుపుఁబువ్వుఁబోండ్లు నిండార
జల్లిన కుంకుమరసంబు తెఱంగునఁ గోకిల కులంబులు చేసిన తపములు
పండినఫలములపగిది హృదయంగమంబై తనరారును. ఎక్కడఁజూచినం
గుసుమసాయక సాయకంబులంబోనియక కోర కుసుమకోరక వారం
బులు వనాంతలక్ష్మిపై మాధవుండిడియెడు తెలిముత్తెపుఁ దలఁబ్రాలుం
బోలె నేతదారామ రామణీయక సమవలోకన సమాగత తారకానివ
హంబులవిధంబున నత్యంతౌత్సుక్యంబు గలిగించు. ఎక్కడఁజూచిననా
నావిధశకుంత కులంబుల కలకలంబులును, నెలదేటిసూటులవల మృదులనిన
దంబులును, శ్రవణేంద్రియంబుల కపరిమిత సుఖానుభవం బాపాదించు
చుండును.

ఇట్టి యుడివోని యొప్పిదంబుల ప్రోవైన యీలోయం జూడఁ
గల్గుభాగ్యం బలతుల దొరకుట యరుదు. ఇక్కడకు వచ్చినవారికి మఱి
పోఁదలఁపుగలుగను. ఇన్ని వైభవంబుల నొప్పారిన యీరమణీయస్థ
లంబు నిర్మించిన సర్వేశ్వరుని మహాత్మ్యంబెంత యవాఙ్మనసగోచ
రంబోయని మనంబున నక్కజంబును సంతసంబును భక్తియుఁ దప్పక
ముప్పిరిగొను. నగరీపరిసరభూమినే యిట్టివిభవంబులుండ విజనప్రదే
శంబులగు వింధ్యాటవియందును, గంగాతరంగిణిం గొలుచు ప్రాలేయా
చల ప్రాంతంబులందును నేమేమివింతలున్నవో యెఱుంగంబోలదు.

ఇచ్చటికి వచ్చువారు మునుచెప్పినకొలనిలోఁ దానమాడి కొండ
పైనుండు సహస్రలింగేశ్వర దర్శనంబు సేయుదురు. ఇదియొక శిలింగం
బుగఁ గన్పట్టుచున్నను దీనియందుఁ జిన్న లింగాకారంబులు వేయిగా
నంబడియెడి. ఇక్కడ సంప్రదాయికంబుగాఁ బూజలు జరుగుచున్నవి.

ఈప్రసిద్ధవనంబున సిద్ధపురుషులు పెక్కండ్రు పరమతపోనిరతు
లయి వసించుచుఁ బురాకృత సుకృత పరిపాకవిశేషంబుగల పుణ్యపు
రుషుల కప్పుడప్పుడు దర్శనమొసగుచుందురు. ఈమహనీయ చరితులకు
బురపరిసరంబులనునికి యనువుకామింజేసి యుత్తపోధనసత్తము లీయు
త్తమవనంబున సామాన్యజనులకుఁ గానరాకుండ నుండుచుం బరమేశ్వ
రదివ్యపాదారవిందభజనైక పరాయణులై నిరవధికసుఖానుభవంబులఁ
జొక్కిపారవశ్యంబున నెలిమఱచియుందురు.

గిరికీవలంగల మధురజలజలాశయమునకుఁ దూర్పునఁగొంతదవ్వు
భూధర నేదిష్ఠసరణి నరుగ నభ్యున్నతగిరి శిఖరద్వయ మధ్యంబుననొక
పెనులోయగలదు. ఇందెల్లప్పుడుం బనసచెట్లుండుకతన దీనికిఁ బనస
కోనయని పేరు. వేయిలింగాల కోనయందలి విశేషంబులిక్కడ లేకున్న
ను నీకోనకుఁ బ్రాకారప్రాయంబులైన యద్రిశృంగంబులు రెండును
మిక్కిలి పొడవులై ప్రక్కలం బెక్కువృక్షంబులం దనర్చుటచే నీభూరు
హంబు లొండొంటిం బెనంగికొని నింగినింబొందింపఁబడిన పందిళులచం
దంబున నెండలకడయీక మనోజ్ఞముగానుండును.

ఇక్కడ నొక్కడ గొప్పబండలప్రక్కల నాక్రమించియున్న
మఱ్ఱియూడలదారి నూరువారిధారలెడతెగక తొరఁగి యొకపల్లమేర్పడి
చల్లనినీళులు గలిగియొప్పెడి. ఇదే మారహరతీర్థంబని యందురు. ఇచటఁ
బుణ్యపురుషుండగు హరహరుండను పేరిటి శివభక్తుఁడొక్కఁడు తొల్లి
నివసించియుండెనని తెలియవచ్చెడిని. దీనియుదక బిందుబృందంబులు
మేనిపైఁ బొలుపుఁడు పూఁదేనెసోనల చాడ్పునను తుషారకరవతంసు
కృపామృత కణంబులకైవడిం దోఁతెంచుచు మానసముల నెంతయు నల
రించును. ఈజాలపై నెల్లప్పుడు నీళులూరుచుండుటవలన వీనిమీఁద శై
వాలజాలంబులు గ్రమ్ముకొని మెత్తని పచ్చపట్టుచీరలు పఱచిన తెఱం
గున నొప్పునూపున.

కార్తికమాససోమవాసరంబుల నీధరణీధరంబును బహుజనులు ప్ర
దక్షిణము సేయుచు నీతీర్థంబులలో స్నానంబు సేసివత్తురు.

ఇక్కరణింగల విశేషంబులతో నిక్కడ భక్తజనులకుఁ గైవల్యా
మృతంబు ప్రసాదించుపొంటె నెలకొనియున్న పరమేశ్వరుచరణపద్మం
బులు హృదయపద్మంబుల నిడికొని యుత్తమధర్మంబులాచరించి భక్తు
లుముక్తులవుదురు.

# లక్షణగ్రంథములు.

[ శ్రీమతి గుండు అచ్చమాంబగారు. ]

క॥ శ్రీరమ్యనవ్యపుస్తక సారఫలవనప్రదేశ • సంచారసుఖో
దారావ్యక్తమధుర వాక్పూరసుకీరమ! • త్రిలోకపూజితవాణీ!॥

మ. ఘనపాండిత్య ఘనుల్వివేకధను లి • క్కాలంబునన్విద్య వృ
ద్ధినిగావింపఁదలంచి పట్టుదల స • త్కార్యంబులన్ శక్తివం
చనలేకుండ నొనర్పఁబూనుతఱిఁ • దత్సంబంధ రాజావలం
బనమున్గల్గుట యాంధ్రదేశజన సౌ • భాగ్యంబుగాదేభువిన్॥

గీ. ఇతరదేశ చరిత్రాదు • లెఱుఁగనయ్యె,
నంతరించు పచ్ఛాస్త్రాదు • లమరఁగలిగె;
నమరభాషా విశేషంబు • లరయుటాదవె;
నింక నెన్ని మేళ్ళిటమీఁద • నెనయఁగలవొ॥

ఉ. పాలకులైన రాజు లొక • పట్టున మానినయప్పుడున్ సతీ
శీలముగాచికొల్తురీ ప్ర • సిద్ధికిసైతము మూలమైన వి
ద్యాలలితాంగి! పాటలుక • థల్ పనులయితిరికాదె యిప్పుడో
మేలగుపాలనంబు వొదమెన్న • సిపాపలవృద్ధిఁ గోరుమీ!॥

ఉ. తల్లులు నత్తలుం దెలుపు • దారినెపోవుచు, నీతిమార్గమం
దెల్లెడఁదప్పలేక చరి • యింత్రు పరంపరగాను బుద్ధిమ
త్తల్లజలార్యవంశముల • దక్షతలెట్టివొ సత్యసంధలౌ
తొల్లిటిసత్సతీమణుల • త్రోవలవెంతటి సుస్థిరంబులో॥

ఉ. ఈయెడఁగొంతకొంతఁ జన • విచ్చుచువిద్యనెఱింగి బాలికా
ప్రాయమునందె తెల్విఁగను • పద్ధతినేర్పఁ దలంచుసజ్జనుల్
ధీయుతులట్టివిద్యదెసఁ ది • న్ననిమార్గముజూపకున్న నో
ర్మాయవలెన్ సతుల్తమరు • పుట్టినతప్పెదలోఁదలంచుచున్॥

చ. కలవుకదా! యనేక వర • కావ్యము లయ్యవిబాలికల్గురుల్
దెలుపఁ బఠింపనట్టివియొ! • తెల్వికిఁదోడ్పడు నీతివాక్యముల్
గలిగిన నొండురెండు తమ • కైరచియించిన వానినొల్లనన్
సలిపినఁజాలునే గుణవి • శారద శారద! నీవె తెల్పుమా!

ఉ. లక్షణశాస్త్రపద్ధతి, నె • లంతలకున్ దగదంద్రదెట్టిదో
సాక్షికబుద్ధిమాని గలఁ • పన్దిగువార లెఱుంగకుందురే
దక్షులు వానికేరసము • దార్కొనఁజేసిరొ తద్రహస్య సం
రక్షణవాక్యమిట్లు సుక • రంబుగ వర్తిలనేమొ ధాత్రిపై॥

చ. చదువన నొక్క పెద్దపులి • చందముగానగుఁ జిన్నయీడునన్
వదలక బోధఁజేయుతఱి • వచ్చుటఁదోచిన నాఁగొల్పు న
య్యదిపలదిద్ది కూడదిఁక • నంతియచాలును విద్యయంచుఁ బ
ల్కెడ దెటులబ్బనేర్చుఁ బరి • కింపకువిద్య సతీలలామకున్॥

క. రసరాజంబెద్దియొ త, ద్రసప్రధానములు కావ్య • రత్నములైనన్
పసివాండ్రుచదువుటకునన్యసత్ప్రబంధము లొనర్ప • వలయుంగాదే?.

మ. పొలుపొందుం ధగురీతిఁదొమ్మిది రసం • బుల్పెంపుదీపించు వృ
త్తుల నద్వైతతినంద్రు తద్రసములం • దుద్దేనిబోధింప వ
ర్తిలునో నీతియుదెల్వితేటలు నటు • ల్దీపించు సల్లక్షణం
బులు లక్ష్యంబులు గల్గుటొప్పదె • జనంబుల్ వానిగైకోరొకో॥

కలిగినబాట చెల్లదని • కాదుర సజ్ఞులొనర్చుపద్ధతుల్
వలదనరాదు లోకమునఁ • బండితులందఱు స్వీకరింపన
జ్ఞ లెఱుఁగనేర్తురేయనుచుఁ • గోపమునూనక పాడితెల్పు మీ
పలువురునేర్చి వృద్ధిఁగను • వైఖరి శాస్త్రము లొప్పటొప్పదే॥

క. అనుభవసిద్ధులు వేదాం తనిత్యసద్గ్రంథరాజిఁ • దద్దయునాత్మన్
మననము చేయదగును బెఱజనములు వల్లింపఁ జిలుక • చందముకాదె.

శా. తర్కవ్యాకరణాది శాస్త్రచయవే • త్తల్వేద విజ్ఞానతే
జోర్కుల్నీతి విచక్షణుల్వరమత • త్వార్థైక్య సంధాతలుం
చేరంగ్ శక్యముగాని సత్కవివరు • ల్విఖ్యాత విద్యాన్వితుల్
కోర్కుల్మీఱఁగ నంతఁదీర్పఁగ నవే • కుల్మెచ్చ శాస్త్రక్రియన్॥

క. వేడుకకుఁదండ్రిబిడ్డలుఁ దోడంబుట్టువులునాఁడు • తోబుట్టువులన్
గూడిచదువుకొను గ్రంథంబాడాడనునిలుపవలయు • నద్వైయెడలన్॥

చ. చదువుటకొద్దికాలమది • చక్కఁగ నర్థముచేసికొంటకున్
బదిలముకాదు తెల్వియొక • పట్టునశాస్త్రములభ్యసింపఁగా
నదనగునేయటంచు నన • నక్కటచెల్లునె తెల్విమీఱునే
ర్పదమనువారలు న్జదువ • సిగ్గయి మానవలెన్ సతీమణుల్॥

చ. వదనమున న్సరస్వతి!ని • వాసమొనర్చితివేని మానినుల్
పదుగురకొక్కరేని నొక • పద్యముచెప్పఁ దలంపుగల్గువోఁ
దదనుగుణంబులయినవి య • ధావిధిఁ జొత్తమొనర్పనేమి వి
న్నఁదనముదోఁపనుండు • రనిన న్దగుపాండితి గల్గనేర్చునే?.

క. ఇంచుకఁ దీరికనోపికఁ గాంచిచదువ సతులనగినఁ • గలదెఫలముయో
చించితగినవిద్యనదను మించనితఱినేర్పఁదెలివి • మెఱయకయున్నే

క. చేసెను శ్రీశూద్రాదులకై సంహితయనఁగ వ్యాస • కవిభారతమున్
వ్రాసినవొసచ్ఛాస్త్రంబాసగొలుపకున్నె దత్క్రి • యజనంబులకున్

ఉ. శాంతరసప్రధానముగ • సల్పిననాటక మెట్టికీర్తి యా
శాంతము లాక్రమించెఁ గవు లందఱు మెచ్చరె కృష్ణమిశ్ర వే
దాంతపటుత్వ వాఙ్మహిమ • మల్లెవినూత్నరసాంచితంబు గ్రం
థాంతర మాచరించి బుధు • లందరె శాశ్వతకీర్తి నిద్ధరన్!.

క. ఏరసమెట్లెట్లొదవి యపారముదముకూర్చు నాంధ్ర • భారతమువలెన్
సారవచస్థితివలదే కోరిరసాభాసమిడిన • గుణమొప్పునొకో॥

ఉ. పెక్కులు చిక్కులుంట గని • పెట్టిపరీక్షకులట్టితావులన్
జక్కఁగ నేర్పరించుచు • విచక్షణులై చదివింత్రు బాలురన్
నిక్కముగా నిబంధనలె • నిల్పవటంచొకమాటవుట్టె నిం
కెక్కడిమాట స్త్రీలచదు • వెట్లుప్రవర్తిలనున్నదో భువిన్॥

ఉ. ఆర్యజనంబులెప్డు విన • యాన్వితులై నినుగొల్తురిగాదె గాం
భీర్యఖనీ! త్వదాశ్రితుల • పెంపెదఁగోరెదుగాదె సద్యశః
స్థైర్యమనోజ్ఞవస్తుఫల • దానమొనర్పఁ దలంచియీమహా
కార్యమొనర్చి ప్రోవ నది • కారివి కావొకొ యాంధ్రభారతీ॥

Sir Harold Stuart.



సర్ హారాల్డు స్టూవర్టు.

Sir K. G. Gupta.



సర్ కృష్ణగోవింద గుప్త.

The Hon. Mr. Chaubal.



గౌ॥ శ్రీ చౌబలుగారు.

The Hon. Nawab Shams-ul-Huda.



గౌ॥ నవాబ్ షంసుల్ హుదాగారు.



గౌ॥ రాజా పి. రామారాయణంగారు.

h Ramarayanam garu.



గౌ॥ మిర్ అసద్ అలీఖాన్ బహదూర్ గారు.

The Hon. Mr. Mir Asad Ali Khan Bahadur.

Bambay Art Printing Press.

Mr. Rockfeller. రాక్ ఫెల్లరుగారు.



Sir Tarakanath Palit.



సర్ తారకానాథ పాలిత్.



Sir S. Ramaswamy Modaliar.

సర్. ఎస్. రామస్వామి మొదలియారుగారు.

Dewan Bahadur Govindadas Chaturbhuj Das.



దివాన్ బహదూర్ గోవిందదాస్



Mr. Marconi. మార్కొనిగారు.



Mr. Amundsen. అముండ్సెన్‌గారు.



...hetty. శిరాం సుబ్బయ్య శెట్టిగారు.

Mr. Habibur Rahman Khan



హబిబూర్ రహిమాన్ ఖాన్ గారు.

# మేనరికము.

[ భో. నంబెరుమాళ్లుగారు. ]

హిందూజాతీయ దౌర్బల్యమునకు ముఖ్యకారణములుగానున్న యతిబాల్యవివాహాదులనురూపుమాపుట సంఘసంస్కర్తలగు దేశాభిమానులు తమసామర్థ్యానుసారముగఁ బలువిధములగు ప్రయత్నముల జేయుచున్నారు. బాల్య వివాహములు, వృద్ధ వివాహములు, నింద్యములనియు, మనసౌఖ్యమునకు భంగకరములనియు, రాఁబోవు తరములకు దౌర్బల్యావహము లనియు జనులకు సామాన్యముగా దెలియును. శాస్త్రవిహితము కాదని తెలిసియు, పిత్రాచార గౌరవముచేత వానినివిడువలేకున్నారు. గాని మేనరికముమొదలగు రక్తసంబంధులలోని వివాహములు శాస్త్రనింద్యములనికాని ప్రకృతశాస్త్ర విరుద్ధములనికాని జనసామాన్యమునకు తెలియనే తెలియదు. జాతీయ దౌర్బల్యమునకు మనలోని వివాహములు హేతువులని యంగీకరించుచు, మేనరికములుముఖ్య కారణములనిచెప్పుటకుసాహసించుచున్నాము.

జ్ఞాతివివాహములు, నష్టాపాదకములగునా, కావా యనునది వివాదాంశమైనను, హిందూదేశ విషయమం దనర్థదాయకమైయున్నది. అద్దానికి కారణములుమున్ముందు తెలియగలవు. వివాహములందు నాలోచింపవలసిన యంశములు రెండు. ఈవివాహము దంపతులకు సుఖావహమా? వారిసంతానమారోగ్యముగ నుండగల్గునా యనునీరెండు విషయముల నాలోచింపవలసి యున్నది. కాన జ్ఞాతివివాహము లీరెండవ విషయమం దెట్లువర్తించుచున్నవో యిచ్చట విమర్శించిచూతము. ఈముఖ్యాంశ విమర్శనయందు జీవశాస్త్రములను, హిందూవివాహధర్మములను, భౌతిక శాస్త్రజ్ఞుల యభిప్రాయములను మనము తెలిసికొనవలయును.

వీనిలో మొదట జీవశాస్త్రమును పరిశోధింతము. విశ్వ విశ్వంభరావలయంబున వెలయు సచరాచరజీవరాసులయందు వివాహమువంటి ప్రకృతిధర్మ మొకటియున్నది. వివాహమన్న ఘృతహోమమనికాని మంత్రోచ్చారణమనికాని భ్రమించవలదు. వివాహమనగా నొక జీవము మఱియొక జీవముతో సమాగమ మగుటకాని వేఱుకాదు. సమాగమము నానావిధములుగానుండును. కొన్ని యంగభేదములేని క్షుద్రజంతువులు కలసియొక చోటఁ బడియుండును. ఈతరగతిలోఁజేరిన పార్మోశియ మనుజీవము మనముచూచు పెద్దజంతువువలె పిల్లలనుబెట్టక యదియే రెండు శకలములయి రెండుపిల్లలుగా మారును. వీనిలో స్త్రీపురుషభేదములేదని తెలియజేసితిమిగదా! ఇటులనొక్కొక్కపిల్లయుఁ బెద్దదయిమఱిరెండుపిల్లలుగామాఱును. ఈజాతి వృద్ధియగువిధ మత్యద్భుతము. గాని దీనిలోనొకరహస్యమున్నది. వీనిలో నేదైనను శకలములు కాకపూర్వము మఱియొక జీవముతో సమాగమము కావలయును. ఏయే జీవములు సంయోగమగునో మనము విచారించిచూతము. ఏకమాతృశకలములగు సహోదరులెంతస్నేహముతో నుంట సంభవించినను, సమాగమముగాక యన్యమాతృ శిశువులతోడ సంయోగమగుట కర్థమేమయియుండునో వివేకులూహించుకొనెదరుగాక! సమాగమసమయమందు వానిబీజములను బరస్పరము మార్చుకొనును, ఇట్టిబీజపరివర్తనము భిన్నమాతృశకలములప జీవనములకైనంగాని, పిల్లలుకనుటకు శక్తిపుట్టదు. కాన దైవయోగములైన సమాగమములయందు రక్తసంబంధ వివాహములులేవు. జ్ఞాతిసంయోగములయందు తనబీజమువంటి బీజముమార్చుకొనవలసియుండునుగాన సంతానముపొందుటకు శక్తికలుగదు. జ్ఞాతివివాహములు సంతానమునకు భంగకరములనియు, ఈశ్వరోద్దేశమునకు విరుద్ధములనియు నిందువలనదేలుచున్నది.

ఇక చరములలోఁగాక యచరములలోని ప్రకృతిధర్మమును గనిపెట్టిచూతము. వృక్షజాతులలో సమాగమమెట్లగునని కొందఱూహింపవచ్చును. సాధారణముగా చెట్లయొక్క స్త్రీపురుషభేదము వానిపువ్వులనుండి నిర్ణయింపబడును. వృక్షములయందు స్త్రీపురుషభేదము కలదని మనలోననేకులకుఁ దెలియనే తెలియదు. కొన్ని స్త్రీపురుషలక్షణాన్వితమైన భూజములుకలవు. వానిపుష్పములందుఁబురుషలక్షణమైన చిన్నధ్వజమొకటియు, స్త్రీలక్షణమైన చిన్న రేకొకటియునుండును. ఇప్పుడుసంయోగమెట్లుకలుగునో కొంచెము తెలుపఁగలము. ఒకపుష్పధ్వజము మఱియొక పుష్పదళముపై పడుటచేఁ సమాగమమందును. ఒకవృక్షముయొక్క పుష్పదళములలో నున్న దళధ్వజములు కలియుట తటస్థించునని సందేహింప బనిలేదు. దళధ్వజములకు ఋతుసమయ ముండుటంజేసియు, నవి రెండును, నొక్కకాలమందు వికసింపమిచేతను, నట్టి యనుమానమునకు తావులేదు. వికసింపని దళధ్వజములుసమాగమమైనను, లాభములేదు. ఫలోత్పత్తి కానేరదు. కావున నొకపుష్పముయొక్కగాని లేక యొకచెట్టుయొక్కగాని, దళధ్వజములకు నిజమైన సమాగమముండదు. సమాగమమందు పరస్పరబీజ పరివర్తనము ముఖ్యముగుటంజేసి, బీజరసమెంత దూరసంబంధము గలిగియున్ననంతమంచిది. ఈవిషయము పార్శ్మిశియము లందువలెనే చెట్లయందును వర్తించును. కానియొకచెట్టుపూరేకు మఱియొక వృక్షపుష్పధ్వజముతో సమ్మేళనమెట్లగునని యొకసందేహము పొడమవచ్చును. దళధ్వజములు సాధారణముగా నతిసూక్ష్మములగుటంజేసి గాలిచేఁ దీసికొనిపోబడవచ్చును. లేక పుష్పరసాదులకై వచ్చెడు పిట్టలకాళ్ళకంటుకొని పోవచ్చును. ఈయుదాహరణముల వలనరక్తసంబంధవివాహములు నష్టకరములనియు, భగవదుద్దేశవ్యతిరేకములనియు స్పష్టపడఁగలదు. మఱియుజ్ఞాతివివాహములు సంతానశూన్యములైనను, లేకదుర్బల సంతానములైనను గావచ్చునని మనముదృఢముగఁ జెప్పగలము.

మఱియొకచిన్న ప్రకృతి రహస్యమును సూచించుచున్నాము. అదిసామాన్యముగా నందరికిఁదెలిసియేయున్నది. చెట్లకంట్లుకట్టుదురని మనకుదెలియని విషయము కాదు. ఒకసామాన్యపు మామిడి మొక్కనుదెచ్చి మఱియొక సాధారణమైన మామిడిచెట్టుతో నంటుకట్టినయెడల నేమిలాభమున్నదో, యట్టి యంటుమామిడిచెట్లెట్టి పండ్లనుగాయునో ప్రత్యేకముగా నిచ్చట నొక్కిచెప్పనవసరములేదు. ఇటులనే తక్కిన వృక్షములలోనేగాక మనుష్యులలోనుగూడ నూహించుకొనునది. ఆంగ్లేయులు మొదలగు బలాఢ్యుల, ధైర్యస్థైర్యములకుఁ గారణమిట్టిరక్తసంకరముగాక మఱియెద్ది? వారు, కెల్టులు, సేక్సనులు, డేనులు, నార్మనులు మొదలగు జాతులసంకరముచేతనే యింతబలాఢ్యులైరని కొందఱుప్రకృతి శాస్త్రజ్ఞుల యభిప్రాయము. వారుమనహిందూదేశమును స్వాధీనముచేసికొనకుండ, వారివ్యూహములకుఁ బ్రతివ్యూహములంబన్ని, వారిబలములకు శతవత్సరములు చెలియలికట్టై నిలిచిన మహారాష్ట్రులు, సిక్కులు మొదలయినవారెట్టివారు? వారును నిట్టి సంకరజాతులేయని దేశచరిత్ర ఘోషించుచున్నది. ఇట్టియుదాహరణము లెన్నియైనను నీయవచ్చును. యూరోపుఖండంబున మహాచక్రవర్తియను పేరుగాంచిన నెపోలియనునందు, కార్సికా, ఫ్రాన్సు, ఇటలీదేశీయుల రక్తము ప్రవహించుచున్నదని చరిత్రకారులు వ్రాయుచున్నారు. ఈ దేశమునందేకాక ప్రపంచమందేభాగమందైనను, యేయుగమునందైనను మహాత్ములు, మేధాసంపన్నులు, భీమబలులు మొదలగువారు దూరసంబంధజనకపుత్రులనియు రక్తసంబంధ దంపతుల పుత్రులుకారనియు మేముద్ఘోషింప సాహసించుచున్నాము.

ఇంతవఱకు జ్ఞాతిసంబంధము దైవోద్దేశ విరుద్ధమనియు, దూరసంబంధమువలన లాభములున్నవనియు విశదపఱచితిమి. గాని జ్ఞాతిసంబంధములు మనుష్యుల కెట్టి నష్టమునాపాదించునో యట్టివానిసంతానమున కెట్టివిపత్తులఁ దెచ్చిపెట్టునో చెప్పవలసియున్నది. ధీమంతులగు భౌతికశాస్త్రజ్ఞులు వివాహ సంబంధములఁగూర్చి వ్రాయుచు నిట్టివివాహములను జేయగూడదని నిషేధించియున్నారు. "అట్టిదంపతులకు (1) సంతాన మెప్పుడును

కలుగకపోవచ్చును. (2) కలిగినను జాలకాలమునకుకలుగును. (3) వదియును పిండరూపముగాఁ గలుగవచ్చును, తప్పిజారి సంతానము నిలిచినయెడల (4) అంగవైకల్యముగాని, (5) బుద్ధిమాంద్యముగాని, (6) రోగారిష్టముగాని సంభవించును" అని రిల్లెటుదొరగారు వ్రాసియున్నారు. జెమస్‌దొరగారు, వారియనుభవము నిట్లనివిశదపఱచియున్నారు.

"సంయుక్తరాష్ట్రిమునందు 580 జ్ఞాతివివాహములైనవి. 2778 శిశువులు జనించిరి. అందు 846 వికలాంగులును, 117 మూగివారును, 63 బధిరులును, 231 బుద్ధిమాంద్యులును, 24 పిచ్చివారును, 44 మూర్ఛారోగబాధితులును, 189 గండమాల వ్యాధిచేఁ బీడింపబడువారును, 637 అల్పాయుష్మంతులునైరి." ఇట్టిగ్రహచారమునకు, జ్ఞాతివివాహ మొక్కటియెగాక జనకుల క్షీణస్థితియు శిశుపోషణలోపము మొదలైన మఱికొన్నికారణములుండవచ్చునని యొకశాస్త్రజ్ఞునియభిప్రాయము. ఉన్మత్తుల తలిదండ్రులు సాధారణముగా రక్తసంబంధులగుచున్నారని జార్జిడార్విన్‌గారు తెలుపుచున్నారు. మఱికొందఱు ప్రకృతి శాస్త్రవేత్తలు భిన్నాభిప్రాయులై, జనకులు జ్ఞాతులైనను, వారారోగ్యవంతులైనయెడల వారికి లేశమైన, నంగవైకల్యము లేనియెడల సంతానమునకు దౌర్బల్యము వాటిల్లనేరదని చెప్పుచున్నారు. దంపతుల సంతానము బలముగ నుండినను, నీధర్మమన్వయింపలేదని తలపవలదు. వారు దూరసంబంధులవివాహము చేసికొనియుండిన యెడల నంతకంటె బలాధికులనే కనియుందురని కూముదొరగారి యభిప్రాయము. ఈవిషయమునుగూర్చి చర్చించునపుడు, న్యూయార్కువైద్యసంఘమువారు "వంశములో నెవరమువారైనను దీర్ఘవ్యాధిబాధితులు కానప్పుడు సగోత్ర సపిండుల సంతానములకు నెవ్విధమైన హానియురాదు. అట్లుకాక పూర్వవంశస్థుల కెట్టిలోపమైననున్న, జ్ఞాతిదంపతుల సంతానమందాలోపము, వృద్ధితోఁ బొడసూపును." ఏతరమందైనను వ్యాధి బాధితముకాని వంశముండునని చెప్పుటకేమూర్ఖుఁడైనను సాహసించునా? రోగబాధితులవంశస్థులయందారోగము కొంచెముగానో, గొప్పగానోయుండుటచేత జ్ఞాతివివాహములు దుర్బలసంతానయుతములన్న నాశ్చర్యమేమున్నది? దీనినిగురించి 'చేంబర్సు ఎన్‌సైక్లోపీడియా' యందిట్లున్నది. "పిరినీసులోయలోని కాగట్లయొక్కయు, నవరంజ్‌లోనిమూరనులయొక్కయు, డాఫిన్యులోని సారసనులయొక్కయు, ఆల్ప్సులోని క్రీటనులయొక్కయు మనోదేహ దౌర్బల్యమునకును అమెరికాలో నీగ్రోజాతివారు నానాటికి హీనస్థితికి వచ్చుటకును గారణము సమీప బంధువులలోని వివాహములేయని తెలియవలెను.' మనదేశమునందును జాతులలో శాఖోపశాఖలేర్పడుటచేత, సమీప బంధువులలో వివాహముచేసికొనవలసివచ్చుచున్నది.

ఇచ్చట అనువాయి ధర్మము గూర్చి కొంతచెప్పియున్నాము. కాని హిందూవివాహములయందీధర్మ మెట్లువర్తించుచున్నదో విపులముగా విమర్శింపవలసియున్నది. తల్లికిగాని తండ్రికిగాని యెట్టిగుణమున్నను, వారి సంతానమందు వృద్ధితోఁ గనఁబడును. మనపూర్వుల కిట్టి ధర్మము తెలియనిదికాదు.

శ్లో॥ కులానురూపాః ప్రజాస్సంభవంతి. యనుహారీతవచనము;
పితుర్వా భజతేశీలం మాతుర్వా భయమేవవా యని మనుస్మృతి.

అనగా సంతానము తండ్రినిగాని తల్లినిగాని లేకయుభయులనుగాని పోలియుండును. జనకులకట్టి లోపములేకపోయినను వారిపూర్వులలో నెవరికైన యుండినయెడల వారిసంతానమునకు హానికలిగించునని కొందఱియభిప్రాయము. ఈధర్మమును మనవారు తెలిసినవారగుటచేత నిట్లువిధించియున్నారు.

శ్లో॥ మహాంత్యపి సమృద్ధాని గోజాని ధనధాన్యతః ।
స్త్రీసంబంధేదశైతాని కులానిపరివర్జయేత్॥
హీనక్రియం నిష్పురుషం నిశ్ఛందో రోమశార్శసమ్ ।
క్షయామయావ్యపస్మారి శ్విత్రికుష్ఠికులానిచ॥

అనగా, గోధనధాన్య సంపత్తితోనున్న, వారివంశమును, పురుషసంతతి బొత్తుగలేకున్నను, దేహమున వెండ్రుకలు బలిసినవారున్నను, వ్యాధిగ్రస్తులున్నను, కుష్టుశరీరులున్నను వివాహమునందు విడువదగినది. తలిదండ్రులకవ

గుణములున్నను, నాలోపములు వారి శరీరతత్వమందు దృఢముగా నాటకుండిన యెడల సంతానమునకు నష్టదాయకము కాదనియు, వంశపారంపర్యముగా వ్యాపింపదనియు కొందఱు తలంచుచున్నారు. కాని వ్యాధి శరీరతత్వమందుఁ బాదుకొనిన యెడల నిరుద్ధముగా, ద్విగుణితముగా సంతానమునందుఁ గనఁబడునని యంశము నైకకంఠ్యముగా నొప్పుకొనుచున్నను, దలిదండ్రులవయస్సు శిశువుల సుఖాసుఖంబుల నిర్ణయించునేమోయని కొందఱి యనుమానము. వృద్ధులయొక్కగాని పంచవింశతి వత్సరముల కంటె తక్కువప్రాయపు దంపతులయొక్కగాని పిల్లలు వారిజనకుల రోగముల ననివార్యముగాఁ బొందుదురు. భార్యాభర్తలు సంపూర్ణయౌవనులైన యెడల శరీరధార్ఢ్యముచేతను, విద్యాబలముచేతను వారిశిశువులకుఁదమ వ్యాధులు వ్యాపింపకుండఁ జేయుశక్తి కలిగి యుందురని ప్రకృతి శాస్త్రవేత్తలు వ్రాయుచున్నారు. కావున జననీజనకులు బాలులైనను, వృద్ధులైనను, వారిసంతానము తనుశరీరధర్మములను నిరాటంకముగా బొందుచున్నది. సాధారణ వివాహములే యిట్లు ఫలించుచుండగా జ్ఞాతి వివాహములగతి వేఱెచెప్పనేల? నిష్కళంకమైన వంశముండుట దుస్తరమగుటచేతను, నీదేశమందు పంచవింశతివత్సర ప్రాయము రాకముందే స్త్రీలు నలుగురైదుగురు బిడ్డలను గనుటచేతను, సమీప బంధువులలో వివాహములు దుఃఖభాజములనుట నిర్వివాదాంశము. అతిబాల్యవివాహము లతిప్రబలముగ నున్ననాఁడు, వృద్ధవివాహము లడుగంటనినాఁడు, జాతులలో శాఖోపశాఖాభేదము లేర్పడిననాఁడు, జనులు ప్రకృతిశాస్త్ర విచారదూరులై సకలరోగ పీడితులైననాఁడు, ప్రజలకు శిశుపోషణ రహస్యము సమగ్రముగఁ దెలియనినాఁడు, మేనరికము మొదలగు రక్తసంబంధ వివాహము లనర్థదాయికములు గదా!

ఇంతవఱకు నిట్టివివాహములు ప్రకృతిధర్మ వ్యతిరేకములనియు నీశ్వరోద్దేశ విరుద్ధములనియు భౌతికశాస్త్ర బాధితములనియుఁ దెలపియున్నాము. ఇట్లు సపిండదంపతుల సంతాన మనంతములైన ప్రత్యవాయములకు లోనైయున్నదని మన యిప్పటివారికిఁ దెలియకపోయినను, ధీమద్గ్రేసరులగు మన పూర్వులకు స్ఫురింపకపోయెనా యని కొందఱు బుద్ధిమంతులడుగ వత్తురేమో? మనపూర్వులు ప్రకృతిశాస్త్రమును గూలంకషముగ నెఱిగినవారైనను గాకపోయినను స్మృతికర్తలు వివాహధర్మములందు, సగోత్రసపిండ వివాహముల నేకగ్రీవముగా నిషేధించియున్నారు.

శ్లో॥ అసగోత్రామ సపిండా మసమాన ప్రవరాం కన్యాంవరయేత్ ।

అనగా సగోత్రయును సపిండయును సమాన ప్రవరయును గానట్టి కన్యను గోరవలయునని తాత్పర్యము. సగోత్రమనగా నొకవంశ మగుటం జేసి కన్యావరులయొక్క మూలపురుషుఁడొక ఋషిగా నుండకూడదు. ఈనిబంధనను హిందువులందఱు మొదటనుండి యనుసరించుచున్నారు. కాని సపిండవివాహము లశాస్త్రీయములని తెలియనివార నేకులుండవచ్చును.

శ్లో॥ మాతృష్వ స్వమాతులాది భిస్సహమాతా మహదేహాన్వయాత్ ।
తథాపితృవ్య పితృష్వస్రాది భిరపి పితామహదేహాన్వయాత్ ।
ఏవంత్రసాక్షాత్ పరంపరయావా ఏకశరీరాయవయవా
న్వయేన సాపిండ్యం యోజనీయం ॥

అనగాఁ దల్లితండ్రి దేహసంబంధమువలనఁ దల్లియొక్క యక్కసెల్లెండ్రును మేనమామలును, తండ్రియొక్క దేహసంబంధమువలన, తండ్రియొక్క యక్క-సెల్లెండ్రు మొదలగువారును సపిండులని తెలియవలయును. ఇందుచే మేనత్తగారి వంశములోను మేనమామగారి వంశములోను, తల్లియొక్క సెల్లెండ్ర వంశములోను తనయక్కసెల్లెండ్రవంశములోను సపిండత్వబాధకమునుబట్టి పరిణయంబాడఁగూడదని విశదమగుచున్నది.

శ్లో॥ పితుః పితృష్వసుః పుత్రాః పితుర్మాతృష్వసుస్సుతాః ।
పితుర్మాతుల పుత్రాశ్చ విజ్ఞేయాః పితృబాంధవాః ॥
మాతుః పితృష్వసుః పుత్రాః మాతుర్మాతృష్వసుస్సుతా ।
మాతుర్మాతుల పుత్రాశ్చ విజ్ఞేయాః మాతృబాంధవాః ॥

అనగా తండ్రి తండ్రియొక్క యక్కసెల్లెండ్ర కొడుకులును తండ్రి తల్లియొక్క సెల్లెండ్ర కొడుకులును, తండ్రి మేనమామగారి కొడుకులును పితృబంధువులనియు, తల్లి [illegible] యక్కసెల్లెండ్ర కొడుకులును, తలి తలి యక్క-

సెల్లెండ్ర కొడుకులును, తల్లి మేనమామగారి కొడుకులును మాతృబంధువులనియు నెఱుంగవలయును. సపిండత్వ మీవంశము వారందఱికిని వ్యాపించియున్నది గనుక నీవంశములో వివాహము జేసికొనదగదు.

శ్లో॥ భగిన్యాః పుత్రికాం స్వస్యపుత్రస్యోపమే యద్వది।
సతుచండాల వత్త్యాజ్యః సర్వకర్మ బహిష్కృతః॥

అనగాఁ దోడఁబుట్టినదాని కూఁతునిఁ దనపుత్రునికి వివాహము చేసినవాఁడు చండాలునివలెకర్మబాహ్యుడగును. సపిండనివృత్తి యెప్పుడగునందు రేని

శ్లో॥ పంచమాత్ సప్తమాదోర్ధ్వం మాతృతః పితృతః స్థదేతి

అనగాఁ దండ్రి ప్రక్కకూటస్థుఁడు మొదలుకొని యేడు తరముల కనంతరమున తల్లి ప్రక్కకూటస్థుఁడు మొదలైదు తరముల కనంతరము సపిండనివృత్తి యగునని చెప్పబడియున్నది. సపిండనివృత్తి యగునన్న రక్తసంబంధమంతగా నుండదనుట. దీనింగూర్చి భౌతికశాస్త్రజ్ఞులిట్లు చెప్పుచున్నారు. «ఒకజత యెలుకలందెచ్చి తోఁకలం గొట్టివేసి పెంచవలయును. దానిపిల్లలలో నొకజత నెంచుకొని మరల వానితోకలను గత్తిరించవలయును. ఇట్లేడుతరములవఱకుఁజేసినట్లయిన ఎనిమిదవతరము తోక లేకపుట్టును. గాన నొకరియందొకానొక గుణముండినయెడల నేడుతరములనుండి వాని వంశమందున్నదని మనమూహింపవచ్చును ఈధర్మమును మనపూర్వులు తెలిసినవారగుటచేత వివాహశాస్త్రములందు సపిండనివృత్తి నంగీకరించియున్నారు.

సపిండవివాహము లశాస్త్రీయములైనను హిందువులు శేయుచున్నారుకదా? ఈవిషయమందు హిందూజాతియంతయు దోషార్హముగాదు. ఉత్తరహిందూస్థానమందుగాని దక్షిణమందుగాని లేక యాంధ్రులలోనే యిట్టిదురాచారము గానవచ్చుచున్నది. వైశ్యులయందును శూద్రజాతులయందును నిర్బంధముగా నున్నది. తక్కిన జాతులయందు నిర్బంధము లేదుగాని శాస్త్రనిషిద్ధమనియు నష్టావహమనియుఁ దెలియదు. ఏమికాలకర్మ దోషమునో గాని కొందఱు సహోదరికొమార్తెను వివాహమాడుచున్నారు. అక్కకొమార్తెను బెండ్లాడ వెనుదీయ[...] వారలన్నకూఁతునేల వివాహమాడకూడదు? తండ్రియ[...]క్కసెల్లెండ్ర పుత్రికలఁ బరిణయంబగువారు మహమ్మ[...]యులవలె తండ్రి యన్నదమ్ముల కుమార్తెలనేల చేప[...] గూడదు? సగోత్రవివాహమెంత దోషమో యెంతపా[...]పమో సపిండవివాహమునంత పాపమే. పినతండ్రి కొ[...]మార్తెను సహోదరిభావముతోఁ జూచువారు మేన[...] కుమార్తెనెందులకట్లు చూడరు?

శ్లో॥ పితృమాతృష్వస్పదుహితరో మాతులస్యసుతా।
ధర్మతో భగిన్యస్తావర్జయేదితి విజ్ఞాయితే॥

అనగాఁ దండ్రి యక్కసెల్లెండ్రయొక్కయు, మేనమా[...]మయొక్కయు కూఁతులు న్యాయముగాఁ జెల్లెండ్రగుచు[...]న్నారుగాన వివాహమందు విడువదగినవారని పైశ్లో[...]మందుఁ జెప్పఁబడియున్నది. ఇట్లు శాస్త్రములు వలదు వలదనిచెప్పిన దానినేమనవారు చేయుటచూడ నాశ్చర్య[...]ముగానున్నది. మనవారికి శాస్త్రాదరణ యున్నదని భ[...]మపడుచున్నాముకాని, నిజముగా మూర్ఖాచారమే వీరి[...] బీక్షించుచున్నయది. మేనరికములు జేసెడివారు కన్యదొ[...]రకదనియో, సంబంధానురాగముచేత మేనకోడలను దవ[...] యింటిలో నుంచుకోవలయుననియో, ధన మన్యాక్రాంత[...]మగునను దురాశచేతనో మఱియే తుచ్ఛోద్దేశముతోనొ[...] చేయుచున్నారు గాని దూరబుద్ధితో నొనర్చుటలేదు. ఈ[...] దురాచారము ప్రేతాచారమేగాని శాస్త్రవిహితము[...]నియు నసర్థదాయకమనియుఁ దెలిసికొనియెదరు గాక[...] బుద్ధిమంతులగువారు దైవముఖమునుజూచి సత్యమును స్థా[...]పించవలయునేగాని వృద్ధులకుజడిసియు మూర్ఖులకు భయ[...]పడియుఁ గర్తవ్యమును విడువగూడదు. సపిండవివాహ[...]ములు హిందూశాస్త్రబాధికములని తెలిసిన తరువాత[...] ప్రకృతిధర్మ విరుద్ధమని ధృడపడినవెనుక, నీశ్వరోద్దేశ[...]క్కరణమని విశదమైనపిమ్మట, మేనరికములు రూపుమా[...]పలేకున్న యెడల నాంధ్రమహాజనులను మూర్ఖపిశాచా[...]ష్టులని విదేశీయులేకాక తక్కిన భారతీయులును నింది[...]తురని మేము భయపడుచున్నాము.

# రజస్వలా వివాహములు.

[ దాసు మాధవరావు పంతులుగారు బి.ఏ., బి.ఎల్.,]

ప్రస్తుతము మన దేశమునందు ప్రబలియుండు సాంఘిక దురాచారములలో బాల్యవివాహము మొదటి తరగతిలోనిది. బాలులకును బాలికలకును నతిబాల్యములోనే వివాహము చేయుటయేగాక పిన్నవయసునందే గర్భాదానమును చేయువాడుకకూడగలదు. భర్తకు 20 సంవత్సరములును భార్యకు 14 సంవత్సరములును దాటక పూర్వ మీపునస్సంధానమును చేయుచున్నారు. ఇందువలన నీదేశపు జనులు నానాటికి బలహీనతజెంది క్షీణించుచున్నారనుట నిస్సందేహము. కేవలము ఋతుమతియైన మాత్రమున పిల్లలకు శైశవము వదలి అవయవదార్ఢ్య మేర్పడి ప్రసవబాధలను సహించుటకును మాతృదశా భారమును వహించుటకును శక్తికలుగునుట వెఱ్ఱి. శిశువునకు పండ్లువచ్చినవనిన తోడనే సెనగలు నమలించుటకు ప్రయత్నించుట యెట్టిదో ఇదియు నట్టిదియే. నిజమైన యంగసౌష్టవము పురుషునకు 21 సంవత్సరములు దాటినవెనుకను, స్త్రీకి 18 సం॥ దాటినకనుగాని యేర్పడదు. ఈ విషయమున మనదేశీయులైనను, అన్యదేశీయులలోను, మిక్కిలి పేరుపొందినట్టియు విశేషవైద్యశాస్త్రజ్ఞానము గలిగినట్టియు మనదేశపు స్థితులను గుర్తెరింగినట్టియు పెక్కండ్రు డాక్టర్లు తమ యభిప్రాయము లిచ్చియున్నారు. చిరకాలము క్రిందట సంస్కృతభాషయందు వ్రాయబడిన శుశ్రుతమను వైద్యగ్రంథమునం దిట్లు వ్రాయబడియున్నది.

శ్లో॥ ఊనషోడశవర్షాయా । మప్రాప్తః పంచవింశతిమ్
యద్యాధత్తే పుమాన్ గర్భం । కుక్షిస్థస్సవిపద్యతే
జాతోవానచిరంజీవే । ఙ్జీవేద్వాదుర్బలేంద్రియః
తస్మాదత్యంతబాలాయాం । గర్భాధానం నకారయేత్.

దీనియర్థము 25 సం॥లోపు పురుషుడు 16 సం॥ల లోపు బాలికను పొందెనేని శిశువు గర్భములోనైన జచ్చును. ఒకవేళ జన్మించినను దీర్ఘకాలము జీవించదు. జీవించినను దుర్బలియై యుండును. పూర్వకాలమునందే ఇట్టి గొప్ప ధన్వంతరుల యభిప్రాయములు కనుబడుచుండినను, మనదేశమునందు బాల్యగర్భాధానములు ప్రబలుట శోచనీయము. మనదేశ ముష్ణదేశమనియు బాలికలు శీతలదేశములకంటె వేగముగ పుష్పవతు లయ్యెదరనియు స్త్రీపురుషులకు యౌవనము వేగముగ నంకురించుననియు నందువలన శీఘ్రముగ సంయోగము గలుగ వలసినదనియు కొందరు చెప్పెదరు. అది తప్పిదము. కొందరు గొప్ప విద్యావంతులైన డాక్టరులు, ఇచ్చిన యభిప్రాయములు చదివి చూడగా నుష్ణదేశ వాసమువలన స్త్రీలయందు రజోదర్శన కాలము సూక్ష్మముగ త్వరితపఱచబడినను అది శీఘ్ర యౌవ్వనారంభమునకు ముఖ్యకారణము గాదనియు, బాల్యవివాహములే ముఖ్యకారణములనియు తెలియవచ్చుచున్నయది. సరియైన దేహపటుత్వ మేర్పడక మునుపే పిల్లతల్లులైనవారిని మన మనేకులను చూచుచున్నారము. ఎలుకకూనలవలె బలహీనులైన పిల్లలు పుట్టుటయేగాక తల్లులు బడుగులై 20 సం॥ల యీడునకే ముదుసలు లగుచున్నారు. ఈ విధముగ కొన్నితరములు గడచిన పిదప దేశజనులు కుబ్జులును మనోదుర్బలులును నై తుదకు నాశనముజెందుదురనుట నిశ్చయము. గిడసబారి, ఇలకరించుకొనిపోయిన అరటిచెట్టున వ్రేలెడుగెల దిగినట్లు తల్లులకు పిల్లలు పుట్టుచుందురు. ఇట్లు పుట్టిన పిల్లలకు త్వరితముగ ఋతుకాలమువచ్చి యౌవన లక్షణము లేర్పడుచున్నవి. ఇదియుంగాక పసితనముననే దాంపత్య విషయములను తిలకించుట అవలోకించుట వినుచుండుటల వలనకూడ నస్వాభావికమైన యౌవనమేర్పడుటకు కార

ణ మగుచున్నది. ఇంతకన్న దేశవినాశకరమైన యాచారము కలదా? మన ముసలమ్మల నీవిషయమై పృచ్ఛ చేసితిమా మాతల్లి 13 వ యేటనుండి కాన్పులుకనినది. మామ్ముత్తవతల్లి 12 వ యేట గర్భాధానమై 10 మందిని కనినది వారు వృద్ధురాండ్రగు వరకు సలక్షణముగ జీవించలేదా! పుట్టినవారు దృఢముగ నుండలేదా యని యుత్తర మిచ్చెదరు. కాని, ఈవాదన సరికాదు. పూర్వకాలమునందు స్త్రీలు పిన్నవయసున కాపురమునకు వచ్చినను పురుషులు తగువయసువచ్చిన పిదపగాని సంసారముచేయ నారంభింపలేదు. ఇప్పటివలె జనులు పట్టణవాసముచేసి శరీరవ్యాయామము లేక విద్యావ్యాసంగము మొదలగు మనఃక్లేశమునకు లోనై, దార్ఢ్యము చెడియుండలేదు. ఒకానొకప్పుడు స్త్రీపురుషులు స్వభావముగా దృఢకాయులైయుండి సంసారక్రియలవలన కృశించక యుండవచ్చును. అంతమాత్రముచేత చిన్నతనములోనే స్త్రీపురుష సంధానము కావచ్చునని చెప్పఁదగదు.

ఇప్పుడిప్పుడు ఈ విషయమున మన దేశములో క్షేమకరమైన మార్పులు కలుగుచున్నవి గాని బాల్యగర్భాధాన పద్ధతిని మొదలంట దునిమినఁగాని దేశము పురోవృద్ధి జెందదు. గర్భాధానము యుక్తవయసునందే కావింపవచ్చును, గాని వివాహకర్మమాత్రము బాలిక రజస్వల కాకపూర్వ మేల కాకూడదని కొందరు బుద్ధిమంతులైన పూర్వాచార పరాయణులు చెప్పుచునున్నారు. ధర్మశాస్త్రములును చిరకాలా గతమయిన యాచారమును రజస్వలా వివాహములను నిషేధించు చున్నవి యనియు కేవలము వివాహమైన మాత్రమున కష్టము లేదనియు, చిన్నతనమందే వివాహమగుటవలన సంసారము చేయవచ్చునప్పటికి భార్యాభర్తల మనస్సులయందు అన్యోన్యానురాగ బీజములు నాటుకొని యుండుననియు వీరు చెప్పెదరు. ఈ సంగతి విచారించవలసి యున్నది.

ధర్మశాస్త్ర విషయములలో నేను విస్తారము పరిశ్రమచేసిన వాడనుకాను. ఐనను శాస్త్రజ్ఞానముఁగల పండితుల వాక్యములను విని యున్నాడను. వేదశాస్త్ర పురాణములు బాగుగ తెలిసికొనినయెడల రజస్వలావివాహములు లేశము నిషిద్ధములు కావనియు ప్రాచీనకాలమందు బ్రాహ్మణాద్యగ్రవర్ణములందు గూడ ఋతుదర్శనానంతరము వివాహములు జరుగుచు వచ్చినవనియు స్త్రీలకు వివాహమైచ్ఛికమై కొందరుస్త్రీలు నిత్యబ్రహ్మచారిణులుగ నుండిరనియు తేటపడుచున్నది. వేదములందు నిషేధమే కనఁబడదు. పైగా వివాహములయందుచ్చరింపబడు వేదమంత్రములను జరుపబడు ప్రయోగములను పరికించి చూచితిమా యీడువచ్చి సంసార యోగ్యులైన స్త్రీపురుషులకే వివాహక్రియ యేర్పడి యున్నట్లును పసిబాలురకును బాలికలకును పెండ్లియుద్దేశింప బడనట్లును స్పష్టమగుచున్నది. వివాహప్రయోగమునందు గర్భాదాన ప్రయోగము కూడ చేరియున్నందున ప్రస్తుతము పెండ్లిండ్లలో అందుకు సంబంధించిన మంత్రములను పైవేడుకలను మాత్రము జరిపి చాలించుచున్నారు. గర్భాధానక్రియను కాలాంతరమున నిషేక సుముహూర్తము నిర్ణయించి జరుపుచున్నారు. ఈ పద్ధతి వేదమునకును గృహ్యసూత్రములకును విరుద్ధమై యున్నది. నానాట బాల్యవివాహములు ప్రబలి వివాహ సమయమునందే నిషేకము జరిగించుటకు అవకాశము లేక యిట్టి యాచారము ఉత్పత్తియైనది.

స్మృతులయందుమాత్రము కొన్నిటియందురజస్వలా వివాహములు నిషేధింప బడినట్లు కానవచ్చుచున్నది.

పరాశరుడు = శ్లో॥ ప్రాప్తేతు ద్వాదశేవర్షే యఃకన్యాంనప్రయచ్ఛతి।
మాసి మాసి రజస్తస్యాః పిబంతి పితరోనిశమ్ ॥

అర్థము:—పండ్రెండువత్సరముల ప్రాయమువచ్చిన కన్యను పెండ్లిచేయని తలిదండ్రులు ప్రతిమాసమును ఆమె రజస్సును పానముచేయుచుందురు.

బృహస్పతి = శ్లో॥ గౌరీందదన్నాకపృష్ఠం వైకుంఠం రోహిణీందదత్।
కన్యాం దదద్బ్రహ్మలోకం రౌరవంతు రజస్వలాం॥

అర్థము:—గౌరినివివాహముచేసి నాకలోకమును రోహిణిని వివాహముచేసి వైకుంఠమును కన్యనువివాహముచేసి బ్రహ్మలోకమును రజస్వలను వివాహముచేసి నరకలోకమును పొందుచున్నాడు.

పరాశరుడు చెప్పిన. శ్లో॥ అష్టవర్షాభవేత్ గౌరీ । నవవర్షాతురోహిణీ ।
దశవర్షాభవేత్కన్యా।అతఊర్ధ్వం రజస్వలా ॥

అను వాక్యముననుసరించి పై శ్లోకమునందలి గౌరీ, రోహిణీ, కన్యా అను పదములకు వరుసగా 8, 9, 10 సంవత్సరముల యీడుగల బాలికలనియును రజస్వలాపదమునకు 10 సంవత్సరముల వయసుదాటిన చిన్నదియనియును అర్థము గ్రహించదగియున్నది.

వసిష్టుడు = శ్లో॥ పితుర్గేహేచయాకన్యా । రజఃపశ్యత్య సంస్కృతా
భ్రూణహత్యా పితుస్తస్యాః।సాకన్యావృషలీస్మృతో ॥

అర్థము:—వివాహముకాకయే తండ్రియింటనే కన్య రజస్వలయగుచున్నదో యట్టికన్య వృషలి యనబడుచున్నది. ఆమెతండ్రి భ్రూణహత్య దోషము చేసినవాడగుచున్నాడు.

ఇట్లే మరికొన్ని స్మృతులయందును కాన్పించుచున్నది. అయిన నిట్టిశ్లోకములుకొన్ని ప్రక్షిప్తములుగాని నిజముగా ఋషివాక్యములు కావనిచెప్పుటకు నిదర్శనములుకలవు. అదియెట్లున్నను మనుస్మృతిమొదలగు మరికొన్నిగ్రంథములలో ఋతుమతీవివాహములు గర్హితములుకావని స్పష్టముగా గనబడుచున్నది.

మనువు= శ్లో॥త్రింశద్వర్షో వహేత్కన్యాం హృద్యాంద్వాదశవార్షికీం।
త్ర్యష్టవర్షోష్టవర్షాం వాధర్మేసీదతి సత్వరః ।
కామమామరణాత్తిష్ఠేద్గృహేకన్యర్తుమత్యపి ।
నచైవైనాంప్రయచ్ఛేతుగుణహీనాయ కర్హిచిత్ ॥

అర్థము:—ముప్పది సంవత్సరముల పురుషుడు తనకుహృద్యయైన పదిరెండు సంవత్సరముల బాలికను వివాహమాడవచ్చును. ఇరువదినాలుగు సంవత్సరముల పురుషుడు ఎనిమిదిసంవత్సరముల బాలికను వివాహమాడవచ్చును. అంతకుపూర్వము వివాహమాడిన ధర్మమును పోగొట్టుకొనును. బాలిక గుణహీనున కీయబడుటకంటె పుష్పవతియయ్యును పితృగృహమునందుండుటయే మంచిది.

మనువు = శ్లో॥ త్రీణివర్షాణ్యుదీక్షేతకుమారీ ఋతుమతీసతి ।
ఊర్ధ్వంతు కాలాదేతస్మాత్ విందేత సదృశంపతిమ్ ॥

అర్థము:—బాలిక ఋతుమతియయ్యును మూడుసంవత్సరములు పేక్షించి సదృశుడైన పతిని పరిణయింపవచ్చును.

విష్ణువు = శ్లో॥ ఋతుత్రయము పాస్యైవకన్యా కుర్యాత్స్వయంవరం.

అర్థము:—మూడుఋతువులుపాసించి కన్యస్వయంవరముచేసికొనదగును.

ఇట్టి ప్రమాణములవలన రజస్వలా వివాహముశాస్త్రసమ్మతమేయైనట్లు కానవచ్చుచున్నది.

ధర్మశాస్త్రవిచారము చేసినయెడల నొకసంగతి పొడగట్టుచున్నది. ప్రథమమున శ్రుతుల కాలములలో ఈడురాని పిల్లలకు వివాహములేలేనట్లును, తరువాత స్మృతులకాలములో చిన్నప్రాయమునందే వివాహము చేయునాచారము ఆరంభమైనను కొంతకాలము వరకు రజస్వలావివాహములు అంగీకరింపబడుచువచ్చి యంతకంతకు కేవలము నిషేధింపబడినట్లును తెలియుచున్నది. శాస్త్రవిషయమైన చర్చను ఇంతకన్న పూర్ణముగదెలిసికొనగోరువారు „రజస్వలా వివాహములనుగూర్చివిద్యావిశారదులును „దేశసేవకసంఘు” సభికులును అయిన వి. యస్. శ్రీనివాసశాస్త్రి బి. ఏ. గారివలన ఇంగ్లీషు భాషలోరచింపబడిన పుస్తకమును జదువవచ్చును.

శాస్త్రవిచారమెట్లున్నను బుద్ధిబలముచేతను యుక్తిచేతను దేశకాలావస్థలనుబట్టియు అనుభవమునుబట్టియు, శరీరావయవాది వస్తుస్వభావములను బట్టియు యోజించిచూచిన విరుద్ధముగగన్పించు శాస్త్రమునువిడనాడుటయేధర్మము. మరియు పూర్వమెన్నడోపుట్టినధర్మశాస్త్రములనే నేటివఱకును నాచరించవలసిన దనుట యుక్రమము. కొన్నిశతాబ్దములక్రిందట ధర్మశాస్త్రములు ద్భవమాయెను. ఈమధ్యకాలమున ప్రపంచ మెంతయో మారిపోయినది. ఆనాడు తిన్నయన్నమే కట్టినబట్టయే చేసిన వ్యాపారమే ఈనాడు నుండవలయుననుట విపరీతము. పూర్వకాలపు స్థితిగతులనుబట్టి అప్పటిచక్రవర్తులయొద్దనుండు ధర్మవేత్తలు అప్పటికాలాను గుణ్యముగా ధర్మశాస్త్రములను రచించియుందురు. స్థితిగతులుసంపూర్ణముగ మారిపోయిన వెనుకగూడ నవిపనికివచ్చునా? మన ప్రభుత్వమువారు చేయు రాజశాసనములు అప్పటప్పటికి కాలానుసారముగ మారుటలేదా? జీర్ణమైశిథిలమై కాలముదీరిన పురాతన ధర్మశాస్త్రము లన్నివిషయములయం దనుష్ఠేయముగ నుండజాలవు. కనుకబాల్య వివాహములు ధర్మశాస్త్రసమ్మతములా కావాఅనుసంశముకంటె దేశకాలవర్తమానస్థితులనుబట్టి యోగ్యములాకావా అనుసంశమే ముఖ్యముగ నాలోచించదగియున్నది.

బాలికకు బాల్యమునందే వివాహముచేసినయెడలనేమినష్టము? ఇదివరలో చంటిపిల్లలకుగూడవివాహము

లు చేయుటయు నొకానొకప్పుడు అట్టిపిల్లలను వృద్ధవరుల కిచ్చుటయు పలుచోట్ల చూచుచుండెడివారము. ఇప్పుడు నవీన నాగరికతవలన నీయాచారము చాలవరకు తగ్గినది గాని తరుచుగా 8 సం॥ ప్రాయమునుండి 12సం॥ ప్రాయమువరకు నాడుపిల్లలకు వివాహములు జరుగుచున్నవి. కాళింగులు మొదలగుజాతులలో చంటిపిల్లలకు పెండ్లి యేర్పాట్లు జరుగునాచారము నేటివరకును కానవచ్చుచున్నది. పసితనమున శిశువునకు జీవగండము లెక్కువను సంగతి అనుభవసిద్ధము. 18 సం॥ వచ్చువరకును నీయుపద్రవము తటస్థమగుచుండును. శరీరము ముదిరినవెనుక గండములు తగ్గును. ఈలోపుగా భార్యాభర్త లొకరినొకరు గోల్పోవుటకవకాశము లెక్కుడున్నవి. మగడు చచ్చెనేని పిల్ల దేశాచారముచొప్పున నిత్యవితంతువై యుండవలసివచ్చును. మగనిమొగమే యెరుగక ఇట్లునిత్యవైధవ్యమనుభవించు వితంతువు లెందరోగలరు. ఈడువచ్చినవెనుక నైజధర్మమైన వలపోవలేక పలువగలపాలై జీవయాత్రలుగడపు విధవలనేకులున్నారు. వారిలో గర్భస్రావములు, భ్రూణహత్యలుగూడ కదాజిత్తు జరుగుచుండుట చూచుచున్నారము. ఈడువచ్చినతరువాత పెండ్లియైనచో కొంతకాలము గాకున్న కొంతకాలమైనను పతిపజ్జనుండి పలుమరు సంతానముగూడ వడసియుండుట గలుగును. అట్టిస్త్రీలకుభర్తృవిహీనత యేర్పడునెడ కామేచ్ఛతగ్గికాలక్రమమునసమసిపోవును. ఈహేతువువలన ఈడువచ్చినపిల్లలకు వివాహము చేసిరేనివిధవా వివాహములఅవుసరమే చాలవరకు తగ్గిపోవును. కొంతకాలము క్రింద నాదివెలమవారిలో నొకబాలవితంతు వివాహము జరగెను. ఈకులములో సాధారణముగ నాడుపిల్లలకు 16, 17, సంవత్సరముల యీడురాకపూర్వము పెండ్లి యగుటయేలేదు. ఆవర్ణములోని విద్యావంతులైనకొందరుపెద్దలు అట్టివితంతువివాహము కూడునా కూడదా యని చర్చించుటకొక గొప్పసభచేసి తమలోబాలవితంతువులింతకంటె లేనేలేరనియు బ్రాహ్మణులు మొదలగు వారిలోవలె తమకువిధవావివాహ నిషేధమొకగొప్పజనకంటకమైనబాధగాకుండ లేదనియు బ్రాహ్మణులెప్పుడు వీరివిగావిధవావివాహముల నామోదించెదరో అప్పుడే తామునుట్లు చేయవచ్చుననియు తీర్మానించుకొనిరి. కాబట్టివివాహయోగ్యమైన యీడువిషయములో సంస్కారముజరిగెనేని స్త్రీపునర్వివాహచర్చ చాలవర కనవసరమే యగును.

చిన్నపిల్లలకు వివాహములు జరుగుటవలన పైన జెప్పినరీతిని చిన్నతనమునుండియు దాంపత్యసంబంధమైన తలంపులు హెరిగి శీఘ్రముగ ముగ్ధావస్థవదలి ముదిమిప్రవేశించును. ఆడుపిల్లలకు చదువు పనిపాటలు లేనప్పుడీఫలితము మరింతగాన్పించుచున్నది. పిల్లలమనసు నాకర్షించుటకు చదువుగాని కాయకష్టముగాని యుండవలయును. ద్రవ్యవంతులైన కుటుంబములలో ననేకచోట్లల ఆడుపిల్లలు చదువును పనియునులేక సోమరిచెలికత్తెలసహవాసముచేసి ముదిపేరక్కలగుచున్నారు.

దేశక్షేమమునకు స్త్రీవిద్యాభ్యాస మావశ్యకము. బాల్యవివాహములు జరుగుటవలన నీయుద్యమము కొనసాగనేరదు. పిల్లకు నించుమించు 10 సం॥ యీడువచ్చిన నిప్పటియాచారమునుబట్టి పెండ్లికావలసియున్నది గదా? తల్లిదండ్రులు విద్యనేర్పింపవలయునన్న పెండిలియైనతరువాత నట్టియుద్దేశము నెరవేరుట కనేకప్రతిబంధకములున్నవి. పెండ్లియైన పిమ్మట ప్రతివిషయమున నత్తింటివారి యభిప్రాయముచొప్పున నడుచుకొనవలసివచ్చును. ఒకవేళ మగనికిష్టమున్నను నతడుప్రాయశః చిన్నవాడై యితరులయాలోచనకు లోబడియుండుటవలనను వారికిబాలిక సమర్తయీడు వచ్చుతరి స్కూలునందు చదువుట హేయముగ తోచుటవలనను వెంటనే చదువు మట్టుపడుచున్నయది. పుట్టింటివారును నత్తింటివారును నాగరికులైనయెడలగూడ వీరియాలోచనలును వారియాలోచనలును గలువక విద్యాభివృద్ధికిభంగములు కలుగుచున్నవి.

మఱియు వివాహమైనవెనుకనోములనియు, వ్రతములనియు, శుభకార్యములనియు తరుచుగ నత్తింటికి వెళ్ళివచ్చుచుంటచేతను కాలవిక్షేపము చేయుటచేతను గూడ చదువుసాగదు. వివాహమైయున్న అవకాశము

చూచుకొని యత్తింటివారు గర్భాదానము నిమిత్తము తొందరపడుటయు సంభవించుచున్నది.

రజోదర్శనమువలన వివాహమునకు కాలదోషము (లిమిటేషను) పట్టు ననుశాసనము క్రూరశాసనము. అట్టి చట్టము నీకాలమందు ప్రభుత్వమువారు నూతనముగనేర్పరచిన నెందరుప్రభుత్వమువారితో పోరాడెదరో. నిశ్చితకాలావధి యుండవలయునుగాని అనిశ్చిత కాలావధి యుండగిట్టదు. డాక్టరుమహేంద్రలాల్ సర్కార్ గారు కొంతకాలముక్రింద కొందఱుబాలికల ఋతుకాలముల గూర్చి విచారణచేసిరి. అందులో 8, 9, 10 వ సంవత్సరములలో సమర్తాడిన వారుగూడ పెక్కండ్రుండిరి. 20 సం॥ వఱకునుకూడ ఋతుకాలము రానివారలునుండిరి. మనలోని యాచారమునుబట్టి సమర్తాడకపూర్వము గదా వివాహము జరుగవలయును. అట్లుజరుగని యెడల పిల్లయు తల్లిదండ్రులు మున్నగువారలు పతితులగుచున్నారుకదా. 10, 11 సం॥ దాటువరకుగూడ నిర్భయముగ మనలోకొందరు పిల్లలనుఅనుద్వాహితలుగనుంచుచున్న వాడుకనుచూచి యొకతండ్రి అంతవరకునుకూతునకు వివాహప్రయత్నముసేయడు. ఈలోపుగ పిల్లసమర్తాడును. వానిగతియేమి? ఒకతండ్రితనపిల్ల సమర్తాడకుండుటనుచూచి 20 సం॥ యీడువఱకును పెండ్లిచేయడు. వాడుపతితుడగునా, కాకపోవునా? ఇట్టిసంశయములకాస్పదమగు చట్టము మతిహీను లవలంబింపవలసినదియేగాని, బుద్ధిమంతు లవలంబింపరు.

బాల్యవివాహ సిద్ధాంతమువలన అనురూపదాంపత్యము లేర్పడుట దుస్తరముగనున్నది. పిల్లకునుపిల్లవానికిని బుద్ధివికాసముజెంది ఉత్తరోత్తరమున వారెట్టివారుగ పరిణమింతురో నిర్ణయింప శక్యముగాకముందే వివాహములు జరుగుచున్నవి. ఇందువలన పలుచోటుల దంపతులకు సుఖములేకపోవుచున్నది. వివాహహము మనుష్యుడు చేసికొను నొడంబడికలలో మిగుల ఘనమైనదియు శ్రద్ధాపాత్రమైనదియు నైయున్నది. లాప్రకారముమైనర్లుచేసికొను కంట్రాక్టులుచెల్లవు. గార్డియనులు వారితరఫున చేయువ్యవహారములు మిక్కిలిశ్రద్ధవిశ్వాసములతో చేయవలయును. వివాహవిషయములో మాత్రము ఓగు,బాగులు విచారించుటయందు కోర్టులకధికారములేనందున కొందఱుగార్డియనులు పిల్లలకు తమయిష్టమువచ్చినరీతిని వివాహములు చేయుచున్నారు. పిల్లకు వయసువచ్చిన వెనుక నామెయిష్టమునుకూడ నాలోచించివివాహముచేసిన నెంతశ్లాఘనీయముగనుండును. యావజ్జీవమును కష్టసుఖములకోర్చి భర్తతోకాలముగడుపవలసినది భార్యయగునుగాని తలిదండ్రులు, సంరక్షకులు గారుగదా?

రజోదర్శన కాలదోషము వలన పిల్లతలిదండ్రులు పడుప్రయాసలు మనకనుభవసిద్ధములు. 8. 9. సం॥ ప్రాయము వచ్చువఱకును పిల్లశైశవమందుండుటచేతను, తలిదండ్రులు ప్రేమాతిశయము వదలక యుండుటచేతను, సామాన్యముగ పెండ్లిమాటతలపెట్టరు. అంతటినుంచి నెమ్మదిగ పెండ్లియాలోచనచేయుదురు. ప్రథమమున పెండ్లి వ్యయమునిమిత్తమును, కట్నములనిమిత్తమును ద్రవ్యమును కూర్చుకొనుటకు ప్రయత్నము చేయవలసియుండును. ద్రవ్యవంతుల కీకష్టము లేకపోయినను, నాగరికతజెందియు లక్ష్మీకటాక్షము తక్కువగానుండు మధ్యతరగతికుటుంబములలో నీబాధహెచ్చు. కలక్టరుకచేరీలో 30, 40, రూపాయలు వేతనముగల యొక బి. ఎ. పరీక్షందేరిన యొకయుద్యోగి కొకకుమారితకలదు అనియనుకొనుడు. అతడు పిల్లకు విద్యాబుద్ధులు చెప్పించును. కలిగినదానిలో నుపాయముగ జీవనముచేయుచుండును. పిల్లను చూచుచు చూచుచు నొకమూర్ఖునకిచ్చి వివాహముచేయుటకు మనసొల్లదు. తెలివిగా చదువుకొనుచున్న యొకబాలున కీయనెంచును. అందుకథమము మూడునాలుగువందల రూపాయల కట్నమీయవలయును. 6, 7 వందలరూపాయలు, ఇతరవ్యయములకు కావలయును. గుడిలోపెండ్లి గౌరవహీనము. 5 దినములు పెండ్లిజరుగవలయును. ఇట్టిస్థితిలో కడుపుగట్టుకొని తనకొద్దిజీతములో డబ్బునిలువజేయ నారంభించును. ఇట్లు చేయుచుండగనే పిల్లకు 11 సం॥ నిండును. అప్పుడింటియొద్ద నాడువారి పోరుపడలేక సెలవుతీసికొని బాలుని వెదకబోవును.

ఎక్కడ పిల్ల సమర్తాడునోయను భీతిచేత బాగుగవిచారించకయే తొందరపడి తనశాఖవారిలో నెవనినో ఒక చిన్నవానిని మాటలాడుకొని వచ్చును. పెండ్లికికావలసినద్రవ్యముమాత్రము, ఇంకను సమకూర్చియుండడు. తుదకేదైన పూర్వార్జితపుమాన్యము 4 యకరములభూమియుండిన, దానినివిక్రయించియో, తాకట్టుపెట్టియో డబ్బుతెచ్చి వివాహముచేయును. ఇట్లుతొందరపడి చేసినందున పలుమారులు యోగ్యమైనసంబంధములు కుదురుటలేదు సమర్త ప్రతిబంధములేకున్న నీకీడుబాయునుగదా.

సమర్తాడిన పిమ్మటగూడ వివాహము చేయకయుండినయెడల పిల్లకవశాత్తు దుస్సహవాసమువలన గర్భంబయ్యెనేని దుర్యశములకు హేతువగుటయేగాక వివాహ యోగ్యతయే లేకపోవుననియు, ఈనువచ్చిన పిదప పెండ్లియైన భార్యలుభర్తలను తిరస్కరింతురనియు, కావున, బాల్యవివాహములేమంచివనియు, కొందరువాదింతురు. పిల్ల దుస్సహవాసముచేయనేల? గర్భవతికానేల! మంచినడతబోధించు తలిదండ్రులు, పోషకులు, గురువులేమయ్యెదరు. అట్టివారెవరునులేక, దిక్కుమాలి దురదృష్టవశమున దుర్గతిపాలైన పిల్లవిషయ మాలోచించిన సార్థకమేమి? క్రమమైనకట్టుబాట్లలో నున్నపిల్లలట్లెన్నడును భ్రష్టులుకానేరరు. శూద్రులలో గొప్పశాఖలవారిలో రజస్వలావివాహములులేవా? యూరోపియనులుమొదలగు విదేశీయులలో లేవా? వారందరును చెడిపోయి మనముమాత్రము బాగుగనున్నారమా? కదాచిత్తు ఒకానొకయువతి భ్రష్టయైనను, సామాన్యముగనట్టిముప్పువాటిల్లునని చెప్పనొప్పునా? రైలుబండ్లవలన నొకానొకప్పుడు ప్రాణహాని కలుగుననుటవలన రైలుబండ్లవలదనియనదగునా? వ్యభిచారభయముచే ఆడుపిల్లలకుబాల్యమునందే వివాహమునువిధించిన వారుబాలవితంతువులకు పునర్వివాహమేలవిధింపరైరో! కన్యకును బాలవితంతువునకును చెడిపోవునెడ భేదమేమికలదు? వితంతువును దూరముగనుంచినట్లే కన్యనుగూడ దూరముగనుంచనగునుగదా? కాబట్టి యీవాదములన్నియు భ్రమాజనితములును ఛాందస జనితములును గాని, వేరొండుగాదు. ఈనువచ్చినవెనుక వివాహమైనచో నాలుమగలకు మైత్రితక్కువగ నుండుననుట కీషన్మాత్రమునుసందులేదు. పాశ్చాత్యులపద్ధతులను చూచినవారు కొందరీమాట చెప్పరుగాని వారిపద్ధతులకును, మనపద్ధతులకును కడుభేదమున్నయది. వారిదాంపత్య ధర్మములునుసాంఘికనియమములును వివాహ మర్మములును వేరు. వారిలోనైనను సతీపతివైరములు విపరీతముగనున్నవనుట సరికాదు. వారిలో స్వాతంత్ర్యము హెచ్చగుటచే వెంటనేవెల్లడియైడైవోర్సు (వివాహబంధవిసర్జన) కోర్టులకెక్కుచున్నవి. మనలో నిండ్లలోనే అడగినుడగి పోవుచున్నవి. మూర్ఖురాండ్రై మగలనువేధించెడి గయ్యాళి భార్యలను మనమెందరినెఱుగము? ఇదిగాక ఆచార వ్యవహారముల నత్యంతవైషమ్యముగల పాశ్చాత్యులతో మనమేలపోల్చుకొనవలయును. మనదేశాచారముల జాలవఱకుబోలియుండునట్టియు, విద్యావతులును, నవనాగరికలును అగునట్టియు పారసీస్త్రీలతో నేల సరిచూచుకొనరాదు! వీరియందేమివంకపెట్టగలము? మంచినడత ఆయాస్త్రీల విద్యను, అభ్యాసములను, సహవాసమును, అనుభవమును, నైజమునుబట్టియుండును. గాన, పరిణయకాలము కొంచెము వేగముగగాని, ఆలస్యముగగాని, సందర్భించుటలో లేశమును లేదు.

వివాహమునకును, శోభనమునకును, నడుమ కొంతకాలముజరుగుటవలన దంపతులకు పరస్పరానురాగము మొలకలెత్తుట కెడముగలుగుచున్నదియనికొందఱియభిప్రాయము. అటులైన క్షత్రియులలోను, కులీనశూద్రులలోను, జరుగువివాహములగతియేమి? వారిలో స్త్రీలుభర్తలనువిడనాడిరా? బ్రాహ్మణులలోనైనఅక్కడక్కడ పెండ్లియైనవెంటనే బాలిక, రజస్వల అగుట ఆవెంటనే గర్భాదానమగుటయుజరుగుటలేదా? అట్టి బాలికలు పురుషులద్వేషించిరా? ప్రథమకళత్ర వియోగమై భర్తలు ద్వితీయసంబంధమునకు ఎదిగినపిల్లల నన్వేషి చుచున్నారే తమయందనురాగము కుదురవలయునని చిన్నపిల్లలను పెండ్లియాడక వారట్లేలచేయుచున్నా

బాల్యవివాహాచారమే లేకున్న ద్వితీయ పరిణయమును గోరుపురుషులు రజస్వలలైయెదిగిసిద్ధముగనున్న కన్యలు దొరకిన నెంతసంతసింతురో!

ఇంతకును మనవారు రజస్వలా పరిణయవిషయమై చేయుశంకలు దీర్ఘకాలాగతమైన దురాచారము నొక్కిపెట్టునవిసర్జించలేక, స్వపక్షపాతబుద్ధిచేతను, అభిమానముచేతను, చేయుకుశ్శంకలుగాని,నిజముచేత, ఈడేరినవెనుక పెండ్లిండ్లుచేయుటవలన దేశమునకు, అమితమైనమేలుగాని, కీడులేదు. విధవావివాహముల విషయలోవలె దీనివిషయములో వ్యవహారభాధ లేమియులేవు. వితంతువునకు వివాహముచేయుటలోవలె అక్షతకన్యలకు మాత్రమేచేయవలయునా? సంతాన వంతులకు కూడ చేయవచ్చునా? వయఃపరిమాణమెక్కడ? ఒకపురుషునిపొందినస్త్రీకి ద్వితీయపురుష సంసర్గపాత్రత యుండునా? ఒకసారి భర్తృగోత్రమున ప్రవేశించి దాయార్హురాలై తిరిగిమఱియొకగోత్రము నన్వేషించునా? ప్రథమభర్తవలన బిడ్డలుగలిగియుండిన రెండవభర్త యొద్దికి కాపురమునకు వెళ్ళినవెనుక బిడ్డలపోషణపరామర్శలకు లోపముగలుగదా! పునర్వివాహమునకు పుట్టింటివారా! మొదటిఅత్తింటివారా! యజమానులు. ఇత్యాది సంకోచము లేమియును రజస్వలాప్రథమ వివాహముల విషయమున గలుగపనిలేదు. కేవలము రజోదర్శన మైనదను మాటతప్ప వాడుకగానున్న వివాహములకును వీనికిని తారతమ్య మేమియును లేదు. అట్టిరజో దర్శనమునకు వ్యవహారసంబంధమేమియు లేదు. కావున,విబుధులారా!!

మనదేశప్రకృతస్థితులను జక్కగబరికింపుడు. మనదేశమిప్పు డన్యదేశ సంపర్క సంఘట్టనమందు దగిలియున్నది. పరరాష్ట్రీయులెల్లరును, నిజపదవీ ప్రకర్షనిమిత్తమును, స్వార్థపరంపరాభివృద్ధినిమిత్తమును, సకలవిధముల కృషిచేయుచున్నారు. మనమును అట్లేనిరంతరోద్యోగరతులమై అభివృద్ధిబాధకములైనయాచారములెల్ల విడనాడి, పాటుపడినంగాని నిర్వహింపజాలము. మనోబలమును, దేహపటుత్వమును, క్రియాకౌశలమును, విద్యాప్రాబల్యమును, ధనాధిక్యమును, దేశమునవిస్తరింపవలెనన్న బాల్యవివాహములుమానుడు!మానుడు!మానుడు!!

## శ్రుతిరంజని.

[అక్కిరాజు ఉమాకాంతము పంతులుగారు.]

ఆంధ్రసాహిత్యపరిషత్తుచే మధుర, తంజావూరు, తిరుచినాపల్లి, తిరునల్వేలి మండలములయందలి తెలుగుతాళపత్రగ్రంథములు ప్రోవుచేయఁబడినవి. ఇవి సుమారిప్పటికి నాలుగువందలుగలవు. వీనినిబరిశీలించుచుండఁ జయదేవకవిరచితమైన గీతగోవిందమను సంస్కృతగ్రంథము నాన్వయించెను. ఇయ్యదిసవ్యాఖ్యానముగనుండెను. ఈగ్రంథమును జదువు[..]బత్రములు తిరుగవేసినప్పుడు "శ్రీరంగరాజపుత్ర తిరుమలరాజ విరచి[త]ాయాం గీతగోవింద వ్యాఖ్యాయాం శ్రుతిరంజనీ సమాఖ్యాయాం" అను పఙ్క్తులు కన్పట్టెను. వసుచరిత్ర కృతిపతియైన తిరుమలరాజు శ్రీరం[గ]రాజ పుత్రుఁడని వసుచరిత్రమునందును, రామాభ్యుదయమునందును, [..]దివియుంటినిగావున నతఁడేయితఁడాయని యొకవిధమైన యాసక్తి [..]ించెను. పవిత్రమైనను గష్టతరంబైన తాళపత్రగ్రంథపరిశీలమునందు [..]స్పష్టపూర్వంబులు నప్రసిద్ధంబులు మరలఁమరల వచ్చుచు బోవుచునుండ నేదొయొక యపూర్వవిషయంబు కనఁబడఁబోవుచున్నదని తోఁచిప్పుడు పుట్టునట్టితొందఱ, యాసక్తి, యాందోళనము, ఏమని చెప్పవచ్చును! అశ్రుతపూర్వంబైన జలరాశియందుఁగాని, యజ్ఞాతంబైన దుర్గమ కాంతారంబునందుఁగాని మనుష్యస్వరంబు విన్నను మనుష్యపాదచిహ్నంబు చూచినను నూతనప్రదేశపరిశోధకునిగుండె యెట్టుకొట్టుకొనునో యూహింపనెవ్వరితరంబు! గ్రంథాంతమందలి గద్యమును పూర్తిగఁ జదివితిని. అది

"ఇతిశ్రీ మదఖిలదేవతా సార్వభౌమ రఘునాథప్రసాదలబ్ధసకలసామ్రాజ్య సోమాన్వయాభరణ ధరణీవరాహ శ్రేయగోత్ర పవిత్రశ్రీరంగరాజపుత్ర తిరుమలరాజవిరచితాయాం గీతగోవింద వ్యాఖ్యాయాం శ్రుతిరంజనీ సమాఖ్యాయాం ద్వాదశస్సర్గః"

అని యుండెను. ఇదిచదివినతోడనే పొగచూరినపత్రములు, చిల్లులవ

డినపత్రములు, మలినావృతములైనపత్రములు, చెదలుకొరికినపత్రములు చూచిచూచి పొందినశ్రమను విస్మరించితిని. "నాపతివిద్వాంసుఁడు, సంస్కృతభాషా విశారదుఁడు; గ్రంథకర్త" అనిమనుచరిత్రము సంతుష్టి నిజెందియుండ "నాపతికూడఁ బండితుఁడే. మహావ్యాఖ్యానకర్త; శాస్త్రవేత్త; గీర్వాణ వాఙ్మయపారంగతుఁడు" అని నిజనాథోత్కర్షము నునిండుమనంబున వసుచరిత్ర చెప్పుకొనగలిగిన కాలము ప్రాప్తించెఁగదా యని సంతోషమునొందితిని. వసుచరిత్రలోని తిరుమలరాజు శ్రీరంగరాజపుత్రుఁడు. ఇతఁడును శ్రీరంగరాజపుత్రుఁడే. ఆతిరుమలరాజు సోమాన్వయాభరణుఁడు. ఈతిరుమలరాజును సోమాన్వయాభరణుఁడే. ఇద్దఱు నులబ్ధసకలసామ్రాజ్యులు. అతఁడాత్రేయ గోత్రుఁడు, ఇతఁడునాత్రేయ గోత్రుఁడు. వసుచరిత్రమునందలి

సీ॥ వసుమతీభార ధూర్వహత నెవ్వనియుర్వరా
వరాహాంక మర్థమువహించు"

అను సీసపద్య పాదమువలనఁ దత్తిరుమలరాజునకు "ఉర్వరావరాహ" అనుబిరుదముండినట్లు తేలుచున్నది. శ్రుతిరంజనీ గద్యమునందలి

"సోమాన్వయాభరణ ధరణీవరాహాత్రేయగోత్ర" అనుపత్త్రివలన నీతిరుమలరాజునకును "ధరణీ (ఉర్వరా) వరాహ" అనిబిరుదున్నట్లు తెలియుచున్నది. కావున నాతిరుమలరాజు నీతిరుమలరాజు నొక్కఁడే యని నిశ్చయించుకొంటిని. మఱియు "రఘునాథ వరప్రసాదలబ్ధ" అని శ్రుతిరంజనీ గద్యముననున్నది. "శ్రీరామచంద్ర చరణకమల యుగళాభి వాదనుండును" అనివసుచరిత్రములోని (వెండియుం బ్రచండరుచిపిచండిల' అనుగద్యముననున్నది. తిరుమలరాజునకు శ్రీరాముఁడిష్టదైవమని చెప్పుటలో రెండుగ్రంథములు నేకీభవించుచున్నవి. తిరుమలరాజు తనపెద్ద కుమారునకు "రఘునాథుఁడు" అని పేరుపెట్టుటకూడఁ బైయంశమును బలపఱచుచున్నది. కావునవసుచరిత్ర కృతిపతియైన తిరుమలరాజే శ్రుతి రంజనిని రచించెనని దృఢముగఁ దేలినది. ఎట్టియనుమానమునకు నవకాశము లేదు. ఇంతటితో సంతుష్టిచెందక వ్యాఖ్యాత తనచరిత్రమును గ్రంథ ముఖమున నేమైనఁ జెప్పెనేమోయని చూచితిని. అచ్చట నీక్రిందిశ్లోకములు కనఁబడెను.

శ్లో॥ ఉపదిశతి కార్యజాతం స్వప్నే మహ్యం పితేవ పుత్రాయ
యద్ధామ నీరదాభం సేవే తన్నూభమిపుత్రికా... హృద్యం.
అస్తి సోమాన్వయార్ణవేందు రార్వీటీ బుక్కభూపతిః
యద్దానవారివాహినా నిత్యంపరిణయోంబుధేః
రామరాజస్తతో జజ్ఞే దానక్షాత్రజనీగృహం
గృహీతాస్యే కదాయేన దశదుర్గాణివిద్విషాం
శ్రీరంగరాజ క్షితిపాలమౌళి స్తస్యాత్మజ స్సర్వగుణాభిరామః
యద్వర్తనంభాతి మహీపతీ నామాచారశిక్షా గురుకల్ప మాసీత్
రామోర్వీశ స్తిరుమలనృపో వేంకటాద్రిక్షితీశః
తిమ్మాంబాయాం జగతి జనితా విశ్రుతాస్తేనపుత్రాః
యేషామగ్ర్యం దధతిధరణీ పాలనాదగ్రగణ్యా
వాణీప్రాణేశ్వర గిరిసుతా భర్తృలక్ష్మీపతీనాం
జయతి తిరుమలేంద్ర స్తేషు విఖ్యాతకీర్తిః
నమదరినృపమౌళి స్తోమనీరాజితాంఘ్రిః
సుగుణసుత చతుష్క స్యస్తరాజ్యాతిభారః
కృతబుధవరవిద్యాగోష్ఠీ రత్యూర్జితశ్రీః
లోకాలవాల సౌశీల్యబీజ దానాంబువర్ధితాం
సుగుణప్రసవాయస్య దిక్షుభాతి యశోలతా
యద్బాహునా సముత్క్షిప్త ఖడ్గవల్లీమతల్లికా
శత్రురాజప్రతాపాగ్నేర్మణిర్భవతి బంధుభిః
గేహేయం తిరుమలక్షోణీ పతిర్గూఢార్థ సంగ్రహం
శృణ్వత్ మృదుపదం గీతగోవిందం ధ్వనిమండితం
తస్యార్థదీపికాం టీకాంకరోతి శ్రుతిరంజనీం
లోకోపకారద్వారా శ్రీరామస్య ప్రీతయేప్రభుః
నబుధ్యతే బుద్ధిర్గీతగోవింద స్యార్థగౌరవం
వ్యాఖ్యాన శతకేనాపివిహాయ శ్రుతిరంజనీ
రాగద్వేషవిహీనైరతి పరకైః పరగుణ స్తవన విద్వత్కవి భిరనేకైః
స్తోతవ్యా కృతిరసౌవిమల...సంగీతశబ్దశాస్త్ర విచక్షణైః
విలోకనీయా విద్వద్భిర్వ్యాఖ్యాసౌ శ్రుతిరంజనీ."

దీనిలోని వంశక్రమమునకును వసుచరిత్రలోని వంశక్రమమునకు భేదము లేదు. అయితే శ్రీరంగరాజునకుఁ దిమ్మరాజు, కొండశౌరి అనునగ్రజులు కలరని వసుచరిత్రములోనున్నది. ఈ శ్రుతిరంజనీపీఠికలో వారిపేరులుకానరావు. వారుసుప్రసిద్ధులుకాకపోవుట వలననో బాల్యముననే మృతినొందుటవలననో వారిని శ్రుతిరంజనీపీఠికలో నుదాహరించియుండకపోవచ్చును. వసుచరిత్రములోని

"శా॥ చేతోజాత సమానమూర్తి యగు నాశ్రీరంగధాత్రీధవుం
డాతిమ్మాంబిక యందుఁ గోనవిభుఁదిమ్మాధీశు రామప్రభున్
ధూతాశేష విపత్తు శ్రీ తిరుమలేంద్రు న్వేంకటాఖ్యాన వి
ఖ్యాతుం గాంచె సురద్రుపంచకము నయ్యంభోధి రాజుంబలెన్॥

అనుపద్యమున శ్రీరంగరాజునకుఁ దిమ్మాంబయందుఁ గోనరాజు తిమ్మరాజు, రామరాజు, తిరుమలరాజు, వేంకటరాజు పుట్టిరనియుండ శ్రుతిరంజనీ పీఠికలో "రామోర్వీశ స్తిరుమల నృపో వేంకటాద్రి క్షితీశః తిమ్మాంబాయాం జగతి జనితా విశ్రుతాస్తేనపుత్రాః" అనుశ్లోకమున రామరాజు, తిరుమలరాజు, వేంకటరాజు అను మువ్వురుమాత్రమే పేర్కొనఁబడిరి. ప్రసిద్ధచరిత్రులు కాకపోవుటచేఁ గోనతిమ్మరాజులు శ్రుతి రంజనిలో నుదాహరింపఁబడలేదని సమాధానము చెప్పవచ్చును. వసుచరిత్రలోఁగూడ రామరాజే రాజ్యమును బాలించినట్లున్నదిగాని కోనరాజునుగుఱించి విశేషములేమియుఁ గానరావు. వంశక్రమము తాతపిన్నరాజునొద్దనుండి వసుచరిత్రలోఁ జెప్పఁబడినది. శ్రుతిరంజనిలో బుక్కరాజునొద్దనుండి నుడువఁబడినది. రెండిటిలోనివంశక్రమములకు భేదంబులివియ. తక్కినయంశంబులు సరిగానున్నవి. ఉన్న భేదములైనను ప్రధానములైనవికావు. వసుచరిత్రకృతినందిన తిరుమలదేవరాయలు శ్రుతిరంజనిని రచించెనని నిస్సంశయముగ స్పష్టపడినది.

పీఠికలోని "సుగుణసుత చతుష్కన్యస్తరాజ్యాతిభారః కృత బుధవరవిద్యాగోష్ఠి రతుర్యార్థితశ్రీ" అనుపాదములవలన రాజ్యభారము తననల్వుర పుత్రులయందునుంచి విద్యాగోష్ఠిసల్పుచుఁ బ్రొద్దులుపుచ్చువార్ధకదశయందుఁ దిరుమలరాజీవ్యాఖ్యానమును వ్రాసినట్లు విశదమగుచున్నది. తిరుమలరాజుయొక్క శాసనములు 1572 వఱకును గాన్పించుచున్నవి. తిరుమలరాజు పెనుగొండలో రాజ్యము సేయుచు 1571 వ సంవత్సరములో వ్రాయించినదానశాసనమొకటి చింతగుంటలోనున్నది. ఈచింతగుంటలోని 1573 సంవత్సరపు శాసనమున శ్రీరంగరాయల పేరు కనఁబడుచున్నది. కనుక 1572 వఱకుఁ దిరుమలరాజు స్వయముగా రాజ్యముజేసెనని తెలియుచున్నది. అయితే యీతఁడు 1577 సంవత్సరము తరువాతగూడ జీవించియుండినట్లు తెలుపు నాధారములు కలవు. 1573 వ సంవత్సరము తరువాతఁ దిరుమలరాజు పేరిశాసనమునను గన్పట్టుచుండుటలేదు. 1565 సంవత్సరపుఁ దాళికోట యుద్ధమునందు రామరాజు మృతినొంద నతనియనుజుఁడగు తిరుమలరాజు సదాశివరాయల పేర రాజ్యమేలుచుండెనని చరిత్రలు తెలుపుచున్నవి. తాళికోట యుద్ధానంతరము విజయనగరరాజ్యము క్షీణించిపోవఁ దిరుమలరాజు పునరుద్ధరణమొనర్చి రాజధానిని బెనుగొండలో నేర్పఱచుకొనియెను. ఈయంశమునే వసుచరిత్రలోని

"సీ॥ జీర్ణకర్ణాట లక్ష్మీపునస్సృష్టి నెవ్వాని లోకేశ్వరత్వము పొసంగు"

అను సీసపద్య పాదము ధ్వనిపఱచుచున్నది. 1565వ సం॥రము తరువాత నొక్కసంవత్సరము విజయనగర మరాజకమై యుండినట్లు తెలియుచున్నది. 1567వ సంవత్సరమునఁ దిరుమలరాజు సదాశివరాయలను సింహాసనమున నెక్కించి తాను రాజ్యభారము వహించుచుండెనని శాసనములవలన తెలియుచున్నది. 1568 వ సం॥మున దిరుమలరాజు సదాశివరాయలను జంపి తానే రాజయ్యెనని కొమర్రాజు లక్ష్మణరావుగారు వ్రాసియున్నారుగాని దానికేమి యాధారములు కలవో యచ్చోట వ్రాసినవారు కారు. కర్నూలుజిల్లా గుండాలలో సదాశివరాయల పేరనొక శాసనము 1569వ సం॥మున వ్రాయఁబడియున్నది. ఈశాసనములోఁ దిరుమలరాజు పేరులేదు. సదాశివరాయలు చనిపోయినతరువాతఁ దిరుమలరాజు పెక్కుదినములు రాజ్యముచేయలేదు. 3సంవత్సరములు మాత్రము స్వకీయనామంబుతోఁ బరిపాలించి 1573వ సం॥న శ్రీరంగరాయలను బట్టాభిషిక్తునిఁగఁజేసెను. పట్టాభిషిక్తుడు కాకపూర్వము శ్రీరంగరాజు కొంతకాలము యువరాజుగనుండెనని వసుచరిత్రములోని

"చ॥ హరిపద భక్తిశీలుఁడగు నారఘునాథ నృపాలుమూర్తి సో
దరుఁడు సిరంగరాయ వసుధావరుఁడాత్మగుణ ప్రమోదవ
త్తిరుమలరాయశేఖర వితీర్ణమహో యువరాజ పట్టబం
ధురుఁడయి సర్వభూభువన ధూర్వహశక్తి వహించునెంతయున్."

అను పద్యమువలనఁ దెలియుచున్నది. ఈకాలముననే, అనఁగా శ్రీరంగరాజు సింహాసనస్థుఁడు కాకముందే, 1573 వ సంవత్సరమునకుఁబూర్వముననే రామరాజభూషణుఁడు వసుచరిత్రము, రచించెనని పైపద్యమువలన విశదమగుచున్నది. 1577 వ సం|లో వేంకటపతిరాజు రాజధానిని బెనుగొండనుండి చంద్రగిరికి మార్చెననియు నీవిషయము వసుచరిత్రములో "హారుఁడాతారకశైల దుర్గమున" అను పద్యమునందు శ్లేషింపఁబడుటవలన వసుచరిత్రము 1577 వ సం॥ తరువాత రచింపఁబడెనని రావుబహద్దరు వీరేశలింగముపంతులుగారు కవులచరిత్రలో వ్రాసియున్నారు. కాని 1578 సం॥నకుఁ బూర్వమే వసుచరిత్ర రచింపఁబడినదని మనమెంచవలసియున్నది. 1577 వ సం॥లో రాజధాని చంద్రగిరికి మార్పఁబడెనుగదా. ఆవిషయమును సూచించిన వసుచరిత్ర 1578 సం॥నకుఁ బూర్వమెట్లు వ్రాయఁబడెను? అని శంకింతురేనివినుఁడు. 1577 వ సం॥లో రాజధాని పెనుగొండనుండి చంద్రగిరికి మార్చఁబడినదని నిశ్చయించుట కాధారములు వీరేశలింగంపంతులుగారు చూపియుండలేదు. 1584 సం॥ వఱకు శ్రీరంగనాయకులు పెనుగొండలో రాజ్యము చేయుచుండినట్లు శాసనము లనేకములుగలవు. ఉత్తరార్కాడుజిల్లా దిగువ తిరుపతిలోను, కర్నూలుజిల్లా చింతగుంటలోను శ్రీరంగరాయలు పెనుగొండయందు రాజ్యముచేయుచుండెనని శాసనములు లిఖింపఁబడియున్నవి. కావున 1577 వ సం॥లో రాజధాని పెనుగొండనుండి యెత్తివేయఁబడినదని యూహించుట పొరపాటని చెప్పవచ్చును. అందుచే భట్టు వసుచరిత్రము 1577 వ సం॥ము తరువాత రచించెననియూహించుటకూడఁ బొరపాటేయని స్పష్టమగుచున్నది. అయితే భట్టుమూర్తి "హారుఁడాతారక" యను పద్యములో వేంకటపతి చంద్రగిరియందు రాజ్యముచేయుచుండెనని చెప్పెనే! దానిగతి యేమి? అని ప్రశ్నింతురేని నాలకింపుఁడు. తిరుమలరాజు సింహాసనస్థుఁడైయుండఁగా వసుచరిత్ర రచించిన భట్టుమూర్తి తిరుమలరాజునుదాఁటి శ్రీరంగరాజు నతిక్రమించి వేంకటపతి రాజ్యపాలనమునెట్లు కనుఁగొనెను? భట్టుమూర్తి నేత్రాంజనము వేసికొని రాఁబోవుకాలమును జూచెనా? యని మనకాశ్చర్యము కలుగకమానదు. కొంచెమాలోచించినచో నీయాశ్చర్యములు సనుమానములు విరిసిపోఁగలవు. "హారుఁడాతారక" యను పద్యమునుబట్టి వేంకటపతి చంద్రగిరిలోఁ బట్టాభిషిక్తుఁడైయుండెనని యర్థముచేసికొనఁగూడదు. తిరుమలరాజు పెనుగొండలో సింహాసనారూఢుఁడై యుండ నతని యాజ్ఞకులోఁబడి వేంకటపతి చంద్రగిరిలోఁ బరిపాలకుఁడుగనుండి యుండును. శ్రీరంగరాజుయొక్క మరణానంతరము వేంకటపతి పెనుగొండలోఁ బట్టాభిషిక్తుఁడాయెను. దీనికి నిదర్శనముగా 1585 వ సం॥ నుండి వేంకటపతి పెనుగొండలో రాజ్యముచేయుచుండినట్లు కర్నూలుజిల్లాలోని యహోబిలము, చావరదిన్నె గ్రామములలోను దిగువతిరుపతిలోను శాసనములుగలవు. ఈతఁడు 1592 వ సం॥నందు మాత్రము పెనుగొండనుండి రాజధానిని జంద్రగిరికి మార్చెనని సూయల్ దొరగారు వ్రాసియున్నారు. శాసనములవలన నట్లే తెలియుచున్నది. పైకారణ పరంపరవలన భట్టుమూర్తి "హారుఁడాతారక" యను పద్యములో వేంకటపతి చంద్రగిరిలోఁ బరిపాలించుచుండెనని చెప్పినమాట తిరుమలరాయలకుఁ బ్రతినిధిగఁ జంద్రగిరిలో నుండెనని తెలియఁజేయునుగాని 1592 వ సం॥లోఁ జంద్రగిరికి

మార్చిన యంశమును దెలియఁజేయునది కాదని యెఱుంగ వలయును. కనుక శ్రీరంగరాయలు రాజ్యాభిషిక్తుఁడు కాకపూర్వము, అనఁగా 1578 వ సం॥నకు ముందే వసుచరిత్రము రచింపఁబడెనని స్పష్టముగఁ జెప్ప వచ్చును. వసుచరిత్రము రచించునాఁటికి శ్రీరంగరాజు యువరాజుగా నుండెనని "హరిపదభక్తి" అను పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది. పెద్దకుమారుఁడు రఘునాథుఁడై యుండ రెండవకొడుకైన శ్రీరంగరాజేల యువరాజయ్యెనో భట్టుసూచించినవాఁడుకాఁడు. "హరిపదభక్తిశీలుఁడు" అను విశేషణమువలన రఘునాథుఁడు హరిపదములఁ జేరెను (మృతినొందెను) అని యర్థము చేసికొనవలయునేమో. చచ్చెననిచెప్పుట కావ్యమున నమంగళకరమని యూహించి యిట్లు నుడివియుండ వచ్చును. ఈరఘునాథుఁడు పెక్కు యుద్ధములు చేసెనని వసుచరిత్రమున వ్రాయఁబడియున్నది. కృష్ణానదియొడ్డున మహాఘోర యుద్ధము జరిగెనని వసుచరిత్రములోని

"యాదోరాశిగభీరుఁడైన రఘునాథాధీశుఁడుద్దండబా
హాదర్పాంధ సపాదమల్కికనిజామానీకముల్ గ్రుంపఁజ
న్యాదూరక్షితిఁ బాఱు కృష్ణకును గృష్ణాంకంబునాఁడబ్బెబి
బ్బీదీవ్యన్నయనాబ్జకజ్జలజలాభీల ప్రవాహంబులన్."

అను పద్యమువలనఁ దెలియుచున్నది. ఇట్టి యుద్ధములలో దేనిలోనో రఘునాథుఁడు ప్రాణములఁ గోల్పోవ శ్రీరంగరాజు యువరాజపట్టబంధురుఁడై యుండును. అయితే శ్రుతిరంజనిమాత్రము రఘునాథుఁడు మృతినొందక పూర్వమే రచింపఁబడెనని తత్పీఠికలోని "సుగుణసుత చతుష్కన్యస్తరాజ్యాతిభారః" అను పఙ్త్కులవలన స్పష్టపడుచున్నది. తిరుమలరాజునకు రఘునాథుఁడు, శ్రీరంగరాజు, రామరాజు, వేంకటపతి యని పుత్రులునల్వురు. శ్రుతిరంజనిని రచించునాఁటికి రఘునాథుఁడు మృతినొందినచో "సుగుణసుతత్రయన్యస్తరాజ్యాతిభారః" అని చెప్పియుండును. అట్లుకాక "చతుష్క" అని యుండుటవలన నల్వురు కొడుకులు చెక్కుచెదరకయున్న శుభదినములలోఁ దిరుమలరాయలు శ్రుతిరంజనిని రచించెనని నిశ్చయింపవచ్చును. వసుచరిత్రమునకంటె ముందే 1569, 70, 71 సంవత్సర ప్రాంతమున శ్రుతిరంజని వ్రాయఁబడినదని యొక రీతిగ సిద్ధాంతము చేయవచ్చును. రాజ్యభారము సుత చతుష్టయముపైనుంచి విద్వద్గోష్ఠిసల్పుచుఁ దీనిని దిరుమలరాజు రచించెనని పీఠికలోనున్నది. ఈకాలమునాఁటికిఁ దిరుమలరాజేండ్లుగడచినవాఁడై యుండును. తాళికోటయుద్ధమునందు నిజబంధువులసంఖ్యాకముగ మృతినొందుట, యత్యుచ్ఛదశయందుండిన నరపతి సామ్రాజ్యము భగ్నమగుట, బహుకాల ప్రవర్ధిత విజయనగర పట్టణంబు క్షణకాలంబునఁ గలిన మహమ్మదీయ హస్తవిధ్వస్తమగుట, తిరుమలరాజునకుఁ బ్రాపంచిక వైభవములందు విరక్తినిఁ గలుగఁజేసియే యుండును. రాష్ట్రవర్ధనములను దిలకించిన నేత్రములు తద్వినాశములను జూచినప్పుడును, సకలవిభవాస్పద సింహపీఠికాసీనులైన ప్రియజనంబుల సేవించిన హస్తములు తదస్థికల స్పృశింపవలసివచ్చినప్పుడును, "అహో! వివిధాకృతుల వహించియుండు నీప్రకృతివికారంబులెంత యశాశ్వతములు" అని మనస్సునకు విరాగభావము పుట్టుననబ్రమేమి!

శ్రుతిరంజని మిక్కిలి విపులమైన వ్యాఖ్యానము. పూర్వ పద్ధతులప్రకారము చూచినచో నీవ్యాఖ్యానము కడు శ్లాఘాపాత్రముగ నున్నది. జయదేవకవి విరచితమైన యాగీతగోవిందమునకే జగద్ధరుఁడు సారదీపిక యను నొక వ్యాఖ్యరచించెను. వ్యాఖ్యానసంగ్రహమని మఱియొక వ్యాఖ్యానముకలదు. ఈరెండిటికంటెను శ్రుతిరంజనియే ప్రౌఢతరముగానున్నది. పీఠికలో

"నబుధ్యతే బుద్ధిగీతగోవిందస్యార్థ గౌరవం
వ్యాఖ్యానశతకే నాపి విహాయశ్రుతిరంజనీం"

(శ్రుతిరంజనిని విడిచి నూఱు వ్యాఖ్యానములచేనైనను, గీతగోవిందముయొక్క, అర్థగౌరవము విద్వాంసులచే, నెఱుంగఁబడదు) అని యీశ్రుతిరంజని ప్రశంసింపఁబడినది. తమ పుస్తకమును దాము పొగడుకొనుట సాధారణమే యైనప్పటికి నీపొగడిక యట్లుకాక సత్యము ననుసరించియే యున్నది. దీనింజదువఁ జదువ నాకనుమానము లంకురింపఁజొచ్చెను. రచయితయొక్క సాహిత్యమునకు దర్పణంబనఁ దగిన యీశ్రుతిరంజనిని వ్రాసిన యాతఁడు తిరుమలరాజేయగునా యను సందేహము నిమిషనిమిషమునకు హెచ్చెను. వ్యాఖ్యానమునుబట్టి చూడవ్యాఖ్యాతసాహిత్యధురీణుఁడు, వైయ్యాకరణుఁడు, ఆలంకారికుఁడు, సంగీతవిద్యాపారంగతుఁడుగాఁ గన్పట్టుచున్నాఁడు. తిరుమలరాజింత పెద్దపండితుఁడాయను సంశయము రానురాను తాయివలె గట్టిపడెను. తిరుమలరాజు పండితుఁడని భట్టుమూర్తి వసుచరిత్రములో నెక్కడను జెప్పినవాఁడుకాఁడు. రామాభ్యుదయములో రామభద్రుఁడైన నీవిషయమును నుడివియుండలేదు. కృష్ణరాయలయొక్క సామర్థ్యాతిశయములనల్లసాని పెద్దనయుఁ దిరుమలరాజుయొక్క శక్తివిశేషములను భట్టుమూర్తియు స్తుతింపక విడువఁగలరని మన మనుకొన జాలము. శౌర్యధైర్యాదులు రాజులకు సామాన్యలక్షణములు. పాండిత్యము విశేషలక్షణము. స్తుతిపాఠకులు విశేషలక్షణముల నధికముగఁ గొనియాడుట సహజము. తిరుమలరాజు గొప్పవిద్వాంసుఁడైయుండినచో భట్టుమూర్తి చెప్పక మానునా? వసుచరిత్ర షష్ఠాశ్వాసాంత పద్యములోమాత్రము

"సారసాహితీ సదధ్వచారి భూరిధీరసా"

(శ్రేష్ఠమైన సాహిత్యమనెడు మంచిమార్గమునందు సంచరించు బుద్ధియొక్క గుణముకలవాఁడా!)

యని తిరుమలరాజును భట్టు సంబోధించియున్నాఁడు. మఱియు దామ్రశిలాశాసనములను బరిశీలింపగా 1559 వ సంవత్సరములో సదాశివరాయలు రాజుకొండపల్లి లక్ష్మణభట్టునకు వద్దిరాల గ్రామము (రామానుజపురము) నిచ్చిన తామ్రశాసనమందుఁ దిరుమల రాజాదుల ప్రశంస కొంత కన్పట్టినది. దానిలో

"భరతమహిత భూమాభాతి యస్యాను జన్మా
వర తిరుమలరాజః సాహితీ భోజరాజః"

అని రామరాజును వర్ణించుసందర్భమునఁ దిరుమలరాజునుగూర్చి చెప్పఁబడినది.

పై నుదాహరింపఁబడిన "సారసాహితీ సదర్థ్వచారి భూరిధీరసా" యను పద్యపాదమును, శాసనములోని "సాహితీ భోజరాజః" అను విశేషణమును దిరుమలరాజు విద్వాంసుఁడనియే నిరూపించుచున్నవి. అయితే యింతమాత్రముచేతనే తిరుమలరాజు శ్రుతిరంజనీ రచనసేయఁ గలిగినంత పెద్ద విద్వాంసుఁడాయని విచారింపవలసియున్నవి. "సారసాహితీసదర్థ్వ" యను పద్యము శబ్దాలంకార భూయిష్ఠమైనది. అలంకారముకొరకు "సారసాహితీ" "భూరిధీరసా" అనుపదముల నుపయోగించెనేమోయని యనుమానము పొడముచున్నది. ఒకవేళ నీసంబోధనము వాస్తవమైనదే యైనను దిరుమలరాజునకు మహావిద్వత్తకలదని నిరూపింపదు. వసుచరిత్రమువంటి కృతులనంది, భట్టుమూర్తివంటి విద్వాంసుల నాదరించి విబుధగోష్ఠియం దాసక్తికలిగియుండిన తిరుమలరాజువంటి రాజు సాధారణ సాహిత్యమైన నలవఱచికొని రసజ్ఞుఁడై యుండి యుండుననుటకు సందియ మావంతయైనను లేదు. కనుకనే పై సంబోధనమును, "సాహితీభోజరాజః" అను విశేషణమును దిరుమలరాజునుగూర్చి చెప్పియుందురు. లేనిపోని యుత్ప్రేక్షల నాలోచించుటలోఁ దిరుమలరాయని పాండిత్యమును మఱచి, వసుచరిత్రము పూర్తియైన తరువాత జ్ఞప్తికిరాఁగాఁ బశ్చాత్తాపమునొంది చిట్టచివర పద్యములో "సారసాహితీ సదర్థ్వచారి భూరిధీరసా" యని భట్టుమూర్తి చెప్పెనని యూహింతమనుకొనుఁడు. అయ్యలరాజు రామభద్రునకుఁ గూడ మతిపోయెనా? అతఁడైన రామాభ్యుదయములోఁ దిరుమలరాజును వర్ణించునప్పుడేల యతని యద్భుతపాండిత్యమును దెలియఁజేసి యుండఁడు? శ్రుతిరంజని వసుచరిత్రకంటెఁ బూర్వమే రచియింపఁబడెనని యిదివఱకు సిద్ధాంతము సల్పియుంటిమి. వసుచరిత్రలో నీ శ్రుతిరంజనిని భట్టుమూర్తి మెచ్చుటను దడవినవాఁడుకాఁడు. అయ్యలరాజు రామభద్రుఁడైన నుదాహరింపలేదు. జాంబూనదాభరణాగ్రహారంబులు పొంది గుణములు గోరంతలు కొండంతలుచేసి యెవ్విధముచేనైన స్తుతించి మెప్పవడయ నడుముకట్టుకొనిన భట్టే తిరుమలరాజుయొక్క పాండిత్యాతిశయమునుగాని శ్రుతిరంజనినిగాని ప్రశంసింపకపోవుట, తిరుమలరాజు శ్రుతిరంజనీకర్త కాఁడనియు, శ్రుతిరంజనీ రచయిత యుండవలసిన సాహిత్యాతిశయముగాని శాస్త్రజ్ఞానముగాని కలవాఁడు కాఁడనియుఁ దెలుపునని నిస్సంశయముగఁ జెప్పవచ్చును. ఇబ్భంగి నిశ్చయించుకొని వ్యాఖ్యానమును జదువుచుండ నొక్కచో

"ఉదాత్తాది స్వరూపంతు అస్మత్కృత ప్రసన్నరాఘవ
వ్యాఖ్యానే నిపుణముపపాదితం తత్రద్రష్టవ్యం"

అను పఙ్క్తులు కన్పట్టెను. దీనినిబట్టి శ్రుతిరంజనీకర్త ప్రసన్న రాఘవ నాటకమునకుఁగూడ వ్యాఖ్యానము రచించెనని విశదమగుచున్నది. శ్రుతిరంజనీ రచయిత తిరుమలరాజేయైనచోఁ బ్రసన్నరాఘవ వ్యాఖ్యాతకూడ నతఁడేకావలయును. రెండు గొప్ప వ్యాఖ్యానములు తిరుమలరాజు వ్రాసియుండినయెడల భట్టుమూర్తిగాని, రామభద్రుఁడుగాని ప్రశంసింపక మానుదురనుట యసంభవము. ప్రసన్నరాఘవ వ్యాఖ్యాన మిప్పుడెచ్చటను గానరాకయున్నది. సవ్యాఖ్యానమైన ప్రసన్నరాఘవమే, వ్రాఁతప్రతిగాని, ముద్రితప్రతిగాని, కానవచ్చుటలేదు. ఇయ్యది దొరకినచో సందియములు చాలమట్టునకుఁ దీరును. శ్రుతిరంజని మాత్రము గవర్నమెంటు పుస్తకభాండాగారములో నొక యసంపూర్ణప్రతిగలదు. ఆంధ్రసాహిత్య పరిషత్తులోని ప్రతి సమగ్రముగనేయున్నది. ప్రసన్నరాఘవ వ్యాఖ్యానమునువ్రాసిన పండితుఁడే శ్రుతిరంజనిని రచించి తిరుమలరాజు పేరుపెట్టెనని యొకరీతిగ మనకుఁదెలిసినది. ప్రసన్నరాఘవ వ్యాఖ్యానముకూడఁ దిరుమలరాజుపేర నున్నయెడల మన సిద్ధాంతములకుఁ గొంతవఱకు బలముతగ్గినను సమకాలికులును స్తోత్రముచేయ నడుముకట్టినవారునగు భట్టుమూర్త్యాదులేల ప్రశంసింపకుందురాయను సందియముమాత్రము బాధించుచునే యుండును.

పీఠికలోని "జయతి తిరుమలేంద్రస్తేషు విఖ్యాతకీర్తిః"

అను శ్లోకమును పీఠికనురచించిన యాతఁడు తిరుమలేంద్రుఁడు కాడని చెప్పుచున్నది. మొత్తముమీఁదఁ టీకయొక్క ధోరణిచూడఁ దత్కర్త తిరుమలరాజు కాఁడనియే తోఁచును. వ్యాఖ్యాత తిరుమలరాజు కాఁడనుమాట వాస్తవమేయైనచో నతనిపేరపెట్టిరచించిన పండితుఁడెవ్వఁడో యమాయికుఁడును ఛాందసుఁడునైయుండినట్లు కన్పట్టుచున్నది. చేసినపనిని టీక కప్పిపుచ్చునదిగాలేదు. మధ్యమధ్యమున దాను మొదటవ్రాసిన యస్మచ్ఛబ్దములను దీసివేయలేను. గ్రంథములు వ్రాయించి తమ పేరుపెట్టుకొను దురభ్యాసము పూర్వరాజులయందే కాక యిప్పటికిని గొందఱు రాజులయందును ధనికులందు నధికారాతిశయముగలవారియందును నిలిచియున్నది. శ్రీకృష్ణదేవరాయ లాముక్తమాల్యదను, వేమభూపాలుఁ డమరుక వ్యాఖ్యానమును, గాటయవేమన మాళవికాగ్నిమిత్ర వ్యాఖ్యానమును రచించిరనుట యెంతవఱకు సత్యమో యింకను విచారింపవలసియున్నది.



Rajah of Mandasa. మండాస రాజా గారు.



Kumara Rajah of Mandasa. మండాస కుమారరాజాగారు..



Rajah of Chikati. చీకటి రాజాగారు.



Minor Zamindar of Kallikota కల్లికోట మైనరుజమీదారుగారు



Blocks by Messrs R. Venkaih Bros Madras.



The Most Rev. Bishop Azariah. బిషప్ అజరయ్యగారు.



Mr. Henry Polak. హెన్రీ పోలక్ గారు.



Mr. Leadbeater. లెడ్ బీటరుగారు.



Mr. J. Krishnamoorty. జిదు క్రిష్ణమూర్తిగారు.

Blocks by Messrs D. B. Neroy & Co.



The Late Rao Bahadur R. Venkaiah.

కీ॥ శేషులైన రావుబహదూర్ ఆర్. వెంకయ్యగారు.



The Late Mr. C. Sesha Rao Naidu.

కీ॥ శేషులైన సి. శేషరావునాయుడుగారు.



The Late Mr. K. Venkatapati Rao.

కీ॥ శేషులైన కావలి వెంకటపతిరావు గారు.



The Late Mr. Chevendra Venkatachalam.

కీ॥ శేషులైన చేవేంద్ర వెంకటాచలం పంతులుగారు.

Blocks by Messrs D. B. Neroy & Co.

# ఆంధ్రభాషాసంస్కారిణీసభ.

[నంబూరి తిరునారాయణస్వామిపంతులుగారు బి. ఏ.]

(కార్యదర్శి వెంకయ్య ప్రవేశించుచున్నాడు.)

వెంకయ్య:—ఈయతిప్రాసలు నాప్రాణాలు తీస్తున్నవి. వీటిప్రయోజనము కనుపించదు. అవి వదలివేసి వ్రాయమంటే రోజుకొక నూరుపద్యాలు వ్రాయగలను. వీటిమూలాన నాకు నాటకరచన సాగకుండా ఉన్నది. అదుగో భాస్కరరావు వస్తున్నాడు.

(భాస్కరరావు ప్రవేశించుచున్నాడు.)

భాస్కరరావు:—ఏమండోయ్, వెంకయ్యగారు? ఈరోజున మన తెలుగుభాషకు సంస్కారము జరుగుతుంది కాబోలు. ఎవరెవరే వంకలు తీర్ప దలచుకొన్నారు?

వెంకయ్య:—భాస్కరరావు, నీవు వేళాకోళంమనిషివై పోతున్నావు. నీవుగ్రంథరచనకు పూనుకోలేదుగనుక నీకు తెలియకుండా ఉన్నది.

భాస్కరరావు:—గ్రంథరచనకు నేనున్ను మొదలుపెట్టినాను తిరిగి విడిచిపెట్టినాను.

వెంకయ్య:—నీపుణ్యము తిరిగీ ప్రారంభంచేతూ? బ్రదికిపోతాము. ఎందుచేత విడిచిపెట్టావు? ఈదిక్కుమాలిన యతిప్రాసలచేత నేనా?

భాస్కరరావు:—అది యెందుకులే? ఒకసారినాకున్ను నీకుదోచినట్టే తోచింది. ఈగణాలు యతిప్రాసలు లేకుంటే చాలా రసవంతంగా ఇంగ్లీషుకావ్యముల ఫక్కిని కావ్యము వ్రాయవలెనని, తమాషాకు ఒక్కనాడు షేక్స్పియర్ను హాంలెట్టులోనుంచి కొంత తర్జుమాచేయడానికి మొదలుపెట్టాను. గణాలు యతిప్రాసలు తప్పుతూ వచ్చినవి. అంతట వీనిని నాయిష్టమువచ్చినట్టు వేసుకుంటూ వ్రాసినాను. ఆతరువాత కొంతసేపటికి నాదగ్గిరశబ్దజాలములేక తెలుగులో పెట్టలేకపోయినాను. ఇంతలోకే వెంకటశాస్త్రిలుగారు వచ్చారు. వారికి ఇంగ్లీషులోనున్నదాని అర్థమంతా చెప్పినాను. ఆయనగారొక్క పావుగంటలో యతిప్రాసలు గణములు తప్పకుండా పద్యమువ్రాసియిచ్చినారు. అప్పుడునాకు తెలిసినది. శబ్దజాలము లేనిదోషముచేత నాకు సాగిందికాదన్నసంగతి. చదువుతక్కువ అయినవారికే యివిన్ని ప్రతిబంధకములుగానుండునుగాని కవితాధోరణి కలిగిచక్కగా జదువుకొన్న వారికివి అడ్డగింపవు.

వెంకయ్య:—చాల్లేవోయి, నీగర్వము, నీవుచదువుకొన్నవాడవు నేను చదువులేనివాడనని నీతాత్పర్యము.

భాస్కరరావు:—నీవు కోపములేకుండా మాటలాడితే నేను నిష్కపటముగా చెప్పుతాను. నీకు గవిత్వధోరణి అయినా తక్కువ అయియుండవలెను లేదా నీకు శబ్దజాలము తగినంత లేకుండానైనా యుండవలెను!

వెంకయ్య:—నాకు రెండూ తక్కువలేవు. యతిప్రాసలులేకుండా నేనువ్రాసిన పద్యాలు చూపించుతానుచూడు. ఎంతరసవంతముగానున్నవో. నాకోసంచెప్పడంలేదు.

భాస్కరరావు:—రసవంతంగా వ్రాసినట్టయితే నీగ్రంథము తప్పకుండా మెచ్చుకుంటారు. త్వరగాపూర్తిచేయరాదా మఱి అదియెదుటపెట్టి తర్వాతపోట్లాడవచ్చును.

(చలమయ్య ప్రవేశించుచున్నాడు.)

భాస్కరరావు:—వెంకయ్య, మనచలమయ్యగారువస్తున్నారు. వారికి యీగణాలు యతులు ప్రాసలు లెక్కలేదు.

చలమయ్య:—ఏమిటిబాబు. ఛందోనియమములు బాధించునా. కవిత్వము చెప్పగలవారికి నేను నిన్నటిదిన మొకక్రొత్తపద్యము వ్రాసినాను.

భాస్కరరావు:—ఏలాగో శలవియ్యండి. ఇదివరకున్న పద్యములలో దేనిని మార్చి వ్రాసి యేమిచేశారో.

వెంకయ్య:—ఉన్నపద్యమును మార్చడమెందుకు ప్రస్తరించి క్రొత్తపద్యమును వ్రాసియుందురు.

చలమయ్య:—ఆటవెలది మెఱుగుదురా?

వెంకయ్య:—మెల్లగా. తానొక్కడే కవీశ్వరుడనని యీయనగర్వం.

భాస్కరరావు:—ఆటవెలదికి నేమిచేసినారు? దానికి గొత్తసింగారమేదో చేయించారు, కావలెను.

చలమయ్య:-ఆటవెలదికిముందరనొక భగణముపెట్టినాను. అతిమనోహరమైనది. మోహిని అని పేరుపెట్టినాను.

భాస్కరరావు:—బలేబలే.ఇక దానినివదలకండి. ఇంకా దానికి కొత్తసింగారాలుచేసి భువనమోహినిగాచేయండి.

వెంకయ్య:—చలమయ్యగారూ. మీరునాతో ఒక్కవిషయములో నేకీభవిస్తున్నారు. ఇదివరకు ఆయావృత్తములకు నిరూపించబడియున్న గణములను మార్చుటగాని వానికిగొన్నిటిని చేర్చుటగానిచేసి శ్రావ్యమైనపద్యములు వ్రాయవచ్చునని, మఱి యతిప్రాసలుండవలె నంటారా?

చలమయ్య:- యతిప్రాసలులేకుంటే పద్యమెందు కౌతుందయ్య యతిప్రాసలులేకుండా వ్రాయవలెనంటే వచనకావ్యాలు వ్రాసుకోరాదా యేమిటి?

వెంకయ్యగారూ. మనగోపాలంగారు వచ్చినారు.

భాస్కరరావు. వెంకయ్యగారు ఎదురుగాబోయి తీసుకొనివచ్చుచున్నారు.

గోపాలం:—ఆకూర్చునవారెవరు?

వెంకయ్య:—చలమయ్యగారు. ఆయనగారు కొత్తవృత్తమొకటి మరల కల్పించినారట.

గోపాలం:—ఏమిటది.

భాస్కరరావు:—ఆటవెలదికి ముందో వెనకో కొంతచేర్చినారట. మోహనవృత్తమనదట.

గోపాలం:—కొంతచేర్చితే యేమైనట్టు. అటుయిటు ఆవెండిబంగారము కమ్మరించక పోయినారూ. అతిమోహనవృత్తమవుతుంది. దిక్కుమాలిన గొడవ. అబ్బబ్బా వీండ్లందరు ప్రజలను చంపేస్తున్నారు. దిక్కుమాలిన భాషపెట్టి, మనకు రానిభాషలో పుస్తకాలెందుకయ్యా! వాడుకకు భాషవకటి. పుస్తకాలకొకటా. మాట్లాడినట్టే ఉండాలె పుస్తకాలుకూడా?

భాస్కరరావు:—గ్రామ్యమువాడమంటారాయేమిటి?

గోపాలం:—వాడమంటారాయేమిటి? అందులోనే వ్రాయవలసినది. అదేఉపయోగము ప్రజలకు అర్థంకావలెనా? చాటుమాటు మాటలతోవ్రాస్తే యెవరికి తెలుస్తుంది.

వెంకయ్య:—గ్రామ్యభాషలో మనకు గ్రంథములెందుకండి. గ్రామ్యభాషలో నుపన్యాసములు చేతాము. అంతమట్టుకుచాలును.

గోపాలం:—ఉపన్యాసాలు గ్రామ్యములోనా, గ్రంథాలు వేరేభాషలోనా, నేను చెప్పుతున్నాను వినండి దేశము బాగుపడవలెనంటే మనము, గ్రామ్యభాషనే సర్వత్ర యుపయోగించవలెను.

(నాగభూషణం ప్రవేశించుచున్నాడు.)

నాగభూషణం:—నమస్కారమండోయ్, గోపాలంగారు.

గోపాలంగారు:—ఏమిటయ్యోయ్, నీసమాసాలతో మమ్మును చంపివేస్తున్నావే.

నాగభూషణం:—ఏమండోయ్, అలాఅంటారు. నాపుస్తకానికే అలాఅంటే తక్కినవారు వ్రాసేవాటి కేమంటారు? పద్యముఅంతా ఒక్కటేసమాసంగాను పాదమంతా ఒక్కసమాసంగాను వ్రాసేవారున్నారే. నాదానిలో అట్లులేదు. ఏపద్యములోను దీర్ఘసమాసములు నేను వెయ్యలేదే?

(సోమసుందరం ప్రవేశించుచున్నాడు.)

సో:—ఏమండోయ్ నాగభూషణంగారు, మీరెక్కడనూ దీర్ఘసమాసాలు వేయలేదనిన్ని పద్యమంతా సమాసంగా వ్రాసేవారు పాదమంతా సమాసంగ వ్రాసేవారు తేరా అంటున్నారు? అవును నాపద్యాలుకొన్ని అలాగేఉన్నయికాని, మీరు వచనమంతా సమాసములతో నింపివేసినారెందుకండీ, మూడేసిమూరల సమాసములెందుకండీ వచనములలో. మీరు పద్యాలలో దీర్ఘసమాసములు వెయ్యనికారణమునాకు దెలునునుఅంటే నేను గర్వపోతునంటారు. మీకు పద్యాలలో దీర్ఘసమాసములు పెట్టుటకు యతిప్రాసలు బాధకంగాతోచి మానివేసినారు. మీరు చేసినపని మీకు మంచిదా? ఇతరులు చేసినపని తప్పా.

వెంకయ్య:—అదుగో నేనుచెప్పలేదండీమరి. ఈ యతి ప్రాసలేనండి, చాలా బాధకమైనవి అవితీసివేయవలెనండి.

భాస్కరరావు:-ఈగొడవంతాయేమిటండి, పద్యకావ్యములే పనికిరావని గ్రామ్యభాషలోనే వ్రాయవలయునని క్రొత్తసిద్ధాంతములువచ్చుచుండగా మీయీసమాసముల ప్రయోగములను గురించి తగాయిదా యెందుకు?

నాగభూషణం:—వీరు గ్రామ్యములో వ్రాయమనగానే యెవరు వ్రాస్తారయ్యా.

సో:—వారే వ్రాసుకోవలెనుగాని మరెవ్వరూ వ్రాయరు.

వెంకయ్య:—అయితే మీరిద్దరూ వ్రాయకుంటె మరి వ్రాసేవారు లేరా యేమిటండి.

భాస్కరరావు:—ఇప్పుడు గ్రంథములు వ్రాసేవారికేమి కరువు. ఎవరి చిత్తమువచ్చినట్టువారు వ్రాయడం యెప్పుడేర్పడ్డదో అప్పుడే వ్రాతవ్రాసేవారేర్పడ్డారు. మంచి చెడ్డలెవరికికావలెను.

నాగభూషణం:—మంచి చెడ్డలు చూడకుండానే ప్రజలు కొనుక్కుంటారండీ, పుస్తకంబాగుంటే విరివిగాఖర్చు అవుతుంది. అదేగుర్తు.

భాస్కరరావు:-ఆమాటకేమిలెండి. పామరరంజకమైనవి ఉన్నయి పండితరంజకమైనవి ఉన్నయి. పామరరంజకమైనవి విశేషంగా ఖర్చుపడుతాయి. పామరరంజకముగా భాషఉన్నా పర్వాలేదు. గాని గొందరు భావములనే పామరరంజకముగా వుపయోగించుచున్నారు. ఇంతలో

(యోసేపుగారు ప్రవేశించుచున్నారు.)

భాస్కరరావు, వెంకయ్యగార్లు ఎదురుగాఁబోయివెంటబెట్టుకొని వచ్చుచున్నారు. అంతట నచ్చటనున్నవారందరు వారిని గౌరవించి యుపవిష్టులను జేయుచున్నారు. ఆయోసేపుగారందరితోను ముచ్చటించుచున్నారు. ఒకరు యతిప్రాసల ప్రతిబంధమునుగురించి, యొకరు ఛందస్సువిపులము చేయుటనుగురించి, యొకరు గ్రామ్యభాషను గ్రంథములలోఁ బ్రయోగించుటనుగురించి యొకరు వచనకావ్యములు వ్రాయుచుఁ బద్యకావ్యములు వ్రాయుట మాన్పుటనుగురించి వారితో బ్రస్తావించుచున్నారు. ఇంతలో కోటంరాజుగారు, అన్నయాచార్యులుగారు, వెంకటశాస్త్రిలుగారు మరికొందరు ప్రవేశించుచున్నారు. వెంకయ్యగారులేచి సభయొక్క కార్యప్రారంభమునకు వేళ అయినదని తెలుపుచున్నారు. అంతట యోసేపుగారు అగ్రాసనాధిపతిగా నుండుట తమయభిప్రాయమని గోపాలంగారు చెప్పుచున్నారు. దానికందరు నామోదించుచున్నారు. యోసేపుగారగ్రాసనాధిపత్యము వహించుచున్నారు.

వెంకయ్యలేచి, ఈనాడు మనమందరము తెలుగుభాషవృద్ధియగుటకుఁ దగిన సదుపాయములను గురించియోచించుటకు నిచ్చటచేరినాము. కొందరు తమకు దోచిన సదుపాయములను ముందుగానాకు వ్రాతమూలకముగా దెలిపి వానిని సభవారియెదురఁ బెట్టమనికోరినారు వానినొక్కటొకటిగ బెట్టుదును. మీరందరు సాధకబాధకములు చక్కగాఁ బరిగణించి మీయభిప్రాయములను దెలుప వేడుచున్నాను. మొదటిది నరసింహముగారి యుద్దేశ్యము. "పద్యకావ్యములు వ్రాయుటమాని మనవారు గద్యకావ్యములే వ్రాసిన తెలుగుభాష వృద్ధియగునని" నరసింహముగారు వారియుద్దేశ్యమును విశదీకరించి ప్రస్తావింతురు.

యోసేపుగారు:—నరసింహముగారు ప్రస్తావింతురుగాక. నరసింహముగారంతలేచి గద్యకావ్యములు తెలుగుభాషయందు మిక్కిలియరుదుగానున్నవనియును, శాస్త్రవిషయములు సుబోధకముగ వ్రాయుటకు వచనకావ్యములనుకూలముగా నుండుననియు, శాస్త్రపరిజ్ఞానము వలన దేశము నాగరికతవడసి సంపత్సమృద్ధి గనునుగావున జనులకు శాస్త్రవిషయిక గ్రంథములు మనవారుబహుళముగా వచనరూపమున వ్రాయుట శ్రేయోదాయకమనియుఁ బ్రసంగించిరి.

అంతట యోసేపుగారు సభవారిలో నెవ్వరైననిందున కాక్షేపించువారున్నయెడలఁ బ్రసంగింపవచ్చుననిరి. అంతట వెంకటశాస్త్రిలుగారులేచి శాస్త్రవిషయికగ్రంథములు దేశాభివృద్ధి కారణములగును గానికావ్యములు ప్రబంధములు నాటకములు బుద్ధివికాసము కలిగించి చిత్తశుద్ధి కలిగించునవికావున ముఖ్యముగ వ్రాయదగినవనియును

దీనివలన నీతి విస్తరించుటయేగాక కాలస్థితియు దేశస్థితియు స్పష్టముగ దెలియుచుండుననియు కావ్యరచనయు దేశాభివృద్ధి కారణమేయనియుఁ జెప్పిరి. మఱెవ్వరు బ్రసంగించుట కుద్యుక్తులు కానందున నరసింహ్వాముగారి యుద్దేశము నంగీకరించువారు చేతులెత్తవలయునని యోసేపుగారుచెప్పిరి. లెక్కపెట్టగా నలుగురు చేతులెత్తినవారైరి. అందున కాక్షేపించువారు చేతులెత్తవలయుననిచెప్పగా సుమారు ముప్పదుగురు చేతులెత్తిరి.

తిరిగి వెంకయ్యగారులేచి "గ్రామ్యభాషలోనే గ్రంథములు రచించిన సర్వజనబోధకమై యుండును గావున గ్రంథరచనకుగూడ గ్రామ్యభాషవ్యవహరింపవలయును" అని గోపాలంగారి యుద్దేశము. అనిచెప్పిరి. యోసేపుగారు గోపాలంగారిని బ్రసంగింపుమనిరి. వారులేచి గ్రామ్యభాషయనునది గ్రంథములయందుఁ బ్రయోగింపబడకపోవుటచే సింధిలమగుచున్నదిగాని వేఱుకారణములేదనియు దానిని గ్రంథములయందుఁ బ్రయోగించిననదియు మాన్యమగుననియు గ్రంథములు పామరజనులకునుబోధకముగ నుండుననియు విద్యావ్యాప్తికిమిక్కిలి యనుకూలమగునని యుముచ్చటించిరి. దానికాక్షేపణలు చెప్పుడని యోసేపుగారు సభవారినిఁగోరగా నాగభూషణముగారులేచి "ఆయాజాతులవారికిని నాయాదేశములవారికిని గ్రామ్యభాష వేరువేరుగా నున్నదనియు నది యవలంబించి గ్రంథములందు బ్రయోగించిన సర్వజనగ్రాహ్యముగ నుండదనియు గంభీరభావములు తెలుపుటకు గ్రామ్యభాషచాలదనియు గ్రామ్యభాష గ్రంథములయందు బ్రయోగించుట యేదేశమందును సంప్రదాయకముగా లేదనియు, బ్రసంగించిరి. యోసేపుగారులేచి యీవిషయము లన్నిటినిగూర్చి తాము చివర నొక్కసారిగా బ్రసంగింతుమనియు గ్రామ్యభాష గ్రంథములయందుప్రయోగించుట కాక్షేపించువారు చేతులెత్తుడనియుజెప్పిరి. సభవారిలో ముప్పాతికమంది చేతులెత్తిరి.

వెంకయ్యగారులేచి సమాసప్రయోగము దగదని నాగభూషణముగారి యుద్దేశమనిచెప్పిరి. నాగభూషణముగారంతట యోసేపుగారి కోరికమీద సులభముగ తేలిక పదములతో వ్రాయవలయునుగాని సమాసములు ప్రయోగింప గిట్టదని ప్రసంగించిరి. అంతట వెంకటశాస్త్రులుగారులేచి సమాసప్రయోగము విధికాదనియు తేలిక మాటలతో వ్రాయుట కావ్యగుణములలో నొకటిగా లాక్షణికు లిదివరకే నిర్ణయించినారనియు దీనింగూర్చి యిప్పుడొక నిబంధన కవసరములేదనియుఁజెప్పిరి.

అంతట నందరు నిబంధన మవసరములేదనిరి.

వెంకయ్యగారంతటలేచి యతిప్రాసలు కావ్యరచనకు బాధకములనియు నవి వదలివేసిన బాగుండుననియు బ్రస్తాపించిరి. అవి బాధకముగా దలంచువారు గద్యకావ్యములు వ్రాయవచ్చుననిరి.

అంతట యోసేపుగారులేచి యిట్లు ముచ్చటించిరి.

"సభ్యులారా, మీరందరు తెలుగుభాషనువృద్ధిచేయ దలచిన సదుపాయములను చర్చించుచున్నారు. భాషను వృద్ధిచేయుటయనగా భాషలో గ్రంథములు బహుళముగఁజేయుటయనిగాదు. నీతిబోధకములును, శాస్త్రవిషయములునునైన గ్రంథములను నెక్కువగ వ్రాయుటకుఁ దగిన సదుపాయములేర్పరచి యట్టిగ్రంథములు వృద్ధియగునట్లు చేయుటయని నాకుదోచుచున్నది. అందునకైయేర్పరుపవలసిన సదుపాయములనికొన్ని విషయములుజర్చించుట జరిగినది. కాని యివినాకు సమ్మతములుకావు. యతిప్రాసలు తీసివేయవలయునని, గద్యకావ్యములే వ్రాయఁదగునని, సమాసములు ప్రయోగించుట మానదగునని ఛందస్సు మార్చవలయునని మొదలైన వాంశములు చర్చింపబడినవి. గ్రామ్యభాషనే గ్రంథములయందుఁ బ్రయోగింపవలయునని కొందరిమతముగా నున్నది. నేను గ్రామ్యభాషను గ్రంథములయందుఁ బ్రయోగింపవలయుననువారి వాదమును గ్రహింపజాలకున్నాను. ఏదేశములోని యేభాషనుఁ బరిశీలించిచూచినను గ్రంథములయందుఁ బ్రయోగింపబడు భాషకును జనసామాన్యముచేత మాటలాడుకొనబడు భాషకును వ్యత్యాసము కలదు. గ్రామ్యభాషమాటలాడువారు నాగరికతలేనివారుగాఁ బరిగణింపఁబడుదురు. సలక్షణముగ మాటలాడుట నాగరికత చిహ్నముగా నెన్నబడుచున్నది. కాబట్టి గ్రామ్య

భాష గ్రంథములయందే కాక మాటలాడుకొనునప్పుడును నిషేధించుట నామతము. సర్వజనులకు సలక్షణమైన భాషయలవడునట్లు చేయవలయును. ఇకను యతిప్రాసలను దీసివేయుటను గురించియు సమాసభూయిష్టముగ నుండకుండ దేటమాటలతో రచించుటను గురించియు నిప్పుడు చర్చించనవసరము లేదు. ఏలయనగా సులభముగ వ్రాయుట కావ్యగుణములలో నొకటి కావున ప్రతిగ్రంథకర్త తనకు సాధ్యమైనంతవరకు సులభశైలిని వ్రాయుటకు బ్రయత్నించును. యతిప్రాసలు తీసివేయవలయు ననువారు గద్యకావ్యములు వ్రాయవచ్చును. ముఖ్యమైన విషయములువిడిచి ఈయనవసరమైన యంశములతోఁ బ్రొద్దుపుచ్చుట యెందునకు? రసము వెల్లివిరియునట్లు వ్రాసిన గ్రంథకర్త తప్పక మెప్పువడయగలడు. రసస్ఫూర్తి కలుగునట్లు వ్రాయుటకు శక్తిగల గ్రంథకర్త మార్గమును సర్వజనులు ననుసరింతురు.

ఇప్పుడు ముఖ్యముగ విచారించఁదగిన యంశమొకటి నాకు దోచుచున్నది. సర్వజన సుబోధమై, నీతిబోధమై, జ్ఞానప్రదమైయుండు గ్రంథములు పాఠశాలలలోని బాలురచేతఁ జదివించిన వారికి సులభశైలిని వ్రాయుటయు, నీతియు, నాగరికతయు జ్ఞానమును గలుగును. ఇప్పుడు చదువుకొనుచున్న బాలురే ముందు గ్రంథకర్తలు కాగలవారు గావున వారికిఁ జిన్ననాటినుండియు సులభశైలియు భావగాంభీర్యతయు గలుగునట్లు చదివించవలసిన గ్రంథములెయ్యవి? నాతాత్పర్యము తెలుగు బైబిలు. ఈబైబిలు మహాగ్రంథము వేదము. దీనంబోధింపబడని నీతులు,ధర్మములుమరి యెందును లేవు. సలక్షణమైనభాష, సర్వజనగ్రాహ్యము. ఈమహాగ్రంథమును మనబాలురందరుఁజదువునట్లుచేసిన సులభశైలిని నుత్కృష్టమైన గ్రంథములు వ్రాయుశక్తి కలుగును. కావుననీమహాగ్రంథములోని భాగములు పాఠగ్రంథములుగా నేర్పడు ప్రయత్నము మీరు చేయవలయునని నాతాత్పర్యము. మఱియు సకల జనులు ఆభాషయే మాటలాడుకొనునప్పుడును వ్యవహరింపదగును. యోసేపుగారిట్లు చెప్పి విరమించిరి. అంతట గోపాలంగారు లేచి, ‘‘ఈరాత్రి యోసేపుగారు శ్రమయనక యగ్రాసనాధిపత్యము వహించి మనలను మన్నించినందులకు వారికి సభవారివందనములు దెలుపుచున్నా" మని చెప్పిరి. అంతట నెవరిపాటికివారు వెళ్ళిపోయిరి.



## ఆంధ్రదేశోద్యమము – దాని భావిస్థితి.

[చల్లా శేషగిరిరావుపంతులు బి. ఏ., గారు.]

హిందూదేశీయులకెల్లను హైందవజాతీయత పరమావధి. అన్ని సంఘములతోఁబాటు బలవత్తరమైన హైందవజాతీయ నిర్మాణముకొఱకు నాంధ్రులుకూడ తమయావచ్ఛక్తిని వినియోగించు నుద్దేశముతో నాంధ్రదేశమునందొక నూతనోద్యమమును బ్రారంభించినారు. దర్బారు వరములు లభ్యమగుటకుఁ బూర్వమే సాంఘిక, రాజకీయ, యార్థిక స్థితిని బలపఱచుకొనవలయునని స్థిరసంకల్పము జేసికొనియున్నారు. హిందూదేశపు రాజప్రతినిధియగు హార్డింజిప్రభువుగారి అప్రతిమానమైన రాజనీతివలనను, మన యేలికయగు శ్రీ జార్జిచక్రవర్తిగారి కృపారసమువలనను, నొకజాతికి సంబంధించి, యొక్క-భాషను మాటలాడు జనులనందర నొకరాష్ట్రమునఁజేర్చిన, భవిష్యద్వృద్ధి శీఘ్రముగ నొందఁగలరని యంగీకరింపఁబడినది. ఇందునకు మన వైస్రాయిగారును చక్రవర్తిగారును సంస్తవనీయులు. ఈరీతి ననుసరించి, వంగ, విహార, దేశంబులు ప్రత్యేకరాష్ట్రంబులుగ మార్పబడినవి. వంగ విహారవాసులు గూడ నీయేర్పాటువలన సంతృప్తిఁజెందిరి. హిందూదేశపు చరిత్రలో నీక్రొత్తమార్పు ఆంధ్రదేశీయుల మనంబులయందు, డాగియున్న యాశయంబుల బ్రబోధింపఁజేసి, యాంధ్రజనోద్ధరణ హేతువగు నొకగొప్ప సంచలనము నుద్భవింపఁజేసెను. రాజనీతి విశారదుండగు హార్డింజిప్రభువుగారికి నాంధ్రులెల్లరు వారుజేసిన యీమహాకార్యమునకు గృతజ్ఞులు. వారి ప్రాణమున కపాయముగావింప బ్రయత్నించిన దుర్మార్గుల మీద నాంధ్రులెల్లరు దమ యాగ్రహమును వెలిబుచ్చియున్నారు.

ఘోరకృత్యము గావింపఁబడినను, మనదేశముయెడల వారికిఁగల ప్రేమ యొంతమాత్రము తగ్గదనియు, హిందూదేశ రాజ్యాంగవిషయమై తా మవలంబించినమార్గము మార్చమనియు, నుడివిన మృదువచనములు వారి విశాలహృదయమును, వారి యుదారస్వభావమును వెల్లడించుచున్నవి. భగవంతుఁడు వారి కాయురారోగ్యములు ప్రసాదించి, హిందూదేశ పురోభివృద్ధికి వారుచేయుప్రయత్నములన్నియు సఫలముగావించుగాక!

### ఇందలి సూత్రము.

ఒకరిభావములు వేఱొకరికి దెలుపుటకు భాష ముఖ్యసాధనమని యెల్లదేశములందును గ్రహింపఁబడినది. ఒక సామాన్యభాష, దానినిమాటలాడు వారందఱియందు నైకమత్యమును బ్రసరింపజేయును. ఐకమత్యము ప్రబలుటకు సామాన్యమతము, సామాన్యసాంప్రదాయములు, సామాన్య ధర్మములు, సాధనభూతములయినను, సామాన్యభాషవలె నొకరియందొకరికి ప్రేమాతిశయంబులను బురికొల్పఁజాలవు. సామాన్యభాషయు భావవ్యక్తీకరణంబునకు నుత్కృష్టసహాయము నొసగును. సంఘీభావమును, నైకమత్యమును వృద్ధిఁబఱచును. ఈసూత్రమును గ్రహించినచో, భాషైక్యము నాధారపఱచుకొని, సంఘాభ్యుదయమును శీఘ్రముగఁ నొందవచ్చుననియు, నందువలన జాతీయాదర్శముగూడ త్వరలో ఫలించుననియు సిద్ధాంతమేర్పడుచున్నది. హైందవులందరు నొక్కభాష మాటలాడు నొక్కజాతివారు కారని, మనము ముందు తెలిసికొనవలసియున్నది. హిందూదేశమునందు వివిధభాషలుమాటలాడు ననేకజాతులు గలవు. నాగరికత, వేష భాషలు, సాంప్రదాయము వీనియందెల్ల భేదావస్థలు గాన్పించుచున్నవి. ఒక్కభాష మాటలాడు వంగదేశీయులందఱు నేకరాష్ట్రముక్రింద నఖండాభివృద్ధిఁగాంచిరి. బంగాళావిభజనము రద్దుచేయుటకు, హిమగిరిమొదలు కన్యాకుమారివఱకు హిందూదేశమునంతను సంచలనముగావించిన వంగదేశీయుల కలవరకారణము, నాంధ్రదేశీయులీసమయమునఁ దెలిసికొనఁగలరు. అట్టి దృఢనిశ్చయమే యాంధ్రుల మనంబుల నాటుకొని యాంధ్రదేశీయ సంచలనమునకు కారణభూతమైనది.

### ఇందలి ముఖ్యభాగములు.

ఈయాశయము నాల్గువిధములని చెప్పవచ్చును.

1. ఆంధ్రరాష్ట్రోద్యమము, 2. ఆంధ్రవిశ్వవిద్యాలయ స్థాపన ప్రయత్నము, 3. ఆంధ్రమహాజన సభానిర్వహణము, 4. ఆంధ్రుల యాశయంబుల వెలిఁబుచ్చుచు, హిందూదేశ పురోభివృద్ధికి సాయపడుటకు నాంధ్రుల యాధిపత్యముక్రింద నొక యాంగ్లేయ దైనికవార్తాపత్రికను స్థాపించుట.

### ఆంధ్ర రాష్ట్రము.

హిందూదేశములోనిరాజ్యములు, దీర్ఘయోచనతో నిర్మింపఁబడలేదు. దేశమునుజయించి బ్రిటిషువారు స్వాధీనపఱచుకొను వరుసనుబట్టి రాష్ట్రములేర్పరుపఁబడినవి. ఆంగ్లేయరాజనీతివిశారదులు, భాషైక్యము, జాత్యైక్యము, నాధారపఱచుకొని, రాష్ట్రనిర్మాణము జేయుట ముఖ్యావసరమని గ్రహించిరి. అందులోముఖ్యులు హార్డింజిప్రభువుగారని యెల్లరకు విదితమె. హిందూదేశమునకు శాశ్వతపు సహాయకార్యదర్శియును, హిందూదేశ రాజ్యాంగవిషయమున చిరకాలపరిచితుఁడు నగు, సర్, టి. డబ్లియు. హోల్డరునెసుగారు, రాష్ట్రములు భాషాభేదమును బట్టి విభజింపబడవలయుననియు, "బర్మారాష్ట్రముతప్ప యేరాష్ట్రము స్వభావసిద్ధమైన రాష్ట్రముకాదు! అనగా జాతి, భాష, భూగోళాది భేదములు ననుసరించి రాష్ట్రవిభజనము చేయబడలేదు. దేశముసంపాదించునపుడు పరిపాలననిమిత్తము రాష్ట్రము లేర్పఱుపఁబడినవి" అనియువ్రాసిరి. గతించిన సర్జాన్ స్ట్రాచీయను మహామహుఁడును, జాన్ఫుల్లర్ దొరగారును, కర్జనుప్రభువుగారును, రాష్ట్రములు భాషైక్యమునుబట్టియు, జాత్యైక్యమునుబట్టియు, నేర్పరచుట ముఖ్యావశ్యకమని యభిప్రాయపడిరి. సర్. బి. ఫుల్లరుగారు వారిహిందూదేశజీవితమను గ్రంథమునందిటులవ్రాసిరి. "హిందూదేశమునందు రాష్ట్రనిర్మాణము భాషను బట్టియు, జాతినిబట్టియు, జరఁగినయెడల, పరిపాలనా సౌకర్యమునకు సాధనముగానుండును. అప్పుడొకరియందొకరికి ప్రేమజనించి దొరతనమువారియెడల నభిమానముదయించును." పరిపాలనా సౌకర్యమునుబట్టి చూచినను, ప్రజలసౌఖ్యమునుబట్టి చూచినను, రాష్ట్రములను తిరిగినిర్మించుట, ముఖ్యావసరమని చదువరులకుఁ దోపకమానదు. ఆంధ్రరాష్ట్రమువలన గలుగు మొదటిలాభమేమన, ఆంధ్రదేశములో ముఖ్యపట్టణముండుటయే. దీనిప్రయోజన మింతింతనిఁ చెప్పవీలులేదు. ప్రధానపట్టణమెప్పుడును తనతేజోకిరణములను దేశమంతటను ప్రసరింపజేయును. హిందూదేశపు జాతులతోబాటు ఆంధ్రులుకూడ నభివృద్ధి నొందుటకుచాల యవకాశముండును. ముఖ్యపట్టణమున గనిపించెడి నూతనశక్తులన్నియు, నాంధ్రదేశమునందెల్ల నూతనోజ్జీవము కల్పించును. ఆంధ్రోద్ధరణము త్వరలోవ్యాపించును. ఆంధ్రులికముందు పెక్కుమందిలో నొకరుగనుండబోరు. వారిపురోభివృద్ధియే జనులమనంబులను, దొరతనమువారిమనంబులను, నెల్లపుడు మెలఁగుచుండును. అందువలన శీఘ్రముగ నభివృద్ధిఁ జెందఁగలరు. ఆంధ్రదేశములోని గొప్పయత్నములన్నియు త్వరలో సఫలీకృతమగును. విశాఖపట్టణపు హార్బరును గుఱించిన యుద్యమము ఫలప్రదమగుటకును, ఆంధ్రులలోనున్న తవిద్యవ్యాపించుటకును, ఆంధ్రదేశాభివృద్ధికి గావలసిన పనులన్నిటిని త్వరలో నిర్వర్తించుటకును, దొరతనమువారు బ్రయత్నముచేయుదురు. ఆంధ్రుల సామర్థ్యాతిశయములుచితరీతిని సత్కరింపఁబడును. వారియభివృద్ధికి నవకాశ మెక్కువగును. ప్రస్తుతము చెన్నపురి యాంధ్రదేశము వెలుపలనున్నది. అందువలననాంధ్రేతరుల యధికారప్రాబల్యములు మనదేశమునం దెక్కువగానున్నవి. ఆంధ్రులబుద్ధివికాసములు చూచువారులేక త్రుప్పుపట్టిపోవుచున్నవి. అందువలన నాంధ్రజాతి కొలదికాలములో నడుగంటు నేమోయనిభయమొకలుగుచున్నది. గానియాంధ్రరాష్ట్రోద్యమము, ఆంధ్రులకునూతనోజ్జీవము గల్పించును. ఆంధ్రదేశనాయకుల దేశాభిమాన మెక్కువగా నభిమానింపఁబడును. అందువలనవారు దేశోద్ధరణమునకు మఱింతపాటుబడుటకు ఉత్సాహపూరితులై యుందురు. సంఘసంస్కరణబీజమాంధ్రదేశమున గాఢముగ నాటఁబడినది. అది యాంధ్రదేశమంతయువ్యాప్తమై

యాంధ్రులనందఱి నొక్కటిగఁ జేసి, మఱింత స్వేచ్ఛాబుద్ధి నొసంగి, యాం
ధ్రజాతిని యున్నతపదవి నాక్రమింపఁ జేయును. విదేశములలో కష్టించి
చదివిన యాంధ్రులు, గొప్పయుద్యమములు ప్రారంభించి, భాగ్యోద
యమునకు కారకులగుదురు. వేయేల, కొలదిసంవత్సరములలో, నాం
ధ్రులు వంగదేశీయులతోబాటు నభివృద్ధిఁజెందగలరని నా నమ్మకము.
మనము స్వదేశసంస్థానములలోని యాంధ్రులను, మనరాష్ట్రములో గలి
యుటకు, తదధిపతులను ప్రోత్సాహముచేయలేమను సంగతి, నిశ్చయ
ము. అంతమాత్రమున నాంధ్రరాష్ట్రోద్యమము వ్యర్థమేనా? అసంభవ
మగు నాక్షేపణలవలన ప్రయోజనముండదు. ఆంధ్రులందఱును నేదేశ
మందున్నను నాంధ్రమహాజనసభయందేక కార్యోన్ముఖులై యొక్క
ప్రదేశమందుగూడుటకు నవకాశముగలుగును. ఆంధ్రులందఱు నాంధ్ర
విశ్వవిద్యాలయమువలన నున్నతవిద్య నభ్యసింపఁగలరు. ఆంధ్రదేశమున
నాంగ్లేయదొరతనమువారి పరిపాలనకు లోఁబడియున్న యాంధ్రులం
దఱునొక్కటియై, బంగాళీయులవలె శీఘ్రముగ నౌన్నత్యము గాంచ
గలరు. వీరియభివృద్ధి స్వదేశసంస్థానములలోని యాంధ్రులకుఁ గూడ
మార్గదర్శకమగును. అటులైన చెన్నరాజధాని యనేకరాష్ట్రములుగ
విభజింపబడవలెనని యడుగవచ్చును. కాని, దక్షిణకన్నడము జిల్లా
యొక్కటియే కన్నడభాష మాటలాడువారిది. అదియుత్తర కన్నడము
తోబాటు బొంబాయి రాజధానిలో జేరవచ్చును. లేకయొకకమీషనరు
అధికారముక్రిందనుండవచ్చును. మళయాళభాష మాటలాడువారి జిల్లా
యొక్కటిమాత్రమే. దానినిమలబారు జిల్లాయనియెదరు. దానినిగూడ
నవసరమైనయెడల నొకకమీషనరు యధికారముక్రింద జేర్చవచ్చును.
ఆంధ్రదేశము స్వల్పరాష్ట్రమగుననియు, నందువలన ప్రజలు పెద్దదొర
తనమువారిక్రింద లభ్యమగు ప్రయోజనముల బొందజాలరనియు, కొంద
రాక్షేపణ చేయుచున్నారు. ఒక్కప్రభుత్వముక్రింద కలసియుండుట
యేయాంధ్రులకు గొప్పలాభము. దానివలన వెనుకసూచించిన లాభము
లన్నియు నొందగలరు. కాని చిన్నరాష్ట్రములు పెద్దరాష్ట్రములనుభేద
ములేకయే శాసననిర్మాణసభలను,అంతరంగికసభలను దొరతనమువారొ
సంగుచున్నారు.రాష్ట్రభేదమువలన హైందవుల యైకమత్యము చెడుచు
చున్నారు.వంగ విహారరాష్ట్రములు విడిపోయినను,కాంగ్రెసుమహాసభ
లో నుభయరాష్ట్రవాసులు నైకమత్యముతో మెలంగిరి. పాంచాల దేశీ
యులు, వంగదేశీయులు, మగధదేశవాసులు, మహారాష్ట్రులు, హిందూ
స్థాన దేశవాసులు, ద్రావిడులు, మొదలగువారందఱు వివిధరాష్ట్రీయు
లైనను,హిందూదేశాభివృద్ధికొఱకు కాంగ్రెసుమహాసభలో సోదరులవలె
మెలంగి తీర్మానములు గావించుచున్నారు. అటులనే చెన్నరాజధాని
గూడ వేర్వేరురాష్ట్రములుగ విభజింపఁబడినను, ఆ రాష్ట్రవాసులెల్లరు
నిదివఱకు జూపుచున్న ప్రేమనే యొకరియెడనొకరు చూపుదురనియు,
హిందూదేశపురోభివృద్ధికి నెల్లరు సాయపడెదరనియు,నాయొక్క నిశ్చ
యమైన యభిప్రాయము.ఆంధ్రరాష్ట్రనిర్మాణమువలన వివిధజాతులనై
కమత్యము చెడుననుట మిక్కిలి పరిహాసాస్పదము. ఇంతియగాక యిక
నిర్మింపఁబడబోవు నాంధ్రరాష్ట్రము, పెద్దరాష్ట్రములలో నొక్కటి
యగుటకు ననుమానించవలసినపనిలేదు. 1911 వ సంవత్సరపు జనాభా
ప్రకారము తెలుగుజిల్లాలసంఖ్య యించుమించుగా 1,70,87,808. ఈసం
ఖ్యబర్మాదేశపు 100 లక్షల జనసంఖ్యకన్న చాలపెద్దది. ఈజనసంఖ్య
పంజాబు, బొంబాయిరాష్ట్ర జనసంఖ్యతో నించుమించుగా సమానమ
గును. మధ్యపరగణాల జనసంఖ్య పదమూడు లక్షలకన్న చాలపెద్దది.
ఇవియన్నియు పెద్దరాష్ట్రములే. మధ్యపరగణాలయందున్న తెనుగు
జిల్లా లాంధ్రరాష్ట్రమునగలిపినచో, నాంధ్రరాష్ట్రము పెద్దరాష్ట్రము
లలో నొకటియగుటకు సందియములేదు. ఒక రాష్ట్రముయొక్క
యాధిక్యత వైశాల్యమువలనగాని జనబాహుళ్యమువలనగాని,నిశ్చయింప
వీలులేదు. ఇతరకారణములవలనను నిర్ణయింపనగును. హిందూదేశమున
పెద్దరాష్ట్రములలో వైశాల్య విస్తీర్ణములయందు భేదము గాన్పించు
చున్నది. ఇతరదేశములలో రాష్ట్రనిర్మాణము గమనించిన, వైవాద
ముస్థిరపడును. అమెరికాఖండమున కొలంబియారాష్ట్రము 70 చదరపు
మైళ్ళ విస్తీర్ణమయినను ప్రత్యేకరాష్ట్రముగ, నిర్మింపఁబడినది. స్విజరు
లాండుదేశము మనదేశములోని పెద్దరాష్ట్రమంత దేశమయినను, కాక
పోయినను, భాషాభేదమునుబట్టి యనేకరాష్ట్రములుగ నేర్పరుపబడినవి.
అందు నాలుగు ప్రత్యేకభాషలుమాటలాడుచున్నారు. అయినను స్విస్సు
జను లేకదేశీయులుగా బరిగణింపఁబడి యైకమత్యముతో రాజ్యపాలనము
జఱుపుకొనుచున్నారు. తెలుగుజిల్లాలు గోదావరి కృష్ణమొదలగుమహా
నదులచే ప్రవహింపఁబడి, ఫలవంతములై, ధనధాన్యములతో తులదూగు
చున్నవి. విశాఖపట్టణపు హార్బరు నిర్మింపఁబడినచో, యాంధ్రదే
శము బొంబాయివలె విశేషవర్తకమున కునికిపట్టగును. చెన్నరాజధాని
యందు వసూలుచేయు శిస్తులో సగముకన్న నెక్కువగ నాంధ్రదేశ
మునందు వసూలు చేయఁబడుచున్నది. ఇంతియగాక, ఆంధ్రులకుసం
బంధించిన ప్రత్యేకపుచట్టములు ఆంధ్రరాష్ట్రము విడిపోయినగానిజయ
ప్రదముగ శాసననిర్మాణసభలో నంగీకరింపఁబడుటకు వీలులేదు. ఇప్ప
డున్ననో, దొరతనమువారును, శాసననిర్మాణసభ్యులును, అనేకజాతుల
వారి శ్రేయోభివృద్ధిఁజూచుటవలన, నీజాతివారిపురోభివృద్ధియు యు
క్తరీతిని బెంపొందించుటకు వీలులేదు. ఈవిషయము విపులముగా వ్రా
యస్థలముచాలనందున ఇంతటితో నాపెదను. కానియొక్కటిమాత్రము
చెప్పవలసియున్నది. ఆంధ్రులు విహారదేశస్థులవలెనే అద్భుతమైన
పూర్వనాగరికత గలవారు. అనేకదేశములను జయించి యొకప్పుడు
హిందూదేశసామ్రాజ్యత్వము నాలుగుశతాబ్దము లనుభవించిరి. ఇప్పుడు
గుంటూరు జిల్లాలో అమరావతి యని పిలువబడు గ్రామమొకప్పుడు
ధరణికోట యని బి లు వ బ డి యాంధ్రసామ్రాజ్యమునకు ముఖ్య
పట్టణముగనుండెను. అందు ప్రసిద్ధిగాంచిన యొక విశ్వవిద్యాలయ
ముండెను. తరువాత గూడనాంధ్రులు దక్షిణదేశమంతయు జయించి
వివిధరాష్ట్రములలో నాంధ్రనాయకులనుంచి, పరిపాలించిరి.ఆంధ్రదేశ
చారిత్రము ఆంధ్రులపూర్వపు టౌన్నత్యమును సూచించుచున్నది. అట్టి
వారి సంతతివారైన యిప్పటియాంధ్రులకు ప్రత్యేకరాష్ట్ర మొసంగుట
యెంతయు సమంజసము. ఇందువలన నాంధ్రులు ముమ్మందు హిందూ

దేశచారిత్రములో నింకను గొప్పకార్యములు చేయఁగలరు. ఈపరిచలన మందు రెండవయాశయము ఆంధ్రవిశ్వవిద్యాలయ స్థాపనము.

### ఆంధ్ర విశ్వవిద్యాలయము.

హిందూదేశమంతకు హిందీగాని మఱియొక భాషగాని సామాన్యభాషగా నుపయోగింపబడునని తలచుట దుస్సాధ్యమైనకోరిక. ప్రతి భాషయు నాఁటఁటకభివృద్ధి యిదివఱకే చెంది, వానియందు సద్గ్రంథములు వ్రాయఁబడినవి. వానినన్నిటిని రూపుమాపి యొక్కభాషను దేశమందంతటను వ్యాపింపజేయుట యసంభవము. ఈసత్యమును గ్రహించిన యెడల, హిందూదేశపు భావిస్థితి దేశభాషలయభివృద్ధిమీఁద నాధారపడియుండునని తెలియుచున్నది. ఇతరభాషలయందు వ్రాయబడిన గ్రంథములలోని సత్యములు, స్వభాషలోనికి దీసికొనిరావలయును. అప్పుడే జనులు, యజ్ఞానాంధకారమునుండి విడిపోవుదురు. గోఖలేగారి ప్రారంభవిద్యాశాసనము అమలులోకి వచ్చినచో దేశభాషలలో నూతన మార్గముల ననుసరించి గ్రంథములు వ్రాయవలసియుండును. అవి దేశ జనులలో విద్యావ్యాపనమునకు తోడ్పడును. ఆంధ్రభాషావాఙ్మయముకూడ నట్లే వృద్ధిగాంచవలయును. ఆంధ్రులుకూడ ఉన్నతవిద్యవలని లాభము లెక్కువగ బొందవలయును. ఆంధ్రులమనోరథముల నెరవేర్చుటకు చెన్నపురి సర్వకళాశాల యంతగా ప్రయోజనకారి కానేరదు. నాలుగు వివిధభాషలయందు దృష్టిని నిలుపవలయును. అందువలన నేభాషయు నుచితరీతి నభివృద్ధి జెందదు. అరవభాషలో, అనేకవేలరూప్యములు వెచ్చించి యొకనిఘంటువు దయారుచేయ దొరతనమువారు బూనుకొనియున్నారు. కాని యాంధ్రభాషావధూటియందట్టి యాదరణమేమియు జూపకుండుటకు కారణమూహింప నశక్యము. బహుశః యన్నిభాషల నొక్కవిధముగ నాదరించుట యసంభవమని తెలియవలయును. అందువలననే, మదరాసు దొరతనమువారి యాంతరంగిక సభ్యుడగు హానరబిల్ పి. యస్. శివస్వామిఅయ్యరుగారీమధ్య తిరిచినాపల్లిలో నుపన్యసించుచు «దక్షిణజిల్లాల కొక విశ్వవిద్యాలయమును, ఉత్తర జిల్లాలకు వేఱొకటియు, పశ్చిమజిల్లాలకు మఱియొకటియు భావ్యభ్యుదయమున కెక్కువని నేదలచను» యని నుడివిరి. దొరతనమువారుకూడ ననేక విశ్వవిద్యాలయములు హిందూదేశమంతటను స్థాపించుటకు సుద్యుక్తులైయున్నారు. మాంటాగుగారు దొరతనపువారి యుద్దేశమును బ్రకటించుచు «1904 వ సంవత్సరమున ప్రతి విశ్వవిద్యాలయమునకు నెంతవఱకు నధికారముకలదో నిర్ణయించిన తరువాత, నా యధికార విస్తీర్ణత తగ్గించుట ముఖ్యమైన కార్యమని» చెప్పిరి. ఆంధ్రవిశ్వవిద్యాలయము నెరవేరదగని కోరికకాదు. దొరతనమువారు ఆరంభించిన యుద్యమము శీఘ్రముగ గొనసాగినచో నదియు త్వరలో జేకూరును. విహార, రంగూను, డక్కా, పూనా, అహమదాబాదు, కరాచి, కాశి, అలిఘురు మొదలగు విశ్వవిద్యాలయము లన్నిటివలెనే, ఆంధ్ర విశ్వవిద్యాలయమునుకూడ త్వరలోస్థాపించుట యావశ్యకము.

### ఆంధ్రమహాజన సభ.

ఈ ప్రయత్నము చాలవఱకు ఫలించుచున్నది. ఇట్టి మహాసభ విషయమై ఆంధ్రులలో భేదాభిప్రాయముండకూడదు. ఆంధ్రుల కష్టనిష్ఠురములు, వారి యాశయములు, దేశీయ మహాజనసభయందుగాని, మండల రాజకీయసభయందుగాని, అంతగ చర్చింపఁబడుట కవకాశము లేదు. అందువలన ప్రత్యేకాంధ్ర మహాజనసభ యత్యవసరము. ఆంధ్రదేశోద్ధరణ ప్రయత్నములన్నిటిని నొప్పుకొనుటకుగాని, నిరాకరించుటకుగాని, ఈ మహాజనసభకుదప్ప ఇతరమనుజుల కధికారముచాలదు. ఈ మహాసభ యాంధ్రులందరి యభీష్టములు వెలిబుచ్చుటకు జాలియుండును. ఈసభా తీర్మానములే యాంధ్రదేశీయుల ప్రయత్నములకు మూలాధారములై, వానిని దొరతనమువారి దృష్టిపథమునకు దీసికొనిపోవును. ఆంధ్రుల నుత్సాహపూరితులజేయును. ఆంధ్రులందఱిని నొక్క స్థానమునజేర్చి, వారి యాదర్శములను, వెల్లడిజేయు నవకాశ మేర్పడుటకై, గుంటూరుజిల్లా సంఘమువారు వేసవికాలములో నాంధ్రమహాజనసభను బాపట్లలో జరుపుట కేర్పాటుగావించిరి. వారెంతయు నాంధ్రుల వందనములకు పాత్రులనుట నిస్సందియము.

### ఆంధ్ర యాంగ్లేయ దైనికపత్రికలు.

జనసామాన్యమున కంతకు నీ నూతనాశయమును దెల్పుటకును, రాజకీయవిషయములను, నవీనాభ్యుదయమార్గములను బోధించుటకును, నాంధ్రభాషయందొక దైనికపత్రిక యవసరము. ఆంధ్రుల కష్టనిష్ఠురములు, వారి యాదర్శములు దొరతనమువారికి దెలియపరుచుటకు ఆంగ్లేయ దైనికపత్రిక స్థాపింపబడవలయును. ఈ పత్రిక దొరతనమువారికిని, జనులకును, నొకరి యభిప్రాయము లొకరికి దెలియజేయుటకు మిగుల సహకారియగును.

### భావిస్థితి.

నిజమయిన ప్రయత్నములు ముందు జరుగనున్నవి. నేను సూచించిన యుద్దేశములతో నీసంచలనము ప్రారంభమైనది. మున్ముందు ఇది యేరూపమున బరిణమించునో చెప్పజాలము. విహారదేశీయులను అన్ని విధముల ననుసరించజాలము. ఆంధ్రమహాసభ ముందుజేయవలసిన కార్యములను నిర్ణయించును. ఈప్రయత్నములలో నేమానవునియందుగాని యే యితరజాతియందుగాని, ఈర్ష్య, దుర్మార్గపు చింతలేదని నొక్కి వక్కాణింపవచ్చును. అవియే ప్రధానోద్దేశములైనచో దేశములోనింత దూరమీ సంచలనము వ్యాపించి యితరజాతులవారి మెప్పునుగాంచి యుండదు. ఆంధ్రులయభివృద్ధి యొక్క శీఘ్రగమనమునకై యీయుద్యమముబయలు వెడలినది. ఈమనోరథముసఫలమైనయెడలనాంధ్రులు హిందవజాతిలో బలమైన యొకభాగమగుదురనుకోరిక, యాంధ్రులమనంబుల నాటుకొనియున్నది. సంఘవిషయములనుగూర్చి యీయుద్యమము శ్రద్ధవహించుటలేదని కొందఱును, రాజకీయవిషయములను బూర్తిగవిచారించుటలేదని మఱికొందఱును, శంకించుచున్నారు. కానియీయభిప్రాయము సహేతుకముకాదు. ఆంధ్రులందఱును నొక్కపరిపాలన క్రిందనున్నపుడు, వారి యభివృద్ధికై ఇప్పటికన్న నెక్కుడుగ బ్రయత్నించెదరు. ఈయుద్యమము కేవలము రాజకీయముగాదు. కేవలము సాంఘికమునుగాదు. ఆర్థికమునుగాదు. అన్నియుదీనిలోనిమిడియున్నవి. అన్నివిధముల యాంధ్రులభివృద్ధి జెందుటయే దీనియాదర్శము .ఇంతకన్న నెక్కుడుగ వ్యక్తీకరించుటకు ప్రస్తుతమున సాధ్యపడదు.

ఏప్రయత్నము సఫలముగావలెనన్నను, వారిసర్వస్వమును ధారబోసి, పట్టుదలతోను, నుత్సాహముతోను, బనిచేయగల దేశనాయకులు గావలెను. ఆంధ్రదేశోద్యమమునకుగూడ నట్టినాయకులవసరము. తగిన నాయకులును, వారికి మనస్ఫూర్తిగ సాయపడి పనిచేయు జనసామాన్యమును, నుండినయెడల, ఈమహోద్యమము నిర్విఘ్నముగ జయముగాంచి ఆంధ్రదేశమునకు అనిర్వచనీయమగు లాభముల నొసగూర్చ ననుటకు సందియములేదు.

Dewan Bahadur Kanchi Krishnaswamy Rao. C.I.E.



దివాన్ బహదూర్ కంచి కృష్ణస్వామిరావుగారు.

Dewan Bahadur V. Subrahmanyam Pantulu.



దివాన్ బహదూర్ వి. సుబ్రహ్మణ్యం పంతులుగారు.

Mr. P. V. Krishnaswamy Chetty.



పి. వి. కృష్ణస్వామి శెట్టిగారు.

Rao Bahadur Bhavanandam Pillay.



రావుబహదూర్ భవానందం పిళ్ళెగారు.



Blocks by Messrs R. Venkiah Brothers, Madras.




Lala Hari Kishen Lal. లాలా హరికిషన్ లాల్ గారు.



Pandit Ramavatara Sharma. పండిత రామావతార శర్మ గారు.

Mr. Puranam Nagabhushanam.



పురాణం నాగభూషణంగారు.

Mr. Dasu Madhava Rao.



దాసు మాధవరావు పంతులుగారు.

Blocks by Messrs U. Ray & Sons, Culcutta.



Mr. M. Gangarazu. శ్రీ మోతే గంగరాజుగారు.

Mr. C. K. Reddy.



సి॥ కె॥ రెడ్డి గారు. బారిష్టరు.

Mr. Kandula Veeraraghavaswamy.



కందుల వీరరాఘవస్వామిగారు. బారిష్టరు.

Mr. Muttaraju Subba Rao M. A.,



ముత్తరాజు సుబ్బారావు పంతులుగారు ఎమ్. ఏ.,

Blocks by Messrs Neroy & Co.

## I. C. S. PROBATIONERS DURING 1913.

Mr. B. Rama Rao.



బెనగల్ రామారావుగారు.

Mr. Ramachandra Rao.



రామచంద్రరావుగారు.

Mr. B. K. Basu.




బి. కె. బాసుగారు.

Mr. Godbole.



గోడ్బోలెగారు.

# సంస్కృతభాష—ఆంధ్రదేశము.

[ ప్రతివాదిభయంకర కృష్ణమాచార్యులుగారు. ]

మనుష్యజాతియొక్క ఐహిక పారలౌకికాభివృద్ధులకత్యంతోపయుక్తములగు ధర్మార్థకామమోక్షములను చతుర్విధ పురుషార్థముల వివరణమే భాషయందు విపులముగ జర్చింపబడియున్నదో; ప్రపంచమందలి ప్రథమ విజ్ఞాతలనదగు నార్య ఋషులు తమ విజ్ఞానలతల ఫలంబులనదగు వైద్య, జ్యోతిష, వేదాంతాది సమస్త వైజ్ఞానిక విషయంబుల నేభాషను వ్రాసియుంచిరో; మన భారతదేశమందలి భాషలకన్నిటికిని మాతృభాష యేయయ్యెదియో! ఆసంస్కృతభాష, ఆభాషామతల్లి, అవిద్యాకల్పవల్లి, గీర్వాణవాణి మన యాంధ్రదేశంబున నెట్లాదరింప బడుచున్నదో; ఆంధ్రవిషయంబున శ్రద్ధానివలన గలుగు ప్రయోజనంబు లెయ్యవియో; ఇచ్చో నాభాష నభ్యసించుటకు సాధనంబులుగ నేర్పరచుకొనబడిన పద్ధతులేయవియో; ఆపద్ధతులవలన ప్రయోజన మెంతవరకు కలుగుచున్నదో; ఈభాషను బాగుగను సులభముగ నభ్యసించుట కవలంబింపవలసిన పద్ధతులేయవియో; యను విషయములంగురించి ఈవ్యాసమున వివరింప దలకొంటి. గుణగ్రహణ పరాయణులిందుగల గుణంబుల గ్రహించి దోషంబుల సవరింప వేడుచున్నవాడ.

## ఆంధ్రదేశమున సంస్కృతభాషయొక్క ఉపయోగములు.

ఈభాష మనదేశమందలి తక్కిన భాగములన్నిటియందు నుపయోగించునట్లే మన యాంధ్రదేశంబునను అనేకవిధముల నత్యంతోపయుక్తమైయున్నది. అందు మొదటిది బ్రహ్మజ్ఞాన సాధనమగుట

“ప్రాప్యస్య బ్రహ్మణోరూపం ప్రాప్తుశ్చ ప్రత్యగాత్మనః।
ప్రాప్త్యుపాయం ఫలం ప్రాప్తేస్తథాప్రాప్తి విరోధిచ॥”

యనునట్లు మానవకోటియొక్క కోరికలలో అవినశ్వర ఫలమగుటచే నత్యుత్తమమగు మోక్షము లక్షణముగా కలదగుటచే పరమప్రాప్యమగు బ్రహ్మయొక్క స్వరూపమును; శరీర శరీరి భావనిబంధనమగు అనాది స్వాతంత్ర్యమును కలిగియుండుటచే ప్రాప్తమగు ప్రత్యగాత్మస్వరూపమును ఈప్రత్యగాత్మ పరమాత్మంబొందుటకు సాధనమగు దాని స్వరూపమును, పరమాత్మ ప్రాప్తివలనంగలుగు ఫలముయొక్క స్వరూపమును పరమాత్మ ప్రాప్తికి విరోధియగు దాని స్వరూపమును అను మోక్షసాధనమగు అర్థపంచకమును వివరించు, ఉపనిషత్తులు, గీతలు, బ్రహ్మసూత్రంబులు, తద్భాష్యంబులు లోనగు బ్రహ్మ ప్రతిపాదక గ్రంథరాజంబులన్నియు సంస్కృతభాషయందె వ్రాయబడియుండుటచే నీభాష బ్రహ్మజ్ఞానసాధనమైనది. మానవకోటికీజ్ఞాన మత్యావశ్యకమని వేఱ వ్రాయబనిలేదుగదా? ఏతద్భాషాజ్ఞానము ముఖ్యమగుటచేతనే ద్వైతులమనియు, నద్వైతులమనియు, విశిష్టాద్వైతులమనియు మొదలగు పేర్లచే జెప్పుకొనువారిలో చాలమంది స్వస్వమతధర్మముల నెఱుంగకుండుటయు తన్మూలకముగా నాయామతధర్మముల సత్యమగు యనుష్ఠానములు నశించుటయు అందుచే శారీరక, మానసిక, వైజ్ఞానికాది శక్తులు నశించుటయు సంభవించి క్రమక్రమమున ఆంధ్రజాతి ప్రతివిషయమున నధోగతినందుచున్నది. రెండవప్రయోజనము కర్మజ్ఞాన సాధనమగుట. ఆంధ్రులలో చాలమంది సంధ్యావందనాది నిత్యకర్మలను వివాహాదికమగు నైమిత్తిక కర్మలను యజ్ఞాదికమగు కామ్యకర్మలను ఆచరించువారై యున్నారు. “కర్మణైవహి సంసిద్ధిమాస్థితా జనకాదయః” అనియు “కర్మజ్యాయోహ్యకర్మణః” అనియు “నహి సన్యసనాదేవ నైష్కర్మ్యం పురుషోశ్నుతే” యనియు “యోగస్థః కురుకర్మాణిసంగంత్యక్త్వాధనంజయ” అనియు మొదలగు వచనములచే కర్మాచరణ మత్యంతావశ్యకమని చెప్పబడియున్నది. ఈకర్మలనాచరించు పద్ధతులును ఆయాకర్మల నాచరించునప్పటి బుద్ధియోగమును, మొదలగు కర్మలకు సంబంధించిన పద్ధతులన్నియు వేదములు, స్మృతులు, గీతలు మొదలగు వానియందు సంస్కృతభాషయందే వ్రాయబడియున్నవి. మన పురోహితులకుగాని కర్మల నాచరించు మనకుగాని యీభాష తెలియకుండుటచేతనే పవిత్రతమంబులగు మన వివాహాది కర్మలు “లగ్నంచపాదఘట్టంచ” మొదలగు మంత్రములు మొదలగువానిచేతను నిర్వహింపబడుచు హాస్యాస్పదములగుచున్నవి. మూడవఫలము వైజ్ఞానిక విద్యాపరిజ్ఞాన సాధనమగుట. “శరీరమాద్యం ఖలుధర్మసాధనం” అని నిఖిల పురుషార్థ సంపాదన సాధనంబగు శరీరముయొక్క ఆరోగ్యపద్ధతుల దెలుపు వైద్యశాస్త్రము, గ్రహనక్షత్రాదుల సంచారమును దెలుపుటచే కాలమును దెలుపు జ్యోతిషశాస్త్రము, మహాద్భుతములగు శతఘ్న్యాది యంత్రనిర్మాణాదుల దెలుపు శుక్రతంత్రము, సుహృత్సమ్మితములయ్యు కాంతాసమ్మితములయ్యు నీతిమత వ్యవహారాది విషయముల బోధించు పురాణంబులును, కావ్యంబులును, ఇతిహాసంబులును మొదలగు విజ్ఞాన విద్యలందెలుపు గ్రంథములన్నియు సంస్కృతభాషయందే వ్రాయబడియున్నవి. వేయేల? మ॥రా॥శ్రీ, రాజా మంత్రిప్రగడ భుజంగరావు బహద్దరువారు “సంస్కృతభాషావాఙ్మయ” మను వ్యాసమున 1911 సంవత్సరపు సంవత్సరాది సంచికయందు వ్రాసినట్లు “ఆర్యుడుదయమున లేచినదిమొదలు రాత్రి నిద్రించువరకును పంచాంగపు బ్రాహ్మణు నివలనను దైవప్రార్థనయందును, దేవాలయమందును, నిత్యనైమిత్తికములందును, వేదాంతమునందును, సంస్కృతముబాడ గనుచుండుటావ

శ్యకమైనది॥ మన మీభాషాభ్యాసమునం దశ్రద్ధవహించి యుండుట చేతనే పైవిషయములయందు అమెరికా, జర్మనీ, మొదలగు యితర దేశములయందలి వారికంటెను, హిందూదేశమందలి ఉత్తరాహులకంటెను వెనుకబడియున్నాము. నాల్గవది భాషాపరిజ్ఞానసాధనమగుట. తత్సమ, తద్భవ, దేశ్యభేదంబుచే ముత్తెఱంగులనుండు యాంధ్రంబున తత్సమ తద్భవాత్మకమగు భాషయంతయు సంస్కృత మయమైనది. గాననే ఒక శాస్త్రీయ గ్రంథమును వ్రాయదలచినపుడును, అన్యభాషయందుండు గ్రంథమును ఆంధ్రమున ననువదింప దలచినపుడును సంస్కృతభాషా సహాయ మత్యవసరమైయుండును. గాననే పదార్థవిజ్ఞాన శాస్త్రమును ఆంధ్రభాషయందు వ్రాసి వినుతిగాంచిన మంత్రిప్రగడ సాంబశివరావుగారు ఆగ్రంథముయొక్క పీఠికయందు "ఆగ్రంథమును చదివిజూడ మన యాంధ్రభాషలోగూడ సంస్కృతభాషాసహాయము వలన నెట్టి యుద్గ్రంథములనైనను యెట్టి కఠిన శాస్త్రీయ గ్రంథములనైనను వ్రాయవచ్చునని స్పష్టపడినది" అని వ్రాసియున్నారు. గాన ఆంధ్రభాషయందు వ్రాయబడియుండు శాస్త్రీయ గ్రంథములుగాని పురాతనాధునాతన కవిపుంగవులచే వ్రాయబడిన యుద్గ్రంథములను గాని చదువవలయుననినను అట్టి గ్రంథముల వ్రాయవలయుననినను, సంస్కృతభాషా పరిజ్ఞాన మావశ్యకమైయున్నది. సంస్కృతభాషా పరిజ్ఞానములేని కవులు కొందరు వ్రాసిన గ్రంథములలోని అసందర్భములను వానివలన భాషకుకలుగు అనర్థములును క॥ భాస్కరరావుగారు 1911 వ సంవత్సరపు సంవత్సరాదిసంచికయందు "ఆంధ్రభాష చెడుచున్న మార్గము" అను శీర్షికక్రింద వ్రాసియున్నారు. పైచెప్పబడిన తెఱంగున ఆంధ్రదేశమున కత్యవసరమగు సంస్కృతభాష మనదేశమున నెట్లభ్యసింపబడుచున్నదను విషయమును విమర్శించుటకు పూర్వము భాషాభ్యాస పద్ధతులను చర్చింతము.

## భాషాభ్యాససాధనములు - అవియుండవలసినరీతి.

ఏభాషనైనను బాగుగ నభ్యసింపవలయుననిన దానికిఁ గావలసియుండు అనేక సాధనములలో ముఖ్యతమములైనవి పఠనీయగ్రంథములు. ఎంతమంచి గురువులున్నను, యెంతటి గ్రహణధారణ పటుత్వము కలిగియున్నను, మరియితర సహాయము లెన్నియున్నను తగిన పఠనీయ గ్రంథములు లేనిచో, అట్టిభాష నభ్యసించుట సాధ్యముకాదు గదా? గురువులు దొరకకపోయినను తగిన పఠనీయగ్రంథముల సహాయముండిన భాష నభ్యసింపవచ్చునుగాన పఠనీయగ్రంథములు భాషాభ్యసనమునకు నగావలసి సాధనములలో ముఖ్యతమములని చెప్పవచ్చును. ఈపఠనీయగ్రంథములను 1. వ్యాకరణములు 2. సాహిత్యగ్రంథములు నని రెండు విధములుగా విభజింపవచ్చును. అందు వ్యాకరణ గ్రంథములు సాధ్యమైనంతవరకు రెండు మూడు భాగములుగా విభజింపబడి మొట్టమొదట ఆభాషకు సంబంధించు వ్యాకరణ విషయములలో సులభములగు నంశముల వివరింపుచు నడచినకొలది ప్రౌఢాంశములవివరింపుచు ఆయావిధుల నెఱుకపరచు సూత్రములు దేశీయభాషలయందునను ఉదాహరణము లాయాభాషలయందును వ్రాయబడి సుబోధకములుగా నుండవలయును. ఇట్లుండిన కుసుమకోమలంబులగు బాలుర హృదయకమలలన్యభాషా గ్రంథవిషయ గ్రహణమను పాషాణభరణంబుచే నలుగుడుకెందక స్వభాషాగ్రంథపఠనమను తేజోజాలంబున వికసితమై జ్ఞానగంధము నలుదెసల బలపఱచుననుటకు సందియముండదు. సాహిత్యగ్రంథములన్ననో అవియు వ్యాకరణగ్రంథములవలెనే విభజింపబడి, వెనుకజెప్పబడిన పద్ధతిననుసరించి వ్రాయబడియుండు వ్యాకరణగ్రంథములకులక్ష్యస్థానీయములై మొట్టమొదట పదములును తరువాత చిన్నచిన్నవాక్యములును పిమ్మట గడచినకొలదిని భాషాప్రౌఢిమ యందభివృద్ధినందుచు నీతిదాయకములగు కథలను కలిగి రాజిల్లుచుండవలయును. మరియు మధ్యమధ్యనొక పాఠముపద్యకావ్యములనుండియెత్తబడిగాని స్వకల్పితములైగాని యుండు పద్యములుకలవిగా నుండవలయును. ఈపాఠములన్నియు నీతి,మత, వ్యవహారముల బోధించునవిగా నుండవలయును. ఇట్టి పఠనీయగ్రంథములఁగలిగియుండు భాషనభ్యసించు బాలుర జ్ఞానము మంచివికాసముకలిగి ప్రతివిషయమునందును సులభముగా వ్యాపించు నభ్యాసమును కలిగియుండుటచే నూతనవిషయ నిర్మాణసామర్థ్యమును కలిగియుండును. మరియు బాల్యమునుండియు నీతి, మత, వ్యవహార, విషయక జ్ఞానము వ్యాపించుచుండుటచే బాలురు సత్ప్రవర్తనము కలవారై పెద్దవారైన తరువాత పరోపకారాది సద్గుణములుకలిగి ప్రపంచమున కుపయోగింతురు. మరియు వారభ్యసించు భాషయందు మంచిజ్ఞానము సులభముగా కలుగును. అట్లుగాక మంచి పఠనీయగ్రంథములులేనిభాష నభ్యసించు బాలురకు భాషాజ్ఞానముకలుగుట కవకాశముండదు. అతికష్టముమీద నొకవిధమగు భాషాజ్ఞానము కలిగినను పైచూపబడిన సద్గుణములు కలుగుట కవకాశముండదు.

## ఆంధ్రదేశమున సంస్కృతభాష నభ్యసించుట కుపయోగింపబడుచుండు పఠనీయ గ్రంథములు వాని యుపయోగములు.

ఇటుపై మనదేశమున సంస్కృతభాష నభ్యసించువారుపయోగించు పఠనీయగ్రంథములేవి; వానియుపయోగ మెంతవరకు గలుగుచున్నదను విషయములగుఱించి చర్చింతము. మనదేశమున సంస్కృతభాష నభ్యసించు వారినందరిని రెండుతరగతులుగా విభజింపవచ్చును. ఆంగ్లేయభాషాభ్యాసముకొఱకేర్పరుపబడియుండు పాఠశాలలలో ద్వితీయభాషగా సంస్కృతమును దీసికొని చదువువారు కొందరును, కేవలపరోపకార పరాయణతచేగాని సంస్కృత భాషాభిమానులచేస్వల్పముగా ద్రవ్యసహాయము నందుచుగాని విద్యార్థులకు చదువుచెప్పుచుండు అట్టి గురువులయొద్ద విద్యనభ్యసించువారు మరికొందరునైయున్నారు. ఇందుమొదటివారి సంస్కృతభాషాభ్యాస మంతముఖ్యమైన దనుటకువీలులేదు. వీరు తమచేచదువబడిన భాగములయం దధికారులచే నధికారపత్రములనందుటకుగాను శ్రైథముగా చదివెదరు. వీరాయధికారపత్రికల నందినతరువాత నీభాషను తిరిగిచూడరు. చదువునప్పుడైనను అంత

గా శ్రద్ధయుండదు. వీరికిసంస్కృతమును జెప్పునుపాధ్యాయులలోచాల మంది సంస్కృతభాషనుమాత్రమే చదివినవారుగానుందురు. వారాంగ్లేయభాషయందు మాటాడలేరు. ఆంగ్లేయభాషయందు వ్రాయబడినగ్రంథముల చదువనులేరు. ఇచ్చట సంస్కృతభాష నభ్యసించువారలకుగాను, ఆంగ్లేయభాషయందు వ్రాయబడినగ్రంథములు పఠనీయములైయుండుటగాన నీగ్రంథముల నాగురువులు సమన్వయముచేసిచెప్పలేరు. అట్లుచెప్పకుండిన విద్యార్థులకీయంశములు తెలియవు. అందుచేసంస్కృతమునభ్యసించు మొదటితరగతిలోని వారిలోచాలమందికి ఆభాషకు సంబంధించుసంగతులేవియు తెలియనే తెలియవు. వీరికొరకు డాక్టరు భాండార్కరువారిచే వ్రాయబడినపుస్తకములును మరికొన్ని పుస్తకములును పఠనీయములుగా నేర్పడియుండును. వీనిలోచాలగ్రంథములనేకవిషయములలోనే పైవివరించిన పద్ధతిననుసరించియేయుండును. కాని ఆగ్రంథములపై వ్యాసంగము బాగుగాజరుగదు. అయినను పఠనీయగ్రంథములు మంచివగుటచే శ్రద్ధగలకొంతమంది సంస్కృతభాషయందు కొంతవరకు వ్యాకరణజ్ఞానమును సంపాదింపగలుగుచున్నారు. కానివీరికి సాహిత్యజ్ఞానము చాలతక్కువగానుండును. ఇకరెండవ తరగతివారిని గురించి విచారింతము. వీరికిపఠనీయగ్రంథములలో ప్రప్రథమమున చదువదగిన వ్యాకరణగ్రంథములు లేవనియే చెప్పవచ్చును. వీరందరును,

“రామోహరిశ్చ కరీభూభృద్విష్ణుః కర్తాచచంద్రమాః ।
తస్థివాక్ మధువానాత్మా దత్తైతే పుంసినాయకాః॥”

అను మొదలగు మూడుశ్లోకములయందు చెప్పబడియుండు ముప్పదిశబ్దములనుమాత్రము వ్యాకరణాంశములకుగాను చదివెదరు. కొంతమంది శబ్దమంజరిలోని సాధారణసర్వనామశబ్దములు చదువుటయుకలదు. సంస్కృతభాష మిక్కిలిక్లిష్టమైనది. ఈభాషలో వ్యాకరణాంశములు తెలుసుకొనవలసిన వనేకములుకలవు. దీనికంటె నితరములగు భాషలయందు ఒకశబ్దమున కాయావిభక్తులయందు ప్రత్యయములు చేర్చుపద్ధతి తెలిసినతక్కినశబ్దములకన్నిటికి తెలిసినదనవచ్చును. సంస్కృతభాషయందట్లుగాక ఒకవిధమగుశబ్దమునకు విభక్తిప్రత్యయములు చేర్పబడినపుడు ఒక్కొకవిధమగు రూపమేర్పడును. గాననే ఒకఅకార మంతమందుశబ్దములలోనే యిరువదివిధములగు రూపములుగలశబ్దములేర్పడినవి. ఇది దిక్ప్రదర్శనముగా జూపబడినది. ఇట్లె సంధులు, ధాతువులు, అవ్యయములు, వృత్తులు, విభక్తులు మొదలగువానియందు తెలియవలసినయంశము లనేకములుండును. గ్రంథవిస్తరభీతిచే వీనికన్నిటికిని యుదాహరణములనీయలేదు. ఇట్లుండ వ్యాకరణాంశములన్నిటికి బదులుగాముప్పదివిధములగు శబ్దములనుమాత్రము తెలుసుకొనుటయెంతటిలాభకారియో విచారింపుడు. సంస్కృతభాషం బ్రవేశింపదలంపుగలవారికి వ్యాకరణవిషయంబుల దెలిసికొనుటకు సాధనములుగా “శబ్దమంజరి” “శబ్దరత్నావళి” “ధాతుమంజరి” “తిజంతరూపావళి” “ధాతురత్నావళి” “ఉపయుక్తాంశసంగ్రహము” మొదలగు కొన్నిగ్రంథములు కొందరుమహాత్ములచే వ్రాయబడినవి గలవుకాని అవియెవరిచేతను అంతగా నుపయోగింప బడుచుండలేదు. ఇందుకుకారణము అవిసంస్కృతభాషయందు వ్రాయబడియుండుటచేతను కొన్నిఆయావిషయముల పూర్ణముగా వివరింపకుండుటచేతను సుప్రవేశములును సుబోధములును కాకుండుటయే. ఇట్లనుటచే ఆగ్రంథములునిరుపయుక్తములనినాయభిప్రాయమని తలంపకుందురుగాక. బాలురకు సులభముగా ప్రవేశింపదగినవని నాయభిప్రాయము. వ్యాకరణగ్రంథములిట్లుండ లఘుత్రయము గురుత్రయమునను యుద్దేశముతో రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, కిరాతార్జునీయము, శిశుపాలవధము, నైషధముఅను కావ్యముల క్రమముగా సాహిత్యగ్రంథములుగా నుపయోగించుచున్నారు. ఈ గ్రంథములను వ్రాసినకవులు వీటిని భాషాభ్యాసమున కుపయోగించుదనుతలంపుతో వ్రాసియుండలేదు. స్వకవితాసామర్థ్యమును లోకమున కెఱుకపరచి ఆచంద్రార్కమగు యశముసార్జించుట, సర్వలక్షణవిరాజమానయగు ప్రియురాలు సుందరకటాక్ష ప్రసారంబులచేతను హావభావానులచేతను తనప్రియుని వశపరచుకొని యుక్తాయుక్తంబులప్రవృత్తినివృత్తుల కలుగజేయునట్లు శయ్యలు, రీతులు, అలంకారములు, ధ్వనులు మొదలగువానిచే సహృదయ హృదయంబుల నాకర్షించి హితాహితంబుల ప్రవృత్తినివృత్తులకలుగజేయుట మొదలగుకార్యముల కొరకు ప్రౌఢకవివరులచేరచింపబడినవైయున్నవి. ప్రౌఢతమగ్రంథసందర్భంబులై, పటుతరసమాసభూయిష్ఠంబులై, సునిపుణశబ్దార్థయుతంబులై, సుశిక్షాపరిజ్ఞేయంబులగు గుణాలంకారంబుల కాకరంబులై, రహస్యతరధ్వనిమార్గంబులకు నిలయంబులై, విబుధలోకమాత్రపరిస్వాద్యంబులును, భావతరంగితములును, అగు రససుధాసింధువులం ధరించియుండుకావ్యంబులేడ. కుసుమకోమలంబులు సులభతరవిషయమాత్రపరిజ్ఞానక్షమంబులగుబాలుర మానసంబులేడ. వ్యాకరణవిషయంబుల నత్యల్పంబగు జ్ఞానంబును సంపాదించి ప్రౌఢతమంబగు భాషాజ్ఞానముకలవారికి గాని గోచరముకాని విషయంబుల [illegible] చదువుదు, సంస్కృతభాషాజ్ఞానముసంపాదించుబాలురహృదయంబులు వ్యాపకతాగుణలవశూన్యంబులై మూఢతాపూర్ణంబులగు జ్ఞానంబులకు నిలయంబులగుచున్నటుకు సందియముండదు. కావుననే యీపద్ధతిననుసరించి చదువువారునైషధాంతములగు కావ్యంబులంజదివినాటకాదులం జదువుచుండినను ఒకశ్లోకార్థవాక్యమునైనను స్వబుద్ధిచే కల్పింపనశక్తులైయుందురు. వీరికి బభౌ అనినప్రకాశించెనని యర్థమనిమాత్రము తెలియునేకాని అదియేక్రియయొక్కరొట్టిరూపమో యింకనెన్నిరూపములుకలవో ఏయేరూపముల నేయేసమయముల నుపయోగింపవలయునో తెలియదు. ధాతువులయుపయోగము తెలియనివారువాక్యములనెట్లునిర్మింపగలరు. వాక్యమునకు క్రియముఖ్యముగదా; వీరిభాషాజ్ఞాన మిట్లుండ నీతిమతవ్యవహారవిషయకమగు జ్ఞానమెట్లుండునో విచారింతము. చదువరులమనంబుల నాకర్షించుటకై కావ్యములయందు ప్రాయికముగా శృంగారరసమును పయోగింతురు. శృంగారరసమును ప్రౌఢశైలిని వివరింపుచుండు నిట్టికావ్యముల పఠనీయగ్రంథములుగా గలిగియుండు విద్యార్థులు విషయార్థులగుట కెంతయు సందియముండదు. బాలురమనంబుల నీతిబాహ్యములు

గానొనర్చు శ్లోకముల గ్రంథవిస్తరభీతిచే నిట వ్రాయలేదు. ఇట్లుబాల్యముననే విషయవాంఛల నలవాటుపడియుండు బాలురు పెరిగి పెద్దలైనతరువాత నీతిమతవ్యవహారవిషయముల సరియైనమార్గంబున నిశ్చలబుద్ధితో ప్రవర్తించు టెట్లుసంభవించును. గానఆంధ్రదేశంబున సంస్కృతభాషనభ్యసించువారికేర్పడియుండు పఠనీయగ్రంథము లన్నివిధముల ననర్హములైయున్నవని చెప్పవచ్చును. ఇట్లాంధ్రమండలంబున సర్వవిధముల వ్యాపనముదగ్గియుండు సంస్కృతభాషను తిరిగివ్యాపింపజేయవలయుననిన మనమవలంబింపవలసిన పద్ధతులను విచారింతము.

## ఆంధ్రదేశంబున సంస్కృతభాషను వ్యాపింప జేయుటకు చేయవలసిన నేర్పాటులు.

ఏవిషయమునైన సంస్కారముచేసి బాగుచేయ దలంపుకలిగినపుడు అందలిలోపముల సవరించుట ప్రథమకర్తవ్యముగాన ప్రస్తుతమగు సంస్కృతభాషా వ్యాపనమునకు ప్రధానాటంకము పఠనీయగ్రంథలోపముగాన ప్రప్రథమమున తగినపఠనీయగ్రంథములు వ్రాయబడవలయును. అందుకొరకు సంస్కృతభాషాపాండిత్యముగల యాంధ్రులు శ్రద్ధవహించి పఠనీయగ్రంథముల వ్రాయవలయును. ఈ పఠనీయగ్రంథములు నేనుపై వ్రాసినట్లు రెండుతెఱగులనుండవలయును. అందు వ్యాకరణగ్రంథములు బాలురకుసుబోధమగు శైలిఁగలిగియుండు నాంధ్రంబున లక్షణములను సంస్కృతభాషయందు లక్ష్యములను కలిగియుండి ప్రప్రథమమున తెలుసుకొనవలసిన సంస్కృతభాషా వ్యాకరణాంశములనన్నింటిని వివరింపునవిగానుండవలయును. ఇట్లు వ్రాయబడిన వ్యాకరణగ్రంథముల జదువుబాలురకు శ్రమచాలవఱకు తగ్గును. అన్యభాషయందు వ్రాయబడియుండు శాస్త్రీయగ్రంథముల చదువునపుడు బాలురు మొదట నాపదముల కర్థముచేసుకొనుటయు తరువాతనందలి విషయంబుల గ్రహించుటయునను రెండు పనులజేయవలసియున్నది. ఇందు రెండవదానికంటె మొదటిది బాలురకు మిగులకష్టమైనది. కాబట్టి అన్యభాషాగ్రంథములు సాధనములుగా జనకొని శాస్త్రీయవిషయముల గ్రహించునపుడు అన్యభాషాపదముల కర్థము జేసికొనుటయను ప్రథమకార్యమునందే యెక్కువ శ్రమపడిన బాలుర మనసు విసుగుజెంది ప్రధానమగు విషయగ్రహణ సమయమున పరాఙ్ముఖమగును. ఈవిషయము నావద్ద జదువు బాలురకు శబ్దరత్నావళి మొదలగు గ్రంథముల జెప్పునపుడు నిపుణముగా పరిశీలింపబడినది. లక్షణము లాంధ్రభాషయందు వ్రాయబడియుండునెడల అట్టి గ్రంథముల జదువునపుడు విషయగ్రహణముమాత్రమే చేయవలసినదగుటచే బాలురమనసు శ్రద్ధతో బనిచేయును. కాబట్టి అన్యభాషాగ్రంథములయందలి విషయముల గ్రహించు నప్పటికంటె స్వభాషాగ్రంథములయందలి విషయముల గ్రహించుట మిగుల సులభమగుటచే వ్యాకరణగ్రంథములనేనుపై వ్రాసినట్లు రచించుట మిగుల యుపయుక్తము.

*ఈసంగతులనెల్ల విచారించియే కౌముదిననుసరించి అన్ని విషయములు* తెలియుట కనువగునటుల రెండుభాగములుగా 4 సంవత్సరములు చదువుటకు వీలగునట్లు సంస్కృతవ్యాకరణము నొకదాని నాంధ్రభాషయందు వ్రాసియున్నాను. దాని నిప్పు డచ్చొత్తించుదలంపుతో నున్నవాడను. గాన విద్యాచణులును ధనచణులును, నాకు సహాయులై; నా గ్రంథమునందలితప్పుల దిద్దియు ధనసహాయముజేసియు నీగ్రంథముల బ్రకటింపజేయవేడుచున్నాను. సాహిత్యగ్రంథములను పైప్రకరణముననే సూచించినటుల యేడెనిమిదితరగతుల విభజింపబడి వ్రాయబడవలయును. అవియు బాలురకు పఠనీయముగా నుండు వ్యాకరణగ్రంథముల ననుసరించుచు అట్టి వ్యాకరణ గ్రంథములకు లక్ష్యస్థానీయములై గడచినకొలది సంస్కృతభాషా యోషామణియొక్క విలాసవైఖరుల సహృదయహృదయాహ్లాదకరముగా జూపుచు వ్రాయబడవలయును. ఆంధ్రేతరులలో జాలమంది ఈపద్ధతినే యవలంబించియున్నారు. మైసూరుప్రాంతముల భాండార్కరుగా రాంగ్లేయమున వ్రాసిన సంస్కృతవ్యాకరణ గ్రంథముల కన్నడభాషలోనికి మార్చి బాలురకు మొదట నాగ్రంథములనే జెప్పుచున్నారు. మరియు మొదటికావ్యములజెప్పక సంస్కృత కథాసప్తతి, కథావళి మొదలగు వచనగ్రంథముల జెప్పుదురు. ద్రావిడులును యిట్టిపద్ధతినే యవలంబించియున్నటుల తెలియవచ్చుచున్నవి. హిందీ మొదలగు నౌత్తరీయభాషలయందు వ్రాయబడియుండు గ్రంథములిట్టివనేకములు గలవుగాన ననేకులచే నుపయోగింపబడిన ఈపద్ధతి మన యాంధ్రదేశంబునను మహోపయుక్తమైనదిగా నుండును. ఇది మొదటిపద్ధతి. రెండవది ఆంధ్రదేశంబున సంస్కృతభాషను వ్యాపింపజేయుటకై సంస్కృతభాషాభివ్యాపకసమాజమొకటి బయలుదేరుట. ఈ సమాజము సంస్కృతభాష వ్యాపించుటకుతగిన మార్గముల యోజించుట. ఆమార్గములను సంస్కృతపాఠశాలలు మొదలగు సంస్కృత భాషావ్యాసంగము జరుగుచోటులకు తెలియపంపుట, సంస్కృతభాషయందొక మాసపత్రికను, ఒకవారపత్రికను ప్రకటించుట, సంస్కృత భాషాగ్రంథముల నాంధ్రులకుపయుక్తములగు తెలుగున నచ్చొత్తించి జనసామాన్యమునకందుబాటుగ తెలుంగున నుంచుట మొదలగు పనులజేయవలయును. హిందీమొదలగు భాషలయందు భాషాటీకలతోను భాషావ్యాఖ్యానములతోడను భాషానువాదములతోడను ముద్రింపబడియుండు గ్రంథములకు మితియె లేదు. కైయటము మొదలగు వ్యాకరణగ్రంథములకును శ్రుతులకును, స్మృతులకును, షడ్దర్శనములకునుగూడ భాషాటీక వ్రాయబడినదనిన యిక సామాన్యగ్రంథముల విషయము వ్రాయబనిలేదు. ఈపద్ధతినే యవలంబించినగాని మన దేశమందును సంస్కృత భాష యభివృద్ధినొందజాలదు. గానదేశాభిమానులిట్టి సమాజమునొకదానిని బయలుదేరదీయవలయును. మూడవది గవర్నమెంటుసహాయము. గవర్నమెంటువారు సంస్కృతభాషకు విద్వాన్, శిరోమణియను బిరుదముల నేర్పాటుచేసియు సంస్కృతపాఠశాలలకు గ్రాంటునిచ్చియు చాలసహాయము చేయుచున్నారు. అందు బిరుదపరీక్షలు మిక్కిలి కష్టమైయున్నవి. అనేకశాస్త్రముల జదివినవారుగాని ఆపరీక్షలకు నిలువజాలరుగాన ఆపరీక్షలయందు యింకను కొన్ని క్రిందితరగతుల నేర్పరచి కావ్యతీర్థ, అలంకారతీర్థ, శాస్త్రి మొదలగు చిన్నబిరుదములగూడ నేర్పరచిన కేవల కావ్యనాటకములు అలంకారశాస్త్రములు మొదలైనవిమాత్రము చదివినవారికిని ప్రోత్సాహము కలుగునుగాన యిట్లు చేయుటకు గవర్నమెంటువారిని నైసమాజమువారు ప్రార్థించవలయును. ఇట్టి సంస్కృతభాషాభివర్ధకములగు కార్యముల జేయుటకు ఆంధ్రుల బ్రార్థించుచున్నాను.

# హిందూదేశ పరిశ్రామిక సంస్కరణము.

[బి. వి. రాఘవరాజు గారు.]

హిందూదేశమం దీవిద్యలు నశించుటకును, ఆ కారణమున దేశస్థులకును దేశమున కుండవలసిన ప్రాముఖ్యత గొఱవడుటకు హేతువు లనేకములు గలవు. వానిలో ముఖ్యమైనవాని నిచటఁ జర్చింతము. ఈదేశమునందలి విద్యల చరిత్ర మనము జూచినయెడల మొదటినుండియు దేశవృద్ధికిఁగావలసినపరిశ్రమములఁ జేయుట మాని యీదేశస్థులు వారి మనముల సూక్ష్మకళలయం దుఁ జొన్పి, తమ జీవికావృత్తులయం దశ్రద్ధఁ జూపుటకు ముఖ్యకారణము విచారించి చూడగ వీరికి సహజమగు మతచింతయు అధ్యాత్మిక విచారణమై యున్నది. కేవలము పరలోకచింతయే సహజలక్షణమై యున్న జనులు పరిశ్రామికవిద్యలపై తమ మనములఁ బోనిచ్చుటఱుదు. హిందూదేశమం దేగొప్పకార్యమునందును, వృద్ధికిఁగాని క్షయమునకుఁగాని మతము చేసినపని మరియొకటి చేయ [illegible] సౌగతమతము హిందూమతము మొదలుగాఁగల గొప్పమతము లన్నియు నొకటివెనుక వేరొకటి వాని విజృంభణకై దేశీయుల మనస్సుల నాకర్షించి యన్యచింతయం దణుమాత్రముఁ జొఱనీయక యీదేశము నీస్థితి కితర విషయములలోఁ దెచ్చినవని జెప్పవచ్చును.

ఈ దేశమందు పరిశ్రమ నాశనమునకుఁ గారణ మింకొకటి గలదు. స్వభావసిద్ధముగా నీయార్యావర్త మందు భూమి మిక్కిలి సారవంతమై భుక్తికి గావలసినంత ఫలమొసంగుచుండెను. అందుచే వ్యవసాయపు కృషి మంచి స్థితికిఁ దెచ్చుట యనవసరమై యుండెను. పూర్వకాలములో ఒకఁడు సాగుఁజేయఁగలిగినంత రత్నగర్భయని సార్థకముగాఁ జెప్పఁబడు భూమి స్వల్పపన్నులకు దొఱకుచుండుటను బట్టియు, వర్షఋతువునం దేవో రెండు విత్తనపు గింజలు చల్లిన నవి వృథాబోక, సమృద్ధిగ సస్యవృద్ధి నిచ్చుచుండుటను బట్టియు, వ్యవసాయపు స్థితి నంతకంటె మంచిస్థితికిఁ దేవలయునను తలంపే రయితుల కు అవసరము లేక యుండెను. కావున నేదోవిధమున సులభముగ నల్పప్రయత్నమున బొట్టబోసుకొని మత చర్చయం దష్టగడియలదే ధ్యానము బెట్టుకొని నందున పరలోకచింత హెచ్చి, పరిశ్రామిక వృద్ధి తగ్గినది. ఆలోచనయందును వాఙ్మయమునందును శక్తిని బెంచెడి యా సూక్ష్మకళలయందు దిగినందున చేతిపనులయందు నిపుణత నానాటికి నశించి పోయినది. కాబట్టి మొగలాయిల ప్రభుత్వమునాటికి పరిశ్రమ బీజమే క్షీణించినందున పునరుద్ధారణ జేయుట కష్టతరమాయెను. అక్బరు చక్రవర్తి ప్రభుత్వకాలములో, పైపై గాన్పించు చిహ్నములబట్టి పరిశ్రమవిద్యల వృద్ధిజేయుటకు బ్రయత్నించెను. గాని వాని ప్రయత్నములు నిష్ఫలమాయెను. చిరకాలము దు దశకాల స్థితుల ననుసరించి [illegible] గానరాక, యెవరిప్రాణము వారు, ఎవరిమానమువారు ఎవరిధనము వారు గాపాడుకొని, వారివారి జీవనము వారు సంపాదించుకొనవలసిన దినములలో నాటిన యా పరిశ్రామిక బీజములు కృశించినందున, పరిశ్రమము తిరిగి యుద్ధరించుట మహమ్మదీయ చక్రవర్తికి నసాధ్యమయ్యెను. కాబట్టి మనమిదంతయు దఱచి చూడ భౌతికాభివృద్ధికి ప్రతికూలములగు మార్గములయం దీ శీయులు ప్రవర్తించినందున అట్టివృద్ధి గగనకుసుమమాయెను.

పూర్వకాలపునాటి గతియటులుండగా వర్తమానమందుగూడ పరిశ్రమాభివృద్ధికి భంగము గలిగించు మరియొకటి సంభవించినది. ఈదేశపు గతియేమో గా

యేది సంభవించినను సంభవించు చున్నది. ఇట్లేపూర్వపు దినములలో వర్షములు మెండు. అడవు లధికము. పంటలు హెచ్చు. ధరలు తక్కువ. కఱవు లఱుదు. ప్రస్తుతమందునో వర్షములు ఖండవృష్టిగా వర్షించు చున్నవి. పంటలు అర్ధపంటలు, పాతికపంటలు తేలుచున్నవి. ఈతిబాధలు చేలకు పలువిధములగు రోగములు సంభవించు చున్నవి. కఱవులకు కఱవే లేదు. ప్రతిసంవత్సరము కఱవుబాధ తప్పడములేదు. ఇట్టిస్థితిలో మహారాజు మొదలు మాలవాడు వఱకు వ్యవసాయపు వృత్తినే ముఖ్యవృత్తిగ బెట్టుకొని యున్నారు. బ్రాహ్మణులలోను గొందరు తమయినాముభూముల బూర్వమువలె రయితులకు కవుళ్ళకిచ్చుట మాని, తామే వ్యవసాయమును జేయుచున్నారు. ఇందువల్ల వారు వ్యవసాయపువృత్తి మానుకోవలసినదని లేఖకుని యభిప్రాయము గాదు. ఆవిద్య నేర్చి కొంత యనుభవము సంపాదించిన తరువాత నేకృషిచేసినను లాభకరముగనే యుండును. రాజులు, మొఖాసాదారులుమున్నగువారు తాముపాలించెడు గ్రామములు ఋణములపాలై పోయినందున వ్యవసాయమునే ముఖ్యవృత్తిగా నవలంబించినారు. గానుగలాడి నూనెనమ్మెడు తెలుకుల కులస్థులు, నూలువడికి [illegible] కుమ్మరలు, బుట్టలు, చాపలుఅల్లి చెట్లపై జీవించెడు యీతవాండ్రు, పాదరక్షలు ప్రశస్తముగాకుట్టి యందువల్ల జీవనము చేసెడు మాదిగవాండ్లు మొదలగు వారు ారివారి వృత్తులమాని యందరు వకటేవృత్తిని యీ ్యవసాయపు వృత్తిని నవలంబించినారు. అందరు తమ ృష్టిని భూమిపై నిల్పినందున, చేతిపనులు, శిల్పనాపను ం అడుగంటినవి.

1901 సంవత్సరపు జనాభాలెక్కనుబట్టి జూడగా వ్యవసాయపు వృత్తిలో మూడుకోట్లు జనులు గలరు. 891 సంవత్సరం జనాభానుబట్టి యిందులో సగమే యుండిరి. పాటకపువాండ్రు వారివృత్తులనుమాని వ్యవసాయములో దిగినవా రీ 20 వ శతాబ్దమునుండియే యెక్కువగా గాన్పించుచున్నారు. వీరందరకు తృప్తియైన పంట భూమి యొసంగుచుండుటలేదు. పాపము కఱవులలో వీరిగోల చెప్పజాలము. అందరు యిటుల వ్యవసాయ మవలంబించుట మిక్కిలి యార్థికానర్థము. కృషితో నాస్తి దుర్భిక్షమను నార్యోక్తి వకనిని కాయకష్టపడి జీవనము సంపాదించుకొనమని జెప్పు బోధనగాని, యందరను కృషియవలంబించమని చెప్పి యరిష్టముం దెమ్మనికాదు. శతాబ్దములనుండి పీల్చి పిప్పిచేయబడినందున, రానురాను సారముతగ్గి బీదపంట పండుచుండు నీభూములకు మరింతభారము గల్గించుట మిక్కిలి యాలోచన లేనిపనియై యున్నది. ఇట్టి దుస్సహమైన భారమును పంటభూమికి యెప్పుడు గల్పించుదుమో యప్పుడు కఱవుగనో, వ్యాధిగనో పరిణమించు చుండును. ఇదిగాక ప్రతివారును వ్యవసాయము చేయుట కర్హులుగారు. 15 సంవత్సరములు బడిపంతులుగా నుండి, గొంతభూమి సంపాదించి వ్యవసాయ మారంభించినందున తనకేగాదు తదితర వ్యవసాయ దారులకును మిక్కిలి చేటు గల్గును. పెట్టుబడి హెచ్చుకావలసి యుండును. వ్యవసాయపు కట్టుబాట్లన్నియు చెడునుగాన నిది విచారణీయము. అయినను హిందూదేశములో వ్యవసాయపు స్థితి మంచిస్థితికి దెచ్చుట యసాధ్యమని జెప్పుట వలను పడదు. [illegible] యింప్వటులలో కొన్ని మార్పులును, రసాయన శాస్త్రపద్ధతుల ననుసరించి యెరువు, దుక్కి మొదలుగాగల భూమి సారవంతముగా జేయుపద్ధతులను సామాన్యపు రయితులకు నేర్పించడము మొదలగు మార్పులు మిక్కిలి యావశ్యకమై యున్నవి. ఇవిగాక పెట్టుబడిక్రింద చాలధనము కావలసి యున్నది.

ఒక వ్యవసాయమేగాక హిందూదేశములో ధనవృద్ధికి మరియొక మార్గము లేకపోలేదు. అదేదియన మన పరిశ్రామికవిద్యల వృద్ధి జేసుకొని తగురీతిని సామానుల తయారుచేయించుటయేయై యున్నది. పరిశ్రామికవృద్ధివలన హిందూదేశ జాత్యుద్ధరణ గలుగును. ఇట్టివృద్ధికి ఆటంకములు గొన్ని యున్నను, వృద్ధికి తోడ్పడు ఖనిజవర్గాది సహజమార్గములు లేకపోలేదు. ఈసందర్భమున

హిందూ దేశ పరిశ్రామిక వృత్తుల చరిత్రాంశముల గొన్నిటి జూడవలయును. 1901 సంవత్సరం జనాభా లెక్కలనుబట్టి 4 కోట్ల జనులు పల్లెటూరివారు శిల్పిపనులలో నున్నారు. ప్రతి పల్లెటూరియందును, పూర్వము గ్రామస్థులకు గావలసిన వన్నియు నక్కడనే చేసుకొనుచుండిరి. ఒక గ్రామము వేరొక గ్రామముపై నాశించుటలేదు. అలాగు ఆసించినను రాకపోకలకు మెగుమతి దిగుమతులకును తగిన మార్గములు లేవు. అందుచే నా జనులు అన్యగ్రామస్థులతో సాంగత్యము లేనందున మిక్కిలి పూర్వాచార రతులకులై యున్నారు. అందుచే పూర్వపు పద్ధతుల ననుసరించు ప్రతిష్ఠాపనములు యిప్పుడు గూడ గాన్పించుచున్నవి. అట్టి ప్రతిష్ఠాపనములలో ముఖ్యమైనవి రెండు. మొదటిది గృహ్యాపరిశ్రామిక వృత్తులు, రెండవది వర్తక సమితులు.

గృహ్యాపరిశ్రమముల లక్షణమేమన యేకుటుంబమునకు గావలసిన సామానులు వస్తువులను వారు తయారు చేసుకొనెడివారు. ఎగుమతులుగాని దిగుమతులుగాని లేవు. అదిగాక పరిశ్రమ విభాగము లేదు. రెండవదగు వర్తక సమితులలో పనివాండ్రందరు తమలో తాము గొన్ని యేర్పాటులు జేసుకొని వకసంఘముగా జేరి యొకరి నొకరు పరస్పరసహాయమునకు వడంబడికలువల్లను ప్రమాణములవల్లను కట్టుబడియుండిరి. వీరు, వారికిని, వారి పొరుగు గ్రామస్తులకును, సమీపమందున్న సంతలలో అమ్మకమగు సామానులను తయారు చేయుచుండెడివారు.

పాశ్చాత్యుల వర్తకసంఘములవలె యీసంఘపువారు వారిలోవారు యేయేపనుల జేయవలయునో నవి యేర్పాటు జేసుకొందురు. ఇట్టి సంఘముల ముఖ్యలక్షణమేమన అన్యోన్యసహాయము, స్వజాత్యభిమానము, బీద సాదలయెడ ప్రేమయు మొదలుగాగల లక్షణములు గల్గియుండును. వారి లాభములో గొంతసొమ్ము యీవిధమగు ధర్మములయందు వినియోగించుచుందురు. వారి శక్తికొలది వారమున కొకసారిగాని పక్షమున కొకసారిగాని బీదల కన్నమిడుచుందురు. పైజెప్పబడిన రెండును పూర్వపు ఆర్థికప్రతిష్ఠాపనములలోముఖ్యమైనవి. ఇవిగాక మరికొన్ని సంఘములు లేకపోలేదు. చిన్నచిన్న పట్టణములలో కార్యాలయవిధానములుగలవు. ఇట్టికార్యాలయములలో ముఖ్యుడువకడుండును. మేస్త్రీఅనబడుయట్టివాడు, పనిలేని మరికొందఱ గూర్చుకొని వారికి ముందు భుక్తికి గావలసిన పెట్టుబడిపెట్టి పనిముట్లు మొదలగునవి యమర్చి, వస్తువుల జేయుటకు గావలసిన సామగ్రి నిచ్చును. ఇందువల్ల నొకవిధమైన పరిశ్రమ విభాగము గలుగును. ఏపని జేయుటకైనను కొలదికాలమే పట్టును. అందుచే మదుపుతగ్గును. ఈపనివాండ్రు వారి మజూరీ తీసికొనెదరు. లాభనష్టములు మేస్త్రీవైయున్నవి. ఇట్టి సంఘములు ఢిల్లీ, ఆగ్ర మొదలగు పట్టణములయందు గనుపించుచున్నవి. ఇట్టియేర్పాటు నొక కారుఖానాయను పేరున అక్బరు చక్రవర్తి తనకోటలో నేర్పాటుజేసినాడని వినుదుము. ఈకారుఖానాయేర్పాటు లిప్పటికిని వచ్చుచున్నవి.

2. మరియొకవిధమైన పరిశ్రమ యేర్పాటు యిండియాలోనున్నది. అది కర్మాగార ప్రతిష్ఠాపనములవల్ల గలుగుచున్నది. ఇది యూరోపియనులవల్ల యేర్పాటుజేయబడినది. ఇవి కొన్ని యార్థికానర్థములవల్లను, అప్పటికి దేశమం దేవిషయములను స్థిరభావము పొడమనందునను, గతశతాబ్దములలో సగమువరకు యిట్టి కర్మాగారములు మూర్తిత్వమును బూర్ణముగ జెందలేదు. గత శతాబ్దములో బొంబైనగరములో ప్రత్తివడకు యంత్రములు యేర్పరుపబడినవి. రానురాను రాకపోకలకనువగు మంచి మార్గము లేర్పడినకొలది పెక్కుచోట్ల రయిలుస్టేషనుల దరి నిట్టి కర్మాగారము లుత్పన్నమైనవి. ఇందులో పరిశ్రమాభివృద్ధి చాలమట్టుకు గాన్పించుచున్నది. యంత్రసహాయమువల్ల పరిశ్రమములు జేయబడుచున్నవి. పనివాండ్రుయంత్రములు నడుపుచుందురు.

పాశ్చాత్యవిషయములు చూచిన వారికివి హిందూదేశమందు లేనట్టుగానే గాన్పించును. ఇందుకు కారణమివి యచ్చటచ్చట చెదరియున్నందున లేనట్టుగా నగుపడును. అయితే యూరపుదేశమందువలె సంఘము



The King of Bulgaria.

బల్గేరియా రాజు గారు.



The King of Servia.

సర్వియా రాజుగారు.



The Late King of Greece. గ్రీసు రాజుగారు.



The King of Montenegro. మాంటినీగ్రో రాజుగారు.



Blocks by Messrs D. B. Neroy & Co.

Mahamad Shevket Pasha. Nazim Pasha. Ali Riza Pasha



మహమ్మద్ షెవ్ కెట్ పాషాగారు. నాజిం పాషాగారు. అలి రిజాపాషా గారు.

General Dimitriff.



బల్గేరియా సేనాధిపతి డిమిట్రిఫ్ గారు.

The Commander-in-Chief of the Bulgarian Army.



బల్గేరియా సర్వసేనాధిపతిసావోఫ్ గారు.

Blocks by Messrs D. B. Neroy & Co.

The Hon. Rao Bahadur B. N. Sarma.



గౌరవనీయులగు రావుబహదూర్
బయ్యా నరసింహేశ్వర శర్మగారు.

The Hon. Mr. Srinivasa Sastri.



గౌరవనీయులగు శ్రీనివాస శాస్త్రిగారు.

The Hon. Dr. Nair.



గౌ॥ డాక్టరు నాయరుగారు.

The Hon. Mr. T. V. Seshagiri Iyer.



గౌ॥టి.వి. శేషగిరి అయ్యారుగారు.

Mr. K. C. Sen I. C. S.




కె. సి. సేన్‌గారు.

Mr. Madireddi Kesavarao Naidu.



మాదిరెడ్డి కేశవరావునాయడుగారు.

Mr. Rama Pandit.



రామా పండిట్ గారు.

Blocks by Messrs R. Venkiah Brothers, Madras.

ను బ్రారంభించినవి. కర్మాగారములను, కార్యాలయ విధానములను వృద్ధిజేసి, క్షీణించియున్న దేశీయపరిశ్రమముల పునర్జీవముగ జేయవలసియున్నది. ఇటుల కర్మాగారములు వృద్ధిబొందిన కొలదిని పరిశ్రమ విభాగమును పొందనగును. విస్తార మవసరములేని రత్నకంబళ్లు మొదలుగాగల పనులలో పరిశ్రమ విభాగమంత జరుగుట లేదు. కొలది పనివాండ్రతోనే నవి జేయించుట లాభకరము. గాని జనసామాన్య మంతటికిని మిక్కిలి అవసరమగు బియ్యము, ఆముదము, నూనె, నూలు మొదలగు జేయు కర్మాలయములలో పరిశ్రమవిభాగము మిక్కిలి యవసరమును, లాభకరమునైయున్నది. గాన పెద్దవర్తకులిది యవలంబించవలయును.

మూడవవిషయము సంఘసంస్కరణము. శిల్పాదిపనులు మనుజులయొక్క స్వభావమునుబట్టి చిత్తము, బట్టి యున్నందున సంఘమునుగురించి జెప్పక వీలులేదు. పురోవృద్ధికి ప్రతికూలములగు సంఘమందుగల పద్ధతు మార్చుకొనుట మిక్కిలి యావశ్యకము. మతమందెక్కువ పట్టుదలగలిగి సర్వకాల సర్వావస్థలయందు మత ర్చయే బెట్టుకుని యాధ్యాత్మికచింతయే గలవారికి భౌ కాభివృద్ధి సున్నయని యిదివరకే వ్రాయబడినది. ఐహి మునకును, ఆముష్మికమునకు సమానదృష్టినుంచ ఒకదానిని విడిచి రెండవ విషయమందే చిత్తవృత్తిని ల్పినందున గలిగెడు వృద్ధి పూర్ణమైన వృద్ధిగా నేరదు గాన మార్పులు మిక్కిలి అవశ్యకమైయున్నవి.

# శృంగార నిషేధము.

[ గడ్డం కొండారెడ్డిగారు. ]

ప్రథమమున ప్రస్తుతకాలమున దెలుగుబాసయం దెట్టి గ్రంథములు వ్రాయబడవలయునను సంశము విచారణీయము. సకల దేశములందును సకల కాలములయందును గ్రంథరచన కెద్దియైన బ్రయోజన ముండీననేగాని యవి రచియింపఁబడుట లేదు. కవుల భావములు కాలానుసరణముగ మారుచుండును. శృంగారము నవ రసములలో బ్రధానమైనది. ఉత్సాహజనకమైనది. కాన శృంగారమనవసర మనుటకు వీలులేదు. కాని ప్రస్తుతము మన యాంధ్రదేశస్థితినిఁబట్టి విచారించిన నది తెలుఁగు కబ్బములయందు విచ్చలవిడిగను జర్విత చర్వణముగను నుపయోగింపబడుట నవసరము. దేశమాదరిద్ర దశయందున్నది. విద్యయల్పము. ఐకమత్యముశూన్యము. దురాచారములా గణనాతీతములు. ఇట్టిస్థితియందు దేశాభిమాన లేశముగల విద్యావంతుల యంతః కరణము విచార సహితములు. తృప్తికిని, సంతోషమునకును, సుఖానుభవమునకును సమయముకాదు. ప్రాచ్య దేశములు మాంద్యమును విడనాడుచున్నవి. భరతఖండమునదదంతర్గతమగునాంధ్రదేశమును నీయవస్థను జెందుటసహజము. దృఢమైన దేశభక్త్యుత్సాహములును, స్వార్థపరిత్యాగమును, దురహంకార వర్జనమును అవసరములు. తక్కుగల భారతీయులతో సమముగ నాంధ్రులు నీసద్గుణము నవలంబించు టవసరము. కవులు తమ మృదుమధుర కవితాధారచే జనులహృదయక్షేత్రములయందీ సద్భావబీజముల మొలకెత్తునట్లు చేయుట పరమావశ్యకము. వీరకరుణారసములు ప్రధానములుగ గ్రంథములను రచించుటుత్తమము. శృంగారమును నయితము తదవిరోధము

జీయు స్మృతులు "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అని కావ్యపఠనమును నిషేధించినవి. మల్లినాథ సూరిగా వ్యములని పైననిర్దేశించిన కావ్యశబ్దమునకు దుష్ప్రబంధములను జూడరాదనియు రామాయణాదులు కావ్యములే యైనను సత్కావ్యము లేగనుక బఠింపఁదగుననియు వ్రాసిరి. భారత రామాయణాదులను హంసవింశతి శుకసప్తత్యాదుల నొకవర్గములోఁ జేర్చుట గణికలలో గులాంగనల జేర్చినట్లుండును. విద్వాంసులకు జిత్తచలనము కలుగదని చెప్పుట సరికాదు. వ్యాసులవారు "బలవానింద్రియగ్రామోవిద్వాంసమపికర్షతి"ఇంద్రియసమూహము బలవంతమైనది. కాన నది విద్వాంసుని సయితమాకర్షించును. అని వ్రాసియున్నారు. కావ్యములు మనస్సు నాకర్షింపజాలవనుట సరికాదు. ఎందువలన ననగా నాలంకారికులు "కాంతాసమ్మితతయోపదేశయుజే" కావ్యము కాంతవలె నీతి నుపదేశించును. అని చెప్పియున్నారు. పరిషత్తువారజ్ఞులనికాని వారి యభిప్రాయములు సరికావనిగాని నేను జెప్పుచుండలేదు. వారియందును వారి ప్రయత్నములందును మిక్కుటమగుభక్తి నాకుకలదు. న్యాయమైన హేతువుచేత వారుగాని మఱియెవరుగాని నాయభిప్రాయమును మార్పవచ్చును. శృంగారమును సందర్భమును విడిచియును నతిగను నుపయోగించరాదుకాని కావ్యములందు శృంగార మనవసరమనియు బొత్తుగా వదలివేయ వలయుననుటకు వీలులేదు. ప్రస్తుతము శృంగారమనగా స్త్రీవర్ణనమనియే యందఱికిని దోఁచుచున్నను సృష్టియందలి యానందకరములగు పదార్థములను వర్ణించుటంతయు శృంగారమే. ప్రభాతకాలమునందు మగఱాలవలె బ్రకాశించు మంచు బిందువులచే మనోహరములుగనుండు పచ్చని బయళ్లును, పరిణతసస్యసమృద్ధములై ప్రేక్షణీయములై యలరు పొలములును, సుందర మందిరములును, తరులతాకుంజ మంజులంబులగు వనంబులును, గిరికందరంబులును నందలి సెలయేఱ్లును మొదలగునవి కనులకు గట్టినట్లు వర్ణింపరాదె. వాని ననుసరించి భక్తిరసము పొంగిపొరలునట్లు వానిని నిర్మించిన భగవంతుని నిర్మాణ చాతుర్యంబును సర్వజ్ఞత్వాదిశక్తులను వర్ణింపరాదే. నీతిబోధకములగు సంవాదములనందు గల్పింపరాదా. స్త్రీవర్ణనమైనను పాత్రానుగుణముగ దేలికగా వర్ణింపవచ్చును. పాశ్చాత్యదేశములందు శృంగారప్రధానమగు కావ్యములు లేవా? యని కొందఱడుగవచ్చును. కలవుకాని వానితోఁగూడ దేశాభ్యుదయకర గ్రంథములుగూడ మెండుగనున్నవి. ప్రస్తుతము [illegible]వ దేశమునందున్న శృంగారగ్రంథముల కనుగుణముగ [illegible] గ్రంథములు లేవు. వారు మహోన్నతదశయందున్నారు. వారికి శృంగారగ్రంథములును దన్మూలముగ నానందానుభవమును సహజములు. మనమా పరతంత్రులము. దరిద్రులము. విద్యావిహీనులము. కాన మనకది యసహజము. మన చిలుక రాయభారములతోను, నాయకీనాయక వర్ణనలతోను బనియేమి? గృహదహన సమయమందు సంగీతమునుబాడి యానందించువానివలె హాస్యాస్పదులమై చెడిపోఁగలము. కావున మనకావ్యము లిక్కాలమున వీరకరుణారస ప్రధానములును బోధప్రదములుగ నుండవలయును. కావుననో యాధునికాంధ్రకవివతంసులారా! సత్కార్య కరణోత్సాహాగ్ని నాంధ్రజనుల హృదయవేదికలయందు బ్రజ్వలించునట్లు చేయుడు. రాలనైనను గరగించునట్టియు మోడులనైన జిగుర్పజేయగలట్టియు మీ కవితారసమునకు నే కఠినుని హృదయము కఱుగదు? ఏమందబుద్ధి మానసము వికసించదు? పండితులు పామరుల కొఱకును, ధనికులు దరిద్రుల కొఱకు నుపయోగపడునట్లు వారియాన చ్ఛక్తిని వినియోగించుట దైవశాసనమని నమ్ముడు. కవులే దేశోద్ధరణమునకు మూలబీజములు. మీకందఱికును సర్వేశ్వరుడట్టి యుత్సాహకార్యనిర్వహణ సామర్థ్యముల నొసంగుగాత!

# శతావధానములు.

[తిరుపతి వెంకటేశ్వర కవులు.]

అవధానము, అనునది మొట్టమొదట వేదాధ్యయన పరులకుండెడి నిరుపమాన శక్తులలో నొక్కటియనియు దానిని గొన్ని వందల సంవత్సరములనుండి కొందఱు మహాకవులు కవితాశక్తులలో నొకదానినిగాఁ గైకొని నేఁటి యిరువదవ శతాబ్దము కొండొక [illegible]ఱకును మంచి గౌరవముగాఁ గాపాడికొనుచు వచ్చిరనియు [illegible] భావింప వలసియున్నది. ఇది వైదికపండితులనుండి కవులనుకరించిరను సంశయము నుసాధించుటకు విశేషప్రమాణముల నీవలసిన యావశ్యకతలేదు. నేఁటి వఱకును వేదాధ్యయనపరులకుఁ బరంపరా ప్రాప్తముగుచున్న "సుబ్బావధాని, నీలకంఠావధాని," లోనగు బిరుద నామములంబట్టియే తెలిసికొనవచ్చును. అవధానమనఁగా చిత్తైకాగ్రత. కావున నియ్యది ముఖ్యముగా వైదికుల కావశ్యకమని తజ్ఞులకు దెలియరానిదికాదు. దానింగూర్చి యిట విస్తరింపఁ బనిలేదు. విస్తరింప బూనుదుమేని? అచుంబిత ప్రక్రియయగు వేదవిషయమునకుదిగి, వచ్చియురాని విషయమును వ్రాయ సాహసించి నేఁటి కొందఱు నవనాగరికులంబోలెఁ బరిహాసపాత్రులము కాకతీరము. గాన నీవైదికవిషయము నింతకన్న స్పృశింప నవకాశములేని మేము అవధానపదము కవులిటీవలఁ గవితావిషయమునఁగూడ వాడఁజొచ్చిరను నంతవఱకు మాత్రము వ్రాయుటతోఁదృప్తి నందుచున్నారము. అవ పూర్వక ధాఞ్ ధాతువునుండిజనించిన యీ శబ్దపుఁ బ్రసంగమును నిన్న మొన్నటిదాఁకఁ బ్రతికవియుఁ బ్రతిపండితుఁడును గడుగౌరవపాత్రముగను అనన్యసాధ్యముగను దలఁచుచుండెడివారు. ఇప్పటికిని తజ్ఞులట్లే తలఁచుచున్నవారు. నిజమున శయ్యావధాన విషయ మట్టిదియేకాని యిటీవలఁ గొందఱు పండితంమన్యులు వ్రాయుచున్నట్లు సర్వసామాన్యమైనదికాదు. కావుననే పూర్వకాలమున దీని నాచరించువారలకు, శతఘంటా_సురత్రాణేత్యాది బిరుదములు తాత్కాలిక ప్రాజ్ఞులచే నొసంగబడుచుండెడివి.

మ॥ శతలేఖిన్యవధాన పద్యరచనా సంధా సురత్రాణ చి
హ్నితనామా? జరికొండ ధర్మసుకవీ? నీవాగ్విశేషమ్ములా
సితికంఠోజ్జ్వలజూట కోటర కుటీశీతాంశురేఖాసమ
న్వితగంగాకనకాబ్జ నిర్భర రసావిర్భూతసందర్భముల్ ॥

(చిత్రభారతము)

దీనింబట్టియేమి, ఇటీవల భట్టుమూర్త్యాది మహాకవులీ యవధాన రచన నొకగొప్ప శక్తిగాఁ బరిగణించుటచేత నేమి పరప్రత్యయనేయబుద్ధులు సైత మియ్యది సామాన్యశక్తికాదనియుఁ బురాకృత పుణ్య పరిపాకలభ్యమనియు విశ్వసించి తీరవలసియుండును. పూర్వమహాకవులలో దీని నాచరించి పేరుగొన్న వారెందరో సరిగా నిర్ధారణఁజేసి వ్రాయుట మావంటి సామాన్యులకు సాధ్యమగుపని కాకుండుటంజేసి మా చిన్నతనమున నీయవధానమున విశేష ప్రతిష్ఠవహించిన శ్రీమదభినవ పండితరాయలవారినిగూర్చి మాత్రమే యించుకవ్రాసి నేఁటి పండితంమన్యుల దురూహలను మరలించి వీరివ్రాఁతలచే డోలాయమాన మానసులగు కొందఱకు సంశయనివృత్తి నొనర్ప నుంకించుచున్నారము. పైనుదహరించిన "అభినవ పండితరాయలవారు, నూజివీడు పురనివాసులు. శ్రీవైష్ణవులు. సుప్రసిద్ధ శతావధానులు. వీరు సర్వశాస్త్రములయందును శాస్త్రార్థమొనరించి తజ్ఞులను మెప్పించుచుండువారను సంశయము మేము ప్రత్యక్షముగా నెఱుఁగుదుము. ఈయంశమునకుఁగొన్ని యుదాహరణములుకలవు. అందొకటి యుదాహరింపఁబడుచున్నది. ప్రస్తుతకాలమునఁ గృష్ణాడిస్ట్రిక్టులోనిదిగా భావింపఁబడుచున్న తాడేపల్లిగూడెపు ప్రాంతమందున్న పెంటపాడుగ్రామమునకీ మన మాడభూషి వేంకటాచార్యులవారు ప్రతివత్సరమును దయచేయుచుండెడివారు. ఆకాలములో నా పెంటపాడుగ్రామమున కనతిదూరమందున్న "కడియొద్ది" యను చిన్నిపల్లెయందు రేపల్లెయందు శ్రీకృష్ణభగవానుని తెఱఁగున నొకమహాభాగుఁడు వర్తించుచుండెను. ఆమహాపురుషుఁడు "మద్దర్శనీవేదిచర్ల బ్రహ్మయశాస్త్రి గురువరేణ్యుఁడు ధరాభరణమాకు" అను మా సీసపద్య పాదమున నుదాహరణమైన జగదేకపండిత శిఖామణి, శ్రీ ఆచార్యులవారీ మాగురువరేణ్యులను సగౌరవముగా సవిద్యార్థికముగా నాహ్వానమొనర్చి మాగురువరులకును దత్సమీపమునందలి మార్కొండపాడు, గ్రామనివాసులగు చిలుకూరి పండిత చతుష్టయమునకును వ్యాకరణమునందు శాస్త్రార్థమును జరిగించి అందు మాధ్యస్థ్యపదవినిదామే వహించి గుణాగుణవివేచన మొనరించి యుభయకక్షుల పండితులచేతను మిగుల నుతింపఁబడదగిన కాశలమును జూపుచుండెడివారు. అదిమేము ప్రత్యక్షములోఁ జూచిన యంశము. దీనివలన మన సుప్రసిద్ధ శతావధానకవిగారికిఁ బాణినీయశాస్త్రమందెట్టి ప్రవేశమున్నదియో విజ్ఞులు తెలిసికొనవలసియుండును. మార్కొండపాటి చతుష్టయమనఁగాఁ బ్రక్రియాభాగములోనందె వేసికొనినదియని యెఱుఁగనివారేలేరు. ఆనలుగురన్నదమ్ములును మహావైయాకరణులు, కాశీపండితులు, వారిగురువులు జాగేశ్ పండిజీవారు. వీరు పరిభాషేందుశేఖరముపై, హైమవతి, అను

వ్యాఖ్యానమును రచించినవారు. దాని సారమును జక్కఁగాఁ దెలిసి వ్యాకరణమె జీవనముగా సర్వకాల సర్వావస్థలయందును గాలక్షేపమొనర్చిన మార్కొండపాటివారును, వ్యాకరణమునందేకాక తర్కశాస్త్రములయందుఁగూడ విశేషప్రజ్ఞలుగల శ్రీ చర్ల బ్రహ్మయ్యశాస్త్రిలవారును శాస్త్రార్థ మొనర్చుచుండఁగా నెంతపండితుఁడైనచో మాధ్యస్థ్య మొనర్ప జాలఁడినో నేఁటి పండితంమన్యులు గుఱితింపఁజాలకున్నను శేషించియున్న ఆపండితశాఖవారెఱుఁగకపోరు. ఇట్టి మహాపాండిత్యము వ్యాకరణమునందుఁగల మన యాచార్యులవారికి వ్యాకరణములో గురువులెవ్వరో సుంత వ్రాయవలసియున్నది. కాని యావిషయమును ముందు వ్రాయ దలఁచి ప్రకృతము వీరికిఁగల తర్కశాస్త్రానుభవమును గూర్చి కొండొక ప్రస్తావించుచున్నారము. వీరొకమాఱు వైకలూరు గ్రామమునకు విచ్చేసిరఁట? ఆగ్రామము సుప్రసిద్ధులును నిరుపమానులునగు సపరగౌతమ మహామునులు వసించెడిచోటు. ఈగౌతములు బ్ర॥శ్రీ, పరిమి శివయ్యశాస్త్రిలవారు. ఇట్టి శివయ్యశాస్త్రిలవారుకూడ నద్భుతపడి మెచ్చునట్లొక సందర్భమున మన యాచార్యులవారు న్యాయశాస్త్రవిషయమునఁ బ్రవర్తించిరని శ్రీ శాస్త్రిలవారి పుత్రులును వైయాకరణులును మాకుఁ బరమమిత్రులునగు బ్ర॥శ్రీ, పరిమి నృసింహశాస్త్రిలవారు నుడువఁగా వినియుంటిమి. ఇట్లే మన శతావధానిగారు వేదాంతాది శాస్త్రములయందుఁగూడఁ దజ్ఞులను మెప్పించియుండుటనుగూర్చి కొండొక వ్రాయవలసి యున్నను గ్రంథవిస్తరభీతిచే నంతను లకుఁ గలుగఁజేసికొనక యిమ్మహామహుఁడు సర్వశాస్త్రసంపన్నుఁడని మాత్రము నొక్కి వ్రాయుటతోఁ దృప్తిచెందుచున్నారము. ఈయనఘుని గురువుంగూర్చి వ్రాసెదమని వెనుక వాక్రుచ్చియున్నారము. కాని ఆయా యాశాస్త్రములు వీరెవరియొద్ద నభ్యసించిరనుటకును సాహసింపఁజాలము.

శ్లో॥ అనభ్యాసేవిషంశాస్త్ర మజీర్ణేభోజనం విషం॥

అను తెలుఁగున నితరవిద్యలవలెఁగాక శాస్త్రములు గురువులేక రాఁదగినవి కావని కొండొక యెఱిఁగిన మేము వీరికిమాత్రము గురుశుశ్రూష లేకయె వచ్చినవని వ్రాయ సాహసించుటకుఁ గొంకుచున్నారము. ఎవరేని గురువులుండిరని కొందఱు చెప్పుదురుగాక. ఆగురుత్వముకూడఁ గొలదికాలముమాత్రము నిమిత్తమాత్రముగా జరిగియుండునేమో గాని యంతకెక్కువదియైయుండదు. ఈయేక సంథాగ్రాహికి ముఖ్యగురు వవధానశక్తియే యని వ్రాయుటకేవిధమైన సంశయమునులేదు. అట్లే కానిచో నక్రమముగా సర్వశాస్త్రస్వతంత్రత్వమెట్లు లభించెడిని. కావున నీయవధానశక్తి కెట్టి గౌరవస్థానము నొసంగవలయునో ప్రాజ్ఞులు విచారింతురుగాక. శ్రీ మాడభూషి వెంకటాచార్యులవారి యవధానశక్తిని గీర్తిశేషులగు శ్రీశ్రీ రావు గంగాధర రామారావుబహద్దరువారును మతికొందఱు రాజులును శ్రీపనప్పాకము అనంతాచార్యులవారలోనగు సుప్రసిద్ధులును నెఱుఁగుదురు. ప్రత్యక్షముగాఁ గనివినియున్న యమ్మహాత్ములు వర్ణింపవలసిన విషయమును నెఱిఁగియు నెఱుఁగని ప్రాయములో వీరినొకపరిమాత్రమె విద్యార్థిదశలో సందర్శించిన మేము వ్రాయఁబూనుట 'ఉద్బాహురివవామనః' అను కాళిదాసోక్తి కుదాహరణమగునుగాన నీసాహసమును దలనిడికొనక వీరికెట్టి యద్భుతపాండిత్యమును గలిగించిన యవధానశక్తినిగూర్చి చదువరులు సుంతవిచారింపవలసియుండునని మాత్రము ప్రార్థించుచున్నారము. అవధాన మనునది ధారణావిశేషైకసాధ్యము. ధారణయనునది బుద్ధికి ముఖ్యముగా నుండవలసినగుణరాజము. ఇది ప్రతిబుద్ధికిని నొంచెమో గొప్పో కలిగియుండును. శ్లో॥ ధీర్ధారణావతీ మేధా, అని నైఘంటుకులు వ్రాసిరి. ఏబుద్ధికి నియ్యదినిరవధికముగా నుండునో అట్టి మేధకలవారే నిజముగా నవధానిబిరుదమును దాల్పఁదగువారు. అట్టి యవధానులలో నిటీవల మన మెఱిఁగినంతలో నగ్రగణ్యులు శ్రీ మాడభూషివారేయని చెప్పకతప్పదు. ఈయనకుఁగల గౌరవము నిరవధికము. ఈయన పేరు విన్నంత నెట్టిపండితులును, ఎట్టి మహోద్యోగులును, ఎట్టి నృపాలురును, అనితర సామాన్య గౌరవసూచకమగు నొకవిధమైన యక్కజమును దెల్పు కళను దమతమ ముఖపద్మములందు బ్రకటించెదరు. ఇట్లెల్లజగములచే నేకవాక్యతగాఁ గొనియాడఁదగు మహాయశము నాచార్యులవారి కొసంగిన పరదేవతయెవరు? అవధానమే. అట్టి యవధానమును దెలిసియుఁ దెలియని జ్ఞానముతో నిరసించుచు నేవో కల్లబొల్లి వ్యాసములను గిలుకునట్టియు వెఱ్ఱిమొఱ్ఱి యుపన్యాసములను వదలునట్టియు సాహసుల నేమిచేయవలయును? ప్రాజ్ఞులగువారు తగు సభాస్థలములయందుఁ దగురీతిని మందలింపవలయును? అవధానమనఁగాఁ జిత్తైకాగ్రత అని మున్ను వ్రాసియుంటిమి. తేలిన నిష్కృష్టార్థ మేమనఁగాఁ బ్రమాదరాహిత్య మనియనుకొనుఁడు. కావుననే, అనవధానతాపదమునకు నైఘంటుకులు ప్రమాదమని యర్థము వ్రాసియున్నారు. శ్లో॥ ప్రమాదోఽనవధానతా" ప్రమాదరాహిత్యముగల మేధ యనునది దివ్యజ్ఞాన సదృశము. దాని నార్జించుట పురాకృతపుణ్య పరిపాకము లేనివారికి సాధ్యమెన్నఁటికిని గాదు. 'యోగభ్రష్టః ప్రతిభా వాక్ భవతి' అని యార్యోక్తులు చాటించుచున్నారు. శ్లో॥ ప్రజ్ఞాం నవనవోన్మేషశాలినీం ప్రతిభాం విదుః" నవనవోన్మేషశాలిని యగు బుద్ధివిశేషమే ప్రతిభ. ఇయ్యది పూర్వజన్మమున విశేషించి యోగశాస్త్రపరిశ్రమ మొనర్చి యందేదేనిగారణాంతరమున సంగ్రస్త కృత్యత గలుగకున్నప్పుడంత దనుక నొనర్చిన యోగాభ్యాసమునకుఁ బ్రతిఫలముగా నీజన్మమున నేర్పడునట్టి యున్నతపదవులలో నొకటియని పెద్దలుచెప్పుదురు. ఈయర్థమునకు గీతావాక్యముకూడఁ దోడగుచున్నది.

"శ్లో॥ ప్రాప్యపుణ్యకృతాఁల్లోకానుషిత్వాశాశ్వతీస్సమాః
శుచీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టోఽభిజాయతే
అథవాయోగినామేవ కులేభవతి ధీమతాం
ఏతద్ధి దుర్లభతరం లోకేజన్మయదీదృశం
తత్రతంబుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం" ॥

ఇట్టి ప్రతిభావిశేషద్యోతకమగు నవధానము నింద్యమనుట పొరపాటు. ఇయ్యది రోగగ్రస్తతా సూచకమను హేతువున

"శ్లో॥ పూర్వపుణ్యవిభవవ్యయ లబ్ధాస్సంపదో విపద ఏవవిమృష్టాః"

అను శ్రీహర్షోక్తింబలెఁ జమత్కార ప్రధానమగు వచోరచనసంబూను వారుదక్కఁ గేవలాసూయచేఁగాని యనభిజ్ఞతచేఁగాని తత్త్వశూన్యతచేఁగాని యవధానశక్తిని దూషించువారిని మేము నుతించి వ్రాయుటకిప్పటికిఁ దగినపదములుమాకు దొరకకున్నవి. ఎట్లోతమ వాచాటకత్వమును వినియోగించికొనక యనుచిత ప్రక్రియలలోనికిదిగి చిరకాలము నుండి మహామహులచే గౌరవింపఁబడు విద్యలను నిరసించి పెద్దపని చేసితిమని సంతసించుచు నంతం దనివిసనక యేవచనముతోడనో యేకవిత్వమునో ప్రకటించుచుఁ బ్రసక్తిగాని ప్రసక్తిగానందుఁగూడఁదమతమ ప్రయోజకత్వమునే వెళ్లఁగక్కు పండితంమన్యులంగూర్చి యెంతవ్రాసినను దనివితీరదు. వీరు ప్రత్యక్షములోఁ దటస్థించినచో నడుగఁదలఁచి ప్రకృత మింతతోఁ వదలుచున్నారము. ఈయనయు నవధాని నని కొంతకాలము తలద్రిప్పికొన్నట్లు వినవచ్చెడిని. అట్టివోనితఁడు జగదేక పూజ్యమును సర్వవిద్యా మూలకందమునగు నవధానశక్తినిగూర్చి పిచ్చిపిచ్చి ప్రసంగముచేసి తజ్ఞులచేవెంటనే యేల ఖండింపఁబడినట్లు పత్రికలలో మనకు గోచరించుచున్నది యని ప్రశ్న రావచ్చును. వినుఁడు ఒక మహావిషయము నొకరు ప్రదర్శించినపిదప నాఁడు మొదలుగఁ గొందఱు బాలురు దాని ననుకరించుట సహజమైయున్నది. మహావిషయమే కానక్కఱలేదు సామాన్యవిషయమైనను అనుకరణమునకు లక్ష్యమైతీరుచున్నది. పీర్లపండుగలలో నొకఁడు పెద్దపులివేషమును వేసికొని తిరుగఁగాఁజూచి ప్రతి పసిపిల్లవాఁడును వాని చేష్టల ననుకరించుచుఁగొన్నాళ్లు కాలయాపనమొనర్చి యంతట విరమించు చుందురు. అట్లే యీమన యుపన్యాసకుఁడుగారును ఎవరినో యవధానులనుజూచి కొంతప్రయత్నించి యందుఁ గృతకృత్యత నొకింతేని గనఁజాలకఁ పరుగిడలేక యేదో అనివాడను సామెతగా "తనకలిమి యింద్రభోగము" అను పద్యమును జ్ఞప్తికిఁదగిలించుచు నవధానములనుగూర్చియు వాని నాచరించువారలంగూర్చియు వారిని బ్రోత్సాహపఱచువారింగూర్చియు 'పగటివేషగాండ్రు' లోనగు ప్రల్లదముల నొకించుక గిలుక మొదలిడుచు వాగ్వ్యయ మప్పుడప్పుడు సేయుచుండఁగాఁ దజ్ఞులు కొండొకవారించుచువచ్చిరనియు నావారణము పూర్తిగా జరుగకుండుటచే మరల మరలఁ దన పండితంమన్యత్వమును బీలుపడినప్పుడెల్ల వెళ్లఁబుచ్చుచుండెననియు నంతలోఁ దనకొకింత పదవిసూడఁ దటస్థింపఁగాఁ "జలిచన్నముబలు" మను సామెతగా మఱింత ధైర్యముచిక్కి మిక్కిలిగాఁ బరాక్రమించి తనవాగ్ధోరణిని ప్రపంచమునఁ జాటింపఁ బ్రారంభింపఁజొచ్చెననియు నూహింపనయ్యెడిని. ఈపండితమ్మన్యుఁడుగారు తనకుఁజేతఁగాని ప్రతివిషయమును నిట్లు దూషింప మొదలిడువారే యైనచోఁ దమకునొకింతమాత్రమే ప్రవేశముకల యింకనొక విద్యలోని యున్నతపరీక్షలనిచ్చిన మహాభాగులను వారిచ్చిన పరీక్షలనుగూడ నిందింపవలసియున్నది. అట్టిపనికి వీరేల పూనకుండిరో యని శంకింపవలసి యున్నది కాని మన మన్యుఁడుగారీ యవధాన దూషణమునుతలపైఁబెట్టికొనుటకుఁ దమకు నలవడకుండుటయే కేవల హేతువుగాఁ దైకొనినట్లు తోఁచదు. మఱొక్క హేతువుగూడనున్నది. ఆహేతువు శాఖాభిమాన పిశాచావేశము. అయ్యది యంతర్గతజ్వరమువలె వీరివ్రాఁతలోఁ గొండొక గన్పట్టుచుండును. దానిని గప్పిపుచ్చుటకుఁగూడ మన్యుఁడుగారు ప్రయత్నించుచుందురుగాని యది వెలికిబుసకొట్టుచునేయుండును. అయీహేతువులంబట్టి వీరిందు దిగి పని చేయుచున్నారు. వీరుపని యెంతచేసినను తజ్ఞులవధానములను మన్నించుటయేకాక బ్రహ్మోత్సవములఁగూడఁ దత్కర్తలకొనర్చుచున్నారు. అట్టిచో వీరిపరిశ్రమ యెందులకు శేయవలయునో? యని సంశయించుచున్నారము. భళితు, దీని నిటులుంతము. పెద్ద గొంతుకతో బిగ్గరగా నవధానములను దత్కర్తలను దూఱుచుఁబట్టుచున్న మన పండితంమన్యుఁడుగారి ఘోష యిప్పుడుగాకున్న నెప్పుడేని సఫలమగునా? యని శంకింపవలసియున్నది. కాకేమి యెప్పుడో కాదు. ఇప్పుడే సఫలమగుచున్నది. ఎట్లందురా? ఇంతకుమున్న దాహరించిన నిరంకుశచర్యులగు శ్రీ మాడభూషి వేంకటాచార్యులవారు గతించినమీఁదట నీయవధానములు కేవలానుకరణమాత్ర ప్రయోజనములు కావలసిన కాలము దాపరించినది. ఇటీవల నీయవధానము లొనర్చువారికిఁ బాండిత్యముతోఁగాని మఱియితర శక్తులతోఁగాని లవమును సంబంధములేకు సరిగదా తుదకు దీనికి ముఖ్యమగు ధారణతోఁగూడఁ బనిలేదు. ఒకరికో యిద్దఱికో మూఁగురకో చెప్పి అవుఱునాఁటి నుండి 'శతావధాని' అని బిరుదును వ్రాసికొన మొదలిడుట సహజముగాఁ గన్పట్టుచున్నది. ఇది గవర్నమెంటువారు పరీక్షించియిచ్చు బిరుదుల లోఁజేరని హేతువున సర్వసాధారణమైపోయినది. ఈ బిరుదధారుల పరిశ్రమయు వీరిస్థితియు మాత్రమే యెఱిఁగిన మన మన్యుఁడుగారు లోఁగుచురయక "మూలచ్ఛేదీ తవపాండిత్య ప్రకర్షః" అన్నట్లు విజృంభింపఁదొడఁగిరి. కావున నవధానమన నేమో సుంతవారికిఁ దెలుపుట యేకాక అదియొనర్చి పేరందిన మహాభాగులను జేర్చి కొండొక వాక్యనకుఁ బవిత్రత గలిగించుకొనుచున్నారము. మఱియు నీమన్యుఁడుగారిచే వృథాగా నిరసింపబడుచున్న యీయవధానవిద్య సర్వసామాన్యముగా నభ్యసింపఁ దగినది కాదనుట కింకొక యుదాహరణము నిచ్చుచున్నారము. వేదశాస్త్రములయందేకాక వీణావాదనాది సమస్తకళలయందును మహాప్రవీణులైన శ్రీ కిష్టు కృష్ణమూర్తి గారాశువునందు నన్నఁగా దుస్సంప్రదాయములులేని యథార్థాశువునందు మహాప్రసిద్ధిని బడసిన సంగతి జగద్విదితమేకదా? అమ్మహామహుని యాశుధారయనఁగా? ఏదేనియొక పురాణమును వారు చదువుచున్నప్పుడు కొందఱువచ్చి జరిగినమీఁదట నంతతోఁ బుస్తకమును మూసివేసి యాకథాశేషమును దమ సొంతకవనముతోఁ బూరింపుఁడనికోరినచో నిరాఘాటముగా నదియే ధారను సంస్కృతాంధ్రములలో నాశువుగాఁజెప్పి పండితులడిగిన యంశములకు వ్యాకరణాదులలో సమాధానమును జెప్పుచు గథాంశమును బూరించుచుండెడి సత్సంప్రదాయములు కలవియఁట?

ఇట్టి ప్రతిభావిశేషద్యోతకమగు నవధానము నింద్యమనుట పొరపాటు. ఇయ్యది రోగగ్రస్తతా సూచకమను హేతువున

"శ్లో॥ పూర్వపుణ్యవిభవవ్యయ లబ్ధాస్సంపదో విపద ఏవవిమృష్టాః"

అను శ్రీహర్షోక్తింబలెఁ జమత్కార ప్రధానమగు వచోరచనకుం బూనువారుదక్కఁ గేవలానూయచేఁగాని యనభిజ్ఞతచేఁగాని. తత్త్వశూన్యతచేఁగాని యవధానశక్తిని దూషించువారిని మేము నుతించి వ్రాయుట కిప్పటికిఁ దగినపదములుమాకు దొరకకున్నవి. ఎట్లోతమ వాచాటకత్వమును వినియోగించికొనక యచుంబిత ప్రక్రియలలోనికిదిగి చిరకాలము నుండి మహామహులచే గౌరవింపఁబడు విద్యలను నిరసించి పెద్దపని చేసితిమని సంతసించుచు నంతం దనివిసనక యేవచనముతోడనో యేకవిత్వమునో ప్రకటించుచుఁ బ్రసక్తిగాని ప్రసక్తిగానందుఁగూడఁదమతమ ప్రయోజకత్వమునే వెళ్లఁగ్రక్కు పండితంమన్యులంగూర్చి యెంతవ్రాసినను దనివితీరదు. వీరు ప్రత్యక్షములోఁ దటస్థించినచో నడుగఁదలఁచి ప్రకృత మింతతోఁ వదలుచున్నారము. ఈయనయు నవధాని నని కొంతకాలము తలఁద్రిప్పికొన్నట్లు వినవయ్యెడిని. అట్టిచోనితఁడు జగదేక పూజ్యమును సర్వవిద్యా మూలకందమునగు నవధానశక్తినిగూర్చి పిచ్చిపిచ్చి ప్రసంగముచేసి తజ్ఞులచే వెంటనే యేల ఖండింపఁబడినట్లు పత్రికలలో మనకు గోచరించుచున్నది యని ప్రశ్న రావచ్చును. వినుఁడు ఒక మహావిషయము నొకరు ప్రదర్శించినపిదప నాఁడు మొదలుగఁ గొందఱు బాలురు దాని ననుకరించుట సహజమైయున్నది. మహావిషయమే కానక్కఱలేదు సామాన్యవిషయమైనను ఆనుకరణమునకు లక్ష్యమైతీరుచున్నది. పీర్ల పండుగలలో నొకఁడు పెద్దపులివేషమును వేసికొని తిరుగఁగాఁజూచి ప్రతి పసిపిల్లవాఁడును వాని చేష్టల ననుకరించుచుఁగొన్నాళ్లు కాలయాపనమొనర్చి యంతట విరమించు చుందురు. అట్లే యీమన యుపన్యాసకుఁడుగారును ఎవరినో యవధానులనుజూచి కొంతప్రయత్నించి యంతఁ గృతకృత్యత నొకింతేని గనఁజాలకఁ బరుగిడలేక యేదో అనినాఁడను సామెతగా "తనకలిమి యింద్రభోగము" అను పద్యమును జ్ఞప్తికిఁదగిలించుచు నవధానములనుగూర్చియు వాని నాచరించువారలంగూర్చియు వారిని బ్రోత్సాహపఱచు వారింగూర్చియు 'పగటివేషగాండ్రు' లోనగు ప్రల్లదముల నొకించుక గిలుక మొదలిడుచు వాగ్వ్యయ మప్పుడప్పుడు సేయుచుండఁగాఁ దజ్ఞులు కొండొకవారించుచువచ్చిరనియు నావారణము పూర్తిగా జరుగకుండుటచే మరల మరలఁ దన పండితంమన్యత్వమును వీలుపడినప్పుడెల్ల వెళ్లఁబుచ్చుచుండెననియు నంతలోఁ దనకొకింత పదవిహర్షఁ దటస్థింపఁగాఁ "జలిజిష్ణముబలు" మను సామెతగా మఱింత ధైర్యముచిక్కి మిక్కిలిగాఁ బరాక్రమించి తనవాగ్ధోరణిని ప్రపంచమునఁ బాఱింపఁ బ్రారంభింపఁజొచ్చెననియు నూహింపనయ్యెడిని. ఈపండితమ్మన్యుఁడుగారు తనకుఁ జేతఁగాని ప్రతివిషయమును నిట్లు దూషింప మొదలిడువారే యైనచోఁ దమకునొకింతమాత్రమే ప్రవేశముకల యింకనొక విద్యలోని యున్నతపరీక్షలనిచ్చిన మహాభాగులను వారిచ్చిన పరీక్షలనుగూడ నిందింపవలసియున్నది. అట్టిపనికి వీరేల పూనకుండిరో యని శంకింపవలసి యున్నది కాని మన మన్యుఁడుగారీ యవధాన దూషణమునుతలపైఁ బెట్టికొనుటకుఁ దమకు నలవడకుండుటయే కేవలహేతువుగాఁ గైకొనినట్లు తోఁచదు. మఱొక్క హేతువుగూడనున్నది. ఆహేతువు శాఖాభిమాన పిశాచావేశము. అయ్యది యంతర్గతజ్వరమువలె వీరివ్రాఁతలోఁ గొండొక గప్పట్టుచుండును. దానిని గప్పిపుచ్చుటకుఁగూడ మన్యుఁడుగారు ప్రయత్నించుచుందురుగాని యది వెలికిబుసకొట్టుచునేయుండును. అయీహేతువులంబట్టి వీరిందు దిగి పని చేయుచున్నారు. వీరుపని యెంతచేసినను తజ్ఞులవధానములను మన్నించుటయేకాక బ్రహ్మోత్సవములఁగూడఁ దత్కర్తలకొనర్చుచున్నారు. అట్టిచో వీరిపరిశ్రమ యెందులకు చేయవలయునో? యని సంశయించుచున్నారము. భవతు, దీని నిటులుంతము. పెద్ద గొంతుకతో బిగ్గరగా నవధానములను దత్కర్తలను దూఱుపాటుఁ బట్టుచున్న మన పండితంమన్యుఁడుగారి ఘోష యిప్పుడుగాకున్న నెప్పుడైనీ సఫలమగునా? యని శంకింపవలసియున్నది. కాకేమి యెప్పుడో కాదు. ఇప్పుడే సఫలమగుచున్నది. ఎట్లందురా? ఇంతకుమున్నుదాహరించిన నిరంకుశచర్యులగు శ్రీ మాడభూషి వేంకటాచార్యులవారు గతించినమీఁదట నీయవధానములు కేవలానుకరణమాత్ర ప్రయోజనములు కావలసిన కాలము దాపరించినది. ఇటీవల నీయవధానము లొనర్చువారికిఁ బాండిత్యముతోఁగాని మఱియితర శక్తులతోఁగాని లవమును సంబంధములేదు సరిగదా తుదకు దీనికి ముఖ్యమగు ధారణతోఁగూడఁ బనిలేదు. ఒకరికో యిద్దఱికో మూగురకో చెప్పి అమలునాఁటి నుండి 'శతావధాని' అని బిరుదును వ్రాసికొన మొదలిడుట సహజముగాఁ గన్పట్టుచున్నది. ఇది గవర్నమెంటువారు పరీక్షించియిచ్చు బిరుదుల లోఁ జేరని హేతువున సర్వసాధారణమైపోయినది. ఈ బిరుదధారుల పరిశ్రమయు వీరిస్థితియు మాత్రమే యెఱిఁగిన మన మన్యుఁడుగారు లోఁగుసరయక "మూలచ్ఛేదీ తవపాండిత్య ప్రకర్షః" అన్నట్లు విజృంభింపఁదొడఁగిరి. కావున నవధానమన నేమో సుంతవారికిఁ దెలుపుట యేకాక అదియొనర్చి పేరందిన మహాభాగులను జేర్కొని కొండొక వాక్కునకుఁ బవిత్రత గలిగించుకొనుచున్నారము. మఱియు నీమన్యుఁడుగారిచే వృథాగా నిరసింపబడుచున్న యీయవధానవిద్య సర్వసామాన్యముగా నభ్యసింపఁ దగినది కాదనుట కింకొక యుదాహరణము నిచ్చుచున్నారము. వేదశాస్త్రములయందేకాక వీణావాదనాది సమస్తకళలయందును మహాప్రవీణులైన శ్రీ శిష్టు కృష్ణమూర్తి గారాశువునందు నఁగా దుస్సంప్రదాయములులేని యథార్థాశువునందు మహాప్రసిద్ధిని బడసిన సంగతి జగద్విదితమేకదా? అమ్మహామహుని యాశుధారయనఁగా? ఏదేనియొక పురాణమును వారు చదువుచున్నప్పుడు కొందఱొకదినము జరిగినమీఁదట నంతతోఁ బుస్తకమును మూసివేసి యాకథాశేషమును దమ సొంతకవనముతోఁ బూరింపుఁడని కోరినచో నిరాఘాటముగా నడియే ధారను సంస్కృతాంధ్రములలో నాశువుగాఁజెప్పి పండితులడిగిన యంశములకు వ్యాకరణాదులలో సమాధానమును జెప్పుచు గథాంశమును బూరించుచుండెడి సత్సంప్రదాయములు కలవియుఁట?

మఠికొండయు ప్రకృతకథకు వ్యతిరేకముగా నన్నగా నభియన్యవధఘట్ట ము చదువునపు డభిమన్యుఁడు మృతిచెందుటవలనను జదివినమీఁదట నితఁడే జయించినట్లుగాఁ జెప్పఁడనిన నక్లైచెప్పి దానికిఁగల హేతు కల్పనముచేఁ బండితులను మెప్పించువారఁట? వారి యాశువు పండిత మాన్యమనుటకొక యంశము మేము విన్నది వ్రాయుచున్నారము. ఒక చో వారాకాశిపురాణమును జెప్పునప్పుడు 'దధంతం'అని ప్రయోగించి రఁట? అప్పుడొక వైయాకరణుఁడు తప్పనెనఁట? దానిమీఁద శ్రీకృ ష్ణమూర్తిశాస్త్రిలవారు 'దధాతీతిదధః, తం' అని సమాధానమును జెప్పి రఁట? ఈయంశమును మేము బ్ర॥శ్రీ, ఉప్పలూరి రామజోగన్నసిద్ధాం తిగారను మహావిద్వాంసునివలన వింటిమి. వీరు సామాన్యులను మెచ్చు వారుగారు. వేదశాస్త్రములయం దఖండపండితులు. వీరు శ్రీకృష్ణమూ ర్తిశాస్త్రిలవారికి సహాధ్యాయులో సతీర్థులోయనివింటిమి. ఇట్టిపండి తకుంజరములచేనెల్ల మెప్పనందఁదగిన యాశురచనయం దాఱితేఱిన శ్రీకృష్ణమూర్తిగా 'రవధాని' అను బిరుదమును సంపాదింపనేలేను. కా రణమేమో? వారికి నాశుధారమాత్రమే కలదఁటకాని నూఱుగురకుఁ గవనముచెప్పి దానిని ధరింపఁదగునంతటి ధారణలేదఁట. అన్ని మహాశ క్తులుగల యామహానుభావునకు నేశక్తియందించుక లోటుంటచే నవ ధాని బిరుదము లేకపోయెనో అట్టి యవధాని బిరుదమునకు నీకాల మున సపాత్రులు కనుపట్టుటయేలేదు. ఎల్లరును బాత్రులే. ఈహేతు వుచే మన మన్యుఁడుగారీ యవధానముల నొండెఁగర్తలనొండె వెక్కి రించుచున్నారను కొనుటకొంతవఱకుయుక్తమే కాని వీరివ్రాఁతయంతట్టి సూచన కాన్పింపదు. వీరిని మందలించిన వారి మాటలయందానూచన స్ఫుటముగాఁ గన్పట్టుచున్నది. ఆ యనఘుఁడిట్లునొడివి తన్ను సమ్యము వుగా మందలించినందుల కీయన కెంతయో కోపమువచ్చి యాకోపమును గూడఁ బత్రికాముఖమున వెళ్లఁగ్రక్కుటచే నీయన కేవలపండితమ్మ న్యకోటిలోఁ జేర్పఁదగినవాఁడుగా మామనస్సాక్షికి వచ్చుచున్నది. కా వున నీయనఘుని నిరసనప్రసంగము నిక్షేతుక మనవలసియున్నను 'ప్ర యోజనమనుద్దిశ్యనమందోఽపిప్రవర్తతే' అను న్యాయము ననుసరించి యేదోవిధమునఁ దనపేరు బైటికిఁబెట్టుకొననెంచి యిట్టిగట్టిపనికిఁబూనె నని నిర్ణయింపవలసియున్నది. ఏమీ? యవధానము? పైపై నున్న దేమి? మహారాజునింటను బెండ్లియే మనయింటను బెండ్లియేయనునట్లు [illegible]కవియు నేదో తెలుఁగున'అష్టావధానము' చేసినట్లు నటింపనేని [illegible]గాని 'శతావధానము'ను బూనుటకుఁ దగినంత సామగ్రియుఁ [illegible]ర్మ సంచితమగు ధారణాశక్తి విశేషమును లేక యెవనితరము? [illegible]చకమగు నైశ్వర్యము నేమి యవధానశక్తి నేమి, [illegible]వము లేదనియు దాని తత్త్వము నెఱుఁ [illegible] పండితమన్యుఁడుగారికి బోధిం [illegible]ము. వేదశాస్త్ర చోదితము [illegible]ర్కాలమున బుద్ధివిశేషదో [illegible]తప్పుపనిలోనిదికాదుగావ [illegible]ణముగా గౌరవింపవలసి యున్నది. ఈపండితమ్మన్యుఁడుగారు తాను పెద్దపండితుఁడనని లోక మునకుఁ దెల్పుటకుఁ గాఁబోలును దనవ్యాసములలోఁ బ్రాచీన సంస్కృ తమహాగ్రంథముల పేర్లను గుప్పతెప్పలుగా నచ్చటచ్చట వాడుచు నా యాయాగ్రంథములలోని 'పప్పుభొట్లు' శ్లోకముల నుదాహరించుచుం డును. "కాశీగమనమాత్రేణనాఽన్నం భట్టాయతేద్విజః" అనునట్లంత టితోడనే తానాగ్రంథముల తత్త్వమెఱిఁగినవాఁడనియే ప్రాజ్ఞుఁడను దలఁపఁడనియు నావ్రాఁత తనచేతికి మురుగుగలదని తెల్పుటకుఁగా నెవనినో యనవసరముగాఁబిల్చుచుఁ జేయాడించిన యమాయకుని చేష్ట వంటిదనియుఁ దనలోఁ దానిప్పటికేని దెలిసికోవలసియున్నది. అనేక విద్వన్మహాకవిమాన్యమగు నవధానరచనయే దూష్యమగునెడల నేఁటి కాలపు విద్వాంసులలో నేతరగతిలో గూడఁ జేరుటకు శక్తిలేని తాను పెద్దపండితునివలె నభినయించుచు దత్తద్గ్రంథనామములకుఁగూడ నవ మానమును గలిగించుట దూష్యముకాకపోవునా? పాండిత్యమనునది యట్టి యభినయములతో వచ్చెడిదిగాదు. పుస్తకముల పేళ్లనుమాత్రమే యేకరువు పెట్టినంతలో, దన్ను బండితునిగా గణించి తనవాక్కుల యందు నంబలె విలువనుంచునెడల బుక్కసెల్లరులమాటలుగూడ వేద ములు కావలసివచ్చునుగాన: దన యుపన్యాసమునకేక నిట్టితలఁపుదగని విషయము నుదాహరణముగా, బుచ్చుకొనక తెలిసినవిషయమునే లక్ష్య ముగాఁ గైకొని తోచినమాటలను జెప్పి దానిలోఁ జేరప్రతిష్ఠలుసం పాదింపఁగోరుచున్నారము. ఈమన్యుఁడుగారి వాక్యముల నిందుదాహ రింపవలసియున్నను దెలిసియు దెలియని వ్రాఁతలను బైకిఁ దెచ్చుటకన్న నొండొక తప్పుండదని యెంచి యట్లొనరింపమైతిమి. ఊకదంపు టు పన్యాసకుల వృథాగ్రహపుఁ బ్రల్లదములపై నింతవఱకు వ్రాసిన దోష మునకు శ్రీమదభినవ పండితరాయల నిరంకుశచర్య శ్రీ మాడభూషి వేంకటాచార్యవర్యులయొక్కయు దాదృశులో యంతకు మిన్నలో యగు శ్రీ శిష్టు కృష్ణమూర్తిగారియొక్కయు జగత్ప్రసిద్ధులును నిరతా న్నదాన విద్యాదాన పరతంత్రులునగు మాగురువరేణ్యులయొక్కయు ననాది వ్యాకరణైకజీవనమును మార్కొండపాటి చతుష్టయాపరపర్యా యంబును నగు వైయాకరణ కుటుంబముయొక్కయుఁ దద్గురువరులగు యాగేశపండితజీ వారియొక్కయు దదాస్థానమగు శ్రీకాశికయొక్కయు మఠికొండఱ మహాత్ములయొక్కయు నామస్మరణము ప్రాయశ్చిత్త ప్రాయమగుఁగాక.

సీ॥ ఇలగాపరి పాడునట్టి పాటలువిని గానమ్ము నిందించువాని పగిది
వంటపూటమ్మ చప్పనిబోనముంగుడ్చి భోజనమ్ము నరోయు పురుషు భాతి
గాడిదపై సవార్గావించి యుచ్చైశ్శ్రవము బడ దిట్టు జనము విధాన
గంటిభాగవతంబుగన్గొని కాకుంతకాములరో పెడి యజ్ఞకరణి

తే॥గీ॥ నస్మదాగాలుగొండ ఉన్నా తురులు స
మగ్రమగు ప్రజ్ఞ లేక శతావధాన
మనుచు నెుదలిడి పేర్మాపినంతదాని
ఘనత: దగ్గించుమూర్ఖులుగలరె భువిని॥ 1.

క॥ స్వామి వివేకానందుఁడు।
మామిడిపండునుగుఱించి మతియేమనెనో।
ధీమంతు లెఱుంగుదురు వృ।
థా మాటలతోడ నేమి తజ్ఞులు లేరే॥ ౨.

ఉ॥ మామిడిపండునాగ నొకమామిడిక్రిందను జిన్ననాఁట నెం
దైనతి రాలి నల్లఁబడినట్టి యొకానొక పిందెయొౌన యే
ధీమహితుండుదాని గని తేఁకువగల్గినవానియట్లనే
మేము వచింపవానిని హిహీ ? యని నవ్వనివారలుందురే॥ ౩.

ఉ॥ కొన్నిశతాబ్దముల్ గడచె గొందఱుమెచ్చుటె కాక యందఱుక్
ఋన్నము పండకున్న నిది పుట్టదటంచు నుతించిరట్టి శ
క్తిన్నగుఁ బాటుగాఁదలఁచి తెప్పన దెల్వినివెళ్లఁబెట్టుమా
యన్న కు వందనమ్ములివె యర్పణజేసితి మందుకోఁదగన్ ॥ 4.

మత్తకోకిల.

మంగళం జయమంగళం శుభమంగళం జగదీశ్వరీ।
మంగళం బవధానశక్తికి మంగళంబవధానికిన్।
మంగళం వృథగాఁ బ్రసంగము మాటిమాటికి జేయుచున్।
కంగుకంగున మ్రోగుచుండెడి కాకవిద్విజపాళికిన్ ॥ 5.

# ఆంధ్రుల దురదృష్టము.

[ శా॥ రంగప్పగారు. ]

మ॥ వికలంబయ్యె మనంబులార్యతతికిన్, వీర్యంబువుట్టెన్ దురా
త్మకచిత్తంబుల, కాంధ్రభాషకొక యాధారంబు పాడయ్యె! నా
టకముల్ వ్రాసెడు నేర్పులెల్ల నడుగంటంబోయె, నేమందు? నేఁ
డకటా! నీవిటు రామకృష్ణకవిచంద్రా! యస్తముం బొందుటన్. ౧.

శా॥ ఎన్నోవిద్దెలనేర్చి యన్నిటను నెంతే నద్వితీయుండుగన్
మన్నింపందగి యుంటివయ్య! నిను నన్యాయంబుపాల్సేసె నో
యన్నా; యిట్టులదృష్టదేవత! త్వదీయప్రౌఢిచే దానికిం
గన్నుల్గుట్టెన కాక! నీకునిటుల్ గల్పంబు నిండారెనే!. ౨.

మ॥ అనవద్యంబగుశైలి, పాత్రములయం దౌచిత్యమున్, దేనియల్
దొనుకంజాలెడు పల్కు లబ్బురపురీతుల్మీఱు నానార్థ క
ల్పనములుల్లాసపుచు నిట్లునాటకములన్ వ్రాయంగ నోరామకృ
ష్ణునిఁబోనాడి వచింపఁ డెవ్వఁడు గలండో ధీరుల్ నాఁటికిన్!. 3.

మ॥ మునునీకెన్నఁడులేని మేల్పసిఁడి సొమ్ముల్ చిత్రచిత్రంబుగా
దినమొక్కొక్క మెఱుంగుదోఁపఁ గడుఁబ్రీతిం జేసి యొన్నెని నీ
కు నతండియ్య నలంకరించికొని కుల్కుల్మీఱగాఁనుంటి వ
మ్మ! నిరున్ గన్గొన సంకటంబగుఁ గదమ్మా! యాంధ్రభాషామణీ!. ౪.

శా॥ పోటాపోటికి నన్యభారతులతోఁ బుట్టించెనొక్కండు నిన్,
మాటల్దేనియ లొల్కనేర్చి యటుపైనం గొందఱంతేనియున్
నీటొప్పారఁగ మేనినిండఁ దొడవుల్ నిండించిరే కాని, నీ
కాటల్ పాటలు నేర్పినాఁ డితఁడుగాఁడా? యాంధ్రభాషామణీ.

శా॥ ఆయెం బోయినవానికై వగవనేలా యింక? నాతండు నీ
కేయేసొమ్ములు సేసి మూలనిడిపోయెన్ వానితో నెవ్వ రే
నీయంగంబు నలంకరింప నదియేనిం గాంచుభాగ్యంబు వ
యాయుస్సీమను గల్గునో కలుగదో! హా! యాంధ్రభ

Sri Srungeri Swamy.



శ్రీశృంగేరి స్వాములవారు.

Sri Parakala Maha Desika Swamy.



శ్రీ పరకాల మహా దేశిక స్వాములవారు.

Swamy Ramatirtha.



స్వామి రామతీర్థ.

Mr. Vadlamannati Venkatachalam Pantulu.



వడ్లమన్నాటి వెంకటచలం పంతులుగారు.



Mr. R. Krishnama Charlu M. A.

ఆర్. కృష్ణమాచార్యులు గారు.



P. R. Jiyyer Swami.

శ్రీమాన్ పెరుమాళ్ళ శ్రీ రామానుజ జియ్యర్ స్వాములుగారు.



Pandit R. Kasturi Rangacharlu

పండిత ఆర్. కస్తూరి రంగాచార్యులుగారు.



Mr. C. Narasimha Rao.

చిలుకూరి నరసింహరావుగారు.

Blocks by Messrs R. Venkiah Bros. Madras.



President and Members of the Managing Committee of the Bombay Telugu Education Fund.

బొంబాయి తెలుగు విద్యాభివృద్ధి నిధి కార్యనిర్వాహకసభ్యులు.



The Andhra Students in the Bombay Victoria Technical Institute.

బొంబాయి విక్టోరియా సాంకేతిక విద్యాలయములోని ఆంధ్ర విద్యార్థులు.

Miss. Sen M. D.



శ్రీమతి సేనుగారు.

Srimati K. Ramabayamma.



శ్రీమతి కాశీనాథుని రామా[illegible]యమ్మగారు.

Sister Nivedita.



సోదరి నివేదిత.

# ఆయుర్వేదము – వస్తికర్మ.

[ వైద్యరత్న ఆయుర్వేదమార్తాండ భిషఙ్మణి పండిత డి. గోపాలాచార్యులుగారు. ]

పరాత్పరుని విచిత్రసృష్టియందలి జరాయుజములనంబరగుమానవులకు నహితాహార విహారంబులచేత సమానస్థితినుండు వాత- పిత్త కఫంబులు వికృతిజెంది వివిధరోగంబుల నుత్పాదించు. అట్టి రోగంబులను నిర్మూలముజేయ నాయుర్వేదమున నాదికాలమందు వివిధ చికిత్సోపాయంబుల మహర్షులు గనుఁగొనిరి.

అందు శోధనము. (దోషముల నిగ్రహింపంజేయునది) శమనము (దోషముల శమింపజేయునది) అను రెండు చికిత్సలు ప్రధానములు. ఈ రెంటిలో "యొతుసంశోధనైః సిద్ధాః నతేషాంపునరుద్భవః॥ (వమనవిరేచనాది శోధన క్రియలచే శోధింపబడిన వ్యాధులు మరలయుత్పన్నంబులు కావు.) అను శ్రీవాగ్భటోక్తిచే శోధన చికిత్సయే సర్వోత్తమమని తోఁచెడిని. అయ్యది ఆయుర్వేదంబున స్నేహకర్మ (నూనె, నెయ్యి మొదలగు చమురులచే శరీరమును మెత్తబరచుట) స్వేదకర్మ (చెమటను బైటికి వెడలించునుపాయము) వమనకర్మ, (ఆమాశయ కఫాశయములందలి దోషముల వెలిబుచ్చుట) విరేచనకర్మ (మలాశయ పిత్తాశయములందలి దోషము బైటికిదీయుట) వస్తికర్మ (మూత్రపు తిత్తివలన మలాశయపక్వాశయము (సూక్ష్మాంత్రము) లందలి దోషములను బహిర్ముఖముజేయుట) అనినైదువిధంబులు వీనికేపంచకర్మలని నామాంతరము. ఈఐదు విధములగు శోధనచికిత్సలకును నాయావ్యాధులయందు ప్రత్యేకమగు వినియోగముగలదు. ఇచ్చట నాయైదింటియొక్కయు నుపయోగమును వివరించుట గ్రంథవిస్తరభీతిచే విరమించి "వుపక్రమాణాం సర్వేషాం సోగ్రణీః" అను నాయుర్వేదసూత్రంబు ననుసరించి రోగనివారణోపాయములలో నెల్ల ప్రధానోపాయంబని. నుతికెక్కిన వస్తికర్మనుద్దేశించి ఇంచుక వ్రాసెదను.

వస్తిశబ్దనిరుక్తి:— వస్తినాయత్కర్మదీయతే. తద్వస్తికర్మ. (జంతువుల మూత్రపుతిత్తి. (బ్లాడర్) మూత్రపుతిత్తిమూలకమున నవుషధముల నుపయోగించుటచేత దీనికి వస్తికర్మయని యాయుర్వేదమున వాడుకయైయున్నది.

వస్తిరూపము:—"వస్తయశ్చాతివృద్ధానాం మృదవోనాతి బహుళాదృఢాప్రమాణవంతః గోమహిష వరాహ అజ ఉరభ్రాణాం" వయస్సుమీరిన ఆవు, దున్న, పంది, మేక, గొఱ్ఱె అను జంతువుల మృదువును మిక్కిలి పెద్దదికానిదియు, చెప్పంబోవు పరిమాణము గలదియు నగు వస్తిని (మూత్రపుతిత్తిని) ఛిద్ర, గ్రంథి, గంధ, శిరలు లేకుండఁజేసి వగరు చెక్కల కషాయముతో పదునుజేయవలయును. నిరూహాను వాసనకర్మలయం దుపయోగించెడి ద్రవ్యములు చక్కఁగ శరీరాంతః ప్రదేశము నొందుటకై ద్రవ్యముంచెడి వస్తితిత్తికి ననుకూలములగు గొట్టము లావశ్యకము. అట్టి గొట్టమునకే నేత్రమనియాయుర్వేదమున వచించెదరు.

నేత్రలక్షణము:— "తత్ర నేత్రాణి సువర్ణరజత తామ్రఅయో రీతి దంతశృంగమణి తరుసారమయాని శ్లక్ష్ణాని దృఢాని గోపుచ్ఛాకృతీని ఋజూని గుటికాముఖాని." నేత్రము (గొట్టము) బంగారు, వెండి, రాగి, ఇనుము, ఇత్తడి, దంతము, కొమ్ము, రత్నము, సారముగలకొయ్య వీనిచే మొదలు బొటనవ్రేలంతలావుగను, కొన చిటికెనవ్రేలంత సన్నముగను, ఆవుతోకవలెనుండునట్లు చేయవలయును. చివరను గుండ్రముగను నునుపుగను మొదటివంపును నునుపును గలిగి లెటికివైన ముఖముగలదిగ నుండునట్లుచేయవలయును. మరియు మొదలునకుమూడంగుళముల సమీపమున గొట్టమునకుచుట్టును కర్ణిక (కట్టు) గట్టిగనుండునట్లునిర్మించవలెను.

నేత్రరంధ్రము:—గొట్టముయొక్క మొదటి భాగమున రేగుగింజ పట్టునంతటి బెజ్జముండి క్రమముగ కొనకు పెసరగింజ పట్టునంతటి సన్ననిబెజ్జముగునట్లుచేయవలయును.

నేత్రపరిమాణము:—ఆనేత్రము వత్సరములోపు పసివారికారంగుళములును, నెనిమిదివత్సరములవారి కెనిమిదంగుళములును, పదునారువత్సరములవారికి పదియంగుళములును నిరువదియైదు వత్సరములు మించినవారికి పదిరెండంగుళములును పరిమాణముండవలయునని యాయుర్వేదాచార్యులు వక్కాణించిరి. మరియునీనేత్రముయొక్క పరిమితి వాగ్భటాచార్యుని మతమున నొకవత్సరముగల బాలుని కైదంగుళములమాత్రమే యని కాలానుగుణముగ తగ్గించినట్లుదోఁచెడిని.

ఉత్తరవస్త్యుపయోగ నేత్రప్రమాణము:—రోగియొక్క అంగుళముతో పండ్రెండంగుళముల పరిమాణముగల గొట్టమును మొదలు లావుగను కొనసన్నమును గలదిగ నావుతోక మాదిరి నుండవలయును. గొట్టముయొక్క మధ్యభాగమున కర్ణిక (కడియము)యుండవలయును. కొన సన్నని యావగింజ పట్టునంతటి రంధ్రము గలదిగను నునుపుగను మల్లెగన్నేరు, జాజిమొగ్గల తొడిమలవంటి కొనగలదిగను, మిక్కిలిమనోహరముగనుపూర్వోక్తస్వర్ణాది లోహములతోచేసినదిగను నుండవలయును.

గర్భాశయాద్యుపయోగి నేత్రప్రమాణము:—స్వర్ణాది లోహములచే జేయంబడిన నేత్రము పదియారంగుళముల పరిమితియు పెసరగింజ పట్టునంతటి బెజ్జమును అగ్రమునకు నాలుగంగుళముల కీవల కర్ణికయు గలిగి గోపుచ్ఛాకృతినుండవలయు. మరియు స్త్రీల మూత్రమార్గమున నుపయోగింపబడు నేత్రముయొక్క కొనకు రెండంగుళముల కీవల కర్ణికయుండవలయు. ఈనేత్రమే చిన్నయాఁడు బిడ్డలకుగలిగెడు మూత్రకృచ్ఛ్రాది వ్యాధులయందొకయంగుళము పరిమితి కలదిగానుండనగును.

వస్తినేత్రసంయోజనము:—పైనచెప్పంబడిన తిత్తియందునిరూహ, అనువాసన వస్తికర్మల కనుకూలంబుగ కల్క కషాయ స్నేహాది ద్రవ్యంబులనుంచి యాద్రవ్యములు సుఖముగ శరీరమున బ్రవేశించుటకై యేర్పరచిన లోహాది నిర్మితమగు నేత్రమును కర్ణికపర్యంతము తిత్తిలో నిమిడ్చి తిత్తి బైటకురాకుండునట్లు మంచిగట్టిదారముతో కర్ణికకుజేర్చి చక్కగ గట్టవలెను. ఈసముదాయమునకె వస్తియంత్రమని పేరు.చిమ్మని గొట్టము లేకపిచికారీ యనియు వాడుదురు.

వస్తిప్రతినిధులు:—పైజెప్పంబడినటుల వస్తియంత్రమునకు మేకమొదలగు జంతువుల మూత్రపుతిత్తులు దొరకనిచో మెత్తనిచర్మముగాని గట్టిపప్పుటిగడ్డగాని యుపయోగింపందగునని సుశ్రుతాచార్యులుపలికిరి.

వస్తిభేదములు:— నిరూహవస్తి, అనువాసనవస్తి; ఉత్తరవస్తి యని వస్తిమూడుతెరంగులు.

నిరూహవస్తి, (కషాయవస్తి) :— అందునిరూహవస్తి (దీనికి ఆస్థాపనమని నామాంతరముగలదు) తత్తద్రోగహరమగు కల్కకషాయాది ద్రవ్యములనుండి జేయునది. «శరీర రోహణాత్, దోషనిర్హరణాత్, అచింత్యప్రభావాత్, నిరూహసంభవాద్వానిరూహః శరీరవృద్ధి జేయుట చేతగాని, దోషములను హరించుట చేతగాని, అచింత్యప్రభావముగలదియగుట చేతగాని, ఈ హారహితముగుఫలముల నిచ్చుటచేతగాని నిరూహమనంబడును. మరియు వయస్థాపన దోషస్థాపనలనుండి యాస్థాపనమనియు జెప్పంబడిరి. మరియు నిరూహవస్తిలో ఉత్క్లేశన, శోధన, శమన, లేఖన, బృంహణ, వాజీకరణ, పిచ్ఛావస్తి, మాధుతైలకము, సనికొన్ని భేదములం గల్పించెదరు. మాధుతైలకమను వస్తినే యాపన, యుక్తరథ,దోషహర,సిద్ధవస్తి,యనుపర్యాయములబల్కెదరు.

అనువాసన వస్తి (స్నేహవస్తి):—అనువాసనవస్తి తత్తద్రోగహరమగు నౌషధులచే సిద్ధముజేయంబడిన తైలాదుల నుపయోగించునది. «అను వసన్నపిన వ్యత్యేనుదివసందీయత్యనువాసనః» తేపతేప నుపయోగించుటచేతనుగాని రొట్టిబాధను గలిగించకుండుట చేత ననువాసనమనబడుచున్నది. అష్టాష్టమాత్రావకృప్తప్రమాణములచే నుపయోగించెడు మాత్రావస్తియు దీనికిపర్యాయమందురు.

ఉత్తరవస్తి:—ఉత్తరవస్తియన «ఉత్తరేణ మార్గేణ (ప్రధానావయవ మార్గేణ వస్తిదోష నాశముద్దిశ్య) దీయత్యుత్తర. వస్తితి» పూర్వోక్తముగుఅనువాసన, నిరూహవస్తులనుప్రధానావయవ మార్గమునుండి మూత్రాశయ దోషనిర్హరణకై యుపయోగించెడువస్తికి ఉత్తరవస్తియని వ్యవహారము.

నిరూహవస్తి ద్రవ్యపరిమితి:—నిరూహవస్తి కుపయోగించెడు కషాయము వత్సరపరిమితిగలవానికొక పలప్రమాణము. అది మొదలుపది రెండువత్సరముల ప్రాయమువరకు నొక్కొక్కపలము చొప్పున హెచ్చించవలయును. ఇట్లు పదిరెండు వత్సరముల వానికి పదిరెండుపలముల కషాయముపయోగింప నగును. పిమ్మట పదునెనిమిది వత్సరముల వరకు రెండేసి పలములచొప్పున హెచ్చించునది. అనగా పదునెన్మిది వత్సరములవానికి ముప్పదియారు పలముల కషాయము. (ఆంగ్లేయపరిమాణమునుబట్టి షుమారు ఒకటిన్నరపాయింటు) ఈపరిమితియే డెబ్బది వత్సరముల వరకును గ్రహించవలయును. డెబ్బదిసంవత్సరముల యనంతర మాతురణావధి యిరువది పలములు మాత్రముపయోగింపందగును.

అనువాసనవస్తి ద్రవ్యపరిమాణము:—వయోభేదములననుసరించి నిరూహవస్తికైనియమించిన ద్రవ్యపరిమితిలోనాలవవంతు స్నేహద్రవ్యముల ననువాసన వస్తికై యుపయోగింపందగును అనగా నొకవత్సరము బాలురకు ¼ అవున్సును పదిరెండు వత్సరములవానికి నాలుగుపలములను పదునెన్మిది వత్సరముల వానికి తొమ్మిదిపలములు. డెబ్బదివత్సరములకు మీద నైదుపలములను నుపయోగింపందగునట.

నిరూహవస్తి కర్మార్హులు:— నిరూహవస్తి, గుల్మము, కడుపుబ్బరము, వాతరక్తము, ప్లీహము, అతిసారము, శూల, అజీర్ణము, జ్వరము, పీనస, శుక్రగ్రహము, [వాతనిరోధము, అండవృద్ధి, అశ్మరి, రజోదోషము, పక్షవాతము, ఆమవాతము ధనుర్వాతము, మొదలగు క్రూర రోగములయందు చేయందగును.

నిరూహానర్హులు:— రొమ్ముపుండు, మిక్కిలి చిక్కిపోవుట, అమాతిసారము, వమనోన్ముఖత, అర్శస్సు, ఎక్కిళ్ళు, ఉబ్బసము, గుదమునవాపు, బద్ధోదరము, ఛిద్రోదరము, మధుమేహము, ఈమొదలగురోగములయం దుపయోగింపజనదు.

అనువాసనార్హులు:—నిరూహవస్తినుపయోగింపదగిన వారలందరును అనువాసన వస్తికర్మకర్హులు. విశేషముగ అగ్నివృద్ధిగలవారలు, శరీరమున జిడ్డులేనివారలు, కేవల వాతరోగ పీడితులును అనువాసన వస్తికర్మార్హులు.

అనువాసనానర్హులు:—పాండు, కామల, మేహ, పీనస,ప్లీహ, కఫోదర, కృశోద్ధాల, క్రిమి, శ్లీపద, గండమాలాదిరోగములుగలవారలును విషపానము చేసినవారలును. నిరూహవస్తి కనర్హులగువారునుగూడఅనువాసనకర్మకుండదగరు.

వస్త్యుపయోగము:— ఈరీతిగ నిరూహానువాసన వస్తికర్మలను విహితరోగములయందు హీనమధ్యాతియోగ సమ్యగ్యోగ జ్ఞానముగల కుశలుడగు వైద్యుడుపయోగించందగును. నిరూహవస్తిచేసిన ముహూర్తకాలములో బైటికి ద్రవ ద్రవ్యమురానిచో మృత్యువాసన్నమైయమపురికిం జేర్చనుండెనని యాయుర్వేదాచార్యులు వక్కాణించుటచేత నీనిరూహవస్తి నెంత మెలకువతో వైద్యవరులుపయోగించవలయునో వైద్యునకెంతజ్ఞానగరిమ యుండవలయునో తేటపడుచున్నది. స్నేహవస్తి యనువాసనవస్తిని దానివలన మంచిలక్షణములు కలుగువరకు నుపయోగింపందగు,

వస్తిప్రణిధానము:—అనువాసన నిరూహవస్తుల కర్హుండగు మనుజుడు మున్ముందు విధివిహితస్నేహ స్వేద వమన, విరేచనములనెడి శోధనములను గైకొని శుద్ధశరీరుండు కావలయు. పైశోధనలచే గలిగిన బలహీనతపోయి తిరిగిస్వాభావికబలము కలిగినపిమ్మట వస్తికర్మకర్హుడగును. నిరూహానువాసనకర్మల కర్హుండగునట్టిపురుషుడు మలమూత్రము

లను విడచి నిమ్నోన్నతము గాని ప్రదేశమున వామభాగముగ బరుండవలయును. అట్లు పరుండిన పురుషుని యెడమతొడను చాచి కుడితొడను వంచునట్లుచేసి గుదద్వారమున మృదువగు నెయ్యి మొదలగు స్నేహద్రవ్యములం జమిరి, నెయ్యి మొదలగు స్నేహద్రవ్యములం జమిరిన వస్తినేత్రముయొక్క రంధ్రమును జక్కగ నడ్డులేకుండునట్లుగా నొకచేతితో వస్తియంత్రములు బట్టుకొని రెండవచేతితో వెన్నెముకకు సూటిగా గుదద్వారమున నేత్రమును ప్రవేశింపజేసి అతివేగమును అతిమందమును గాకుండ తిత్తియందలి ద్రవద్రవ్యములోన ప్రవేశించునట్లు వత్తవలయును.

చెట్టుయొక్క మొదలు నీటిచే తడుపుటచేత చెట్టునకంతకు వీర్యము వ్యాపించుకరణి వస్తిముఖమున మూలద్వారమునుండి యుపయోగించిన ద్రవ్యము దోషములకెల్ల మూలమగు వాతమున కునికిపట్టగు పక్వాశయము (సూక్ష్మాంత్రము) నందంతట వ్యాపించి యనంతరము తన మహిమచే రోగముల నిర్మూలముజేయును.

అట్లుగాక భిన్నముగ నుపయోగించెనేని ద్రవ్యము చక్కగ పక్వాశయంబున వ్యాపించకుండును. మరియు నుక్తరోగంబుల నివర్తింపజేయ నసమర్థంబగుటయేగాక వస్తివ్యాపద్రోగంబులకు కారణంబగు.

వస్తికర్మప్రచారము అభివృద్ధి:—నిరూహ, అనువాసన, ఉత్తర వస్తి మొదలగు ప్రయోగ భేదంబులు వ్యాధి భేదంబున కనేకవిధములు. అయ్యవి వివరముగ నిచ్చట జేర్కొనుట గ్రంథవిస్తరము కాస్పదమగును. కావున నీవస్తికర్మయందు ఆర్యులు చిరకాలమునకు పూర్వము పొందిన యౌన్నత్యమును సూచించుటకై వాని ప్రయోగములలో గొన్నిటిమాత్ర మిప్పటివారికి దెలియుటకై వివరించెదను. చరకమున చికిత్సాధ్యాయములు 9, 10 యందు క్రూరమగు అర్శస్సు, ప్రవాహికా అతిసారము అను వ్యాధులను నిర్మూలముచేయుటకై "పిచ్ఛావస్తి సిద్ధవస్తు"లు నిరూపింపబడినవి.

సుశ్రుతుని చికిత్సా 38వ అధ్యాయమున శరీరమునకు పుష్టియవసరమగునపుడు పుష్టికొరకు పుష్టినిచ్చుద్రవ్యములచే జేయంబడిన కషాయమున మధుర ద్రవ్యకల్కములంజేర్చి యందు నెయ్యి, మాంసరసములనుగూర్చి యుపయోగించెడునవి బృంహణవస్తికర్మలని కొనవచ్చెడిని.

వరాహ, మహిష, భల్లూక, సారంగ; కుక్కుటాది జంతువుల యొక్క రక్తమును అండరసమును, వస్తికర్మలకు మిక్కిలి యుపయుక్తములని నిరూపించెను. అదె అధ్యాయమున వంధ్యాదోషనాశనమునకై శతపాకబలా తైలమును వస్తికర్మకై కన్పట్టెను. సుశ్రుతచి అ 8 అశ్మరీ చికిత్సాప్రకరణమున శస్త్రసాహాయ్యముచే నశ్మరిని వెలికిదీసిన యనంతరము కారణాంతరములచే మూత్రపుతిత్తియందు రక్తము, గడ్డ కట్టియున్నచో నట్టి రక్తమును వుత్తరవస్తిచే దీసివేయందగుననియు, మూత్రము చక్కగ ప్రవర్తించనిచో మధురద్రవ్య కషాయములచే నుత్తర వస్తి నుపయోగింప వలెననియు వక్కాణించిరి. మరియు తత్తద్రోగములయొక్క యవస్థాభేదంబులంగూర్చి "రసక్షీరామ్లమూత్రాణాం" (సుశ్రుతచి అ 38), మాంసరసము, పాలు, పులుసు, మూత్రము వీనిని వుపయోగింపవలెననియు పెక్కునోళ్ల నుద్ఘోషించిరి. పరిహరివిధంబులగు వస్తిప్రయోగంబులు రోగభేదంబులచే క్రీస్తుశకమునకు కొన్నివేలవత్సరములకు పూర్వము వృద్ధిగాంచిన యాయుర్వేదమున విపులముగ నున్నట్లు తత్తద్రోగ భేదములయందు మహర్షులు నిరూపించుటచే నాకాలమున మిక్కిలి వృద్ధిగాంచిన దనుటకు గొప్ప నిదర్శనములు. పరంపరాగత వస్తికర్మజ్ఞానము ఆత్రేయమతానుయాయియగు చరకాచార్యులును ధన్వంతరి మతావలంబియగు సుశ్రుతాచార్యులును తమ గ్రంథములయందు శోధనప్రయోగములు పెక్కులుజూపుటచే దీనియభివృద్ధి నలుదిశల వ్యాపించినదని యెరుగనగు. ఇట్లు క్రమాగతమగు ఈ వస్తికర్మ పరిజ్ఞానము కేవల వైద్యులచే రోగనిర్మూలన విషయమై యుపయోగింప బడుటయేగాక చిత్తస్థైర్యము, ఆరోగ్యాభివృద్ధి, ఆయుర్వృద్ధి వీనికి మూలభూతంబగు యోగాభ్యాసంబున మహర్షులు కూడ శరీరశోధనకై యుపయోగించుకొనెడు నేతి, ధౌతి, బౌళి యనెడు కర్మలతోపాటుగ నుపయోగించి చతుర్విధ పురుషార్థములకు మూలభూతమైన శరీరమును అనామయముగ నుంచుకొనుచుండిరనుటకు పాతంజలయోగ సూత్రాది గ్రంథములె సాక్ష్య మిచ్చుచున్నయవి. గాన నీవస్తికర్మ సూత్రిక మహాయుగమున యోగశాస్త్రజ్ఞులచేగూడ నభివృద్ధిని బొందింపంబడినదని స్పష్టమగుచున్నది. అనంతర మష్టాంగ సంగ్రహాది గ్రంథనిర్మాతయగు శ్రీ వాగ్భటులుగూడ నీవస్తికర్మ, శోధనకర్మ సామాన్యమున ముఖ్యముగ నంగీకరించి బహురోగముల నీప్రయోగములను తన గ్రంథములయందు నిరూపించుటచేతను బృంధమాధవ, చక్రపాణిదత్త, భావమిశ్రాదులుగూడ దీనికి శోధనకర్మలలో ప్రాధాన్యము నిచ్చుటచేతను పరంపరగా నభివృద్ధి జెందియున్నదని తెలియవచ్చుచున్నది. ఆయుర్వేద కాలమునుండి భావమిశ్రుల కాలమువరకు శుక్లపక్ష చంద్రునివలె వృద్ధిగాంచియు గాలక్రమమున నాయుర్వేద వైద్యము క్షీణ్యము నొందుటచేత నీవస్తిప్రయోగములును క్షీణించినవి. శోధన చికిత్సలు నశించినకాల మఃదగిన యిక్కాలమునగూడ కేరళ దేశమున నచ్చటచ్చట స్నేహాస్వాది వస్తికర్మలు కొంతవరకు వాడుకలో నున్నట్లు వినుచున్నారము. ఇట్లున్నత ప్రభావముగల చికిత్సా రాజమని సుశ్రుతునిచే వర్ణింపబడిన వస్తికర్మ యిక్కాలపు వైద్యశిఖామణులకు గగనకుసుమ ప్రాయంబయ్యె. మరియు ప్రకృతపాశ్చాత్య వైద్యపుంగవులీ వస్తియంత్రమునే "ఎనీమా, ఇరిగేటర్" అను పదములచే వ్యవహరించుచున్నారు. వస్తియంత్రమునకును, ఎనిమా ఇరిగేటర్ లకును నాకృతిభేదమున్నను క్రియాభేదమేమాత్రమును గానరాదు. కాని యిక్కాలమున వస్తి యనుటకన్న ఎనిమాయన్న నాబాలగోపాలము దెలియును. ఎనీమాప్రయోగమున్నను నాయుర్వేదమున నాయా వ్యాధినాశక ద్రవ్యములచే జేయంబడిన కషాయాదులు తైలములు నుపయోగింప నట్టి ప్రయోగసరళి కలదో యట్టి ప్రయోగమార్గము లాంగ్ల వైద్యశాస్త్రమునందున్నట్టుల గానరాదు. మరియు వీరి ప్రయోగములలో సర్వసామాన్యముగ గోరువెచ్చని వేడినీళ్లనుమాత్ర ముపయోగించుట సర్వజనవిదితము. ఈ వేడినీళ్లకు మించిన సోపుకలిపిన గోరువెచ్చని నీళ్ల

నుపయోగించుట నిరూహవస్తియు పరమావధియని తోఁచెడిని. కలరా మొదలగు వ్యాధులచేత ప్రాణావసాన సమయమున దుర్బలమగు హృదయమును సంరక్షించుటకు ఉప్పుయొక్క పరిమాణభేదములచే జేయంబడిన యుప్పుగలిపిన సామాన్యపు వేడినీటినిగూడ నుపయోగించెదరు. క్రిమిరోగములయందును, అతిసారమందును, కడుపుబ్బరమందును కొన్ని వ్యాధులయందు మాత్రము కొనైక దాడిమశిరత్వక్కషాయము కర్పూర తైలము వగైరాల నుపయోగింతురు. ఇక ననువాసన వస్తియన్నచో కొన్ని వ్యాధులలో "గ్లిసరైన్" అను స్నిగ్ధవస్తువును మరికొన్ని వ్యాధులలో నాముదమును నుపయోగించుట తెలియుచున్నది. నిరూహానువాసన వస్తిప్రయోగంబులు వాడుకలో లేవని తెలియవచ్చెడిని. వారి శాస్త్రసీమయందున నింతకన్న నెక్కువ వన్నెకెక్కిన ప్రయోగరాజంబులున్నచో పువ్వు పుట్టకమునుపే దాని పరిమళమును మహిమను వేనోళ్ళ నుద్ఘోషించు నీకాలంబున మూలదాగియుండ నేరవు. మరియు నాహారరూపమగు బృంహణవస్తి ప్రయోగంబులుమాత్రము లెక్కకు మీరినట్లు పాలు, కోడిగ్రుడ్లసొన, మాంసము, అన్నరసము నిట్టి యనేక ద్రవాహారములయొక్క ప్రయోగభేదములు వాడుకలో నున్నయవి. "తత్రస్నేహాదీనాం కర్మణాం వస్తికర్మ ప్రధానతమమాహు రాచార్యాః" (స్నేహాది శోధనకర్మలలో వస్తికర్మయే ప్రధానమని యాయుర్వేదాచార్యులు వక్కాణించుచున్నారు) అనెడి సుశ్రుతోక్తిచే దెలుపంబడిన నీ వస్తికర్మ నుద్దేశించి చరక సుశ్రుతాచార్యులు చెప్పిన చొప్పున లక్ష్యలక్షణముల నభ్యసించి క్రమముగ నాయా వ్యాధులయందు ప్రయోగించవలయును. ఒకవేళ చరకసుశ్రుతములలో జెప్పిన వస్తియంత్రములు తటస్థించకున్నను నాంగ్లవైద్య శిఖామణులచే వివిధభేదములతో నిర్మింపబడిన యంత్రముల నుపయోగించుట వలన నే హానియుండదని తలంచెదను. వయోభేదములచేతను వ్యాధిభేదముల చేతను ద్రవద్రవ్యములను వస్తిముఖమున పరిమాణభేదమున నుపయోగించుట కనుకూలమార్గము లున్నటుల నే యెనీమాయను వస్తియంత్రముల యందును పరిమాణభేదబోధకములగు మార్కులు వేయబడి యున్నవి. అట్టి యెనీమాలనుండి యాయుర్వేదవైద్యము తత్తద్రోగములకై నిరూపించిన ప్రయోగంబుల నుపయోగింపందగును. సమయభేదముచే వైద్య విశారదు లుపయోగించెడి యెనీమాను ప్రతిదినము కొంచెము సులబద్ధమని తోఁచిన నవనాగరికతను జెందిన ప్రతి మనుజుడును కొంచెము వేడి నీళ్లతో నీయెనీమాను సులభముగ నుపయోగించుకొనుట వాడుకలో నుంచుకొనియున్నాడు. మరియు రోజుకు నాలుగైదుసార్లు వేడినీళ్లతో యెనీమా నుపయోగించుకొనువారిని నూటికేబదిచొప్పున గుర్తెరిగియున్నారము. ఎనీమానుపయోగించనిచో మలనివృత్తి కానివారలను కొందరిని దెలిసియున్నారము. వైద్యోపదేశంబుల సాయములేకయే సమయభేదముల గుర్తెరుంగక యిచ్చవచ్చినపుడెల్ల వేడినీళ్లతో యెనీమా నుపయోగించి యుపయోగించి మలాశయముయొక్క స్వాభావిక వ్యాపారమును జెడగొట్టుకొనినవారలను మనమెరుంగుదుము. మరియు యెనీమాను పదెపదె ఉపయోగించి యుపయోగించి యది జేయదగిన కార్యమును జేయకుండుటచే ధరవస్థలపాలగు మహనీయులెందరో మన కనుల యెదుట కానబడుచున్నారు. అమోఘఫలమునిచ్చు నీయెనీమాను వైద్యవిద్వాంసుల సాహాయ్యములేక నల్పజ్ఞతచే నుపయోగించి సర్వ కార్యసాధన భూతమగు నమూల్యశరీరమును చెడగొట్టుకొనకుందురు గాక. మరియు నార్యవైద్యవిశారదుల సహాయ్యమున, సమస్తరోగములను నిర్మూలము జేయు త్రైకాలికజ్ఞానముగల ఋషిపుంగవులచే చిరకాలమునకుపూర్వము గనుగొనంబడిన యీ వస్తికర్మ చక్కగ నుపయోగించుటచే ననేకరోగములను శమింపజేయును. ప్రకోపించిన దోషములకు శోధన, శమన, సంగ్రహణములజేయును. క్షీణించిన శుక్రముగలవానిని యౌవనవంతునిజేయును. చిక్కిపోయిన శరీరమును పుష్టినొందించును. స్థూలమగువానిని సమానస్థితికిదెచ్చును. నేత్రములకు పుష్టిని ప్రసాదమును నిచ్చును. వలీపలితముల బోనడచును. ఆయుష్యమభివృద్ధినొందించును. శరీరమునకు వర్ణమును బలమును గలుగజేయును.

ఇట్లు బహురోగనాశకమును ఆరోగ్యదాయకమును నగుచు భారతీయుల ప్రకృతిబలముల కనుకూలమగునట్లు పరోక్షజ్ఞానముగల మునిపుంగవులచే గనుంగొనబడిన వస్తికర్మ నార్యవిద్వద్వైద్యుల సాహాయ్యమునబడసి రోగములంబాపికొని యెల్లరు నారోగ్యవంతులగుదురు గాక. మరియు నారోగ్యదాయకమనియు రోగములురాకుండ గాపాడ గలదనియు నిత్యోపయోగముచేగూడ నెట్టిబాధలను గలిగింపదనియు ఖ్యాతి జెందిన మాధుతైలకాది వస్తిప్రయోగంబుల నుపయోగించుకొని ప్రియసోదరులందరు స్వస్థతనొందుదురుగాక!

క. జననియును జన్మభూమియు
ఘనమగు స్వర్గమునకన్న గౌరవనీయల్
జనయిత్రిని జన్మస్థల
మును భక్తి భజింపకున్న పోతుముగలదే?.

ఆ. సకలదేహములకు జనన కారణములై
తనరు శుక్లశోణితంబులకును
దనువు వృద్ధినొంది తనరారుటకు హేతు
వైన యన్న మిడున దవనిగాదె?

తే. తల్లులకు నెల్లఁ దల్లి నాఁ జెల్లునీ క
తమ్మనను దేశమాత యీధర్మమెఱిఁగి
తల్లిపిల్లలు భక్తి తాత్పర్యయుక్తి
దేశమాతను సేవించి తీరవలయు.

తే. ధాత్రియను పేరు తనకు సార్థకముగాగ
సర్వకాలంబుఁ దన యురస్థలమునందె
మోచి ప్రాణులనెల్లను గాచి ప్రోచు
జన్మభూమి భజింపని జడుఁడు జనుఁడె?.

# లంచములు - వానిమాన్పు మార్గములు.

[ ఒక యాంగ్లేయయువతిచే వ్రాయబడిన వ్యాసమున కాంధ్రీకరణము. ]

రాజ్యము శరీరమునకును, అందలి రాష్ట్రములు మున్నగు వివిధభాగములను అంగములకును, శరీరమును పోషించి, బలము, శక్తి, నొసగునట్టి జీవనాధారమగు రక్తమును దొరతనమునకును బోల్పవచ్చును. శరీరము ఆరోగ్య స్థితియందుండుటకు రక్తము పరిశుద్ధముగ నుండవలయును. ప్రభుత్వము న్యాయముగను, స్థిరముగను, అభివృద్ధికరముగను నుండుటకు నీతి యుండవలయును. పరిశుద్ధమగు రక్తమునందు విషము ప్రవేశించిన యెడల వ్యాధి జనించును. అట్లె దుష్ప్రవర్తనము, లంచగొండితనము, మున్నగు దుర్నీతులు రాజ్యమును ధర్మపథమునుండి మఱలిచ్చి, అక్రమముగను, బలహీనముగను నొనర్చును. ఏదేశమందుగాని ప్రభుత్వమెంత మంచిదైనను, జనసామాన్యము అజ్ఞాన స్థితియందుండి, శాసనములు తెలియక తమహక్కులను గ్రహింపజాలనపుడు, ధనాశాబద్ధులగు చిన్నయుద్యోగీయుల బాధకు లోనగుదురు. ఉన్నతోద్యోగస్థులెంత సన్మార్గులైనను, నెంతన్యాయదృష్టితో సంచరించినను, వీరిలో గొందఱు జనుల మేలునకై తమప్రాణములను సైతము గోల్పోయినను, ధనాశావిష్టులగు తాబేదారుల యక్రమవర్తనము వలన వీరియత్నములు చాలవఱకు నిష్ఫలము లగుచున్నవి.

ఒక గ్రామముపోయి చూడుడు. భూములన్నియు సస్యభరితములై, నిగనిగలాడుచు, పచ్చని రంగు పూసినట్లుగ నేత్రోత్సవము గొల్పుచుండును. పంట కాలువలయందు నీరు గలగల ధ్వనిచేయుచు, ధారాళముగా ప్రవహించుచుండును. కాని, యెవరి "మామూళ్ళు" వారికి చెల్లింపనిచో నాసంవత్సరము పంటలు పాడైనవే. కరణముగారు చేయిచాచినపుడేమైన ముట్టజెప్పని యెడల కీడు మూడినదే. పోనిండు. ఇది పెద్ద గ్రామము. కరణమొక్కడియు జేయులే దనుకొందము. ఇంకొకచోట జూడుడు. కరణము బాధతప్పిన రెడ్డిబాధ తప్పదు. గ్రామమునసబుతో కలహము పెట్టుకొనినవాడు చచ్చినవాడే! ఎన్ని కేసు లయినను మీదబడును. ఎన్ని సారులైనను పశువులు బందెలదొడ్డిలో నుండును. ఎన్ని చిక్కులైనను గల్పించును. గ్రామముల మాటయేల? ఒకచిన్న బస్తీకి పొండు. అచ్చట నొకవైద్యశాలకూడ గలదు. వైద్యశాలాధికారి చాలమంచివాడు. ఒకదమ్మిడీయయిన బుచ్చుకొనడు. అయినప్పటికి నెందరో బీదవాండ్రు రోగమువచ్చి చచ్చుచుండినను, నేమంగలివైద్యుని దగ్గరకో, లేక ఏదూదేకుల సాహెబు దగ్గరకో పోయి యొకమాత్ర దెచ్చుకొందురు గాని, వైద్యశాలయొద్దకు పోనేపోరు. ఇంగ్లీషుమందన్న భయము. డాక్టరుగారన్నహడలు. ఎందువలన? కాంపవుండర్లకు మామూళ్ళిచ్చినగాని మందులియ్యరట! వైద్యశాలయందుండి చికిత్స చేయించుకొనవలయునన్న ముడుపు జెల్లించినగాని, అసలుస్థలమే దొఱకదు. స్థలము దొఱకిన శ్రద్ధగా చూచువారే యుండరు. ఈవిధముగా అన్నిచోట్లను జరుగుచున్నదని యెవరును జెప్పజాలరు. కాని, యెచ్చటకు బోయినను చెవులు గింగురుమను నీవార్తలన్నియు సర్వాబద్ధము లగునా? నిప్పులేనిదే పొగరాజునా? సరే దీని నట్లుంచి, పోలీసు స్టేషనుగల గ్రామమునంగతి చూడుడు. పోలీసు స్టేషను కలదని ప్రజలు సుఖముగా నిద్రించవచ్చు ననుకొందురా? పోలీసువారున్నారని జరిగే దొంగతనములు మానుచున్నవా? కోళ్ళు, ధాన్యము, బట్టలు, నగలు మొదలగునవి వేనికవిపోవుచునే యుండును. దొంగలు దొఱకుట కష్టము. ఒకవేళ పోలీసువారెవరినైన బట్టుకొందురా? వారేపాపము నెరుగనివారై యుందురు. ఇంకొక గ్రామము విషయమై యోజింపుడు. దీనిచుట్టు చక్కని పచ్చికతో గప్పబడిన

కొండలు. గ్రామస్థుల యుపయోగము నిమిత్తమై గడ్డిని దొరతనమువారు బహుజాగ్రత్తగ సంరక్షించుచున్నారు. అయినను చిన్న చిన్న యుద్యోగీయులు ప్రజలకు పెట్టు బాధ లెవరికి తెలియవు? కొద్దిగొప్ప విచక్షతలేకుండ అందఱకు నిష్పాక్షికమైన న్యాయము చేయుటకై కలెక్టరుగారు కూర్చుండుదురు. వీరెంత న్యాయస్వరూపులైనను, ప్రజలు వారియొద్దకుపోయి తమకష్టసుఖములను విన్నవించుకొనుటకైన వీలుపడదు. ముందుగ డవేదారుల సంగతి చూచినగాని కలెక్టరుగారి దర్శనము దొరకుటయే దుర్లభము. ఇట్లు చెప్పుటచే చిన్నయుద్యోగీయులందఱు లంచములు తినువారే యని మాయభిప్రాయ మెన్నటికిగాదు. యోగ్యులైనవారు వీరిలో నెందరో కలరు. వారందఱు పూజ్యులు. ఈలంచములు పుచ్చుకొను నాచారమొక్క హిందూదేశమునందే లేదు. ఇది యన్ని దేశములందును సామాన్యమైన దురాచారమే. మానవప్రకృతి యంతయు నొక్కటే. లంచములు పుచ్చుకొనువారు న్యాయమును రక్తమును విషవంతముగాచేయు వేఱుపురుగులవంటి వారనియు మానవరూపమును ధరించిన క్రూరరాక్షసు లనియు, చెప్పవచ్చునా? అది న్యాయముకాదు. వీరిలో చాలమంది బీదలు. వీరినాశ్రయించి యెందరో జీవింపవలసి యుందురు. సంసారభారమునకు గావలసిన ద్రవ్యముల కొఱకై వారిట్లు చేయవలసి వచ్చుచున్నది. తాముచేయుపనియొక్క అనర్థమును గ్రహింపజాలని వట్టి మూర్ఖులు.

పెద్దజీతము పుచ్చుకొనువారిలో లంచగొండులు లేరాయని ప్రశ్నింతురేమో? ఉండినను నుండవచ్చును. ఇట్టివారిపేరు తలచకుండుటయే యుత్తమము. దేశమీయనర్థమునుండి తప్పించుకొను మార్గములేదా? మార్గములు లేకపోలేదు నిరుత్సాహమునొందవలసిన పని లేదు. విద్యప్రబలిన కొలది జనాభిప్రాయము హెచ్చుచున్నది. ప్రజలు తమహక్కులను గ్రహించి వానిని బొందయత్నించుచున్నారు. జనాభిప్రాయము ప్రబలిన కొలది నీచరభ్యాసములన్నియు మెల్లమెల్లగా నశించును. నేనొకరోజున నెల్లూరునందలి యొక గ్రామమున, దారినే పోవుచుంటిని. ఆ దారినే ఒక పల్లెటూరివాడును, స్త్రీయును మాటలాడుచు వెళ్ళుచుండిరి. వీరిరువురును మిక్కిలి దరిద్రులవలె గనుపట్టుచుండిరి. చాలవృద్ధులు. ఈముసలివాడు చెప్పుచుండిన రోషపుమాటలు [illegible] నాయనకేదియో అక్రమము జరిగినదని యనుకొంటిని. "నన్నుత్రొక్కివేయుద మనుకొన్నాడు నాబోలు! ఇదెన్నటికి సాగదని తెల్పెదను" అని యావృద్ధుడేమో ఆగ్రహముతో జెప్పుచుండెను. చదువురాని యాబీద ముసలివాడు సయితము శాసనములును, న్యాయమును తనపక్షమునే యున్నవనియు, తనకెవరు హానిచేయజాలరనియు గ్రహింప గలిగియుండెను.

విద్యాహీనులును, పరమసాధువులును నగు హిందూదేశీయులకు న్యాయము వారిపక్షమునే యున్నదనియు, తమకర్మమని ప్రతివానిచేత తన్నులుతిన నక్కరలేదనియు, నీయవస్థనుండి తప్పించుకొను మార్గములు వారియొద్దనే కలవనియు, హిందూదేశ సేవకాసంఘము వంటివారు బీదరైతులకు నయితము బోధించుచున్నారు. ఈబాధలన్నిటిని దప్పించుటకు "అయికమత్యము" కంటె బలమయిన ఆయుధము లేదు. దీనిలాభము నిదివఱకే అచ్చటచ్చట జనులు పొందుచున్నారు.

ఒక సంగతి చూడుడు. ఏదియో కుగ్రామమున నొక గొప్ప నేరము జరిగిన దనుకొనుడు. లంచగొండియగు నొకయుద్యోగి దీని విచారణ నిమిత్తమై వచ్చి, ఊరిలో గొందఱను పోగుచేసి, తనకేదో కొంతలాభము కలుగజేయని యెడల, నేదియో నేరము మోపి చిక్కులు కలిగించెదనని బెదరించుననుకొనుడు. బ్రాహ్మణులు, కోమట్లు, శూద్రులు, మాదిగలు, మాలలు అందఱుచేరి, తమలో తాము సంప్రదించుకొని యేమియు నియ్యకున్న ఇతడేమి చేయగలడు? వీరందఱుచేరి యాతని వశత విషయమై దొరతనము వారికి జెల్పిన యాతని మచ్చ చూపరా? అయికమత్యము చేయగలిగినపని మఱేదియు జేయజాలదు. నల్గురుచేరి యెంతటిపనినైన జేయవచ్చును. ఎద్దులు సింహము కథ చదువరులకు తెలిసియేయుండును. ఎద్దులన్నియు నొండగా నున్నంతవఱకు సింహమేమియు జేయలేకుండెను. అంతట వీనికి మాయమాటలుచెప్పి విడదీసి ఒక్కొక్కదానినే భక్షించెను. సంఘీభావము సర్వశ్రేయములకు మూలము. లాతివిధ మనర్థదాయకమని యీధర్మమును సంవత్సరాదియందు చదువరులందఱు నవలంబించెదరుగాక

# వంశపావనుడగు తనయుడు.

[ ఒకకల్పితకథ. ]

మహారాష్ట్రులకును, ఆంధ్రులకును సంవత్సరాది పండుగ ఒక్కటే. హైందవులలో ధనాఢ్యులు వెళ్ళిభుజించునొక సుప్రసిద్ధభోజనశాలకు దాము దొరలుకాకపోయినను, గావలయునని కోరు కొందరు పెద్దమనుష్యులు వెళ్ళియుండిరి. వారి యాశ సంవత్సరాది భోజనమునిచ్చట బ్రాందివైనులతోను, మాంసాహారముతోను జేయవలయుననియే. అచ్చటనున్న దొరలు, దొరసానులు పెద్దలు, పిన్నలు సొగసైన విలువగలవస్త్రములనుధరించి తమ జన్మాధిక్యతనో, విద్యాధిక్యతనో రెండును లేనప్పుడు ధనాధిక్యతనో ప్రకటించుచుండిరి. ఎచ్చటజూచినను సంతోషముతో గూడినముఖములే! ఎచ్చటవినినను బ్రాంది బుడ్ల చప్పుళ్ళే!! ఏవితినినను మాంసముకలిపినవస్తువులే!! ఎవరు చెల్లించినను గినీలే!!!

ఈహోటలు జగత్ప్రఖ్యాతినిగాంచిన తాజ్ మహలుహోటలని చెప్పవలయునా? కష్టపడి రొక్కమును గడించు సాధారణ హైందవులిందు భుజించుట కసమర్థులుగాన పిత్రార్జితము మెండుగాగల భారతీయులిందలి రుచులను జవిచూచుచుందురు. నిజమే! ఒకరిసంపాదనను ఖర్చుపెట్టుటతిసులభముగదా!

ఈమందిరమునందొక విశాలమైనగదిలో నలుగురుయౌవనహైందవులు గూరుచుండిరి. ఇందిద్దరు భాగ్యవంతులయిన మేనత్తలనుగలిగి వారికి వారసులయినట్టివారు. హోటలులో కావలసినవస్తువుల కింగ్లీషుపేరులను బహుకాలపరిచయమువలన నేర్చుకొనుటయే వారికున్న ఇంగ్లీషువిద్యాపాండిత్యము. మూడవవాడు అవివేకపుతండ్రి సతారానుండి నెలకు బంపుసొమ్ముతో పూలరంగనివలె బొంబాయినగరమందు గాలక్షేపము జేయుచున్నట్టివాడు ముప్పది సంవత్సరములకు బయిగా ఈడుగల మహాత్ముడు. ఇక నాలుగవవాడో మనకథానాయకుండగు దినకరరావు. ఈతనిపేరు దినకరరావైనను మిత్రులు ముద్దుకై సర్దారనిపిలుతురు. సర్దారుయొక్క బాహ్యవేషములనుజూచినవారు నిరభ్యంతరముగా నట్టిపేరునకర్హుడనియే చెప్పితీరగలరు. వానిసుందరమైన మహారాష్ట్ర వీరులంబోలిన ముఖము, చక్కనిమీసములకట్టు, విశాలమైన నేత్రములు, పటుత్వమయిన శరీరమును జూచినవారు సర్దారని పిలువక మరేమని పిలువగలరు! కాని దినకరరావుయొక్క గొప్పతనమంతయునాతని పైవేషమునందు మాత్రమేగలదని వ్రాయుటకు చింతించుచున్నాను. ఇంక మొదటి యిద్దరు పడుచువాండ్రును బ్రతిదినమును మొమ్మాదేవికి జేయు ఒక్కప్రార్థన యేదనగా ఎప్పుడత్తలుజచ్చెదరా, ఎప్పుడాస్తివశమగునా తల్లీ యని! మూడవవానికి తండ్రిచావవలయునని లేకున్నను బ్రతినెలయు జేతికందవలసిన మనీఆర్డరాలస్యముగా జేరినప్పుడు ముసలిముండవాడింతకాలమేల బ్రతుకవలయునురా శంకరా యనిపండ్లుపటపటకొరుకుచుండును. నాలుగవవాడగు మనసర్దారుకు నెలకుపోలీసు సబ్ ఇన్స్పెక్టరుగా వచ్చుజీతము తప్ప ఒక్కపగులగొట్టిన గవ్వయయినను పిత్రార్జితములేదు. వానిజీతము వానికిసరిపోదు. కాని వీనిపూర్వులువారిదినములలో గొప్పరణశూరులని ఖ్యాతివహించి పేష్వాలపక్షమునబోరి దేశమునకు సేవచేసినట్టివారు. వారార్జించిన జాగీరులన్నియు దినకరుని తండ్రికాలమునాటికే ఎక్కడివక్కడ సర్దుకొనినవి. దయగల బ్రిటిషుగవర్నమెంటువారాయనకొక పోలీసుఇన్స్పెక్టరుద్యోగము నిచ్చుటవలన, దానివలనవచ్చు స్వల్పాదాయముతో దనపూర్వులవలెనే జీవింపబోయి అప్పులపాలయి, ఏమున్నను, ఏమిలేకపోయినను, దనపూర్వులకందరికినిజన్మమొసంగిన స్వగృహమునుసయితము గోలుపోయి, మృతినొందునప్పటికి దినకరరావును నిస్సహాయునిగా జేసిపోయెను. దినకరరావుకున్న యిద్దరు చెల్లెండ్ర కట్టు

ట్లో బంధువులు పెండ్లిచేసి వారినిభర్తలయింటికి సాగనంపిరి. ఈతనితల్లి యొక అద్దెకొంపలో దక్కనులో నొకగ్రామమందుపడియున్నది. వీని తండ్రియందు గౌరవముగలయొకదొరగారు వీనికి సబ్బిన్స్పెక్టరుపని నిప్పించెను. సర్దారుయొక్క నిజస్థితి యిట్టిదైనను దనపూర్వుల నామమును ధరించుచున్నవాడగుటచే వారి పౌరుషమునుగాక పోయినను వారిడాబుడంబములను మాత్రము విడిచిపెట్టలేదు.

నేడుమహారాష్ట్రసంవత్సరాది పండుగయగుటం జేసి బొంబాయిలోని తనముఖ్యస్నేహితులలో ముగ్గురుని ఈహోటలులో విందుకైపిలిచెను. కన్నతల్లి అన్నములేక మాడుచుండగా నీనిర్దయుని కామాటయే మనస్సునకు బట్టలేదుకాని తానాదినము మార్వాడీవాని వద్దనుండి అప్పుగాబుచ్చుకొనిన యేబదిరూపాయలను బొంబాయిలో బ్రహ్మాండమగు న భోజనమందిరమునందు పాడుచేయుటకుమాత్రము వెనుకదీయులేదు. ఈసొమ్ము వాని తల్లికి బంపియుండినయెడల నాపెకారు మాసముల గ్రాసమునకు సరిపోవునుగదా?

„అహో, ఈవేళ ఏమయినదో తెలుసునా. ఆమార్వాడీ పిసినారి గాడిదె 15 దినములు తెగత్రిప్పి ఈనెల జీతమంతయు వ్రాసియివ్వనిది అప్పుగా నేబదిరూప్యము లీయననెను. నాకప్పుడెంతకోపము వచ్చినదో ఏమిచెప్పగలను. నాపూర్వుల దినములలోనైనచో వానినిచెట్టుకు వ్రేలాడగట్టి పేముబెత్తముతో చెండాడియుండకుందునా. ఇది పాడుబ్రిటిషుగవర్నమెంటు. పోకిరులు, ప్లీడర్లు, లాలు, మేజస్ట్రేటులు, అపీలులు ఇంకనెన్నో వల్లకాటిలోనివి గలవు. ఇంతజేసినను సుఖముగా జెయిలులో తిన మనిశిక్ష. ఈబ్రిటిషు ప్రభుత్వమువారి అమితదయవలెనే వారిరాజ్యము పోవునని నాకు తెలుసును.” అని సర్దారనెను.

„ఓహో, పోలీసు సబ్బినస్పెక్టరుగారా ఈమాటలనవలసినది” అని మొదటి స్నేహితుడు హేళనము జేసెను.

„ఫర్వాలేదులే. మనము మరాఠీలో మాటలాడుచున్నాము. ఈతెల్లదొరలకు మనగొడవ ఏమి తెలియగలదులే. అయినను ఈపాపిష్టిరోజులలో గోడలకుచెవులున్నవి. ఆ రవ్వంత యుద్యోగముపోయెనా భవతీ భిక్షాం దేహి అనుచు బయలుదేరవలసినదే. అనిసర్దారు మారువల్కెను.

„అయితే మార్వాడీవాని సంగతేమయినది”

„ఇంకేమున్నది. ఇది బ్రిటిషుప్రభుత్వముకాదు. కానిమార్వాడీ ప్రభుత్వము. క్లైౖ అంటే దస్త్రము కట్టలు. స్మాలుకాజు కోర్టులు, డిక్రీలు, వారంటులు, జప్తులు. కావలసినన్ని పాడుపీడలు. జీతమువ్రాసియిచ్చి రూపాయికి పండ్రెండణా లేపుచ్చుకొంటిని.

„వడ్డీయో”

„నెలకు రూపాయికి ఒకఅణా”

„ఇంతకష్టపడి యీవిందుమాకెందుకు”

„అబ్బో, ఎంత కనికరము! మీతావున సొమ్మేమిచ్చినట్లు. ఆ అత్తముండలిద్దరు చచ్చినప్పుడుగదా మనమందరము భాగ్యశాలులము” అని దినకరు డెత్తిపొడిచెను.

„అట్లయినచో, సర్దారూ, అప్పులుపెట్టిన మార్వాడీవాండ్రనందరిని ప్లేగుపట్టుకొని వీకి దిగమ్రింగునుగాక” యని రెండవస్నేహితుడు దొరలుపోయువిధమున సారాయిని గ్లాసులోబోసి ఒకక్షణములో కడుపులోనికి జారవిడిచెను. దీనినేఆంగ్లేయులు „డ్రింకింగ్ డిటోస్టు” అనిఅందురు.

ఇట్టి సరససల్లాపములలో నారితేరినవాడు గాన సర్దారు „మనత్రోవకడ్డమున్న ముసలి అత్తముండలుత్వరగా జచ్చెదరుగాక” యని గ్లాసును ద్రాక్షసారాయితో నింపి లోపలికి జారవిడిచెను. అందరును ఇట్టిసమయోచితసంభాషణమునకై పకపకనవ్విరి. అంతట ఈనలుగురి స్నేహితులయొక్క ధోరణియు గుఱ్ఱపుబండ్లు, మోటరుబండ్లువారుముందు నిషసింపదలచిన సుందరమందిరములు, నాటకములు, గుఱ్ఱపుపందెములు, లాటరీలు, అన్నిటికంటె ముఖ్యముగా స్త్రీలు మొదలగువానిమీద మరలెను. ఈసంగతులలో నందరును విశారదులవలెనే మాటలాడిరి. ఈనలుగురినోటిలో గొప్పయుద్యోగియు లంచలను లంచగొండులయిరి. గొప్పసత్పురుషుల కీర్తియంతయు వినాశమయినది. మహాపతివ్రతలగు స్త్రీలునయితేమ



St. John Ambulance Association Rajahmundry. రాజమహేంద్రవరములో సెయింటుజాన్ అంబ్యులెన్సు అసోసియేషన్.



The Andhra Students of Edinburgh. ఎడింబరోలోని ఆంధ్రవిద్యార్థులు.

The Andhra Students of the F. L. Class in the Madras Law College.



చెన్నపురి లా కాలేజీలో ఎఫ్. ఎల్. విద్యార్థులు.

Honouring the Sheriff of Madras.



చెన్నపురి షెరిఫ్ గారిని గౌరవించుట.

The Madras Ayurvedic College



ఆయుర్వేద కళాశాల, చెన్నపురి.

వ్యభిచారిణులు కాగా సాధారణస్త్రీల సంగతి యని వ్రాయనేల? వారు త్రాగినపదార్థము వారినాలుకలను విచ్చలవిడిగా వదలివేసెను.

ఆహా! ఆనిందింపబడిన యుద్యోగులుగాని, స్త్రీలుగాని పురుషులుగాని ఆ గదిలో ఆసమయమందుండి వినినచో ఎవరివో కొందరివి ప్రాణములు పోయి యుండవలసినవే గదా?

ఇంతలో నొక భోజనగృహసేవకుడు వచ్చి "దేవరా, తమకొరకెవరో వచ్చినారండి" యని సర్దారుతో మనవి చేసెను.

"ఎవడో వానిని ఇక్కడకు రమ్మనుము. నేను లేచి వెళ్ళి చూచుస్థితిలో లేను"

"చిత్తమండి"

అంతట సర్దారుయొక్క అర్డర్లీపోలీసుకాన్ స్టేబిలు లోపల ప్రవేశించెను.

"ఏమోయి, ఏమిముంచుకొని పోయినదని యిచ్చటికి పరుగెత్తుకొని వచ్చినావు" అని యజమాని యడిగెను.

"చిత్తమండి, కొనుమని పండ్లు, సారాయి బుడ్లు, పుష్పహారములు, పెద్దదొరగారికి బంపుటకయి తెచ్చినానండి"

"ఓహో, ఇదియొక పనితగలబడినదే, యీపూట. మనపండుగ మనకుగాని మన దొరల కెందుకీ బహుమతులో. ఇది డిపార్టుమెంటులో లేనిపోని పాడురివాజు." అని విసుగుతో సర్దారు పలికి "సరే, విక్టోరియానొకటి బాడుగకు కుదిర్చి అందు నీవు తెచ్చిన సామానులను బెట్టి కూర్చునుము. నేను తరువాత వచ్చెదను." అని కాన్ స్టేబిలును వెళ్ళమనెను. కాని వాడు కదలలేదు.

"పోవేమి, అటుయిటు ఏల చూచెదవు. జన్మములో ఇట్టియింటిని జూడలేదు కాబోలును"

"కాదండి, తమకొక యుత్తరము వచ్చినదండి"

"ఇటుల పారవేసి పో," అని సర్దారు గర్జింపగా దానినిచ్చి కాన్ స్టేబిలు నడచిపోయెను. ఈయుత్తరము జదువగానే సర్దారుయొక్క ముఖము వెలవెల బోయినది. తన స్నేహితులు లాగుకొని చదివి నవ్వెదరని నెమ్మదిగా దానిని క్రిందికి జారవిడిచి బూట్సుకాలు క్రింద నణచియుంచెను. ఇంతలో నలుగురు స్నేహితులును, మూడునాలుగువైను బుడ్లను తిరిగి ఖాళీచేసిరి. తరువాత సిగరెట్లవాసనలతో గది యంతయు నిండియుండెను. దినకరరావుకు నిషా హెచ్చినది. అట్టిసమయమందెట్టి మధురభాషణలు నోటినుండివచ్చునో మనకదరికిని దెలుసునుగాన విస్తరించి వ్రాయనవసరము లేదు. ఏలాగుననో హోటలులోని నౌకరులసహాయ్యమువలన ఆనలుగురును అద్దెబండ్లలోబడి వారివారి యిండ్లకుజేరిరి.

వీరు వెళ్ళినతరువాత ఆగదినూడ్చుటకయి వచ్చిన యొకపనికత్తెకొక యుత్తరము దొరికినది. దానినిదీసుకొని వెళ్ళి ఆస్త్రీయొక గుమాస్తాకిచ్చెను. ఆయుత్తరమును అయిదురూపాయల నోట్లు రెండును, తెల్లతెల్లబోయిన సిరాతో నొకస్త్రీవలన వ్రాయబడిన మరాఠీయుత్తరమును గలవు. ఆయుత్తరములో నిట్లున్నది.

"నాముద్దులబిడ్డా,

నీవు చెప్పిన ప్రకారము చేసితిని. నేచేసినపనికి నీవుముందెన్నడును తప్పులు పట్టకుందువుగాక. ఏమున్నను ఏమిపోయినను మనపూర్వులతి భద్రముతో వంశధనముగ గాపాడుకొనుచున్న పేష్వాబాజీరావిచ్చిన అమూల్యధనమును నేటికి మన హయాములో బోగొట్టుకొన వలసివచ్చెనుగదాయని దుఃఖించుచున్నదానను. నేజేసిన యీమహాపరాధమునకయి వారుదయ్యములై నన్ను బట్టుకొనకుందురుగాకయని భవానీతల్లికి మ్రొక్కుచున్నాను. అయినను నాతప్పేమికలదు? నీ విప్పుడింటికి పెద్దవుగదా? నేనాడుదానిని. నీయిష్టప్రకారము జేసితిని. ఆవీరఖడ్గమునకు బంగారుపూతయు, కెంపులును ఉన్నను కాబూలీవాడు ప్రాతపడి పోయినదని 50 రూపాయలకెక్కువ సొమ్మీయలేదు. వీనితప్ప మరెవ్వడును దానిని గొనలేదు. రహస్యముగా కొంగులో దాచుకొని రాత్రిపూట వానియింటికొక త్తెని దీసుకొనివెళ్ళుచుండగా నింకొక దారిని భవానీ దేవాలయమునకుబోయి అచ్చటనేల యీఖడ్గముతో అమాతయెదుట నాదరిద్రపుప్రాణమును త్యజింపరాదనిపలుమా అనుకొంటిని. ఇంతలో భవానీయా

లయుమెదుటనే నిలిచినట్లు గనుగొంటిని. కాని, ప్రియకుమారా! నీయవసర మెట్టిదో, ఏమియిబ్బందిలో నీవున్నావో అని తల్లినగుటచే భీతిల్లి ఈపాడుప్రాణములను నీయందలితీపిచేత బోగొట్టుకొనక ఆకాబూలీవాని గృహమునకేవచ్చినదానిని వెళ్ళితిని. నేనుమహారాష్ట్రస్త్రీలలో పేరాగ్రగణ్యుల కులమునందు జన్మించినదానను. కాబూలీవానియింటికి రాత్రిపూటవెళ్ళుట. ఏమిఘోరము! అహా, ఎంతమానమును విడిచితిని!! పూర్వపు వీరనాయికలిట్లు జేయుదురా? కాని యిదంతయు నీకొఱకేనను మనశ్శాంతినిగలిగి యుంటిని. వాడిచ్చిన యేబది రూప్యములలో నయిదుసత్తువి. నాకారాత్రి సత్తువేమిటో మంచివేమిటో జూచునంతనిబ్బరము లేకపోయెను. ఎవరితో నేమి ఇట్టిమోసమునుగుఱించి చెప్పినను మనపరువుపోవునని కుక్కినపేనులాగూరకుంటిని. నాయనా, నాదురదృష్టమింతటితో దీరలేదు. ఏలాగుననో నావద్ద రూపాయలున్న సంగతి బియ్యపువానికిని, ఇంటివానికిని, గుడ్డలిచ్చినవానికిని, పాలవానికిని, తెలిసి వారి వారి సొమ్మియ్యమని బాధపెట్టిరి. వారినిబంపివేయుటకు దీర్ఘకాలపు టప్పులగుటచేత ముఖము జెల్లక ముప్పదిరూపాయలిచ్చి పంపివేసితిని. నీకుబంపవలసినసొమ్ములో దక్కువ యయినను, నాయబ్బా, నేను ఋణవిముక్తనై నిబ్బరముగా నిద్రింపజాలినందునకు నీవయినను సంతోషింపకుందువా? అయ్యో! దేవుడా! సుఖమైననిద్రా, యీపాపికి!! అట్టి వంశధనమును యమ్మిన పాపిష్ఠిదానికి సుఖనిద్రపట్టునా. ఆఖడ్గముచేతినుండిపోయి నను హృదయములో జేరిపొడుచుచున్నది. కుదువయయిన బెట్టకేలయమ్మితిని? అప్పుడు నీవుపంపమనిన యేబది రూప్యములను తాకట్టుక్రింద నీయననినాడు. ఇకమిగిలిన యిరువది రూప్యములను నీకుబంపవలయు ననుకొంటిని. ఇంతలో సంవత్సరాది పండుగ యగుటవలనను, వారును నీవలెనే నాకడుపున బుట్టినవారగుటచేతను, అత్తవారిండ్లకు బంపినదిమొదలు ఒక్కపండుగకైనను బిలిచి యింతపసుపు కుంకుమ మనమింతవఱకు బెట్టనందువలనను, ఇదియే నాకడపటి సంవత్సరాది పండుగయని నాదృఢనమ్మకమగుటచేతను, ఇకదిరిగివారినీలోకములో బిలిచి పెట్టబోనుగదాయని చెరియయిదురూపాయల చీరెలను గొనిపంపితిని. నీముద్దుచెల్లెండ్రకిట్లు పంపినందునకైనన్ను శపించకుందువుగాకయని వేడుకొనుచున్నాను. నాకును గట్టిబట్టలు లేవు అన్నియు చినుగులే. అతుకులు వేసుకొని కాలక్షేపము జేయుచున్నాను. నేనుమూడు రూపాయలకయినను ఒక్కచీరెను కొనుక్కొనవలయుననుకొంటిని. కాని నీస్వభావము నెఱుగున్నదాననగుటవలన ఇప్పటికే ఆగ్రహపడుదువను భయముచేత నాకొఱకెయిచీరెను కొననయితిని. మిగిలిన అయిదురూపాయల రెండు నోటుల నిందుతో జతపఱచిపంపితిని. నాయనా, ఈపదిరూపాయలతో సంవత్సరాదిపండుగకు క్రొత్తబట్టలను కొనుక్కొనుము. వానిని కట్టుకొనునప్పుడు ఒక్కసారియయినను నీప్రియమయిన తల్లిని తలంచుకొంటివేని ఆమె కృతకృత్యురాలు.

బొంబాయివంటి మహానగరములో పదిరూపాయలొక లెక్కలోనివి కావు. నీ వనేకపర్యాయము లనునట్లు అవి "వెధవపదిరూపాయలే" కాని, నాపట్టీ, సర్కారు వారిచ్చుచున్న ఆరురూపాయల వితంతువుల పింఛనులో నెలకు సగముభాగము మూడురూపాయలు నీకుబంపుచు మిగిలిన మూడురూపాయలతోనే ఈపాడుకఱవు దినములలో బ్రతికియు బ్రతుకక, చచ్చియు చావక, కాలక్షేపము జేయుచున్న నీతల్లి అట్టినిందార్హురాలుకాదని నీయంతరాత్మ చెప్పకపోవునా?

తండ్రీ, నేను చేసినదానిలో నేదయిన తప్పున్నచో నన్ను క్షమింపుము. దేవుడు నిన్నెల్లప్పుడును రక్షించుచుండునుగాక! నేనుచచ్చిపోవులోపల ఒక్కసారయినను వచ్చిచూచి ముద్దిచ్చెదవేని శాంతముతో జచ్చిపోగలను.

ఇట్లు,

నీప్రియజనని.

సమాప్తము.

# ముక్తిమార్గము.

ఇందలి సారాంశము ఋగ్వేదాది భాష్యభూమికనుండి గ్రహింపబడినది.

[ వేలాల సుబ్బారావుగారు. ]

ఈశ్వరనిర్మితంబగు నీసృష్టియందు మనుష్యజన్మ మెత్తిన సమస్త ప్రాణులకు ముక్తియే పరమావధి. అనంఖ్యాకములగుజీవరాసులచే బరిపూర్ణమైన యీబ్రహ్మాండమందన్నింటికంటె నత్యుత్తమమగు జ్ఞానసమేతమైన మనుజశరీరము ప్రాప్తించిన తరుణమందే మానవుఁడు తన జన్మముయొక్క విధ్యుక్త ధర్మముల బాగుగఁ దెలిసికొని తన పరమావధికొరకై తన శరీరము వినియోగింపవలయునుఁగాని యుపేక్షించి యక్కరపట్టని వానింబలె నూరక కూరుచుండియున్న యెడల బ్రయోజన మావంతయులేదు. అట్లువానీనుఁడై యున్నచో హీనములైన తక్కిన జంతు జన్మములట్ల మానవజన్మమునుగూడ నిరర్థకము చేసికొనుటయేగాని వేరుకాదు. పరమావధి సంపాదనమే మానవజన్మమునకు ముఖ్యకర్తవ్యంబని చక్కగ గుఱెఱిఁగిన వారలై మన యార్యావర్తమందలి మన పూర్వీకులందరు అమోఘులు లైన యెడతెగని ధర్మానుష్ఠానంబుల చేతను, అర్థవిచారంబుల చేతను దానిని సాధించి సకలజనోపకారము నిమిత్తము తమమార్గముల లోకమున కంతయు వెల్లడిగావించి పోయిరి. ఎంతకాలమువరకు వారిసత్యమార్గముల నవలంబించి నడచికొనుచు వచ్చిరో యంత పర్యంత మార్యులు మహోన్నతదశయందుండి యుత్తమసౌఖ్యముల నందుచువచ్చిరి. కాని కాలక్రమంబున సంభవించిన యనేకములగు మార్పుల తోబాటు వారి సత్యమార్గంబులకుఁగూడ మార్పులు కలిగి ప్రాచీనుల సత్యార్థముల మనవారలెప్పుడు తెలిసికొనఁజాలక పోయిరో యప్పటినుండియే సకలానర్థములు వాటిల్లినవి. స్వార్థపరత్వంబువలనను, బక్షపాతమునను, అజ్ఞానముచేతను దమ పెద్దలు చూపించిన సత్యమార్గముల నెప్పుడు విడనాడిరో యప్పటినుండి యార్యులు ముక్తికి దూరగులైయుండుట సరియేగదా భుక్తికిఁగూడ దూరగులై యున్నారనుటకు వర్తమానకాల మందలి యార్యావర్తముయొక్క హేయమైన శోచనీయస్థితియే వేనోళ్ళఁ జాటుచున్నది. చదువరులార! మానవ జన్మంబునకు బరమావధియగు నీముక్తి యనునది యేమి? ఏదేని పదార్థవిశేషమా? ఖండవిశేషమా? లేక యంతరిక్షమందు బరిభ్రమించుచుండు నేదేని గ్రహవిశేషమా యంచు రేని మనపూర్వుల సత్యశాస్త్రప్రమాణ పూర్వకంబుగ వచించెద వినుండు.

ముక్తియనఁగా విడిపడుట. జగత్తునందెన్ని ప్రకారంబులగు దుఃఖములు గలవో వాని యన్నింటి నుండి విడివడి యానందమే స్వరూపముగాగల పరమేశ్వరుని బొందుటవలన సర్వదా ఆనందమే యనుభవించుచు జన్మమరణాది దుఃఖసాగరంబునఁ బడక యుండుటకే ముక్తియనిపేరు. ఇది పదార్థవిశేషముగాదు; స్థానాంతరముగాదు. సర్వవ్యాపియగు పరమేశ్వర పదంబనుట వలన నేదియో యొక నియమితస్థల విశేషంబనుటకు మొదలే యవకాశము లేదు. మరియు

ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంత్య స్థూలమనణ్వ హ్రస్వమదీర్ఘమలోహిత మస్నేహ మచ్ఛాయ మతమోవాయ్వ నాకాశ మసంగమ స్పర్శమగంధ మరస మచక్షుష్క మశ్రోత్ర మవాగమనో తేజస్క మప్రాణ మముఖ మనామాగోత్రమ జరమ మరమభయ మమృత మరటోశబ్ద మవివృత మసంవృత మపూర్వ మనపర మనంతర మబాహ్యం న తదశ్నోతి కశ్చన నతదశ్నోతి కశ్చన.

శ. కాం. 14. అ. 6. కం. 8.

నాశ, స్థూల, సూక్ష్మ, లఘు, లోహిత, ఛాయా, అంధకార, వాయు, ఆకాశ, సంగ, శబ్ద, స్పర్శ, గంధ, రస,

నేత్ర, కర్ణ, మనో, తేజ, ప్రాణ, ముఖ, నామ, గోత్ర, వృద్ధావస్థా, మరణ, భయ, ఆకార, వికాశ, సంకోచ, పూర్వ, అపర, అంతర, బాహ్యంబులనెడు దోషముల నుండియు గుణములనుండియు రహితమై నిరంతరానంద మయంబగు నీశ్వరపదమే మోక్షపదము. పూర్వోక్తము లైన గుణదోషములేదైన నాకారముగల ద్రవ్యమునాశ్ర యించి యుండును గాని వేరుగనుండవు. ఆకారములేక యంతములేక సర్వత్రవ్యాపించియుండుయానందమే యా కారమైన పరమేశ్వరపదమే యనునప్పుడు ద్రవ్యము వలనంగలుగు గుణదోషములుండుట కవకాశ మీకలుగదు.

పురుషార్థశూన్యానాం గుణానాం ప్రతి ప్రసవః
కైవల్యం స్వరూప ప్రతిష్ఠావాచితి శక్తిరితి.
యోగ. అ. పా. 4. సూ. 34.

శుద్ధ మధ్యమజాడ్య (సత్వ-రజ_స్తమో) గుణం బులంగలిగి కారణరూపంబుననుండు ప్రకృతిమూలమున గలుగు యవస్థలును, తత్కార్యరూపమున గలుగు బురుషార్థంబులును నష్టమై శుద్ధవిజ్ఞానము కలిగి జీవుఁడు తన తత్వమెట్లో యట్టిస్థితినుండి స్వాభావికమైన శక్తిని, గుణములను గలిగి పరమేశ్వరాకారంబగు విజ్ఞాన ప్రకాశమందును, నిరంతరానందమందును నుండుటకే కైవల్యము లేక మోక్షమనిపేరు. మోక్షదశయందు జీవాత్మకు భౌతిక శరీరముగాని, ఇంద్రియగోళకములు గాని యుండవు. స్వాభావిక విశుద్ధగుణంబులు మాత్ర ముండును.

శృణ్వన్ శ్రోత్రంభవతి, స్పర్శయన్ త్వగ్భవతి, పశ్యన్ చక్షుర్భవతి, రసయన్ రసనాభవతి, జిఘ్రన్ ఘ్రాణంభవతి, మన్వానో మనోభవతి, బోధయన్ బుద్ధిర్భవతి, చేతయంశ్చిత్తం భవత్యహం కుర్వాణో హంకారోభవతి. శత. కాం. 14.

వినఁగోరినపుడు శ్రోత్రశక్తియు, స్పృశించినపుడు త్వగింద్రియశక్తియు, జూడఁగోరిన నేత్రశక్తియు, రుచి జూడనెంచిన రసనాసామర్థ్యంబును, వాసనజూడఁదలచిన ఘ్రాణశక్తియు, సంకల్ప వికల్పములందు మనోశక్తియు, నిశ్చయించుటకు మేధాశక్తియు, స్మరింపనెంచినఁ చిత్త శక్తియు మొదలైనవి స్వాభావికమైన స్వశక్తివలననే ప్రాప్తము లగుచుండును. భౌతిక శరీరముయొక్క యాధారమువలన నింద్రియములద్వారా జీవుఁడు సమస్త కార్యంబులఁ జేసికొనుచుండుచాడ్పున మోక్షదశయందు స్వశక్తిచేతనే సకలవిధముల బరిపూర్ణానంద మందుచుం డును. శుద్ధవిజ్ఞానియై యుండుకారణమున సమస్తసృష్టిని జూడఁగలుగును. సమస్త విద్యావిలాసుఁడగుటచే లోక లోకాంతరంబులగూడ అనగా మన కనులకు గనుపడు నట్టియు, గనబడనట్టియు లోకములందు నయితము జరిం చుచుండును. నిర్మలుఁడగుటవలన నత్యంత విజ్ఞానము కలిగియుండును. సన్నిహితంబులగు సమస్తపదార్థముల తెలివియుఁ గలుగును ఇటి సౌఖ్యవిశేషమే స్వర్గము. విషయ తృష్ణలయందు దగుల్కొని దుఃఖమనుభవించు చుండుటయే నరకము. ఇట్టియానందమయంబగు నీమో క్షపదమును నిరంతర పరిశ్రమలమూలమున మనపూర్వు లైన యార్యులు సాధించిన విధానంబు లెవ్వియన:—

ఉపాసనవలన నవిద్యాది క్లేశంబులను, నధర్మా చరణాది దుర్గుణంబులను నివారణముచేసికొని శుద్ధవిజ్ఞా నంబునొంది ధర్మాచరణాది సుగుణంబుల నవలంబించుట మూలమున నాత్మ కున్నతికలిగి జీవునకు ముక్తిప్రాప్త మగును. చిత్తవృత్తుల బంధించి మోక్షసాధనమం దెల్ల ప్పుడును దత్పరుఁడై యుండుటవలన మనుష్యునియందుం డెడు అవిద్య, అస్మిత, రాగ, ద్వేష పంచక్లేశములు నాశనమొందును. ఈ యైదింటిలో అస్మిత రాగద్వేషాభి నివేశంబులను, అభినివేశంబులను నాలుగు ప్రకారములగు దుఃఖములకు అవిద్యయనునది జన్మ భూమియగు దల్లివంటిది. అవిద్యవలననే తక్కినక్లేశ ములు పొడముచుండును. అవిద్యవలననే మనుష్యులు మూఢులై యజ్ఞానాంధ కారంబునంబడి జన్మ మరణాది దుఃఖపారావారంబున మునిగి తేలుచుందురు. అవిద్యాంధకారమున మగ్నులై దిక్కుతోచక వ్యథల ననుభవించుచుండు మానవుల కెప్పుడు విద్వాంసులును, ధర్మాత్ములును నగు ఉపాసకులయొక్క సత్యవిద్యాబోధ మువలన నవిద్య నశించి జ్ఞానముత్పన్నమగునో యప్పుడే వారికి ముక్తికలుగును.

అనిత్యాశుచి దుఃఖానాత్మసు । నిత్యశుచిసుఖాత్మఖ్యాతిరవిద్యా.

అనిత్య, అశుచి, దుఃఖ, అనాత్మలయెడల నిత్య, శుచి, సుఖ, ఆత్మలయొక్క భావముగలిగి యుండుటయే యవిద్య యనఁబడుచున్నది. వీనిలో ననిత్యమందు నిత్య భావము గలిగియుండుట యనఁగా సంయోగవిభాగముల వలన నుత్పన్నములైన శరీరాది స్థూలపదార్థముల యెడలను లోక లోకాంతరములందును నిత్యబుద్ధికలిగి యివి నాశనమందక యెల్లప్పటి కిట్లేయుండునని తలంచుటయు, నాశన రహితములైన ఈశ్వర ప్రకృతులను అనిత్యములని తలంచుటయు నవిద్యయొక్క ప్రథమభాగము. మలినము తోడను దుర్గంధముతోడను గూడుకొనియుండు శరీరంబులఁ బవిత్రములని తలంచుటయు, చెరువులు, బావులు, కుంటలు, నదులు మొదలగువానియెడల దీర్థభావముకలిగి వానిలో మునుఁగుటచే శాపముపోవునని తలంచుటయు నట్టి తీర్థంబుల సేవించిన తైర్థికనామకుల చరణామృతంబు పావనంబని గ్రోలుటయు, నేకాదశి మొదలగు మిథ్యా వ్రతములందు ధ్యానముగలిగి యాకలి దప్పులచే సంభవించు బాధలసహించుటయు, స్పర్శేంద్రియ భోగమందు మితిమీఱిన ప్రీతి గలిగియుండుటయు మొదలగు వాని యెడలశుద్ధబుద్ధికలిగి అనఁగా నీపైనవచించినవిమాత్రమే పవిత్రములు శుద్ధములు నను నమ్మకమూని సత్య విద్య సత్యభాషణాది విశుద్ధవ్రతంబుల యెడలను, పవిత్రములైన పదార్థముల యెడలను, ధర్మము, సత్సంగము, పరమేశ్వరోపాసనము మొదలగు పవిత్రతీర్థముల యెడలను, సర్వోపకారత్వము, జితేంద్రియత, సకలభూతములందు ప్రేమభావముతోడ వర్తించుట మొదలగు విశుద్ధ ధర్మముల యెడలను నపవిత్రబుద్ధి గలిగియుండుట అవిద్యయొక్క ద్వితీయభాగము. విషయ, తృష్ణ, కామ, క్రోధ, లోభ, మోహ, శోక, ఈర్ష్యా, ద్వేషాది దుఃఖరూపక వ్యవహారములందు సౌఖ్యమున్నదని భావించి జితేంద్రియత, నిష్కామము, శమము, సంతోషము, వివేకము, ప్రసన్నత, మిత్రత్వము లోనగు సౌఖ్యరూపక వ్యవహారములలో దుఃఖమున్నదని తలంచుట అవిద్యయొక్క మూఁడవభాగము. ఇఁక ననాత్మయం దాత్మబుద్ధియన ఆత్మలేని పదార్థములలో నాత్మయున్నదనియు, నున్న దానిలో లేదనియు ననగా చేతనము జడమనియు, జడమును చేతనంబనియు దలంచుట అవిద్యయొక్క నాలుగవభాగము. ఈనాలుగు ప్రకారములైన యవిద్యయే జగత్తునందలి మానవుల నజ్ఞానబంధనంబులం బంధించి యెల్లకాలము వేధించుచుండును. కాని విద్యవలన నెప్పుడవిద్య నాశనమందునో యప్పుడే యాయజ్ఞాన బంధనములుఁగూడ నాశనంబులగును. అనిత్యము ననిత్యముగను, నిత్యము నిత్యముగను, శుద్ధాశుద్ధంబుల శుద్ధాశుద్ధములుగను, సుఖము సుఖము దుఃఖము దుఃఖముగను, జడచేతనంబుల జడచేతనంబులుగను దెలియుటయేవిద్య. ప్రపంచమందలి సమస్త పదార్థములయొక్క గుణధర్మముల జక్కగ దెలిసికొని పంచదార నుప్పుగను, ఉప్పును బంచదారగను భావింపక యుప్పు నుప్పుగను, జక్కెర జక్కెరగను తెలిసి యుండుటయే విద్యయనఁబడును. ఇట్టి యదార్థజ్ఞానము వలన నవిద్యకెప్పుడు నివృత్తికలుగునో యప్పుడె మనుజునకు ముక్తికలుగును. రెండవక్లేశంబగు అస్మితయెట్టిదన,

దృక్దర్శనశక్త్యోరేకాత్మతే వాస్మితా.

ఆత్మస్తుతి పరాయణుఁడై మానవుఁడు అహంకారాభిమానంబులవలన దనకుదానే యెక్కువయనిభావించిగర్వపూరితుఁడై యుండుట అస్మితయనఁబడును. సముచితమైన విద్యావిజ్ఞానంబున నభిమానాదుల కెప్పుడు లోపముకలుగునో యప్పుడే యస్మితకునివృత్తికలుగును. తన్మూలమున జీవునకు ముక్తిప్రాప్తమగును.

సుఖానుశయీ రాగః.

ప్రపంచమందలి సమస్త భోగ్య వస్తువులయెడల నపరిమితమైన యాశబెట్టికొని యెల్లవేళల వానినేస్మరించుకొనుచు దన్మూలమున లోభసాగరంబున మగ్నుఁడై యిడుమలఁ గుడుచుచుండుట మూఁడవ క్లేశమగు రాగమనఁబడుచున్నది. విద్యాజ్ఞాన మభివృద్ధియైనకొలఁది జీవునకెప్పుడీసృష్టియంతయు సంయోగ వియోగములతో గూడుకొన్నదనియు, సంయోగము తరువాత వియోగంబును, వియోగానంతరము సంయోగంబును బొందు

చుండుననియు స్పష్టపడునో యప్పుడే రాగమునకు నివృత్తి కలుగ జీవునకు ముక్తిలభించును.

దుఃఖానుశయీ ద్వేషః — భోగ్యవస్తువులపై రాగముకలిగి యవి లభించనితరి నెటులైనవాని బ్రాప్తములగునట్లు చేసికొనవలయునని పట్టుపట్టి యొనరించు ప్రయత్నమందు గలుగు క్రోధబుద్ధియే ద్వేషమనబడును. ఇదియే నాలుగవక్లేశము. రాగమునకెపుడు నివృత్తికలుగునో యపుడే యీ ద్వేషముకూడ నాశనమందును.

స్వరసవాహీ విదుషోపి తథారూఢోభినివేశః.

ప్రపంచమందు దేహముదాల్చియున్న సమస్త ప్రాణులకు మనస్సులో నొకవిధమైనయాశ గాఢముగ నాటుకొనియుండి బాధించుచుండును. ఎట్లనగా మరణమనుమాటలేక తమకప్పటికి విద్యమానములైయుండు శరీరములే శాశ్వతముగ నుండవలయునని ప్రాణిసమూహంబులన్నియు గోరుకొనుచుండును. అల్పప్రాణులైన క్రిమికీటకాది జంతువులు మొదలుకొని విద్వాంసులవరకు గూడ మరణభయ మొక్కరీతిగనే యున్నది. ఈక్లేశమునకే యభినివేశమనిపేరు. జీవేశ్వరప్రకృతులు నిత్యములనియు, సంయోగ వియోగంబుల వలననేర్పడు కార్యద్రవ్యము లనిత్యములనియు నెప్పుడు మనసుకు స్పష్టమగునో యప్పుడే యీక్లేశమునకు నివృత్తికలుగ జీవునకు ముక్తిప్రాప్తమగును. అవిద్యాది క్లేశములు దూరములై విద్యాది శుభగుణంబులెప్పుడు ప్రాప్తములగునో యపుడే జీవునకు సమస్త బంధనములనుండియు, దుఃఖము నుండియు విముక్తికలిగి యానందము సమకూరును కావున ఆత్మోపయోగములైన శోకరహితంబులగు సిదులయెడల నైతము విరక్తిగలిగి సకలదోషంబులు సకల క్లేశంబులు జనించుటకు మూలకారణమైన యవిద్య యనెడు విత్తనమును నాశనము చేయుటకై యహర్నిశము ప్రయత్నము చేయుచుండవలయును. అనగా భూమిమీద జీవించియున్నంతవరకు విద్యకొరకు పరిశ్రమచేయుచు జ్ఞానము సంపాదించు చుండవలయును. అవిద్యా నాశనము కాని యెడలముక్తియెంతమాత్రము గలుగనేరదు.

సత్వపురుషయోః శుద్ధి సామ్యే కైవల్యమితి.

యోగ, అ. 1. పా. 3. సూ. 58,

బుద్ధికి జీవునకు శుద్ధవిజ్ఞానంబు కలుగుటవలననే ముక్తి కలుగుగాని వేరువిధముననగాదు. సమస్తదోషములనుండి దూరగుడై మనుజుడు జ్ఞానముంబొంది యాజ్ఞానమువలన నెప్పు డాత్మనున్నతిపరచుకొనునో యప్పుడే ధర్మసంస్కారమువలన జీవునకు ముక్తిగలుగును. ఎంతవరకు బంధనంబుల జిక్కువడి యుండునో యంతపర్యంతము ముక్తికలుగుట యసంభవమే. ఎప్పు డవిద్యవలన గలుగు మిథ్యాజ్ఞానము విద్యమూలమున నాశనమందునో యప్పుడే జీవునిదోషములన్నియు నష్టములగును. అందువలన ప్రవృత్తియనగా అన్యాయము, అధర్మము, విషయాసక్తి లోనగు దోషసముదాయము దూరముగును. ఈదోషములు దూరములగుటచే మరల జన్మము కలుగదు. జన్మరాహిత్యమైనచో దుఃఖములు కలుగజాలవు. దుఃఖముల భావములగుటకతన బూర్వోక్త పరమానందమే యాకృతిగాగల పరమేశ్వర ప్రాప్తివలన నిరంతర సౌఖ్యముచేకూరును. ఇట్టియానంద ప్రాప్తికే ముక్తి, మోక్షము, లేక కైవల్యమనిపేరు. ఇచ్ఛావిఘాతంబువలన ననగా దనమనస్సులోని న్యాయమైన సంకల్పమునకు విఘాతము సంభవించుటచేతను, బరతంత్రత యననగా దనకావంతయు స్వాతంత్ర్యములేక కేవలమితరులయాధీనమందే యుండుటచేతను, గలుగు వేదనయే నరకమనబడును. ఈయన్ని ప్రకారములగు దుఃఖములు నశించి జీవునకు బరమాత్మయొక్క నిత్యయోగము కలుగుటయే యానందమనబడును. చదువరులారా! మనుష్యులమైన మనమందరమిట్టి సౌఖ్యసమేతంబగు ముక్తికొరకే పాటుపడవలయును. ఈమోక్షమే పరమావధి యని దృఢముగ నమ్మినవారలై పూర్వులైనయార్యులు తత్సంపాదనము నిమిత్తము నానావిధ ప్రయత్నంబులనల్పి సాధింపుచు వచ్చిరి. ఎంతకాలమువరకు జనులీ ముక్తివిషయమై నిశ్చయమగు భావముగలిగియుండి దాని కొరకు బ్రయత్నములజేయుచు వచ్చిరో యంతపర్యంతము మనయార్యావర్తము ధనధాన్యరాసుల కాగారమై సిరులకు నిలయమై విద్యాజ్ఞానములకాటపట్టయి తక్కుంగల

సమస్తదేశములకు గురుపీఠమై మహోన్నత దశయందే యుండియుండెను.

కానియార్యులెప్పుడు దురభిమానులు స్వార్థగ్రస్థులై విద్యాజ్ఞానముల నభివృద్ధి పరచికొనుట మానిరో నాటినుండియు దేశము క్రమక్రమంబుగ హీనస్థితికిరా ప్రారంభమగుటయుగాక జనులు పరమావధి విషయమగు నిశ్చయభావమును గోల్పోయినవారలై సౌఖ్యముకలుగుటయే మోక్షమనితలంచి తమకు తాత్కాలికముగ సౌఖ్యముగ దోచునట్టి తుచ్ఛమగునదగు స్త్రీసంభోగము వలనగలుగు ఆనందమే యానందమని యెంచి తదనుకూలంబుగ గొన్ని శాస్త్రంబుల రచించి యందప్సరసలకావాసంబగు స్వర్గమొకదాని గల్పించి పుణ్యకార్యములొనరించువారల కాయచ్చరలతో భోగము కలుగునని ప్రఖ్యాతముజేసిరి పుణ్యకార్యముల జేయుటవలన వేశ్యాజననివాసమైన నీస్వర్గము ప్రాప్తమగునని వచించుటచేత ప్రస్తుతకాలమున ప్రతిదేశంబున ప్రతిపట్టణంబున ప్రతి గ్రామంబునగూడ వ్యాపించి లెక్కలేని సంసారంబుల నాశనము చేయుచున్న యిచటిపడుపుగత్తెలకంటె నచటి కులటలెక్కుడుగ నుండరను తలంపుననే కాబోలు జనులిక్కాలంబున బుణ్యకార్యము లొనరించుటయందు గూడ విముఖులగుచున్నారు. చదువరులారా! ముక్తినామక స్వర్గము పౌరాణికకల్పితమైన యీ వేశ్యాస్వర్గమువంటిదిగాదు. వర్తమానకాలంబున బుణ్యకార్యముల పేరున బ్రచారములైయున్న యనేకములైన యసత్యకర్మంబులకుఫలితముగనొకవేళ నీ వేశ్యాస్వర్గము లభించిన లభించునేమోగాని సత్యకార్యము లొనరించువారలకుం గాదు. పరిపూర్ణమైన విద్యాజ్ఞానముబడసిననే ప్రాప్తముకాంగల మోక్షమునిమిత్తమెక్కుడ ప్రయత్నములు సలుపబడుచుండునో యచట నేవిషయమందును గొరంతలేక యన్నిప్రకారముల నుత్తమ సౌఖ్యములే కలుగుచుండును. ఆ దేశమే మహోన్నత స్థితియందుండును. మహోన్నతదశ లేకపోవుట యటులుండ బ్రస్తుతము మనదేశమెట్టి నీచదశయందున్నదో పక్షపాతవిహీనంబైన బుద్ధితోడ నాలోచించి చూచికొనుడు. అట్లు పోల్చిచూచికొనుట కీకాలంబున నాగరికత నొంది మహోన్నత దశయందున్న దేశము లనేకము లున్నవిగదా! ఏ నాగరికతనొందిన దేశమునందుజనులు విద్యాగంధము లేక మూర్ఖశిరోమణులై పరస్పర కలహములతో నైకమత్య విహీనులై పశువులభంగి మెలంగుచున్నారు? ఏ నాగరికతనొందిన దేశమందుజనులు తినగూడును గట్టగుడ్డయులేక మల మల మాడుచు సకలసస్య ప్రదంబిని ప్రఖ్యాతికెక్కిన స్వదేశమందు బ్రతుకుతెరువుగానక పరరాష్ట్రముల పాలగుచుండుటయగాక ప్రాణముల సయితము గోలుపోవుచున్నారు? ఏనాగరికత నొందిన దేశమందు జనులు నానాప్రకారంబులగు రోగంబులతగుల్కొని వేలకొలందిగ నకాలమరణదేవత కతిథులుగ బోవుచున్నారు? ఏనాగరికతనొందిన దేశమందు జనులు స్వచ్ఛందజీవనమువలనిసౌఖ్యముగననేరక కేవలముసేవకావృత్తియే పరమధర్మమని భావించుచున్నారు? నిష్కల్మషమైన పక్షపాతరహితమైన యంతరాత్మ ప్రబోధకమైన హృదయముతోడ నాలోచించి చూచికొందుమేని మనయార్యావర్తము నేడెట్టిదశయందున్నదియువిశదము కాగలదు. దేశమంతయు నిట్టి దారిద్ర్యదేవతకు నాట్యరంగముగ నుండుకారణంబున నిచట ముక్తజీవులు లేరనియే తలంపవలయు తన్మూలమున ముక్తిదంబులనియు పుణ్యదంబులనియు మనవార లాచరించుచున్న యాచరణంబులన్నియు నసత్యములనియే యెంచవలయును. ఎందుచేతననగా సత్యధర్మము లేదైనయెడల నిచటివారలకు ముక్తిగలుగుచుండవలయు. ముక్తజీవులేయున్న దేశము సమస్త విషయముల నున్నతిగాంచి యుండవలయును. ప్రత్యక్షప్రమాణముగగనబడుచున్న మనదేశముయొక్క ప్రస్తుతపుదీనదశనుబట్టి పైరెండునునభావములగుచున్నవి. కావున సోదరులారా! జ్ఞానమభివృద్ధిజేసికొనుటకు దగిన మనుష్యజన్మమెత్తియుదానినభివృద్ధి చేసికొనకసత్యాచరణంబులమూలమున బరమావధికొరకు బ్రయత్నింపక యుందుమేని మనజన్మము నిరర్థకంబేగదా! జన్మమునట్లు వ్యర్థముచేసికొనక విద్యాభ్యాసమొనరించి, దురభిమానాహంకారంబుల వదలి ప్రపంచమందలి సకల పదార్థంబులు తమకేరావలయునను దురాశమాని ద్వేషపూరితులు గాక శరీరంబుల శాశ్వతంబులనుకొని సత్యధర్మాచరణంబులొనరించుచు సమస్తజనులు ముక్తికై ప్రయత్నముల సలుపవలయును.

# దేశాభిమానము.

[ పుంగిపూడి వేంకటశర్మగారు. ]

తే. మాతయనియెడు సద్భక్తి చేతనైనఁ
బూజ్యురాలని యనెడు సుబుద్ధినైన
సకల ఫలదాత్రియను కృతజ్ఞతనునైన
జన్మభూమిని భజియింపఁజను జనుండు.

ఉ. ఎక్కడఁ జన్మమెత్తి తమి నెక్కడి వాయువుఁ బీల్చి యింపుమై
నెక్కడి నీరు ద్రావి తగ నెక్కడి భోజ్యములన్ భుజించి తాఁ
జిక్కక దేహధారణముఁ జేసి రహించి సుఖించి మించు నా
చక్కని జన్మభూమి మనసార భజింపని నీచుఁ డుండునే?..

ఉ. ఎందలి పండువెన్నెల లవెంతయు వేడుక వెల్లిగొల్పునో
యెందలి పుష్పసౌరభము లెంతయుఁ గౌతుకమున్ ఘటించునో
యెందలి పక్షిగానము లవెంతయు వీనుల విందొనర్చు నా
యందపు జన్మభూమి మనసార స్మరింపని యల్పుఁ డుండునే?

ఉ. ఎమ్మెయి వేదముల్ పొడమె నీశ్వరతత్త్వము బోధసేయు నం
గమ్ములతోడ నెమ్మెయి జగన్నుత శాస్త్రములుద్భవించెఁ దా
నెమ్మెయి జ్ఞానమూర్తులు మునీంద్రులు సంభవమొందిరా పవి
త్రమ్మగు నార్యభూమికిని బ్రాంజలులీని యనార్యుఁ డుండునే?

సీ. కామధేనువుఁ బోలెఁ గామితార్థము లెల్లఁ గోరనప్పుడ సమ
కూర్చుదాని
కన్నతల్లియుఁ బోలె గారాము మీఱఁగాఁ గలకాలమును
బెంపఁ గలుగుదాని
గురువరుంబోలె నీశ్వరతత్త్వమును దెల్పి పరమ వివేకంబుఁ
గఱపుదాని
మిత్రరత్నముఁ బోలె మైత్రి దైవాఱఁగా నిత్యసంతోషంబు
నెఱపు దాని

తే. ఏలికయుఁ బోలెఁ గరుణమై నేలుదాని
నీశ్వరునిఁ బోలె సుఖశాంతు లిచ్చుదాని
తాల్యమెందును గనరాక తనరుదాని
జన్మభూమిని మఱచు దుర్జనుఁడు గలఁడె?

సీ. రత్నగర్భాఖ్యధారణికిఁ దెచ్చినబిడ్డ
యవనినాసార్థాఖ్య నమరుతల్లి
లలిమించు పంటవలంతు ) పేల్పంతి
పుణ్యవాహినులకుఁ బుట్టినిల్లు
విజ్ఞాన తేజంబు వెదచల్లు దినమణి
సాత్త్వికత్వమునకు జన్మభూమి
క్షమయన్న యన్వర్థ సంజ్ఞఁ దాల్చినదేవి
లక్ష్మీ సరస్వతులకు వయస్య

ఆ. అఖిల సస్యములకు నాలవాలము సమ
శీత లోష్ణ వాత ధూళి కిరవు
భూరిభోగములకు భూతలస్వర్గంబు
భక్తి సేయఁదగదె! భరతభూమి.

సీ. జగదుపకారక శాస్త్రముల్ గూర్చిన
ఘనమునీశ్వరులలోఁ గనినయపుడు
శిల్పాదికళల ననల్పముల్ జేసిన
విజ్ఞాన విదుల భావించినపుడు
మత సంఘ సంస్కార మతులైన రామమో
హనముఖ్యులను జేరుకొనిన యపుడు
గంగాసరస్వతీ కావేరి ముఖపుణ్య
వాహినుల్ తలఁపునఁ బాఱినపుడు

తే. తుహిన శైలాది శైల పంక్తులను జూచి
నపుడుఁ బ్రతిభారతీయుని కాత్మలోన
దేశమున నిష్కళంక భక్తియును నిరుప
మాన దేశాభిమానంబు మలయ వలయు.

సీ. దుస్తరదుఃఖాబ్ధిఁ దోఁగుచున్న యనాథ
బాలికల్ పడుచున్న పాట్లువిన్న
నసమ వివాహశోకాగ్ని వేఁగుచునున్న
దంపతులౌ పడుతాప దశనువిన్న
హేయస్థితినిఁ బశుప్రాయులై వర్తిల్లు
నధమజాతులు పొందు వ్యథలువిన్న
నజ్ఞానవివశులై యల్లాడుచుండిన
జనులెల్లరును జెందు శ్రమలువిన్న

తే. సదమలంబగు హృదయంబు సదయమగుచుఁ
గరఁగి యశ్రుకణంబులు దొఱఁగ వగచి
తన్నివృత్తికి మార్గముల్ దలఁచి తత్ప్ర
యత్నములు జేయవలయు దేశాభిమాని.

ఆ. దేశమాతృభక్తి, దేశాభిమానంబు,
దేశమాతృప్రేమ త్రికము నొకటె
దీనిభావ మెఱిఁగి దేశీయులు స్వదేశ
సేవజేసి ఫలముఁ జెందవలయు.

ఉ. పేదల కర్థమున్ గొనక విద్యలు నేర్పుట, రోగవంతులన్
సాదరమొప్పఁ జూచి యుపచారముచేయుట, యార్తబృందమున్
వేదనఁ బాపుటల్, పతితస్త్రీలు ననాథల కన్నవస్త్రముల్
ప్రోదిగ నిచ్చి పెంచి పరిపోషణచేయుట దేశసేవయే.

The Lieu-Governor of the Punjab and Punjab Chiefs on the State entry Day.



ఢిల్లీలో పంజాబు లెఫ్టినెంటు గవర్నరుగారును, పంజాబు మహారాజులును.

Elephant Procession on the day of the state entry into Delhi.



ఢిల్లీ ప్రవేశదినమున ఊరేగింపు టుత్సవము.

The Dupleix Column.



పుదుచ్చేరిలోని డూప్లేస్తంభము.

The House from which the bomb was thrown at Delhi.



బాంబువేయబడిన ఢిల్లీ చాంద్నీచౌకములోని యిల్లు.

Brundavan.



బృందావనము.

Haridwar



హరిద్వారము.

# చిత్రపటముల వివరణము.

### భారతమాత యాంధ్రబాలను దీవించుట.

ప్రక్కను నిలుచుని యున్న బొంబాయి, బెంగాలు, పంజాబు, బేహారు, సంయుక్తరాష్ట్రముల వలెనే నీవును బెరిగి పెద్దదానవై స్వరాష్ట్రమును గలిగి యుండుమని ఆంధ్రబాలికను భారతమాతదీవించుచున్నది.

### తుర్కిసుల్తాను.

ఈయన పెద్దవాడయినదిమొదలు 1909 వ సంవత్సరము వఱకు సుమారు 30 సంవత్సరములు తనమందిరములో ఖైదీగా అబ్ దుల్ హమీదుగారివలననుంచబడెను. తురుష్కదేశపరివర్తనము జఱిగిన పిమ్మట, ప్రజాప్రతినిధిసంఘ మేర్పఱచబడి, యౌవనతురష్కులవలన సుల్తానుగా జేయబడెను. శాంతిస్వభావుడనియు, విద్యావంతుడనియు, న్యాయప్రియుడనియు జెప్పుదురు. కానిరాజ్యమెక్కినది మొదలు అల్లరులు, యుద్ధములును పొసగుట వలన ఈగొప్పగుణములను జూపుట కవకాశము లేక పోయినది.

### పెంట్లండు ప్రభువు.

ఈయన మనచెన్నరాజధానికి ప్రస్తుతము గవర్నరుగా నున్నారు. స్కాట్లండుదేశవాసి. గడచిన 7 సంవత్సరములనుండియు ఇంగ్లండు నేలుచున్న మంత్రులలో నొక్కడయి స్వదేశమగు స్కాట్లండుకు గొప్పసేవజేసి, చక్కని శాసనములను జేయించెను. జార్జిచక్రవర్తిగారు ప్రత్యేకముగా గోరగా చెన్నపురి గవర్నరు పదవి నంగీకరించి వచ్చెను. వీరు మన రాజధానికివచ్చి కొన్ని మాసములే యయినను ప్రజల మనంబులలో వారిమెడ ప్రేమోత్సాహములనుబుట్టించగలిగిరి. పెంట్లండు ప్రభ్విణియు శ్రీవారి కన్నివిధముల సహాయముజేయుచు, హైందవయువతుల యభ్యున్నతియం దెక్కువ అభినివేశమును గలిగించుకొనుచున్నది.

### విల్లింగ్డన్ ప్రభువు.

వీరు బొంబాయికి గవర్నరుగా నియమింపబడి ఏప్రిలు 5 వ తేదిన యుద్యోగభారమును వహించిరి. 10 సంవత్సరములు పార్లమెంటులో లిబరలు సభ్యుడుగా నుండి తరువాత ప్రభువుగాజేయబడెను. వ్యవసాయ విషయములం దెక్కువ పరిశ్రమము జేసినట్టివాడు. గొప్పభూస్వామి. బొంబాయికి భార్యతో నిదివర కొకపర్యాయము వచ్చి వెళ్ళియుండెను. వీరి ప్రభుత్వము క్రింద ఈరాజధాని చక్కగా నభివృద్ధి నొందగలదని అనేకమంది భావిసూచనము జేయుచున్నారు. విల్లింగ్డన్ ప్రభ్విణి మంచిరూపవతి. బ్రాసేప్రభువుయొక్క కుమార్తె. బొంబాయి రాజధాని స్త్రీల విషయమై గొప్పగా పాటుపడగలదు.

### పబ్లికు సర్వీసు కమిషన్.

వీరు హిందూదేశమందు సైనికశాఖగాక మిగిలిన శాఖల నన్నింటిని పరిశోధించి హైందవుల కెక్కువ యుద్యోగము లిచ్చుటకుగాని లేక నితరవిధములవానిని వృద్ధిజేయుటకుగాని సిఫారసుజేయుటకు జార్జిచక్రవర్తిగారి వలన నియమింపబడిరి. వీరి సిఫారసులవలన భారతీయుల కెక్కువలాభములుచేకూరునని యూహింపబడుచున్నది.

### పేరులు.

(ఎడమప్రక్కనుండి కుడిప్రక్కకు చదువవలయును.)

కుర్చీలమీద కూరుచున్నవారు:— 1. సర్ వాలంటైన్ షిరోల్, 2. సర్ మర్రేహామిక్, 3. లార్డు ఇస్లింగ్టన్, (ప్రెసిడెంటు.) 4. సర్ థియొడోరుమారిసన్ 5. గౌరవనీయులగు చౌబల్‌గారు.

### నిలుచున్నవారు.

1. రాంసే మెక్డొనాల్డుగారు, 2. గోపాలకృష్ణ గోఖలేగారు, జస్టిస్ అబ్ దుల్ రహీంగారు, 4 లార్డు రొనాల్డ్షే ప్రభువు, తెరువాతి యిద్దరు పురుషులును కమిషన్ వారి

కార్యదర్శకులు, 7. స్లయిడోరగారు, 8. జస్టిస్ ఓల్డు ఫీల్డుగారు, 9. మాజి దొరగారు, 10. వారణాసి సుబ్రహ్మణ్యం పంతులుగారు. ఈచిత్రపటము చెన్నపురిలో తీయబడి ట్టిది. 8,10 నెంబరులవారిపని చెన్నపురి రాజధానితోనే సరిపోయినది.

## జనరల్ నోగిగారు.

పోర్టుఆర్థరుఅను మహాదుర్గమును రష్యనులను ఓడించి జపానీయుల వశముజేసిన మహారథుడు. తన యిద్దరు కుమారులను పోర్టు ఆర్థరువద్దనే కోలుపోయెను. యుద్ధానంతరము టోకియోలో నొక చిన్న భవనమందుండి భార్యతో గాలము గడపుచుండెను. జపానుచక్రవర్తిగారి శవమును శ్మశానభూమికి దీసుకొని వెళ్లుతరి భార్యాభర్తలిద్దరును ఖడ్గముతో బొడుచుకొని తమ చక్రవర్తిని స్వర్గములో సేవింపవలయునని వెళ్ళిరి.

## సర్ ఎడ్వర్డు గ్రే.

ఈయన గ్రేటుబ్రిటనుకు విదేశాంగ మంత్రి. పరిష్యా, తుర్కీ, మొరాకో, మొదలగు మహమ్మదీయ రాజ్యములయెడ సహానుభూతిలేనివాడై వానివిషయమై నడపుచున్న రాజ్యనీతి మనదేశమందలి మహమ్మదీయుల కధికాగ్రహమును గలిగించుచున్నది. చైనాయెడలను గ్రేగారు బహుకఠినముగా బ్రవర్తించుచున్నాడు. కాని ఇంగ్లీషు మంత్రులలో బ్రసిద్ధికెక్కినవాడయి ఆప్రజల గౌరవాదరణములకు గొంతవఱకయినను బాత్రుడై యున్నాడనుట నిజము.

## కయామిల్ పాషాగారు.

ఈయన 90 సంవత్సరముల వయోవృద్ధు. తుర్కీకి అనేక పర్యాయములు ముఖ్యమంత్రిగా నుండెను. బల్‌గేరియనులతో సంధిజేసికొన వలయుననగా యావన తురుష్కులు ఈతనిని మంత్రిత్వమును మానుకొనునట్లు జేసిరి. తురుష్క సామ్రాజ్యములో పితామహుడని పిలువబడుచున్నాడు.

## ఎన్వరు బే గారు.

ఈయన యావనతురుష్కులనాయకులలో నొకడు. మహాసాహసవంతుడు. అత్యంత దేశభక్తుడు. బల్‌గేరియనులతో సంధిచేసికొనకుండ జనవరిమాసములో పడగొట్టించెను. తుర్కీవారి ఆసియారాష్ట్రములను ఉన్నతస్థితికి దెచ్చుటకయి యుద్ధానంతరము ప్రయత్నించునని తలంచుచున్నారు.

## కీర్తిశేషులైన జపానుచక్రవర్తిగారు.

ఈయన చారిత్రము సవిస్తరముగా గడచినజూలయిమాసమునందాంధ్రపత్రికలో మృతినొందినప్పుడు ముద్రింపబడినది. ఈయనరాజ్యమెక్కినప్పుడు ప్రాచీనపద్ధతుల నవలంబించుచు, నూతననాగరికతఒసంగుబలధన దారుఢ్యములులేక అసహాయ స్థితియందున్న జపానును జూచెను. నలుబదిసంవత్సరములు రాజ్యమేలినపిమ్మట ధనముతోను, బలముతోను, దేశభక్తి ప్రభుభక్తులతోను, నిండియున్న జపానునుజూచి, తనజీవితముయొక్క పరమార్థమీడేరినదని తలంచి ఆనందముతో స్వర్గమునకరిగెను. ఈయనకాలమునందే జపాను రెండుమహాయుద్ధములలో చైనా, రష్యాలనోడించి సముద్రముమీదనేమి, నేలమీదనేమి జపానీయులతో బోరాడువారిలోకమందు లేరని వెల్లడియయ్యెను. ఈయన పరిశ్రమలవలన జపాను ఆసియాఖండమునకు నాయకమణి యగుటయే గాక ప్రాచ్యులును దగినశిక్షయున్నయెడల యూరోపియనులకు ఏ విషయమునను దీసిపోరనిచాటించగలిగెను. ఈయనజపానులో చక్రవర్తిగా మాత్రమేగాక నొకదేవతవలె బూజింపబడుచున్నాడు. స్వభాషలో ననేకకావ్యములను రచించి ప్రజలదేశభక్తిని రవులుకొలిపెను. ప్రజలకు ప్రజాప్రతినిధిసభనొసంగెను.

## ప్రకృత జపానుచక్రవర్తిగారు.

వీరికిప్పుడు ముప్పదియయిదు వత్సరముల వయస్సుగలదు. స్వభాషయందును, ఇంగ్లీషు, ఫ్రెంచి మొదలగు పరదేశ భాషలలోను పాండిత్యముకలదు. సైన్యములోను, నావికాదళములోను జేర్పబడి అందు క్రమమయిన శిక్షనుబడసెను. జపానువారు పరదేశములకనేకవేలమంది పంపబడుచున్నను ఈయనతండ్రి యేకారణమువలననో నింతవరకీయనను యూరపమెరికాలకు బంపలేదు. ఈచక్రవర్తి అట్లుచేయక తనపసునాలుగేండ్లకుమారుని ఇంగ్లండునకు విద్యకైబంపియున్నాడు. ఈయనకాలమందుజపాను మరింతమహోన్నతస్థితికి రాగలదని తలంపబడుచున్నది.

## ప్రెసిడెంటు రేమాండ్ పాయిన్ కేర్.

ఈయన రెండు నెలల క్రిందట ఫ్రాన్సు దేశమున కధ్యక్షుడుగా నెన్నుకొనబడెను. ఇంతకుపూర్వము అనేకపర్యాయములు మంత్రిగాను ముఖ్యమంత్రిగాను ఉండెను 13 సంవత్సరములు న్యాయవాదిగానుండి పారిసునగరమందు చాలధనమును గడించెను. 1876లో జర్మనీవారు ఫ్రాన్సునోడించిఆలేస్‌లో రైన్ రాష్ట్రమును వశముజేసుకొనిరి. ఆలేస్‌లోరైన్ రాష్ట్రములోబుట్టినవాడగుటచే ఆదేశముతిరిగి ఫ్రాన్సువశమగునంతవరకును నిద్రబోమనిశపథముజేసిన దేశాభిమానులలో నొక్కడు. ఇందువలనఈయన ప్రెసిడెంటగుట, జర్మని వారికి కంటకముగానున్నది. అప్పుడే ఫ్రెంచిసైన్యము 8 లక్షలకు వృద్ధిచేయబడు చున్నది. అధికధనము ఆకాశవిమానములకును, నావికాబలమునకును వ్రయము చేయబడగలదు. నెపోలియను అయినతరువాత అంతబలస్థైర్యములను గలవాడనియు, ఫ్రాంసుదేశమీతనికాలములో మరింతఉన్నత స్థితికి రాగలదనియు ఫ్రెంచివారూహించుచు తమప్రెసిడెంటుయెడ పితృభక్తిని గలిగియున్నారు.

## జర్మను చక్రవర్తిగారు.

జర్మనుదేశము దాదాపు మనవంగదేశమంతకలదు. ఇది అనేకరాజ్యములుగా విభజింపబడియుండి ప్రత్యేకరాజులచే బరిపాలింపబడుచున్నను సామ్రాజ్యమునకంతయు విలియంగారు చక్రవర్తి. ఈయనరాజ్యమునకువచ్చిన 28 సంవత్సరములలో ఒకసాధారణమైన రాజ్యమునుండి ఇంగ్లడునకుసయితము భయోత్పాదమును గలిగించు మహారాజ్యముగా మారిపోయినది. నేలమీదబోరుటలో జర్మనుచక్రవర్తికున్నంత గొప్ప సైన్యము ప్రపంచమునందెవరికిని లేదు. అందువలననే "సంగ్రామసార్వభౌము" డని పిలువబడుచున్నాడు. సముద్రదళములో ఇంగ్లండయిన పిమ్మట జర్మనీ యెక్కువయుద్ధనావలను గలిగియున్నది. ఈచక్రవర్తిగారికాలములో జర్మనీదేశపు వ్యాపారము ఇంగ్లండుతో సమానమైనస్థితికివచ్చునట్లు పెరిగినది. ప్రజలైశ్వర్యవంతులై, మాతృభూమియందు భక్తిగలవారై, కృషిపరాయణులై విలసిల్లుచున్నారు. ఒక్కొక్కప్పుడీయనజేయు ప్రసంగములు యూరపురాజులను తల్లడిల్లునట్లుచేయుచున్నను ఈయనసంభాషణములు దేశభక్తులకుత్సాహభరితములై స్వదేశసేవకు బురికొల్పుచుండును. ఒక్కయుద్ధమయినను ఇతరదేశములతో ర్మనీకి ఈయనకాలమందు పొసగియుండలేదు. సుమారు 7 మందికుమారులు. ఒక్కకుమార్తెకలదు.

## ఆస్క్విత్తు ముఖ్యమంత్రిగారు.

ఈయన ఇంగ్లండులోని యార్కుషైరునందు జన్మించి, బారిస్టరుపదవియందు బ్రవేశించి, మొట్టమొదట కొన్నిసంవత్సరములొక కాసయినను రాక అవస్థపడి, తరువాత లక్షలకొలది రూపాయలనార్జించి, రాజుగారి మంత్రులలో నొక్కడయి, సర్. హెన్రీకెంబెల్ బేనర్ మేన్‌గారు మృతినొందినపిమ్మట లిబరలు కక్షివారికి నాయకుడై, ముఖ్యమంత్రియయ్యెను. గతించిన నాలుగు సంవత్సరములనుండియు, పనేకప్రజోపయోగకరమయిన శాసనములను గ్రేటుబ్రిటనులో లిబరలుప్రభుత్వమువారు ఆస్క్విత్తుగారి నాయకత్వముక్రింద జేసిరి. అందుముఖ్యమయినవి అరువది సం॥ దాటిన పేదలకు స్త్రీలయినను, పురుషులయినను బ్రతికియున్నంతవఱకు నెల 1 కి 15_0_0 రూపాయల పింఛనొసంగబడుట. జబ్బుగానున్న వారి కౌషధములు దొరతనమువారిచ్చి, వారి సంసార పోషణార్థమై ధనమిత్తురు.

## విన్‌స్టన్ చర్చిలుగారు.

ఈయనకు 38 సం॥ల వయస్సేయయినను నాలుగు సంవత్సరములనుండియు, చక్రవర్తిగారి మంత్రులలో నొక్కడుగా నున్నాడు. ఇండియాకు స్టేటుసెక్రటరీపని జేసిన లార్డురాండాల్ఫు చర్చిలుగారి కుమారుడు. మొట్టమొదట సైన్యముతో బ్రవేశించి కొన్ని యుద్ధములలోబోరెను. బోయరులచేత బట్టుకొనబడినను, తప్పించుకొని పారిపోయెను. మనదేశమునందు బెంగుళూరులో గొంతకాలము సైనికోద్యోగిగానుండి పశ్చిమోత్తరపరగణాలలో యుద్ధముజేసి కీర్తివహించెను. తరువాతవార్తాపత్రికా లేఖకుడుగను, గ్రంథకర్తగను, నుండి వన్నెకెక్కెను. తనతండ్రిజీవితము మూడు పుస్తకములుగా బ్రచురించెను. ఆపుస్తకములాంగ్లేయభాషలో జీవితచారిత్రములలో నెక్కువగొప్పగా నాదరింపబడుచున్నవి. తరువాత కామన్సు సభికుడై లిబరలుపక్షమునజేరి బోయరులకు స్వరాజ్యమునిచ్చు బిల్లునుతాను పుచ్చుకొని కామన్సుసభలో అంగీకరింపబడునట్లుచేసెను. పిమ్మట స్వదేశాంగమంత్రిపదవి నలంకరించెను. ప్రస్తుతము చర్చిలుగారు యుద్ధనావాంగ మంత్రిగానుండి 1½సంవత్సరములలో ఆశాఖయందనేక యద్భుతమయిన మార్పులనుజేసి తన దేశీయుల పొగడ్తలకు పాత్రుడాయెను. వయస్సునందు జిన్నవాడయినను బుద్ధిబలమునందసమానుడను కీర్తినిపొందియున్నాడు. ఈయనకొన్నివత్సరములలో ముఖ్యమంత్రిగూడ కావచ్చును.

## విలియం థామస్ స్టెడ్‌గారు

ఈయన లోక ప్రఖ్యాతిని గడించిన రెవ్యూఆఫ్ రెవ్యూపత్రికా సంపాదకుడు. ఆంగ్లేయపత్రికాసంపాదకులలో "రాజు" అనుగొప్పకీర్తిని పొందెను. వార్తాపత్రికయనగా స్టెడ్‌గారికి సత్యమునుబోధించుటకొక పనిముట్టు. తనధర్మోపన్యాసములనిచ్చుటకొక వేదిక. దుర్మార్గమును ఖండించుటకొక ఖడ్గము. చక్రవర్తులతోను సుల్తానులతోను సంభాషించి ఆసంభాషణములను దనపత్రికలోముద్రించినమహానుభావుడు. యూరపురాజుల యుద్ధములనాపి తగవులను హేగు పంచాయతీ మూలకముగా దీర్చుటకు యత్నించిన ముఖ్యులలోనొక్కడు. బోయరుయుద్ధమమానుషమని పోరాడి బోయరులకు స్వరాజ్యము నిప్పించినవారిలో నగ్రగణ్యుడు. ఇండియాదేశమందును ఎక్కువ సహానుభూతిని గలిగి మనకనుకూలమగు అనేక వ్యాసములను వ్రాసెను. ధర్మము, న్యాయము, సత్యము ఏపక్షమునయుండునో ఆపక్షమున ప్రతిపక్షులెంత బలముగలవారయినను లెక్కసేయక పోరాడిన మహావీరుడు. అమెరికాకు వెళ్లుచు టైటానిక్ నావతో మునిగి చనిపోయెను.

## జనరల్ బూతుగారు.

బూత్ గారును లోక ప్రఖ్యాతిని వహించిన ఆంగ్లేయుడు. ముక్తిసైన్యమును స్థాపించి మృతినొందువరకును, దానికి నాయకుడైయుండెను. మొట్టమొదట జనులు ఇతని మూర్ఖుడని తిట్టి, అభిప్రాయములు విపరీతములని పలికి, మంటిముద్దలను, క్రుళ్ళిపోయిన గ్రుడ్లను, మాంసమును ముఖమునవేసి కొట్టిరి. చనిపోయినరోజున భూలోకమందలి రాజులుమొదలు బజారులోని కూలివానివఱకును గౌరవించిరి. శవమును ప్రేతభూమికిగొంపోవుతరి లండనునగరములో సగముజనులు వెంటనంటి వెళ్ళిరి. ఏ రాజులకును ఇంతసన్మానము జరిగియుండదు. ఇంతమర్యాద యెందుకలన? ప్రపంచము నుద్ధరించుటకయి బూతు దొరగారు నలుబది సంవత్సరములు పాటుపడి తనసర్వస్వమును దనతోడి మానవుల ముక్తికొఱకయి ధారవోయుటవలన. ముక్తిసేన ప్రపంచమునందన్ని దేశములలోను మహాసద్భుతములను జేయుచున్నది. ముక్తిసైన్యమువారు మన దేశమందు అనేకపాఠశాలలను, కర్మాగారములను, వైద్యశాలలను, స్థాపించి బీదలకు జీవనోపాధిని గల్పించియున్నారు. జెయిలునుండి విడిపింపబడిన దొంగలు తిరిగి అవృత్తిలో జేరకుండుటకు వారికి ఇండ్లు భూములు ఒసంగబడి వ్యవసాయదారులుగా జేయబడుచున్నారు. బూత్ గారి మరణానంతరము మనదేశమందు ఆరులక్షల రూపాయలు జమచేయబడినవి. ఈధనము చాలభాగము భారతీయులొసంగిరి. దీనితో ననేక ప్రజోపయోగమైన కార్యములు ప్రతిరాష్ట్రమందును, జేయబడును. మనహిందూదేశశాఖకు అధిపతి బూత్ గారి అల్లుడయిన బూత్ టకర్ గారు. ఈయనపంజాబులో కలక్టరుగానుండి, ఉద్యోగమును మానుకొని, ఈసేనలో బ్రవేశించుట జనరల్ బూత్ గారి ఉపన్యాసముల మహిమ వలననే.

## నవాబ్ సాలార్ జంగ్ బహదూర్ గారు.

ఈసాలార్ జంగుగారు నిజాంరాజ్యమునకు ముఖ్యమంత్రియైగొప్పరాజకార్య విశారదుడని ప్రసిద్ధివడసిన సర్ సాలార్ జంగ్ బహదూర్ గారి మనుమడు. ఇరువదియారు వత్సరములవయస్సుండును. శ్రీనిజాము కాలేజీలో హైదరాబాదునందు విద్యనభ్యసించెను. ఉర్దుభాషయందు మంచిపాండిత్యమున్నది. సర్ కిషన్ ప్రసాదు ముఖ్యమంత్రిగారు సెలవుతీసుకొనగా వారిస్థానమందు వీరునియమింపబడిరి. వీరిమంత్రిత్వముక్రిందను, శ్రీఉస్మాన్ అలీఖాన్ బహదూర్ నిజాంగారి ప్రభుత్వముక్రిందను నిజాంరాజ్యము గొప్పయభివృద్ధినొందునని జనులు తలంచుచున్నారు.

## నవాబ్ ఫర్దూన్ జంగ్ బహదూరు సి.ఐ.ఇ.,సి.ఎస్.ఐ.

ఈయన నిజాంప్రభుత్వమునకు ప్రధాన కార్యదర్శకుడు. ముఖ్యమంత్రిగారికి ఆంతరంగిక కార్యదర్శి. నిజాంప్రభుత్వమునకును బ్రిటిషు గవర్నమెంటువారికిని మధ్యజరగు వ్యవహారముల శాఖకు ఫర్దూనుజంగు గారు ముఖ్యుడు. హైదరాబాదు రాజ్యములో గాపురమున్న పారశీకుడు. ఈయనయెడ నిజాంగారికిని, ముఖ్యమంత్రిగారికిని, బ్రిటిషుగవర్నమెంటు వారికిని, గౌరవ విశ్వాసములు కలవు.

## ప్రధానశిరోమణి ఆనందరావుగారు సి.ఎస్.ఐ.

మైసూరు దివానుగానుండి ఖ్యాతివహించిన మాధవరావుగారి పుత్రుడు. మైసూరురాజ్యమునం దనేక యుద్యోగములను చక్కగా నిర్వహించి ముఖ్యమంత్రిగా యయిదు సంవత్సరములుండెను. ఈయన దివానుపనిచేసిన కాలమందు మైసూరురాష్ట్రములో ననేక సంస్కరణములుచేయబడి దేశమభివృద్ధినొందినది. మహారాజుగారికి ఆనందరావుగారియెడ గౌరవముమెండు. ఈయన యుద్యోగకాలము పూర్తికాగానే ప్రధానశిరోమణియను బిరుదొసంగి, అంగరక్షకులనిచ్చి, ప్రతిదినమును మహారాజుగారి వైద్యుడు ఆనందరావుగారి యింటికివెళ్లి వారిని జూచి వారి ఆరోగ్యస్థితిని మహారాజుగారికెఱింగించునట్లుచేయుటయే, మైసూరుమహారాజుగారికి వారి దివానుయందెంత ప్రేమగలదో ఉద్ఘోషింపబడుచున్నది.

## దివాన్ మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు సి.ఐ.ఇ.

విశ్వేశ్వరయ్యగారు మైసూరుదేశముననున్న నొక తెలుగు బ్రాహ్మణకుటుంబమున జన్మించిన ఆంధ్రుడు. ఇంజనీరింగు పరీక్షలో కృతార్థుడయితనశక్తిసామర్థ్యములవలన బొంబాయిగవర్నమెంటువారికి ముఖ్య ఇంజనీయరగునంత పదవిని బొందెను. ఏడను జలాశయమును, హైదరాబాదులో మూసి జలాశయమును నిర్మించుటకు ప్లానులను వ్రాసినదీయనయే. ఇంజనీయరింగుశాఖలో గడు గొప్పవాడని సునదేశమందేగాక యూరపునందును ప్రఖ్యాతిని గడించినట్టివాడు. రెండు పర్యాయములు జపాను, యూరపుదేశములకు వెళ్లివచ్చెను. బ్రిటిషు కొలువునువదలి, స్వరాష్ట్రమందు ముఖ్య ఇంజనీయరుగానుండి, కొన్నిమాసముల క్రితము మైసూరురాష్ట్రమునకు దివానయ్యెను. ఈయనకు బుద్ధివైభవము, స్వరాష్ట్రభక్తి మిక్కుటము. విశ్వేశ్వరయ్యగారి పాలనాకాలమందు మైసూరురాష్ట్రము పూర్వమువలెనే.స్వదేశసంస్థానములలో నగ్రగణ్యతను వహించి విలసిల్లునని భారతీయ విద్యాధికులందరును దమదృష్టిని మైసూరుపైననుంచియున్నారు. దేవుడట్లనుగ్రహించుగాక.

## సర్ కృష్ణ గోవిందగుప్త కె.సి.ఎస్.ఐ.

గుప్తగారు వంగదేశీయుడు. ఐ. సి. ఎస్. పరీక్షయందు దేరి ఆరాష్ట్రమునందు 30 సంవత్సరము లుద్యోగముజేసి లెఫ్టినెంటు గవర్నరుపని యొక్కటితప్ప తక్కిన గొప్పగొప్ప యుద్యోగములనన్నింటిని జేసెను. తరువాత యుపకారవేతనమును బుచ్చుకొనగా, మోర్లేప్రభువుగారు లండనులోని స్టేటు సెక్రటరి సభాసభ్యునిగా నియమించిరి. ఆపనియందయిదు వత్సరములనుండియు ఉన్నాడు. హిందూదేశ వ్యవహారములు స్టేటుసెక్రటరిగారు పరిష్కరింపవలసి వచ్చినప్పుడెల్లను గుప్తగారు తగిన సలహానిచ్చును. తన మాతృభూమికి చేతనయినసేవనుజేయుచున్నారు. ఈమధ్య మనదేశమునకువచ్చి దేశవ్యవహారములస్థితిని బాగుగా దెలుసుకొని నెలదినములక్రిందట లండనుకు దిరిగి వెళ్ళిరి.

### సర్ హారోల్డుస్టూఆర్టుదొరగారు.

చెన్నపురి రాజధానిలోనేగాక హిందూదేశమందంతటను ఉన్న ఐ. సి. ఎస్. ఉద్యోగీయులలో స్టూఆర్టుదొరగారితో సరియయిన తెలివితేటలుగలవారు కొద్దిమందేగలరు. వీరు చెన్నపురిరాజధానిలో యుద్యోగమారంభించినను, ఇండియాదొరతనమువారు కోరగాఅనేకపర్యాయములు సింలా, కలకత్తాలలో నుద్యోగముచేయుటకయి పంపబడిరి. జర్మనీ యువరాజు 1908 లో మనదేశమునకు వచ్చినప్పుడు వారితో సంచరించి హిందూదేశ సంగతులను బోధించుటకు స్టూఆర్టుగారు ఆ మూడుమాసములును వారివెంట బంపబడిరి. తరువాత చెన్నపురి గవర్నమెంటువారికి ముఖ్యకార్యదర్శకుడుగానుండి, సర్ మున్రోహామిక్కుగారు గవర్నరుగారయినప్పుడు చెన్నపురి కార్యనిర్వాహక మంత్రులలో నొక్కడయి, ఆపనియందే ప్రస్తుతమున్నాడు. శాసన నిర్మాణసభయందీయన ప్రసంగములు.భావగర్భితములయి, దొరతనమువారి పక్షమును బలపఱచుచుండును. సర్ హారోల్డు స్టూఆర్టుదొరగారియెడల హైందవులకును ఎక్కువ యభిమానముగలదు.

### గా॥ మహాదేవచౌబలుగారు సి.ఎస్.ఐ.

శ్రీచౌబలుగారు బొంబాయి హైకోర్టులో జాలకాలము న్యాయవాదిగాను, గవర్నమెంటు ప్లీడరుగను ఉండెను. తరువాతబొంబాయి గవర్నరుగారి కార్యాలోచన సభలో హైందవసభ్యుడయి నెలకయినువేల రూప్యముల జీతమునుబొందుచుండెను. ఈయుద్యోగము నాలుగు సంవత్సరములు చేసిన పిమ్మట జనవరిమాసమునుండియు పబ్లిక్ సర్వీస్ కమిషన్‌లో సభ్యుడయి హైందవులపక్షమున సేవజేయుచున్నాడు. చౌబలుగారు జాతీయనాయకులలో నొక్కరనుటకు సందియములేదు.

### గా॥ నవాబు షంసుల్‌హుదాగారు సి.ఐ.ఇ.

ఈయన తూర్పు బంగాళమున జన్మించిన మహమ్మదీయుడు. కలకత్తా హైకోర్టులో జ్ఞాలకాలమునుండియు న్యాయవాదిగా నున్నాడు. మహమ్మదీయ పక్షవాది. సర్వ ఇండియా మహమ్మదీయ మహాసభకొకపర్యాయము అధ్యక్షుడుగానుండెను. ఇప్పుడు వంగరాజధాని గవర్నరు కార్మయికేలుప్రభువుగారి కార్యనిర్వాహకసభలో భారతీయ సభ్యుడుగా నున్నాడు.

### గా॥ రాజా పానుగంటి రామారాయణంగారు ఎం.ఏ.

ఆంధ్రజమీదారులలో నున్నతవిద్య గఱచి ఎం. ఏ. పరీక్షలో దేరినవారువీరొక్కరే. చెన్నపురివిశ్వవిద్యాలయములోను, లండన్ రాజకీయకళాసమాజములోను సభ్యులుగనున్నారు. ౧౯౧౩వసం॥నుండి చెన్నపురిరాజధానిలోని జమీదారులవలన సార్వభౌమిక శాసననిర్మాణసభకు సభ్యులుగా నెన్నుకొనబడిరి. శ్రీవారికి అంగ్లమునందువలెనే ఆంధ్రమునందును గొప్ప పాండిత్యముకలదు. వీరు కాళహస్తియందుగాపురముండి తమ ఎస్టేటును నూతనకృషి పద్ధతులవలన సాగుచేయించుచు ఆప్రాంతములందు గొప్పకీర్తిని గడించియున్నారు. సాలుకు వీరికి ౭౦,౦౦౦ రూపాయలు ఆదాయము వచ్చుచున్నది. ఇంతగొప్ప విద్యాధికుడు వారిప్రతినిధిగా సామ్రాజ్యసభలో నుండుట చెన్నపురి జమీదారుల భాగ్యమనియే అనవచ్చును. శ్రీరామారాయణంగారు ఆ సభలో దమ్మెన్నుకొనినవారి పక్షమున గొప్పగా పాటుపడుచున్నారు.

### గా॥ మిర్ అసద్ అలీఖాన్ బహాదూర్‌గారు.

వీరు కర్నూలు జిల్లాలోనిబనగానపల్లి నవాబుగారితమ్ములు. హైదరాబాదులోనినిజాంకళాశాలయందు జక్కగా విద్యనభ్యసించెను. తరువాత సైదాపేటలోని వ్యవసాయ కళాశాలలోజేరి అచ్చట వ్యవసాయ శాస్త్రమభ్యసించిరి. పిమ్మట చెంగల్పట్టు, బళ్లారిజిల్లాలలో కలక్టరుల పద్దపని నేర్చుకొనిరి. బనగానపల్లి మునిసిపాలిటికిఅధ్యక్షుడుగానుండెను. తరువాత చెన్నపురిలో మెసర్సు, భుంగర అను కంపెనీకి స్వాములయి వ్యాపారమును జేయుచున్నారు. మహమ్మదీయుల యభివృద్ధికరమగు ప్రతికార్యమందును అభినివేశముతో బనినిజేయుదురు. ఉర్దుభాషయందెక్కువప్రావీణ్యతకలదు.ఏవ్ బరీప్రభువువ్రాసిన«జీవితోపయోగము»అను పుస్తకము నుర్దూభాషలోనికి భాషాంతరీకరించెను. వీరిప్పుడుచెన్నపురి మహమ్మదీయుల పక్షమున సార్వభౌమిక శాసననిర్మాణసభలో సభ్యులుగా నున్నారు.

### రాక్ ఫెల్లరుగారు.

ఈయన భూలోకములోని మొట్టమొదటికోటీశ్వరుడు. సుమారు 400 కోట్ల రూపాయల ఆస్తిగలవనివాడుక. ఈయన ధనమును, ఈతని చర్యలనుగుఱించి వ్రాయని వార్తాపత్రిక లీప్రపంచమునందుండజాలవు. ప్రపంచమునందన్నిచోట్లనున్న స్టాండర్డు ఆయిల్ కంపెనీ అను కిరోసినాయిలు కంపెనీ ఈతనిది. ఈకంపెనీవారుచేసిన అక్రమచర్యలకయి అనేకపర్యాయములు జరిమానాలు విధింపబడినను, అపీలులలో రాక్ ఫెల్లరుగారే జయించుచువచ్చుచుండిరి. ఈయన కజీర్ణబాధమెండట, తన స్వీయచరిత్రమును వ్రాయుచున్నాడు. తనకుమారుడు ఇంతధనమున కధికారియగుటవలన జెడిపోవునని న్యూయార్కులో నొక చిన్నగదియందుంచి నెలకు ఖర్చులకు 100-0-0 లు ఇచ్చును. ఈసొమ్ముతో వాడు కాలక్షేపము జేయుటవలన ధనముయొక్క విలువయిదియని తెలుసుకొన గలుగును. రాక్ ఫెల్లరు కంపెనీలో వానికుమారుడు ప్రస్తుతమొక సాధారణ గుమాస్తాపనిని నేర్చుకొనుచున్నాడు.

### సర్. ఎస్. రామస్వామి మొదలియారుగారు.

చెన్నపురిలో నెచ్చటజూచినను సర్. ఎస్. రామస్వామి మొదలియారుగారు జేసిన దానచిహ్నములు వారికీర్తిని చెప్పక చెప్పక చెప్పుచుండునుగాన విస్తరించి యిచ్చట వ్రాయుట అనవసరము. ఈయన గొప్పవర్తకుడు. చెన్నపురి షెరిఫ్‌పనినిజేసెను. దొరతనమువారిచేత సర్ అను బిరుదును బొంది వారి గౌరవమునకు బాత్రుడాయెను.

## సర్ తారకానాథపాలిత్ గారు.

ఈయన కలకత్తాలో బ్యారిష్టరు. స్వభావముఒకరితో కలసిమెలసియుండుగాక నిష్కృష్ణ యయిన దగుటవలన నింతకాలము వఱకును ఈయనపేరు బయటికిరాలేదు. 1907 లో కలకత్తాలో సాంకేతిక విద్యాలయమునకయి ౧౦ లక్షల నీయజూచెనుగాని షరతులు కుదరవందున మానుకొనెను. ౧౯౧౨ లో కలకత్తా విశ్వవిద్యాలయమునకు ప్రకృతి శాస్త్రాన్వేషణాలయమునకయి ౧౪ లక్షల రూపాయలను, తన స్వగృహమును ఒసంగెను. ఈనూతనాలయములో విద్యార్థులును, ఉపాధ్యాయులును భారతీయులుగనే ఉండవలయునను నియమమేర్పఱచి ఇంతధన మొసంగుటవలన తారకానాథుని స్వదేశాభిమానము వెల్లడియగుచున్నది. తన బిడ్డలను బీదవారినిగాజేసి తన స్వార్జితవిత్తమును తన దేశమునకయి నొసంగుటకంటె గొప్పదేశాభిమాన మేమికావలయును.

## దివాన్ బహదూర్ గోవిందదాసు చతుర్భుజదాసు గారు.

వీరు చెన్నపురిలో విఖ్యాతిగాంచిన లక్షలకధిపతియగు ఘూర్జరవైశ్యులు. అబాలగోపాలము దెలిసిన ధర్మప్రభువు. వీరును వీరి పితామహులును రామేశ్వరము మొదలు వారణాసివరకును అనేక ధర్మశాలలు, సత్రములను అచంద్రార్కముగ నుండునట్లు ఏర్పరచిరి. రాజధానిలో బైరాగులకును నితరులకునుజేయు ధర్మములలో వీరిది మొదటిదైయున్నది. మరియు వీరలు రాజకీయనియోగప్రకారము.అనేకధర్మములు జేసియున్నారు. జేయుచున్నారు. పిన్నవయస్సుగలవారైనను వీరుజేయు ధర్మమను కీర్తికాంత పెద్దదియగుటకు దొరతనమువారు దివాన్ బహదూర్ అను గౌరవబిరుదముచే నలంకరించుటయె గొప్పసాక్ష్యము.

## మార్కోనిగారు.

తీగలేకుండ తంత్రీసమాచారములను నేలమీదగాని సముద్రముమీదగాని బంపగల యంత్రోపకరణములను నిర్మించి ప్రపంచమునకు మహోపకారమునుజేసిన మహనీయుడు. పుట్టుకవలన ఇటాలియను అయినను అమెరికా సంయుక్తరాష్ట్రములలో గాపురమున్నాడు. ఈయన నిర్మాణమువలన మునిగిపోవుటకు సిద్ధమయిన స్టీమరులనేకములు కాపాడబడినవి. ఈనిర్మాణమువలన లోకమునకు గావలసినంత యుపకార మనేకవిధములజరుగుచున్నది. భూలోకప్రజా సౌఖ్యమునకయి నూతననిర్మాణములనుజేసి గొప్పకీర్తివహించిన మహామహులలో మార్కోనిగారి దివ్యనామము శాశ్వతముగా నిలిచియుండగలదు.

## అముండ్సెన్ గారు.

ఈయన దక్షిణధ్రువమునుజేరి అచ్చట నార్వేజియను పతాకమును పాతి నార్వేదేశమునకు కీర్తినిగడించిన దేశాభిమాని. ఈయన తరువాతనే కాప్టిన్‌స్కాటును దక్షిణధ్రువముజేరిన తిరిగివచ్చునప్పుడు మృతినొందెను. కాని ప్రథమమున ఆధ్రువమునుజేరినకీర్తి అముండ్సెన్ గారిది. అనేకపర్యాయము లీప్రయత్నమునుజేసి, విఫలమనోరథుడయి, పట్టుదలనువిడువక, తుట్టతుదకు జయించుటవలన ధీరులు తాముబూనిన కార్యములను బరిత్యజింప రమటకు ప్రబల నిదర్శనము చూపబడినది. దక్షిణధ్రువ ప్రయాణమును గురించి రెండు గొప్పగ్రంథములనువ్రాసెను. ఇప్పుడునార్వేనువదలి బెహారింగు జలసంధివద్ద కాపురముండుటకయి వెళ్లియున్నాడు.

## శిరాం సుబ్బయ్యశేష్ఠిగారు.

సుబ్బయ్యశ్రేష్ఠిగారు ఆంధ్రవైశ్యుడు. మనదేశమందు ఇంజనీరింగుపరీక్షలలో కృతార్థుడై, మైసూరుగవర్నమెంటువారి విద్యార్థివేతనమును బుచ్చుకొని, ఇంజనీరింగును ఇంగ్లండులో జదువుటకయి వెళ్లి, ఆకాశవిమాన నిర్మాణమునందాసక్తిగలవాడయి, వాటిని నిర్మించుటను నేర్చుకొని, వాటిలో ననేకపర్యాయములు ఎగిరి, విమాననిర్మాణమునందు గొన్ని నూతనమార్పులను స్వబుద్ధిబలమువలనజేసి, బంగారు పతకములను సంపాదించి,౧౯౧౨ లో మైసూరునకు దిరిగివచ్చి, అప్రభుత్వమువారి కొలువులో ఇంజనీయరుగా ప్రవేశించెను. ఆంధ్రదేశమందున్న వైశ్యులందరును సుబ్బయ్యగారిని తమతమ నగరములకు బిలిపించి ఊరేగింపులతో నెనర్కొని, సభలుజేసి, గౌరవించుట మరియొక యుదహరింపవలసిన సంగతి.

## హబిబూర్ రహిమాన్ ఖాన్ గారు.

ఈయనచారిత్రము ఆంధ్రపత్రికయందొక పర్యాయముపూర్తిగా వ్రాయబడినది. ఇండియా టెలిగ్రాఫుడిపార్టుమెంటుకు జేరిన సూపరింటెండెంటు. నాలుగువత్సరముల క్రితము వర్షములవలనను, మంచువలనను టెలిగ్రాఫుతీగెలు తెగిపోయి, ఉత్తరములను సయితముదెచ్చు పోస్టు రాకయుండగా, పశ్చిమోత్తర పరగణాలలోనున్న నదిలోని జలముగుండా తీగెలులేకుండతంత్రీవార్తలనంపు పనిముట్లనునిర్మించెను. ఇందుకనిమనదేశమందును,యూరపునందును అనేకమంది యీతనిని అభినందించిరి. తననిర్మాణమును లోపరాహిత్యముజేసి సిద్ధినొందించుటకయి ఇండియా గవర్నమెంటువారివలన నుపకారవేతన మొసంగబడుటచే శోధనములను జేయుచున్నాడు.

## అతిపూజనీయులగు మఠాధిపతి అజరయ్యగారు.

వీరుతిరునల్వేలి జిల్లాకు జెందిన స్వదేశక్రైస్తవులు. ఎఫ్. ఏ. పరీక్షలో కృతార్థులయినపిమ్మట క్రైస్తవమత వ్యాపనార్థమై చాల కృషి సలిపిరి. తరువాత దేశీయక్రైస్తవమతవ్యాపక సమాజమునకు జెందినవారయి ఉత్తరమునకువచ్చి నిజాంరాజ్యములోని డోర్నకల్లునుముఖ్యస్థానముగా నేర్పఱచుకొని ఆరాష్ట్రమందును మరియితరచోటులను ఉన్న చర్చిఆఫ్ ఇంగ్లండునకు జెందినవారికందరికినిగురువుగానున్నారు. ఈయనగడచిన జనవరిమాసమందు బిషప్‌గా కలకత్తాలో జేయబడిరి. ఈగొప్పపదవినందుటకు మొట్టమొదటి భారతీయు డీయనయే.

## హెన్రిపోలక్ గారు.

పోలక్ గారు దక్షిణాఫ్రికాకు జెందిన యూదుడు. బారిష్టరు. అచ్చట హైందవులుపడు కష్టములనుజూచి, ఓర్వలేక, పనినిమానుకొని వారిపక్షమువహించి, తనగవర్నమెంటుతో పోరాడుటయేగాక, ఇండియాకువచ్చి, అన్నిచోటులలోను, దిరిగి అనేకసభలలోనుపన్యాసముల నొసంగి, మనదేశీయుల కష్టములను వెలిబుచ్చి, వారికొరకయి ధనము నువసూలుచేసెను. గాంధిగారయినపిమ్మట మనదేశీయులకొరకయి మరెవ్వరును పోలకుగారు పడినంతకష్టమును పడలేదు.

## లెడుబీటరుగారు.

అనిబెసెంటు దొరసానమ్మగారయినపిమ్మట దివ్యజ్ఞానసమాజములో లెడ్‌బీటరుగారంతవారింకొకరులేరు. ఈయనమీద అనేక అపనిందలుమోపబడినవి. వానితో మనకిక్కడపనిలేదు. మనశాస్త్రములను చక్కగాజదివినట్టివాడు. భవిష్యత్తును గూడజెప్పగలడు. రాగలసంగతులనుగుఱించియు ప్రపంచముయొక్క యుత్పత్తినిగురించియు, గ్రంథములనువ్రాసెను. మంచివక్త. దివ్యజ్ఞాన సమాజమునందు జనప్రీతిత్వము గలుగుటకయి శ్రమపడుచున్నట్టివాడు.

## జిడ్డు కృష్ణమూర్తిగారు.

ఈయనపేరు "గురుపాదసన్నిధిని" అనివ్రాసినపుస్తకము వలననేమి, చెన్నపురిహైకోర్టులో జఱుగుచున్న అభియోగము వలననేమి మూడునాలుగు ఖండములయందు మ్రోగినది. ఈయనయొక ఆవతారపురుషుడని (ఆల్ కోయన్)దివ్యజ్ఞానసమాజికులనమ్మకము. తమ్ముడు నిత్యానందముతో నింగ్లండునందు విద్యనభ్యసించుటకు అనిబెసెంటుగారువద్దకు పెట్టివచ్చినది. తండ్రి నారాయణయ్యగారికిది యిష్టములేకతనబిడ్డలిద్దరును మైనరులగుటవలన దనవశము జేయవలసినదని చెన్నపురి హైకోర్టులో అనిబెసెంటమ్మగారి పయిన అభియోగము దెచ్చియున్నాడు. తీర్పు చెప్పబడలేదు. జిడ్డు వారాంధ్రబ్రాహ్మణులు.

## రావుబహదూర్ వెంకయ్యగారు.

ఈయన మదరాసు గవర్నమెంటువారిక్రిందను, సింలాలోఇండియా గవర్నమెంటువారిక్రిందను పూర్వవస్తుపరిశోధకుడుగా నుండి ఆశాఖయందు తనపరిశ్రమవలన మనదేశమందేగాక, యూరపునందును ఖ్యాతిగడించెను. సుమారాయనకు పదిభాషలువచ్చును గతవత్సరమునందు అతిమాత్రవ్యాధివలన రాచపుండుపుట్టి మృతినొందెను. వెంకయ్యగారాంధ్రుడు.

## సి. శేషారావునాయుడుగారు.

వీరు మధ్యపరగణాలలో గాపురమున్న ఆంధ్రులలో నొక్కరు. బి. ఏ. పరీక్షలో దేరినపిమ్మట అసిస్టెంటు కలక్టరుద్యోగ మొసంగబడెను. తరువాత జిల్లాజడ్జీయయ్యెను. మొత్తముమీద 20 సం॥ లారాష్ట్రమందు రాజకీయసేవజేసి గతించిన అగస్టునెలలో 42 వ ఏట మృతినొందిరి. ఇతరరాష్ట్రములలోనుండి జిల్లాజడ్జియుద్యోగమువంటి గొప్పపదవిని ఒక ఆంధ్రుడు బొందగలుగుట ప్రశంసనీయ మయినది.

## కావలి వేంకటపతిరావుగారు.

వీరు నియోగిబ్రాహ్మణులు. విన్నన్నపేట, తిన్ననూరు, అమ ముతా జమీందారులు. బి. ఎల్. పరీక్షమొట్టమొదట చెన్నపురిలో శెట్టినప్పుడు కృతార్థులయినవారిలో వేంకటపతిరావుగారొకరు. అత్యధికమేధాశక్తిగల దేశాభిమాని. అయిదుసంవత్సరములు చెన్నపురిహైకోర్టులో న్యాయవాదిగానుండి సుమారు నాలుగులక్షలరూపాయ లార్జించెను. ఈయనతన 32 వ యేటనే 1872వసం॥ లో మృతినొందియుండకున్నచో నాంధ్రులలో నత్యున్నతగౌరవము నొందవలసినవాడే. ఈయనయకాలమరణము ఆంధ్రులకు గొప్పలోపమును గలిగించెను.

## దివాన్ బహదూర్ కంచికృష్ణస్వామిరావుగారు సి. ఐ. ఇ.

ఈమహనీయుడు దేశస్థబ్రాహ్మణుడు. ఆంధ్రభాషను రెండవభాషగాదీసికొని అంతపాండిత్యమును సంపాదించినట్టివాడు. తెలుగుజిల్లాలలో ననేకవత్సరములు సబార్డినేటు జడ్జిపదవిని జేసినపిమ్మట, ఈయనధర్మశాస్త్ర ప్రావీణ్యతకు మెచ్చుకొని తిరువాన్కూరు మహారాజుగారు వారిహైకోర్టుకు న్యాయాధిపతిగాను తరువాత ముఖ్యమంత్రిగాను, నియమించిరి. కృష్ణస్వామి రావుగారికాలములో ప్రజలకనేకసౌకర్యములేర్పఱచబడెను. ఇప్పుడాయన యుపకారవేతనమునుబుచ్చుకొని చెన్నపురిలోగాపురమున్నారు. ఈనగరమందేచిన్నదికాని పెద్దదిగాని కార్యము జఱిగినను అంతరావుగారుండి దానిని నడపుచుండవలసినదే. ఎక్కువ దేశభక్తిగలవారు. మధ్వసిద్ధాంత సభాప్రతిష్ఠాపకులు. ఆసభకు ప్రధాన సభాధ్యక్షులు.

## దివాన్ బహదూర్ వారణాసి సుబ్రహ్మణ్యంపంతులుగారు.

వీరు చెన్నపురిలో స్మాలుకాజు కోర్టులో జడ్జిగానుండి, పిమ్మట జిల్లాజడ్జిపదవినిబొంది ప్రస్తుతము కడపలోగొలువునందున్నారు. ఇట్టియున్నతోద్యోగమును బడసిన బహుకొద్దిమంది ఆంధ్రులలో వీరొక్కరు. సంఘసంస్కరణాభిలాషులు. బాపట్లలో జఱుగబోవు సంఘసంస్కరణసభ కధ్యక్షులుగా నెన్నుకొనబడిరి. బి.ఏ.,బి.ఎల్., పరీక్షలం దుకృతార్థులైరి.

## పి. వి. కృష్ణస్వామి శెట్టిగారు బి.ఎ.బి.ఎల్.

ఈయన చెన్నపురిలోనున్న వైశ్యశిఖామణి. న్యాయవాదిగానున్న దినములలో సగముఅభియోగము లీయనకును, మిగిలినసగ మితర న్యాయవాదులకును వచ్చుచుండెడివి. అంతధర్మశాస్త్రపరిజ్ఞానముకలదు. చెన్నపురిలో వైశ్యులచే చేయబడిన అనేకధర్మములకు సభాధినాయకులుగానున్నారు. శ్రీకన్యకాపరమేశ్వరీ దానములను మంచిస్థితికితెచ్చిన దీమహనీయుడే. ఇప్పుడు వృత్తిని మానుకొని వయోతీతులగుటచేసుఖముగా కాలము గడుపుచున్నారు.

# తీర్థయాత్రా సేవనము.

చ. వ్రతములులేనివారు నుప * వాసపరాఙ్ముఖులైనవారు దు
ర్మతులు విహీనశౌచులు వ్ర * మంబునఁ దీర్థములాడనోప రా
తతగుణశాలి నీవఖిల * ధర్మవిదుండవుగావునన్ శుభ
స్థితిఁజని తీర్థ సేవనము * సేయుము నీకునభీష్టసిద్ధిగన్.

(మహాభారతము.)

ఉత్తుంగంభీరంబులైన నగరాజంబులును, సుజల పూరితంబులైన నదీనద కాసారంబులును, విశాలోన్నతపాదపాకీర్ణంబులైన వనంబులును, శిల్పిరచనా విరాజితంబులైన సుందర మందిరంబులును, దివ్య ప్రభావ విలసితంబులైన దేవాలయంబులును, నిరంతర వారిధారాపరిశోభితంబులైన జలపాతంబులును, పురాణేతిహాస ప్రసిద్ధంబులయిన ప్రదేశంబులును దర్శనీయంబులై, మనోహరంబులై మనుజులకు సృష్టి వైచిత్ర్యంబులను దేవదేవుని దివ్యమహిమను బ్రకటించుచు జ్ఞానప్రదంబులగుచున్నవి. తమచుట్టు గుడిసెయె దివ్యమందిరంబనియును, కుగ్రామమే మహాపట్టణమనియును, సంపదలె రాజసంపదలనియును, గుణగణంబులె సద్గుణంబులనియు నానందించు మనుజులు యాత్రాసేవనమువలన గన్నులనుదెఱచి తమయల్పత్వమును ప్రపంచ మహాత్వమును గ్రహింపనోపుదురు. మంచుచేగప్పబడి వెండిశిఖరమువలె మెఱయు కైలాసశిఖర సందర్శన మత్యంతాశ్చర్యజనకములు. ఉత్తుంగతరంగ విరాజితంబులును సుజలపూరితంబులును, నౌకాతరణానుకూలంబులును, సుక్షేత్రాలంకృతంబులును నగు గంగా గోదావర్యాది నదులాహ్లాద కరంబులు. నిర్మల జలపూరితంబులును, హంససారసాకీర్ణంబులును నైన మానససరోవరాది కాసారంబులు రమణీయంబులు. అనంతశాఖా పర్ణశోభితంబులునువిహంగమ నివాసానుకూలంబులును నైన దేవదారు సాల వట మహీరుహంబులు సుఖప్రదంబులు. పరిమళామోద జనకంబులును పుష్పఫలభరితంబులునైన వకుళ చూత వృక్షబృందంబులు మనోహరంబులు. సౌందర్య నిలయంబులును, చిత్రవిచిత్ర వినిర్మితంబులునునైన తాజమహాలు మొదలగు దివ్యమందిరంబులు స్వర్గతుల్యంబులు. దివ్యప్రభావ భాసురంబులును గోపుర మంటప మండితంబులును నైన కాశీ రామేశ్వరాదిమహాస్థలంబులు పాపహరంబులు. మహాశక్తివంతంబులును గంభీరంబులును నైన గెరసొప్ప మొదలగు జలపాతంబు లద్భుతంబులు. పురాణేతిహాస ప్రసిద్ధంబులును విభవాభిరామంబులును నైనమధురాది నగరంబులు మంగళకరంబులు. రమ్యంబును, గంభీరంబును, మనోహరంబునగు యాత్రాసేవనము దుఃఖార్తులకు దుఃఖోపశమనమును, రోగగ్రస్తుల కారోగ్యమును, లుబ్ధుల కౌదార్యమును, మూర్ఖులకువివేకమును మతాభిమానులకు మతావేశమును, గలిగించుచున్నది. యాత్రాసేవనమనుశ్రుతముగా బ్రాచీనకాలమునుండియును సకలదేశవాసులచేతనాదరింపబడుచు వచ్చినది. పూర్వకాలమునందు యూరపుదేశీయులు రోము నగరమునందలి సెంటుపీటరు దేవాగారంబును పలస్తీనుదేశంబును భక్తి శ్రద్ధలతో సందర్శించెడివారు. భక్తితత్పరులైన మహమ్మదీయులు లేటేటను గుంపులు గుంపులుగా మక్కాయాత్రను సేవించుచున్నారు. ధర్మనిరతులైన బౌద్ధులు బుద్ధగయను సందర్శించుచున్నారు. యూరపుదేశమునందనేకులు పాదచారులై సుప్రసిద్ధంబులైన క్షేత్రములకుబోవుచున్నారు. తీర్థయాత్రలను సేవింపవలయుననుదలంపు హిందువులకువలె వేరొకరికిలేదు. హిందువులకు వారములు, తిథులు, నెలలు, ఋతువులు అయనములు, వత్సరములు దైవాధిష్ఠితములు. గ్రామములు,నగరములు, పుణ్యక్షేత్రములు.దేవతాపోషితములు. నదీనదములుదేవతావతారములు. పర్వత ప్రదేశంబులు దేవతావాసంబులు. ఈయుదారభావ భరితులైన హిందువుల కాసేతు హిమాచలపర్యంతము వ్యాప్తమైన భరతఖండము పురాణ గాథలతోను పుణ్యక్షేత్రములతోను, దివ్యప్రదేశ ములతోను నిండి దర్శనయోగ్యమును పూజార్హమును నగుచున్నది. సూక్ష్మబుద్ధి గలవారలీ స్థలపురాణములందు ప్రాచీనచరిత్ర కాధారములను గ్రహింపనోపుదురు. మహాకవి షేక్స్పియరు వ్రాసినటులు "ధీమంతులువృక్ష సంచలనంబులందు మంజులాలాపంబులను, శిలలయం దుపదేశంబులను, సర్వత్ర సత్స్వభావంబును జూడనోపుదురు."

యాత్రాసేవనమిపుడు నూతనాకృతిని గైకొనినది. లోకాటనమిపుడు యాత్రాసేవనస్థానము నాక్రమించుకొనినది. భక్తివైరాగ్య లాభార్థమై యేర్పడినయాత్రాసేవనమిపుడు భోగభాగ్య లాభార్థమైన లోకపర్యటనముగామారినది.

పాశ్చాత్యులేటేటను కోట్లకొలది రూప్యములను దేశాటనమునకై వినియోగించుచున్నారు. వారిచేజూడబడని రమణీయ ప్రదేశములేదు. హిందూదేశ వైభవంబులను జూచుటకేటేటను శీతకాలమునందు పాశ్చాత్య యాత్రికు లరుగుదెంచుచున్నారు. హిందూదేశమునందుగల సృష్టివైచిత్ర్యములకుసాటిలేవు. ఉన్నత తమంబైన కించింజింగశిఖరము భారతమాతయొక్క కీర్తిపతాకము మిన్నదై వెలుంగుచున్నది. అందపు కుప్పయైన తాజమందిరము పతకమురీతిని మెఱయుచున్నది. భూలోకోద్యానంబు నాబరగు కాశ్మీరము శిరోభూషణముమాడ్కి రాజిలుచున్నది. రమణీయంబులైన బౌద్ధవిహారంబులు భూషలభంగి భాసిల్లుచున్నవి. పవిత్రంబులైన గంగాయమునాది ప్రవాహంబులు హారంబులతెరంగున బ్రకాశించుచున్నవి. ఈగంభీరరూపంబును, నీసుందరాకారంబును, నీవిలాసవైభవంబును జూడజాలిన భారతీయులుమాతృపూజాతత్పరులై తత్సేవా నిరతులగుట సహజము. చూచుట కవకాశము లేనివారు తద్వైభవ శ్రవణమువలననైనను పవిత్రమైన దేశారాధన వ్రతము నారాధించవలసియుందురు.

## రామేశ్వరము.

కాశీరామేశ్వరములు హిందూదేశమునందలి పుణ్యక్షేత్రములలో సుప్రసిద్ధములు. శ్రీరాములు రామలింగేశ్వరస్వామిని రామేశ్వరలంకయందు బ్రతిష్ఠించినటుల పురాణగాథలు గలవు. ఈలంక విస్తీర్ణము 66 చదరపు మైళ్ళు. గుడికి నాలుగువైపుల గోపురములును, 600 అడుగులు పొడవును 157 అడుగులు వెడల్పును గలిగిన ప్రాకారమును గలవు. గుడికి ముందుగల సహస్రస్తంభమంటపము రమణీయంబుగ నుండును. యాత్రికు లనుదినమును గంగాజలంబులతో రామలింగేశ్వరస్వామి కభిషేచనంబును జేయుచుందురు. రామేశ్వర యాత్రాసేవనము పాపహరమని హిందువులు నమ్ముదురు. అనవరత మసంఖ్యాకులైన యాత్రికులువచ్చుచుందురు. రామేశ్వరమునకు రయిలుమార్గ మేర్పడినది.

## పెరియారు కూనూరు శివసముద్ర జలపాతములు.

పెరియారనఁ బెద్దనది. ఈనది బ్రిటిషు రాజ్యమునకును తిరువాన్కూరు సంస్థానమునకును నడుమగలదు. పాలకులు 92 లక్షలరూప్యములను వెచ్చించి నది కడ్డకట్టనుగట్టి గొప్పజలాశయము నేర్పరచిరి. ఆనీటివలన నిపుడు 1,00,000 యకరముల భూమి సాగగుచున్నది.

కూనూరు శివసముద్రము జలపాతంబులు దక్షిణ దేశమునందుగల సృష్టివైచిత్ర్యములు. చూచుట కాహ్లాదకరంబై సర్వేశ్వరుని మహిమను జాటుచుండును.

## నాశికాక్షేత్రము.

పంచవటీక్షేత్రము పురాణప్రసిద్ధము. సీతారామలక్ష్మణులిచట వనవాసమును జేసిరి. లక్ష్మణుడు శూర్పణఖ నాశికను గోయుటవలన నీపేరు గలిగినదని ప్రతీతిగలదు. పూర్వకాలమునం దాంధ్రసామ్రాజ్యమునకుఁ బశ్చిమ రాజనగరముగనుండిన ప్రతిష్ఠానపురము నాశికకు 110 మయిళ్ళ దూరమునఁ గలదు. లీనాగుహాయందలి శాసనములవలన నాంధ్రులీప్రదేశమును క్రీ. పూ. 200 నుండి పాలించినటులు తేలుచున్నది. నాశిక కనతిదూరమునందున్న త్రియంబకము గోదావరి పుట్టినచోటు. గోదావరీనది కిరుప్రక్కలను దేవాలయంబు లనేకములు గలవు. ఈసుందర ప్రదేశము దర్శనయోగ్యము. దీనికి రయిలుమార్గము గలదు.

## తంజావూరు.

కావేరీతీరమునందుగల తంజావూరు దక్షిణ హిందూదేశమునందలి ముఖ్యపట్టణంబులలో నొక్కటి. బృహదీశ్వరస్వామి దేవాలయము 208 అడుగుల యెత్తును గలిగి రెండు విశాలమైన ప్రాకారములచే నావృతమై యున్నది. స్వామియెదుటను 16 అడుగుల యెత్తుగల చక్కని నందివిగ్రహము గలదు. ఒకవైపున సుబ్రహ్మణ్యేశ్వరుని దేవాలయముగలదు. గుడిమీదను శివలీలలకును గోపురముమీదను విష్ణులీలలకును సంబంధించిన ప్రతిమలు గలవు. ఈక్షేత్రమునకు రైలుదారిగలదు.

## చిదంబరము.

నటరాజస్వామికి నిలయమైన చిదంబరమొక పవిత్రమైన క్షేత్రము. ఇచ్చోట నాకాశలింగము వెలసినది. దేవాలయ ప్రాంతము నలువది యకరముల ప్రదేశము నావరించుకొనినది. దేవాలయమున క్రొత్తయిన ప్రాకారము గలదు. నాటుకోటశెట్టులు విశేషద్రవ్యమును వ్యయముచేసి యాత్రికులకొరకు ధర్మసత్రమును గట్టించిరి. ఇది దర్శనీయమైన క్షేత్రము. రయిలుమార్గము గలదు.

## చంద్రగిరి.

విజయనగర రాజులకు తాలికోట యుద్ధానంతరము చంద్రగిరి రాజధానిగ నుండెను. పూర్వకాలమునందు చంద్రగిరిదుర్గము శత్రువులకు దుర్భేద్యముగా నుండెను. 1639 వ సంవత్సరమునందు ప్రాగ్వాణిజ్య సంఘమువారికి చెన్నపట్టణము కవులన కీదుర్గమునందలి రాజమందిరమునం దీయబడినటులు దృష్టాంతములు గలవు. ఇది ఉత్తరార్కాటుజిల్లాయందు సువర్ణముఖీ తీరమునందు గలదు.

## తిరువనామలయి.

ఇది దక్షిణఆర్కాటునందు గలదు. ఈశివక్షేత్రమునందు కార్తికమాసమున మహోత్సవమును పశువుల సంతయును జరుగును. ఈస్థలమునకు సమీపమునందున్న చెంగముకనుమవద్దను 1767 లో హైదరాలి ఆంగ్లేయులవలన నోడింపబడెను. దేవాలయము చిత్రాలంకృతంబై రమ్యంబుగ నుండును. రయిలుమార్గము గలదు.

## తిరుపతి.

తిరుపతి వేంకటేశ్వరుల దేవాలయ మాసేతు హిమాచలపర్యంతమును బ్రసిద్ధికెక్కినది. ఈక్షేత్రమునందు దిగువతిరుపతి, ఎగువతిరుపతి అని రెండుభాగములు గలవు. ఎగువతిరుపతికి బోవుట కేడుకొండలను నేడుగోపురములను దాటవలెను. కొండమీదను పాపనాశనము గోగర్భము మొదలగు పుణ్యతీర్థము లనేకములు గలవు. ధర్మకర్త మహాంతని పిలువబడును. ఆయన బైరాగులకు జెందిన బ్రహ్మచారి. యాత్రికులు చెల్లించు ముడుపులవలనను కానుకలవలనను ధర్మకర్తకు మంచిరాబడి గలదు. ప్రజలకు వేంకటేశ్వరుని మాహాత్మ్యమునందు నిండునమ్మకము గలదు. తిరుపతికి రయిలుదారి గలదు.

## మహాబలిపురము.

చెన్నపురికి ముప్పదియైదు మైలుల దూరమునందున్న మహాబలిపురమునందలి దేవాలయము లాశ్చర్య ప్రదములు. ఇచట బౌద్ధవిహారములు, గుహాలు, హిందూదేవాలయంబులు గలిసియున్నవి. ఏకశిలానిర్మితములయిన రథము లత్యంతాశ్చర్యమును బుట్టించును. అర్జునరథము ద్రౌపదిరథము మొదలగు రథము లయిదుగలవు. శ్రీకృష్ణుని మంటపము చిత్రవిచిత్రమై మనోహరముగ నున్నది. పడమటి చాళుక్యులు వీటిని కట్టించిరని రాబర్టు స్యూయెలుగారిమతము. రథములమీదగల శాసనములవలన క్రీ. శ. నాలుగయిదు శతాబ్దములం దీరథములు నిర్మింపబడినవని నమ్మవలసి యున్నది. ప్రాచీనవస్తు పరిశోధకుల కీనిర్మాణములు హృదయరంజకములుగ నుండును.

## మధుర.

పాండ్యరాజ్యమునకు రాజధానియైన మధురానగరము మిక్కిలి పురాతనమయిన పట్టణము. క్రీ. పూ. అయిదవశతాబ్దమునందు పాండ్య

రాజులిచటను పాలించుచుండిరి. పదునొకండవ శతాబ్దమునందు పాండ్యవంశ మంతరించెను. పదియారవ శతాబ్దమునం దాంధ్రులయిన నాయకవంశజులు పాలకులయిరి. వారియందు తిరుమలనాయకుడు సుప్రసిద్ధుడు. ఆరాజన్యునిచే గట్టింపబడిన నగరు లిప్పటికిని సుందరముగా నున్నవి. మీనాక్షీ సుందరేశ్వరుల దేవాలయములు, తెప్పకోలను, సహస్రస్తంభమంటపము, గోపురములు, చిత్రాలంకృత స్తంభములు దర్శనీయములై మనోహరముగా నుండును. రయిలుబాటగలదు.

### శ్రీరంగము.

శ్రీరంగనాయకస్వామి దేవాలయము సప్తప్రాకార విరాజితమై శోభాయమానమై యొప్పుచున్నది. విశిష్టాద్వైతమతస్థాపకులును మహామతులునునయిన శ్రీరామానుజాచార్యులవారిచట చిరకాలము నివసించిరి. ఉత్తరగోపురము 130 అడుగుల ఎత్తును గలిగి యున్నది. ప్రాకారముల మధ్యప్రదేశము 7,92,000 గజముల విస్తీర్ణమును గలిగి యున్నది. వైష్ణవదేవాలయములలో శ్రీరంగము మిక్కిలి ప్రసిద్ధికెక్కినది ముక్కోటి ఏకాదశికి జను లసంఖ్యాకులుగా నిచటికి బోదురు." రయిలుమార్గము తిరుచునాపల్లి వరకును గలదు.

### తాడిపత్రి.

పదియారవ శతాబ్దమునం దీపట్టణమును నిర్మించిన రామలింగనాయుడు రామలింగేశ్వర స్వామియొక్క దేవాలయమును గట్టించెను. తిమ్మనాయుడొక దేవళంబును నిటీవల వర్తకు లొక దేవళంబునుగట్టించిరి. దేవాలయములు సుందరముగా నున్నవి.

### రంగనాథస్వామి, నెల్లూరు.

ముక్కంటియను నాయకుడు నెల్లూరుపట్టణమును గట్టించినటులు ప్రతీతి గలదు. పండ్రెండవ శతాబ్దమునందు సిద్ధిభూపాలుడు రాజుగ నుండెను. కవిబ్రహ్మ తిక్కనార్య డీరాజేంద్రునకు మంత్రిగను సేనాధిపతిగను నుండి శత్రువులగతమయిన రాజ్యమును తిరిగి జయించి తనయేలిక కర్పించెను. కాలక్రమమున కాకతీయులు, విజయనగర రాజులు, మహమ్మదీయులు, ఆంగ్లేయులు పాలకులయిరి. రంగనాథస్వామిదేవాలయ మిటీవల గట్టబడినది.

### కాంచీపురము.

ఈపుణ్యక్షేత్రము ప్రఖ్యాతమైన ఏడుపుణ్యక్షేత్రములలో నొకటి. ఇది చోళరాజ్యమునకు రాజధానిగ నుండెడిది. ఇతరపుణ్యక్షేత్రములందువలె నిచట జైనులు ప్రబలియుండిరి. హిందూమతముతిరిగి ప్రబలినపుడు జైనారామములు దేవాలయములుగ మారినవి. కాంచీపురము పూర్వము పండితులకు నివాసస్థలమై మహావిద్యాలయముగ నొప్పుచుండెడిది. శ్రీరామానుజాచార్యులవారిచటను విద్యనభ్యసించిరి. శివకంచియందే కాంచేశ్వరస్వామియును విష్ణుకంచియందు వరదరాజస్వామియును గలరు. దేవాలయంబులు దర్శనీయంబులును, రమణీయంబులు.

## ఇతర దేవాలయములు

గయా, భువనేశ్వరము, పునహా, జగన్నాధము, సింహాచలము, సంచి, గ్వాలియరు, కాశి, కలకత్తా, మాండలి, హంపివిరూపాక్షము, హరిద్వారము, బృందావనము మొదలగు మహాస్థలములందుగల దేవాలయముల చిత్రపటములిందు ముద్రితములైనవి. అవకాశములేకుండుటవలనను, గ్రంథవిస్తరభీతిచేతను మిగిలినదేవాలయముల వృత్తాంతములను వ్రాయనందులకు జదువరులు మన్నించుటకు బ్రార్థితులు. ఆక్షేత్రముల సంగ్రహవృత్తాంతము వారపత్రికయందప్పుడప్పుడు ప్రచురింపబడును. ఆంధ్రదేశమునందలి దేవాలయముల పటములు దొరకనందున ప్రచురించుటకు వీలుగలుగనందులకు విచారముగలుగుచున్నది.

### విగ్రహములు, చిత్రశిల్ప రచనలు.

లక్ష్మి, నృసింహుడు, శివుడు, బుద్ధుడు, గణపతి, నందీశ్వరుడు, వీరభద్రుడు మొదలగు విగ్రహపటములును, గంటసాల, అమరావతి, మధుర, రామేశ్వరము మొదలగు ప్రదేశములందలి పురాతనపు శిల్పరచనల పటములును ప్రచురింపబడినవి. వాటిని పరిశీలించినవారలకు ప్రాచీనశిల్పవైభవమును నేటిదుస్థితియును బోధపడగలదు. రెండువేలేండ్లకు బూర్వము అమరావతి స్తూపమునందు జూపిన పనితనమాంధ్రులకాశ్చర్యమును గలిగించుట సహజము. నేడు వేడుకకైన నొకసుందరమందిరమైన నాంధ్రదేశమున నగోచరము.

### ఇతరపటములు.

బొంబాయి, మద్రాసు, మైసూరు, బెంగుళూరు, కలకత్తా, ఢిల్లి మొదలగు పట్టణంబులందుగల ముఖ్యప్రదేశములపటములు కొన్ని ముద్రింపబడినవి. వాటిసౌందర్యమును చదువరులు గ్రహించగలరు.

సృష్టిక్రమమును దెలుపుపటములుమూడు ప్రచురింపబడినవి. ఆపటములు "లండను ఇలస్ట్రేటెడ్ న్యూస్" పత్రికనుండెత్తి వ్రాయబడినవి. అనాదిని జలమయమైన భూభాగముక్రమముగ జలచరములకును, స్థలజలచరములకును, చతుష్పాదజంతువులకును, వానరులకును, నరులకును నివాసయోగ్యమైనవిధమిందు జూపబడినది. ఏకపదార్థము బహుధాకరణమైనదను బరిణామవాదసిద్ధాంతము నీపటములు ధృవపరచుచున్నవి.

### మహమ్మదీయమసీదులు, సమాధులు.

మక్కా, శ్రీరంగపట్నము, ఆగ్రా, లక్నో, బీజాపురము, సెయింటుసోఫయ, మెదీనా మొదలగు ప్రదేశములందుగల పవిత్రములైన మసీదులపటములును, కాదిర్ సాహేబు, ఎట్మద్దౌలా, రాబిసురాణి మొదలగు మహానుభావుల సమాధులపటములును ముద్రింపబడినవి. మక్కా మదీనాలు మహమ్మదీయులకు పుణ్యక్షేత్రములు. అవి అరాబియా దేశమునందుగలవు. మహమ్మదీయమతమును మహాత్ముడు మహమ్మదీప్రదేశములనుండి వ్యాపింపజేసెను. సయింటుసోఫయా మసీదు కాన్‌స్టాంటునోపిలునందు గలదు. పదివేలమంది నమాజును జేయుటకీమసీదునందు గూడుదురు. ఆగ్రాయందలి మోతిమసీదు వెలలేని ముత్యమువలె సౌందర్యసాలియై, విచిత్రనిర్మాణమై, యానందప్రదమై, లోకాలంకారమై వెలయుచున్నది. ఆదివ్యమందిరమును సందర్శించినవారలు సమ్మోహపరవశులై శిల్పకళానైపుణ్యమునకు విస్మయమును బొందుచున్నారు.

## ఆంధ్రజాతీయ కళాశాల.

ఆంధ్రజాతీయ కళాశాలను మచిలీపట్టణమున స్థాపించుటకు ఆ 1907 సంవత్సరములో పురజనులచే మహాసభ కావింపబడి ఆ 1910 సంవత్సరము ఫిబ్రివరులో 25 యకరముల వైశాల్యముగల తోటలో నీవిద్యాలయము నిర్మింపబడెను. పరికాశముగల కళాభవనము విశాలముగలదయి రెండుభాగములుగా నేర్పరుపబడి యుండెను. అందొకటి విద్యాశాలగను రెండవది కర్మాగారముగను వాడబడుచున్నది. పాఠశాలయందు పెద్దపరీక్షలలో కృతార్థులైన విద్యావంతులు ఎనమండ్రుగురు స్వార్థత్యాగముతో స్వల్ప వేతనములు తీసికొనుచు ఉపాధ్యాయులుగా నున్నారు. ఎమ్. ఏ. బి. యల్. పరీక్షలలోఉత్తీర్ణులయిన మహారాజశ్రీ కోపల్లె హనుమంతరావు పంతులుగారు కళాశాలకు ఉచితముగ తమయావచ్ఛక్తిని వినియోగ పరచుచున్నారు. సామాన్యవిద్యాలయములలోవలె సంస్కృతము, తెలుగు, ఇంగ్లీషు, గణితము, శాస్త్రములు, చరిత్రలు, చిత్రలేఖనము మున్నగు విషయములయందేగాక ప్రతి బాలునకును జీవనోపాధి గల్పించుటకును హస్తనైపుణ్యమును, ఇంద్రియగ్రాహ్యశక్తిని వృద్ధిపరచుటకును కర్మాగారమునందు ప్రత్యేకశిక్ష గఱపుట కవకాశములు ఏర్పాటు చేయబడినవి. కావున విద్యార్థులకు సామాన్యవిద్యయు కర్మాగారమందు తగిన యంత్రప్రయోగ సామర్థ్యములు నేర్పబడును. వడ్రము, కమ్మరము, ఇంజనీరింగు మొదలగు పనులు ప్రస్తుతము నేర్పబడుచున్నవి. ప్రత్యేకముగ కర్మాగారమందు పనులను నేర్చుకొన దలచినవారు అటుల ప్రవేశించి కృతార్థులు కావచ్చును. ప్రైమరీ క్లాసువరకు నుచితముగను, తక్కినతరగతులకు స్వల్పజీతములకొను, బీదబాలురకు జీతము లేకయు విద్యగఱపబడుచున్నది. కళాశాలయందు నూటయిరువదిమంది బాలురు విద్య నభ్యసించుచున్నారు. బాలురకును, ఉపాధ్యాయులకు నుపయోగించునటుల సంస్కృతము, తెలుగు, ఇంగ్లీషు పుస్తకములుగల గొప్ప పుస్తకాగారము గలదు. కర్మాగారమునందు కొయ్యసామగ్రియును, ఇనుము కరిగి పోతపోసిన యంత్రసామగ్రియును చేయబడును. కావలసినవారు ఆర్డరు యిచ్చిన తయారు కాగలదు. కళాశాలయొక్క పరిపాలన కొరకు ఆంధ్రజాతీయ విద్యాపరిషత్తను సంఘమును, దానికి చేరిన మరియొక పాలకసంఘమును ఆ 1911 సంవత్సరములో నేర్పడి పరిషత్తు ఆ జూను నెలయందే 1860 సం॥ నెం 21 ఆక్టు ప్రకారం రిజిష్టరు కాబడినది. దేశీయులందరు నీ యుద్యమమునకు సంపూర్ణముగా తోడ్పడినయెడల కాలక్రమమున పట్నములయందును గ్రామములయందును కలాశాలకు శాఖల నేర్పరచుటకు అవకాశము కలుగగలదు. కళాశాలవఱకు మ్యునిసిపల్ వారు యిరువదిమూడువందల రూప్యములు శాంక్షనుచేసి మంచి కంకరరోడ్డును వేయించియున్నారు. కృష్ణకాలువనుండి ప్రత్యేకముగ తూమునిచ్చి కళాశాలతోటలోనికి కృష్ణనీరు తెచ్చుకొనుటకు గవర్నమెంటువారు అవకాశము కలుగజేసినందున మంచితీర్థముయొక్కవసతి యేర్పడినది. విద్యార్థులును, ఉపాధ్యాయులు నుండుటకు గృహములు కట్టించబడినవి. సాధ్యమైనంతవరకు వీరెల్లర నొక్కచోట నివసింపచేయుటయే కలాశాలయొక్క ముఖ్యోద్దేశము. ఈప్రయత్నములకు మనరాజధానిలోనుండు మహామహులందరుతోడ్పడుచున్నారు. కళాశాలకు కీర్తిశేషులగు కృష్ణస్వామి అయ్యరుగారు, ప్రస్తుతము జడ్జీలుగనున్న సుందరయ్యరుగారు, శంకరనాయరుగారు, సదాశివ అయ్యరుగారు గవర్నమెంటు మెంబర్లుగానున్న శివస్వామయ్యరుగారు, అట్కిన్సన్ గారు మున్నగు మహనీయులు తమ యామోదమును, మఱికొందరు తమ విరాళములను ఇచ్చియున్నారు. స్వార్థత్యాగ పరాయణులైన ప్రముఖులు కొందరు యీవరకు 30 యకరములభూమిని ఒకలక్షయిదువేల రూప్యముల సొమ్మును విరాళ మొసంగియున్నారు. ఇందులో సొమ్ము సుమారు డెబ్బదివేలు వసూలు కాబడినది. భూమిమీదసాలువారీ రమారమి పదునాలుగువందలరూపాయలు ఆదాయము వచ్చుచున్నవి. కళాభవనమునకు యంత్రసామగ్రి మొదలయినవానికి ముప్పదిఅయిదువేల రూప్యములు వెచ్చింపబడినవి. పాఠశాలకు, కర్మాగారమునకు మాసమాసము అయిదువందల రూప్యముల జీతము లియ్యవలసియున్నది. ఈకార్యనిర్వహణమునకు దేశాభిమానులెల్లరు తమశక్తి కొలది పాటుపడి వలయుధనమును సమకూర్చవలసియున్నది. ఇంతవఱకు దీనియెడల ప్రజలుచూపిన గౌరవమునుబట్టిచూడ కలాశాల శాశ్వతముగను స్వతంత్రముగను వర్ధిల్లుటకు వలయు మూడులక్షల రూప్యముల మూలధనము త్వరలోనే లభింపగలదనుటకు సందియములేదు.

## మందస రాజుగారు, కుమార రాజాగారు.

## చీకటి, కల్లికోట రాజా గారులు.

వీరు గంజాంజిల్లాలో సుప్రసిద్ధి జెందిన రాజులు. వీరివిపూర్వకాలమునుండియు దానధర్మములకును, ఆంధ్రభాషా పోషణమునకును పేరుచెందిన సంస్థానములు. ఈరాజులును వారిప్రజలయెడల ఎక్కువ ప్రేమగలవారయి, వారికొఱకై పాటుబడుచు, బ్రిటిషుప్రభుత్వము వారి యందెక్కువ భక్తివిశ్వాసములుగలిగి ఘనతకెక్కియున్నారు.

## అమరచింత, వనపర్తి రాజులు.

ఈ సంస్థానములు నిజాంరాజ్యమునందున్నవి. వీరు శ్రీ నిజాముగారి క్రిందనున్న సామంతరాజులు. వీరి పూర్వులు బల సాహసములయందు ఘనతకెక్కినవారయి నిజాములకు వారి వారి యుద్ధములలో నెక్కువగా సహాయముచేసిరి. ప్రస్తుతరాజులు దానధర్మములు చేయుటయందు గొప్పవారు. ఆశ్రితపోషకులు. ఆంధ్రభాషయందధిక గౌరవమున్నవారు.

## కందుకూరి శివప్రసాదరావు బహద్దరు జమీందారుగారు.

నరసాపుర వాస్తవ్యులయిన శివప్రసాదరావు బహద్దరుపంతులుగారు, శైవబ్రాహ్మణజమీందారులు, విద్యాభిమానులు, మతాభిమానులు, నిరతాన్నదాననిరతతులు, శాస్త్రజ్ఞులు, ధర్మపరాయణులు. శ్రీ రాజాగారనవరతము తమద్రవ్యమును ధర్మకార్యములకై వినియోగించుచుందురు. శైవమతమహాసభకు రాజాగారు రాజపోషకులుగ నుండుటకంగీకరించి వారిసహజమైన యుదారస్వభావమును వ్యక్తీకరించిరి.

### కొవ్వూరు చంద్రారెడ్డిగారు.

భాషాభిమానులు, విద్యాభిమానులు, దేశాభిమానులునై మన యాంధ్రదేశమున వేగుచుక్కవలె ప్రకాశించుచున్నవారు శ్రీకొవ్వూరి చంద్రారెడ్డిగారు. విద్యార్థులపాలిటి కల్పతరువై, గుప్తదాతయై, యుదారగుణోపేతుడై శ్రీ చంద్రారెడ్డిగారు చేయుచున్న సేవయంతయు బహు గూఢముగనున్నను, వారికీర్తిచంద్రికలాంధ్రదేశమునందెల్ల గ్రమ్మియున్నవి. మధురమగు సంభాషణము. హానియెరుగని బలము. గర్వములేని వర్తనము. పూజ్యమగు యోగ్యత. ఇట్టి చంద్రారెడ్డిగారి ధర్మములకు దరుగులేదు.

### చేవెంద్ర వేంకటాచలం పంతులుగారు.

నోబిలుదొరయొక్క దైవభక్తిచే సమ్మోహితులై క్రయిస్తవ మతము స్వీకరించిన బ్రాహ్మణులలో కీర్తిశేషులగు శ్రీ చేవెంద్ర వేంకటాచలపంతులుగారొకరు. వీరు ఎఫ్. ఏ. పరీక్షయందు కృతార్థులైనపిమ్మట గవర్నమెంటుద్యోగమున బ్రవేశించి, తమ శక్తిసామర్థ్యశీలముల వలనను, కార్యదీక్షవలనను, న్యాయబుద్ధివలనను, క్రమముగా డిప్యూటీకలెక్టరు హోదావహించి, యనేకుల కనేకవిధములైన యుపకారములొనర్చిన, దయార్ద్రహృదయులు. వీరిపరోపకారనిరతికిని, దీనరక్షణ పరాయణత్వమునకును, పండిత సన్మానమునకును, మితిలేదు. వారి గృహమెప్పుడును, ఆంగ్లేయాంధ్రగీర్వాణపండితులచే నిండియుండెడిది. దానకర్ణులును, భక్తిపరాయణులునునగు వేంకటాచలపంతులుగారు 1907 మార్చి 5 వ తేదిని మృతినొందిరి.

### రావుబహదూర్ భవానందముపిళ్ళగారు.

వీరు జాఫ్నానివాసులు. చెన్నరాజధానియందు పోలీసు అసిస్టెంటుకమీషన రుద్యోగమును జేయుచున్నారు. ద్రావిడిభాషలో హరిశ్చంద్రాది నాటకములనువ్రాసెను. ఎఫ్. హెచ్. ఎస్., ఎం. ఆర్. ఎ. ఎస్. అనుబిరుదములును వీరికి గలవు. వీరుద్యోగ నిర్వహణమునందు జూపిన సామర్థ్యమునుబట్టి దొరతనమువారు రావుబహదూర్ అను గౌరవబిరుదము నొసంగిరి.

### లాలా హరికిషన్‌లాలుగారు.

ఈయన పంజాబులోని దేశీయనాయకులలోనొక్కరు. బ్యారిష్టరు. పరిశ్రామిక విషయములయందెక్కువ ఆసక్తికలవారు. పంజాబులోనొకబ్యాంకున కధిపతిగనున్నారు. అనేకనూతనపరిశ్రమలను స్థాపించుటకు సహాయభూతుడాయెను. గడచిన డిశంబరులో పాట్నాలో జరిగిన పరిశ్రామికసభ కధ్యక్షుడుగానుండెను. 1909 సం॥లో లాహోరులో జరిగిన దేశీయమహాసభాహ్వానసంఘమున కధ్యక్షుడుగానుండెను.

### పండిత రామావతారశర్మగారు.

ఈయన పాటలీపుత్రమందలికళాశాలలో సంస్కృతపండితుడు. ఎం. ఏ. లో కృతార్థుడయినవాడు. నడివయస్సువరకును పూర్వాచారుడుగానే ఉండెను. కాని సంఘదురాచారములకు శాస్త్రీయాంగీకారములేదని శాస్త్రాన్వేషణమువలన దెలిసికొనినవాడయి సంఘసంస్కర్తయయ్యెను. పాట్నాలో గడచిన డిసంబరులో జరిగినసంఘసంస్కరణసభ కధ్యక్షుడై పూర్వాచారప్రియులకు రౌద్రమును బుట్టించిన యుపన్యాసమొసంగెను.

### పురాణం నాగభూషణంగారు.

వీరు చెన్నపురి హైకోర్టులో న్యాయవాదిగా జాలకాలమునుండియున్నారు. బందరుపురవాసులు. చెన్నపురమందలి ఆంధ్రులలో గణనీయులు. ఈ సంవత్సరము జరిగిన కృష్ణామండల సభ కధ్యక్షులుగా నెన్నుకొనబడిరి. ఆంధ్రోద్యమము నంగీకరించుచు గొప్ప ఉపన్యాసమొసంగిరి.

### దాసు మాధవరావుగారు.

వీరు కృష్ణాజిల్లాలో ప్రసిద్ధికెక్కిన దాసువారివంశమునకు జెందినవారు. ఏలూరులో న్యాయవాదిగానున్నారు. రజస్వలానంతర వివాహములను జేసుకొనిన ఆంధ్రబ్రాహ్మణులలో వీరొక్కరు. ఈసంవత్సరము జరిగిన కృష్ణామండల సంఘసంస్కరణసభ కధ్యక్షులుగనుండిరి.

### మోతే గంగరాజు శ్రేష్ఠిగారు.

కృష్ణాజిల్లాలోని విస్సన్నపేట యెస్టేటు ప్రొప్రయిటర్లును, హేలాపురివాసులును నగు శ్రీ మోతే గంగరాజు శ్రేష్ఠిగారికంటె, దానధర్మములయందును, పరోపకార బుద్ధియందును, పరిశ్రామికాభిలాషయందును మించినవారు కృష్ణామండలమునందు మిక్కిలి యల్పముగనున్నారు. వీరియొక్క యభిమాన ప్రోత్సాహములచే నేలూరుపట్టణమునగొప్ప జూట్టుమిల్లు స్థాపింపబడినది. ఏలూరుపట్టణమునందలి శ్రీకన్యకాపరమేశ్వరీ దేవాలయ నిర్మాణమునకై విశేష శ్రద్ధవహించి, వ్యయమును చాల భాగము తాము భరించుటయేగాక, స్వయముగ, శ్రీజనార్దనస్వామియొక్కయు, శ్రీ ఆంజనేయస్వామియొక్కయు, సుందరములగు దేవాలయములు నిర్మించుటయే వారి మతాభిమానమునకును, దైవభక్తికిని నిదర్శనములని చెప్పనగును. ఒక్క మతవిషయములందును, పరిశ్రామిక విషయములందును, మాత్రమేగాక, రాజ్యాంగ వ్యవహారములయందును వీరు చాల యభిమానమువహించి, ప్రతి సముద్యమమునందును శ్రద్ధబూని పనిచేయు విశాలహృదయులుగనున్నారు. దొరతనమువారు వీరిసుగుణ సంపదకును, పరోపకారశీలతకును, సంతసించి కృష్ణాజిల్లాబోర్డు మెంబరుగను, ఆనరరీ మేజస్ట్రీటుగను, నియమించియున్నారు. ఇదిగాక శ్రీ గంగరాజుగారెందరో విద్యార్థులకుజీతములిచ్చి, అన్నముపెట్టి యున్నతవిద్యాదానము చేయుచున్నారు. ఇటీవలనే ఏలూరులో ప్రశస్తమగు ఘోషావైద్యశాలయొకటి నిర్మించి యిచ్చెదమని బహు యౌదార్యముతో సెలవిచ్చిరి. శ్రీగంగరాజుగారు చాల చిన్నవారు. అయినను వీరి హృదయము గంభీరమగు ననేకానభిప్రాయములతో నిండియున్నది.

### సి. కె. రెడ్డిగారు, బారిష్టరు.

రెడ్డిగారు నెల్లూరుమండలవాసి. ఇంగ్లండునకు బారిష్టరు పరీక్షను జదువుటకయి వెళ్ళెను. 1912లో ఆపరీక్షలో ఆంగ్లేయహైందవ విద్యార్థులందరిలోను బ్రప్రథముడుగా కృతార్థుడై, విద్యార్థి వేతనమును సంపాదించి, ఆంధ్రులకు సత్కీర్తినార్జించెను. రెడ్డిగారికి వేఱొక వేతనము లభించినందున మరిరెండు వత్సరము లింగ్లండులోనుండి ధర్మశాస్త్రమును మరింత హెచ్చుగా జదువుదురట.

### ముత్తరాజు సుబ్బారావు ఎమ్. ఏ. గారు.

వీరు నియోగిబ్రాహ్మణులు. బందరు నోబిలు కళాశాలయందు ఐతిహాసికోపన్యాసకులుగనున్నారు. బి.ఏ. పరీక్షయందు చరిత్రములందు మనరాజధానిలోకెల్ల మొదటివారుగ సుత్తీర్ణులయిరి. వీరు ప్రాక్తన హిందూరాష్ట్రీయయుద్ధధర్మములనువ్యాసమునుసంచికకువ్రాసియున్నారు.

### ఐ. సి. ఎస్. విద్యార్థులు.

బెనగల్ రామారావుగారు. ఈయన దక్షిణకన్నడ జిల్లావాస్తవ్యుడు.

రామచంద్రరావుగారు లాహోరు పురవాసి.

బి. కె. బాసుగారు వంగదేశీయుడు.

గోడ్బోలె గారు మహారాష్ట్ర బ్రాహ్మణుడు.

వీరు నలుగురును 1912 వ సంవత్సరములో జరిగిన ఐ. సి. ఎస్. ప్రవేశపరీక్షలో కృతార్థులయిరి. 1913వ సంవత్సర మచ్చట విద్యనభ్యసించి కడపటిపరీక్షలో దేరినతరువాత మనదేశమునకు 1914 లో అసిస్టెంటు కలక్టరులుగా వచ్చెదరు.

### బల్గేరియ, సర్వియ, గ్రీసు మాంటినీగ్రో రాజులు.

తురుష్కులు యూరపుఖండపు తూర్పుభాగము జయించినప్పుడు ఈ దేశములు వారివశమయినవి. నలువదివత్సరముల క్రితము వారిక్రింద నే యుండినవిగాని యూరపురాజులందరును ఏకమై ఈదేశములకు క్రైస్తవరాజుల నేర్పఱచి స్వరాజ్యమునొసంగిరి. కాని మసిడోనియ, ఆల్బేనియ, గ్రీసులలోని క్రైస్తవప్రజలు తురుష్కుల పరిపాలనము చేత పీడింపబడుచున్నారని వీరందఱు నేకమై ఆదేశములను జయించి తురుష్కుల పేరును యూరపుఖండమందు నామమాత్రావశిష్టము జేసిరి. ఈ యుద్ధపు సమాచారములన్నింటిని అంధ్రపత్రికాపాఠకు లెఱింగియే యున్నారు. ఈ నాలుగు చిన్నరాజ్యములును పూర్వపు జగడములనుమఱచి ఈయుద్ధమునకై ఒక్కటైపోరుట యూరపుఖండమునకు మహదద్భుతమును గలిగించినది. ఇందు మాంటినీగ్రో తప్ప తక్కినవారందరును దురుష్కులనోడించిరి.

### మహమ్మద్ షెవ్కెట్ పాషా.

నాజింపాషాను చంపించి, కయామిల్ పాషాను ముఖ్యమంత్రిత్వమునుండి పడద్రోసి, ఎన్వరు బే సహాయమువలన ముఖ్యమంత్రి యయ్యెను. తురుష్కులెంతమాత్రము విడువకూడదనిన ఏడ్రియానోపిలు ఈయనకాలమందే బల్గేరియనుల వశమైనది. 1908లో తురుష్కరాజ్య పరివర్తనమునకు గారకుడీ మహనీయుడు. సేనాధిపతులకొసంగబడు అత్యుమితగౌరవమగు ఫీల్డుమార్షల్ అను గౌరవ మీయనకుగలదు.

### నాజింపాషాగారు.

ఫ్రాంసు, జర్మనీలలో యుద్ధవిద్యనభ్యసించి తురుష్క సైన్యమును గొప్పస్థితికి దెచ్చెను. ఛాటాల్జాకోటల నమిత ధైర్యముతో బల్గేరియనుల వశముకాకుండ కాపాడెను. ఎన్వరు బేయొక్క మనుష్యుల వలన కాన్స్టాంటినోపిలులో గాల్చి చంపబడెను.

### అలిరిజాపాషా.

ఈ యుద్ధమునందు శత్రువులతో బోరాడి యోడిపోయిన తురుష్క సేనాధిపతులలో నొక్కరు.

### జనరల్ డిమిట్రిఫ్.

కర్కికిలేసువద్ద తురుష్కులనోడించి పారదోలిన బల్గేరియనుసేనాధిపతి.

### జనరల్ సోవోఫ్.

ఈయనయే యెచ్చట యుద్ధముజేసినను నచ్చట తప్పక బల్గేరియనులకు జయము నొడగూర్చిన మహాసేనాని. ఈయుద్ధమువలన లోకమందంతటను బల్గేరియనులకువచ్చిన కీర్తికి కారకుడు.

### గా॥ రావుబహదూర్ బ. నరసింహేశ్వర శర్మగారు.

వీరు విశాఖపట్టణము, గంజాంజిల్లాల పక్షమున పూర్వమును, ప్రస్తుతమును చెన్నపురి శాసననిర్మాణ సభాసభ్యులుగనున్నారు. ఈపని యందు దేశీయులపక్షమును వహించి వారి విధ్యుక్తధర్మములను జక్కగా నిర్వహించుచున్నారు. వారిధనమును సత్కార్యములకు ధారాళముగా వినియోగించుచుందురు. ఈ సంవత్సరము జరుగు అంధ్రమహాజనసభ కధ్యక్షులుగా నెన్నుకొనబడుటవలననే మనవారికి వారియందున్న గౌరవాదరణములు వ్యక్తీకరింపబడుచున్నవి.

### గౌరవనీయులగు శ్రీనివాస శాస్త్రిగారు.

వీ రుపాధ్యాయులుగానుండి ద్రావిడదేశమున గొప్ప దేశసేవను జేసిరి. తరువాత గోఖలేగారి హిందూదేశ సేవకసంఘమునందు ప్రవేశించి, కొంతకాలమచ్చట హిందూదేశ రాజ్యాంగ వ్యవహారములను జక్కగా పఠించి, తరువాత చెన్నపురిలో నా సంఘమునకొక యుపసంఘము నేర్పఱచి దాని కధ్యక్షులుగానుండి యనేకవిధముల దేశోపకారమును జేయుచున్నారు. ఈసంవత్సరము చెన్నపురి శాసననిర్మాణ సభా సభ్యులుగా మెట్లండు ప్రభువుగారివలన నియమింపబడిరి. శ్రీ శాస్త్రిగారి కాంగ్లమునేగాక మన శాస్త్రములయందును ప్రావీణ్యత గలదు. సంఘసంస్కరణమం దభిమానముగలవారు. చెన్నపురి రాజధానికి గోఖలేగారంతవాడని పిలువబడగలరు. గోదావరిమండలసభ కధ్యక్షులుగ నుండిరి.

### గా॥ డాక్టరు నాయరుగారు.

ఇంగ్లండునకు వెళ్ళి, వైద్యవిద్య నభ్యసించి, ఆదేశపు సాంప్రదాయములలో ముఖ్యములగు, వ్యక్తిస్వాతంత్ర్యములను గడించి, చెన్నపురికివచ్చి, వైద్యుడయి, చక్కగా ధనమార్జించుచుండుటయే గాక దన దేశమునకును పాటుపడుచున్నారు. మంచివక్త. చెన్నపురి మునిసిపాలిటీవారివలన శాసననిర్మాణ సభకు సభ్యుడుగా నెన్నుకొనబడెను.

### గౌ॥ టి. వి. శేషగిరి అయ్యరు గారు.

వీరు చెన్నపురి హైకోర్టులో న్యాయవాదులుగానుండి చక్కగా ధనమార్జించుచుండుటయే గాక తమకాలమును దేశసేవకయి వినియోగించు చున్నారు. చెన్నపురి విశ్వవిద్యాలయము వారివలన ఆ శాసన నిర్మాణ సభాసభ్యులుగా గడచిన 6 సం॥ముల నుండి ఎన్నుకొనబడు చున్నారు.

### కె. సి. నేక్ గారు.

వంగదేశవాసి. 1912 లో జరిగిన ఐ.సి.ఎస్. పరీక్షలో లండను నందు కృతార్థుడాయెను. 1914 లో సహాయ మండలాధిపతిగా మన దేశమునకు రాగలడు.

### మాదిరెడ్డి కేశవరావు నాయుడుగారు.

వీరు బందరు వాశిరెడ్డివారి వంశజులు. వీరితండ్రి చాలకాలము బెంగుళూరులో గాపురముండుటవలన నీయనయు నానగరమందే విద్య నభ్యసించెను. తరువాత రయిల్వేశాఖయం దుద్యోగములో బ్రవేశించి, ఏభారతీయుడును ఇంతవఱకు బొందనట్టి "దక్షిణ మహారాష్ట్ర ఇనుప దారి ఏజెంటుకు ముఖ్యకార్యదర్శి" యను ఉన్నతపదవి నందిరి. ఇప్పు డుపకారవేతనమును బుచ్చుకొని చెన్నపురియందు కాలక్షేపము చేయు చున్నారు.

### రామా పండిత్ గారు.

వీరికి ఆయుర్వేదమం దపారమయిన జ్ఞానముకలదు. మైసూరు గవర్నమెంటువారి ఆయుర్వేదకళాశాల కధ్యక్షులు. వీరిక్రింద తరిఫీయ తయినఅనేకమంది ఆయుర్వేదవైద్యులు దేశములోననేకచోట్ల వైద్యసేవ జేయుచున్నారు. వీరికనేక బిరుదులును, యోగ్యతా పత్రములునుగలవు.

### శ్రీ శృంగేరిశంకరాచార్యస్వాములవారు.

అద్వైతసిద్ధాంత స్థాపకులును, షణ్మతోద్ధారకులును నైన శ్రీశంకరాచార్యులవారి విజ్ఞానము జగద్విఖ్యాతము. ఆమహనీయునిచే స్థాపితమైన పీఠము విఛ్ఛిన్నముగా వర్థిలుచున్నది. ప్రస్తుతమాపీఠమునలంకరించు శ్రీసచ్చిదానంద నృసింహభారతీస్వాములవారు మహాపండితులు, సాధుశీలసంపన్నులు, ధర్మనిష్ఠాగరిష్ఠులు, సదాచారపరాయణులు.

### శ్రీకృష్ణబ్రహ్మతంత్రపరకాలస్వామి సార్వభౌములవారు.

వీరు పూర్వాశ్రమమున మైసూరురాజ్యమునకు జేరిన హాసదుర్గమను గ్రామమున జన్మించిరి. వీరలు బాల్యమున శాస్త్రములనభ్యసించి తమవిద్వద్గరిమచే నైజాము రాజ్యమున జేరిన వనపర్తి సంస్థానమునకు ఆస్థాన విద్వత్పదవిని బొందిరి. శ్రీస్వామివారికి వేదాంతాది శాస్త్రప్రతిభకు తోడు సాహిత్యమందును ఆంధ్రమందును కన్నడమందును అపారపాండిత్యము గలదు. శ్రీవారలు యిప్పటికి అలంకార మణిహారము శ్రీనివాసవిలాసములను, మొదలగు గొప్పగ్రంథములను, హంససందేశ పాదుకా సహస్రము మొదలగు గొప్పవ్యాఖ్యానములు రచించి చిన్నచిన్న సంస్కృత, తెనుగు, కన్నడగ్రంథములు లెక్కకు మీరినవి రచించిరి. శ్రీవారి కవితాప్రౌఢిమ వాక్యరచనయు అప్రతిహతము. వర్ణనాతీతము. శ్రీవారి కవిత్వమునకై పూర్వాశ్రమమున కవిగండభేరుండ, కవిరసన కంఠీరవ అను నిరుపమాన బిరుదములు బడసిరి. శాంతశమదమాది గుణగరిష్ఠులగు యీవిద్వత్పుంగవుండు గడచిన 25 వత్సరము లవుకు శ్రీమాన్ మైసూరు మహారాజులవారికి ఆచార్యపీఠమగు శ్రీబ్రహ్మతంత్రపరకాల మఠమున సంయమి పదవి నలంకరించి శ్రీమన్మహారాజులవారికి ఉపదేశ గురువులయిరి. ఇప్పటికి శ్రీవారికి 75 వర్షములు గలవు. దేశమందంతటను గొప్పగా సన్మానింపబడుచున్నారు.

### స్వామి రామతీర్థ.

ఈయన పంజాబి. ఎం.ఏ పరీక్షలో కృతార్థుడయి, ఉపాధ్యాయుడుగా నుండెను. తరువాత మనస్సు వేదాంతమార్గమును బట్టినందున హిమాలయములో గొన్నివత్సరములు తపస్సుచేసి, వేదాంత మతమును బోధించుటకయి అమెరికా యూరపుఖండములకు వివేకానందస్వామి వలె వెళ్ళి మన యౌన్నత్యమును చాటివచ్చెను. కొన్ని వేదాంతగ్రంథములను వ్రాసెను. తన సర్వసౌఖ్యములను తన మతోద్ధారణకయి పరిత్యజించెను. తిరిగి మనదేశమునకు వచ్చినపిమ్మట ఉత్తర హిందూస్థానమందొక నదిలో స్నానముజేయుచుండగా మునిగిపోయి 35 ఏండ్లయిన నిండకముందే కాలగతి జెందెను.

### వడ్లమన్నాటి వేంకటచలం పంతులుగారు.

వీరు బృందావన పురమున జన్మించిన నియోగి బ్రాహ్మణులు. మొట్టమొదట స్వల్పరాజకీయోద్యోగములలో బ్రవేశించి శక్తిసామర్థ్యములవలన డెప్యూటీకలక్టరయిరి. అమిత న్యాయైకచతురులు. వీరిని జూచి వారి పైయధికారులును భయపడుచుండిరట. వేదములను, ధర్మశాస్త్రములనుజదివి మంచి పాండిత్యము నార్జించుటయేగాక దద్విధముగా ననుష్ఠించిరి. ఈరూపపటమే ఆయనకు వైదికమందున్న ప్రేమను వెల్లడించుచున్నయది. ఉపకారవేతనమును బుచ్చుకొనిన తరువాత ముప్పదివర్షములు వైదికధర్మముల ననుష్ఠించుచు జీవనయాత్రనుగడపిరి.

### ఆర్. క్రిష్ణమాచార్యర్ ఎం. ఏ. విద్యానిధి.

వీరు చెన్నపురిదొరతనమువారి కలాశాల సంస్కృతప్రధానాధికారులు. సంస్కృతభాషయందు మిక్కిలి గొప్పపండితులు. కాళిదాస విరచిత రఘువంశ మేఘసందేశములకు చక్కని విమర్శనములు వ్రాసి మెప్పొందిరి. ప్రసిద్ధమగు సహృదయ అనుసంస్కృతమాసపత్రికకు అధిపతులును సంపాదకులును సంస్కృతభాషను ఈరాజధానియందు విశేషముగా వ్యాపింపజేసిరనుటకు వంగదేశమందలి నవద్వీపము నందు పండితబృందము వీరికి విద్యానిధియని బిరుదొసంగుటయె నిదర్శనము. మరియు వీరి పాండితికి మెచ్చి వారణాసియందలి విద్వచ్ఛిఖామణులు సంస్కృతసంజీవన యనియు బిరుదమొసంగిరి. వీరు సంస్కృత వాసంతికా స్వప్నము మొదలగు గ్రంథములను వ్రాసియున్నారు.

